చేమకూర వెంకట కవి

# విజయవిలాసము

*

## హృదయోల్లాస వ్యాఖ్య

*

రచన

తాపీ ధర్మారావు

1968

'విశిష్ట రచనలు'

హైదరాబాద్

# విజ్ఞప్తి

ఈనాటి కయినా ఈ వ్యాఖ్యానము వెలువడినందుకు నేను సంతోషిస్తున్నాను: నేనే కాదు; మిత్రులు సాహిత్యప్రియులు సహృదయులు చాలామంది సంతోషిస్తారనే నా నమ్మకము. వ్యాఖ్యాన రచన తలపెట్టిన నాటినుంచి అవాంతర పరంపరలు నన్ను చుట్టుముట్టి బాధిస్తూ వచ్చేవి. వాటి ఒత్తిడికి తట్టుకోలేక, ప్రయత్నమే మానుకుందామా అని అప్పుడప్పు డనిపించేది.

అయినా మిత్రుల ప్రోత్సాహమువల్ల రచన కొనసాగించి, ఏలాగయితే నేమి, కలము చేయవలసిన పనిని ఒక విధంగా పూర్తిచేయగలిగాను ఓగిలినది కలిమి చేయవలసిన కార్యము; కళ్ళు తేలవేయక తప్పలేదు కొందరు ధనాఢ్యులు, అధికారులు, అభిమానులు, ఉదారబుద్ధితో ముద్రణ చేయించాలని పూనుకున్నారు. కాని, అనేక కారణాలవల్ల ఆ పని జరగలేదు. నిస్పృహతో నేనీ వ్యాఖ్యానం గురించి ఆలోచించడం గూడా మానుకున్నాను.

పరిస్థితి ఇలాగున్నందుకు నా కంటే ఎక్కువగా విచారించిన వారు నా శ్రేయోభిలాషులు. వారిలో ప్రత్యేకించి చెప్పవలసిన వారు, సర్వశ్రీ గోపీచంద్,* ఉ. మాలకొండారెడ్డి, డాక్టర్ బి. రామరాజు, ప్రసిద్ధ న్యాయవాదులు పి. బాబులురెడ్డి, ఆవుల సాంబశివరావు (ఇప్పుడు హైకోర్టు న్యాయమూర్తులు) మొదలైన వారు, భాషాభిమానులను ధనసాహాయ్యము అడగడానికి పూనుకున్నారు అడిగి అందుకోడం అందరూ చేయగల కార్యము కాదు కదా. ప్రయత్నము అట్టే ఉత్సాహజనకంగా లేకపోయినందున వారు ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారితో సంప్రతించారు.

అధ్యక్షులు డాక్టర్ బి. గోపాలరెడ్డిగారూ, కార్యదర్శి దేవులపల్లి రామానుజరావుగారూ అత్యంత ఆదరాభిమానాలు చూపి రెండు వేల రూపాయల సాయము చేయించి, ముద్రణ ఆరంభించడానికి అనుకూల్యము కలిగించారు. వీరందరికీ, గుప్తదాన ప్రియులైన పై వారికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ముద్రణ కాలములో గూడా అనేక విధాల అవాంతరాలు తమ అలజడి మానలేదు. అయినా సర్వశ్రీ దేవులపల్లి రామానుజరావు, డాక్టర్ బి రామరాజు, మడిపడగ

---

*త్రిపురనేని గోపీచంద్ వంటి వారిని కీర్తిశేషులని వ్రాయడానికి మనసొప్పలేదు. ఆంధ్ర సాహిత్య రంగములో వారు సర్వదా సజీవులే. అమరులు.

బలరామాచార్యులు (కవీ కళాకారుడూ) వీరు దీక్షపూని ఇటు నాకు నిరుత్సాహము కలుగ నీయకుండాను, అటు ముద్రణాలయం వారికి సందేహాలు తీరిపోయే విధంగాను చెప్పదగిన మాటలు చెప్పుతూ ముద్రణ కొనసాగే లాగా చేశారు. వారి ప్రోత్సాహమూ పరామర్శా లేకుండినట్టయితే ఈ గ్రంథము ఈనాటి కయినా బయటపడేది కాదని నిరాఘాటంగా చెప్పగలను. వారికి నా కృతజ్ఞతా ప్రణామాలు. శివాజీ ముద్రాలయము వారు గూడ మా అభిప్రాయాలతో ఏకీభవించి చక్కని ముద్రణతో చాలినంత త్వరలో అచ్చు పూర్తిచేశారు వారికి నా ధన్యవాదాలు.

ఈ సందర్భములో శ్రీ మడిపడగ బలరామాచార్యులుగారు ఉదార భావముతో అందజేసిన సహకారము స్వల్పముకాదు తమ స్వంతపనులను గూడా వెనుకపెట్టి, ప్రతి విషయములోను నాకు సలహాలిస్తూ పేజి ప్రూఫులను కొంతవరకు సరిచూస్తూ గ్రంథము పేర్లూ రచయిత పటమూ చిత్రించి ముద్రణకు అంద చందాలు సమకూర్చారు. శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారూ, శ్రీ బి. రామచంద్రరావుగారూ, వేరు వేరుగా, ఎంతో శ్రమ తీసుకొని గ్రంథము ఆమూలాగ్రము చూచి తప్పొప్పుల పట్టికల నిచ్చారు. ఆ మిత్రులకు నా ధన్యవాదాలు.

అచ్చు తప్పుల గురించి ఒక్క మనవి. ఎవరివల్ల కలిగినా, ఏ కారణమువల్ల కలిగినా తప్పు తప్పే. అలాంటి తప్పులు – ముఖ్యంగా నా దృష్టి లోపంవల్ల – ఎక్కువగా దొర్లాయి. క్షమాపణ చెప్పుకోవడం కంటే, నేను చేయదగిన దిప్పు డేదీ లేదు వాటికి ప్రతి క్రియ నాకు తోచినది ఒక్కటే. పాఠక మహాశయుల దగ్గర కీ పుస్తకం రాగానే, శ్రమకోర్చి ఒక్క గంట తీరిక కలిగించుకొని, చివరనున్న 'సవరణలను' ఆ యా పేజీలలో కలముతో వ్రాసి ఉంచడం మంచిది. చీటికీ మాటికీ 'సవరణలు' చూచుకోవలసిన అవసరం లేకుండా కలకాలం ఉంటుంది. ఇదే నా ప్రార్థన.

ఇంకా నా వ్యాఖ్యానములో అసంతృప్తిగాని, సందేహముగాని, దోషముగాని కనబడి నప్పుడు, నాకు వ్రాస్తే, నేను చెప్పుకోవలసినది మనవి చేస్తాను. దిద్దుకోవలసినది దిద్దుకుంటాను. ఏ విధంగానైనా, చేమకూర కవి చమత్కారాలను ఆంధ్ర సాహిత్య పరులు సంపూర్ణంగా తెలుసుకోగలగడమే మన కందరికి వాంఛనీయము కదా.

"ఏ యెడ మేలె చూతురు
గణింపరు జాణలు జారుపాటుల౯"

చిక్కడ్‌పల్లి
హైదరాబాద్-20.
1–5–1968

సెలవు,
తాపీ ధర్మారావు.

## అంకితము . . .

*"వినదగు నెవ్వరు సెప్పిన,*
*వినినంతనె వేగపడక వివరింపదగున్*
*కని కల్ల నిజము తెలిసిన*
*మనుజులెపో నీతి పరులు..."*

అటువంటి నీతి పరులైన

**పాఠక సహృదయులకు**

# విషయసూచికలు

## పీఠికకు



## ప్రబంధానికి

# విజయవిలాసము

## హృదయోల్లాస పీఠిక

చేమకూరకవి పాకరుచి చాలా చిన్నతనంలోనే 15, 16 సం. వయసులోనే నన్ను ఆకర్షించింది. ఆ రోజులలో వసుచరిత్ర, మనుచరిత్రలకంటె విజయవిలాసం మీదనే నాకు అభిమానం ఎక్కువగా ఉండేది. నా పద్దెనిమిదోయేట ఒక నాటకం వ్రాయవలసి వచ్చి ఈ విజయవిలాస కథనే 'విలాసార్జునము' అన్న పేరుతో నాటకంగా రచించాను. దానిని వేగుఁజుక్క గ్రంథమాలలో తరువాత ప్రచురించాము గూడాను.*

అయినా అనేక పద్యాలకు సరియైన అర్థాలు తెలియకుండా ఉండేవి. ఆనాటికి విజయవిలాసం వ్యాఖ్యానాలు యేవీ ప్రచారంలో లేవు. ఉన్నా నేను చూడలేదు. తరువాత కొంతకాలానికి 1911 లో బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు విజయవిలాసం వ్యాఖ్యానాన్ని ప్రచురించారని విన్నాను. శ్రీ వేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యాన నైపుణ్యాన్ని వారి మేఘ సందేశ వ్యాఖ్యానంలో చవిచూచిన వాడిని కాబట్టి ఈ చక్కని కావ్యానికి యోగ్యమైన వ్యాఖ్యానం లభించి ఉంటుందనీ చేమకూరకవికి ఆంధ్రసాహిత్యము ఇవ్వవలసిన ఋణము కొంతవరకు తగ్గి ఉంటుందనీ సంతోషించాను.

అప్పటి పండితులు శాస్త్రిగారితో, "అద్దములోని బిబ్బవలె అబ్బియునబ్బని యర్థములచే నబ్బురమొసంగుచు, కాకలీగీతముం బోలె మధురంబయ్యు నస్ఫుటంబై, రసిక గోష్ఠులయందు సందేహాంతచర్వ (ర్వ ?) లకుఁ గారణంబై, కాకి మెలఁకువలతో నిండి, సంపూర్ణానుభవమునకు రాకయున్నట్టి యీ రసోత్తర ప్రబంధము (విజయవిలాసము) ను నైతము యెల్ల వారికిని సుబోధంబగునట్లు మద్విరచిత విపుల వ్యాఖ్యానముతో ప్రకటింపుదునుగాక" యని తమ యీప్సితమును తెలియచేసిరి. "యథామతి పాఠనిర్ణయ వ్యాఖ్యా రచనాది పరిక్లేశము వహించి, సకలసౌకర్య సంపన్నంబుగా నీ ముద్రణమును పమకూర్చినాఁడ" అని తమ వ్యాఖ్యానముఖాన ఉన్న "విన్నపం"లో ప్రకటించారు.

ఆ వ్యాఖ్యానాన్ని చూడాలని ఎంత కుతూహలం ఉండినా 1920 ప్రాంతంవరకు నాకు ఆ అవకాశం చిక్కలేదు. తరువాత ఉద్యోగరీత్యా నేను నెల్లూరులో ఉండడం తటస్థించింది. అక్కడ మిత్రులు భైరవరపు సుబ్బారావు M.A.LT., ఆనం పద్మనాభరెడ్డి B.A.LT., మొదలయిన వారికి విజయవిలాసంలోని పద్యాలను, వాటి అందాలను అప్పుడప్పుడు తెలియజేస్తుండే వాడిని. ఈ ఉత్సాహంతో సుబ్బారావుగారు

*త్వరలోనే విలాసార్జున నాటకమును పునర్ముద్రణచేసి పాఠకమహాశయులకు అందింపగలనని ఆశిస్తున్నాను.

(తరువాత కీర్తిశేషులు) వేంకట్రాయశాస్త్రిగారి వ్యాఖ్యానాన్ని పట్టుకొని ఇంటిదగ్గర పఠించడం ప్రారంభించారు. అందులో, నేను చెప్పినవాటికి భిన్నంగా ఉన్న వ్యాఖ్యానాలను చూచి ఒకరోజు క్లబ్బులో ఈ మిత్రులు నన్ను హెచ్చరించారు. దాని తరువాత నేను ఆ వ్యాఖ్యాన గ్రంథాన్ని తెప్పించుకొని అమూలాగ్రంగా చదివాను.

ఆనాటి నా అభిప్రాయము :

క్షమించాలి. ఆనాడు నాకు కలిగిన అభిప్రాయము మనవిచేస్తాను. వేదంవారు అనేక పద్యాలలో సరైన వ్యాఖ్యానం యివ్వలేదనీ, ఎన్నో అందాలను ప్రకటించలేదనీ, కవి ప్రక్రమాది కావ్య గుణాలనూ, నియమాలనూ పూర్తిగావారు గుర్తించజాలకపోయారనీ అనుకున్నాను. అంతకు పూర్వం శ్రీ శాస్త్రిగారి వ్యాఖ్యానం మీద ఏర్పర్చుకున్న అభిప్రాయం కొంత చెదిరింది. ఈ రసవత్తర కావ్యానికి సరియైన వ్యాఖ్యానం ఇంకా రాలేదని విచారించాను. ఈ అభిప్రాయంతో, మిత్రుల గోష్ఠిలో కొన్ని పద్యాలను చదివి వేంకట్రాయశాస్త్రి గారు ఇచ్చిన వ్యాఖ్యానం ఏ విధంగా సంతృప్తికరంగా లేదో, వాటిమీద నాకు ఉన్న అభిప్రాయం ఎటువంటిదో చర్చారూపంలో, ఉదాహరణ సహితంగా వివరించాను. అప్పుడు వారందరు వేరొక వ్యాఖ్యానం వ్రాయమని ప్రోత్సహించారు.

వ్యాఖ్యానము వ్రాయడమనగానే గుండె బద్దలయింది. నేను కాలేజీలో లెక్కలుచెప్పే అధ్యాపకుడను. సర్దా ఆంధ్రసాహిత్యములో, నేను చేసిన సాహిత్య పరిశ్రమ వ్యాఖ్యాన రచనకు చాలదని నాకు బాగా తెలుసును. సుప్రసిద్ధులయిన కవులదగ్గరగాని పండితులదగ్గరగాని నేర్చుకోగలిగిన అవకాశాలు నాకు లభించలేదు. అయినా సర్దాగా చదువుతుండేవాడను. కావ్యాలు చదవడమూ, ఆనందించడమూ, అవకాశము దొరికినప్పుడు ఆ యా కావ్యాలను గురించి నాకు తోచిన విషయాలు మిత్రులకూ విద్యార్థులకూ తెలుపుతూ ఉండడమూ నా కభిమానవిషయాలు. గ్రంథరచనా కుతూహలము లేకపోలేదు.

దేవరాజు వెంకటకృష్ణారావు (మొన్ననే కీర్తిశేషులయారు) గారూ నేనూ కలిసి వేగుజుక్క గ్రంథమాలను బరంపురములో స్థాపించి పదిహేను గ్రంథాలు ప్రచురించాము. అప్పటికి మద్రాసులో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలివారూ బందరులో ఆంధ్ర భాషాభివర్ధనీ గ్రంథమాలవారూ మంచిమంచి గ్రంథాలు ప్రచురిస్తుండేవారు. వారు చరిత్రలు విజ్ఞానశాస్త్రాలు ఇటువంటి ప్రచురణలే చేస్తుండేవారు. వారితో పోటీ లేకుండా మేము వారు విడిచిపెట్టిన సాహిత్యశాఖలనే— డిటెక్టివ్, చారిత్రక నాటకాలూ, స్వీయానుభవాలుగా వ్రాసిన నవలలు ఇలాంటి వాటినే— ప్రధానంగా ప్రచురించేవారము. ఆ కారణంచేతనే విలాసార్జున (పౌరాణిక) నాటకాన్ని కొన్ని సంవత్సరాలవరకు ప్రచురించలేదు.

ఈలాంటి కృషిలోనుండిన నాకు వ్యాఖ్యారచన అంత సులభం కాదుకదా ! అమరాలూ నిఘంటువులూ, వ్యాకరణాలూ రావాలి. అలంకారములు, రసములు ధ్వని మొదలైన వాటి లక్షణాలు తెలియాలి. ఆ పాండిత్యము నాకు లేనందువల్ల ఆ ప్రయత్నము మానుకుందా మనుకున్నాను.

అయినా, నా అభిమానకవిలో నేను చూడగలిగిన విశేషాలని నే ననుకున్న సొగసులూ, మిత్రులు హర్షించిన అందాలూ. ఇవన్నీ ఏమికావాలి ? జూలూరువారూ మరికొందరు వ్యాఖ్యాతలూ తమ రచనలన్నింటిలోనూ ఆ పాండిత్యము చూపించారా ? ఆ మీమాంసలేవీ లేకుండా, కేవల రసగ్రహణానికే ఉపకరించే వ్యాఖ్యానాలు లేవా ? అన్న ప్రశ్నలు పుట్టాయి. ప్రయత్నించడమే మంచిదనిపించింది. మరే ఫలితమూ లేకపోయినా నాకు కావ్యములో కనబడిన అందాలూ విశేషాలూ ఇలాంటివని లిఖితరూపంగా ఉంచినట్లవుతుంది— అని ఉపక్రమించాను,

**సందేహము - పర్యటన :**

మిత్రు లెంత హర్షించినా, నే నిచ్చిన విశేషాలను పండితలోకం ఏలాగు స్వీకరిస్తుందో, పెద్దలుచెప్పింది కాదనడము ఎంత సాహసంగా భావిస్తారో అన్న సందేహాలు మనసునిండ అలుముకొన్నాయి. ఈ సందేహాన్ని దూరంచేసుకోవడం, అంటే ఇంకొక వ్యాఖ్యానం అవసరమా కాదా అనే విషయాన్ని తేల్చుకోవడం ప్రధానం అనుకున్నాను. ఇందుకొరకు నా ఉద్యోగంలో ఉంటూనే ఎప్పటికప్పుడు ఉద్యోగంనుంచి అవకాశాన్ని చిక్కించుకొని, బరంపురం మొదలుకొని చెన్నపట్నం వరకున్న ముఖ్యమైన ఆంధ్రనగరాల్లో పర్యటన జరిపాను ; పర్యటన సందర్భాన పండిత గోష్ఠులలో నా వ్యాఖ్యాన విధానాన్నిగురించి ఉపన్యాసాలిచ్చాను, చర్చలు కావించాను. ఆ యా ప్రదేశాల్లో పెద్దలు అనేకులు (వీరిలోని శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, వద్దాది సుబ్బారాయుడు, త్రిపురాన సూర్యప్రసాదరాయకవి, ఆచంట సాంఖ్యాయన శర్మ, కాశీ కృష్ణాచారి, వేమవరపు రామదాసు కేతవరపు వెంకటశాస్త్రి...) శాస్త్రిగారిమీద ఉన్న అభిమాన గౌరవాలతో వారి వ్యాఖ్యానాన్ని సమర్థించడానికి, నా వ్యాఖ్యాన విధానాన్ని నిరాకరించడానికి గట్టిగా ప్రయత్నించారు ; కాని, ప్రయోజనం లేకపోయింది. వారిలో కొందరు నే నడగనిదే ఇచ్చిన *అభిప్రాయాలివి :

కళాప్రపూర్ణ త్రిపురాన సూర్యప్రసాదరాయకవి—

"విజయవిలాస కావ్యమున వేంకటసత్కవి చూపినట్టి య
క్కజమగు నందియందని యొకానొక చందపు పల్కుటందముల్
నిజములు విప్పిచెప్పితివి నేర్పుదలిర్పగ నీదువ్యాఖ్య ది
గ్విజయముగాంచు గావుత వివేకనిధానమ ధర్మరాట్కవీ"

మహామహోపాధ్యాయ ఆచంట సాంఖ్యాయనశర్మ—

"చతురమగు వేంకటరాయశాస్త్రి బుద్ధి
కందనట్టి యందములు నీదు వ్యాఖ్యఁజూపి
చూపినాడవు మాకు నీ సూక్ష్మబుద్ధి
ఔర ! ఆంధ్రవిశారదుం డగుదు వీవు"

వద్దాది సుబ్బారాయకవి—

"చరితయు నర్థపుష్టియు రసస్ఫురణంబు గభీరభావ బం
ధురతయు మాకరంద(?) రసతుందిల సత్పదగౌరవంబులున్
వెరవున జూపినాడవు వివేకులు మేలన ధర్మరాయనీ
సురుచిరనామ మాంధ్రమున సుస్థితిగాంచును వాఙ్మయమ్మునన్"

---

*ఈ పెద్దలిచ్చిన అభిప్రాయాలను ఆ రోజులలో ఎప్పటికప్పుడు పత్రికలకు పంపిస్తుండేవాడను. గండాలుగడచి నా వ్యాఖ్యానం ప్రచురణ జరిగినంతవరకు వారు సజీవులుగా ఉంటారో ఉండరో అన్న భయమున.

ఇటీవలి వరకు ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా గౌరవమునంది కీర్తిశేషులయిన శతావధాన శిరోమణి బ్రహ్మశ్రీ కాశీ కృష్ణాచార్యులవారు—

"కవికిన్ గల్గునొ కల్గదో యనెడు శంకన్ గల్గఁగాఁజేయు న
ర్థ విశేషంబులు చేమకూరకవి పద్యాలందు జూపించినా
వవురా ! మెచ్చితి మామకాగమన వార్తాఖ్య స్థలంబందు నీ
వివృతిం; బొంగితి నీదు చాతురికి తాపీపంశముక్తామణీ"

ధైర్యం తెచ్చుకొని వ్యాఖ్యానం చెయ్యడానికే పూనుకొన్నాను.

మహామహుడు సి. పి. బ్రౌను దొరగారు వ్రాయించి, మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో ఉంచిన జూలూరి అప్పయ పండితులవారి వ్యాఖ్యానాన్ని, పూండ్ల రామయ్యగారి అముద్రిత గ్రంథ చింతామణి మయూఖాలను పరిశీలించాను. నా వ్యాఖ్యానరచన సాగుతూ ఉండగా తరువాత కొన్నాళ్ళకు వేంకట్రాయశాస్త్రి గారికి అభిమానకేంద్రమైన నెల్లూరు నగరంలో మహాపండితులూ వేదము వారి మిత్రులూ బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అధ్యక్షతను నాలుగైదు సభలు జరిపి అక్కడి పండితుల అంగీకారాన్ని గూడ సంపాదించుకోగలిగా ననుకున్నాను.

తరువాత 'భారతిలో' 'విజయవిలాస వ్యాఖ్యాన విధానము' అన్న పేరుతో, కొన్ని పద్యాలకు పూర్వ వ్యాఖ్యాతలు ఇచ్చిన వ్యాఖ్యానాల ఔచిత్యాన్ని సవిమర్శకంగా ఖండించి నా వ్యాఖ్యాన విధానాన్ని నివేదించుకున్నాను.*

ఇంతలో, నా జీవిత పరిస్థితులు మారినందువల్ల నా వ్యాఖ్యాన రచన కొంతకాలం వెనుకబడిపోయింది. అంతేగాక ప్రబంధపఠనానికి విముఖత ప్రబలంగా కన్పిస్తున్న ఈ దినాలలో ఈ వ్యాఖ్యానం అవసరమా అన్న సందేహం గూడ నన్ను మరికొంత నిరుత్సాహపరిచింది. అయినప్పటికీ, అట్టి వ్యాఖ్యానం మన వాఙ్మయానికి చాలా అవసరమనీ, ఇట్టి రచనలవల్ల ప్రబంధవిముఖత పట్టు సడలిపోవడానికి కొంత అవకాశం ఏర్పడుతుందని పండితమిత్రులు ఎన్నో పర్యాయాలు, అనేక విధాలుగా చెప్పడంచేత నా వ్యాఖ్యాన రచన తిరిగి వేగాన్ని సంతరించుకున్నది.

## నా కోరిక :

నా పాండిత్య ప్రకర్షకోసంగాని, ఇతర వ్యాఖ్యానాల్లో తప్పులు పట్టడానికిగాని నేను ఈ వ్యాఖ్యానానికి పూనుకోలేదు. విజయవిలాస కావ్యంలోని పద్యాలలో కొన్నిచోట్ల ప్రస్ఫుటంగానూ, మరికొన్నిచోట్ల నిగూఢంగానూ ఉన్న అనేకరకాల చేమకూర చమత్కారాలను సవ్యంగాను, సమంజసంగానూ ప్రకటనచేసి కవియందలి గౌరవాన్ని ఇనుమడింపజేయడానికే నా ఈ ప్రయత్నము.

మన కవి పోకడలను, అభ్యాసాలను సాధ్యమైనంతవరకు పరిశీలించుకున్నాను. చేమకూరకవి తన వర్ణనలలో ఊహించిన విశేషభావాలను, హవణికలను నా వ్యాఖ్యానంలో వివరించి చూపడానికి ప్రయత్నించాను. కవి హృదయపూరిత రచన ఉన్నవాడు కాబట్టే మనకవి పాఠకుల శ్రద్ధకు పాత్రుడయ్యాడు.

---

*అవకాశముంటే పాఠకమహాశయులు 1933 లోని భారతి సంపు. 9 సంచికలు 3, 4, 5, 6 లో ఉన్న ఈ సుదీర్ఘ వ్యాసాలను చూడాలని ప్రార్థిస్తున్నాను.

అంతేకాదు; స్వయంకృషివల్ల అద్వితీయమయిన కీర్తి నార్జించి ఆంధ్రసాహిత్య ప్రపంచమున అమరుడయి నిలిచిన మనకవి ఆంధ్రపాఠకులకూ యువకలోకానికీ ఆదర్శప్రాయుడుగా ఉంటాడని ఆశించాను.

చూడండి: అర్జునుడి తీర్థయాత్రలో గంగానది స్తుతి మన కవి ఇలాగు వ్రాశాడు:

తా సైరింప, కపర్దియుండఁగ భవద్దర్పంబునన్ దాల్చి తే
జోసహ్యున్ శరజన్ముఁగాంచి, యల నీహార క్షమాభృత్ కుమా
రీ సాపత్న్యముఁ గన్న మోహపుఁ బురంధ్రీ రత్నమౌ దీవ; కా
దే సర్వజ్ఞుఁడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవీ. (వి.వి. 1-114§)

దీనిలో ప్రతిపదము ప్రతిఅక్షరము అర్థపుష్టికలిగి కవి శిల్పనైపుణ్యాన్ని ప్రకటిస్తున్నదని వేరుగ చెప్పనక్కరుండదు. పార్వతికి సగముదేహ మిచ్చిన ఈశ్వరుడు గంగను తలపై పెట్టుకోదానికి ఒక కారణం సూచించాడు. ముని కూతురు పేదరాలు (అందుకే జాహ్నవీ మూడక్షరాల పేరు) పార్వతితో సమానమవడమే కాక, భర్త నొక ఇంటివానిగాచేసిన కుటుంబినిగా ఆమెను మించిపోయింది. ఆమె నీహారక్షమాభృత్ కుమారి- గొప్ప రాచవారిబిడ్డ (చాలా అక్షరాల పేరు). అంతేకాదు, ఆకూ అలమూ కూడా తినకుండా (అపర్ణ అయి) తపస్సుచేసి ఎంతో మహిమ నార్జించిన యువతి. అటువంటి దానిని గూడా ఈ జాహ్నవి మించిపోయింది. భార్యను తలమీద నెక్కించుకున్న శివుడు, రామాంధుడూ తెలివితక్కువాడూ కాడు. సర్వజ్ఞుడు - అన్నీ తెలిసినవాడు. ఇటువంటి ఇంత అర్థాన్ని ఆ నాలుగు చరణాలలోనూ ఇమిడ్చిన చేమకూర కవిని ఎంతని ప్రశంసించగలము. అడుగడుగున ఈలాంటి హృదయరంజకమయిన అర్థాలనూ అద్భుతమయిన అందాలనూ సాధ్యమైనంతవరకు పాఠకలోకానికి తెలియపర్చడానికే ప్రయత్నించాను.

ఈ వ్యాఖ్యాన ఫలితంగా పాఠకులకు కవిమీద ఇతోధికమైన గౌరవం కలిగితే నేను ధన్యుణ్ణి. విజయవిలాస కవి గతించి మూడువందలయేభయి సంవత్సరాలైనా ఆ కవిని మనం సంపూర్ణంగా అర్థం చేసుకోలేకపోయాము అనే అపయశం ఎంత తొలగితే అంత మంచిదికదా!



## కవిపరిచయము

కవి ఎన్నో మంచి కావ్యనియమాలతో గ్రంథరచనకు పూనుకున్నాడు. మాటలకున్న విలువలను బాగా గుర్తించాడు. ఉపమావాచకాల విషయమూ తిరస్కారపదాల ఉపయోగము, పలుకుబడులలోనూ లోకోక్తులలోనూ చూపదగిన చమత్కారమూ ఇవన్నీ చక్కగా గుర్తించినవాడు. సన్నివేశానికి తగిన పదమును చక్కని అర్థగౌరవముతో ప్రయోగించే నేర్పు నలవరచుకున్నాడు. అతని ప్రక్రమాభిలాష అద్వితీయము. మాటల విరుపులు మహాద్భుతంగా ఉంటాయి.

ఇన్ని విశేషాలతోచేసిన రచనను అవగాహనచేసుకోవడము చాలా కష్టమయిన కార్యము. "పాఠ నిర్ణయ వ్యాఖ్యారచనాది పరిక్లేశము" మహాపండితులయిన శ్రీ వేదము వెంకటరాయశాస్త్రిగారికే అవసరమయినప్పుడు, నావంటి వాని కది ఎంత పరిక్లేశ భరితమో వేరుగ చెప్పాలా.

---

§వి. వి. అంటే విజయవిలాసము.

సన్నివేశాలు - పదాలు :

కథా సన్నివేశానికి తగిన పద ప్రయోగము ఉన్నప్పుడు వ్యాఖ్య సులభముగా సాగుతుంది. అది కనబడనప్పుడు వ్యాఖ్యాత ఎంత శ్రమ అయినా పడి సరియైన అన్వయము కనబరచాలి. లేదా, చేమకూర కవిని పట్టి 'తోటకూర' కవిగా అపయశముపాలు చెయ్యాలి ; అతని కవిత్వాన్ని అనేక విధాల ఎంతగానో ప్రశంసించిన పండితులను, కవులను, విమర్శకులను పట్టి 'మిథ్యావాదులు'గా పరిగణించాలి. ఆ పని చేయడానికి ఇష్టములేనివాడను కాబట్టి అవసరమయినంత శ్రమ పడడానికే సిద్ధమయ్యాను. ఒక్కొక్కప్పుడు ఒక్క విషయంకోసం రోజుల తరబడిని— కొన్ని సమయాలలో నెలల తరబడిని— శ్రమపడవలసి వచ్చేది.

చూడండి : చిత్రాంగద వర్ణనలో ఒక చిన్న పద్యం ;

కన్నెనగు మోముతోడన్
పున్నమచందురుని సాటిఁ బోలుప వచ్చున్ ;
వెన్నుదురుతోడ మార్కొని
ము న్నందఱు జూడ రేకమోవక యున్నన్ (వి. వి. 1-197)

ఈ పద్యములో చంద్రుడు పూర్వము నుదురుతో మార్కొని అంటే ఎదిరించి ఓడిపోయి 'రేకమోయ' వలసి వచ్చిందని కవి అన్నాడు. ఆ పనే జరగకపోయి ఉంటే, ఈనాడు ఆమె నవ్వు ముఖముతో సాటి పోల్చ వచ్చునన్నాడు.

వేదమువారు దీనికి "బట్టబయలైన అవమానమునకు పాలయి, జాబు మోయు పనిని (తపాలా నౌకరీని) చేయకున్నయెడల" అని వ్యాఖ్యానించారు. మార్కొని (ఒడ్డారించి) అవమానానికి పాలయి జాబుమోయు పనిచేయడ మంటే ఏమిటి ? ఆ జాబేమిటి ? వ్యాఖ్యానంబండి ఆగక తప్పదు కదా ! జూలూరు అప్పయ్యగారు బ్రౌన్ దొరగారికోసం వ్రాసిన వ్యాఖ్యానం చూచాను. దానిలో తపాలా నౌకరీ అనడానికి బదులు "హర్కారా" పనిచేయనియెడల అని వ్రాశారు. రేక అంటే లేఖ కావచ్చును ; రేకమోయుపని తపాలా పనే కావచ్చును. ఆ పలుకులకు ఆ అర్థములేదని అనలేము. కాని, ఎదిరించడంతోనున్న ఆ సన్నివేశానికి ఆ అర్థం కూడదని వదులుకున్నాము. ఇంక దాని అర్థం ఏమిటి అని కొన్నాళ్ళు తపనపడి నే నిచ్చిన గంటు గాయము అన్న అర్థానికి వచ్చాను. ఆగంటే పుండయి మాని మచ్చకట్టి చంద్రునిలో ఉందనీ, ఆ మచ్చ లేకపోతే ఈ నవ్వు మొగముతో ఉపమించదగుననీ చక్కని వ్యంగ్యార్థము కలుగుతుంది. అపార్థము చెప్పినందువల్ల ఈ సొగసంతా కనబడదు.

గంగానదిలో అర్జునుడు స్నానము చేసినప్పుడు

తమి నిగుడ గుడాకేశుం
డమర నదీ విపులవారి నాడుచునుండన్
యమునా నది గూడిన తో
యమునా నది తనరెఁ దక్క చామేచకమై (వి. వి. 1-121)

అని కవి వర్ణించాడు. గంగానది తెల్లని నీటిలో అర్జునుడు స్నానం చేస్తూంటే అతడి నల్లని దట్టమై నిడుపైన తలవెంట్రుకలవల్ల అది యమునానదిలోని నల్లని నీరా అన్నట్టుందని దాని భావములో ఒక భాగము. ఈ సన్నివేశములో అర్జునుడిని "గుడాకేశుడు" అని కవి పేర్కొన్నాడు. వ్యాఖ్యాతలు గుడాకా = అలస్యము నకు, ఈశుడు = దొర (అలసతలేనివాడు) అని అర్థం ఇచ్చారు. భగవద్గీతలోనూ భారతములోనూ ఆ పేరుకి

ఈ అర్థం సరి అయినదే. కాని, ఈ కవికీ ఈ సన్నివేశానికీ అది అమరదు. దీనిలో ముఖ్యమైన విషయం తలవెంట్రుకల (కచ) వర్ణన, గుడాకేశ శబ్దములో 'కేశ' ఉన్నది. దాని అర్థము గూడ తల వెంట్రుకలనే. కాబట్టి కవి హృదయములో కేశముతో సంబంధమున్న అర్థమే ఉండి ఉండాలి. ఆ అర్థం ఏమిటో తెలుసుకోడానికి చేయదగిన ప్రయత్నమంతా చేయక తప్పదుకదా.

## చారిత్రక విషయాలు :

చారిత్రక విషయాలు, చెప్పవలసి వచ్చినప్పుడు కవులు సాధారణంగా కృతి భర్తలను అతిశయోక్తులతో వర్ణిస్తుంటారు— ఓడిపోయిన పోరాటలు గెలిచినట్టూ, పది మందిని శత్రువులను చంపి, సహస్రాధిక విమతులను చంపినట్టూ వ్రాయడం ఉంది. కృతి భర్త రఘునాథ రాజువంటి పండిత ప్రభువయితే ఆ మాటల అర్థం తెలిసినవాడు కాబట్టి ఆ అతిశయోక్తులను వారించకతప్పదు. ఆ చారిత్రక విషయాలు తెలుసుకోడానికి బెంగుళూరులో ఉంటూ, తంజావూరు డిస్ట్రిక్టు గెజిటియరో (మాన్యుయలో) మద్రాసు లిటరరీ సొసైటీనుంచి తెప్పించుకొని దానిలోని కొన్ని విషయాలు 'విజయవిలాసములోని చారిత్రక విషయాలు' అని ఒక వ్యాసము వ్రాసి పాండ్రంగి రామారావుగారు ప్రచురిస్తూ ఉండిన 'పుష్కరిణి' మాస సంచికకు పంపించాను. చేమకూర కవి రాజుగారియందు భక్తి విశ్వాసాలు కనబరచడమే కాక, వర్ణిస్తున్న విషయాలయందు గూడా ఆ గుణాలే ప్రదర్శిస్తాడని సభలో చెప్పుతుండేవాడను.

ఆ విషయాలు పూర్తిచేయకముందే ఆ గ్రంథము లైబ్రరీకి వాపసు పంపించవలసివచ్చింది. తరువాత విజయవిలాసములోని షష్ఠ్యంతాలలోఉన్న ఈ కింది పద్యము కంటపడ్డది. శ్రద్ధగాచూచాను.

సుస్థిర లక్ష్మీ మహిత మ
ణీ స్థగిత గృహాంగణునకు నేపాళ నృపా
ల స్థాపన చణునకు, సక
లాస్థాన ప్రణుత వరగుణాభరణునకున్ (వి. వి. 1-62)

దీనిలోని రెండవ వర్ణన : నేపాళరాజును రఘునాథుడు సింహాసనముమీద నెలకొల్పినవాడని, ఎక్కడ నేపాళదేశము ? వేయిమైళ్ళ దక్షిణముననున్న తంజావూ రెక్కడ ? ఆ రాజు రాజ్యభ్రష్టుడయితే అతనికి సాయంచేసే వారెవ్వరు దగ్గరలో లేకపోయారా ? దేశం గొడ్డుపోయిందా ? ఇది కేవలం అసత్యం అని అనుకున్నాను. ఆ దినాలలో, దుర్భావారి అధ్యక్షతను నెల్లూరులో ఉపన్యసిస్తూగూడా, ఈ పద్య విషయం కేవలం అసత్యమయినా కావాలి, లేదా, సహించడానికి వీలులేనంతటి అతిశయోక్తి అయినా కావాలని మనవిచేశాను.

చెన్నపురి చేరిన తరువాత ఈ అభిప్రాయము మార్చుకోవలసి వచ్చింది. రఘునాథరాజు కుమారుడు విజయరాఘవ నాయకుడు వ్రాసిన రఘునాథాభ్యుదయ ద్విపద కావ్యము చూచాను; దానిలో రఘునాథుడు కట్టించిన లక్ష్మీ విలాసము అన్న ఇందిరామందిర వర్ణన ఇలాగుంది.

"...............
మేలైన పటికంపు మెటికలు కల్గి
కదనంబులో చోళగుని గెల్చినట్టి
పోలికల్, నేపాళ భూపాలకునకు
దొరతనం బిచ్చిన దోర్విలాసములు :
దురములో నల పాండ్య తుండీర పతుల

చేరి గెల్చినగెల్పు: సింహాసనమున
నా రామదేవరాయల నిల్పుటయును:
మొదలైన విజయముల్ ముద్దులుగుల్కఁ
బదరక వ్రాసిన భావముల్ మెరయ
ఇందిందిరాలక యిందిరా రమణి
కందళించిన వేడుకల్ గటారింప
రమణీయమగు నిందిరామందిరంబు......"

ఆ లక్ష్మీమందిరము గోడలమీద నేపాళరాజును నెలకొల్పడాన్ని తెలిపే బొమ్మలున్నాయన్నాడు. ఇంక దీనిని అసత్యమనిగాని అత్యంతాతిశయోక్తి అనిగాని అనుకోడానికి వీలులేదు.

ఇది సత్యం— ముమ్మాటికీ సత్యము. యజ్ఞనారాయణ దీక్షితుడు— రఘునాథుడి శిష్యుడు— తన సాహిత్య రత్నాకరంలోనూ, రామభద్రాంబ రచన 'రఘునాథాభ్యుదయ కావ్యంలోను ఈ నేపాళ నృపాల స్థాపనగురించి వ్రాశారు.

కాని, ఈ నేపాళరాజు శత్రువు లెవరన్న విషయములో వీరి వ్రాతలలో కొంచెము వ్యత్యాసముంది. యజ్ఞనారాయణ దీక్షితులు 'పారశీకు: లన్నారు; రామభద్రాంబ 'ఫరంగులు' (అంటే ఫ్రెంచివారు) అని అన్నది; పడవలమీద సేనలను నడిపి రఘునాథుడా శత్రువుల నోడించినట్టు ఉభయులూ వ్రాశారు. ఆ శత్రువులు పారశీకులూ కారు, ఫ్రెంచివారూ కారు, పోర్చుగీసులు. ఆ నేపాళము జాఫ్నాదీవి, ఆ రాజు సంగ్లీకుమార్, వారి అభ్యర్థనమీద రఘునాథుడు విజయం సాధించి ఆ రాజును సింహాసనము మీద ప్రతిష్ఠించి వచ్చాడు:

ఆంధ్రులకు గర్వకారణంగా ఉండదగిన ఈ సంగతిని వివరిస్తూ 1927లో భారతి పత్రికలో 'నేపాళ చోళగ' అన్న శీర్షికతో ఒక వ్యాసము ప్రకటించాను. ఆ వ్యాసంలో నేను విమర్శక ధర్మాన్ని పాటించలేదని బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు భారతిలో వ్రాసి కొంత వాదోపవాదాలకు దారితీశారు.†

దాని ఫలితంగా వెంకటరాయశాస్త్రిగారిని (అప్పటికి సజీవులుగానే ఉన్నారు). వేటూరివారు కలుసుకొని మాటలాడి, "శ్రీ శాస్త్రులవారు విజయవిలాస సారంగధర చరిత్రములకు టిప్పణులను తమ యొద్దఁ బనిచేయుచున్న యొక గ్రంథకర్త అప్పయ్య (జూలూరువారు) పంతులుగారి ప్రౌఢటీకల ననుసరించి వ్రాసికొనివచ్చి యిచ్చిన లఘు టీకను సరిపఱచి రచించిరట. అట్లు సరిపఱచుటలో నా లఘుటీకలోని ప్రమాదములు కొన్ని యపరిశీలితములుగా నట్టె విడువఁబడి యుండునని శాస్త్రులవారు నాతో ననిరి§" అని వేటూరి వారే భారతిలో ప్రకటించారు.

ఈ సందర్భములో శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు ఇంకా ఈలాగున వ్రాశారు. "శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఆ సంగతిని ఆంధ్ర విశారదులు తాపీ" ధర్మారావునాయుడుగారు 'విజ' - 'సారంగ' టీకలలోని లోపము

---

†భారతిలో మా వాదోపవాదాలు 1927 సంపు 4. సంచిక 9 లోనూ 1928 సంపు 5, సంచికలు 3, 4, 5 లోనూ చూడవచ్చును.

§ఆనాటి ప్రభాకరశాస్త్రిగారి వ్యాసము కాపీ నా దగ్గర లేదు. అందుచేత మిత్రులు బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తాము 1942 లో ముద్రించిన సారంగధర - జితకాశి వ్యాఖ్యానరాజములో 20 వ పుట చివరను ముద్రింపించిన వేటూరివారి వ్యాస భాగమే ఇది.

లను గూర్చి విమర్శించి వెంకటరాయశాస్త్రిగారికి ఒత్తిడి కలిగించిన సందర్భములో— శ్రీ శాస్త్రిగారికి సాయపడు తలంపుతో - బయట పెట్టినారు" అని

ఏ విధంగానైనా సత్యము బయటపడడం వాంఛనీయమే కదా !

చోలగుడు అన్నవాడు దేవకోటలో ఉండే పరమదుర్మార్గుడయిన దొంగల ముఠా నాయకుడు. ప్రజలను చెప్పనలవికాని హింసలపాలుచేసి, రోమకూపాలలో సూదులుగుచ్చి, మొసళ్ళకు నరులను మేతగా ఇస్తూ ఉండేవాడు. అంతేగాని చోళదేశ ప్రభువుకాడు. రఘునాథుడే చోళదేశ ప్రభువు. అటువంటివానిని రఘునాథుడు బయటి కీడ్చి ఓడించి అవమానముపాలుచేసి ప్రజలకు హాయినికలిగించాడు. ఆ నేపాళ నృపాల స్థాపనలాగానే ఈ చోలగ మానభంజన గూడా గర్వకారణమయి సంతత స్మరణీయంగా ఉండదగినది. అందుకే ఆ విషయాలు మందిరాల గోడలమీద చిత్రించారు.†

ఈలాగు పెద్దలు ఇచ్చిన అర్థాలనూ చేసిన వ్యాఖ్యానాలనూ కొన్నింటిని అంగీకరించి చేమకూరకవిని అవమానంపాలుచేయడానికి మనసొప్పక, అతని హృదయములోనున్న అభిప్రాయాన్ని తెలుసుకోడానికి శక్తివంచనలేకుండా ప్రయత్నించాను. ఈ విధంగా పొసగని అర్థాలు పూర్వ వ్యాఖ్యానాలలో చాలా ఉన్నాయి.

వాటిలో కొన్ని :

(1) చంద్రప్రస్తరసౌధ........పద్యంలో
'రమాహేలాకళావాసమై' (వి. వి. 1-66)

(2) అంగజరాజు పాంథనిచయంబులపై....... పద్యంలో
'ఆలవట్టములు' (వి. వి. 1-208)

(3) అతివినోదముగాగ రతులమెప్పించు........పద్యంలో
'చవులదేలించు' (వి. వి. 1-81)

(4) గెలిచిన గెల్పు లర్థితతికిన్.... ...పద్యంలో
'ఈవులున్ వహుల్' (వి. వి. 1-14)

(5) చెలువ నినురాజకీరంబు చెట్టపట్టి........పద్యంలో
'కాలుత్రొక్కె' (వి. వి. 2-159)

(6) అనిన ఫణిజాతి వీ వేను మనుజజాతి........పద్యంలో
'చిలువచెలువము' (వి. వి. 1-165)

పై వాటిలో 1, 2 విషయాలకు సరియైనటువంటిన్ని సంతృప్తికరమైనటువంటిన్ని అర్థాలకోసం నేను తాపత్రయంపడుతూ ఉండగా మిత్రులు, విజయనగర మహారాజావారి కాలేజీలో ఆంధ్రోపాధ్యాయులుగా ఉండిన

---

†భారతిలో నా వ్యాసము చూచి నెల్లూరులో సుప్రసిద్ధ న్యాయవాదులు, ఆంధ్ర సాహిత్యాభిమానులు, వేదమువారి మిత్రులు నిఘంటు నిర్మాతలు అయిన శ్రీ ఒంగోలు వెంకటరంగయ్య పంతులుగారు నాకు జాబు వ్రాస్తూ - వారి చిన్నతనములో వ్రాతకు తాటాకులే ఉపయోగించేవారనీ, పొడవు వెడల్పు బాగా ఉండిన తాటాకులను 'నేపాళపాకులు' అనేవారనీ, ఆ ఆకులు సింహళమునుంచి వస్తూండేవనీ తెలియ పరిచారు. అలాగే మంచి బలముకలిగిన తాటివాసాలు - నేపాళపువాసాలని - సింహళమునుంచి వస్తూండేవని మరొకరుచెప్పారు.

బ్రహ్మశ్రీ గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారు లక్ష్మీనారాయణీయమన్న ఆంధ్ర నిఘంటువులో అలవట్టము అంటే సూర్యపాళా చంద్రపాళా అన్న అర్థాన్ని చూపించడమేకాకుండ హేలా అన్న పదానికి 'విలాసము, పార్వతి' అని నానార్థాలున్నాయని తెలుగు లిపిలో ముద్రితమయిన నిఘంటువు చూపించారు. వారికి నా కృతజ్ఞత.

ఈ అర్థముతో నన్నయభట్టుగారి శ్రీ, వాణి, గిరిజలు ముగ్గురిని మన మొదటి పద్యములో నెలకొల్పిన వార మయినాము కదా.

3 వ విషయము నగరవారకాంతల వర్ణనలో చక్కెరమోవిచ్చి చవుల తేలించునీ ముత్యాలకమ్మల ముద్దులాడి...... "అతివిమోదముగాగ రతుల మెప్పించు నీ పచ్చల కదియాల పద్మగంధి" అన్నాడు. వ్యాఖ్యాతలు "చవులు అనగా ముత్తెముల కాంతి విశేషము - దానినే నీరు అని వ్యవహరింతురు" అని వ్రాశారు. కవి ప్రక్రమ పద్ధతిని ఈ 'చవుల తేలించును' అన్నదానికి, పై చరణములోని 'రతుల మెప్పించును' అనిన పదాలకు ఇచ్చిన అర్థంవంటి అర్థమే చెప్పడం ధర్మము'...... మద్రాసులోని వజ్రాలనగల వర్తకులు సూరజ్‌మల్ లల్లూభాయి అంగడిలో నా దగ్గరున్న బాగా తయారుకాని ఒక ముత్యము తూచి, ఇది 42 చౌలుంది అన్నాడు. ఏమిటని మళ్ళా అడగగా ఆ వర్తకుడు వజ్రాలు తూచడానికి కారెట్లులాగానే ముత్యాలు తూచడానికి "చౌలు" వాడతారని నా కపరిమితానందాన్ని కలుగజేశాడు.

ఇంకేమి కావాలి ! రఘునాథరాజు ఆస్థానములో రత్నాలగురించిన ప్రత్యేక గుణాలూ దానికితగిన పరిభాషా మన కవికి బాగా తెలుసును. ఆ సీస చరణాలు నాలుగింటిలోనూ ఇలాటి ప్రత్యేక గుణాల వర్ణనే ఉంది.

4 వది : గెలిచిన గెల్పు లర్థితతికిన్ దినమిచ్చిన యీవులన్ వహుల్ తలచిన. ఇక్కడ వ్యాఖ్యాతలు ఈవులన్ వహుల్ అని చదివి "ఈవులన్ = దానములయందలి, వహుల్ = విధములను" అని అర్థం చెప్పారు. తిరుపతి వేంకటకవులు "వహుల్ = పక్షములు" అని అన్నారు. వెంకటకృష్ణమాచార్యులవారు 'ఈవులన్ బహుల్' అని పరిష్కరించారు. నా అవస్థచూచి 'బహి' అంటే పుస్తకము (ముఖ్యంగా లెక్కల పుస్తకము) అన్న అర్థము హిందీ భాషలో ఉందని పద్యానికి సరళాన్వయానికి చేయూతనిచ్చి శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారు నా కృతజ్ఞత చూరగొన్నారు. మనదేశంలో గూడా 'దినవహి' వారున్నారుకదా.§

పాఠాలకోసం అన్వేషణ :

ఒకొక్కొక్కప్పుడు మన వ్యాఖ్యాతలు నిర్ణయించిన పాఠమూ దాని వివరణమూ అసందర్భంగా ఉండి అంగీకరించడానికి వీలులేకుండా ఉండడము కనబడుతుంది. అలాంటప్పుడు మంచి పాఠము దొరుకుందేమో అన్న ఆశతో మరొకసారి అన్వేషణచేయక తప్పదు. దీనికొక్క నిదర్శనము

శైలములెక్కి అష్ట మదసామజ మౌళులమీఁదు గా మహా
కోలము వెన్ను దాటి పలుగొమ్ము మొనం బడి..        (వి. వి. 1-20)

శూలలితాంగి సాహసించిపోయి రఘునాథుడి నాశ్రయించిందని ఈ పద్య భావము. కవి కల్పనా పెద్దల వివరణ అంతా బాగానే ఉంది. కాని వెన్నుదాటి కోరమీదపడాలంటే తోకవైపు నుంచి ముట్టెవైపు దాటాలి— ఇది అసహజము కాదా ?

§తక్కిన 5, 6 విషయాలు గురించి ఈ హృదయోల్లాస వ్యాఖ్యానములో చూడమని పాఠకులను ప్రార్థిస్తాను.

అన్వేషణలో దొరికిన ఆ రెండోచరణము :

మహా – కోలకులేంద్రు వాడి బలుకొమ్ము మొనంబడి... దీనిలో వెన్నుదాటే అసందర్భం పోయింది. సవ్యమయిన వివరణ లభించింది.

దిద్దుబాట్లు :

వ్యాఖ్యాతలూ పరిష్కర్తలూ అందరు ఒకే ఒక పాఠం అంగీకరించి, పద్యాన్ని వాక్యవిభజనచేసి అర్థం చెప్పబోతారు. దానిలో కవికి కాణాచిగా ఉన్న మనోహరమయిన కావ్యనియమాలన్నీ భగ్నమయి, వర్ణన మహాపేలమయి, అవకతవకలవుతుంది. ఉదాహరణకు :

ఊదుకవోవు శంఖము నహో ! గళరేఖ; కరాననంబులన్
వాదుకుబట్టి కన్నొమల వైఖరి వంకలు తీరుచున్; కటా
క్షోదయ లీల సాయక సమూహములన్ విషమాస్త్రుగెల్చుబో;
యే దొరసాటి యీ నరునకెన్నగ పేరవిలాస సంపదన్. (వి. వి. 1–134)

ఈ పాఠము, ఈ వాక్యవిభజనా దానికి పండితులిచ్చిన వివరణమూ అంతా అపసవ్యంగా కనిపించాయి. అందుచేత సాహసించి 'వాదుకుబట్టి' అన్న దానిని 'వాదుకుబట్టు' అని చిన్న సవరణచేశాను. అన్వయము సుగమమయి కవిభావము సుందరమయిందని సహృదయులు అంగీకరిస్తారనే నమ్ముతాను. దయచేసి నా వ్యాఖ్యానం చూడండి.

ఈలాటిదే

రసికుండౌ రఘునాథు కీర్తినతి యౌరా ! తొల్త వాగ్బంధమున్
రసవాదంబును...............
........ఛత్రచామర మహాలక్ష్మిల్ గనన్ శక్యమే (వి. వి. 1–18)

దీని నాలుగోచరణం చివరనున్న 'గనన్ శక్యమే' అన్న దానిని 'నగన్ శక్యమే' అని సవరిస్తే అన్వయము సరళంగా ఉంటుందని సాహసించాను. నా వివరణ చూడండి.

—φ—

# రఘునాథరాజు

చేమకూర వేంకటరాజకవిని, అతడు వ్రాసిన ప్రబంధరాజాలు విజయవిలాసం, సారంగధర చరిత్రలను నోరార ప్రశంసించని కవులుగాని, పండితులుగాని, విమర్శకులుగాని ఈ మూడువందల యాభై సంవత్సరాల్లో ఆంధ్రదేశంలో ఎవ్వరూలేరని నిరాఘాటంగ చెప్పవచ్చు. కొందరు చేమకూర పాకాన పండిందన్నారు. ఇంటిపేరు పసగా ఉన్నా కవిత్వం పసగా ఉందన్నారు కొందరు. చక్కెరమళ్ళలో అమృతం పారించి పండించిన చేమకూర అని ఒకరు అన్నారు. ఇంకొకరు 'కసుంగదుం గదుమవాడు' అని మెచ్చారు.

చేమకూర కవిని అనేక విధాల ప్రశంసించారు. కందుకూరి వీరేశలింగముగారి పండితారు..."అచ్చ తెలుగు పదములను పొందికగ గూర్చి కవనము చెప్పు నేర్పు ఈ కవికి కుదిరినట్లు మరియొక కవికి కుదిరిన

దని చెప్పవలను పడదు...... పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమునకు తరువాత విజయవిలాసము సర్వ విధములచేతను తెలుగులో శ్లాఘ్య కావ్యముగ నున్నది. జాతియాది చమత్కృతినిబట్టి విజయవిలాసమే శ్లాఘ్యతరమయినదని అనేకు లభిప్రాయపడుచున్నారు" అని ప్రశంసించారు.

తంజావూరు నాయకరాజులలో ప్రసిద్ధుడగు రఘునాధరాయల ఆస్థానంలో ఈ సరసకవి ఉండేవాడు. 1600 మొదలు 1630 వరకు తంజావూరును పాలించిన పండితకవి రఘునాధనాయకుడు. కృష్ణదేవరాయల అనంతరం అంతటివాడేకాక అంతకుమించినవాడని ఎంచదగిన ఆంధ్రభోజుడు. శత్రువులను నిర్మూలించుటలో అవక్ర పరాక్రమశాలి. జనరంజకంగా దేశాన్ని పరిపాలించుటలో నేర్పుగల రాజనీతి నిపుణుడు. సహృదయులు మెచ్చేటట్లు రసభావకవిత సంస్కృతం, తెలుగు రెండింటిలో చెప్పగల విద్వత్కవి ‡ నూతన రాగాలను, తాళాలను కనిపెట్టి వీణల మేళ వింపును సంస్కరించగలిగిన సంగీతశాస్త్ర నిపుణుడు. మేధావి. యజ్ఞనారాయణ దీక్షితులు, మధురవాణి, రామభద్రాంబ మొదలగు కవి శిరోమణులను తీర్చి దిద్దగలిగిన ప్రతిభాశాలి. యక్షగాన రచనముతో, నాటకకళా వికాసంతో కళాభ్యుదయానికి త్రోవచూపిన రసికవతంసుడు. వేయిమాటలెందుకు ఆంధ్రనరపాలురలో ఇంతటివాడు లేడు అని చెప్పదగిన బహుముఖ ప్రజ్ఞానిధి.

అచ్యుతప్పనాయకుని మంత్రిగా ఉండిన గోవింద దీక్షితులువద్ద సకలవిద్యలను నేర్చిన ఈ రాజు గోవింద దీక్షితుల కుమారుడైన యజ్ఞనారాయణ దీక్షితులకు గురువుగా ఉండదగిన సమర్థత కలిగినవాడు. రఘునాధరాయలు 'పారిజాతా హరణాన్ని' సంస్కృతంలో ఆశువుగా చిరుతప్రాయంలోనె చెప్పగలిగాడు. తరువాత ఉభయభాషలలోను మనోహరమైన కవితా విలసనలో అనేక గ్రంథాలను రచించాడు. వాటిలో ఇప్పుడు మనకు లభ్యమైన గ్రంథాలు ముఖ్యంగా మూడు—— వాల్మీకి చరిత్ర, రామాయణము అనే పద్య కావ్యాలు, నలచరిత్రం ద్విపదకావ్యం. ఇవికాకుండా అచ్యుతాభ్యుదయం అనే ద్విపదకావ్యాన్ని, జానకీ కల్యాణం అను చాటు కావ్యాన్ని, రుక్మిణీ కృష్ణ వివాహ యక్షగానాన్ని గూడ రచించాడని గోవింద దీక్షితుల 'సంగీత సుధ'లో ఉంది; ఇవి ఇంకా ఆంధ్రులకు లభ్యంకాలేదు. రామాయణంలో మొదటి భాగం కొంత వరకు మాత్రం ఇప్పటికి లభ్యమయింది. ఈ రెండు గ్రంథాల ద్వారా రఘునాధరాజు పదప్రయోగం, భావ ప్రకటనం, రసకార్యనిర్వహణం, ప్రకృతి పరిశీలనం స్పష్టంగా కన్పిస్తున్నవి; వాటిలోని ప్రతిభ రసజ్ఞుల ప్రశంసల్ని అందుకుంటున్నవి.

---

‡అంతకుపూర్వం వీణా వాద్యంలో ఒక్కొక్క రాగానికి ఒక్కొక్క మేళవింపు అవసరంగా ఉండేది. అల్లసాని పెద్దన కాలంలో ఈ ప్రత్యేక మేళవింపులు ఉన్నట్టు ఈ క్రింది పద్యంవల్ల తెలుసుకోవచ్చు——

"వాలారున్ కొనగోళ్ళ నీవలనతన్ వాయించుచో నాటకు
న్మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీ వంటమిం జేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాత వాతాహతా
లోల త్తంత్రుల మేళవింపఁ గదవే లోలాక్షి దేశాక్షికిన్" (మనుచరిత్ర)

రామరాజ భూషణుడు గూడ ఇట్టి ప్రత్యేకమైన మేళవింపులు ఉండేవని చెప్పాదనడానికి నిదర్శనంగా—

...కిన్నెరవధూ రాజత్ కరాంభోజ కాం
భోజీమేళ విపంచికా రవ సుధాపూరంబు తోరంబుగాన్....

(వసుచరిత్ర) లో ఉన్న 'కాంభోజీ మేళవిపంచి' ని చూడవచ్చును. రఘునాధరాజు ఈ ప్రత్యేకతలను తొలగించి అన్ని రాగాలకు పనికివచ్చేట్టు 'రఘునాధమేళ' అని ఒక కొత్త మేళవింపును కనిపెట్టాడు. అదే ఇప్పుడు వాడుకలో ఉన్న మేళవింపు.

ఆ దినాలలో ఆయన ఆస్థానం పండితులు, కవీశ్వరులు, కవయిత్రులు, నటీమణులు ఎందరితోనో నిండి ఉండేది: ఈ సభ ఆ ప్రాంతాలవారందరికి ఆదర్శప్రాయంగా అలరారుచుండేది. రఘునాథరాయల్ని చూచే జింజీ, మధుర, తుండీర ప్రభువులు తమ కొలువు కూటాలకు కవుల్ని, నర్తకుల్ని ఆహ్వానించి ఆదరిస్తుండేవారు.

ఈ సందర్భంలో ఒక్కమాట చెప్పక తప్పదు— ఏ కారణంవల్లనోగాని ఆ ఆస్థానంలో సంస్కృత భాషకు ఉన్నటువంటి ఆదరగౌరవాలు ఆంధ్రానికి లేకుండేవి. అనస్పృశమైన కవి పండితపోషణకు ప్రసిద్ధి పొందిన ఆ తంజావూరునగరం ఎందరెందరో ఆంధ్ర కవుల్ని దూరదేశాలనుంచి ఆకర్షిస్తుండేదో చూడండి:

'ఘనావేల గరిష్ఠ దాన పదవీ పరితోషిత కాగగౌతమీ
చోళకవి ద్విజస్తుత పచోలగ చోళగ మాన భంజనా' (వి. వి. 3-237)

వారిలో ఒక్క చేమకూరకవి, రఘునాథరాజు తప్ప తక్కినవాళ్ళనుగురించి మనకు ఎక్కువగా తెలియదు. కాని సంస్కృత భాషా రచయితలుగా గోవింద దీక్షితులు, యజ్ఞనారాయణ దీక్షితులు, కృష్ణాధ్వరి, రామభద్రాంబ, మధురవాణి మొదలయినవారి పేర్లు సుపరిచితంగా ఉన్నాయి.

అటువంటి ఉద్దండ పండితవాతావరణంలో ప్రశంసల్ని పొందగలిగిన చేమకూరకవి ధన్యుడని చెప్పాలి. ఎందుకంటే రఘునాథనాయని కాలంనాటికి, అక్కడి పండితలోకానికి సంస్కృత వాఙ్మయంలోని చమత్కారాది కావ్య విశేషాలతోపాటు ఆంధ్రవాఙ్మయంలోని అపూర్వమైన రచనా విధానాలు గూడ పరిచితమైనవే.

నన్నయ, తిక్కనాది మహాకవులు తమ తమ వాగ్వైచిత్రితో, శిల్పప్రావీణ్యంతో ఆంధ్రసరస్వతిని అలంకరించిన కావ్యరాజాలను వారంతా బాగా ఎరిగినవారు.

అప్పటికి అయిదువందల సంవత్సరాలకు పూర్వం నన్నెచోడ మహాకవి అంకురార్పణచేసిన ప్రబంధలత శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరన మొదలయిన కవిశ్రేష్ఠుల దోహదంతో మూడుపూవులు ఆరుకాయలుగ అలరారింది.

సర్వాంగ సుందరంగా రూపొందిన యీ ప్రబంధ ప్రపంచం రఘునాథరాజు కాలపు కవి పండితులకు కరతలామలకం. శబ్దప్రయోగం, వర్ణనా చమత్కారం, చిత్ర విచిత్ర కల్పనలు, చక్కని రసపోషణం మొదలయిన విశేష కావ్యగుణాలతో ప్రబంధకవులుచేసిన కృషి అనన్యసాధారణం. ప్రబంధరచనా పద్ధతులలో వారు తొక్కని చమత్కారమార్గాలుగాని, విడిచిపెట్టిన ఆలంకారిక విధానంగాని లేదనే చెప్పాలి.

అటువంటి సమయంలో, ఆ పద్ధతులతోనే ప్రబంధరచనకు పూనుకొనిన ఒక కవి పైకవులను ఆకళించియున్న పండితలోకాన్ని మెప్పించటం అసాధారణమైన కార్యం. అందువల్ల ఎట్టి రచనా ప్రాగల్భ్యం ఉన్న కావ్యమైనా, కవనమైనా ఈ పండిత సభలలో పూర్వకవులతో తారతమ్యనిరూపణ జరిగినప్పుడు నిరాకరణానికి పాత్రమవుతుండేది.

ఈ కష్టాన్ని బాగా గ్రహించినవాడు మన చేమకూర కవి. అందువల్లనే చేమకూర కవి ఇతరుల పోకడలను ప్రయత్నపూర్వకంగా, ఉద్దేశపూర్వకంగా విడిచిపెట్టాడు; అంతేగాక పదప్రయోగం మొదలు రసపోషణంవరకు అన్ని విషయాల్లోను స్వతంత్ర విధానాన్ని అవలంబించడానికి ప్రయత్నం చేశాడు. తన కవితారీతుల్లోని మంచిచెడ్డలను నిర్ణయించుకొనడానికి చేమకూరచేసిన ప్రయత్నమే 'సారంగధర చరిత్ర' రచన అని అనవచ్చు.

అందులోని కొన్ని వర్ణనలను, చమత్కారాలను అప్పుడప్పుడు పండితగోష్ఠిల్లో వినిపించడం, వాటి మీద ఇతరుల విమర్శలను, వ్యాఖ్యలను వింటుండం జరుగుతుండేదని మనం భావించాలి. ఆ రూపంలోనే కవి గుణాధిక్యాలను రఘునాధనాయడువిని చేమకూర కవిత్వాన్ని గురించి తన అభిప్రాయాన్ని ఏర్పర్చుకున్నాడు. ("వానింబుకవిత", "ప్రతిపద్యమున చమత్కృతి" మొదలగు పద్యాలలోనివి రఘునాధనాయకుని అభిప్రాయాలే.)

చేమకూరలోని గుణవిశేషాలను తెలిసిన భాషాప్రియులైన కొందరు ప్రభువులు అతని కావ్యాన్ని తమకు అంకితం చేయవలసిందని కోరడమూ, ఆ కోరికను కవి నిరాకరించడమూ "కలనైన మిమ్ముగాకన్యుఁ గొలువనంటి, కృతులొకరి కీను మీకె యంకితములంటి" అన్న రఘునాధుని వాక్యాల వలన తేటపడుతున్నది—

"తారన పుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థ గౌరవముఁ గల్గ ననేక కృతుల్ ప్రసన్న గం
భీర గతిన్ రచించి మహిమించిన......" (వి. వి. 1-31)

రఘునాధునకు అంకితముచేయగలిగిన గుణవిశేషాలు తన 'సారంగధర చరిత్ర' లో పూర్తిగాలేవని భావించి సర్వకావ్యగుణ సంపన్నంగా ఈ విజయవిలాసమును' రచించి, కేవల భక్తి విశ్వాసాలలో రఘునాధునకు అంకితం ఇచ్చి తన జన్మ సార్థకమైనట్లు ఆనందించాడు.

## కవి జీవితము

తన జీవితాన్నిగురించి చేమకూర కవి వాచాగా చెప్పినది చాల స్వల్పము. కాబట్టి ఇతరులు అతడిని గురించి చెప్పిన మాటలనుబట్టీన్నీ ఆశ్వాసాంత గద్యలనుబట్టీన్నీ పాఠకుడు ఆ జీవితాన్ని పునర్నిర్మించుకోవాలి. అది చాల అవసరం; ఎందుచేతనంటే కవినిగురించి బాగా తెలియకపోతే అతని రచనను చక్కగా అవగాహన చేసుకోలేము.

చిన్ననాటనే ఇతనికి సూర్యనారాయణ వరప్రసాదముగా కవిత్వధోరణి అబ్బింది. సంస్కృతములో పెద్ద పాండిత్యమున్నట్టుగాని, తెలుగు సాహిత్యము ప్రసిద్ధ గురువుదగ్గర నేర్చుకొన్నట్టుగాని కనబడదు. గోవిందదీక్షితుల కుమారుడు యజ్ఞనారాయణదీక్షితుడికి గురువుగా పేరుగాంచిన రఘునాధరాజును గూడా తన గురువుగా చెప్పుకోలేదు. అయినా పద్యాలు అల్లడమూ, సన్నివేశాలను వర్ణించడమూ సాగిస్తూఉండేవాడు. ఉద్యోగంచేస్తూ ఉండి గూడా రాజుగారు నడుపుతుండే పండిత గోష్ఠులకు హాజరవుతూ అక్కడి సాహిత్య చర్చలను శ్రద్ధగా వింటూ ఉండేవాడు. తనకు తెలియనివిషయాలను వారినడిగి తెలుసుకుంటూ ఉండేవాడు, వారే గురువులయారు.

### సారంగధర రచన :

ఈ సాంగత్యమువల్ల కావ్యరచన చేయాలన్నకుతూహలము కలిగింది. గౌరన వ్రాసిన నవనాధ చరిత్రలోని సారంగ (చౌరంగి) కథ అతనికి నచ్చింది. ఎందుచేతనంటే తనవలెనే సారంగధరుడు వరప్రసాది; కథలో అనేక రసాల రచనలకు అవకాశముంది. ఆ కథను కావ్యంగా వ్రాయాలని ఉత్సాహంకలిగింది.

ఏలాగుంటుందో చూదామని ఆరంభించాడు. తన ప్రయత్నం ఎంతవరకు ఫలిస్తుందో, బాగుంటుందో లేదో... అనిన ఆలోచనలేగాని, అంకితముగురించీ ఇతర విషయాలనుగురించీ అనుకొని అయినా ఉండడు. శ్రీకారము చుట్టి కథ ఆరంభించాడు. తీరిక కలిగినప్పుడంతా కొంతభాగము వ్రాయడమూ, అవకాశంవొచ్చినప్పుడు తాను వ్రాసిన 1-2 పద్యాలను ఏ పండితునికయినా వినిపించడమూ, వారి విమర్శన తెలుసుకోవడమూ జరుగుతుండేవి. ఆ పండితుడు మెల్లగా విద్వద్గోష్ఠిలో రాజుగారికి "మన వెంకటరాజు చాల చక్కని పద్యం వ్రాశాడండి" అని చెప్పడమూ, సభవారందరు 'ఏదీ ఏదీ' అని అడగడమూ, దానిమీద వారూ రాజుగారూ కొంత మంచిచెడ్డలు చెప్పడమూ... ఇటువంటి వ్యాసంగము కొంత జరుగుతూ ఉండేదని అనాలి ఆ విధంగా చేమకూర కవనములోని మంచిని రఘునాథరాజు గుర్తింపగలిగి ఉండాలి. అప్పుడే "వాక్ప్రియమరూఫి నీ యంతవాడి కేడీ?" అని అనగలిగి ఉంటాడు. గోష్ఠివారి మెప్పులవల్ల మరికొంత ఉత్సాహముతో సారంగధర రచన సాగిస్తుండేవాడు.

ఈ విధంగా ఆరంభమయి సాగిందికాబట్టి దీనిలో అవతారికగాని, ఆశ్వాస విభజనగాని, ఆశ్వాసాది అంతాలలో ఉండే పద్యాలుగాని, మన కవి వ్రాయలేదు. కావ్యము చక్కగా తయారయితే అవన్నీ ఒక్క రోజులో వ్రాయవచ్చునుగదా అని అనుకొని ఉండవచ్చును. తర్వాతనైనా ఎందు కివ్వలేదు?

సాహిత్య విమర్శనతోపాటు ఆత్మవిమర్శన కలవాడు కాబట్టి మన కవి తన సారంగధర అక్కడక్కడ రచన అపక్వస్థితిలో ఉన్నదనీ,§ కొన్ని కల్పనలు కుంటుతూ ఉన్నాయని, గుర్తించగలిగాడు.

తన సారంగధరలో ఎన్ని అమోఘమైన విషయాలున్నా, ఎంతటి కవితా విశేషమున్నా, అది గౌరవ కృతి ననుసరించి వ్రాసినదేగాని స్వతంత్ర రచన అనిపించుకోదుకదా. ఇంక, రాజో: నిత్యమూ నూతన స్వతంత్ర రచనలు ఆదరిస్తూ అనేకప్రాంతాలనుంచి వచ్చిన విద్వత్కవులను సంతోషపెట్టేవాడు. ఆ గోష్ఠిలోని మహామహులు అనుకరణాలంటే పెదవి విరుస్తూ ఉండరా?

స్వ కపోల కల్పిత మనో
జ్ఞ కళాగతి కెట్టులౌను నరి ఛాయా చో
రక రస నందర్భం బని... (వి. వి. 3-90)

స్వతంత్ర రచనకు ఎరువు తెచ్చుకున్న రచన సరికానేరదు... అనే భావము మన కవికి గట్టిగా కలిగింది.

కవి నిర్ణయము:

అంతేకాదు; తాను వ్రాసిన సారంగధరలో కొన్ని పక్వముకాని భాగాలున్నాయి. కొన్ని స్థలాలలో రచన బలవంతాన తెచ్చిపెట్టినట్టుంది ఎంతో సవరణచేస్తేనేగాని తక్కిన భాగాలవలె మనోరంజకంగా ఉండదని గుర్తించాడు.

మరొక్క విషయం: తంజావూరు రాజ్యము రఘునాథుడి పాలనలో విజయాలతోనూ, అన్న సత్రాలతోనూ, విద్యాగోష్ఠులతోనూ నాటకాలతోనూ ఆటపాటలతోనూ వెండియు పైడియు తడబడుతూ ఉండే ఇళ్ళతోనూ నిత్య కల్యాణమూ పచ్చతోరణముగా ఉండేది. ఆట్టి సమయాలలో ప్రజలకునచ్చేది చక్కని

§సుప్రసిద్ధ సారంగధర వ్యాఖ్యాత బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు "మొత్తము మీద... ... సారంగధర రచన విజయవిలాస రచనమంత సరసముగను పరిణతముగను లేదు" అన్నారు. (పా.పుట 10.)

శృంగారరసమేగాని మరొకటి కాజాలదు. అందులోనూ కుటిల ప్రవర్తనతో సాగిన విషాదాంత రచన ప్రజాదరణ యోగ్యంగా ఉండదు. సారంగధరలో ఉన్న కొంచెము గూడా శృంగార రసాభాసమేగాని ఇంకొకటి కాదుకదా !

తానుచేసిన సారస్వత కృషికీ, తనకున్న భావ సంపదకూ శృంగారరసము చక్కగా అమరుతుందని ఊహించాడు. శృంగారమే ఏకైకరసంగా ఉండే కథ వ్రాయాలనుకొని, సారంగధరను కొంచెము వెనుకకు పెట్టాడు. ఏది ఏమయినా, రఘునాధరాజుకు అంకితమీయవలసిన మొదటి కృతి తన సారంగధరకాదని నిర్ణయించుకున్నాడు. అందుచేతనే సారంగధరకు ఆశ్వాసాది పద్యాలుగాని, ఆశ్వాసాంత పద్యాలుగాని, గద్యముగాని వ్రాయలేదు.

విజయవిలాసము అంకితమిచ్చిన తరువాత ఈ సారంగధరను ఉచితరీతిని సవరించి అన్ని అంగులతోను సమర్పించాలని అనుకున్నాడేమో. కాని అదిగూడా జరగడానికి అవకాశంలేకుండా తానే కీర్తి కాయుడయ్యాడని అనుకోవాలి.

## విజయవిలాస రచన :

రఘునాథుడి పాలనలో దేశసౌభాగ్యమూ, ప్రజల సుఖజీవనమూ, లలితకళా విశేషాల అభిమానమూ బాగా ఉండడంవల్ల శృంగారరస రచనల మీద మక్కువ ఉండకతప్పదు. అందుచేత మన కవి సారంగధరనటుంచి విజయవిలాసం ఎత్తుకున్నాడు.

దీనిలో మూడు వివాహాలు చేస్తాడు. మూడూ మూడు రకాలుగా వ్రాయవచ్చును. ఉలూచి తన్ను వలచింది ; సుభద్రను తాను వలచాడు ; చిత్రాంగదకు ఈ అర్జునుడి సంగతే తెలియదు. మొదటిది గాంధర్వము, మూడవది కొంచెము రాక్షస చిహ్నాలున్నాయి. రెండవది తండ్రి ఏర్పాటు చేశాడంటే బ్రాహ్మ్యము, ఒక వాగ్దానం తీసుకొని పెళ్ళి చేశాడంటే ప్రాజాపత్యము అవుతుంది. ఇష్టము వచ్చినంత శృంగారము గుప్పించవచ్చును. ఈ మూడు వివాహాలను కొందరు స్వర్గ మర్త్య పాతాళలోకాల కన్యల వివాహాలుగా భావించారు. ఉలూచి పాతాళకన్య, చిత్రాంగద మర్త్యకన్య, సుభద్ర కృష్ణ బలరాములన్న అవతార పురుషుల చెల్లెలు కాబట్టి దేవకన్య అంటారు.

భారత కథలో అవసరమైన కొన్ని చక్కని మార్పులుచేసి ప్రత్యక్షర చమత్కారముతో పరిపక్వమయిన తన నైపుణ్యమంతా చూపుతూ 'చాల నలంకృతి'తోడి స్వతంత్ర కావ్యంగాచేసి విజయవిలాసాన్ని రాజుకి అంకితముచేసి జన్మ తరించిందన్నాడు.

## ముగ్గురు నాయికలు :

ఈ కావ్యములో ఉన్న ముగ్గురు నాయికలు మూడు రకాలవారు ; ఉలూచి గాఢమైన ప్రేమతో ఎంతో యోచనతో అర్జునుడి నితననగరికి తెచ్చింది. అతడడిగిన ప్రశ్నలకు తగిన సమాధానము చెప్పుతూ వాదించింది. భూప్రదక్షిణ పండ్రెండు నెలల బ్రహ్మచర్య వ్రతము సంగతి చెప్పునప్పుడు

ప్రాణదానంబు కన్నను వ్రతము గలదె ?
ఎరుగవే ధర్మపరుడవు నృపకుమార

అని ధర్మనిర్వచనం చేస్తుంది. అసలు భారతములో గూడా ఈ వ్రత భంగానికి సమాధానము "ప్రాణదానము" అన్న అభిప్రాయమే. ఆ సమాధానములో అర్జునుడు

చక్కెరబొమ్మ నా ప్రతిమ చందము తెల్పితి సంతకాని సీ
చక్కదనంబు గన్న నిముసం బయినన్ నిలు పోప శక్యమే

అనేటప్పటికి ఎక్కడనుంచో 'నునుసిగ్గు దొంతరల్' వచ్చి ఆమెను మాటలాడకుండా చేశాయి. అంతకు ముందుండిన వాదోపవాద పటుత్వమూ. 'పీస్ మనస్ షో' (పీమనబోయెదవ్) అని 'చిలువ చెలువంపు' పలుకులతో విసరిన బెదిరింపూ అన్నీ పోయాయి, కొత్త పెళ్ళికూతురే అయింది.

ఒక్క చిన్న రహస్యము :

నన్నయ భారతంలో ఉలూచి 'ఏ నులూచియను నాగకన్యక నైరావత కులసంభవుండయిన కౌరవ్యుని కూతుర... ....' అని చెప్పింది. కాని, సంస్కృత భారతములో భీష్మ పర్వమున

ఐరావతేన సా దత్తా హ్యనపత్యా మహాత్మనా
పత్యౌ హతే సుపర్ణేన కృపణా దీన చేతసా
భార్యార్థం తాంచ జగ్రాహ పార్థః కామవశానుగాం

అని ఉలూచి విధంతువనీ, ఆమెను నాగరాజే అర్జునుడికి వివాహము చేసినట్టు ఉందని కందుకూరి వీరేశలింగముగారు ప్రకటించారు (చూ. వారి ఉపన్యాసములు 7 వ సంపుటము 486 పేజీ). అయినా నన్నయ 'నాగకన్యక' అనే అన్నాడు.

ఈ విషయాన్ని నా కందజేసిన శ్రీ వెంకటకృష్ణారెడ్డిగారికి నా కృతజ్ఞత.

రెండో పెళ్ళి కూతురు చిత్రాంగద. ఈమెనోట ఒక్క మాట అయినా కావ్యములో రాలేదు. మూడో పెళ్ళి — ముఖ్యమైన పెళ్ళి సుభద్రది. ఇక్కడ అర్జునుడు తాను వలచాడు. బలరాముడు ఈ పెళ్ళికి ప్రతికూలుడు కాబట్టి చిన్న మాయోపాయం అవసరమైంది. త్రిదండిగా నగరులోని ఉద్యానవనంలో ప్రవేశించాడు. సుభద్రనే శుశ్రూషకు నియమించాడు బలరాముడు.

అటు జగదేకసుందరికినై యతివేషము పూని వచ్చినాఁ
డతఁ, తనచేయు భాగ్యమున...... (వి. వి. 2-146)

అర్జునుడు ఎప్పుడెప్పుడని ఎదురుచూడడం సహజము. ఆనాడు ఉలూచి పడిన అవస్థే ఇప్పుడు అర్జునుడు పడుతున్నాడు. ఆమె అర్జునుడిని కొలువులో చూచినప్పుడే పైబడ నుంకించింది. ఇప్పుడు అర్జునుడు 'బలిమిని పట్టగా దివురు........ ఆనాడర్జునుడు కొంకెతనముతో ఆమెను ప్రశ్నల పరంపరలతో విసిగించాడు. ఈనాడు సుభద్ర అర్జునుడి తత్తరం చూచి

పెద్ద లున్నా రెఱిఁగి వారె పెండ్లి సేయ
గలరు వేగిరపా టింత వలదటంచు
విన్నపము సేయరాదె యో చిన్నిచిలుక (వి. వి. 2-187)

అంటుంది. అతడు సహించలేడు. 'మీవా రెఱుగుట యెన్నఁడు, కావించుట యెన్నఁడింక కల్యాణంబుల్' అని తన్ను గాంధర్వమున పెండ్లి చేసుకోమంటాడు.

గద్యములు :

ఆశ్వాసవిభాగము లేకుండా, ఆద్యంత పద్యాలకు నోచుకోక - బోడిగా ఉన్న ఆ సారంగధరను తరువాతి లేఖకులూ పరిష్కర్తలూ చేయి చేసుకొని విజయవిలాస ఆశ్వాసాది అంత పద్యాలతోనే దానిని గూడా మూడాశ్వాసాల కావ్యరూపంగా తయారుచేశారు.

వి. వి. మొదటి ఆశ్వాసానికి అవతారిక ఆరంభములో ఉన్న "శ్రీ లెల్లప్పుడొసంగ.. " అన్న పద్యాన్ని ఉంచారు. తక్కిన ఆశ్వాసాలకు క్రమంగా "శ్రీ ధుర్యశౌర్య..." అనిన్నీ "శ్రీ జానకీ మనోహర..." అనిన్నీ ఆరంభపద్యాలు వ్రాశారు. అవతారిక పద్యాలు దొరకని పరిష్కర్తలు ఆ రెండు కంద పద్యాలతోనే మూడాశ్వాసాలూ సర్దుకున్నారు. ఆశ్వాసాంత పద్యాలు మొత్తము తొమ్మిది వ్రాశాడు. ఎవరి యిష్టం ప్రకారం వారు ఆశ్వాసాంతాలలో ఇరికించుకున్నారు.

ఇప్పుడు మనకు చిక్కిన ప్రతులు- ముద్రితాలూ అముద్రితాలూ చూస్తే ఆశ్వాసాంతగద్య అన్నిటిలోనూ ఒక్కలాగాలేదు.

తిరుపతి వేంకట కవులు పరిష్కరించి 1901 ప్రచురించిన ప్రతిలో

ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ ప్రసిద్ధ
సారస్వత సుధాసార జనిత యశోలతాంకూర
చేమకూర లక్ష్మణామాత్య కుమార వినయ
ధురీణ సదారాధిత బుధసమాజ వేంకటరాజ ప్రణీతంబైన . ." అనిన్నీ

1910 లో వేదమువారు ప్రకటించిన సారంగధరలో "ఇది శ్రీ సూర్య... లబ్ధ ప్రసిద్ధ వాగ్వైభవ చేమకూర లక్ష్మణామాత్య తనూభవ సదారాధిత బుధ సమాజ వేంకటరాజ ప్రణీతంబయిన..." అనిన్నీ.

1856 లో సి. పి. బ్రౌన్ దొరగారి పండితుడు శ్రీమాన్ మా. వేంకటకృష్ణమాచార్యగారు పరిష్కరించిన వి. వి. లో "ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ ప్రసిద్ధ వాగ్వైభవ సారస్వత సుధాసార జనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య తనయ వినయధురీణ సకల కలాప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాల దత్త హస్త ముక్తా కటక విరాజమాన వేంకటకవిరాజ ప్రణీతంబైన..." అనిన్నీ రకరకాలుగా ఉన్నాయి.

ఈ గద్యలనుబట్టి మనము కవినిగురించి కొన్ని విశేషాలు తెలుసుకోవచ్చును.

1. కవి నిగర్వి, ఆర్భాటాలపడలేదు. తన సాహిత్య కృషివల్ల తనకు కలిగిన కీర్తిని 'యశోలతాంకూర' అని మొలకగానే చూచాడు.

2. ఆరంభదశలో తాను సదారాధిత బుధసమాజుడు - విద్వత్కవుల వాదోపవాదాలవల్ల విజ్ఞాన వికాసం పొందాడని తెలియజేశాడు.

3. మరికొన్నాళ్ళకు ఈతని పదప్రయోగ చమత్కారాది విశేషాలను పండితులు గుర్తించడమూ, రఘునాథునివంటి పండిత ప్రభువు తన 'వాఙ్మయమరూఢి' మెచ్చుకోవడమూ జరిగాయి. అప్పుడు 'ప్రసిద్ధవాగ్వైభవ' అని గద్యలో- మిత్రుల ప్రోద్బలమువల్లనైనా- చేర్చి ఉండవచ్చును.

4. మరికొన్నాళ్ళకు రఘునాథరాజు ఇతని మెచ్చుకొని ముత్యాలుతాపిన ముంజేతికంకణమును బహూకరించాడు ఆ మాట గద్యలో ఎక్కిస్తే నలుగురూ "ఇతనికి తల తిరిగిపోయిందని అనుకుంటారేమో" అని వినయధురీణ అంటూ. తన వినయస్వభావము స్థిరంగానే ఉన్నదని మనవి చేశాడు.

5. కవిపేరు వేంకటరాజు అని తేటపడ్డది. దీనిలోని రాజు అన్నది బిరుదు పేరు. నాయకులు-నాయుళ్ళు-రాజులుగా ఉన్నప్పుడు నాయుడులందరు ఆ బిరుదు పేరునే ఉంచుకొనేవారు. తక్కువజాతివారు ఆ పదాన్ని ఉపయోగించరు. నియోగిమంత్రులున్న స్థలములలో రాజు పదానికి మంత్రి, అమాత్య-అన్న అర్థం వచ్చిందికదా. అల్లసాని పెద్దనామాత్యుడిని రాయ వాచకములో 'పెద్దిరాజు' అని పేర్కొన్నారు.

వనజాక్షపదముల వరలు వాహినికి
అనుజయై జన్మించు నాలవజాతి జగతి
.......................
రాజులు మన్నీలు రౌతులు దొరలు,
తేజీలపై నెక్కి ధీరులై కొలువ
చేరువ నౌక గంధ సింధురం బెక్కి
ఆ రామదేవ రాయలు చనుదేర
తరతరమ్ములకును తగువైన కతన
నెరనమ్మదగిన కోనేటి కొండ్రాజు,
కట్ట రంగపరాజు కస్తూరిరాజు,
మిట్టపాలెంపు సంపెట నాగరాజు,
రామరా జల యౌకు రఘునాధరాజు,
మామ యోబళరాజు మనుబోలు రాజు
శ్రీరంగపతిరాజు శ్రీగిరిరాజు,
వీర రాఘవరాజు, విఠ్ఠలరాజు
నందేల చిట్రాజు నారపరాజు
కందనవోల్ రాజు గడి తిమ్మరాజు,
కాళువరాజులు కడపరాజులును
పాశెల రాజులు పంటరాజులును........

ఇప్పటికీ ఒరిస్సాలోని రాజులు తమపేరు చివరను 'దేవ్' అన్న బిరుదుపదం వాడతారు. వాళ్ళ రాజ్యాలలో ఆ తెగకుచెందని వారెవ్వరూ ఆ 'దేవ్' పదాన్ని అలాగ ఉపయోగించరు. ఉపయోగిస్తే వారు రాజదండనకు పాత్రులవుతారు.

దీన్నిబట్టి చూచినా వెంకటరాజునాయుడు బిడ్డ అని తేటపడుతుంది. ఇప్పటికీ చేమకూర నాయుడు కుటుంబాలు మనదేశంలో ఉన్నాయి.

కృతికర్త రఘునాధరాజు కవినిగురించి

> "క్షత్ర ధర్మమెమ్మె కద నీకు కలది మొదలు,
> తమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ముగొలిచి,
> తిపుడు కృతియును జెప్పి మాకింపొనర్చి,
> లోకటఁ గా దన్నిటను బ్రయోజకుఁడ వీవు" (వి. వి. 1-35)

అన్నాడు. దీనివల్ల అప్పటికే ఈ కవి కొడుకులుగూడ సంస్థానసేవలో ఉండదగిన వయసును కలిగిఉన్నారని ఊహించవచ్చు. కాబట్టి అప్పటికి చేమకూర కవి దాదాపు యాభై సంవత్సరాల వయసువాడై ఉండాలి; అంటే 1570 ప్రాంతాల్లో జన్మించి ఉండాలి. పుట్టుక క్షత్రధర్మంగల బ్రాహ్మణేతర కుటుంబంలో; ఆ కుటుంబం తంజావూరులో ప్రఖ్యాతిగాంచిన సంపన్న కుటుంబమై ఉండాలి; లేకుంటే, ఈ కవి సూర్య వరప్రసాదిగా పుట్టడం "ఇజ్జగము" (తంజావూరునగరమే అనుకోండి) తెలియగల అవకాశం ఉండదు. తాను సంపన్న కుటుంబమువాడు కావడంవల్లనే కవి "నిక్కెడు నీల్గెడు విర్రవీగెడుకా క్షితి నిటుగాదె యొక్కొకనికికా నడుమంత్రపు కల్మిగల్గినకా" అని నడుమంత్రపు సిరిగలవాళ్ళను అధిక్షేపించగలిగాడు.

చేమకూరకవి వృత్తి, క్షత్రధర్మం, రఘునాధుని చతురంగబలాలలో ఉద్యోగిగా ఉన్నాడు. రఘునాధ రాజు రాజ్య సారధ్యం వహించిన నాటికి ముప్పై సంవత్సరాల వయసున్న చేమకూర కవి రాజుకు ఎంతో ప్రయోజకుడుగా పక్కను నిలిచాడు. సైనిక ఉద్యోగిగా ఉండడంవల్ల ఈయన వ్యాయామంలో బాగా కృషి చేశాడు; మంచి శరీర దార్ఢ్యం కలిగిఉండి ఉత్సాహంతో వివిధరకాలయిన ఆటల్లో, వేటలలో పాల్గొంటుండే వాడు. 1620 వరకు రఘునాధుడు సాగించిన యుద్ధాలన్నిట్లోను చేమకూరకవి పాల్గొన్నాడని చెప్పడం చారిత్రక సత్యానికి దూరము కాదు. తాను ఏ వృత్తిలో ఉన్నా మన కవి అభిలాష, అభిరుచి— రఘునాధ రాజువలెనె— ఆంధ్రసారస్వత అన్వేషణం మీదనే లగ్నమై ఉండేది. అవకాశం దొరికినప్పుడల్లా పండిత గోష్ఠులకు వెళుతూ వారి వాదోపవాదాలను, విమర్శన విశేషాలను, ప్రశంసా పాత్రాలయిన గుణగణాలను వింటూ ఉండేవాడని, వాటిని అవలోడన పదేపదే చేస్తుండేవాడనీ ఈయన సారంగధర చరిత్ర ఆశ్వాసాంత గద్యలో ఉన్న 'సదారాధిత బుధ సమాజ' అన్న వాక్యాన్నిబట్టి తెలుస్తుంది. విజయవిలాసాన్ని కృతిగా యిచ్చే సమయానికి— విజయవిలాసం ఆశ్వాసాంత గద్య ఆధారంగా— ఈ బుధవిధేయత 'సారస్వత సుధాసారజనిత యశోలతాంకూర..'గా పరిణమించింది; ఈ విద్వద్గోష్ఠులే చేమకూర కవి ప్రతిభా విలసనానికి గురుసమానాలై ఈ పరిణామాన్ని కల్గించాయి.

కవి గ్రహించినది :

ఈ గోష్ఠులవల్ల తాను గ్రహించిన దానిని చేమకూర కవి ఈ క్రింది పద్యంలో ప్రతిధ్వనించాడని చెప్పవచ్చు :

> "ఎందును విద్యలే యెఱుఁగ రెవ్వ : రెఱింగినఁ గొంతమాత్రమే :
> యందును సాహితీరస మహత్త్వ మెఱుంగ; రెఱింగిరేని, యా
> యుంద మెఱుంగలే : రెఱిఁగినప్పటికిన్, పని మెచ్చియీయ : రె
> న్నందగు నచ్యుతేంద్ర రఘునాథ విభుండె ప్రవీణుఁ డన్నిటన్" (వి. వి. 1-55)

కావ్యాలను సాధారణంగా గ్రహించడం, సాహితీ రసమహత్త్వాన్ని గుర్తించడం, ఈ రెండింటికిని మించి, ఇదమిద్ధమని నిరూపించరాని అందాన్ని చూడగలగడం అనే మూడు అంతస్తులు కవికి గోచరిం

నాయి. అందువల్లే తన పద్యాల్లో, ఈ మూడు అంతస్తులకు అనుగుణంగా ఉండేటట్లుగా ప్రాయడం అభ్యసించాడు. కాబట్టే ఈయన కావ్యాలు సాధారణ పాఠకులను, సాహిత్య విషయ పరిజ్ఞానం కలవారిని, పరిణత బుద్ధులైన రసజ్ఞులను అందరినీ ఒక్కరీతిగా ఆనందింపజేస్తున్నవి. అటువంటి గుణవిశేషాలు ఉండడం చేతనే ఈయన కావ్యాలు "అందియు నందక", "పరిపూర్ణానుభవమునకు రాక" ఉండడం. వానికి తగినట్టుగానే ప్రతిపదంలోను జాతి, వార్త, చమత్కారం, అర్థగౌరవం పాటిస్తూ, ప్రతి విషయంలోను రసపుష్టిని ఆకాంక్షించుకుంటూ కావ్యం కఠిన విమర్శనకు నిలునట్టుగా (క్షోదక్షమ) ప్రయత్నించాడు. ఇన్ని భావాలు కలవాడు కావడంవల్లనే ఎన్నో సుగుణాలతో కూడి ఉండి, అనేక రసాల ప్రసక్తి కలిగి, చమత్కారద్యోతకంగా ఉన్న సారంగధర చరిత్ర సైతం కవికి చాలినంత సంతృప్తిని ఇవ్వలేకపోయింది.

క్షత్రధర్మం కలవాడు కాబట్టే వ్యాయామాది క్రీడల్లో ఆరితేరినవాడని ఇంతకుముందు అనుకున్నాం. పురుషులను వర్ణిస్తున్నప్పుడు "సాముకండెపు పిసాళియురంబును" "ఊరులు మల్చివేసినటు లున్నవి" మొదలయిన విశేషణాల ద్వారా నిక్కమైన 'మగ' పురుషులను చేమకూర తన పాఠకులకు ప్రత్యక్షం కావిస్తుంటాడు. సాధనతో గట్టిపడిన శరీరములుగల భటులు మన కవికి 'ఎక్కటి చుక్క తునక్కలు'.

ఆటల్లో మన చేమకూర కవికి ఉన్న ఉత్సాహం అపారం—

వేడుక నప్పురీ హరుల వేగము గన్గొని, లేచ్ఛ గాడ్పుతోఁ
"గూడి చనన్వలె న్మనము, కూడఁగ నోపక యోడినట్టివా
రోడని వారి మోచు" టని యొద్దికఁ బందెము వైచి, కూడలే
కోడెను గాక, మోయఁగఁ బ్రయోజనమే మనిలుం గురంగముల్ ? (వి.వి. 1-78)

కుర్రవాళ్లు పందాలువేసి ఓడిపోయినవాళ్ళు గెలిచినవాళ్ళను మోయడం ఇప్పటికీ ఉంది. ఇట్టి క్రీడోత్సాహం గుజ్జనగూళ్ళ సందడిలోను (వి.వి.), సారంగధర చరిత్రలోని పావురాల పందాలలోను ప్రస్ఫుటంగా కనువిస్తుంది. పావురా పందాల ప్రేక్షకులను—

"కంటికిఁ జేయోరగా నిల్చి కన్గొని
'యన్నన్న ! యెంత ద' వ్వనెడువారు
వలిపచేల ముసుంగు వైచి వేమఱు సూచి
'హా ! కంటిఁ గంటినే' వనెడువారు
మెడలపై హస్తంబు లిడి తప్ప కీక్షించి
'యౌర ! మిక్కిలిపోద' వనెడివారు
పళ్లెంపు నీటిలోపలి నీడ పరికించి
'కనిపించ దేచాయ' ననెడువారు

గొబ్బు గొబ్బునఁ దలలెత్తి కొంద ఱందుఁ
జూడఁ జూడఁగఁ బాగలు వీడిపడిన
నవ్వినోదము గని నవ్వినట్టివారు
నైరి తత్పక్షి విహరించు నవసరమున."

అని వర్ణించిన కవికి ప్రత్యక్షమైన అనుభవం ఉందని ప్రత్యేకంగా చెప్పనక్కర [illegible]
చరిత్రలోని ఈ పద్యము—

అంతిపురమేఁగి మజ్జనం బాడి, వేటఁ
బోవుతమి డేగ పదనుగ భోజనంబు
సేసి, యాఖేట విహరణోచితముగాఁగఁ
దత్తఱంబునఁ గైసేసి బిత్తరముగ

లో కవికిగల వేట అనుభవం ద్యోతకమవుతున్నది. ఈ పద్యంలోని 'డేగపదను' అన్నది డేగవేటకు సంబంధించిన పదం. వేటలో పిట్టలు మొదలయిన వాటిని పట్టుకోవడానికి డేగలను పెంచి వెంట తీసుకొని పోతారు. మేత ఎక్కువ వెయ్యకుండాను, పూర్తిగా తక్కువ వెయ్యకుండాను ఆ డేగలను అర్థాకలితో ఉంచుతారు. కడుపునిండా ఆహారం పెడితే మత్తెక్కి వేటచేయవని, బాగా ఆకలితో ఉంచితే ఆకలితో తమ ఇష్టం వచ్చిన వాటిని పట్టుకోవడానికి వెలరేగుతాయని డేగలను ఈ విధంగా అర్థాకలితోనే ఉంచుతారు. అప్పుడే అవి వేట బాగా చేయగలుగుతాయి. దీనినే 'డేగ పదను' అంటారు.† వేటకు వెళ్ళే మనుషులు గూడ డేగ పదనుగ భుజించాలి. అందువల్లనే రాజు లఘు భోజనం చేశాడు.

**అనుకరణలు :**

తనదగ్గర సిద్ధంగాఉన్న సారంగధరను కవి వెనుకకు పెట్టడానికి కారణము అది గౌరనకు అనుకరణ–అనుసరణ – అయిన కావ్యమనీ, అనాటి వాతావరణంలో ఆ పండిత ప్రభువుకి ఇవ్వదగినదికాదనీ, స్వతంత్ర జాతి రత్నంగా ఉన్న విజయవిలాసము రచించాడనీ మనమనుకున్నాము. కాని అక్కడక్కడ పూర్వపు ప్రబంధ కవుల ననుకరించినట్టు కనబడే పద్యాలు వి. వి. లో కనబడతాయి.

ఆంధ్రకవితా పితామహ అల్లసాని పెద్దనామాత్యుడు మనుచరిత్రలో చాతుర్వర్ణ్య వర్ణన ఈలాగు చేశాడు :

అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి ముదిమదితప్పిన మొదటి వేల్పు
అచటిరాజులు బంటుగంపి భార్గవునైన బింకాన పిలిపింతు రంకమునకు
అచటి మేటికిరాటు లలకాధిపతినైన మును సంచిమొద లిచ్చి మనుప దక్షులు
అచటినాలవజాతి హాలముఖాత్త విభూతి ఆదిభిక్షువు భైక్షమైన మాన్పు...

(మనుచరిత్ర 1–50)

ఈ పద్యంలో ఆ అరుణాస్పద పురబ్రాహ్మణులు ముసలితనములో మతిభ్రమణ కలిగిన బ్రహ్మను మెచ్చరు– బ్రహ్మకంటే విద్యల్లో అధికులు అని అన్నాడు. బ్రహ్మకు ఆలాగు మతిచెడిన దనడానికి ఆధార మేమి ఉందో తెలియదు. మతిభ్రమణ కలిగినముసలిని మెచ్చకపోవడములో ఆధిక్యమేముందో చూడాలి. ఆలాగే రాజులు బంటునుపంపి పరశురాముడిని పిలిపిస్తారు. అంతమాత్రంచేత రాజుల ఆధిక్యము ఏర్పడు తుందా? ఇలా పిలిపించడం సాహసానికి పరాక్రమానికి సూచన అవుతుందా? మొరకుతనాన్ని తెంపరి తనాన్ని తెలియజేస్తుందా? నవనిధులు కలవాడు కుబేరుడు; అతనికి సొమ్ముకేదనా ఈ వైశ్యులు నంచి

†ఒకనాడు నేను శ్రీకాకుళం జిల్లా (అప్పుడు విశాఖపట్నం జిల్లా) లోని పార్వతీపురం వెళ్ళినప్పుడు ఒక ఒరియా భూస్వామిని చూడడం తటస్థించింది. అతడొక డేగను, వేటకోసం, పెంచుతుండేవాడు. పై విషయాలు చెప్పడమేకాక పిట్ట వేటలోని కొన్ని విశేషాలు సర్దాగా చెప్పాడు.

ఆ ఊరిలోనే 'పికిలిపిట్టల పోటీల' గురించి గూడా కొంత తెలుసుకున్నాను. ఆ విషయం ఈ వ్యాఖ్యానములో 1–23 లో మనవి చేశాను.

మొదలు (కాపిటల్ - మదుపు) ఇవ్వడము? నాల్గోచరణంలో ఈ ఆధిక్యసూచన ఏదీ లేదు. ఇప్పుడం ఆలోచిస్తున్నకొద్దీ అవకతవకలు కనిపిస్తాయి. ఆ ముది మరితప్పవము బ్రహ్మకేనా; ఆంధ్రకవితా పితామహుడుగారికి గూడానా అని అనవలసివస్తుంది.

ఈ పద్యం మనసులో పెట్టుకొనే చేమకూర కవి తన చాతుర్వర్ణ్య వర్ణన చేశాడనక తప్పదు. చూడండి!

తడబాటుకలదు వేదముల నాతని కంచు
పరమేష్ఠి మెచ్చరు ధరణి సురులు,
కడమాటు పగవాని గని చేమరించె నంచు
భార్గవు మెచ్చరు బాహుజనులు,
పనికిరా కొకమూల పడియె నాతని వస్తు
వని కుబేరుని మెచ్చ రర్యజనులు...... (వి. వి. 1-69)

దీనిలోనూ ఆ ముగ్గురిపై నాధిక్యమే సూచించాడు కవి. బ్రహ్మలో లోపము చెప్పాడు– దానికి మత్స్యావతార కథ ఆధారము. ఆ బ్రహ్మపరమేష్ఠి పిచ్చవాడు కాదు. పరశురాముడు కడమాటు తన హస్త కౌశలాన్ని మరచిపోయాడు– శివధనుస్సు కథ ఆధారము. కుబేరుడు నవనిధులను అభివృద్ధిపరచకుండా ఆ మూల (ఉత్తర దిక్కున) ఉంచాడు. పౌరాణిక ఆధారము. పద్యము ప్రక్రమముతో మనోహరంగా ఉంది.

ఆ యా లోపాలకు బదులు ఈ వర్ణాలవారికున్న 'పాడిదప్పక...' మొదలైన గుణాలు చూపుతూ ఆ గుణాధిక్య మందరు ప్రజలకు పంచిపెట్టాడు. ఇంకా అందము గుప్పించడానికి 'చదువుసాముల ధనధాన్య సంపదలను' అవి క్రమంగా ఆ నాలుగు జాతులకే కాక పౌరులందరికీ ఆధిక్యం చూపించాడు. అనుకరించా డంటామా, ఆంధ్రకవులకు– తాతగారికిగూడా– ఆధిక్యముచూపడానికి ఆదర్శప్రాయమంటామా?

ఈలాగే తాతగారి

మునుమున్ పుట్టెడు కొంకు తొల్యము నిడన్
మోదంబు విస్తీర్ణతన్
బొనుపన్ కోర్కులు క్రేళ్లద్రిప్ప, మదిమె
చ్చుల్ రెప్ప లల్లార్ప...... (మను 2-30)

చేమకూరకవి

గుట్టసియాడ, గబ్బిచను గుట్టలపై పుల కొంకు రావళుల్
తెట్టువగట్ట...... (వి.వి. 1-126)

అని ఉలూచి తొలిచూపును వర్ణించి ఎంతో మహోదారమయిన మనః పరిణామాన్ని కనబరచి, ఆదీ తాలిక కొండంత మరొక అందాన్ని ప్రకటించాడు. 17వ శతాబ్దిలో మనకవి చేసిన ఈ వర్ణనపద్ధతిని [illegible] (20వ శతాబ్దిలో) ప్రపంచ మహా మేధావులలో అగ్రశ్రేణికిచెందిన ఎస్. ఇ. [illegible] కనబరిచాడంటే, ఆంధ్రుల కెంత గర్వకారణమో చూడండి.

అల్లసాని పెద్దన్న ప్రవరుడి వర్ణనలో

> కమ్మని కుందనంబు కసుగందని మే, నెలతేటిదాటులన్
> బమ్మెరపోవదోలు తెగబారెడు వెండ్రుకలు.......
> అమ్మకచెల్ల వాని వికచాంబకముల్ శతపత్ర జైత్రముల్ (మనుచరిత్ర)

అని వ్రాశారు. దీనిలాగానే 'కమ్మని కుందనంబు...' తోనే పద్యమారంభించి, నాలుగోచరణము 'అమ్మక చెల్ల!' తో మొదలుపెట్టి మన కవి

> కమ్మని కుందనం బొరయగల్గిన చెక్కుల టెక్కువాడు......
> అమ్మకచెల్ల! నాహృదయ మమ్మకి చెల్లదు వీని కియ్యెడన్ (వి. వి. 1-35)

అన్న పద్యములో అర్జునుడిని వర్ణించాడు. కవి కన్ను తాతగారి పద్యముమీద ఉందని వేరుగా చెప్పనక్కర లేదు. దీనిలోని భావగాంభీర్యము ఎంత ఉందో తెలుసుకోవడము మహానందదాయకము. అది "ఛాయాచోరక రససందర్భము"ను ఆసచేయడము కాదనీ, ఆయా వర్ణనలకు మెరుగుపెట్టి మనోహరతరముగా చేయడానికి ఎంత అవకాశముందో చూపించడమే అనీ స్పష్టము కాదా.

## స్వభావ పరిశీలన :

రాజాస్థానాల్లో ఎక్కువగా మెలగుతుండిన చేమకూరకవికి పలువురు ప్రభువులతో పరిచయం కలిగి, వారి వారి గుణాగుణాలను, వైరాలను, వైషమ్యాలను, స్పర్ధలను చాలా సమీపంలో ఉండి సాకల్యంగా పరిశీలించే అవకాశం దొరికింది. ధర్మరాజును వర్ణించే నెపంతో, సంస్థానాలలో సాధారణంగా కనుపించే అవగుణాలను మెత్తమెత్తగా

> "అవలఁ బోయిన వెన్కనాడు టెన్నఁడు లేదు
> మొగము ముందఱ నంట మొదలె లేదు, . .
> చన విచ్చి చౌక చేసినది యెన్నఁడు లేదు,
> పదవి హెచ్చించుట మొదలె లేదు,...." (వి. వి. 1-86)

అనే పద్యంలో సూచించాడు.

రాజు అనుచరులు ఒకరిని మించి మరొకరు రాజసన్మానం పొందడానికి ఏ విధంగా ప్రయత్నం చేస్తుంటారో ఈ క్రింది పద్యంలో సువ్యక్తం చేస్తున్నాడు—

> "వెడవిలుకానికిన్ జెఱకువిల్లును గల్వ లకోరి కోరికల్
> గడలు కొనంగ నామనియుఁ గల్వలరాయఁడు నిచ్చి మన్ననం
> బడయుడు, వాని టెక్కుడుగ మౌర్వులు తామును గాన్క తెచ్చెనా,
> బడి బడి గంధలుబ్ధ మధుపమ్ములు రాఁ జనుదెంచెఁ దెమ్మెరల్" (వి.వి. 1-210)

'ఎక్కుడుగ'లో ఎంత చక్కని అర్థ ముంచాడు !

అలాగే ఆస్థానంలోని కవీశ్వరులలో ఉన్న ఈర్ష్యాది గుణాలను గూడ పరిశీలించాడు ; "ఏ గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా..." అని ప్రకటిస్తూ తన సౌమ్యతను చూపించాడు. ఈ కవి

నోట కటూక్తులు సాధారణంగా వెలువడవు; అందువల్లనే ఇతర అనేక కవులవలె ఇతను పరనిందలకు పూనుకోలేదు. అయితే కుకవిని గురించి తనకు కలిగిన అభిప్రాయాన్ని చెప్పకుండ విడిచిపెట్టనూ లేదు—

స్వకపోల కల్పిత మనో
జ్ఞ కళాగతి కెట్టు లౌను సరి ఛాయా చో
రక రస సందర్భం బని...... (వి. వి. 1-90)

అన్న పద్యంవల్ల తెలుస్తున్నది. దీనికీ, అల్లసాని పెద్దన చెప్పిన

ఖరమైతోఁచు కుటుంబ రక్షణకుఁగాఁ బ్రాల్మాలి చింతన్ నిరం
తర తాళీదళ సంపుట ప్రకర కాంతారంబునం దర్థపుం
దెరువాటుల్ దెగకొట్టి తజ్జ్ఞ పరిష ద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱఁతం బడుం గుకవి పృథ్వీభృ త్సమీప క్షితిన్ (మను. 1-9)

అనే పద్యానికీ ఉన్న వ్యత్యాసం ప్రత్యక్షంగా కనుపింపుతున్నది. ఇంతకు, పెద్దనామాత్యుడు గూడ మారన, పిన వీరభద్రుడు, శ్రీనాథుడు మొదలయిన వారినుంచి 'తెరువాటులు' కొట్టినవాడే.

కృతిభర్తల ఆచారము :

ఇంత సౌమ్యుడు, నిగర్వి కాబట్టే మనకవి ఇతర కవులు అనేకులవలె ఆడంబరాలకు పోయేవాడు కాదు. ఎక్కడో చాల అరుదుగా గాని రాజులు కవులను పిలిచి వారి గ్రంథాలను తమకు అంకితంచేయమని కోరడం జరుగదు. అయినా వారికి తమ గ్రంథాలను అంకితం కావించడానికి సకల సన్నాహాలు చేసి ఉభయ పక్షాలకు గౌరవప్రదంగా ఉండే రీతిగ "ప్రభువు నిండోలగంబున కవి పండితగాయక పరివృతుండై యుండి నన్ను రావించి అనేకాంబరాభరణమ్ముల బహూకరించి నా రచించు... మహాప్రబంధమును తమకు కృతి యీయవలయునని కోరుటయు..." అని తమ రచనలను సాగిస్తుండడం మనకు తెలియనిది కాదు. యథార్థ వాది అయిన మనకవి కల్లాకపటం లేనివిధంగా, తనకు రఘునాథ రాజుమీద ఉన్న గౌరవాతిశయానికి తగి నట్లు తన కావ్యాన్ని తనకు తానై అంకిత మివ్వడానికి సిద్ధమయ్యాడు.

ఇంతేగాక రఘునాథరాజుకుగల పాండిత్యాన్ని, కవితానైపుణిని తెలిసినవారు (నాడూ నేడూ కావిని గూడా) ఆ రాజుపట్ల భక్తి విశ్వాసాలను చూపక తప్పదు. గోవింద దీక్షితుని కుమారుడు, 'సాహిత్య రత్నాకర' గ్రంథకర్త అయిన యజ్ఞనారాయణ దీక్షితులుగాని, బహు భాషాశాస్త్ర పారంగతురాండ్రై ప్రశస్త మయిన గ్రంథాలను వ్రాసి విద్వత్ప్రశంసలను నాటికిని, నేటికిని చూరగొంటున్న మధురవాణి, రామ భద్రాంబలుగాని, రఘునాథుని యెడ భక్తి గౌరవ విశ్వాసాలను ప్రదర్శించడంలో చేమకూర కవికి తీసిపోలేదు. అన్నివిధాల సలక్షణమై ఉత్తమ కావ్యగుణాలతో విరాజిల్లు గ్రంథాలను ఎన్నో వ్రాసిన రఘునాథరాజుకు కృతిని యివ్వడానికి యోగ్యమైన కావ్యరచనకోసం చేమకూరకవి బహుధా తపస్సు చేశాడని చెప్పడం సమంజసంగా ఉంటుంది. ఈ మహాప్రయత్నంకోసమే ఆయన మొదట పారంగతుల చరిత్రను రచించి తన గంటం పదునుచూచుకున్నాడు. ఆ అనుభవం, ఆ నేర్పుతోనే 'విజయవిలాసము' అనే కావ్యాన్ని సర్వాంగ [illegible] శోభితంగా రచించి, దాని యోగ్యతను గుర్తించుకుని, ధైర్యంతో రఘునాథ [illegible] సమ్ముఖానికి వెళ్ళి అంజలి ఘటించాడు—

ఏలిక మాత్రమే మహిమ నీశ్వరుఁడే తలపోసిచూడ, నా
పాలిటి రామభద్రుఁడని బంగరుఁ పూవులఁ బూజచేసి నేఁ
జాల నలంకృతిం బొసఁగు సత్కృతి కానుకచేసి కీర్తి భూ
శ్రీ లలితాంగులన్ వలవఁ జేసిన శ్రీ రఘునాథ శౌరికిన్ (వి. వి. 1-38)

హృదయం లోతులనుంచి వచ్చిన ఈ పద్యంలో పొంగిపొర్లిన భావావేగాన్ని కవి దాచడానికి ప్రయత్నించ లేదు. కృతి ఇచ్చిన తరువాత —

....సకల గణించి మన్ననలొనర్చఁ బ్రబంధము, నింత యుత్తమ
ప్రభునకు నంకితం బొనరుపం గలిగెంగద యంచు వేడుకన్ (వి. వి 1-53)

జన్మ సార్థకమైనట్టు భావించాడు. రఘునాథరాజు తన కావ్యగుణాలను ప్రశంసించినప్పుడూ, మెచ్చి ముంజేతికి ముత్యాల కంకణాన్ని బహూకరించినప్పుడూ ఇది అంతా తన ప్రయోజకత్వమే అని భావించక,

కలిగెంగా తన సమ్ముఖంబనియు, సత్కారంబు తాఁ జేయ నా
తల నెందే శిరసా వహింతు రనియుం, ... గాక శక్యంబె వి
ద్యల మెప్పింపఁగ నచ్యుతేంద్ర రఘునాథస్వామి నెవ్వారికిన్

అది అంతా రఘునాథుని ఔదార్యాతిశయమనే భావించాడు.

## దురభిప్రాయము :

పై సందర్భములోనున్న రచనను బట్టి కవి తన్నుగురించి నీచముగా చెప్పుకున్నాడనీ, కృతిపతి రఘునాథ రాజు గూడా మన కవిని అ దృష్టితోనే చూచాడనీ కొందర భిప్రాయపడ్డారు. ఎవరోకాదు; తిరుపతి వెంకట కవుల సాయముతో విజయవిలాస కావ్యమును పరిష్కరించి 1901 లో ప్రచురించినవాడున్నూ, ఆనాటి సరస్వతీ పత్రికా సంపాదకులున్నూ, పోలవరం జమీందారుగారున్నూ అయి ఉండిన శ్రీ కొచ్చర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు బహద్దరు బి ఏ. గారు.

వారు కీర్తిశేషులయిపోయారు. కాని, అటువంటి అభిప్రాయాలు కలవారు ఈనాడు గూడా కొందరు లేకపోలేదు. చేమకూరకవి ఈ గ్రంథములో కనబరిచిన భక్తి ప్రపత్తులు ఏ శతాబ్దములోనైనా చాలా అరుదు. లక్షలోనో పదిలక్షలలోనో ఒకడు అలాంటి భక్తిని ప్రదర్శిస్తుంటాడు. నటన, ఇచ్చకము, కపటము, ప్రధానలక్షణాలుగాగలిగిన ఆ రోజులలో జమీందారుల ఏలుబడిలో అటువంటిభక్తి కనబడడం చాల కష్టము. కాబట్టి కల్లాకపటమూ లేకుండా, స్ఫటిక నిర్మలమయిన హృదయముతో కవి అనిన మాటలు వారు అవగాహన చేసుకోలేకపోయారు. కవిచేసిన పది దైవప్రార్థనలలోనూ రాజుమేలే కోరాడుగాని, తనమేలు కాదు.

ఆ రాజు మహోదారపురుషుడు, మహానుభావుడు, పరాక్రమములో ఎంత గొప్పవాడో పాండిత్యము లోనూ అంత గొప్పవాడు. శిష్టరక్షణలో ఎంత ఉత్సాహం చూపుతాడో, దుష్టశిక్షణలో అంత వినోదిస్తాడు.

"మాటలనేర్పులా, సరసమార్గములా, కొలువుండురీతులా;
పాటలగంధులా, కళల భాగ్యములా, బహుదానలీలలా,
నాటక శాలలా యొకటనన్ వల దెన్నిటఁ జూడ నన్నిటన్
మేటియు కీర్తిలోలుడుసుమీ రఘునాథనృపాలు డిమ్మహిన్ (వి. వి. 1-28)

ఇది ప్రత్యక్షరసత్యము. గొప్ప దైవభక్తి కలవాడు. తనకెంత చక్కని అవకాశమున్నా విజయనగర సింహాసనాన్ని ఆశించని మహాపురుషుడు అన్న సత్రాలలో ప్రతిదినము వేలకొలది జనులను సంతృప్తి పరిచే ఉదారాశయము కలవాడు. కనకాభిషేకాలలో కవులను కవయిత్రులను గౌరవించిన కవితాప్రియుడు. సాహిత్యములో ఎంత ప్రఖ్యాతి నార్జించినాడో సంగీతములోనూ అంత కీర్తిని గడించిన మేధావి... ఇవి కవి చెప్పినట్లు రాజుగారి అనంత శోభన గుణమ్ములలో కొన్ని మాత్రమే.

అటువంటి 'ఉత్తమ ప్రభునకు' కావ్యాలు అంకితమిచ్చినా, బిడ్డలకు పేరు పెట్టినా దోషమా ? 'నా విష్ణుః పృథ్వీపతిః' అన్నందుకు అతడిని దైవసమానంగా భావించడం నేరమా ?

కృతిభర్త అడగనిదే కావ్యము అంకితము ఇవ్వడము గూడ కవి నైచ్యాన్ని తెలుపుతుందట ! ముక్కు తిమ్మన్నను ఏ రాజు కోరాడు పారిజాతాపహరణం కృతి ఇవ్వమని ? 'మమ్ము కొలిచితివి' అని రాజు కవిని గూర్చి అనడంలో గూడా ఆ భావమే ఉందట. కొలువు (ఉద్యోగము) పనిచేసి పారితోషికం పుచ్చుకోవడంలో ఉన్న గొప్పతనము జమీందార్లు ఎరగరు.

కవి సార్వభౌముడు శ్రీనాథునిగురించి కాశీఖండములో వేమారెడ్డి చెప్పిన పద్యం చూడండి :

> నైషధాది మహాప్రబంధములు పెక్కు
> చెప్పినాడవు, మాకు నాశ్రితుడ వనఘ !
> యిపుడు చెప్ప దొడంగిన యీ ప్రబంధ
> మంకితము సేయు వీరభద్రయ్య పేర

అన్నాడు. ఆశ్రితుడంటే ధర్మభిక్ష – పనిచేయకుండా భోజనాది సదుపాయాలు కలిగిఉండడం. దీనిలో నీచ భావము కనబడదా ! ఇట్లాంటి దురభిప్రాయాలు సహృదయుల కుండకూడదు కదా.

### కళాదృష్టి :

చేమకూరకవి కళాదృష్టి చాలా లలితమూ, సున్నితమూ అయినది. నిపుణుడైన చిత్రకారుడు రెండు మూడు గీతలతో ఒక సుందరమైన రూపాన్ని సృష్టించినట్లు మనకవి గూడ రెండు మూడు అల్పవిషయాలను చెప్పి మనోహరమైన ఒక రూపాన్ని పాఠకుల మనస్సులలో హత్తుకొనేటట్లు చేయగలడు.

> "సిగ సంపెఁగ పూ లొనపరివగ, కస్తురినామ మొరపు, వలెవా టొరా !
> సొగ సిటు లుండగవలె నని సొగసి లతాతన్వి వానిసొగసు నుతించెన్"
> (వి. వి. 1–129)

స్వల్ప విషయాలను మూడింటిని చూపించి ఆ వ్యక్తిలోని నీటుతనాన్ని పాఠకులకంటికి కట్టినట్లు చేశాడు. ఈ కళాదృష్టితోనె "బవిరిదిద్దిన చెంపలబాగును", "మీసాలలో నవ్వును", "కాన టెంచుక నటించు కౌను"ను గుర్తించగలిగాడు.

వర్ణనలలో సైతం, "ఉదుకపోవు కంబుమున హాగళము" అని ఊరుకోక అందులోని విలాసాన్నే ప్రధానంచేసి "గళరేఖ", "కన్నొమల వైఖరి", "కటాక్షోదయలీల" అని విలాస విషయాలనే తన వర్ణనలలో విశేషంగా కనబరిచాడు.

## విజయవిలాస రచన

దేశగౌరవం, ప్రజావైభవం, ఆనందకరమైన వాతావరణం అపరిమితంగా ఉన్న ఆ దినాలలో శృంగార రసానికి ఉన్న ప్రజాకర్షణ కరుణరసానికి కలుగదని అనుకున్నాము గదా! కాబట్టి శృంగార రసాన్ని మూడు ముఖాలుగ ప్రదర్శించడానికి అనుకూలమయిన విజయవిలాస కథను స్వీకరించాడు. దీనిలో తన నేర్పరితనాన్ని బహుముఖాలుగా చూపించి తెలుగుభాషకు తలమానికమైన కావ్యరాజాన్ని అందించాడు.

నాటికి దాదాపు నూరు సంవత్సరాలనుండి శృంగార ప్రబంధ రచన సర్వతోముఖంగా కొనసాగుతుండేది. శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, రామరాజ భూషణుడు, పింగళి సూరన వంటి మహాకవులు సరస్వతీ భాండాగారమును కొల్లగొట్టి స్వాధీనం చేసుకొన్నారంటె దోషం కాదు. వారు చేసిన వర్ణనలు, కల్పనలు ఆ మోఘాలై నేటికిని శ్లాఘాపాత్రంగా ఉన్నవి. వారి కావ్యాలయందలి గుణవిశేషాలను చేమకూరకవి పరిశీలించే ఉంటాడు. ఈ పరిశీలన పరమార్థం వారి వారి రచనలను అనుకరించడం కాదు; వారి రచనకు మెరుగు పెట్టడమూ, వారి వారి వైఖరులను వర్జించి కొత్త పుంతలను తొక్కడమే ఈ పరిశీలన పరమార్థం. అందువల్లనే, పూర్వకవి రచనలతోటి సామ్యాన్ని స్ఫురింపచేసే పద్యాలు చేమకూర కావ్యములో సూక్ష్మ దృష్టితో పరికించిన వాళ్ళకుగాని ఒకటి రెండు కనుపించవు

**కథా వస్తువు :**

రసవత్తరమైన ఈ కావ్యం మూడు ఆశ్వాసాలుగా రూపు దాల్చించి. ఇందులో ఉలూచి, చిత్రాంగద, సుభద్రల వివాహకథలు మూడున్నవి విజయవిలాసం రచనలో చేమకూరకవి చాలావరకు భారతకథనే అనుసరించినా, పాత్ర ప్రవేశ గోపనాలకోసం, కథాకథన సౌలభ్యం కోసం, నాటకపద్ధతి అనుసరించడానికి అక్కడక్కడ కొన్ని మార్పులు చేసుకొన్నాడు.

భారతంలోని ఉలూచి గంగానదీ తీరంలో హోమంచేయడానికి వచ్చిన అర్జునుణ్ణిచూచి, "నళినాక్షి యందొక్క నాగకన్యక కామ పరవశయై వానిబట్టి తిగిచికొని" నాగపురానికి పోయినట్టు ఉన్నది. దీనినిబట్టి భారత ఉలూచి అర్జునుణ్ణి చూడగానె కామపరవశయై ముందు వెనుకలు చూడక అతడ్ని పట్టి తిగిచికొని పోయినట్టు స్పష్టమవుతున్నది. చేమకూర వాని ఉలూచి అట్టి తెంపరితనానికి పాల్పడలేదు. ఈమె వరూధిని వంటి ప్రౌఢగాని, భోగలాలస చిత్తగాని కాదు. అర్జునుడి పరాక్రమం విని, వలచి, అతడికి భార్యననిపించుకొని, ఇలా వంతునివంటి వీరకుమారునికి మాత అయి, గృహిణిగా ఉండదగిన కాంత. కాబట్టి మహాబాహుడైన ఒకని చూచినంతమాత్రానే వాడి సంగతి ఏమీ తెలియకుండానే కామపరవశ అయి అతడిని తిగిచికొని పోవుటకు సాహసించ లేదు—

> "హిమకరశైల సైకతమునందు విహరించు
> కైరవేషు వేషు ఘనని భాంగు
> నెనరు దవుల దవులనే కాంచి క్రీడిగా
> నెఱిఁగి యారః యారగేందువదన" (వి. వి. 1-124)

ఈ పద్యాన్ని చేమకూరకవి కేవలం శబ్దాలంకార ప్రియత్వంతోనే వ్రాశాడని భావించడం కవికి ద్రోహం చెయ్యడమే. కైరవేషు (మన్మథ) వేషు (రూపముగలవానిని) ఘననిభాంగుని దూరాన్న చూచినంత

మాత్రాన క్రీడి ఈతడేనని గుర్తింపగలిగింది. ఎందుకంటే, 'దవులనే కాంచి' సప్పుడు అర్జునార్పితమై ఉన్న తన హృదయాన ఉలూచికి నెనరు దగిలింప— ప్రేమ లగ్నమైనది. ఈ హృదయ ప్రవృత్తి వల్లనే, ఆనాటి దుష్యంతునివలె, తన హృదయాన్ని ఆకర్షింపగలిగిన ఈతడే అర్జునుడని నిశ్చయించింది. ఈ విధంగా తేల్చడమునే కవి 'ఔర!' అనే పదం ప్రయోగించి మెచ్చుకున్నాడు. ఇది అర్థస్ఫూర్తి కలిగిన చక్కని పద్యం.

ఈ విధంగా గుర్తించి మాయాస్వితయై దగ్గరిగాపోయి ఆతని సౌందర్యాన్ని కన్నులార కాంచింది. చూడగానె అర్జునుణ్ణి నాగలోకానికి ఈడ్చుకపోలేదు. ఉదయంనుంచి సాయంత్రంవరకు తనలో తానే పరిపరి విధాలా సతమతమయి చివరకు సాహసించి తన వెంట తీసుకొని వెళ్ళింది. ఇంతగా ఔచిత్యాన్ని పాటించాడు మనకవి.

గోవును కోల్పోయిన బ్రాహ్మణుడు రావడమూ, మొదటి ఏర్పాటు ప్రకారం ఒక సంవత్సరం భూప్రదక్షిణకు - ధర్మరాజాదులు ఎన్ని చెప్పినా కూడదని - అర్జునుడు బయలుదేరడం, ప్రతిజ్ఞ ప్రకారం పన్నెండు నెలల తరువాత ఆగవలసిన భూసంచారాన్ని యింకా కొనసాగించడం, ప్రభాస తీర్థానికి పోయిన తరువాతగాని సుభద్ర, కృష్ణుల విషయం స్మరణకు రాకపోవడం భారతంలో ఉన్నవి. ఇలా విడివిడిగా ఉన్న విషయాలకు ఒక సక్రమమైన ఆధారాన్ని చూపి కావ్యంలో వస్త్వైక్యతను కల్పించుకోవడానికి చేమకూరకవి అవలంబించిన విధానం చాలా ప్రశంసనీయం. గ్రంథారంభంలోనె ద్వారకముద్దుచెల్లెలని సుభద్రను పాఠకులకు సూచిస్తూ, 'రుక్మిణీకాంతుడు' (కృష్ణుడి పద్ధతినే అర్జునుడు పెళ్ళి చేసుకోవడానికి సూచనగా) పంపిన గదుడను యదువంశవిభుడు ధర్మరాజును దర్శించిన తరువాత అర్జునుడితో ఏకాంతంలో, సందర్భానుసారంగా సుభద్రను వర్ణించాడు—

"అని బహుభంగులం బొగడ నంగన ముంగల నిల్చినట్లుఁ దాఁ
గనుగొనినట్లునై నృపశిఖామణి డెందమునందుఁ బట్టఁ జా
లని యనురక్తి నవ్వరవిలాసిని నెన్నఁడు చూడఁ గల్గునో
యని తమకించుచున్న సమయంబున గ్రక్కున దైవికంబుగన్" (వి వి. 1-107)

ఆ విధంగా తమకిస్తున్న సమయంలోనె నాటకీయపద్ధతిని ఒక బ్రాహ్మణుడు తన గోవును దొంగిలించుకొని పోయారని మనవిచేసుకోవడానికి రావడముతో జతపరచి తన రచనా నైపుణ్యాన్ని ప్రకటింపడమేగాక, విడివిడిగా ఉన్న ఉలూచి, చిత్రాంగద, సుభద్ర పరిణయఘట్టాలను ముత్యాలవలె కూర్చడానికి ఒక చక్కని ఉపాయ సూత్రాన్ని ఏర్పర్చుకొన్నాడు. సుభద్ర మీద ఉన్న తమకంవల్లనే గడువుకాలం తీరిపోయినా తాను యాత్ర సాగిస్తూ ఉండడానికి అనుకూల్యం ఏర్పర్చుకొన్నాడు.

ఈ రీతిగ, భారతంలోని విధానంతో మన చేమకూర ప్రవేశపెట్టిన మార్పులు అన్నీ సమర్థనీయాలై గ్రంథంలోని శిల్పచాతుర్యానికి నిదానాలుగా నిరూపితమవుతున్నాయి.

### కావ్య గుణాలు :

రఘునాథరాయల ఆస్థానంలోని కవులూ, కవయిత్రులూ అనేకులు రఘునాథరాజునే తమ విద్యా గురువుగా ఎంచుకున్నారు. ఆ రాజుమీద భక్తి విశ్వాసాలు అపారంగా ప్రకటించిన చేమకూరకవి ఆయనవద్ద ఏదైనా నేర్చుకున్నట్లు ఎక్కడా చెప్పలేదు. సారంగధర ఆశ్వాసాంత గద్యలో 'సదారాధిత బుధ..' అని చెప్పడంవల్ల ఆ బుధ సమాజమే పరోక్షంగా మన కవికి గురువనదగిందని భావించాలి సూర్యనారాయణ

వరంవల్ల కలిగిన కవితోత్సాహాన్ని చేమకూరకవి స్వయంకృషి వల్లనే సర్వలక్షణ సమన్వితంగా చేసుకొన్నా డనడం సమంజసం. ఈ స్వయం కృషిలో ఈయన దృష్టి ఏయే కావ్యగుణాలమీద లగ్నమై ఉండెనో, గ్రహించడానికి మనకు ఆధారాలున్నాయి. రఘునాథరాజ కవిత్వ ప్రాశస్త్యాన్నిగురించి తానుచెప్పినప్పుడు ప్రతి పదంలో జాతి, వార్త, చమత్కారం, అర్థగౌరవాలతోపాటు రసపుష్టి కలిగి ఉండాలని విశ్వసించాడు. కావ్యం ప్రసన్న గంభీరంగా రచించడం సహృదయానందకరం కాగలదని గ్రహించాడు. చక్కని ప్రబంధాలు 'శ్రీ రసభావములతో అలరారవలె'నని విశ్వసించాడు. తనను గురించి రఘునాథరాజు చెప్పినట్టుగా రచించిన పద్యాలలో, వాఙ్మయమర్యాద– పదాలనియమంలోని ప్రసిద్ధి– ఉండాలని, చెప్పిన కవిత 'విరిపొట్లము విప్పిన గతి' వాసించాలని, ప్రతి పద్యంలో చమత్కృతి ఉండడం మంచిదని చేమకూరకవి తనకు శ్రేష్ఠమైన సాహిత్యం పట్ల ఉన్న ఉద్దేశ్యాలను ఉల్లేఖించాడు. ఈ విధమైన వర్ణనలమీద, సాహిత్య లక్ష్యాల మీద చేమకూరకవి తన దృష్టిని కేంద్రీకరించాడని గూడ చెప్పవచ్చు. "ఎందును విద్యలే యెఱుగరెవ్వరు..." అన్న పద్యంలోని 'కొంతమాత్ర మెరుగుట, సాహితీ రసమహత్వ మెరుగుట, ఆయంద మెరుగుట' అనే మూడు సోపానాలుగా కావ్యాన్ని సహృదయులకు అందించాలని నిశ్చయించుకున్నాడు. షష్ఠ్యంతాలలో 'క్షోద క్షమ రసభావ సుకవిత ప్రశంసా పాత్రము' అని నిర్ణయించుకున్నాడు. సుభద్ర చేతి అద్దాన్ని వర్ణించే సందర్భాన 'ఛాయాచోరక రస సందర్భము' కూడదని, 'స్వకపోల కల్పిత మనోజ్ఞ కళాగతి' పండిత రంజకంగా ఉంటుందని గుర్తించాడు.

"క్షితిపయి వట్టిమాటలు చిగిర్ప వసంతుడు తా రసోపగుం
ఫిత పదవాసనల్ నెరప, మెచ్చక చంద్రుడు మిన్నునన్ ప్రస
న్నతయును సౌకుమార్యము గనంబడ రాల్గరగంగ జేసె, నే
గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా" (వి వి. 1-210)

అనే పద్యాన్నిబట్టి మన కవి రసోపగుంఫిత పదాలలోను, ప్రసన్నతా, సౌకుమార్యాలలోను శ్రద్ధ వహించిన వాడని తెల్లమవుతుంది. కొంచెమాలోచించి చూస్తే విజయవిలాసములో •మొదటి సగము రసోప గుంఫిత పదవాసనలతోనూ, తరవాతి సగము ప్రసన్నతా సౌకుమార్యములతోను ఉన్నట్టు కనబడతాయి. మనకవి పై రెండు విధాల రచనలను మెచ్చేవాడే. రెంటిలోనూ మనోహరమయిన కవిత్వ విశేషాలు చూపవచ్చునని అతని భావము.

దీనికి తోడు రెండో సగములో మనకథ త్వరితగతిని సాగిపోతూ ఉంటుంది. ఒక్కొక్క చోట పాఠకులు గ్రహించుకోలేకపోతారా అన్నట్టు కొన్ని విశేషాలు చెప్పకుండా విడిచిపెట్టాడు గూడా. మొదటి సగములో పదప్రయోగ విశేషములతోనూ శ్లేషాది అనేక చమత్కారాలతోనూ సహృదయులను ముగ్ధులుగా చేసినట్టే తక్కిన సగములో స్వభావోక్తి సరళమయిన హాస్యమూ ముచ్చటయిన తెలుగు నుడికారమూ ఉపయోగించి కవి కృతార్థుడయాడు. ఏ భాగములోనూ ఆకర్షణలో వెత్తి రవంతయినా కనబడకుండా రచించడము ఒక సిద్ధహస్తము చేయదగిన పనేగాని మరొకటికాదు.

ఇంతేగాక కవనానికి మెరుగులుదిద్దే అనేక ఇతర లక్షణాలలో కూడ ఈ కవి దృష్టి లగ్నమై ఉంది; వాటిలో ప్రక్రమనియమం, లోకోక్తుల అమరిక, స్వభావ నిరూపణం ప్రధానంగా పరిగణించదగ్గవి. తన రచనను తాను ప్రతిపక్ష విమర్శకునికంటె ఎక్కువ కఠినంగా పరీక్షచేసుకొన్న తరువాతనే గ్రంథాన్ని రచించాడు.

**వ్యాఖ్యాతల పొరపాట్లు :**

ఈ విషయా లన్నింటిని గుర్తించకపోతే పాఠకులు చేమకూరకవిని పరిపూర్ణంగా గ్రహించలేరు. పండితులకు సైతం ఈ కావ్యం 'కాకి మెలికవలతో నిండి యున్నట్లు' కనబడడంలో ఆశ్చర్యం లేదు. పలువురు పండితులూ, విమర్శకులూ ఈ గ్రంథంలో ఉన్న యమక అనుప్రాసాది శబ్దాలంకారాలను మాత్రమే చూచి, ఆలంకారికుల నిర్ణయాన్నిబట్టి, ఇది ఉత్తమ కావ్యం కాదు అనే అభిప్రాయాన్ని కల్గించు కున్నారు. వారి దృష్టి అంతకుమించి, కావ్యంలోని ఇతర ప్రసిద్ధ గుణాలను చూడలేకపోయింది. శబ్దాలంకారాలు ఉన్నంత మాత్రాన తక్కిన రసభావ విశేషాలు, వ్యంగ్య ప్రధానార్థాలు, అపూర్వ కల్పనా చమత్కారాలు, శిల్ప నైపుణ్యం, ప్రబంధీకరణంలోని ప్రతిభ తదితరమైన ప్రశంసా పాత్రమైన విషయాలు లేవని అనుకోవడం పెద్ద పొరపాటు.

ఈ పొరపాటుకుతోడుగా మన వ్యాఖ్యాతలు అనేకులు కవి ప్రయోగించిన పదాలకు సరైన అర్థాలను తెలిసికోలేక ఇష్టం వచ్చిన వ్యాఖ్యానం వ్రాయడంవల్ల పద్యాలు పేలవంగా ఉన్నట్లు కనుపించడం జరిగింది—

ఉదా : "అంగజరాజు పాంథనిచయంబులపై విజయం బొనర్ప నేఁ
గంగఁ దలంచునంత, మును గల్గగ దాసులు వట్టు జాళువా
బంగరు టాలవట్టములభంగిఁ గనంబడెఁ బూర్వపశ్చిమో
త్తుంగ మహీధరాగ్రములఁ దోయజశాత్రవ మిత్ర బింబముల్" (వి. వి. 1-208)

పద్యంలో ఆలవట్టముల్ అన్న పదానికి సరైన అర్థాన్ని తెలిసికోలేక గుడ్డతోకుట్టిన గుండ్రని వివనకర్రలని (జూలూరి అప్పయ్యగారు 'అఫ్తాబ్‌గిరా'- గొడుగు ? అని) అర్థం చెప్పడంవల్ల పద్యం హాస్యాస్పదంగా కనిపించకతప్పదు. వీవనలేమిటి, ఛత్రములేమిటి, రాజుల ఊరేగింపు ముందరి భాగంలో సేవకులు పట్టుకొనడం ఏమిటి అని ఎగతాళిచేస్తారు. ఆలవట్టములంటే సూర్యపాశా, చంద్రపాశా అన్న పేర్లతో ఊరేగింపు ముఖాన సేవకులు పట్టుకొనే సూర్య చంద్రబింబాలతో కూడిన గౌరవ లాంఛనాలు అని తెలుసుకోగలిగితే పద్యంలోని అంగజరాజుకు (మూడు లోకాలుపాలించే మన్మథుడికి) కృత్రిమ సూర్యుడు, కృత్రిమ చంద్రుడు కాక సహజ సూర్యచంద్రులు బంగారు వన్నెతో, కొండలపై ఎత్తున, ఆలవట్టాలవలె కనుపించారని గ్రహించే వారు. అప్పుడు మన్మథుణ్ణి అంగజరాజు అని చెప్పడంలోగల ప్రయోజనం గూడ స్పష్టం అవుతుంది.

ఇదే విధంగా—

'కన్నె నగుమోముతోడన్'.... (వి. వి. 1-197)

అన్న పద్యములో 'రేకమోవకయున్నఁగా' అన్న పదాలకు సరైన అర్థాన్ని గ్రహించలేక జూలూరి అప్పయ్యగారు 'హర్కారాపని చేయకున్నను' అనీ, శ్రీ వేంకటరాయశాస్త్రిగారు 'తపాలా నౌకరి చేయకుండిన' అనీ వ్యాఖ్యానించి పద్యాన్ని నిస్సారం కావించారు. ఏ విధంగా నిస్సారం కావించారో ఈ వ్యాఖ్యానంలో చూడండి.

**అందీ అందని అంచాలు :**

చిత్రాంగదా వివాహఘట్టంలో—

అపుడు నృపుడు ప్రఫుల్ల నవాంబుజ ప్ర
సన్నముఖుడై మలయధ్వజ క్షితీశ
కమలహితునకు మామ కాగమన వార్తఁ
దెలుపుమనుచు విశారదు బిలిచి పనిచె (వి. వి. 1-217)

చిక్కని ఈ పద్యంలోని 'మామకాగమన వార్త' కు శ్రీ వేంకటరాయశాస్త్రిగారు 'మామక = నాదయిన, ఆగమన = రాకయొక్క, వార్తకా = వృత్తాంతమును (మామకా ఆగమనవార్త.... తన కూతును నాకిచ్చి వివాహముచేయుమని ఆయనను అడుగుము అని చమత్కారము)' అని అర్థం చెప్పి అర్జునుణ్ణి అసభ్య ప్రవర్తకుడిగ చేశారు. వివాహానికి పూర్వమే మామవరుసపెట్టి మాట్లాడడం సభ్యత కాదుగదా! మామకుడా + ఆగమనవార్త అన్న పదవిభజనవల్ల తన కూతురును నాకిచ్చి వివాహంచేయమని ఆయనను అడుగుము' అనే 'చమత్కారం' ఎలా సిద్ధిస్తుందో తెలియదు. ఇది సందర్భాన్ని అనుసరించి మసిపూసి మారేడుకాయ చేయడమే అని అనక తప్పదు. జూలూరు అప్పయ్యగారు ఈలాంటి అర్థాన్ని సాహసించి చెప్పలేక "మామకు ఆగమన వార్త అని గూడా చమత్కారము విచారించవలెను అన్నారు.

దీనిమీద 216 వ పద్యములో "లేకెటుల నిద్రవచ్చును రేరగు నయ్యువిద నెదను నిల్పినదాకన్" అని కవి విషయాన్ని అందించారు. విశారదునిని పంపించడం కేవలం వచ్చిన వర్తమానం చెప్పడానికే కాదని స్పష్టము. అయినా ఆ ఎనిమిదక్షరాలకూ జూలూరివారు ఊహించిన అర్థమూ వేదము వారు సాహసించి చెప్పిన అర్థమూ అందడము లేదు.

మామ కాగ మన వార్త అని నేను చేసిన పదవిభజన. మామ అగునట్టు మన విషయము తెలుపుము అన్న అర్థాన్ని యివ్వడం సమంజసంగా ఉందికదా. పూర్వ వ్యాఖ్యానంవల్ల కలిగిన ఈ అసహ్యత ఈ పద్యంలోని 'ప్రఫుల్ల నవాంబుజము', 'శీతశ ఏమంహితుడు', 'పిలిచిపనిచె' మొదలయిన పదాలయందలి అభిప్రాయ విశేషాలను, అంతేకు పై పద్యంలోని 'లేకెటుల నిద్రవచ్చున్' అనే మాటల్లోని అర్థవిపులీకరణాన్ని చూడడానికైనా సంధివ్వదు.

ఈలాంటిదే ఉలూచీ ఘట్టములో ఉంది. ఎంతో ప్రేమతోనూ తప్పక అర్జును డంగీకరిస్తాడన్న ధైర్యముతోనూ తా నతనిని దీసుకువచ్చింది. మొదట మొదట మదవతీ నవమన్మథ, కురువీరా, రసికశేఖర, జనరంజనైక లీలావహరూప, రూపవంచిత మదనా అంటూ సంబోధించింది. అతడు అక్కరకు మాలిన ప్రశ్నలతో విసిగించాడు. ఆమె అతని ముఖము తేరి పారజూచింది. ఆ శృంగార సంబోధనలు పోయాయి. 'నృపాలకా,.... పిలువుమాత్ర ముంచి, ఎన్నో సమాధానాలు చెప్పినా, ఇంకా అర్జునుడు ప్రశ్నించడం మానలేదు. మనసు చివుక్కుమన్నది. దానితో 'చిలువ చెలువంపు పలుకుల' ఆ చిలువ చెలువ

"ఏమన( బోయెదన్ తగులమెంచక నీ విటులాడ
....నీమన సొక్కటె కరగ నేరదుగాని నృపాలకాగ్రణీ (వి వి. 1-166)

ఈ పద్యములో గూడా కవి పూర్వరంగవర్ణన పట్టి కొంత భావము పాఠకుడికి అందించాడు. అందుచేతనే వేదమువారు దీనిలో బెదరింపో, సాహసవుమాటో ఉన్నదని గ్రహించారు.

"ఏమనబోయెదన్ = ఏమి చెప్పగలను, (ఏన్ = నేను, మన(బోయెదన్ = బ్రతుకు దునా- అని కాకువుగ నేనియు- బ్రతుకను అని విపరీత లక్షణగా నేనియునొండె..."

అని వ్యాఖ్యానించారు. ఆ కాకువు ఏలాగు ఉచ్చరించాలో, ఆ విపరీత లక్షణకు ఆధారమేమిటో, ఏమీ వివరించలేదు. ఈ పద్యములో బెదరింపు భావము ఉందని తెలుసునుగాని ఎలాగ సాధించడమో తెలియలేదు.

'చిలువ చెలువంపు పలుకుల' అన్న మాటలను గూడ వేదము వారు అపార్థముచేసుకొని 'చిలువలు పలువలు గల విలాసముతో( గూడుకొన్న పల్కులచేత' అని అర్థం వ్రాశారు. దీనిలో బెదరింపుగాని, నిస్పృహగాని కానరాదు ఆ చిలువలు పలువలుగల విలాసం కవి ఎక్కడ చూపించాడో ఏమీ చెప్పలేదు.

నేను చెప్పినది: "ఏన్ మనన్‌పో— ఏను మననుపో = నేను బ్రతుకను సుమా, ఎదన్ తగుల మెంచక నీవిటులాడ..., కష్టములేని అన్వయము కాదా!

"చెలువ నిను రాజకీరంబు చెట్టపట్టె,
కలికి నిను రాజహంసంబు కాలుద్రొక్కె, (వి. వి. 2-159)

ఈ పద్యంలో కాలుద్రొక్కుటకు కదియు - సమీపించు అని అర్థం చెప్పినవారూ, యుద్ధరంగంలో శరాసనాలను వంకలు తీర్చుట ఆవశ్యకం అని భావించినవారూ, "అతని పితండె సాటి చతురబ్ధి పరీత మహీతలంబునన్" అన్న పాదం పూర్తిగా పాదపూరణ వ్యర్థ పదజాలమే అని అనుకున్నవారూ చేమకూరకవిని సమగ్రంగా గ్రహింపలేము అని అనడం సాహసంకాదు. శబ్దరత్నాకర కారుడు "చేమకూర వెంకటనాథుడు విజయవిలాస రచనా నైపుణ్యము బట్టి నాల్గవ తరగతియందు జేర్పబడినను, సారంగధర చరిత్ర రచనను బట్టి అయిదవ తరగతియందు జేర్పబడవలసిన వాడిగా నున్నాడు" అని వ్రాయడం చేమకూరకవి పద్యాలు బోధపడక పోవడం వల్లనే!

ప్రశంసలు :*

ఎందరెన్ని అనినా విజయవిలాసం ఈ మూడు వందల యాభై సంవత్సరాలు 'పిల్ల వసుచరిత్ర' గా ఆంధ్రకవి పాఠకలోకం అభిమానాన్ని, ప్రశంసలను అందుకొంటూనే ఉన్నది. తరువాతి కవులు ఎందరో 'పిల్ల విజయవిలాసాలు' అనడానికి యోగ్యమయిన కావ్యాలను వ్రాయడానికి ప్రయత్నించారు. అప్పకవివంటి లాక్షణికుడు ఈయన కావ్యంలోని "వ్యాకరణ దోషములను" సరకుచేయక ఎన్నో పద్యాలను ప్రమాణాలుగా తన అప్పకవీయంలో చేర్చుకోక తప్పిందికాదు. ఈ విధంగా చేయడానికి కారణం గ్రంథంలో వారు చూడదగిన (కొంచెంగా చూచిన) అర్థగౌరవం, పదప్రయోగం, మాటల విరుపులు, లోకోక్తుల వాడుక, ధ్వని ప్రాధాన్యం మొదలయిన విశేషాంశాలు చెవులుపట్టి ఆడించడమే అని వేరుగా చెప్పవలసిన అవసరం లేదు.

"పంకేజాతములన్ దిసంతు లడచున్ బాలామణీ పాదముల్" (వి వి. 2-16) అన్నప్పుడు పంకేజాతములు, దిసంతులడచు అనే రెండు పదాల సార్థకతను చూడగలిగినవారూ, ఆ పద్ధతినే పద్యమంతటిలోనూ ప్రక్రమం గుర్తించినవారూ, ఎవరు పద్యంలోని హృద్యమైన సొగసును మెచ్చుకోరు!

"శివుడిటు రమ్మటంచు" (వి.వి. 3-51) అనే పద్యంలో చంద్రుని "ఔరా! నందినన్ సిగయు నందక యుండిన గాళ్ళు పట్టుకొందువు హరిణాంక, వేలకొలదుల్ గద నీ నడకల్ తలంపగన్" అని ఎత్తి పొడవడంలోని లోకోక్తి ప్రయోగ చమత్కారాన్ని, "వేలకొలదుల్ గద నీ నడకల్" అన్న మాటల్లోని గంభీర భావాన్ని ఎవ్వరు మెచ్చుకోరు!

"గుట్టసియాడ, గబ్బిచనుగుట్టలపై పులకాంకు రావళుల్
తెట్టువ గట్ట, కోరికలు తేటలు వెట్టగ, వేడుకల్ మదిన్
దొట్టికొనంగ, నచ్చెరువు తొంగలిరెప్పల వీగనొత్తగా... (వి. వి. 1-126)

పద్యంలో చూపించిన భావ పరిణామాన్ని అనుపమానంగా ప్రదర్శించడంతో (వ్యాఖ్యానాన్ని చూడండి) తృప్తిపడక ఒక తటాకంపవలె ఉన్నదను భావాన్ని ధ్వనింపజేయడాన్ని గుర్తించగలవారు ఎవరు హర్షించరు!

*'వెంకటపతి - చేమకూర' అని మన కవిని గురించి వ్రాసిన నా వ్యాసము 'విజ్ఞాన సర్వస్వము'- 3వ వాల్యూములో పుట 1103 నుంచి 1109 వరకు ఉన్నది. తీరికా ఓపికా ఉంటే సహృదయులు దానిని చూడాలని ప్రార్థిస్తాను.

కమ్మని జాళువా నొరయఁ గల్గిన చెక్కుల పెక్కువాఁడు చొ
క్కమ్మగు జాతికెంపు వెలగాఁ గొను మోవి మెఱుంగువాఁడు, స
త్యమ్మగు రూపసంపద ధనాధిప సూనుని ధిక్కరించువా,
డమ్మక చెల్ల! నాహృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్"— (వి. వి. 1-135)

ఇందులో అమ్మకచెల్ల, అమ్మకచెల్లదు అన్న మాటల విరుపుతోనే సంతోషించక కొంచెం శ్రద్ధగా పరిశీలించి ఆమె హృదయం ఒక అమూల్యమైన రత్నాభరణమనీ, దానిని విక్రయించడానికి అవసరమైన స్వర్ణ పరీక్షకుడు, రత్న పరిశీలకుడు, కొనదగిన ధనవంతుడు ఒక్కడిలోనె మూర్తీభవించి సమకూరి నప్పుడు 'అమ్మక తప్పదు' అన్న ధ్వనిని గ్రహించగల రసజ్ఞులు సెబా సని తలలు ఊపకుండా ఉంటారా?

ఈ రీతిగా, ఇన్ని నూతన విషయాలు తెలియకముందే, అసంపూర్ణంగా అర్థం చేసుకొన్నప్పుడే, ఎంతో ప్రశస్తిని గడించిన చేమకూరకవి ఎంతటి అధిక ప్రశంసలకు ఇప్పుడు అర్హుడు కాడు!

ప్రబంధవర్ణనలు :

ఆయా ఘట్టాలలో మనకవి అవలంబించిన రచనా విధానం అటువంటి ఘట్టాలనే రచించిన ఇతర మహాకవుల విధానానికి ఏ విధంగాను తీసిపొయ్యేది కాదు. ఈ విధంగా పోల్చి చూచినప్పుడు మనకవి భావములోను, కల్పనలలోను కనబరచిన స్వాతంత్ర్యమూ, రచనలో రమణీయంగా అవలంబించిన కొత్త పోకడలూ ప్రత్యక్షం కాకపోవు.

ఇంత స్వతంత్రుడై కూడా తన కావ్యాలలో, పూర్వుల పుంతల్లో, ప్రబంధనియమావళి ప్రకారం, అష్టాదశ వర్ణనలలో ఎన్నింటినో అపరిమితంగా కురిపించాడు. ఇందుకు కారణం ఏమిటని ఆలోచిస్తే, ఈ నెపంతో, రఘునాథరాయల కాలంలో మహావైభవోపేతంగా ఉన్న నగరం, కోట, ఏనుగులు, గుర్రాలు, నర్తకీమణులు, పుష్పలావికలు, వేశ్యలు, రాజు గుణాలు, ఆస్థానం మొదలయిన వాటిని కళ్ళకు కట్టినట్లు చూపించడమే అని తేటపడుతుంది—

"పోఁకక్రమాఁకుల మహిమ, కప్పురపు టనఁటి
యాకుఁదోటల సౌభాగ్య, మందెకలదు,
ప్రబలు పూర్తిక సౌధసంపదల గరిమ,
వీటి రహి మెచ్చ వలయుఁబో వేయునోళ్ల" (వి. వి. 1-82)

అన్న పద్యం ఇతరులకు ఏ విధంగా అర్థమయినా రఘునాథరాయల కాలమునాటి ప్రజలకూ, తంజావూరు ప్రాంతాలను చూచిన ఇప్పటివారికీ ఆ పోకమ్రాకుల విస్తీర్ణత, ఆకుతోటలు, అరటితోటలు, నడుమనడుమ కన్పిస్తుండే తెల్లటి మందిరాలు కంటికికట్టినట్లు కాకమానవు. వాటినిగురించి మహిమ, సౌభాగ్యం, గరిమ అని కవి చెప్పడం కేవలం వాస్తవిక విషయాలగురించే అని తంజావూరుతో పరిచయం ఉన్న వారందరికి తెలుసు. చమత్కృతుల చెలువం ఒక రస ప్రవాహంగా పొంగి పొర్లించే ఈ కవి లేఖిని అంతటితోనే ఆగుతుందని మనం అనుకోకూడదు. ఈ పద్యంలో పోకలు, పచ్చకర్పూరం (అరటిచెట్లు), ఆకులు, సున్నం (సౌధ) అనే నాలుగు వస్తువులతో కప్పురపు విడెమును పాఠకులకు అందజేశాడు. 'వీటి రహిమెచ్చ వలయుబో వేయునోళ్ళ' అని పట్టణ సౌందర్యాన్ని సహస్రముఖాలుగా పొగడాలని చెప్తూనే ఈ తాంబూలం (వీటి) రుచి (రహి)— ఆ తాంబూలము వేయునట్టి నోరులే మెచ్చాలిగాని తక్కిన నోరులు ఆ రుచిని వర్ణించలే వని ఒక చక్కని చమత్కారం కనబరిచాడు

రఘునాథరాజు కోటముట్టా మదగజాలను కట్టివేసి పెట్టనికోటగా ఉంచుతారనీ, సప్తకిషణులు ఎత్తుగా కట్టిన చప్పరాలమీద నృత్యం చేస్తారనీ తెలిసినవారు మనకవి చేసిన ఆ వర్ణనల్లో విశేషమైన వాస్తవికతను చూచిగలుగుతారు. ఇదే విధంగా ధర్మరాజు వర్ణనలలోనూ వివాహ సందర్భాల్లోనూ, కవి తన మనసులో ఉంచుకొన్నది రఘునాథచరిత్రేగాని వేరుకాదు.

కవి సాహస సంపత్తి :

శతాబ్దాలతరబడి ఇటువంటి ప్రశంసలను పొందడానికి సాధనాలుగా మన కవికి ఉపకరించిన విషయాలను పరిశీలించడం సముచితంగా ఉంటుంది. ఈ పరిశీలనలో ప్రప్రథమంగా కనిపించేది ఉచిత పద ప్రయోగం— వెదవిలుకాడు అని అనడంవల్ల చమత్కారం చెప్పలుచోట దానికి పర్యాయపదమైన 'చిత్తజుడు' అన్న పదాన్ని ప్రయోగించడు. తరుణీ అని అనవలసినచోట వెలది అనిగాని, గుడాకేశుడు (అర్జునుడు) అని అనదగినచోట నరుడు అనిగాని, కిరీటి అనిగాని, అమృతాంశుడు అనవలసిన దగ్గర చంద్రుడు అన్న పదాన్నిగాని - అర్థాలు ఒకటే అయినా- ప్రయోగించకుండా ఉండడం అభ్యాసరూపంలో అలవరచుకున్నాడు.

చూడండి :

ఆ రామ సీమలయందు నుండి పవళ్లు
 ముదమొసంగ వసంతు డెదురుచూచు
ప్రొద్దుపోయినవేళ రోహిణీ ప్రాణేశుఁ
 డుదిరి మేడలమీద వెదకిచూచు (వి. వి. 1-76)

అన్న పద్యములో వెన్నెల ఒక మేడ తరవాత మరొక మేడమీదికి ప్రసరిస్తూ ఉండడం చంద్రుడు ఆ మేడలను వెదకి చూస్తున్నట్టు (టార్చి పట్టుకొని ఆయా స్థలాలు వెదకినట్టు) ఉందంటాడు. వెదకి చూడడము ఎంత మనోహరమయిన ప్రయోగమో సహృదయులకు చెప్పనక్కరలేదు అలాగునే ఎదురుచూచు, కెలప చూచు, చొచ్చిచూచు అన్న తక్కినవి గూడా ఈ పద్య ప్రక్రమానికి అనుగుణంగా ఉండి హృదయాహ్లాదాన్ని కలిగిస్తాయి.

వెలది కెమ్మోవి గని జపావృత్తి మరచె
తరుణి లేగౌనుగని హరిస్మరణ మరచె.... (వి. వి. 2-148)

ఈ పద్యంలో సుభద్రమీది ధ్యానముతో ఈ కపట త్రిదండి తాను చేయవలసిన పనులు మరచిపోయాడు. దీనిలో వెలది అనడానికి బదులు తరుణి అనినా అర్థం చెడదు. కాని, కెమ్మోవి (కెంపు + మోవి) లో కెంపు ఉన్నది కాబట్టి వెలది అన్న పదమే వచ్చింది. లేత + కౌను కాబట్టి తరుణి (లేతవయసుది) అన్న మాటనే వాడాడు.

అర్జునుడి బాణ ప్రయోగ నైపుణ్యం చూచి అతనిచేతికి కళ్ళున్నా యనుకున్నారు. అలాగే మనకవి పదప్రయోగ ప్రావీణ్యాన్ని చూచి, చేమకూర కలానికి భాషాజ్ఞాన మున్నది అని అనవచ్చును. పర్యాయపదాలెన్ని ఉన్నా, కల్పనకు తగిన ప్రత్యేకపదాన్ని ఆ కలము తనంతట తానే కవికి అందిస్తుంది.

ఇటువంటి సొగసునే ఉపమావాచక ప్రయోగాలలో గూడ చూడవచ్చు. సాదృశ్యమును తెలుపడానికి తమ్ముడు, స్నేహితుడు, పిన్నమ అని జయంతుని తమ్ముడు సోయగంబునజా. ఆమె ముఖము పిన్నమ పున్నమ చందమామకుజా, నారాయణుని 'ప్రాణ సఖుండు కృపారసమ్మునన్' మొదలయిన పట్టుల కవి సమయాలను, పౌరాణిక సంబంధాలను మేళవించి కవి ఎంతో ఆహ్లాదం కల్గిస్తాడు.

ఈ పరళి చమత్కారమే తిరస్కార పదాల్లో గూడ కనిపిస్తుంది. ఊదుకపోవు శంఖము నహో గళరేఖ, వంకల్ దీప్పు మనోజసాయకపులన్, జక్కవ కవకా చక్కట్లుదిద్దు మొదలయిన స్థలాల్లోని తిరస్కార పదాలు సందర్భశుద్ధితో విశేషార్థ సూచకంగా శోభిస్తాయి కాబట్టే ఈయన కవిత్వంలో అనేక పదాలు సాభిప్రాయాలై సహృదయులను రంజింపజేస్తుంటాయి.

జలరుహగంధి పీనుల పసల్ నవసంఖ్య సదేమిలె క్కనున్
చెలువ నఖాంకురాళి నెలచేడియ పైకము తానుచు క్కనుణా
............................................ (వి. వి. 1-37)

ఈ పద్యములో నవసంఖ్య ఒక అంకె (లెక్క), నెల చేడియ (చంద్రుడి భార్య - తార) ఒక చుక్క... ఇవి కవి సమయాలూ వాస్తవాలుగూడాను, ఆ పదాలనే కవి, గారడివానిలాగా, మార్చి అదేమిలెక్క అనీ. తా నుచుక్ అనీ. తిరస్కార పదాలుగా ఉపయోగించి అవునవిపించాడు. ఇటువంటి చమత్కారం చూపడములో మనకవి సిద్ధహస్తుడు. ప్రబంధ కవులు వాడుకచేసే ఉపమానాలను తిరస్కరించిన అన్ని చోటుల లోనూ ఇటువంటి సొగసును ఉంచకుండా ఉండడు.

మన కావ్యములో లెక్కకు మిక్కిలిగా పలుకుబడులను కవి ఉపయోగించాడు. వాటికి స్థూలంగా ఉన్న అర్థముతో, ఆ పలుకుబడులలో ఉన్న మాటల అర్థ చమత్కృతిని జోడించి ఏదో సంగీత రవాన్ని శ్రవణపేయంగా వినిపించేటట్టు తన మంత్రలేఖినిని ఉపయోగిస్తాడు, లలిత లలితమైన పదాలను మధుర మధురమైన అర్థాలతో చేర్చి అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని ప్రకటిస్తాడు.

ఆపాదమస్తకము అంటే పలుకుబడి అర్థము మొదటినుంచి చివరదాకా, సర్వత్రా, అని; కాని దానిలోని మాటలు పాద, మస్తకము అన్న వాటికి కాలు, తల అన్న అర్థాలున్నాయి. ఆ అర్థాలను గూడా జోడించి "ప్రకట శ్రీహరి యంఘ్రిబుట్టి, హరు మూర్ధం బెక్కి..." (వి. వి. 1-8) సహృదయుల కానందం కలిగించాడు.

మనలో ఒక నమ్మకముంది భర్త పెద్ద అపాయం తప్పించుకొని బయటపడితే అదంతా భార్య చల్లదనమే అనుకుంటాము కదా. శివుడు అగ్నిజ్వాలలు కక్కుతుండే విషం తాగి "బ్రతుకుట నీ చల్లదనంబున కాదే" అని గంగను అర్జునుడు పొగుడుతాడు. ఈ చల్లదనములో 'మంగళసూత్ర మహిమ'తో పాటు మంచుటోపీ (ice cap) అన్న వైద్య ప్రక్రియగూడా జోడించాడు.

విజయవిలాస కావ్యంలో అనేక పద్యాలు అనన్య సామాన్యమైన ప్రక్రమ నియమంతో మనోహరంగా సాగించడము సరసహృదయులైన పాఠకులు గుర్తించే ఉంటారు. "కేళికా సరసిలో దేలియాడుట జేసి శైవాల లత కొంత సాటివచ్చు, పుష్పమాలికలతో బొందుసల్పుట జేసి యెలదేటి గమి కొంత ఈడు వచ్చు...." వంటివి కొల్లలు. ఈలాంటిదే "ధారాధరము వెన్నుదన్ని పుట్టిన జాడ నున్న దీబింబాధరోష్ఠి వేణి..." ఈ రెండో పద్యంలో ఒక అర్థము ఉపమానమూ రెండో అర్థము ఆధిక్యము ఉంచి విచిత్రమైన చమత్కృతి కనబరిచాడు.

లోకోక్తుల ప్రయోగంలోను మనకవి అసాధారణ ప్రజ్ఞను ప్రదర్శించాడు; 'శివుడిటు రమ్మటంచు' మొదలయిన పద్యాలవల్ల యీ విషయం స్పష్టమవుతున్నది. తెలుగు పదాలను విరిచి అద్భుతంగా అర్థాలను, చమత్కృతులను వ్యక్తంచేసే నేర్పు చేమకూరకవిలో చెన్నొందినట్టు ఆంధ్రసారస్వతంలో మరే ఇతర కవికి అందిరాలేదు. "అమ్మకచెల్ల నా హృదయ మమ్మకచెల్లదు వీని కియ్యెడగా", "మనసు భద్రమయ్యె మన సుభద్రకు నేడు", మొదలయిన పద్య ప్రసూనాలు ఇందుకు ఉదాహరణాలు. ఇక శ్లేష- శ్లేషకవిత్వంలో

వెంకటకవి రామరాజ భూషణునికి ఎంతమాత్రం తీసిపోయేవారు కారు. తెలుగు పదాల శ్లేషను గురించి చెప్పాలంటే ఆంధ్ర కవీశ్వరులందర్నీ మించిపోయినవారు మన చేమకూరకవి. పెద్దలు చెప్పినట్లు మనకవి కుప్పతెప్పలుగా ఉపయోగించిన శ్లేషలు పువ్వులలాగా తమంతట అవే విడిపోతుంటాయి.

శబ్దార్థాలలో ఇంతటి ప్రాగల్భ్యం చూపిన ఈ కవి ఊహా చమత్కారం, విషయచిత్రణం, స్వభావ ప్రకటనం, ఔచిత్యపోషణం వంటి వాటిలో గూడ అందెవేసిన చేయి కందకంలో ప్రతిబింబిస్తున్న కోట బొమ్మలను చూచి ఆ రెండూ బాసచేసుకుంటున్నట్లు చిత్రించిన

"నీ సరియైన దేవ తటినిం గలఁగించెద, నీ వధంపుమా
నాసరి శేషపన్నగ ఫణానివహంబు" నటంచు నప్పురిన్
బాసలు సేసికొన్నవన ఖాసిలు సాలశిఖాళి ఖేయముల్ ;
మోసమె యైన, విష్ణుపదమున్ బలిపీఠము ముట్టనేటికిన్ (వి వి. 1-70)

పద్యంలో సారస్వత విశేషంతో శత్రుదమన నీతిని మేళవించడము రమణీయమూ, ఆహ్లాదకరమూ కాదా!

ఉలూచి ఘట్టములో నంతటా భావసంచలనమూ, మనః పరిణామమూ, మొదలయిన విశేషాలను - చెప్పి కొంతా, చెప్పకుండా కొంతా, ప్రకటించిన నేర్పు అద్వితీయ మనక తప్పదు.

చక్కెరబొమ్మ, నావ్రతము చందముదెల్పితి, నంతెకాక నీ
చక్కఁ దనంబు గన్న నిముసం బయిన న్నిలుపోప శక్యమే
యక్కునఁ జేర్ప'కంచు దయ నానతియీఁ, దలవంచె; నంతలో
నెక్కడనుండివచ్చెఁ దరళేక్షణకున్ నునుసిగ్గు దొంతరల్ !" (వి. వి 1-169)

వాదోపవాదాలలో ఉన్న ఉలూచికి, అర్జునుడు 'నిలుపోప శక్యమే' అనగానే, అంతవరకు లేనిసిగ్గు ఒక్కసారి అలముకొనడం సహజమూ, సమంజసమూ, ముగ్ధ మనోహరమూ అని వేరుగా చెప్పనక్కరలేదు

చేమకూర వేంకటకవిలో ప్రస్ఫుటంగా కనుపిస్తున్న మరొక విశిష్టమైన గుణం ఔచిత్యపోషణం. ఈ ఔచిత్యం పాత్రల నిరూపణలలోనూ, కథ కథనంలోనూ ఒక్కరీతిగా, హృదయానందకరంగా కాన వస్తుంది. ఏకాంతపువేళ ద్వారవతియందలి వార్తలు తెల్పుచు "తటిత్ కాంతి మనోహరాంగులగు కన్నెల చక్కదనంబు నెన్నుచున్"— కన్నెలు అని చెప్పినందువల్ల, అవివాహితలు కావడంచేత, ఔచిత్యం చక్కగా నిలిచింది గ్రంథారంభంలో గదుని పంపించింది మొదలు గ్రంథాంతంలో మేనల్లుడు అభిమన్యుడిని బహూకరించినంతవరకు కృష్ణుని పాత్ర కథ నడిపే సూత్రధారివలె ఆయా సన్నివేశాలందు ఉచితభంగి ప్రవర్తించడం శ్లాఘనీయం ఇక కథా కథనంలోని ఔచిత్యాన్ని అవలోకించండి: కథ ముందుకు సాగక నిలువవలసిన సన్నివేశాలందు వర్ణన చమత్కారాలను ఎంత చూపుతున్నా, కథాగమనం ఉన్న పట్టులలో మాత్రం కవి ఆ వర్ణనోత్సాహాన్ని చూపక కథ ఔచిత్యాన్ని కాపాడుతుంటారు. సుభద్ర అర్జునుడి చేతిని విడిపించుకుని పోవడం రుక్మిణి మొదలయిన వారు తెలుసుకొన్నప్పటి నుండి కథ అతిత్వరితగతిలో సాగ వలసి ఉన్నది కాబట్టి కవి వర్ణనా వ్యామోహాన్ని విడిచిపెడతారు; ఈ విధంగాచేయడం కథనము ఔచిత్యాన్ని పోషించడానికే అని చెప్పాలి. ఇటు చెలికత్తెల హాస్య సల్లాపాలు, అటు కృష్ణుని పన్నాగాలు, ఇంద్రాదుల రాక, పెళ్లితొందర, నాగవల్లికి ముందే వధూవరులు ఇంద్ర ప్రస్థం పోవడం మొదలయిన సంఘటనలు ఒక దానిని నెట్టుకొని మరొకటి వస్తున్న ఈ ఘట్టంలో తీరికగా నిలిచి వర్ణించడానికి పూనుకొనడం అవలక్షణమే అవుతుంది. అటువంటి అవలక్షణాన్ని అనుసరించకుండా మనకవి ఔచిత్యాన్నే ప్రధానంగా భావించి విషయ చిత్రణ కావించారు.

ఈ సాధన సంపత్తిని సమకూర్చుకోవాలనే ప్రయత్నంతో నిఘంటువుల్ని చూచి కావలసిన పదాలను కవి ఎంచుకున్నాడన గూడదు. శబ్దవ్యుత్పత్తి పరిజ్ఞానంవల్ల, అభ్యాసబలంవల్ల ఆ యా పదాలు, లోకోక్తులు మొదలయినవి అప్రయత్నంగా, అనాయాసంగా, అకుంఠితమైన ఒక మహా ప్రవాహంగా చేమకూరకవి కలందగ్గరకు దొర్లికొని వస్తుంటాయనడం సమంజసంగా ఉంటుంది. ఇటువంటి వారినే వాక్సిద్ధులు అనీ సిద్ధవాక్కులనీ అంటారు ఈ అభిప్రాయాన్నే రఘునాథరాజు 'వాఙ్మయమరూఢి నీ యంతవా డికేడి' అన్న వాక్యంతో ధ్రువపరిచాడు.

## 'వ్యాకరణ దోషాలు' :

'అటు జూపిటు ఇటు జూపటు' వంటి క్త్వార్థక ఇకార సంధి, 'ఊదుక' అని 'కొను' ధాతువుకు బదులుగా 'క' ను ఉపయోగించుట, 'వాదునకు' అని అనడానికి బదులుగా 'వాదుకు' అని నగాగమము లేకుండా ప్రయోగించడం, 'లేనెలయంత' అనడానికి 'లేనెలంత' అని అత్వసంధి వాడడం, 'బంతి ఇది' అనడానికి బదులు 'బంతిది' అని ఇత్వసంధి చేయడం, 'వెన్నుని అన్నన్న' వంటి నుగాగమము లేని ప్రయోగం మొదలయిన వాటిని వ్యాకరణదోషాలుగా కొందరు పరిగణించారు. ఇటువంటి సంధులు పదిహేడవ శతాబ్ది ఆంధ్ర వాఙ్మయానికి కొత్తకావు, శ్రీనాథుడు, ముక్కుతిమ్మన, పింగలి సూరన, రామరాజ భూషణుడు, అల్లసాని పెద్దన మొదలయిన ఉద్దండ కవీశ్వరులే కాకుండా సాహిత్య శాసనకర్త అప్పకవి కూడా ఇట్టి ప్రయోగాలను చేసినవాడే. అందువల్ల చేమకూరకవిని ఈ వ్యాకరణ దోషాల వివాదంలో ప్రత్యేకంగా సమర్థించవలసిన అగత్యం మనకు ఏమీ లేదు. తెలుగు పదాలలోని లాలిత్యం చెవులకు విందుచేసే ధ్వని జ్ఞానాన్ని వెన్నతో పెట్టినట్టుగా తెలుసుకున్న ఈ కవులు ఉద్దేశపూర్వకంగాచేసిన ఈ శాస్త్రోల్లంఘనం సాహిత్య శాసనోల్లంఘనం – సహేతుకమే అని చెప్పక తప్పదు ఇకను వ్యాకరణదోషాలు అంటే 'వ్యాకరణాలు చేసిన తప్పులు' అని అర్థం చేసుకోవాలి.

## ఒక స్వల్ప విషయం :

ఈ మధ్యను అక్కడక్కడ తెలుగుభాషా అధ్యాపకులు కొందరు నేను కనబరిచిన చేమకూర విశేషాలను తమ "స్వంతం చేసుకుంటూ" ఉన్నారని నా శ్రేయోభిలాషులు కొంతమంది కొంత బాధపడి నాతో చెప్పారు అట్టివారికి నేను "మనము దేశమంతటా తిరిగి ఈ విశేషాలగురించి శతాధికంగా సభలలో ఉపన్యాసాలిచ్చాము; పత్రికలలోనూ సంచికలలోనూ ఎన్నో వ్యాసాలు ప్రకటించాము, పెద్దలతో వాదోపవాదాలు పెట్టుకున్నాము; రేడియో నెలకొల్పినది మొదలు ఎన్నో ప్రసంగాలు చేశాము ఈ కారణాలవల్ల ఆ విశేషాలను ప్రజల సొత్తుగానే భావించాలి. అదీకాక, మనము తలపెట్టిన కార్యము చేమకూర పాకరుచులను తెలుగు సాహిత్య పాఠకులకు తెలియచేయడమే కదా. ఆ కార్యాన్నే ఆ అధ్యాపకాది మహాశయులు పరోక్షంగా నెరవేరుస్తున్నారు, దీనికి చింతించడ మెందుకు ?" అని చెప్పి శాంతించమంటాను.

## నాటకీయ రచన :

ఆ దినాలలో తంజావూరు నాటకాలతోనూ, యక్షగానాలతోనూ. నాటకశాలలతోనూ నిత్యవినోదముగా ఉండేది. వాటి పరిచయంవల్ల మనకవికి నాటకీయరచన అలవడ్డదనీ, దాని ప్రభావం విజయవిలాసంలో బాగా కనిపిస్తూ ఉందని చెప్పవచ్చును. కృతిపతి వంశవర్ణన ప్రవేశ పెట్టడానికి ముందు గంగను స్తుతించి, ఆ గంగ తోబుట్టువులైన నాయకరాజులను గూర్చి చెప్పాడు. గదుడుచేసిన వర్ణనతో సుభద్ర తన ముంగల నిల్చినట్టు భావిస్తున్న అర్జునుడి దగ్గరకు ఆ బ్రాహ్మణుడు తన ఆవును దొంగలెత్తుకుపోయారని చెప్పడానికి

వస్తాడు. కృష్ణుడు అర్జునుడు ఎక్కడా తమ యెత్తునుగురించి మాటలాడుకోరు. అలాగ రహస్యంగా ఉంచడం వల్ల ముందు ఏమి జరుగుతుందో తెలుసుకోవాలన్న ఆసక్తి పాఠకులకు కలుగుతుంది. ఇది నాటకీయ సస్పెన్సు (suspense) విధానము.

కృష్ణుడు ఈ కావ్యములో లేని దైవమహిమను ప్రదర్శించడు అర్జునుడు కృష్ణుడిని తలచుకున్నంతలో కనబడతాడు.

> అప్పుడు సామి తాఁ దలఁచి నంతనె వచ్చెనటంచు విస్మయం
> బుప్పతిలంగ... (వి. వి, 2-85)

సంతోషిస్తాడు. దీనిని దైవమహిమే అని అననక్కరలేదు. ఈలాంటి కాకతాళీయ ఘటనలు జరుగు తుంటాయి. దీనినే సంకల్పబలమని కొందరంటారు.

ఈ కావ్యములో కృష్ణుడు చాలా దూరాలోచనగల గొప్ప బుద్ధిమంతుడు. కార్యసాధనకు కావలసిన ఏర్పాటులన్నీ చేసి, తనకేమీ జోక్యము లేనట్టుండగల కార్యసాధకుడు. అత్యద్భుతమయిన నటనకు కవి మంచి అవకాశముంచాడు. కావ్యములో ఈ భాగమంతా నాటకమే. నటుడికి కవి ఇవ్వవలసిన సూచనలను గూడ చాలచోట్ల ఇవ్వలేదు. ఈ విధంగా stage directions ఇవ్వకపోవడం పెద్దపెద్ద నాటక కర్తల రచన లలో కనిపిస్తూఉంటుంది.

## సందేహాంతాలు

వేదమువారితో పండితులు చెప్పినట్లు ఈ కావ్యములో రెండు మూడు ఘట్టాలు, ఎంత ప్రయత్నము చేసినా, సందేహాంతచర్యలకు కారణాలయి, పరిపూర్ణానుభవానికి రాలేదనే అనవలసివచ్చింది.

మనకవి పలుకుబడులూ సామెతలూ ఉపయోగించినప్పుడు వాటి స్థూలార్థముతోపాటు ప్రతి పదార్థా లను గూడా జోడించి చక్కని చమత్కారం కనబరుస్తుండడం చూచి సంతోషించాము. కాని, ఈ పద్యం చూడండి.

> ఈ కలహంసయాన నను నెక్కడి కెక్కడనుండి తెచ్చె
> ....................జంపుమాటలన్
> వ్యాకులపెట్టు టేల ? విరహాంబుధి ముంచకపోదునన్ ; జలం
> బే కదనీకు మంచి దిఁక నీఁతకు మిక్కిలి లోఁతు గల్గునే (వి. వి, 1-167)

ఇది ఉలూచి నిరాశచేసుకొని అనిన విషయం. దీనికి స్థూలంగా అర్థం చెప్పుచున్నాము. కాని దీని చమత్కారార్థ ములో ఈత ఏమిటి ? ఈదేవా రెవరు ? లోతు ఏమిటి ? పద్యంలో అంబుధి, ఈత, లోతు, జలంబు అన్న పదా లున్నందుకు చాలినంత తృప్తి నిచ్చే అర్థం కనబడలేదు.

అలాగే మరొక పద్యములో "ఈదడం" గురించి ఉన్నది.

> మీదన్ వియోగ సాగర మీదంగలవా లతాంగి
> ............అన్న పద్యములో

ఈఁ దాశన్నను మదనుఁడు
కోఁదాడను వాడు, బిగువు కొనసాగ౽నొకో ? (వి వి. 2_192)

అని అర్జునుడు సుభద్రతో అంటాడు. ఇక్కడ గూడా స్థూలార్థము సరిపోయినా, చమత్కారార్థము తృప్తి కరంగా కుదరలేదు. ఈదు అన్న అర్థంలో ఈదాడు అంటే, 'ఈదాడి' అని అన్నట్లుగా భావించి మదనుడు 'కో దాడి' (=తీసుకో - కాచుకో నా దాడి) అంటాడు; కో=కొనుము అని అర్థముంది. లేదా! యుద్ధావేశంలో 'కో' అని అరవడం ఉన్నది కదా; మదనుడు కో అని అరచి 'దాడి' అంటాడు అని మిత్రులు పార్లికేయులు శ్రీ బి. రామచంద్రరావుగారు సూచించారు. వారికి నా కృతజ్ఞత ఇదీ తృప్తికరంగా లేదుకదా!

ఈ విధంగానే సంతృప్తి నియ్యని పలుకుబడి :

పోటు గంటుల దూఱి పోవు దామణమైన
.........మూస్థిలగమి యెందు ప్రగ్గిపోయె ? (వి వి 1_42)

అన్న చరణంలో మొదటిది. పోటుగంటుల దూరిపోవడం ఒక గొప్ప సాహసకార్యమని స్థూలంగా చెప్పు కున్నాము. ఈటె పోటువల్ల కలిగిన గంటులో దూరిపోవడమని అనుకోలేము అయినా, పింగలి సూరన్న 'కలాపూర్ణోదయ' కావ్యములో కలభాషిణిని వర్ణిస్తూ —

చెఱకులఁ జిమ్ముచుం గలికి బిత్తరిచూపు సరత్న కుండలాం
చల కషణోజ్జ్వలత్వము పస న్నెఱపఁగా జళిపించుచుఁగా బొఱుం
గులహృదయస్థలు ల్వ్రోడిచి కొంచక తోడన పోటుగంట్లఁ దూ
ఱె లలన, యౌర, యొక్కొక తఱిఁగా ఖువుఁ బోండ్లు కటారి కత్తియల్
(కళాపూర్ణోదయము 1_32)

అన్నాడు, దీనిలో కలాభాషిణి చూపు శూలాలతో విటుల హృదయస్థలాలను పొడిచి, వెంటనే ఆ పోటు గంటిలో దూరిపోయిం దన్న భావముంది,

"ఉదయాద్రి యెరగలి నొరసి... అన్న పద్యములో మనకవే

క్రౌంచాచలము పోటుగంటి దూఱిన రాజ
హంసముల్ వడి హాళాహళులుసేయ
......................... (వి. వి. 3_25)

పోటుగంటుల దూరివచ్చిన హంసలు విరహములో ఉన్న సుభద్రార్జునులను వేధిస్తున్నాయని అన్నాడు. పైది సాహసమయితే ఇది క్రౌర్యము. సంతృప్తి కుదరకుండా ఉందికదా! కవి లోపమా ? మన లోపమా.

## అర్థంలేని అపవాదాలు :

ఈ రీతిగా, బహుభంగుల ప్రశంసలకు పాత్రమైన గ్రంథ రాజాలతో ఆంధ్ర సారస్వతాన్ని అలంక రించిన చేమకూర వేంకటరాజు సంకర సంజాతుడనీ, భోగినీ పుత్రుడనీ కొన్ని అపవాదాలు ఉన్నాయి తాను 'లక్ష్మణామాత్య (నియోగి బ్రాహ్మణ) తనూభవ' అని చెప్పుకోవడమూ. ఆ రఘునాథరాజు ఈయనను 'క్షత్రధర్మమె నీకు కలది మొదట' అని అనడమూ ఈ అపవాదాలకు కారణం. ఇందులోని అసందర్భాన్ని ఆధారంచేసుకొని చేసిన ఊహాగానమే ఈ వదంతి. ఈ వదంతికి తగిన ఆధారాలను ఎవ్వరూ చూపలేదు,

భోగినీ పుత్రుడయి ఉంటే రఘునాథరాజువంటి విద్వత్ప్రభువు 'నన్ను నడిపిన బహుళ సన్మానమెంచి' అని కవి అనడానికి బహుళ సన్మానం చేస్తాడా? లక్ష్మణామాత్యునికి ఆయన ఉంపుడుకత్తె మీద ఎంత మక్కువ ఉన్నా తమ ఇద్దరికి పుట్టిన కొడుకుకు ఇంటిపేరు గూడ ఇస్తాడా? ఇస్తే బంధువర్గం ఊరుకుంటుందా? ఈ అపవాదుకు మరొక కారణంగా, అమరావతి వాసిరెడ్డి వెంకటాద్రినాయని కొలువులో ఉన్న బుచ్చివెంకు చెప్పినట్టుగా ప్రచారంలో ఉన్న ఈ క్రింది పద్యాన్ని ఉదహరిస్తున్నారు

"పన్నిన సత్ప్రబంధమున బాగును సోగును జూచ కిసు చే
మన్ననమాలి మాకులము మాటుదలంతురు; చేమకూర వెం
కన్నకు లోపమేమి? కులమా కవనానకు? వేంకటాద్రి రా
జన్న! గణించి మీరలు దయామతిఁ బ్రోచిననాకుఁ జాలదే"

ఈ పద్యంలో చేమకూరకవి భోగినీ పుత్రుడని నిర్ణయించడానికి తగిన ఆధారం లేదు.

కవి తాను వేశ్యాపుత్రుడే అయితే పరమదుర్మార్గురాలిగా వర్ణించిన చిత్రాంగిని తన 'కులం'లోని కాంతగా చేయడానికి సిద్ధపడతాడా? (చిత్రాంగి రాజకుమార్తె అనీ, ఏ కారణంచేత అయితేనేమి, రాజనరేంద్రుని చిన్నభార్య అనీ ఒక అభిప్రాయం ప్రచారంలో ఉన్నప్పటికీ ఈ కవి చిత్రాంగిని 'భోగకుటిల శిరోజా తిలకము'ను చేసి తన వంగడము అంతటికి అధికతరమైన అపయశాన్ని చేకూర్చ సిద్ధంకాడు కదా!) ఇప్పటికీ చేమకూర అని ఇంటిపేరున్న తెలగ (ఆంధ్ర క్షత్రియ) కుటుంబాలు ఉండడం ఆ ఇంటిపేరున్న వేశ్యా కుటుంబాలు కానరాకపోవడం, రఘునాథుని 'క్షత్రధర్మమెకద నీకు కలది మొదట' అనే మాటలకు అత్యంతమైన బలాన్ని కల్గిస్తున్నవి. ఏమయినా సహృదయలోకానికి కావలసింది చేమకూర వాని కవిత్వమే కాని కులం కాదు. అయినా భోగినీ సంజాతుడని చెప్పడం కేవలం సంకుచిత మనస్తత్వ సంజనితమైన అన్యాయం అని మాత్రం సహృదయులు గుర్తించాలి.

## పండిత ప్రమాదము

మరొక ఘోరమైన అపవాదముగురించి మనవిచేస్తాను. దీనికి 'పండిత ప్రమాదము' అన్న పేరు పెడదాము. ప్రమాదము అంటే, సంస్కృతములో 'పొరపాటు - ఏమరుపాటు' అన్న అర్థమూ, తెలుగులో 'ఆకస్మికంగా కలిగిన ఆపద - గండము' అన్న అర్థమూ, రెండూ ఉన్నాయి.

కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1950 లో తిరుపతినుంచి "సుభద్రా కల్యాణము" అన్న పేరుతో 56 పుటలున్న స్త్రీలపాటను (దీనిని శాస్త్రిగారు 'గేయకృతి' అన్నారులెండి) ప్రచురించారు. దానిని తాళ్ళపాక తిమ్మక్క వ్రాసిందనీ, ఆ తిమ్మక్క సంకీర్తనాచార్యుడన్న ప్రఖ్యాతిని గడించిన తాళ్ళపాక అన్నమాచార్యుల భార్య అనీ, ఆమె 'సంగీతసాహిత్య చతుర'అనీ, ఆమె రచనలోని కొన్ని పలుకుబడులను చేమకూర తన విజయవిలాసములో చేర్చుకున్నాడనీ శాస్త్రిగారు కొన్ని నిర్ణయాలు చేశారు. ఈ నిర్ణయాలన్నీ నిరాధారాలూ సత్యదూరాలూను.

ఇది మొదటి సంస్కృత ప్రమాదం - ప్రభాకరశాస్త్రిగారిది - పొరపాటు.

సాహిత్యపరిశోధన బస్సును నడుపుతూ, శాస్త్రిగారుచేసిన ఈ పొరపాటు (ప్రమాదము) వల్ల ఆ బస్సు బోల్తాపడడమూ దానిలో ప్రయాణిస్తున్న ఆంధ్రభాషా పండిత ప్రకాండులు సర్వశ్రీ పింగలి లక్ష్మీకాంతకవి, దివాకర్ల వెంకటావధాని, నిడుదవోలు వెంకటరావు, తిరుమల రామచంద్రాచారి, తిమ్మావఝ్ఝుల

కోదండరామయ్య, చాగంటి శేషయ్య, ఆపుచ్ఛుబాణగిరి రాజమ్మ... మొదలైనవారందరూ వారివారి రచనలలో దెబ్బతినడమూ సంభవించింది.

ఇది రెండో (తెలుగు) ప్రమాదము - అపాయము.

తొలి ప్రమాదానికి శాస్త్రిగారి నేమీ అనలేము. వారికి తాళ్ళపాకవారనినా, అన్నమాచార్యులనినా అపారమైన గౌరవమూ అత్యంతమయిన అభిమానమూ కలుగుతుంది. వారి ముద్రణలో

"అవనిలో తాళ్ళపా కన్నయ్యగారి
తరుణి తిమ్మక చెప్పె తాను సుభద్ర
కల్యాణ మను పాటకడు మంచితేట
పలుకులు....

అని చివరనుండడమువల్ల ఆ అన్నయ్య 1408 లో జన్మించి 90 సంవత్సరాలకు పైగా జీవించిన సంకీర్తనాచార్యులే అనీ, అతని భార్యయే ఈ తిమ్మక్క అనీ, ఈ పాటను శాస్త్రిగారే ప్రప్రథమంగా అచ్చువేసి ప్రకటిస్తున్నారనీ అనుకున్నారు. ఆ భావముతోనే ఆ తిమ్మక్కను సంగీతసాహిత్య చతురను చేశారు.

బస్సులో దెబ్బతిన్నవారిని గూడ ఏమీ అనలేము. శాస్త్రిగారు గట్టి సాహిత్య చారిత్రక పరిశోధకులనీ, ఎన్నో పరిశోధనల నూతన విషయాలు ఆంధ్ర వాఙ్మయానికిచ్చినవారనీ వారెరుగుదురు. ఆ నమ్మకముతోనే వారిటీవల శాస్త్రిగారి పొరపాటునే యథార్థమనుకొని తమ రచనలను సాగించారు. అంతేగాని ఈ పండితులు స్వయంగాచేసిన నిర్ణయాలనుబట్టి వ్రాసిన వ్రాతలుకావు. దీనినిపట్టి ఇన్నాళ్ళూ ప్రథమకవయిత్రిగా గణన కెక్కిన మొల్ల మూల చేరింది. 'క్షితిలో నీ మార్గ మెవరికీ రాదనుమీ' అని పండిత కవుల ప్రశంసలను పొందిన చేమకూరకవికి చేటుకలిగింది

శాస్త్రిగారెరగనిదీ, జరిగినదీ, ఏమిటంటే, 1910 లో కాకినాడ, కమలా ముద్రాక్షరశాలవారు ఈ పాటను "స్త్రీల కత్యంతోపయోగముగ ప్రాచీన† కవిపుంగవులచే రచింపబడిన సుభద్రా కల్యాణము..." అని ముద్రించారు. దానిలో చివరను

వెలయ కృష్ణుని పేర విఖ్యాతిగాను
ప్రబల పార్థుని పేర అంకితంబుగను
వరకవి తాళ్ళపాక తిమ్మప్ప
చెప్పెను విష్ణుకథ జగతిలోపలను
యువిదలందరు గూడి సంతసముతోడ......

దీనిని శాస్త్రిగారి లాగా 'తీర్చిదిద్ది'తే, 'వరకవీశుడు తాళ్ళపాక తిమ్మప్ప' అవుతుంది. దీనినిపట్టి చూస్తే ఈ పాట తిమ్మప్ప అన్న మగవాడు వ్రాసినట్టు తేలుతుంది. ఆనాడు కాకినాడ వారికి దొరికిన ప్రతి ఎక్కడిదో మనకు తెలియదు. ఆ కాకినాడ ప్రతికీ శాస్త్రిగారి ప్రతికీ భేదము చాల స్వల్పముగా ఉంది. శాస్త్రిగారి ముద్రణలో ఉన్నట్టుగానే ఈ కాకినాడ ముద్రణలో గూడా 'ఎగుబుజంబులవాడు...' అన్న చరణభాగాలు కనబడతాయి. అవి చూచే శాస్త్రిగారు 'చేమకూరకవి' అనుకరించాడన్న పొరపాటుపాలయారు. ఈ తిమ్మప్ప ఎప్పటివాడో, ఎక్కడివాడో తెలుసుకోడానికి మార్గము లేదు.

---

† ఈ పుస్తకము డాక్టర్ బి. రామరాజు, యం.ఏ., పియెచ్.డి. వారు తమ వాఙ్మయ పరిశోధనలో సంగ్రహించిన సహస్రాధిక సంఖ్యగల జానపదగేయాలలో ఉంది. వారికి నా కృతజ్ఞత.

ఇంకొకవిషయం : స్త్రీలపాటలు వేలసంఖ్యను మనదేశంలో ఉన్నాయి. వీటిలో నూటికి తొంభై తొమ్మిదీ ముప్పాతిక పురుషులు వ్రాసినవే. కొందరు తమ పేరులను పాటలలో చెప్పుకున్నారు ; కొందరు లేదు. తిమ్మక్క కాలము క్రీ. శ. 1430 ప్రాంతము కదా. ఆ దినాలలో మనదేశంలో రాజకాంతలు, వేశ్యలు, నాట్యకర్త్రులు మొదలైన వారికి మించి సామాన్యకుటుంబాల స్త్రీలకు విద్యను నిషేధించేవారు. ఏమయినా ఈ పాట తిమ్మక్కే వ్రాసిందనుకున్నా ఆ తిమ్మక్క సంకీర్తనాచార్యులైన అన్నమాచార్యుల భార్య మాత్రము కాదు. ఎవరో అన్నయ్య (అన్నమాచార్య అనిగాని సంకీర్తనాచార్య అనిగాని అనలేదు) తాళ్ళపాక వంశమువారిలో అన్నయ్య అన్న నామము కలవారు చాలమంది. తరతరాలలో ఉంటారుకదా. ఏడుకొండలవాని మీదభక్తిగాని, నిత్య నూతన సంకీర్తనలలో వెంకటేశ్వరుని కీర్తించి 30,000 లకు ఎక్కువగా కీర్తనలు వ్రాసిన అన్నమాచార్యులయందు భక్తిగాని ఆమెలో శూన్యము. సుప్రసిద్ధుడైన భర్త, ఉద్దండ పండిత కవులయిన కొడుకులు మనుమలు – ఊరంత బలగముతో కాపురముచేస్తున్న గృహిణి చెప్పరాని విషయా లీ పాటలో ఉన్నాయి. కొన్ని వర్ణనలలో పురుషహస్తము గోచరిస్తుంది. మనుమడు – చిన్న తిరువెంకటనాథుడు (చిన్నన్న) సంకీర్తనాచార్యుల చరిత్రము ద్విపదకావ్యంగా వ్రాస్తూ వారి కుటుంబం గురించి వ్రాసిన చోటనయినా తిమ్మక్క సంగీత సాహిత్యాలు తెలిసినదానిగా చెప్పలేదు.

ఈ పాట చేసినవారు అన్నమాచార్యుల భార్య తిమ్మక్క అయినా, కాక, ఆరుద్ర$గారు చూపించిన మరొక తిమ్మక్కయినా, మరే అన్నయ్య భార్యా అయినా, అటూకాక, తిమ్మప్ప అన్నకవే అయినా, వారు 17 వ శతాబ్ది తరువాతివారేగాని పూర్వులుకారని నిర్ధారణ చేయడానికి తగిన ఆధారాలు శాస్త్రిగారి ముద్రణలోనే ఉన్నాయి.

శాస్త్రిగారు పరిష్కరించి తీర్చిదిద్దిన ముద్రణలో (1.) 39 వ పుటలో చివరనుంచి 8 వ చరణము

మురవైరివందిత మువ్వగోపాల
నారద వినుత యానంద ముకుంద...

అని ఉన్నది. మువ్వగోపాలుడన్న పేరు దేశవ్యాప్తంచేసిన క్షేత్రయ్యగారు 1650 ప్రాంతాలలో నుండినవారు. వారి మువ్వగోపాలుడు 1430 ప్రాంతంలో ఉండిన తిమ్మక్కకెక్కడ దొరికాడో తెలియదు. ఈ చిక్కు గుర్తించే శాస్త్రిగారు "అది (మువ్వగోపాల అన్నమాట) మువ్వపురి గోపాలుని( జేర్కొనునది యన గాదు. క్షేత్రయ్య 'మువ్వపురి గోపాలా' యని చెప్పెనుగాన యది యట్లే అనవలెను" అని తమ ముద్రణ పీఠికలో వ్రాసి తప్పించుకొనజూచి ఏదో విపరీతమైన అర్థము చెప్పారు.

లాభములేదు. ఎందుచేతనంటే శాస్త్రిగారే 1949 లో ముద్రించి ప్రకటించిన "అన్నమాచార్య చరిత్రము" అన్న ద్విపద కావ్యపీఠికలో (పుట 101) ఇలా వ్రాశారు :

"తాళ్ళపాకవా రాయాదేవతలకు( దిరుపతి వేంకటేశ్వరునితో న
భేదము గల్పించి వెంకటేశ్వరనామముద్ర యుంచినట్లు క్షేత్రయయు
నాయాక్షేత్రముల దేవతలకు మువ్వగోపాలునితో నభేదము గల్పించి
మువ్వగోపాల ముద్రను సంకీర్తనములకు( గూర్చెను..."

వేరు వ్యాఖ్యాన మవసరములేదనుకుంటాను.

$ఆరుద్రగారి 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' సం. 10 – పుట. 122 లో మరొక తిమ్మక్క పేరు చూపించారు.

ఇంతేకాదు ; ఇంకొక్కటి ఉన్నది : శాస్త్రిగారి ముద్రణలో 53 వ పుటలో ద్రౌపది సుభద్రను శోభనపుగదికి తీసుకొనివెళ్ళి

అనుచు సుభద్రను అతివతోడ్కొనుచు
విజయుని పొన్పున వేడ్కతో నుంచె.
తలుపులు మూసికొని తరుణి యేతెంచె.
తలపోసె మనసులో తాళంగలేక
యేమివస్తువు లయిన నియవచ్చు గాని,
ప్రాణేశు నిచ్చి మరి బ్రతుకంగరాదు...

అని సాక్షాత్తు ముద్దుపళని వ్రాసిన రాధికా సాంత్వనములో నున్నట్టుగానే అన్నది. ఈ రచన 1430 ప్రాంతానిదెలా అవుతుందో తెలియదు. దీనిని సహృదయులు సమర్థించగలరా ?

దీన్నంతటినిపట్టి చూస్తే, ఈ శ్రీలపాట ఏ తిమ్మక్క వ్రాసినా, తిమ్మప్ప వ్రాసినా, ఎవరైనా, వారు 17 వ శతాబ్ది తరువాతివారే అవుతారు కాబట్టి వారే విజయవిలాసములోని పలుపలుకుళ్ళనూ "ఎగుభుజంబులవాడు..." వర్ణనలనూ ఎత్తి తమ రచనలో ఇరికించుకున్నారని నిష్కర్షగా చెప్పవచ్చును.

మనకవి ఛాయాచోరకుల పని రానుచేయడనీ, స్వతంత్ర విధానాలనే అవలంబిస్తాడనీ, అనుకరణలలాగా కనిపించే పద్యాలలో తన ఆధిక్యము రుజువుచేస్తుంటాడనీ మనకు తెలుసునుకదా.§

విజయవిలాస కృతి సమర్పణ జరిగినతరువాత మనకవి సారంగధర చరిత్రను గూడ కావలసిన మార్పులతో, కూర్పులతో సంపూర్ణమైన గ్రంథంగా సిద్ధంచేసి రఘునాథరాయలకు అంకితం ఇవ్వాలని ఉద్దేశించి ఉంటాడు. కాని ఆ ఉద్దేశం నెరవేరక ముందే ఆయన కీర్తిశేషుడయి ఉంటాడని భావించడం తప్పుకాదేమో. కృతి ఇచ్చినా ఇవ్వకున్నా, అనేక విధాలయిన రసాలను ఎంతో నేర్పుతో పోషించుకొంటూ రచించిన 'సారంగధర'ను వెలుగులోనికి రానివ్వకుండా అణచివేయడానికి ఎవరైనా సమ్మతిస్తారా ; కాబట్టి 1620–30 ప్రాంతంలో, అనగా దాదాపు అరవై సంవత్సరాల వయసుతో చేమకూర మహాకవి అస్తమించి ఉంటాడు.

## ప్రశంసా పద్యాలు :

రఘునాథరాజు పాండ్యతుండీరాది ప్రభువులతో జరిపిన యుద్ధాలలో విక్రమ విహారంచేసి తంజావూరును శత్రువర్గానికి దుర్నిరీక్ష్యం కావించిన తరువాత, విజయవిలాస భవనంలో ఏర్పాటయిన ప్రశంసా మహోత్సవంలో చేమకూరకవి గూడ 'సమరనిశ్శంక రఘునాథ సాహసాంక' అనే మకుటంతో కొన్ని పద్యాలను పఠించి ఉంటాడు. ఆ పద్యాలలో ఏడింటిని విజయవిలాస కావ్యంలోని అవతారిక పద్యాలలో చేర్చుకొన్నాడు. తాను ప్రత్యక్షంగా చూచిన చారిత్రక విషయాలు పాఠకులకు తెలియజేయడానికే ఈ విధంగా

§ఈ వివాదం కొంత సాగుతుందన్న అభిప్రాయముతో కాకినాడ 1910 ముద్రణ కాపీనీ, శాస్త్రిగారి 1950 ప్రతినీ, కాళహస్తి నుంచి వేటూరివారి దగ్గరకు వచ్చిన తాళపత్ర గ్రంథం కాపీనీ నేను సంపాదించుకున్నాను. ఇక్కడ నేను చేసిన నిర్ణయాలకు ఆధారాలు వాటిలో ఉన్నాయి. పరిష్కరించడం, తీర్చిదిద్దడం అంటే ఏమిటో వాటినిబట్టి తెలుసుకోవచ్చును. స్థలాభావమువల్ల వాటినిక్కడ తడవలేదు.

చేసి ఉండవచ్చు. ఆ విధంగా జరిగినా, జరగకుండినా ఆ పద్యాలలోని విషయాలు అతిశయోక్తులు మాత్రం కావు; అవి యథార్థాలు, చారిత్రక సత్యాలు అని ఇటీవల ప్రచురింపబడ్డ చారిత్రక పరిశోధనలనుబట్టి శంకింప తావులేకుండా రుజువైనది.

దక్షిణాదిలో ప్రబలిన ఆంధ్రవాఙ్మయము అంతా అధమజాతికి చెందినట్టిదనీ, ఆ కాలపు వాఙ్మయం సాహిత్యచరిత్రలో క్షీణయుగం అనీ కొందరు నిశ్చయించారు. అందుకు తగినట్లు ఆనాడు వెలువడిన ప్రబంధాలు కొన్నిటిలో శృంగారరసము ప్రధానరసమై, పచ్చిపచ్చి వర్ణనలే కావ్యభాషాలంకారాలయి కనుపిస్తాయి.

అటువంటి నికృష్ట గుణసమయంలో చేమకూరకవి తన రచనా నైపుణ్యంతో, సభ్య శృంగార వర్ణనలతో మూడు వలపుల కథలను కావ్యంగా, కమనీయంగా రూపొందించాడు.

స్వయంకృషి :

> స్వయంకృషివల్ల పేరు ప్రతిష్ఠలు ఆర్జించి, ఉన్నత స్థానాల నలంకరించి, మాతృదేశానికి మాతృభాషకూ మహోపకారంచేసిన మహనీయులు దేశ ప్రజలకు గౌరవ పాత్రులయి, యువకలోకానికి ఆదర్శప్రాయులయి, చిరస్మరణీయులుగా ఉంటారు.

చేమకూరకవి పుట్టినది క్షత్రధర్మముగల కుటుంబములో. ఆ ధర్మాన్ననుసరించి అతడు వ్యాయామము, సాము, సాధన మొదలయిన వాటిలో కృషిచేసి దృఢకాయుడయాడు. సూర్యనారాయణ వరప్రసాదము వల్లనో మరేకారణం వల్లనో అతనికి చిన్నతనములోనే కవిత్వధోరణి అబ్బింది.

తనది విద్వత్కుటుంబము కాదు; గొప్ప పండితుల దగ్గరగాని, ప్రసిద్ధ కవులదగ్గరగాని విద్య నేర్చుకున్నవాడు కాడు. సంస్కృత భాషా పరిచయము ఎక్కువలేదు. అందుచేత తన కవితాశక్తికి తగిన పోషణ లభించలేదు.

అదీ ఒక మేలే అయిందనాలి. గురు శుశ్రూష చేసిఉంటే పాతపుంతలే అలవాటయి ఉండేవి. సంస్కృత భాషా పరిచయం ఇంకా ఎక్కువ ఉండి ఉంటే, ఆ వ్యామోహముతో సంస్కృతం ఎక్కువగా గుప్పిస్తూ తెలుగు కృషిని వెనుకకు తోసి ఉండేవాడు. స్వతంత్రమయిన ఆలోచనలకు అవకాశం లేకపోయేది.

తన కవితాభిలాషను బలపరుచుకోడానికి మనకవి రఘునాథ రాజాస్థానములో జరుగుతూ ఉండే 'బుధసమాజ' విద్వద్గోష్ఠులకు హాజరవుతుండేవాడు. ఆ గోష్ఠులలో వారు మంచివని మెచ్చిన విషయాలనూ, బాగులేవని నిరసించిన అంశాలను శ్రద్ధగా గుర్తించేవాడు. అపారమయిన శ్రద్ధాభిమానాలతోనూ, అద్భుతమయిన ధారణశక్తితోనూ, సునిశితమైన విమర్శనా విధానముతోనూ, ఆ మెప్పులనూ ఈ నిరసనలనూ ఆకళించుకునేవాడు. ఆనాటి కవి పండితులలో ఉండిన నియమాలూ, కవి సమయాలూ జ్ఞాపక ముంచుకొనేవాడు. రసనిర్వహణలో ఉన్న మెళుకువలు తెలుసుకున్నాడు, మాటలూ విరుపులూ పలుకుబడులూ సామెతలూ మొదలయిన వాటి విశేషాలను పరికించేవాడు. చమత్కారమున్న పద్యము విన్నప్పుడు సహృదయులు ఎంతగా సంతోషించి ప్రశంసిస్తారో అవగాహన చేసుకున్నాడు. మనోహరమైన శ్లేషలతోనూ అద్వితీయమయిన ప్రక్రమాదిసూత్రాలతోనూ చమత్కారాలతో నిండిన చక్కని కవనం చెప్పగలిగాడు. సారంగధరము మచ్చుతునకగా వ్రాసి విద్వాంసుల పొగడ్తలను పొందగలిగాడు. దానినిమించిన రమ్యతరమయిన ప్రబంధంగా విజయవిలాసం రచించి రాజు కంకితంచేసి ధన్యుడయాడు.

ఏదయినా ఒక ప్రబంధములో చక్కని చమత్కారమున్న పద్యాలు, ఒకటి రెండుసార్లు చదివినంత మాత్రాన, సాహిత్య ప్రియులకు అప్రయత్నంగానే కంఠస్థమవుతాయి. అటువంటి పద్యాలు సాధారణంగా ఒక కావ్యానికి ఏ పదో, పదిహేనో ఉండడము సహజము. మనకవి ఆ విధంగా స్వయంకృషితో సమకూర్చుకున్న "చమత్కార భాండాగారము"లో చమత్కారాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. శబ్దాలకు, నుడికారాలకు, లోకోక్తులకు, అలంకారాలకు, ధ్వనికి... సంబంధించిన పెక్కురకాల చమత్కారా లందులో ఉన్నాయి, కాబట్టే తాను ప్రతి పద్యములోనూ ఒకటి రెండు చమత్కారాలను ఇముడ్చడానికి వీలు కలిగింది. ఆ దృష్టిని చూస్తే మన కవి అనన్య సామాన్యమైన ప్రతిభ దృగ్గోచరమవుతుంది.

ఇంకొక్క విషయము : వర్ణనలలోనూ విషయకథనములోనూ పౌరాణిక విశేషాల రచనలోనూ మన కవి పూర్వ ప్రబంధకర్తల నియమాలను ఉల్లంఘించలేదు. వాళ్ళ కవి సమయాలనే తానుగూడా ఉపయోగించాడు. పింగలి సూరన్న అనినట్టు—

నెత్తమ్ము లనుచుఁ, గ్రొన్నెల లంచు వటుఫల
శ్రీ లంచుఁ, దాజేటి చిప్ప లనుచు,
నమ్ముల పొదలంచు; ననఁటి కంబములంచుఁ,
పులిన మంచును, నుడిచెలువ మంచు,
హరిమధ్య మంచును, హైమకుంభము లంచు,
...................... ............
......శ్రీకారములటంచు, నళు లటంచు,
ఇట్టివి గదయ్య, చెప్పఁబోయిన నుపమలు,
వీనిఁ దడవ నిగ్గొదవు నవ్వేలఁది నెంచి.

(—ప్రభావతీ ప్రద్యుమ్నము 2-64)

ఇవేకదా ఉపమానాలు? అని అంటూనే ఆ సూరన్న ప్రభావతి తలవెంట్రుకలను మూడు పద్యాలలో వర్ణించాడు. ఆ విధంగానే రామరాజ భూషణుడు ఒక్కొక్క విషయానికి ఒక్కొక పద్యానికి తక్కువ కాకుండా

"నానాసూనవితాన వాసనల..." అన్న ముక్కుపద్యాన్నీ,

"ఇంతి మృదూక్తి మాధురికి..." అన్న మృదూక్తి పద్యాన్ని,

"నతియూరు ద్యుతి..." అన్న ఊరుల పద్యాన్నీ

ఈలాగు వ్రాశాడు. శ్రీనాథుడు మొదలయిన వారు గూడా ఈ ఉపమానాలనే ఉపయోగించి, కొంత కొంత కొత్తదనం చూపించారుకదా.

పింగలి సూరన్నలాంటి వానికే ఈ వర్ణనల విసుగు కలిగింది; ఇంక స్వతంత్ర భావాలతో ప్రతి పద్య చమత్కృతిలో, 'క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదనుమీ' అని అనిపించుకోదగిన పట్టుదల కలిగిన మన చేమకూరకవికి ఎంత విసుగును కలిగిస్తుందో చెప్పగలమా. అందుచేత కవి ఒక్కొక్క విషయానికొక్కొక్క పద్యం అన్న పంథాను (రెండు మూడు చోట్లలో తప్ప) విడిచిపెట్టాడు. రెండు మూడు విషయాలను కూర్చి ఒక్క పద్యములో వర్ణించడం అభ్యాసముచేశాడు. ఆలాగు కూర్చడానికి గూడా ఒక నియమం ఉండాలిగదా! అదేమిటని పరిశీలిస్తే, ఆ కూర్పులో ఒక చక్కని సమానధర్మము కనబడుతుంది.

రపరపలు నెరపు సిలపు
రవ రవణముతోడ చెవియ రాక తిచంబుల్,
కపకప నప్పున్ పలి జ
క్కావ కవం గలకంఠ కంఠ కఠిన కుచంబుల్ (వి. వి. 1-150)

దీనిలో శబ్దాలంకారముతో కూడిన నిరసన అన్నదే సమానధర్మము.

అతివ కుచంబులున్, మెఱుగు
టారుసు, వేనలియుఞా, ధరాధి హో
స్నతియు, నహీన భూతి కల
నంబు ఘనాభ్యుదయంబు నెప్పు దం
డితి మని మాటి మాటికిని
నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీగెడుఞా (వి.వి 1-99)

దీనిలో కుచాలను, నాగాడను, వేనలిని, అందమైన శ్లేషలో పూదించిని కూర్చాడు. సమానధర్మము ఏదు మంత్రపు కల్మివల్ల కలిగిన గర్వాతిశయము.

ఈ విధమైన కూర్పులవల్లా, వాటితో మేళవించిన శ్లేషాది అలంకారాలవల్లా, తాను వర్ణిస్తున్నదంతా పాతపాటే అయినా ఏదో ఒక చక్కని కొత్తదనము కనబడి హృదయాహ్లాదాన్ని కలిగిస్తుంది. ఈ విధంగా మనకవి తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకుంటాడు.

ఏ కావ్యములోనైనా 10, 12, చక్కని చమత్కారమున్న పద్యాలుంటేనే ఎంతగానో సంతోషించి ఓహో! అంటాము. అలాంటిది ప్రతి పద్యములోనూ చమత్కారము కనబడుస్తూ దాదాపు 670 పద్యాల కావ్యాన్ని ఆంధ్రభాషకిచ్చి సర్వతోముఖ ప్రశంసలను ఆర్జించాడు. ఈ ప్రాశస్త్యం అంతా స్వయంకృషి వల్లనే సాధించాడంటే, అది ఎంత గొప్ప విషయమో చెప్ప నక్కరుండదు. సాధారణ వాతావరణములో ఉండినా, కార్యదీక్షనూ స్వయంకృషినీ అవలంబించి తాను శాశ్వతమైన కీర్తిని పొందడమేకాక, తన తల్లి బాసకూ తోడి ఆంధ్రప్రజలకూ పేరు ప్రతిష్ఠలను ఆర్జించిపెట్టాడు. అతనిది సార్థకమైన జన్మ. కాబట్టి పాఠక సహృదయులకూ, ముఖ్యంగా యువతరమువారికి చేమకూర వెంకటరాజు అపర్మప్రాయు డయా దిని మనవి చేస్తున్నాను.

## కృ త జ్ఞ త

నిఘంటువులూ నిర్వచనాలూ వద్దు. ఆంధ్ర జనసామాన్యానికి సులభంగా అర్థమయ్యే తెనుగు భాషను "జానుతెనుగు" అందాము. దీనిలో 'అచ్చతెనుగు' అన్న పేరుతో ఉన్న మాటుమూల పదాలుండవు. సంస్కృతపదాలయినా, మరేయితర భాషల పదాలయినా, తెనుగులో ప్రవేశించి, తెనుగుపదాలలో కలిసి పోయి తెనుగుమాటల కిందనే చెలామణి అవుతున్న పదాలుగూడా జాను తెనుగులో ఉంటాయి. ఉదా: కాలము, భోజనము, నిద్ర, దైవము, వివాహము, శుభము...... రైలు, గేటు, కోర్టు, ఖర్చు, దాఖల్, వాపస్......

ఈ దృష్టితో చూస్తే చేమకూరకవి ఈ కావ్యాలలో ఉపయోగించినది జానుతెనుగే తాను వ్రాస్తున్నది ఎటువంటి సున్నితమయిన సన్నివేశమైనా, ఎంత క్లిష్టమైన సంఘటనైనా, ఏ రసమయినా, ఏలాంటి మనః

పరిమాణమైనా, 'వీసరపోకుండా' ఈ జానుతెనుగులోనే 'వాసించే' కవిత్వం చెప్పి, ఈ కవితలోని పటుత్వాన్ని అద్భుతంగా లోకానికి ప్రకటించాడు. కొన్ని భావాలను తెనుగులో ప్రకటించలేమన్న అభిప్రాయము కలిగిన 'పండితులకు' చక్కని గుణపాఠము చూపించి ధన్యుడయాడు.

సరస్వతీదేవి ఆస్థానములో, భాషల సదస్సులో, వేదికమీద, మన జానుతెనుగుకు ఒక చక్కని ఉన్నత భద్రపీఠమును కానుకగా అర్జించిపెట్టి ఆంధ్రమహాజనులకు గర్వకారణమయాడు. ఇంత మహోపకారం చేసిన చేమకూరకవికి ఆంధ్రులూ, ఆంధ్రవాఙ్మయమూ చాల ఋణపడి ఉందని చెప్పనక్కరలేదు. 'తీర్చగరాని' ఆ ఋణములో ఏ లవలేశమైనా తీర్చడానికి ఆంధ్రులకున్న మార్గము ఒక్కటే: ఆ కవి కావ్యాలను శ్రద్ధాభక్తులతో పఠించి, ఆ మహానుభావుడు ఎన్నివిధాల, ఎంతెంత, అర్థలాభాన్ని మనకు అనుగ్రహించాడో తెలుసుకొని, తెలియనివారికి తెలియజేయడమే; వేరుమార్గము లేదు.

ఈ గ్రంథంలోని గుణవిశేషాలను చూచి ఆనందాన్ని పొందగలిగేవారు ఎంతకాలం ఉంటారో అంతకాలం ఈ కవి 'చిరంజీవి'గా ఉంటాడు.

"సుకవితా యద్యస్తి రాజ్యేన కిం"



# విజయవిలాసము

## హృదయోల్లాసము

### మొదటి ఆశ్వాసము

#### దైవ ప్రార్థన

శ్రీ లెల్లప్పు డొసంగ, నీ సకల ధాత్రీచక్రమున్ బాహు పీ
ఠీ లగ్నంబుగఁ జేయ, దిగ్విజయ మీన్ డీకొన్న చందాన, నే
వేళన్ సీతయు లక్ష్మణుండుఁ దను సేవింపంగ విల్ పూని, చె
ల్వౌ లీలన్ దగు రామమూర్తి రఘునాథాధీశ్వరుం బ్రోవుతన్. 1

అర్థము :

ఎల్లప్పుడు = ఒకప్పుడుండి ఇంకొకప్పుడులేనట్లుకాక, అన్నివేళలందును, శ్రీలు = (ధన పుత్ర, బుద్ధి, కీర్తి...మొదలైన) సంపదలను, ఒసంగన్ = ఇవ్వడానికిన్నీ, ఈ సకల ధాత్రీ చక్రమున్ = ఈ భూమండలమంతా, బాహు పీఠీ లగ్నంబుగన్ = పీఠమువంటి భుజములయందు (ఎల్లప్పుడు) నిలుచునట్టిదానిగా, చేయన్ = చేయడానికిన్నీ, దిగ్విజయము = నాలుగు దిక్కులలో విజయములను, ఈన్ = (ఎల్లప్పుడు) ఇవ్వడానికిన్నీ, డీకొన్న చందానన్ = పూనుకొనిన విధముగా, ఏవేళన్ = ఎల్లప్పుడూ, సీతయున్, లక్ష్మణుండున్, తనున్ సేవింపంగన్ = తన్ను సేవించుచుండగా, విల్ పూని = విల్లుధరించి, చెల్వు ఔ లీలన్ = చక్కని విలాసముతో, తగు = ఒప్పుచున్న, రామమూర్తి = శ్రీరామచంద్రుడు, రఘునాథ అధీశ్వరుణ్ = రఘునాథ రాజును, ప్రోవుతన్ = రక్షించునుగాక.

తాత్పర్యము :

ఎప్పుడూ తన దగ్గరనే సీతా లక్ష్మణులు ఉండగా విల్లు ధరించి ఉన్నందువల్ల ఎల్లప్పుడు సంపదలను, భూమండల పరిపాలనమును, దిగ్విజయాలను ఇవ్వడానికి పూనుతున్నా డన్నట్లు (వరదహస్తము కనబరుస్తూ) ఉన్న శ్రీరామమూర్తి రఘునాథరాజును రక్షించుగాక.

*విశేషములు :*

ఈ విజయవిలాస కృతికర్త చేమకూర వేంకటకవి సూర్యవర ప్రసాది. "భక్తి విశ్వాసంబుల్ నీ సొమ్ములు సామాన్యుడవే ? సూర్యవర ప్రసాది విజ్ఞగ మెఱుఁగన్" అని రఘునాథరాజు అన్నాడు. కవి ఇష్టదైవతం సూర్యుడు. అయినప్పటికి, ఇందులో కావ్యాదిని దేవతాప్రార్థనములో సూర్యుని కాకుండా శ్రీరాముడిని ప్రార్థించాడు. కృతి భర్త అయిన రఘునాథరాజుకు ఇష్టదైవము శ్రీరామచంద్రుడు అవడమే దీనికి కారణం.

కవులు తమ ఇష్టదేవతలను కాకుండా కృతిభర్తల ఇష్టదేవతలను స్తుతిచేసే ఆచారం లేకపోలేదు. పారిజాతాపహరణములో ముక్కు తిమ్మన, తన ఇష్టదైవతము ఈశ్వరుడైనప్పటికీ, కృష్ణదేవరాయల ఇష్టదైవతం వేంకటస్వామి స్తుతితోనే తన గ్రంథ మారంభించాడు. (శ్రీమదుమా మహేశ్వర వరప్రసాద లబ్ధ............. తిమ్మయ నామధేయ ప్రణీతంబైన.........అని తిమ్మన ఆశ్వాసాంత గద్య.)

ఈ ప్రార్థనలో చేమకూరకవి దృష్టినున్న రాముడు 'కోదండరాముడు'. సాధారణముగ ఈ స్వామి పటములోగాని, విగ్రహములోగాని, రాముడు మధ్యను, కుడి ఎడమల సీతాలక్ష్మణులు నిలిచి ఉంటారు. రాముడి ఎడమచేతిలో నిలువుగా పట్టిన విల్లుంటుంది. వేళ్ళు క్రిందికి చూపుతూ ఉన్న కుడి అరచేయి (వరదహస్తము) కనబడుతూ ఉంటుంది.

రఘునాథరాజు గొప్ప రామభక్తుడు. అతని కోటలోనూ, భవనాల గోడలమీదనూ శ్రీరాముని చిత్రాలూ విగ్రహాలూ ఉన్నాయని అతని కొడుకు విజయరాఘవనాయకుడు తన "రఘునాథనాయకాభ్యుదయం" అన్న కావ్యములో వర్ణించాడు.

*పటము :*—పటుతర శ్రీరామ భావచిత్రంపుఁ
బటము నిల్పిన రామభద్రశాలయును.

*విగ్రహము :*— పట్టాభిరాముని భావ చిత్రంపుఁ
గట్టి బంగారు చెక్కడపుఁ బప్పరము......
కలిగి రెండవ పుష్పక విమాన మనఁగ
నలరు శ్రీరామసౌ ధాధిరాజంబు.

రఘునాథుడి కొలువుకూటములో గోడ నొక పెద్ద రామపటము ఉండేదట. అది కోదండ రాముడి పటమే కావచ్చును.

సీత లక్ష్మి అవతారం కాబట్టి సంపదలనూ, లక్ష్మణుడు భూమిని మోసే ఆదిశేషు అవతారము కాబట్టి భూచక్రభరణమునూ, విల్లు విష్ణు పంచాయుధములలోని శార్‌జ్ఞమనే ధనుస్సు కాబట్టి దిగ్విజయమునూ రాముడు ఇస్తాడని భావము.

*చమత్కృతి :*

ఈ మూడు వరాలను అనుగ్రహించడానికి పూనుకొని ఉన్నాడనడానికి ఆ రాముడి వరద హస్తమే సూచన. ఈవరదహస్తమున్న విషయము మాటలతో చెప్పకుండానే ధ్వని మర్యాదను కవి సూచించాడు.

మొదటిచరణములోని 'ఎల్లప్పుడు' అన్న పదమును చేయన్, ఈన్ అన్నమాటలకుకూడ అన్వయించాలి. ఆ భావమే ఏవేళన్ అన్న పదమువల్ల కవి రూఢిచేశాడు. ఏవేళా అన్నది తమిళ దేశములో ఇప్పటికీ ఆంధ్రుల పలుకుబడి; ఎల్లప్పుడు అని అర్థం.

శ్రీరాముడు తన జీవితంలో ఎల్లప్పుడు సీతా లక్ష్మణులతో ఉండినవాడు కాడు. ఒక్కొక్కప్పుడు వారల కెడముగా ఉండినప్పటికీ, ఈ కోదండరామ విగ్రహంలోని రాముడుమాత్రం సీతా లక్ష్మణులతో ఎల్లప్పుడు కలిసి ఉండేవాడే. కాబట్టే ఎల్లప్పుడు మేలు చేస్తూంటాడు. ఆ వ్యత్యాసం సూచించడానికే కవి రాముడు, రామచంద్రుడు......అనకుండా ఈ పద్యంలో 'రామమూర్తి'( = విగ్రహరూపంగా ఉన్న రాముడు) అని సాభిప్రాయంగా అన్నాడు.

ఏదో ఒకసమయంలో జరిగిన విషయమైనా, లలితకళలో నిరూపించినప్పుడు, ఆవిషయం శాశ్వతత్వం పొందుతుంది[1] కదా !

*పాఠాంతరము :*

తిరుపతి వేంకటకవులూ, వావిళ్ళ రామస్వామిశాస్త్రిగారూ ఈ మొదటి పద్యానికి.

శ్రీ లెల్లప్పు డొసంగు నీ సకల ధాత్రీచక్రమున్ బాహు పీ
ఠీలగ్నంబుగఁ జేయు దిగ్విజయమీ డీకొన్న చందాన...

---

1. ఈలాంటి చిత్రలేఖనలోని శాశ్వతత్వాన్నే ఆంగ్ల మహాకవి "కీట్సు"చాల చక్కగా వర్ణించాడు. ఒక గ్రీసు కలశంమీద ఎప్పుడో చెక్కిన ఒకకథలో ఒకయువకుడు ఒకయువతిని పట్టుకోడానికి వెంటాడుతుంటాడు.

Bold lover, never, never, canst thou kiss,
Though winning near the goal–yet,—do not grieve,
She cannot fade, though thou hast not thy bliss,
For ever wilt thou love; and she be fair.—

ఎప్పుడూ నీవు ప్రేమిస్తూనే ఉంటావు; ఆమె అందంగానే ఉంటుంది; విచారించకు అని కవి ధైర్యం చెప్పాడు.

అన్న పాఠం ముద్రింపించారు. దీనిలో దీకొనడం ఒక్క దిగ్విజయ మివ్వడానికే అన్వయించ వలసి వస్తుంది. క్రమాలంకారములోని అందము మందగిస్తుంది.

అలంకారం :

క్రమము; ఉత్ప్రేక్ష; పరికరము.

నాటకాల నాందీలలో లాగానే కావ్యాలలో మొదటి పద్యం ఆశీర్వాద రూపంగా గాని నమస్క్రియా రూపంగాగాని, కథా వస్తు నిర్దేశ రూపంగా గాని ఉండాలని పూర్వకవుల సంప్రదాయం. ఈ పద్యం ఆశీర్వాదరూపం. శ్రీకారంతోనూ, మూడు గురువుల మగణం తోనూ కావ్యమారంభించడం శుభప్రదం అని కూడ ఒక నమ్మకం ఉండేది. అందుకే మనకవి శ్రీతోనూ మగణంతోనూ కావ్యమారంభించాడు. అంతేకాదు; మొదటి మూడు పద్యాలూ శ్రీకారంతోనే ప్రారంభించాడు; మూడింతలు మంచి కలగాలని కాబోలు !

తానెంతటి స్వతంత్ర బుద్ధికలవాడైనా, మనకవి ఈలాంటి సంప్రదాయాలను పాటించక తీరలేదు. ఆనాటి సాహిత్య వాతావరణ ప్రభావం అలాంటిదని సమర్థించుకోవాలి.

శ్రీ కలకంఠకంఠియు ధరిత్రియు దక్షిణ వామభాగముల్
గైకొని కొల్వ, వారిఁ గడఁకం గడకన్నుల కాంతిఁ దేల్చి, తా
నా కమలాప్తతం గువలయాప్తతఁ దెల్పెడు రంగభర్త లో
కైక విభుత్వ మిచ్చు దయ నచ్యుత శ్రీరఘునాథ శౌరికిన్. 2

అర్థము :

శ్రీ = లక్ష్మి అనే, కలకంఠకంఠియున్ = కోకిల స్వరము కల కాంతయును, ధరిత్రియున్ = భూదేవియు, (ఈ ఇద్దరును విష్ణుని భార్యలు), దక్షిణ వామ భాగముల్ = (క్రమముగా) కుడి ఎడమ ప్రక్కలను, కైకొని = అంటిపెట్టుకొని, కొల్వన్ = సేవిస్తుండగా, వారిన్ = ఆ శ్రీదేవిని భూదేవిని, కడఁకన్ = ప్రయత్నముతో, కడకన్నుల కాంతిన్ = పక్కచూపుల కాంతులతో, తేల్చి = సంతోషపెట్టి, తాన్ = (రంగభర్త), ఆకమల ఆప్తతన్ = ప్రసిద్ధమైన లక్ష్మీదేవియందు గల స్నేహభావాన్ని, (ఇంకొక అర్థము-కమలము లకు మిత్రుడైన సూర్యునిగుణాన్ని). కువలయ ఆప్తతన్ = భూదేవియందుగల స్నేహభావాన్ని, (ఇంకొక అర్థము - కలువలకు మిత్రుడైన చంద్రుని గుణాన్ని), తెల్పెడు = ప్రకటిస్తున్న, రంగభర్త = శ్రీరంగనాథస్వామి, అచ్యుత శ్రీ రఘునాథశౌరికిన్ = అచ్యుతనాయకుని కొడు కైన శ్రీ రఘునాథ శూర కుమారునికి, దయన్ = దయతో, లోకఏక విభుత్వము = లోకమున కంతటికి ప్రధానమైన దొరతనము (ఏకచ్ఛత్రాధిపత్యమును), ఇచ్చున్ = ఇచ్చునుగాక.

తాత్పర్యము :

కుడిప్రక్కను లక్ష్మీదేవి, ఎడమప్రక్కను భూదేవి, తన్నంటిపెట్టుకొని ఉండగా, వారిద్దరిని తన కడకంటి చూపులతో సంతోషపెడుతున్న రంగనాథస్వామి కృతిపతిని ఏకచ్ఛత్రాధిపతిగా చేయునుగాక.

విశేషములు :

తంజావూరు నాయకరాజులు శ్రీరంగంలోని రంగనాథస్వామిని చాల భక్తి ప్రపత్తులతో సేవిస్తూ అమూల్యమయిన ఆభరణాలను సమర్పించేవారు. రఘునాథ రాజు తండ్రీ, కొడుకూ చాల శ్రద్ధతో కైంకర్యాలు చేస్తూ ఉండేవారు. కాబట్టే ఈ ప్రార్థన.

కమల శబ్దానికి లక్ష్మి అని, పద్మము అని అర్థాలు. అలాగే కువలయ శబ్దానికి భూమండలం అని కలువ అని అర్థాలు.

శ్రీ రంగనాథస్వామి మహావిష్ణువు కాబట్టి సూర్యచంద్రులు అతని కుడి ఎడమ కన్నులు. సూర్యుడు కమలములకు ఆప్తమిత్రుడు; చంద్రుడు కలువలకు స్నేహితుడు. రంగనాథుడి కుడి ఎడమ ప్రక్కల శ్రీ (కమల) భూ (కువలయ) దేవీమణులుండగా; వారి నిరువురిని ఆయాప్రక్కల కడకంటి చూపులతో సంతోషపెట్టడం చేత, కుడికన్నున కమలాప్తతయు (సూర్యత్వము), ఎడమకంటియందు కువలయాప్తతయు (చంద్రత్వము) తేట పరుస్తున్నాడు.

అనేక (ఇద్దరుగాని అంతకంటె ఎక్కువగాని) నాయికలయందు సమముగా ప్రవర్తిస్తూ వారిని సంతోషపెట్టే నాయకుడిని దక్షిణనాయకు డంటారు. ఈ పద్యములోని రంగభర్త దక్షిణ నాయకుడని మాటలతో చెప్పకుండానే కవి చెప్పాడు.

సూర్యచంద్రు లిద్దరూ ప్రపంచము నంతటిని పాలించేవారు కాబట్టి రంగనాథుడు కృతిపతికి లోకైక విభుత్వము నిచ్చునని భావము.

చమత్కృతి :

"వారిఁ గడఁకం గడకన్నుల కాంతిఁ దేల్చి" అన్నచోట కవి శబ్దాలంకారం కోసం ఆస చేశాడని కొందరు భావిస్తారు. కాని, చేమకూరకవి వంటి భాషాధికారం కలవాడికి కావ్యారంభంలో దైవప్రార్థనయందు అలాటి కక్కుర్తి పడవలసిన అవసరం [illegible] ఉండకూడదు.

కడకన్ అంటే ప్రయత్నముతో అని అర్థము. ఈ ప్రయత్నమన్నది వ్యర్థపదం కాక, ఇక్కడ అర్థగౌరవం గల చక్కని మాట. రంగభర్త దక్షిణనాయకుడు. ఇద్దరు నాయికలు - లక్ష్మీదేవి భూదేవి. వీరిద్దరు ఎవరి మందిరములో వారుంటే, మన దక్షిణనాయకుడికి వారిని సమానంగా సంతోష పెట్టడం సుకరం కావచ్చును. కాని ఇద్దరూ చెరి ఒకప్రక్క తన్ను అంటి పెట్టుకొని ఉన్నప్పుడు, ఎటువంటి నేర్పరికైనా కష్టమే ! ఒకతెకు క్రేగంట చూపిన మెప్పు ఎంత స్వల్పమయినా, రెండవదానికి ముప్పుగా పరిణమిస్తుంది. ఆ భావం కలగకుండా ఉండా లంటే, ఒకతెకు తెలియకుండా తగిన సమయం చూచుకొని రెండోదాన్ని కడకంటితో చూడాలి. ఎంతో సమయజ్ఞతతో, నేర్పుతో, ప్రవర్తించాలి.

ఇద్దరినీ ఏకకాలమందే సంతోషపెట్టాలంటే రెండువైపులా కడకంటి చూపులతోచూడాలి. ఇది యోగులకే సాధ్యం. యోగులు ఏకాగ్రతకోసం నాసాగ్రాన దృష్టి నిలపడానికి రెండు కంటి పాపలను ముక్కుమూలకు తీసుకురావడం కద్దు. రంగనాథుడిపని దానికి వ్యతిరేకం. ఇక్కడ కంటిపాపలు రెండింటిని చెవులవైపు ఒకేసారి తీసుకుపోవాలి. తానెంతటి భగవంతుడైనా, ఎంతో ప్రయత్నమూ అభ్యాసమూ కావాలి. కాబట్టే మాటల విలువలు తెలిసిన మనకవి "కడకన్" అన్నపదము సార్థకముగ ప్రయోగించాడు.

కడకన్నుల "కాంతి" అని కవిసార్థకంగా ప్రయోగించాడు. పద్మము, కలువ, వికసించ డానికి సూర్యకాంతి చంద్రకాంతి అవసరము. లక్ష్మి భూదేవుల విషయంలో కడకంటి చూపు అని అర్థం చెప్పుకున్నా, కమల కలువల విషయంలో కాంతికి ప్రాధాన్య మివ్వక తప్పదు.

అలంకారము :

క్రమం; యమకం, శ్లేష.

"శ్రీ రుచిరాంగి నీ భవనసీమ ధ్రువంబుగ నిల్చు, నేలు దీ
ధారుణి నీవ" యన్న క్రియ దక్షిణపాణి నెఱుంగఁజేయు శృం
గార రసాబ్ధి వేంకటనగ స్థిరవాసుఁడు పూర్ణదృష్టి నెం
తే రఘునాథ భూరమణదేవు గుణంబుల బ్రోవుఁ బ్రోవుతన్. 3

అర్థము :

శ్రీ రుచిరాంగి = సుందరాంగి అయిన లక్ష్మీదేవి, నీభవన సీమన్ = నీ మందిరంలో, ధ్రువంబుగన్ = శాశ్వతముగా, నిలుచున్ = నిలిచియుండును, ఈ ధారుణిన్ = ఈ భూమిని, నీవ = నీవే, ఏలుదువు = పాలింతువు, అన్నక్రియన్ = అనుచున్న విధంగా, దక్షిణపాణిన్ = కుడిచేతితో (వేంకటేశ్వరుని విగ్రహమున కనబడే వరదహస్తముతో), ఎఱుంగఁజేయు = తెలియజేయునట్టి, శృంగార రస అబ్ధి = శృంగారరసమునకు సముద్రము వంటివాడు అయిన, వేంకటనగస్థిరవాసుడు = (తిరుపతి) వేంకటమను కొండయందు నిలకడైనవాడు (వేంకటేశ్వ

రుడు), పూర్ణదృష్టిఁ = పరిపూర్ణమైన దయతో, గుణంబుల ప్రోవుఁ = సద్గుణములకు రాశియైన, రఘునాథ భూరమణ దేవున్ = రాజులకు రాజైన రఘునాథుని, ఎంతేన్ = మిక్కిలిగా, ప్రోవుతఁ = రక్షించునుగాక.

తాత్పర్యము :

లక్ష్మీదేవి స్థిరంగా నీ మందిరంలో ఉంటుంది. ఈ భూమిని నీవే పరిపాలిస్తావు— అంటూన్నట్టు కుడిచేతితో తెలుపుతూ ఉన్న వేంకటేశ్వరుడు పరిపూర్ణమైన దయతో రారాజైన రఘునాథుని రక్షించునుగాక.

విశేషములు :

శ్రీకృష్ణదేవరాయలకూ వారి వంశం వారికీ ఇష్టదైవం తిరుపతి వేంకటేశ్వర స్వామి. ఆ నాయక రాయల బాంధవ్యం మన తంజావూరి నాయకులకు గూడ ఉంది. కృతిపతి ఇష్టదైవం శ్రీరాముడు; అతడి కుటుంబదైవం శ్రీరంగనాథస్వామి. బంధువర్గదైవం వేంకటేశ్వరుడు. ఈ ముగ్గురికి మూడుపద్యాలు వ్రాశాడుకవి.

రఘునాథరాజు నగరిలో అనేక మందిరాలుండేవి. వాటిలో మహావైభవోపేతమైనది [2]ఇందిరా మందిరం అనే భవనం. దీన్ని మనస్సులో ఉంచుకొనే కవి కేవలం

---

2. రఘునాథరాజు గొప్ప భవన నిర్మాత. ఎన్నో దివ్యభవనాలను నిర్మించాడు. వాటిని ఆనాటి రచయితలూ, కవులూ ప్రత్యక్షంగా చూచిన వారెందరో విశేషంగా వర్ణించారు. అచ్యుతరంగకూటము, నాకపురీ విలాసము, లాగుల చప్పరము, నాటకశాల, శ్రీరామసౌధము, విజయభవనము (దీనిని విజయవిలాసమని గూడా అనేవారు) మొదలయిన మందిరాలుండేవి. వీటిలో లక్ష్మీమందిరము చాల గొప్పది. దాని వర్ణన :—

వగడాల జగడాల బటువు కంబములు
మగరాల విగరాల మదన చేతులును,........
సొగసైన కట్టాణి సోగముత్తెములు
జిగిమించ గనుపించు చికిలి కుచ్చులును
తగిన వైడూర్యంపు దారబందములు
మగరాల సంతన మడత తల్పులును,......
మేలైన పటికంపు మెటికలు కలిగి......
మొదలైన విజయముల్ ముద్దులు గుల్క
పదరక వ్రాసిన భావముల్ మెరయ
ఇందిందిరాలక యిందిరా రమణి
కందళించిన వేడుకల్ కటాక్షింప
రమణీయమగు నిందిరా మందిరము.

— రఘునాథ, [illegible]

నామమాత్రంగానే కాకుండా యథార్థంగా కూడ అది లక్ష్మికి శాశ్వతనిలయం అవుతుం దని, వేంకటేశ్వరునిచేత పలికించాడు.

శృంగార రసాబ్ధి అన్నాడుకవి. నిజంగా వేంకటేశ్వరుడు పద్మావతీ పరిణయ ఘట్టంలో, రాళ్ళదెబ్బలు తిని గూడా ఆ కాంతనే పెళ్ళి చేసుకొని తన రసికత కనబరి చాడు. ఇప్పుడు తిరుపతిలో ప్రతిదినమూ కొన్ని వందల రూపాయల ఖర్చుతో జరిగే ముస్తాబుతోనూ, కొన్ని లక్షలు విలువచేసే ఆభరణాదులతోనూ వేంకటేశ్వరస్వామి గొప్ప శృంగార పురుషుడుగా ఉన్నాడు.

*మరొక్క విశేషము :*

తన భార్య లక్ష్మి రాజు ఇంటిలో నిల్చి ఉంటుంది. కాబట్టి వేంకటేశ్వరుడు భార్యను విడిచిపెట్టి దూరంగా ఉండలేక ఇక్కడ స్థిరవాసు డయాడు; రసికుడుకాడా !

వేదంవారూ, బులుసువారూ ఈ పద్యములో కుడిచేయి అభయముద్రగా నున్న దని భావించారు. అదిసరికాదు, తిరుపతి వేంకటేశ్వరస్వామి కుడిచేయి వరదహస్త ముద్రతోనే, వ్రేళ్ళు క్రిందికి చూపుతూ ఉన్న అరచేయి కనబడుతుంటుంది గాని అభయముద్రగా లేదు. వ్రేళ్ళు మీదకు చూపుతూ ఉన్న అరచేయి అభయహస్తం.

*చమత్కృతి :*

ఇక్కడ కుడిచేయి వరద ముద్రలో ఉండినా, దాని ఉపయోగంలేదు. "ఈ ధారుణి నీవ యేలుదువు'' అన్నప్పుడు "ఈ ధారుణి'' నిర్దేశించడానికిగాని, 'నీవ' అన్న అర్థం ప్రక టించడానికిగాని కవి ఉపయోగించా డనాలి. ఆ హస్తానికి మొదటి పద్యంలో ''ఇవ్వడానికి డీకొన్నట్టుందన్న అర్థం చూపి, ఈ పద్యంలో ఈ భూమి అని చూపిస్తున్నట్టుందన్న అర్థం కనబరిచాడు కవి.

*పాఠాంతరాలు :*

1. శ్రీ రుచిరాంగి నీ భవనసీమ ధ్రువంబుగ నిల్చె.
(వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారిపాఠము)

2. శ్రీ రుచిరాంగి నీ *భవన* సీమ ధ్రువంబుగ *నిల్చి* యేలుదీ ధారుణి
(తిరుపతి వేంకట కవుల పాఠం)

1 లో:- లక్ష్మి, 'ధ్రువంబుగ నిల్చె' అని భూతకాలంలో చెప్పి 'నీవ యేలుదువు' అని భవిష్యత్కాలంలో చెప్పడంచేత, ఆమె నిల్చినందువల్లనే ఏకచ్ఛత్రాధిపత్యం సిద్ధించిందని

అర్థం వస్తుంది. అలాగయితే వేంకటేశ్వరుడి కృపారసానికి తావేలేదు. 'నిల్పె' అంటె వేంకటేశ్వరుడి కిచ్చిన రెండు వర్ణనలలో ఉన్న క్రమము పోతుంది.

2 లో:-నీ భువన(నీరాజ్యంలో)లక్ష్మిని ధ్రువంబుగనిల్పి ఏకచ్ఛత్రాధిపతిగా పరిపాలిస్తావు అని వేంకటేశ్వరుడి ఆశీస్సుగా భావము. భువనసీమ ధ్రువంబుగ నిల్పినవాడు రాజు అవుతాడు. కాబట్టి వేంకటేశ్వరుని కిచ్చిన రెండు వర్ణనలు ఇక్కడ కూడా చెల్లుతింటాయి.

*అలంకారము :*

ఉత్ప్రేక్ష; అంత్యానుప్రాస; క్రమం.

ధీయుతుఁ డటంచు నలువ దీర్ఘాయు వొసఁగి,
కాయు రఘునాథ విభు వజ్రకాయుఁ గాఁగ;
వీర వరుఁడని హరుఁడ త్యుదార కరుణఁ
జేయు నెప్పుడు విజయు నజేయుఁ గాఁగ. 4

*అర్థము :*

ధీయుతుఁడు = బుద్ధిజ్ఞానములతో కూడినవాడు, అటంచున్ = అనియోచించి, నలువ = (నాలుగుమోములు కల) బ్రహ్మ, దీర్ఘాయువున్; ఒసగి = ఇచ్చి, రఘునాథవిభున్ = రఘునాథరాజును, వజ్రకాయుగాగన్ = మిక్కిలి పటిష్ఠమైన శరీరంగలవానిగా చేసి), కాయున్ = రక్షించునుగాక, వీరవరుడు అని = వీరులలో శ్రేష్ఠుడని యోచించి, హరుడు = ఈశ్వరుడు, అతి ఉదార కరుణన్ = మిక్కిలి ఎక్కువైన దయతో, విజయున్ = యుద్ధములో విజయము సాధించుకొని వచ్చిన రఘునాథరాజును, ఎప్పుడున్ = ఎల్లప్పుడు (జీవితాంతం వరకు), అజేయున్‌కాగన్ = శత్రువులకు గెలువరానివానిగా, చేయున్ = చేయునుగాక.

*తాత్పర్యము :*

రఘునాథరాజు బుద్ధి జ్ఞానాలను మెచ్చి బ్రహ్మ అతనికి దీర్ఘాయువును, దృఢకాయమును ఇచ్చునుగాక; మంచివీరుడని ఈశ్వరుడు అతనిని అజేయునిగా చేయునుగాక.

*విశేషము :*

వేదములకు అధికారియైన బ్రహ్మ బుద్ధి జ్ఞానములు కలవారిని ఆదరించడం సమంజసము; మహాశూరుడగు ఈశ్వరుడు ఆలాగే వీరవరులను కరుణించడం న్యాయం. కాబట్టి బ్రహ్మ దీర్ఘాయువును, శివుడు ఓటమిలేని పరాక్రమమును ఇవ్వాలని కవికోరిక.

బ్రహ్మ మనుష్యుల నుదుట వ్రాస్తాడని, అదే లలాట లిఖితమని, నుదుట వ్రాసిన వ్రాత అని ఒక నమ్మకం ఉంది. కాబట్టే దీర్ఘాయువును దృఢదేహాన్ని ఇవ్వమన్న కోరిక[1].

వజ్రం చాల గట్టిపదార్థమనీ, దానిని వజ్రమే కోయాలిగాని మరేవస్తువూ కోయజాలదనీ ప్రసిద్ధి. కవులు ఈ గట్టితనమును దృష్టిలో పెట్టుకొని, వజ్రకవచము, వజ్రాంగి, వజ్రకాయము మొదలైన ప్రయోగాలు చేశారు. ఇవి పలుకుబడులు. వీటికి వజ్రాలు తాపిన కవచం అన్నట్లు అర్థంచెప్పరాదు. మిగుల పటిష్ఠమైన అనే చెప్పాలి.

ఈశ్వరుడు నాడు కిరాతార్జున ఘట్టములో, విజయు (అర్జును)ని పరాక్రమాన్ని మెచ్చి పాశుపతాస్త్రాన్ని ఇచ్చి అజేయునిగా చేసినట్లే నేడు ఈ విజయుడిని (రఘునాథ రాజుని) మెచ్చి అజేయునిగా చేయాలని కవి ప్రార్థన.

తోపూరు యుద్ధములో "సమర విజయు"డయి రఘునాథుడు వచ్చిన తరువాతనే విజయ భవన నిర్మాణము జరిగింది. (ఈ భవనమును విజయ విలాసము అనే వారు. విజయవిలాస కావ్యాన్ని దానిలోనే రాజుగారు అందుకున్నారు.) యుద్ధములో అనేక విజయాలు సాధించి వచ్చిన రాజును సమర విజయుడు, విజయుడు, అన వచ్చునుగదా!

దీనికి తోడు ప్రభుత్వము 1924 లో ప్రకటించిన 112 వ శిలాశాసనంలో రఘునాథ నాయకుడి మొట్టమొదటి శాసనములో ఈ నాయకుడిపేరు "విజయ రఘునాథనాయకుడు" అని ఉన్నది[2].

అందుచేత "విజయుఁ" అంటే రఘునాథుని అని అర్థం చెప్పుకోవాలి.

ఈ విజయ శబ్దం పరిష్కర్తలను, వ్యాఖ్యాతలను కొంత చీకాకు పరచింది. వేంకటరాయశాస్త్రిగారు "విజయుఁ = జయించువానిగా, అజేయుఁ = (అజయ్యు

1. శరీరంలో పటుత్వం లేకుండా, రోగాలకు లోకువ అవుతూ ఉండేవాడికి దీర్ఘాయువు దుఃఖ కారణమేగాని సుఖప్రదంకాదు. ఈ ఆలోచన కలవాడు కాబట్టే కవి దీర్ఘాయువుతో వజ్ర కాయాన్ని జోడించి కోరాడు.

2. రఘునాథ నాయకాభ్యుదయ పీఠికలో కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఈ విషయం చర్చించారు. (పుట. 26)

అనుటకు) గెలువరానివానిని" అని అర్థం చెప్పారు. బులుసు వేంకటరమణయ్యగారు (వావిళ్ళ వారి ప్రచురణ) అత్రోవనేపోయి "విజయుణ = జయముకల్గు వానిగను; అజేయుణ = ఇతరులచే జయింప శక్యముకాని వానిగను" అని వ్యాఖ్యానించారు.

జయించువానిగా, గెలువరానివానినిగా అనిచెప్పడం సుబోధకంకాదు; పునరుక్తి అవుతుందేమో కూడా.

*పాఠాంతరాలు :*

ఈ బాధను గుర్తించే పరిష్కర్తలు వేంకట కృష్ణమాచార్యుల వారున్నూ, తిరుపతివేంకట కవులున్నూ (విజయ శబ్దాన్ని తొలగించి) వేరే పాఠాలు ఇచ్చారు.

ధీయుతుఁ డటంచు నలువ దీర్ఘాయు వొసఁగి
జేయు రఘునాథవిభు వజ్రకాయుఁగాఁగ.

(వేంకట కృష్ణమాచార్యుల పాఠం)

ధైర్య పరుడని హరుఁ డత్యుదార కరుణ
జేయు నవ్విభు నెప్పుడజేయు గాఁగ.

(తిరుపతి వేంకటకవుల పాఠం)

వేదంవారు తమవ్యాఖ్యానంలో "కాయుణ" "అజేయుడు" అన్న ప్రయోగములు సాధు రూపాలు కావని, 'కాచుణ' అని 'అజయ్యుణ' అని సాధురూపాలు సూచించారు. కాని 'కాయు' అన్నది 'కాచు, రక్షించు' అన్న అర్థంలోనే మన కవులు ప్రయోగించారు.

................హయమేధంబుఁ ఘటింపం దలం
చి వినంఖ్య ధ్వజినీ పరంపర నుదీచీ ప్రాచ్యవాచీ ప్రతీ
చ్యవధి క్షోణికి యజ్ఞముక్త హరిఁ గాయంబంపి............

(వరాహపురాణం) (సూ. ని.)

ఇది మోయు - మోచు, త్రోయు - త్రోచు, వంటిది. రెండురూపాలూ సరియైనవే.

ఈ 'కాయు' అన్న శబ్దం తప్పు అనే భావంతో తిరుపతి వేంకటకవులు 'చేయు' అనే పాఠం ఇచ్చారు.

జేయు రఘునాథవిభు వజ్రకాయుఁగాఁగ.

ఈ పాఠంలో కవి 2, 4 చరణాలలో వేసుకున్న అనుప్రాస పద్ధతి దెబ్బతింటుంది. ఇంక 'అజేయ' శబ్దం గురించి, అదిగూడా దోషంకాదు.

అజేయము = గెలువదగనిది అని 'సూ. ని.' శ్రీ నిడుదవోలువారు శబ్దరత్నాకరంలో అజేయుడు = జయింప శక్యముకానివాడు అని అర్థం చెప్పి,

నిపుణు లజేయులు వీరలు.......

(భార. ఉద్యో.-2-210)

అని ప్రయోగం చూపించారు.

నలువ = నాలుగు ముఖములుగలవాడు అని చెప్పగానే, ఆ ముఖాలలోనుండే నాలుగు వేదాలు, వాటివల్ల కలిగిన జ్ఞానసమృద్ధి జ్ఞాపకానికి వస్తుంది.

నాలుగుమోములకా నిగమ నాదము లుప్పతిలంగ

(మనుచరిత్ర)

జ్ఞానముతో కూడిన వాడు రఘునాథుడు; జ్ఞాననిధి బ్రహ్మ. సమానగుణమువాడు కాబట్టి ఆదరణకు పాత్రుడు అవుతాడనే, ఆ సాకుతో, కవి బ్రహ్మను అర్థించాడు.

అలాగే 3, 4 వ చరణాలలో జ్ఞాపకానికి తీసుకురావలసింది కిరాతార్జునీయ విషయం. దానికి ఆధారం విజయ (అర్జున) శబ్దం ఒక్కటే కనబడుతుంది. కాబట్టి కవిప్రయోగించినది "విజయున్" అనే నిష్కర్షగా చెప్పవచ్చును.

చమత్కృతి :

కవి చమత్కారం చూడండి, సమానగుణములు కలవాడని బ్రహ్మదగ్గరకు వెళ్ళి, ఏదో కోరకుండా, బ్రహ్మచేయగల ఉపకారాన్నే (దీర్ఘాయువును) కోరాడు. విజయశబ్దం వల్ల సమాన పరిస్థితులున్నవి కాబట్టి శివుని దగ్గరకు వెళ్ళి అతడు పూర్వం అర్జునుడికి చేసిన ఉపకారం లాంటి ఉపకారాన్నే కోరాడు.

ఎవరి నడగాలో, ఏకారణంచూపి అడగాలో ఏమి అడగాలో కవి చక్కగా నిరూపించాడు. ''దానకలాకలాప సముదంచిత సారవివేకసంపదకా'' .... అనీ, "దానవిద్యా పరతంత్ర మానసుడు'' అనీ వర్ణించి మన కవులు దానము ఒక కళగా పాటించారు. మనకవి ఇక్కడ అడగడాన్ని ఒకకళ చేశాడు. ఈ సూత్రాన్నే తరువాతి ప్రార్థనలలోను కవిచూపించాడు.

అలంకారము :

అనుప్రాస; పరికరము.

మొగుడుం దమ్ముల విప్పునప్పుడు రజంబున్, జక్రవాళంపుఁగొం
డ గడిం దేఱుగ డైనపట్లఁ దమమున్, మందేహులం దోలి వా
సి గడల్కొ న్తతియందు సత్త్వము, బ్రకాశింపన్ ద్రిమూర్త్యాత్మకుం
డగు తేజోనిధి వేడ్కఁజేయు రఘునాథాధీశుఁ దేజోనిధిన్. 5

అర్థము :

మొగుడున్ తమ్ములన్ = ముకుళించిన తామరలను, విప్పునప్పుడు = వికసింపజేసినప్పుడు (ఉదయమున), రజంబున్ = పుప్పొడినీ (రజోగుణాన్ని అని ఇంకొక అర్థం), చక్రవాళంపు కొండ గడిన్ = (భూమిని చుట్టికొని ఉండే) చక్రవాళ పర్వతప్రదేశమందు, తేఱుగడ ఐన పట్లన్ = మరుగుపడిన సమయాలలో (రాత్రులందు), తమమున్ = చీకటినీ (మరొక అర్థం తమో గుణాన్నీ), మందేహులన్ = (సూర్యుని గమనం అడ్డగిస్తుండే) మందేహులన్న రాక్షసులను, తోలి = పారదోలి, వాసి = కాంతి, కడల్కొన్ తతియందున్ = అతిశయించుసమయాల్లో (పగళ్ళయందు), సత్త్వమున్ = బలమునూ (మరొక అర్థం సత్త్వగుణాన్నీ , ప్రకాశింపన్ = తేటపడునట్లుచేస్తూ, త్రిమూర్తి ఆత్మకుండు = బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపుడు అగు, తేజోనిధి = ప్రకాశానికి, నిధి = సూర్యుడు, వేడ్కన్ = ఉత్సాహముతో, రఘునాథ అధీశున్ = రఘునాథరాజును, తేజోనిధిన్ = ప్రతాపమునకు నిధానము (ఆశ్రయము) అయిన వానిగా, చేయున్ = చేయునుగాక.

తాత్పర్యము :

త్రిమూర్త్యాత్మకుడైన సూర్యుడు రఘునాథరాజును పరాక్రమవంతునిగా చేయునుగాక.

విశేషము :

ఉదయం బ్రహ్మ స్వరూపుడని, మధ్యాహ్నం మహేశ్వర స్వరూపుడని, సాయంకాలం విష్ణు స్వరూపుడని సూర్యుడిని ప్రార్థిస్తారు.

బ్రహ్మ రజోగుణ ప్రధానుడు; శివుడు తమోగుణ ప్రధానుడు; విష్ణువు సత్త్వ గుణ ప్రధానుడు అని ప్రసిద్ధి. ఈ పద్యములో సత్త్వ రజస్తమోగుణాల క్రమాన్ని త్రిమూర్తుల బ్రహ్మ విష్ణు మహేశ్వర వరుసను కవి పాటించలేదు. ఉత్తమమైన సత్త్వగుణాన్నే ఆశీర్వచన స్థలంలో ఉంచాడు.

సూర్యుడు ఉదయం తామరలను వికసింపజేసి పుప్పొడిని (రజోగుణమును) కనబడునట్లు చేస్తాడనీ; చక్రవాళ పర్వతమును చుట్టి పోవునప్పుడు తమము (చీకటి) వ్యాపిస్తుంది, ఆ సమయమున తమోగుణాన్ని, సంధ్యలందు మందేహులను తోలు

నప్పుడు స_త్త్వము (బలము) చూపిస్తాడు, అప్పుడు సత్త్వగుణాన్నిచెప్పి త్రిమూర్తి స్వరూపమును కవి రూఢిచేశాడు. తేజోనిధియైన సూర్యుడు కృతిపతిని తేజోనిధిగా చేయటం ఉచితము.

సూర్యుని గమనమును మందేహులను రాక్షసులు అడ్డగిస్తుంటారనీ, సంధ్యావందన సమయమున విడిచే అర్ఘ్యోదకము బాణములై సూర్యునికి సాయపడుతుంటాయనీ ఒక నమ్మకం.

*చమత్కృతి :*

సూర్యప్రార్థనలలో "ఉదయం బ్రహ్మస్వరూపుడనీ, మధ్యాహ్నం మహేశ్వర స్వరూపుడనీ, సాయంకాలం విష్ణుస్వరూపుడనీ" అంటారు. మనకవి త్రిమూర్తులకు ఈ వరుసే అవలంబించాడుగాని, మధ్యాహ్న మహేశ్వరుడుని రాత్రిమహేశ్వరుని చేశాడు.

సూర్యుడు తేజోనిధి కాబట్టి కవి రాజును తేజోనిధిని చేయమని కోరాడు. (అక్కడ తేజస్సంటే ప్రకాశం; ఇక్కడ తేజస్సంటే పరాక్రమము.) అతని దగ్గర సమృద్ధిగా ఉన్న విషయాన్నే ఇమ్మన్నాడు. ఈ పద్యములో గూడా కవి కోరడంలో ఉన్న నేర్పు కనబరిచాడు.

సూర్యుడు చేమకూర వేంకటరాజకవికి ఇష్టదైవము; అంతేకాదు; మన కవి సూర్యుడి వరంవల్ల పుట్టాడట. ఈవిషయం రఘునాథనాయకుడే ఇలాగ చెప్పాడు :

వాసించు కవిత చెప్పగ
వీసరవోవాకట భక్తి విశ్వాసంబుల్
నీ నోముమ్మలు సామాన్యుడ
వే ః సూర్యవరప్రసాది విజ్ఞగమెరుగన్.

తన ఇష్టదైవత ప్రార్థనలో గూడా కృతిపతికే అభ్యుదయం కోరాడు గాని తనకు ఏమీ కోరుకోలేదు.

*అలంకారము :*

రూపకము; శ్లేష; అనుప్రాస.

మాద్యద్దంతి ముఖార్చనా నియమమును బాటించు నెల్లప్పుడున్,
సద్యఃపూర్ణ ఫలాప్తిచే మనుచు నంతర్వాణులన్, మామనో
హృద్యుండౌ రఘునాథశౌరి, యని కూర్మిన్ సాటికిన్ బోటికిన్
విద్యాబుద్ధు లొసంగి ప్రోతు రతనిన్ విఘ్నేశుఁడున్ వాణియున్. 6

ఈ పద్యములో కవి గణపతిని సరస్వతిని ప్రార్థిస్తున్నాడు.

అర్థము :

మా అంటే లక్ష్మి; శౌరిఅంటే విష్ణువు; నాఽవిష్ణుః పృథ్వీపతిః - రాజులు విష్ణు అంశతో పుడతా రంటారు.

మా మనో హృద్యుండు ఔ = లక్ష్మీదేవి మనసుకు సంతోషము కలిగించే వాడైన, రఘునాథశౌరి = విష్ణుఅంశతో పుట్టిన రఘునాథుడు, మాద్యత్ దంతి = మదించిన ఏనుగు యొక్క (పట్టపేనుగు యొక్క), ముఖ అర్చనా నియమముఁ = ముఖమును పూజించే ఆచారమును, ఎల్లప్పుడుఁ = ప్రతిదినమును, పాటించుఁ = జరుపును, (రెండోఅర్థము: మాద్యద్దంతి ముఖ = మదపుటేనుగు ముఖముగల గణపతిని, అర్చనానియమముఁ = పూజించే నియమాన్ని, నిత్యమూపాటించును అని విఘ్నేశ్వరునితృప్తి), సద్యః = రేపురా, మాపురా, అని ఆలస్యము చేయకుండ, పూర్ణ ఫల ఆప్తిచే = నిండుగా - సంతృప్తికరముగా - బహుమానము కలిగించుట చేత, అంతర్వాణులఁ = (లోపల విద్యలుగల) విద్వాంసులను, మనుచున్ = పోషించును, (రెండో అర్థము : వాణి అంటే సరస్వతి, అంతర్వాణులఁ = లోపల ఉన్న సరస్వతులను, పోషించును అని సరస్వతితృప్తి), రఘునాథశౌరి = శూరుడైన రఘునాథుఁడు, మా = మా ఇద్దరి, (అనగా గణపతి సరస్వతుల) మనః హృద్యుండు = మనస్సులను సంతోషపెట్టువాడు, ఔఁ = అవుతున్నాడు, అని కూర్మిఁ = ప్రీతితో, విఘ్నేశుఁడుఁ = గణపతియు, వాణియుఁ = సరస్వతియు, సాటికిఁపోటికిఁ = సమానముగను, ఒకరిని మించి ఒకరును, విద్యాబుద్ధులు ఒసంగి = ఇచ్చి, అతనిఁ = రఘునాథుని, ప్రోతురు = రక్షింతురుగాక.

తాత్పర్యము :

రఘునాథరాజు నిత్యమూ చేస్తూ ఉండే దంతిముఖపూజ తనపూజయే అని గణపతి, ప్రతిదినమూ కనబరిచే విద్వాంసుల ఆదరణ తనపూజయే అని సరస్వతి, తృప్తిచెంది రఘునాథునికి విద్యాబుద్ధులిచ్చి రక్షించవలెనని ప్రార్థన.

విశేషము :

మా మనోహృద్యుండౌ రఘునాథశౌరి = లక్ష్మీవిష్ణులన్న అర్థం కవి ఉద్దేశించినదే అనాలి. లక్ష్మిని సంతోషపెట్టినవాడు మమ్మల్ని గూడా రంజింపజేశాడు అని సరస్వతీ గణపతులు లక్ష్మితో సమానంగా (సాటికిఁ పోటికిన్) రాజును సంతోషపెట్టాలి.

రాజులు పట్టపేనుగు ముఖమును పూజించే ఆచారం ఉంది. లక్ష్మికి సంతోషం కలిగించినవాడు కాబట్టి సంపదకు కొదవలేదని వీరిద్దరు విద్యాబుద్ధు[illegible] హృదయం. సాధారణంగా విద్యాబుద్ధులను సరస్వతీవిఘ్నేశ్వరులే [illegible]

సాటికిఁ బోటికిఁ = జంటపదాల పలుకుబడి, అలాకాక విడిమాటలుగా తీసుకుంటే, గణపతి సరస్వతులు ఒకరితో సాటిగా ఒకరు, ఒకరిని మించి పోటీగా ఒకరు అని కూడ చెప్పవచ్చును.

పదబంధ పారిజాతములో "సాటికి బేటికి" అని ఈ పలుకుబడి (జంటపదం) ఉంది; అర్థం = సాటికి అనే ఇచ్చారు.

*పాఠాంతరం* :

"......కూర్మిన్ సాటికిన్ బేటికిన్"

(కృష్ణమాచారిగారి పాఠం)

*అలంకారము* :

శ్లేష :

ప్రాగల్భ్యంబున విష్ణు శంభు మతముల్ పాటించి సర్వంసహా
భాగంబందు సమప్రధాన గతి యొప్పన్ రాజలోకంబులోఁ
దా గణ్యుండని యచ్యుతేంద్ర రఘునాథక్షోణిభృన్మౌళికిఁ
శ్రీగౌరుల్ సమకూర్తు రాహవ జయశ్రీ గౌరులఁ నిత్యముఁ. 7

కవి లక్ష్మినీ గౌరినీ ప్రార్థిస్తున్నాడు.

*అర్థము* :

ప్రాగల్భ్యంబునఁ = నేర్పుతో, విష్ణు శంభు మతముల్ = వైష్ణవ శైవమతములు రెంటిని(నిష్పక్షపాతంగా), పాటించి = గౌరవించి, సర్వంసహా భాగంబందుఁ = భూభాగమందు (తనరాజ్యమునందు), సమప్రధానగతి ఒప్పన్ = సమానమైన ప్రాధాన్యమునిచ్చు పద్ధతి అవలంబించడంచేత, రాజలోకంబులోన్ = రాజుల సమూహములో, తాఁ, గణ్యుండని = ఎంచదగిన వాడని, అచ్యుతేంద్ర రఘునాథ క్షోణిభృత్ మౌళికిన్ = అచ్యుతరాజు కొడుకైన రఘునాథ రాజశ్రేష్ఠునికి, శ్రీ గౌరుల్ = లక్ష్మి గౌరీ (ఇద్దఱను), క్రమముగా ఆహవ జయ శ్రీ గౌరులఁ = యుద్ధవిజయ సంపదను, రాజ్య(లాభ)మును, నిత్యముఁ సమకూర్తురు = ఎల్లప్పుడును కలుగజేయుదురు గాక. (గౌరి అంటే భూమి అని కూడా అర్థముంది.)

*తాత్పర్యము* :

శైవ వైష్ణవ మతాలను సమంగా గౌరవిస్తుంటాడన్న సంతోషంతో లక్ష్మీపార్వతులు రఘునాథుడికి ఇతోధికంగా విజయాలను, సామ్రాజ్యాన్ని ఇత్తురుగాక.

విశేషము :

తమ భర్తల మతములను పక్షపాతము లేకుండా (సమానంగా) గౌరవిస్తున్నందుకు లక్ష్మీ పార్వతులు సంతోషించి, ఈరాజే రాజలోకంలో అగ్రగణ్యుడని గ్రహించి వరములిస్తారని కవి అభిప్రాయము.

రఘునాథుడు, అతని తాత చెవ్వప్ప, తండ్రి అచ్యుతుడు అందరూ వైష్ణవ భక్తులయినా శైవమతమును గూడ చక్కగా పోషిస్తుండేవారు. కాంచి, అరుణాచలము, వృద్ధాచలము, శ్రీరంగము మొదలయిన చోటుల ఉభయమత దేవాలయాలకు గోపురాలు, విమానాలు, అమూల్యమైన ఆభరణాలు, కిరీటాదులు సమర్పించారు. అంతేకాదు, ఆరోజులలో క్రొత్తగా మనదేశానికి వస్తూఉండిన పోర్చుగీసులు (బుడుత కీచులు) మొదలైన క్రిష్టియను మతస్థులను గూడ ఆ ముగ్గురు నాయకులు సాదర బుద్ధితో చూచేవారు. ఈ మతసహిష్ణుత విజయరాఘవుల కాలములో క్షీణించింది. దానితో తంజావూరు నాయక రాజ్యము అంతరించింది.

ఆహవ జయశ్రీ గౌరులన్ - ఇది పండితులను కొంత కలవర పెట్టింది. వేంకటరాయ శాస్త్రిగారు "ఆహవ జయశ్రీన్ = యుద్ధమందలి గెలుపు సంపదను, గౌరులన్ = ఏనుగులను." సమకూర్తురు అని అర్థం వ్రాశారు.

తిరుపతి వేంకటకవులు ఈ మాటలకు ''ఆహవ జయశ్రీ గౌరులు = యుద్ధ విజయమును, ఏనుగులును'' అని ప్రచురించారు.

గౌరు అంటే ఏనుగు అని, కాహళ అని అర్థాలున్నాయి. అంతమాత్రంచేత ఏనుగుల నివ్వమని కాని, కాహళ లివ్వమనిగాని కవి అడుగవచ్చునా ? గౌరి ఏనుగుల నివ్వడానికి ప్రసిద్ధి కలిగినది అని అనలేముగదా. ఏనుగులిస్తే రాజు ధన్యుడవుతాడనీ అనలేము. కాబట్టి ఆ అర్థం పొసగదు. గౌరి అంటే నేల అని అర్థముంది. అనగా రాజ్యసంపద అని భావము.

చమత్కృతి :

ఈ పద్యంలో కోర్కెలు ఇచ్చేవారు ఇద్దరు :- శ్రీ-గౌరి.

అడగడం కూడ దానంలాగ ఒక విద్య అనీ, ఆ అడగడంలో ఒక ఔచిత్యం ఉందనీ కవి రుజువు చేశాడు. ఇందులో కవి శ్రీని అడిగినది, (ఆహవజయ) శ్రీనే; గౌరినడిగినది గౌరినే.

నేల, భూమి, అనగా రాజ్యము అంటే ఎంతో ముచ్చటగా ఉంటుంది. కవి పై పద్యాలలో కోరిన విషయాలు కూడ సంపద, విజయం, రాజ్యపాలన ఇలాంటివేకాని ఏనుగులూ, కాహళులూ మొదలైన చిల్లరవిషయాలు కావు.

పాఠాంతరము :

చివరి చరణంలో "ఆహవ జయశ్రీ గౌరు లక్రాంతముఁ"

అలంకారము :

క్రమము, యమకము, శ్లేష.

ప్రకట శ్రీహరి యంఘ్రిఁబుట్టి హరు మూర్ధంబెక్కి, యాపాద మ
స్తకముఁ వర్ణనకెక్కు దేవి సహజోదంచ త్కులోత్పన్న నా
యక రత్నంబని యచ్యుతేంద్ర రఘునాథాధీశ్వర స్వామికిఁ
సకలైశ్వర్యములు న్నిజేశు వలనఁ దాఁ గల్గఁగాఁ జేయుతఁ. 8

ఈ పద్యంలో గంగాదేవిని కవి అర్థిస్తున్నాడు.

అర్థము :

ప్రకట = వ్యాప్తిచెందిన, శ్రీహరియంఘ్రిఁ = విష్ణుమూర్తిపాదమునందు, పుట్టి = జన్మించి, హరు మూర్ధంబు = ఈశ్వరుని శిరస్సును, ఎక్కి = తలమీద ఎక్కి (ప్రియమైనదై), ఆపాద మస్తకమున్ = ఆదినుండి అంతమువరకు, వర్ణనకెక్కు దేవి = పొగడ్తలనుపొందే గంగాదేవి, సహజ ఉదంచత్ కుల ఉత్పన్న నాయక రత్నంబు : సహజ = తనతోబుట్టి, ఉదంచత్ = ప్రసిద్ధి చెందిన, కుల = జాతియందు, నాల్గవజాతియందు, ఉత్పన్న = జన్మించిన, నాయక రత్నంబు = ప్రభుశ్రేష్ఠుడు, అని (గుర్తించి), అచ్యుతేంద్ర రఘునాథాధీశ్వర స్వామికిఁ = అచ్యుతరాజు కుమారుడైన రఘునాథరాజరాజుకు, సకల ఐశ్వర్యములుఁ, నిజ ఈశువలనఁ = తన (వాడైన) ఈశ్వరుని ద్వారా, తాఁ (గంగ), కల్గగాఁ చేయుతఁ = కలుగునట్లుగా చేయునుగాక.

తాత్పర్యము :

శూద్రకులానికి గంగకు చుట్టరికము (పాదములందు పుట్టడం) ఉంది. కాబట్టి, ఆ కుల ములో ప్రసిద్ధుడయిన రఘునాథ నాయకునికి సకలైశ్వర్యములను తన వశవర్తుడైన ఈశ్వ రునిచేత ఇప్పించునుగాక అని అభిప్రాయము.

*విశేషము :*

శ్రీహరి అంఘ్రిఅంటే విష్ణుపదము; విష్ణుపదమంటే ఆకాశము. వామనావతార ఘట్టములో విష్ణువు ఆకాశాన్నంతటిని ఒకపాదముతో ఆక్రమించాడుగదా. అక్కడ పుట్టినందువల్లనే గంగను ఆకాశగంగ అంటారు. కాబట్టి ప్రకట అంటే ప్రసిద్ధమైన అనడంకంటే మిక్కిలి వ్యాప్తిచెందిన అని అర్థం చెప్పడం సమంజసము.

ఈశ్వరుడు తలపై గంగను ఎక్కించుకొన్నాడంటే గంగను ఎంతగా ప్రేమించాడో తేటపడుతుంది. అంతప్రేమ ఉన్నది కాబట్టే తాను చెప్పినట్లు అతని చేత చేయించ గలుగుతుంది.

గంగ విష్ణుపాదమున పుట్టింది. శూద్రులు బ్రహ్మపాదములనుండి పుట్టారని ప్రసిద్ధి. అయినా కవి శూద్రకులము గంగకు సహజకులమని అన్నాడు. (సహజ = తోబుట్టిన.) కాబట్టి బ్రహ్మ విష్ణువులకు అభేదమయినా చెప్పాలి. లేదా ఈ, ఆ, అనకుండా కేవలం "పాదములందు పుట్టినవారు" మాటచేత తోబుట్టువులని అయినా చెప్పాలి.

హరు మూర్ధం బెక్కడం - భగీరథప్రయత్నమువల్ల కలిగిన గంగావతరణకథ.

ఆపాదమస్తకము - ఇదొక పలుకుబడి - పలుకుబడులను, సామెతలను కావ్యములందు ప్రయోగించడంలో మన కవికి ఒకప్రత్యేక నియమముంది. వాటికి చెప్పవలసిన సాధారణ (స్థూల) అర్థంతో తృప్తిపడడు; పదబంధములోని విడిమాట లకు గూడా అన్వయం కుదిరినట్లుచేసి చక్కని చమత్కారం కనబరుస్తాడు.

ఆపాదమస్తకమంటే నఖశిఖపర్యంతము, ఆద్యంతము, అన్ని స్థలములందు, అంతటా అని అర్థం చెప్పుతేచాలును. పాద, మస్తక శబ్దాలకు అర్థం చెప్పనక్కరలేదు. అయినా ఈపద్యములో కవి ఒక పాదము, ఒక మస్తకము (శిరసు) చూపించాడు; ఆ విష్ణు పాదమునుంచి ఈ శివుడి తలవరకు అని నిరూపించాడు.

గంగ మూడులోకాలలోను ప్రవహిస్తుందనీ, "త్రిజగద్దీవ్యంతిని" అనీ, మూడు లోకాలలోను ప్రతిచోట అది పాపవినాశిని అనీ ప్రసిద్ధి. అందుకే (ఆపాదమస్తకము) వర్ణన కెక్కుదేవి అన్నాడు.

మూర్ధంబెక్కు - ఇదీ ఒక పలుకుబడే. నెత్తిమీద ఉండడమే కాక, అత్యంత ప్రేమాస్పదమై ఉండు అన్న అర్థం కూడ ఉంది. కాబట్టే గంగ తన భర్తచేత

తన కోరిక నెరవేరినట్లు చేయించగలదు. రఘునాథుడంటే బంధుప్రీతి అసంగతం కాదు. ఐశ్వర్యం ఇవ్వగలవాడు ఈశ్వరుడు. కాబట్టి మన కవికి అభ్యర్థనయందున్న సూత్రం ప్రకారం ఐశ్వర్యంకోసం ఈశ్వరుడినే కోరాలి. ఆపని గంగాదేవిచేత చమత్కారంగా చేయించాడు. భర్తలకు 'రికమెండ్' చేసి ఉద్యోగాలిప్పించిన యువతులు ఉన్నారుకదా!

నిజేశువలనన్ — ఈశుడు = ప్రభువు (భర్త), ఈశ్వరుడు అని అర్థాలున్నాయి. నిజేశువలనన్ = తనభర్త (ఈశ్వరుని) వలన అని అర్థం చెప్పవచ్చును. కాని, 'తన ఈశ్వరుని వలన' అనగా, తన వశవర్తి, తనకు కాణాచి అయిన ఈశ్వరుని వలన అని అనడం బాగుంటుంది కదా! హరుమూర్ధంబెక్కి అన్నమాటలు మరింత సార్థకమవుతాయి.

నాటకాలలో పాత్రలు ప్రవేశించినప్పుడు మంచి రచయిత చక్కని నేర్పు కనబరుస్తాడు. ఆ పద్ధతినే మన కవి తన వర్ణనాదులలో కొత్తవిషయం ప్రవేశపెడుతున్నప్పుడు చాల శ్రద్ధతో ప్రదర్శిస్తాడు.

ఇక్కడ దైవప్రార్థనలు ముగియాలి, కృతిపతి వంశావళి ఆరంభంకావాలి. ఈ రెండు అంశాలను కలపడానికి గంగాదేవిని ఉపయోగించాడు కవి. అటు దేవత; ఇటు రాజులకు తోబుట్టువు. రాజవంశమన్న కొత్తవిషయాన్ని ప్రవేశపెట్టడానికే కవి గంగాప్రార్థన (కొంచెం అసాధారణ విషయం) చేశాడని చెప్పనక్కరలేదు.

ఒక్క మాట :

పై ఎనిమిది పద్యాలలోను కవి దేవతాస్తుతిచేసి ఇప్పుడు కృతిపతి వంశవర్ణన ఆరంభిస్తున్నాడు. ఆప్రార్థనలలో విష్ణు, బ్రహ్మ, రుద్ర, సూర్య, గణేశ, సరస్వతి, లక్ష్మి, పార్వతి, గంగలను అర్థించాడు. మొదటి అయిదు పద్యాలలో పురుషదేవులను చెప్పి, ఆరవదానిలో గణేశ సరస్వతు లన్న స్త్రీపురుష దేవతల ఉభయులను స్తుతించి, ఆ తరువాత అందరినీ ఆడు దేవతలనే ప్రార్థించాడు. ఇదొక సొగసు కదా!

ఇన్ని పద్యాలలోను కవి కోరిన కోరికలన్నీ రఘునాథరాజుకే; తనకొక్క కాసంతయిన కోరలేదు. స్వార్థచింత రవంతైన చూపలేదు. రాజు బాగుంటే తానూ బాగుంటానన్న భక్తి విశ్వాసాలు నిరూపించాడు.

కృష్ణదేవరాయల మన్నన లనేకము పొందిన అల్లసాని పెద్దన, "గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికై" అన్నాడు; బమ్మెరపోతన "దుర్గ, మాయమ్మ, కృపాబ్ధి యీవుత కవిత్వ పటుత్వ మహత్వ సంపదల్" అని సొంతానికి కోరాడు.

చేమకూర కవి తన ఇష్టదేవత అయిన సూర్యుడిని ప్రార్థించినప్పుడయినా తన్ను గురించి ఒక్క కోరిక కోరలేదు. రాజునే తేజోనిధిని చేయమన్నాడు. "భక్తి విశ్వాసంబుల్ నీ సొమ్ములు" అని రఘునాథరాజు అన్నాడంటే తప్పా!

## కృతిపతి వంశవర్ణన

ఆ రాజశేఖర ప్రియ
వారిజముఖి తోడు గాఁగ వర్ధిలు విమల
శ్రీరుచిర వర్ణమున ధా
త్రీరంజన సుకృతి చెవ్వనృపతి జనించెన్. 9

అర్థము :

ఆ రాజశేఖర ప్రియ వారిజ ముఖి = మీదిపద్యములో ఉన్న గంగాదేవి (రాజశేఖరుడు- చంద్రుని తలపూవుగా గలవాడు ఈశ్వరుడు, అతని ప్రియవారిజముఖి అంటే ప్రియకాంత గంగ), తోడుగాఁగ = తోబుట్టువుగా ఉండగా, వర్ధిలు = అభివృద్ధి చెందుతున్న, విమలశ్రీ = నిర్మలమైన సంపదచే, రుచిర = ప్రకాశించుచున్న, వర్ణమున = జాతియందు (నాలవజాతియందు), ధాత్రీరంజన = భూమిని (జనులను) సంతోషపెట్టు, సుకృతి = ధన్యుడు (పుణ్యాత్ముడు), చెవ్వనృపతి = చెవ్వప్ప అన్న భూస్వామి (తరువాత నృపతి = రాజు అయాడు) పుట్టెను.

తాత్పర్యము :

గంగాదేవిని తోబుట్టువుగా కలిగి అభివృద్ధి చెందుతున్న జాతిలో, ప్రజలను సంతోష పెట్టే ధన్యుడు చెవ్వప్పనాయకుడు జన్మించాడు.

తంజావూరు పాలించిన నాయక రాజులకు ఈ చెవ్వప్పే మూలపురుషుడు. అంతకు పూర్వము ఈ వంశము వారికి తంజావూరి రాచరికం లేదు.

విశేషము :

ఈ పద్యం గూడ పండితులకు పని కల్పించింది.

"ఆరాజశేఖరుడు ప్రియ
వారిజముఖి తోడుగాఁగ వర్ధిలు విమల
శ్రీ రుచిర వంశమునన్......

(అని వేంకటరాయ శాస్త్రిగారి పాఠము)

ఈ పాఠాన్నెత్తుకొని "ఆ ప్రభుశ్రేష్ఠుడు; ప్రియవారిజముఖి = ప్రియభార్య, తోడు = సహధర్మచారిణి (కాగా); విమల శ్రీ రుచిరవంశమునన్ = ఉత్కృష్టమైన సంపదచేత కాంతిగలదైన కులమునందు," అని అర్థముచెప్పినారు. కాని ఇది సమంజసముగా కనబడదు. ఆరాజశేఖరుడని నిర్దేశించిన రాజశేఖరు డెవ్వడు ? ఏమిచేశాడు ? పై పద్యములలో ఉన్నరాజు షష్ఠీవిభక్తిలో ఉన్న రఘునాథుడే; అతనితో వంశావళిని ఆరంభించడం ఎంతవరకు భావ్యం ?

"ఆ" అని కవి నిర్దేశించినది "వారిజముఖి"—ఆ వారిజముఖి తోడుగాగ...... అని భావం. ఆ వారిజముఖికి విశేషణంగా "రాజశేఖరప్రియ" అని అన్నాడు. అంతే గాని ఈ పద్యంలో రాజశేఖరుడెవడూ లేడు.

వేంకట కృష్ణమాచార్యులు, తిరుపతి వేంకట కవులు కూడ "ఆరాజశేఖర ప్రియ వారిజముఖి తోడుగాగ" అన్న పాఠాన్నే అంగీకరించారు.

పై పద్యములో (ప్రకట శ్రీహరి అంఘ్రిబుట్టి......) అని గంగాదేవిని ప్రార్థించడము, ఆమెతో సంబంధమున్న ఈ కృతిపతి వంశాన్ని ప్రవేశపెట్టడానికే అనడం సమంజసము. సాధారణముగా దేవతాస్తుతిలో గంగనుప్రార్థించినవారు అరుదు.

పాపవినాశిని అయిన గంగ తోబుట్టువుగా వర్ధిలు వర్ణము కాబట్టే నాలవజాతి విమల మైనది.

పాఠాంతరాలు :

వర్ధిలు అనడానికి బదులు వర్తిలు అనిన్నీ, వర్ణము అనడానికి బదులు వంశము అనిన్నీ స్వల్ప పాఠభేదాలున్నాయి. వర్తిలు = ప్రవర్తించు.

చమత్కృతి :

కవీ కృతిపతీ ఇద్దరూ నాలవ జాతివారే. తమ జాతి ఉత్కృష్టతను ప్రకటించడం తప్పుకాదు. ఆపని గూడ కవి వాచ్యంగా చెప్పలేదు. చూడండి : కర్షకులకు గంగ చాల ముఖ్యము. భూములు వర్షాధారాలు, జలాధారాలు కదా. ఆ గంగ తోడుగా ఉంటే సేద్యంవల్ల ఆజాతి (వర్ధిల్లి) అభివృద్ధిచెంది విమల శ్రీ రుచిర వర్ణమవుతుంది. అంటే విమల = (అన్యాయార్జితము కాక చెమట ఊడ్చి సంపాదించి నందువల్ల) కళంకములేని, శ్రీ = సంపదచేత, రుచిర = మనోహరమైన, వర్ణము అని నిరూపించాడు కవి. ఆజాతిలో పుట్టిన చెవ్వప్ప ధాత్రీరంజన

సుకృతి—భూమిని రంజించినందువల్ల ధన్యుడయినవాడు. భూమిని రంజించడం అంటే భూమి సారవంతమూ, ఫలవంతమూ అయి సంతోషాన్ని కలిగించేటట్టు చేయడమన్న మాట. గంగ తోడుగా ఉంటే కర్షకజాతి కళంకంలేని సంపదతో భూమిని ఫలవంతంచేసి ధన్యులవుతారని అభిప్రాయం.

పెండ్లి అయిన తర్వాతనే చెవ్వప్ప రాజయినాడు. అంతకు పూర్వము అతడు సంపన్నుడైన భూస్వామి. భూమి తోటలతోనూ, పంటలతోనూ, నిండిసుందరంగా ఉండేలాగ చేసేవాడు.

భూమిని రంజిల్ల జేసినవాడు సుకృతి అవుతాడని సూచన.

గంగ తోడుపడుతున్న దనడానికి చెవ్వప్ప చాల జలాశయాలు తంజవూరు రాజ్యములో నిర్మించాడు. వాటిలో ఒకటి తంజావూరు సమీపంలో "చెవ్వప్ప నాయకుని కుంట" అన్న పేరుతో ఇప్పటికీ ఉంది. చెవ్వప్ప అన్నపేరు మన ఎర్రన్న వంటిది.

అలంకారము :

శ్లేష.

శీవి నచ్యుతరాయల దేవియైన
తిరుమలాంబకు ననుజయై తేజరిల్లు
మూర్తిమాంబను బెండ్లియై కీర్తివెలయఁ
చెవ్వ విభుడు మహోన్నత శ్రీఁ జెలంగె. 10

అర్థము :

అచ్యుతరాయల దేవియైన = (శ్రీకృష్ణ దేవరాయల తమ్ముడు) అచ్యుతరాయలకు భార్యయైన, తిరుమలాంబకు, అనుజయై = చెల్లెలై, శీవిన్ = శోభతో, తేజరిల్లు = ఒప్పిన, మూర్తిమాంబను, పెండ్లియై = వివాహముచేసికొని. చెవ్వవిభుడు, కీర్తివెలయన్ = తన కీర్తిప్రకాశించునట్లుగా, మహోన్నత శ్రీన్ = మిక్కిలి గొప్పసంపదతో, చెలంగెన్ = ఉండెను.

తాత్పర్యము :

ఈ వివాహమువల్ల చెవ్వప్పకు కీర్తికలిగింది; రాజ్యసంపద లభించింది.

విశేషము :

శ్రీ కృష్ణదేవరాయలు తమ్ముడు అచ్యుతరాయలకు చెవ్వవిభుడు తోడి అల్లుడన్నమాట. ఈ వివాహమువల్లనే చెవ్వప్ప తంజావూరుకు అధిపతి కాగలిగాడు.

అది సూచించేందుకు కవి మహోన్నతశ్రీ కలిగిందని చెప్పాడు. ఇతడే తంజావూరు ప్రథమ నాయక రాజు.

ఆ చెవ్వ నృపాలాగ్రణి
యాచంద్రార్కముగఁ గాంచి, నరుణాచల, వృ
ద్ధాచలములఁ గట్టించె మ
హాచతుర సమీర [1]గోపురావరణంబుల్. 11

అర్థము :

ఆ చెవ్వనృపాల అగ్రణి = చెవ్వప్ప అను రాజశ్రేష్ఠుడు, ఆచంద్ర అర్కముగన్ = చంద్రుడు సూర్యుడు ఉన్నంతకాలముండేటట్లుగా (శాశ్వతంగా అని), కాంచిన్ = కాంచి(కంజీవరము) యందును, అరుణాచల, వృద్ధాచలములన్ = తిరువణ్ణామలై, వృద్ధాచలములు అను పుణ్యక్షేత్రములందును, మహాచతుర = గొప్పపనితనము కలిగిన, సమీరగోపుర = గాలిగోపురములను, ఆవరణంబుల్ = ప్రాకారములను కట్టించెను.

తాత్పర్యము :

చెవ్వప్ప కంజీవరం, తిరువణ్ణామలై, వృద్ధాచలములలో దేవాలయాలకు చక్కని గాలి గోపురాలను, ప్రాకారాలను కట్టించాడు.

విశేషము :

ఈ తంజావూరు నాయకులది మిక్కిలి దైవభక్తి కలిగిన వంశము. ఈ చెవ్వప్ప మంచి శివభక్తి కలవాడైనా విష్ణుమతాన్ని గూడ ఆదరించేవాడు ఇతని తరువాత వచ్చిన తంజావూరు నాయకరాజులు ముగ్గురూ విష్ణుభక్తిని గాఢంగా ప్రకటించారు. దక్షిణదేశంలో అనేక పుణ్యస్థలాలలో వారు నిర్మించిన దేవాలయభాగాలు,

---

1. చెవ్వప్ప శ్రీశైలములో ప్రాకార సోపాన పాళినీ, వృద్ధాచలములో ప్రాసాద మండపములనూ, అరుణాచలములో గోపురమునూ కట్టించినట్టు శ్రీ నిడుదవోలువారు.

చెవ్వప్ప ఈగోపురాదులన్నీ కట్టడం తనకు పెండ్లి అయి, తంజావూరు రాజ్యము తనకు వచ్చిన తర్వాతనే. అప్పుడే అది సాధ్యం కూడ. అందుచేత ఈ పద్యానికి ముందు అతని వివాహం గురించి చెప్పడం సమంజసం. కాబట్టి వివాహం గురించిన పద్యం మొదట చదివి, ఈ పద్యమును తరువాత చదివితే విషయము చక్కగ బోధపడుతుందని తక్కిన వారి ముద్రణలలో నున్న 10 వ పద్యాన్ని 11 వ పద్యముగాను, వాటిలోని 11 వ పద్యాన్ని 10 వ పద్యముగాను మార్చవలసి వచ్చింది.

అలంకారాలు ఇప్పటికీ చూడవచ్చు. శివ విష్ణుమతముల నాదరించడమె కాకుండా, చెవ్వప్ప అప్పుడు క్రొత్తగా వచ్చిన క్రిష్టియను పోర్చుగీసు వారికి చర్చి, ఇళ్ళు కట్టుకోవడానికి అనుమతిగూడా ఇచ్చాడు.

పాఠాంతరము :

.........., కట్టించె మ
హాచతురత మీఱ గోపురావరణంబుల్.

(తిరుపతి వేంకట కవులు, వేంకట కృష్ణమాచార్యులు)

మహాచతురత = మంచిపనితనము, మీఱఁగ = అతిశయించునట్లు అని అర్థం.

ఆ మూర్తిమాంబ కఖిల మ
హీ మండలనాథుఁ డచ్యుతేంద్రుఁడు సుగుణో
ద్దాముఁడు జన్మించెం; ద
ద్భూమీపతి రంగధాము పూజఁగ మించెన్. 12

అర్థము :

ఆమూర్తిమాంబకు, అఖిల మహీమండల నాథుఁడు = సమస్త భూమండలమునకు ప్రభువు, సుగుణ ఉద్దాముఁడు = మంచిగుణములచే అధికుడు, అయిన, అచ్యుతేంద్రుడు = అచ్యుతరాజు, జన్మించెన్ = పుట్టెను, తత్ భూమీపతి = ఆ అచ్యుతరాజు, రంగధాముపూజన్ = శ్రీరంగ నివాసుడైన రంగనాథస్వామి పూజచేత, మించెన్ = అతిశయించెను.

తాత్పర్యము :

ఆ మూర్తిమకు అచ్యుతరాజు పుట్టి, రంగనాథస్వామియందు భక్తికలిగి ఉండేవాడు.

విశేషము :

చెవ్వప్ప కిందనున్న రాజ్యము అచ్యుతుడి కాలములో చాల విస్తరిల్లింది. కాబట్టే అఖిలమహీమండల నాథుడని వర్ణించాడు కవి. ఈ అచ్యుతనాయకుడు విశేష ఆదరాభిమానాలతో రంగనాథుని పూజించేవాడు. ఈ విషయాధిక్యమును కవి ఈ కింది పద్యంలో చక్కగా రూఢిచేశాడు.

అలంకారము :

యమకము - జన్మించెన్, (పూ) జన్మించెన్.

శ్రీరంగేశుఁడె వచ్చి, అచ్యుత ధరిత్రీభర్తయై భాగ్యరే
ఖారూఢిన్ విలసిల్లి, తాన తనకుం గైంకర్యముల్ చేసెఁగా
కే రాజైనను జేయఁగా గలిగెనే? యిట్లీ విమానం బహో!
భూరి స్నిగ్ధముగా, మహామణిమయంబుల్గాఁ గిరీటాదులున్. 13

అర్థము :

శ్రీరంగేశుఁడె = శ్రీరంగనాథ దేవుడే, వచ్చి = ఈలోకానికివచ్చి, అచ్యుత ధరిత్రీభర్తయై అచ్యుతరాజుగా అవతరించి, భాగ్యరేఖారూఢిన్ = స్థిరమైన అదృష్టరేఖతో, విలసిల్లి = ప్రవర్తించి, తాన = తానే, తనకున్ = తనకు (సంతృప్తికరమైన), కైంకర్యముల్ = అర్చన అలంకరణ మొదలైన సేవలు, చేసెన్ = చేసుకొన్నాడు, కాక = అలా కాకపోయినట్లయితే, ఏ రాజైనను = ఎంతటి గొప్ప రాజైనప్పటికీ, అహో = ఓహో, ఇట్లు = ఈ అచ్యుతరాజు నిర్మించినట్లు, భూరిస్నిగ్ధముగా = బంగారముతో దట్టమగునట్లుగాను (పూతగానూ, బోలుగాను కాక అని), ఈ విమానంబు = ఈ శ్రీరంగంలో ఉన్న దేవ (గర్భ) మందిరమున్నూ, మహామణిమయంబుల్గాన్ = గొప్ప మణులతో చేసిన, కిరీట అదులున్ = కిరీటము మొదలైన ఆభరణాలున్నూ, చేయగా కలిగెనే = చేయగలిగినాడా ?

తాత్పర్యము :

శ్రీరంగనాథుడే అచ్యుతరాజుగా అవతరించి తనకు సంతృప్తికరమైన ఆలయాలనూ అలంకారాలనూ స్వయంగా చేసుకొన్నాడా అన్నట్లు శ్రీరంగంలో అద్భుతమైన బంగారు విమానము, మణులతో నిండిన కిరీటాదులు చేయించాడనీ (అనగా), ఈ రాజు కట్టించిన విమానాదులచే రంగనాథుడు సంపూర్ణమైన సంతృప్తి చెందాడనీ భావము.

విశేషము :

దేవాలయాలలో మూలవిగ్రహం ఉండే గర్భాలయంమీదకట్టిన కట్టడానికి (దీని శిఖరంమీద సాధారణంగా కలశాలుంటాయి.) విమానం అంటారు. ఇది గోపురంకాదు.

ఇటీవల తిరుపతి తిరుమల దేవస్థానంవారు అనేక లక్షల వ్యయంతో వేంకటేశ్వరస్వామివిమానం భూరిస్నిగ్ధముగాచేసి, అమూల్యమైన మణులతో, వరదహస్తము మొదలయిన ఆభరణాలతో మూలవిగ్రహాన్ని అలంకరించారు.

''తద్భూమీపతి రంగనాథుపూజన్ మించెన్'' అనినందుకు తార్కాణగా శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు అచ్యుతనాయకుని భక్తిప్రపత్తులను ఈలాగున వర్ణించారు :

"చెవ్వనృపతి కుమారు డచ్యుతప్ప నాయకుఁడు, శ్రీరంగపతికి సింహాసనము, ప్రణవమయంబగు పసిడిసజ్జ, దేవాలయమున కష్టమప్రాకారము - గోపురము సమర్పించెను."

.......................................

"అచ్యుతునికి శ్రీరంగనాథు డిష్టదైవము. కుమారుడగు రఘునాథునికి రాజ్యమప్పగించి అచ్యుతనాయకుడు తన చరమదశను శ్రీరంగక్షేత్రమందే గడపినాడని, సాహిత్యరత్నాకరాది గ్రంథములు సాక్ష్యము నిచ్చుచున్నవి."

.......................................

"ఇట్లే విజయరాఘవ నాయకుడు (రఘునాథనాయకుడి కొడుకు) శ్రీరంగనాథస్వామికిని భక్తుడు, అతడు ప్రతిదినమును ముప్పదిమైళ్ళ దూరమువెళ్ళి స్వయముగా శ్రీరంగనాథుని దర్శించి తిరిగి తంజావూరుకు వచ్చుట చరిత్ర ప్రసిద్ధము."

— దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము.

ఈ విమానాదులను చూచినవారు వ్యక్తం చేసిన ఆశ్చర్యాన్నే కవి "అహో!" అన్న పదంతో తెలియజేశాడు.

అలంకారము :

ఉత్ప్రేక్ష, అతిశయోక్తి.

గెలిచిన గెల్పు, లర్థితతికిన్ దినమిచ్చిన యీవులున్, వహుల్
తలఁచిన, విక్రమార్కు లొక లక్షయుఁ గర్ణులు గోటియుం గదా
కలిగిన నీడు వత్తు రనఁగాఁ దగు; సాహస దాన సద్గుణం
బులు ధరయందుఁ బుట్టఁగనె పుట్టిన వచ్యుత భూమి భర్తకున్. 14

అర్థము :

గెలిచిన గెల్పులు = సాధించిన విజయములును, అర్థితతికిన్ = యాచకుల సమూహమునకు, దినము = ప్రతిరోజును, యిచ్చిన, యీవులున్ = చేసిన దానములును, వహుల్ = వారి లెక్కల పుస్తకములను (బట్టి), తలఁచిన = ఆలోచించినట్లయితే, విక్రమార్కులు ఒకలక్షయు, కర్ణులు కోటియున్ = లక్షమంది విక్రమార్కులూ, కోటిమంది కర్ణులూ, కలిగినన్ = ఉన్నట్లయితే కదా, అచ్యుతభూమిభర్తకున్ = అచ్యుతరాజుకు, ఈడువత్తురు = సాటి అవుతారు, అనగాన్

తగున్ = అని చెప్పవచ్చును, సాహసదానసద్గుణంబులు = సాహసము, దానము, అన్న మంచిగుణ ములు, ధరయందుపుట్టగనె = అచ్యుతరాజు జన్మించినప్పుడే (పుట్టుకతోనే). పుట్టినవి = కలిగినవి.

తాత్పర్యము :

అచ్యుతనాయకుడు సాహసమునందు విక్రమార్కుడిని, దానమునందు కర్ణుడిని మించి ఉన్నవాడన్నమాట. విజయములనుబట్టి (సాహస గుణమునందు) లక్షవిక్రమార్కులును, ఈవులనుబట్టి (దానగుణములో) కోటికర్ణులును, సాటివస్తారనీ, ఈగుణములు నేర్చుకొన్నవి గాక, పుట్టుకతోనే కలిగినవనీ భావం.

విశేషము :

ఈ పద్యములో ''వహుల్'' అన్నపదం మన పండిత వ్యాఖ్యాతలను కొంత కలవర పరిచింది. అసందర్భమయిన అర్థం చెప్పి వారు సంతోషించారు.

తిరుపతి వేంకటకవులు ''గెలిచిన గెల్పు లర్థి తతికిన్ దినమిచ్చిన యీవులన్ వహుల్'' అన్న పాఠము నెత్తుకొని, వహుల్ = పక్షములు అని దిగువను అర్థం ఇచ్చారు.

వేదం వేంకటరాయ శాస్త్రిగారు "గెలిచిన గెల్పు లర్థితతికిన్ దినమిచ్చిన యీవులజా వహుల్ అన్నపాఠాన్నే గ్రహించి "ఈవులజా = దానములందలి, వహుల్ = విధములను'' అని వ్యాఖ్యానించారు.

ఏ విధంగా చూచినా ''విధములు, పక్షములు'' అనే అర్థాలు పొసగవు.

వేంకట కృష్ణమాచార్యులు "ఈవులజా బహుల్" అని ముద్రించారు. వారి అభిప్రాయమేమిటో తెలియడాని కవకాశంలేదు.

రోజువారీ లెక్కలకు "దినవహి" (Day Book) అని వాడుక ఇప్పటికీ ఉన్నది. ఈ లెక్కలు వ్రాయువారు "దినవహివారు". ఈ ఇంటి (బిరుదు) పేరుగలవారు ఇప్పటికీ ఈ ప్రాంతాలలో ఉన్నారు.

పర్షియన్ భాషలో 'బహి' అంటే ఖాతాపుస్తకం. దీన్నే వహి అంటారు. ఈ బహి వికృతి రూపమే, "బయి". ఒరియా భాషలో ఇది "బొయి" అవుతుంది. (బొయి ధొరి అసో = పుస్తకంపట్టుకొనిరా.) వహి, బహి, బయి, బొయిరూపాంతరాలు.

తలచిన = తరచిన = పరిశీలించి చూచిన అని కూడ చెప్పుకో వచ్చును. ర, ల లకు అభేదం కదా.

ఆ లెక్కల పుస్తకాలను చూస్తే అచ్యుతరాజు గెల్పులూ, దానాలు అత్యధికంగా కనిపిస్తాయనీ, విక్రమార్కులు కొందరు, కర్ణులు కొందరు అయితేనేగాని సరిపోలలేరనీ భావము.

పాఠాంతరాలు :

1. "ధరయందు పుట్టఁగనె పుట్టిన యచ్యుత భూమిజానికిన్"
2. "దినమిచ్చిన యావులున్ వహుల్"
3. "దినమిచ్చిన యావులున్ బహుల్"

వేంకట కృష్ణమాచార్యులవారి పాఠం.

అలంకారము :

అతిశయోక్తి, క్రమము.

వీరాగ్రేసరుఁ డర్థిపోషణ గుణావిర్భూత భాస్వ ద్యశో
ధౌరేయుండు, మణీతులాదిక మహాదానావళుల్ సేయఁదా
నౌరా ! మార్గము వెట్టినట్టి ఘనుఁ డాహా ! లోకమం దచ్యుత
క్ష్మారాణ్మౌళి యొనర్చు పుణ్యమహిమల్ శక్యంబె లెక్కింపఁగన్. 15

అర్థము :

వీరాగ్రేసరుఁడు = వీరులలో శ్రేష్ఠుడు, అర్థి......ధౌరేయుండు - అర్థి = యాచకులను, పోషణగుణ = పోషించుట అను గుణమువల్ల, ఆవిర్భూత = కలిగిన, భాస్వత్ = ప్రకాశించుచున్న, యశః = కీర్తిని, ధౌరేయుండు = వహించినవాడు (యాచకులను పోషించుటచేత గొప్ప కీర్తిని గడించినవాడు), మణీ తులా ఆదిక మహాదాన ఆవళుల్ = మణులతో తులాభార దానము మొదలైన గొప్పగొప్ప దానాల వరుసలను (పరంపరగా), చేయన్ = చేయడానికి, తాన్, ఔరా ! మార్గము వెట్టినట్టి = దారిజూపినట్టి, ఘనుడు, తంజావూరు రాజులకు దారిచూపినట్టి ఘనుడు (అనగా తులాభారాది మహాదానాలను ఆవంశములో మొట్టమొదట చేసినవాడు), ఆహా ! లోకమందు, అచ్యుతరాట్ మౌళి = అచ్యుతరాజశ్రేష్ఠుడు, ఒనర్చు = చేసినట్టి, పుణ్య మహిమల్ = పుణ్యకార్యముల గొప్పతనములను, లెక్కింపఁగన్, శక్యంబె = శక్యమా ? కాదన్నమాట.

తాత్పర్యము :

యాచకులను పోషించడంవల్ల గొప్పకీర్తిని గడించి మణులతో తులాభారము మొదలైన మహాదానాలను తానుచేసి, తన వంశమువారికి దారిచూపిన అచ్యుతరాజు చాల పుణ్యాలు చేసినవాడని భావము.

*విశేషము :*

తన బరువుకి సమానమైన మణులనుతూచి వాటిని యాచకులకు ఇచ్చే దానము మణీతులాదానము. "ఇలాంటి తులాభార దానాలను తరువాతి తంజావూరి నాయకరాజు లిద్దరూ చేసినట్లు చరిత్ర తెలుపుతున్నది.

ఆది శబ్దమువల్ల హిరణ్యగర్భము, గోసహస్రము మొదలైన మహాదానాలని తెలియాలి. శత్రురాజులపై విజయమును సాధించినప్పుడే మణీతులాదిక దానాలు చేస్తారు. అచ్యుతనాయకు డావిధంగా అనేక విజయాలను సాధించాడని "గెలిచిన గెల్పు లర్థితతికిన్......" అన్న 14 వ పద్యములో కవి ప్రకటించాడు.

మణీతులాదిక మహాదానావళుల్ అన్నప్పుడు అవి "గో, భూ, తిల, హిరణ్య, రత్న, విద్య, కన్య, దాసి, శయ్య, గృహ అగ్రహార, రథ, గజ, అశ్వ, ఛాగ, మహిషీ" అన్న షోడశ దానాలుగా భావించరాదు. ఇవి పేరుకి మహాదానాలని అనినా, తులాభార, హిరణ్యగర్భ, గోసహస్ర, మహామోక్ష మొదలైన దానాలవంటి గొప్పవికావు.

*అలంకారము :*

అతిశయోక్తి.

## రఘునాథరాజు

ఆ పుణ్యఫలంబుగనె ద
యా పాథోరాశి యైన యల యచ్యుత భూ
మీపతికిఁ రఘునాథ
క్ష్మాపాలుం డుదయ మయ్యె జైవాతృకుఁడై. 16

*అర్థము :*

ఆ పుణ్యఫలంబుగనె = (పై పద్యములో చెప్పిన ఆ పుణ్యముల వలన కలిగిన ఫలమే అన్నట్లుగా, దయా = కరుణకు, పాథోరాశి = (జలరాశి) సముద్రుడు, ఐన, అల అచ్యుతభూమీపతికిఁ = ఆ అచ్యుతరాజుకు, రఘునాథక్ష్మాపాలుడు = రఘునాథరాజు, జైవాతృకుడై = చిరంజీవిగా (చంద్రునివలె), ఉదయమయ్యెన్ = జన్మించెను.

*తాత్పర్యము :*

అచ్యుతరాజు చేసిన పుణ్యాల ఫలముగా అతనికి రఘునాథరాజు జన్మించాడని భావము.

*విశేషము :*

జైవాతృకుడు అంటే చంద్రుడు, ఆయుష్మంతుడు - చిరంజీవి అని అర్థాలు. అచ్యుతుడు (దయా) సముద్రుడు కాబట్టి, అతనికి పుట్టిన కొడుకు రఘునాథరాజు చంద్రునివంటివాడు అని చమత్కారం.

అచ్యుతరాజు అంత గొప్పపుణ్యం చేయబట్టే రఘునాథుడివంటివాడు పుట్టాడు. ఈ పద్యంలో అచ్యుతుడి పుణ్యం చెప్పి, ఆ పుణ్యఫలమని రఘునాథపాత్రను ప్రవేశ పెట్టాడు కవి. కొత్తవిషయాన్ని ప్రవేశపెట్టవలసినప్పుడు ఇలాంటి చమత్కారం కవి చూపుతుంటాడు.

*పాఠాంతరము :*

"ఆ పుణ్యఫలంబుననె" అని వేంకటకృష్ణమాచార్యులు, వావిళ్ళ శాస్త్రిగార్ల పాఠము.

*అలంకారం :*

రూపకము, శ్లేష.

పుట్టిన దాదిగాఁ దనదు పుణ్యమె దాదిగ, వైరిభూమి భృ
ద్ఘట్ట మదంబు దా దిగ, సదా దిగధీశ నుతప్రతాపుఁడై,
పట్టమహాభిషేక బహుభాగ్య దురంధరుఁడై యయోధ్య య
న్పట్టణ మేలు సామియె యనఁ రఘునాథ విభుండు వర్ధిలుఁ. 17

*అర్థము :*

పుట్టినదాదిగాఁ = పుట్టినది మొదలుకొని, తనదు పుణ్యమె = తాను చేసిన సుకృతమే, దాదిగాఁ = పెంచిన దాదిగా తన్ను కాపాడుచుండగా, వైరి = శత్రువులైన, భూమిభృత్ = రాజుల, ఘట్ట = సమూహము యొక్క, మదంబు = గర్వము, తాఁ దిగఁ = తగ్గిపోగా, సదా = ఎల్లప్పుడు, దిక్ అధీశ నుత ప్రతాపుడై — దిక్ అధీశ = నాలుగు దిక్కులనున్న రాజుల చేత (ఇంద్రాదులైన దిక్పతులచేత), నుత = పొగడబడిన, ప్రతాపుడై = పరాక్రమము కలవాడై, పట్టమహా.........దురంధరుడై — పట్ట మహాభిషేక = గొప్ప పట్టాభిషేకము (మొదలైనటువంటి), బహుభాగ్య = అనేక విధములైన ఐశ్వర్యములను, దురంధరుడై = భరించినవాడై (కలిగినవాడై), అయోధ్య, అన్ = అను, పట్టణము, ఏలుసామియె అనఁ = పాలించునట్టి ప్రభువే (శ్రీరామచంద్రుడే అని నిశ్చయించినట్లు), రఘునాథవిభుండు = రఘునాథరాజు, వర్ధిలుఁ = వర్ధిల్లుచున్నాడు.

తాత్పర్యము :

తన పుణ్యమే తన్ను కాపాడుతూ ఉండగా, శత్రురాజుల గర్వభంగముచేసి, దిక్పతుల ప్రశంసలు పొంది, పట్టాభిషేక మహా ఐశ్వర్యాలతో రఘునాథుడు శ్రీరాముడే అన్నట్లు ఉన్నాడని భావము.

*విశేషము :*

చెవ్వప్ప నాయకుడు, అచ్యుత నాయకుడు తంజావూరును విజయనగరసామ్రాజ్యానికి సామంతులుగానే పాలిస్తుండేవారు. రఘునాథరాజే మొదట తంజావూరులో పట్టాభిషేకము చేసికొని ఛత్రచామర లాంఛనాలను కలిగినరాజు.

శ్రీరాముడు గూడ తన చిన్నతనములో కలిగిన కష్టాలను తన పుణ్యప్రభావమువల్ల తప్పించుకొని, రావణాది శత్రురాజులను ఓడించి, ఇంద్రాది దిక్పాలులచే మెప్పులు పొంది, పట్టాభిషేకభాగ్యము పొందాడు. కాబట్టి ఈ రఘునాథుడు ఆ శ్రీరాముడే అన్న అభిప్రాయం కలిగింది.

దిక్ అధీశ నుత అంటే శ్రీరాముడి పరంగా ఇంద్రాది దిక్పతుల ప్రశంసలనీ, రఘునాథుడి పరంగా తంజావూరికి నాలుగు దిక్కులందు ఉన్న రాజుల ప్రశంసలనీ అర్థం చెప్పుకోవాలి. లేకపోతే, ఇంద్రాది దిక్పాలకులు రఘునాథరాజును పొగిడారన్నట్లవుతుంది. అంత పెద్ద అతిశయోక్తి కూడదు.

*పాఠాంతరాలు :*

తిరుపతి కవులు పద్యం చివరను ''రఘునాథ విభుండు వర్ధిలెగా'' అన్నారు. కవీ, రఘునాథరాజూ ఇద్దరూ సమకాలికులు కాబట్టి 'వర్ధిలెగా' అని భూతకాలము చెప్పడము సమంజసము కాదు.

వేంకటరాయశాస్త్రిగారూ మరికొందరూ "అయోధ్య యన్పట్టణమేలు సామియో యనగా" అన్న పాఠము ఎత్తుకున్నారు. దీనిలో రాముడేమో అన్న భ్రాంతి కలుగుతుంది. భ్రాంతిమంతమలంకారం అవుతుంది. న్యాయంగా ఆ అర్థమే చెప్పాలి.

కాని మన చేమకూరకవికి భ్రాంతికాదు; రఘునాథరాజు అతనికి రాముడే. కావ్యంలో రెండుమూడుచోట్ల ఆ రామభావాన్నే ప్రకటించాడు. రాజును —

నా పాలిటి రామభద్రుడని
బంగరు పూవుల పూజచేసి

అన్నాడు (1-38). అందుచేత ''పట్టణమేలు సామియె యనఁగా'' అన్నపాఠం సూచించాను.

అలంకారము :

ఉత్ప్రేక్ష - యమకము.

రసికుండౌ రఘునాథు కీర్తిసతి యౌరా! తొల్త వాగ్బంధముల్,
రసవాదంబును, రాజవశ్యవిధి నేరంబోలుఁ; గాకున్న, వె
క్కసపుం బ్రౌఢి వహించి, శేషఫణి మూఁగంజేయఁ, దారాద్రి ను
ల్లసముల్ పల్కఁగ ఛత్ర చామర మహాలక్ష్మల్ నగఁగా శక్యమే? 18

అర్థము :

రసికుండౌ = సరసుడైన, రఘునాథుకీర్తిసతి = రఘునాథుని వరించిన కీర్తికాంత, ఔరా = ఆశ్చర్యము, తొల్తగా = మొదట (విజృంభించడానికి పూర్వము), వాక్‌బంధముగా = ఎదుటివారినోట మాటరాకుండ కట్టివేయువిద్యను (తెల్లదనమునందు వాక్ = సరస్వతిని, జయించుటను), రసవాదంబుగా = తక్కువ లోహములను బంగారముగా మార్చు విద్యను (తెల్లదనమునందు పాదరసముతో వాదులాడుటను), రాజవశ్యవిధిగా = రాజులను వశపరచుకొను విద్యను (తెల్లదనమునందు చంద్రుని వశపరచుకొనుటను), నేరగా బోలుగా = నేర్చియుండవలెను, కాకున్నగా = కానియెడల, వెక్కసపున్ ప్రౌఢిన్ వహించి = ఇతరులకు భరింపరాని (అత్యంతమైన) నిపుణతకలిగి, శేషఫణిన్ = వేయినోళ్ళుకలిగి భాషానిధి అని ప్రఖ్యాతిగల ఆదిశేషుని, (వాగ్బంధన విద్యచేత) మూఁగగా చేయన్ = మాటలు రానివానిగా చేయుటకును (తెల్లదనమున ఆదిశేషుని మించుటకును), తారాద్రిన్ = వెండికొండను (రసవాదవిద్యతో ఆ కొండవిలువను). ఉల్లసముల్ పల్కఁగన్ = పరిహసించుటకును (తెల్లదనమునందు కైలాసమును మించుటకును), ఛత్రచామర......నగన్-ఛత్రచామర = రాజలాంఛనపు తెల్లగొడుగులు చామరలు మొదలైన, మహాలక్ష్మల్ = గొప్ప సంపదలను (రాజవశ్యవిద్య గలది కాబట్టి వాటి అధికా రాధిక్యాలను). నగగా = చులకనగా చూచుటకును (తెల్లదనమునందు వెల్లగొడుగు వెల్లచామరములను మించుటకును), శక్యమే = సాధ్యమగునా?

తాత్పర్యము :

రఘునాథునికీర్తి - కీర్తి తెల్లగా ఉంటుంది కాబట్టి - తెల్లదనమునకు ప్రసిద్ధిపొందిన సరస్వతీ దేవిని, పాదరసమును, చంద్రుని, ఆదిశేషుని, వెండికొండను, శ్వేత ఛత్రచామరాలను మించిన దని భావము.

*విశేషములు :*

ఈ చక్కని పద్యంలో జ్ఞాపకముంచుకోవలసిన విషయాలు :

కీర్తి తెల్లగా ఉంటుంది. తెల్లదనానికి ప్రసిద్ధి పొందినవి : సరస్వతి, పాదరసము, చంద్రుడు, ఆదిశేషుడు, వెండికొండ, రాజలాంఛనాలైన ఛత్రచామరాలు. వీటినన్నిటిని రఘునాథుడికీర్తి ధిక్కరించిందని కవి మహాచమత్కారంగా చెప్పాడు

ఆదిశేషుడు విశేషమైన పాండిత్యము కలవాడని ప్రసిద్ధి.

> అపురి బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
> షాపర శేషభోగి .................. మనుచరిత్ర.

ఇతడికి వేయితలలు. ఒక్కొక్క తలలో రెండేసి నాల్కలు ఉంటాయి. ఈ నాల్కలన్నిటిని తన వాగ్బంధన విద్యతో కట్టవేసింది రఘునాథుడి కీర్తి.

ఈ పద్యములో విద్యావతియైన ఒకకాంత (1) వాగ్బంధము, (2) రసవాదము, (3) రాజవశ్యము అన్న విద్యలను మొదట అలవర్చుకొని, ఆ వెనుక అత్యంత నిపుణతతో విజయ యాత్రకు బయలుదేరి (1) వేయినాలుకలు కలిగి భాషానిధియైన ఆదిశేషుని నోరెత్తకుండచేసి, (2) వెండికొండను అల్పమైన విలువగల దానిగా పరిహసించి, (3) రాజలాంఛనములైన ఛత్రచామరముల ఆధిక్యాన్ని ఈసడిస్తున్నట్లున్నది అని చమత్కారము.

రఘునాథునికి కీర్తి భాషనుబట్టీ, సంపదనుబట్టీ, పరిపాలనను బట్టీ, అధికంగా కలిగిందని కవిహృదయము.

రసవాదమన్న విద్యనే 'స్పర్శవేది' లేక, 'పరసవేది' అంటారు.

రఘునాథరాజు రసికుడు కాబట్టే తన (కీర్తి) కాంతను ఇటువంటి అద్భుత కార్యాలను చేయనిచ్చి వినోదాన్ని పొందాడు. చరిత్రాత్మకంగా గూడ రఘునాథరాజు దగ్గరుండిన రామభద్రాంబ, మధురవాణి మొదలైన కాంతలు పెక్కసవు ప్రౌఢితో తమ విద్యాధిక్యాన్ని వెల్లడిచేసి, పండితప్రకాండులనుగూడ మాటాడనీయక, కావ్యరసముల విషయమైన విమర్శనలు చేస్తూ, ప్రభువులను మెప్పించి తమకు వశవర్తులుగా చేసికొనగలిగారు. రఘునాథరాజుసభలో 'నేరుతుననిమాటాడగ వారిజభవు నంత వాని వశమే.........' అని కవిచౌడప్పవంటివాడు మెచ్చుకున్నాడు.

*పాఠాంతరము :*

అన్ని ప్రతులలోనూ, వేదంవారి వ్యాఖ్యానంలోగూడా ఈ పద్యంచివర, ......"ఛత్ర చామర మహాలక్ష్మ ల్గనన్ శక్యమే'' అనే ఉంది. చిట్టచివరి మాట 'కనన్' కాదనీ, అది 'నగన్' అని ఉండవలెననీ నా అభిప్రాయం. ఎందువల్ల నంటే, ఉపమానంగా చెప్పిన అన్నిటినీ మించి (తిరస్కరించి)నట్టు కీర్తి ఉందని చెప్పడమే కవి నియమము. సరస్వతికి బంధము, పాదరసానికి వాదము, రాజుకు వశ్యము, ఆదిశేషుని మూగనుచేయుట, వెండికొండను ఉల్లసమాడుట, అని తిరస్కారము సూచించి, ఛత్ర చామరాలకు అలాంటి తిరస్కారము వాడకుండ 'కనన్' అని, ప్రక్రమం పాటించే చేమకూరకవి అని ఉండడని, దానిని 'నగన్' అని ఉంచాను.

చివరి మూడు తిరస్కారాల భావము : 1. శేషుడిని మించిన భాషాప్రావీణ్యం ఆ రఘునాథరాజు కుందని; 2. వెండికొండకంటె గొప్పసంపద అతనికి కలదని; 3. ఛత్ర చామరాదులను వశపర్చుకొని అంతకంటె గొప్ప సమ్రాట్ లాంఛనాలు కలవని స్పష్టము.

*పాఠాంతరాలు :*

'కాకున్న' కు బదులు 'లేకున్న' అని పాఠాంతరముంది.

''ఛత్రచామర...'' అనడానికి బదులు "శంఖచామర..." అని మరొకపాఠము.

''శేషఫణిలోఁగన్ జేయు......'' తిరుపతి కవుల పాఠము.

ఈ పద్యం వేంకటకృష్ణమాచార్యగారి పాఠంలోలేదు.

*అలంకారము :*

క్రమము, ఉత్ప్రేక్ష, శ్లేష, పరికరము.

నలువగ నెన్నఁనైన రఘునాథ నృపాలుఁడు గల్గగా, మహీ
స్థలి నిఖిలైక ధర్మములుఁ దామర తంపరలై చెలంగెఁ, గొ
ల్లలుగ నశేష సజ్జన కులంబు సుఖంబు గనెన్, సమస్త వి
ద్యలు గనఁజెల్లఁబాసి మెఱపై వెలపెట్టె సభాంతరంబులన్. 19

అర్థము :

నలు వగన్ = నలచక్రవర్తి వంటివానిగా, (నలువ గన్ = నాలుగుముఖములుగలబ్రహ్మతో సమానుడుగా), ఎన్నన్ ఐన = భావించదగిన, రఘునాథనృపాలుడు = రఘునాథరాజు, కల్గగాన్ = పాలిస్తుండుటచేత, మహీస్థలిన్ = భూమియందు, నిఖిల ఏకధర్మములు = ముఖ్యధర్మము లన్నీ, తామరతంపరలై = అత్యధికమై, చెలంగెన్ = కొనసాగుచుండెను, కొల్లలుగన్ =

సమృద్ధిగా. అశేష = సకల, సజ్జనకులంబు = సజ్జనుల (సత్యవాక్కులైన మునుల) యొక్క సమూహము, సుఖంబు కనెన్ = సౌఖ్యమును పొందెను. కనటు ఎల్లన్ = మాలిన్యమంతటిని, పాసి = విడిచిపెట్టి, మెఱపై = మెరుగెక్కి, సభాంతరములన్ = సభలలోపల (ఇతరసంస్థానములలోను), వెలపెట్టెన్ = విలువను పొందెను.

తాత్పర్యము :

నలువితో (బ్రహ్మతో) సమానుడుగా భావించదగిన రఘునాథరాజు పరిపాలనలో ధర్మం అత్యధికంగా కొనసాగుతూ ఉండేది. సజ్జనులకు, సకల విద్యలకు ఆదరణ ఎంతో ఉండేది.

విశేషము :

నలచక్రవర్తి పాలనలో ధర్మాలకూ, సజ్జనులకూ, విద్యలకూ చాల ఆదరణా ప్రోత్సాహమూ ఉండేదని ప్రసిద్ధి.

రఘునాథనాయకుడు మంచి ప్రభువు కాబట్టి నలచక్రవర్తివంటి వాడని భావించేవారు. కాబట్టి 'నలు (ని) వగన్' నలుని విధముగ అన్నాడు కవి. ఆ మాటలనే శ్లేషతో విరిచి నలువగన్ = నలువ (బ్రహ్మ)గా ఎన్నదగిన వాడని ఇంకొక అర్థం చూపి చమత్కరించాడు. బ్రహ్మగా ఎన్నతగినవాడు కాబట్టి, అతని రాజ్యంలో బ్రహ్మ పరిపాలనలో ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయని నిరూపించాడు. మొదట బ్రహ్మత్వం శ్లేషవల్ల కల్పించి, పరిస్థితులవల్ల ఆ బ్రహ్మత్వాన్ని సమర్థించాడుకవి.

దీనిలో బ్రహ్మగా ఎంచడం కారణమూ, ధర్మాలు, సజ్జనులు, విద్యలు బాగుండడం దానివల్ల కలిగిన ఫలితమూ అవుతాయి. ఈ ఫలితంవల్ల అతడు బ్రహ్మగా ఎంచబడతాడు అనడం కవి అభిప్రాయాన్ని తారుమారుచేయడం అవుతుంది. కాబట్టి 'నలువగా', చెప్పడానికి ఒక ఆధారముండాలి. దానిని 'నలువగ' మీది శ్లేషవల్ల కల్పించాడు కవి.

కవి రఘునాథుని (నలువ) బ్రహ్మగా చెప్పాడు. బ్రహ్మ ధర్మములకు ఆధారము, మునులకు ఆశ్రయము, సరస్వతికిభర్త కాబట్టి, క్రమముగా ఇక్కడ ధర్మములు సమృద్ధిగా ఉండి, సజ్జనసమూహము (సత్యవాక్కులగు మునులసమూహము) సుఖము పొంది, విద్యలు నిర్మలములై వికాసము పొందాయని అభిప్రాయం.

రఘునాథరాజు కవులకు, విద్వాంసులకు చూపిన ఆదరమునుబట్టి దక్షిణదేశమునందలి అనేక ఆంధ్ర, ఆంధ్రేతర సంస్థానములవారు ఆంధ్రకవులను పోషించడం ఒక

గౌరవసూచకంగా భావించేవారు. చరిత్రాత్మకంగా పుదుక్కోట, మధుర, సేలం, మైసూరు మొదలయిన సంస్థానముల రాజసభలలో ఆంధ్రకవులకు ఆదరణ విశేషముగా లభించేది. కాబట్టే విద్యలు సభాంతరములకు( = ఇతర రాజసభలలోగూడ)వెలపెట్టెను అని కవి సూచించాడు. ఇది అతిశయోక్తి కాదు.

మనకవి దృష్టిని రఘునాథరాజుతో సరిపోల్చదగినవారు శ్రీరాముడు, అర్జునుడు, నలుడు మాత్రమే.

ఆకారమున నలునంత వాడౌనెకా ;
హయసమ్యగారూఢి నంతవాడె ;

అని గూడ నలునితో సరిపోల్చాడు కవి.

సమస్త విద్యలు అన్నందువల్ల రఘునాథుని కాలంలో ఉండిన సంస్కృతాంధ్ర భాషల సాహిత్యము, సంగీతము, శిల్పము, చిత్రలేఖనము, భరతనాట్యము, నాటకకళ, యక్షగానము మొదలైన వన్నీ ఊహించుకోవాలి.

ఈ పద్యంలో నిఖిల ధర్మాలు, అశేష సజ్జనకులంబు, సమస్త విద్యలు అని చెప్పడంవల్ల ఈ గుణములు అక్కడక్కడ అసంపూర్ణంగా కాక అధిక వ్యాప్తిలో ఉన్నవని తెలుసుకోవాలి.

పాఠాంతరము :

"ఒరపై ...... వెలపెట్టె సభాంతరంబులకా." ఒరపై = అందముకల్గి.

అలంకారము :

ఉపమ, శ్లేష.

శైలములెక్కి, యష్ట మదసామజ మౌళుల మీఁదుగా, మహా
క్రోల కులేంద్రు వాడి బలు కొమ్ము మొనంబడి, సర్వదా విష
జ్వాలలు గ్రమ్ము శేషు తల చాయనె యోడకవచ్చి కూడె, నౌ
భూ లలితాంగి కెంతవలపో రఘునాథ నృపాలమౌళిపైకా. 20

*అర్థము :*

శైలములు ఎక్కి = భూమిని మోస్తున్న పర్వతములపై ఎక్కి (కొండలెక్కుతూ దిగుతూ), అష్ట మద సామజ మౌళుల మీఁదుగాఁ = ఎనిమిది మదించిన దిగ్గజముల తలల మీదుగా ప్రయాణంచేసి, మహా కోల కులేంద్రు = కోలమంటే వరాహము, కులఇందుఁడు అంటే అజాతికి రాజు, మహాకోలకులేంద్రు డంటే విష్ణు మూడో అవతారమైన ఆదివరాహము, దాని యొక్క, వాడి = సూదిగా ఉన్న, బలు = పెద్ద, కొమ్ము = కోరయొక్క, మొనఁబడి = సూది చివరమీదపడి, (వరాహావతార సందర్భమున ఆదివరాహము భూమిని తన ముట్టెతో ఎత్తి నప్పుడు దాని కోరమొనమీద భూమిపడ్డదికదా!), సర్వదా = ఎల్లప్పుడు, విషజ్వాలలుక్రమ్ము = విషాగ్నిజ్వాలలు విశేషముగా వ్యాపింప జేస్తున్న, శేషుతలచాయనె = ఆదిశేషుని వేయిపడగల దారినే (ఆపడగల మీదనుంచే), ఓడక = భయపడక, వచ్చి, (భూలలితాంగి) కూడెఁ = రఘునాథుని కలుసుకొన్నది, ఔ = ఓహో ! భూ లలితాంగికి = భూమి అనే కోమల శరీరము కల కాంతకు, రఘునాథ, నృపాల మౌళిపైఁ = రాజశ్రేష్ఠునిమీద, ఎంతవలపో = ఎంత అనురాగమో కదా !

*తాత్పర్యము :*

పర్వతాలు, అష్టదిగ్గజాలు, ఆదివరాహము, ఆదిశేషుడు, భూమినిమోస్తుంటాయని ప్రసిద్ధి. వీటన్నిటి కంటె ఎక్కువ చక్కగా రఘునాథరాజు తన్ను భరించగలడని, భూమి వాటన్నిటిని విడిచి ఇతనిని చేరిందని భావం.

*విశేషములు :*

వలపు కలిగిన కాంత ఎన్ని కష్టాలైనా లక్ష్యపెట్టక, వాటిని అతిక్రమించి తన ప్రియుని చేరినట్లే, ఇక్కడ భూదేవి అన్న కాంత కొండలెక్కి, మదగజాల తలలమీదుగా నడిచి, ఆదివరాహం వాడి కోరమీద పడి లక్ష్యపెట్టకుండా, నాగరాజు విషజ్వాలల బారిని తప్పించుకొనివచ్చి, రఘునాథరాజును కలుసుకొన్నది.

భూమిని(భూధరములు) కొండలు, దిగ్గజాలు, ఆదిశేషుడు భరించి ఉంటాయని ప్రసిద్ధి. ఇదిగాక మూడవ అవతార ఘట్టములో ప్రళయసముద్రములో భూమి మునిగి ఉండగా వరాహము (మహాకోలకులేంద్రుడు) ఆ భూమిని తన వాడికోరలున్న ముట్టెతో ఎత్తినాడని పురాణకథ.

రాజును కూడ భూభృత్ అంటారు - భూమిని భరించేవాడు కాబట్టి. ఈ పద్యంలో గజములు మదించినవి కాబట్టి వాటి తలలమీద నడవడం మహాప్రమాదకరం.

ఆదిశేషుడి వేయిపడగలు విషజ్వాలలు కక్కుతూ ఉండగా, ఆపడగల దారినే రావడం మహాసాహసం.

చాయనె = ప్రక్కనే అని కొంద రర్థం చెప్పుతారు.

చాయనె = త్రోవ, మార్గము (సూ. ని) అని అర్థం కూడా ఉంది.

ఆది వరాహం కోర కొమ్ములాగా చాల గట్టిగా సూదిమొనతో ఉంటుంది. శరీరాన్ని చీల్చివేయగల దానిమీదపడి, అది గుచ్చుకొంటూన్నప్పటికీ లక్ష్యపెట్టకుండా రావడం మరీ సాహసము.

కష్టాలకు అలవాటుపడిన మోటుమనిషి అయితే ఈపనులు చేయవచ్చునేమో. కాని ఈ కాంత లలితాంగి = కోమలమైన శరీరము కలది. కాబట్టే ఇంకా ఎక్కువ సాహసం అన్నమాట. ఇన్ని కష్టాలను లక్ష్యపెట్టకుండా పరుగున వచ్చి చేరిన ఆ భూకాంతకు వలపు అత్యధికమని వేరే చెప్పనక్కరలేదు.

ప్రియుడ్ని వెతుక్కుంటూ ఈలాగ వచ్చేకాంతను "అభిసారిక" అంటారు. ఈ భూలలితాంగి అభిసారికలాగ వచ్చిందని కవి చెప్పకుండా చెప్పాడు.

శైలములు = (మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము, అన్న) సప్తకులపర్వతాలుగా అర్థం చెప్పడం పొరపాటు. ఇవి ఒక్క భారతవర్షంలో ఉన్నవేకాని, యావత్ భూమిని భరించిన మహాపర్వతాలు కావు. కవి భారతవర్షాన్నే యావత్భూమిగా భావించాడని, ముఖ్యంగా ఈ పద్యములో, అనడం మనకు సాహసమవుతుంది. ఈలాంటి కులగిరులు అన్ని వర్షాలలోను ఉంటాయి. ఇలాంటి వర్షాలు కొన్ని కలిసి జంబూద్వీపం, అలాంటి ద్వీపాలు ఏడు కలిస్తే భూమి అవుతుంది. దానిని మోసేవి మన కులపర్వతాలు కానేరవు. మర్యాదా పర్వతాలవంటి వెన్నో ఉన్నాయని పురాణాలు చెప్పుతున్నాయి.

శైలములు, దిగ్గజాలు, ఆదివరాహం, ఆదిశేషుడు అన్న ఇవన్నీ చక్కగా భరించలేని కార్యం రఘునాథరాజు ఒక్కడే భరిస్తున్నాడని ధ్వని.

పాఠాంతరాలు :

"మహాకోలము వెన్నుదాటి పలుగొమ్ము మొనన్ బడి"

వేంకటరాయ శాస్త్రిగారూ, బులుసువారూ.

వేంకట కృష్ణమాచార్యులవారూ, తిరుపతి వేంకటకవులూ మన పాఠాన్నే ఎత్తుకున్నారు.

ఇక్కడ వెన్నుదాటడ మేమిటో శాస్త్రిగారు చెప్పలేదు. బులుసువారు "మహాకోలము వెన్నుదాటి = ఆదివరాహము వీఁపు నతిక్రమించి, పలుగొమ్ము మొనంబడి = (ఆ వరాహము యొక్క) పెద్దకొమ్ము చివరఁబడి" అని అర్థం చెప్పారు. ఈదాటినది భూమేకావాలి. ఎందుకు దాటవలసి వచ్చిందో తెలియదు. దాని వెన్ను దాటాలంటే ఎవరైనా ఒక పక్కనుంచి రెండో పక్కకు దాటుతారు. అలా దాటుతే, దానికోరమీద పడడానికి అవకాశంలేదు. కోరమీద పడాలంటే తోకవైపునుంచి దాటాలి. అది కేవలం అసహజం. పైగా పలుగొమ్ము అంటే పెద్ద కొమ్ముకాదు. కొమ్ముపంటి పన్ను అని చెప్పాలి. ఇంతకూ ఆదివరాహం భూమినెత్తినప్పుడు భూమిచేసిందిగాని, దాటిందిగాని ఏమీలేదు.

కొమ్ము అంటేనే పందికోర అన్న అర్థం ఉంది. అందుచేత 'పలు' అన్నమాటకోసం తాపత్రయపడ నక్కరలేదు. పందికోరకు పల్లు అని చెప్పడం గూడా బాగుండదు. కోరకు కొమ్ము అనడానికి :—

నీటిలో మునిగిన నేల చేడియ
కొమ్ముకొన నుబ్బనెత్తిన ఘోణివీవ.

— పారిజాతాపహరణం

అరయగ నెల్ల లోకములు నంకిలినొంద మహార్ణవంబులో
నొరగి నిమగ్నమైన ధర నుద్ధతి కొమ్మున నెత్తినట్టి యా
కిరిపతి........

భాగవతము 6-304.

అలంకారము :

పరికరము, ఉత్ప్రేక్ష.

రత్నాకరాం తోర్వరా విహారుండౌట
నగ్రహారము లసంఖ్యముగఁ జేసె;
నమిత దానవినోది యగుటఁ గక్ష్యాంతర
భద్రకుంభీక్షణ పరతఁ దనరె;
దక్షిణ నాయకోత్తముఁ డౌట మేలైన
మలయజగంధి మండలము నేలె;
భరత విద్యా ధురంధరుఁ డౌట రంగస్థ
లంబు రామాలంకృతంబు చేసె;

నౌర ౹ కర్ణాట సింహాసనాధిరాజ్య
భరణ నిపుణ రణోద్దండ బాహుదండ
జనిత సాపత్న్య సంవాద జయరమా మ
హీలలిత కేళి రఘునాథ నృపతి మౌళి. 21

ఈ పద్యములో రఘునాథరాజు అభిలాషతో కళాప్రియుడుగా చేసిన కొన్ని పనులూ, రాజుగా చేసిన కొన్ని పనులూ కవి వర్ణించాడు.

అర్థము :

(౧) రత్నాకర......దౌటన్ - రత్నాకర = రత్నములకు నిలయమైన, ఉర్వరా = ప్రదేశమున, (రత్నాలు ఎక్కువగా దొరికే ప్రదేశంలో), విహారుండు = (తిరిగే) పాలించేవాడు, దౌటన్ = అవుటచేత, అగ్రహారములు = శ్రేష్ఠమైన రత్నహారములు, అసంఖ్యముగ = లెక్కకు మిక్కిలిగ, చేయించాడు. అంతేకాదు :- రత్నాకర = సముద్రము, అంత = అంతముగాగల (సముద్రమువరకు వ్యాపించి, అనగా-విశాలమైన), ఉర్వరా = భూమియందు, విహారుండు = తిరుగునట్టివాడు, (పాలించువాడు), దౌటన్ = అగుటచేత, అగ్రహారములు = బ్రాహ్మణులకు దానముగా ఇచ్చే గ్రామాలను, అసంఖ్యముగ = లెక్కకు మిక్కిలిగా, చేసెన్ = నిర్మించాడు.

(౨) అమిత = విశేషమైన, దాన = ఏనుగు మదమునందు, వినోది = ఆసక్తిగలవాడు, అగుటన్ = కాబట్టి, కక్ష్యాంతర = కోటలోని అంగణాలలో, భద్రకుంభి = భద్రజాతి ఏనుగులను, ఈక్షణపరతన్ = చూచుటయం దాసక్తితో, తనరెన్ = ఒప్పెను. అంతేకాదు :- అమితదానవినోది = విశేషముగా దానములు చేయుటయందు ఆసక్తి గలవాడు, అగుటన్ = కాబట్టి, కక్ష్య......పరత—కక్ష్యాంతర = కోటలోని అంగణములందుగల, భద్రకుంభీ = (దానధారకొరకు ఉంచబడిన) బంగారు కలశములను (ఉపయోగించు), క్షణ = ఉత్సవమునందలి, పరతన్ = ఆసక్తితో, తనరెన్ = ఒప్పెను.

(౩) దక్షిణనాయక ఉత్తముడు = (అనేకభార్యలను సమముగ సంతోషపెట్టు) దక్షిణనాయకులలో శ్రేష్ఠుడు, కాబట్టి, మలయజగంధి మండలమున్ - మలయజగంధి = చందనగంధుల (స్త్రీల), మండలమున్ = సమూహమును, ఏలెన్ = పాలించెను, అంతేకాదు :- దక్షిణనాయకోత్తముడు = దక్షిణదేశ రాజులలో శ్రేష్ఠుడు, కాబట్టి, మలయజగంధి = చందనపు వాసనగల, మండలమున్ = ప్రదేశమును, ఏలెన్ = పాలించెను, (దక్షిణమున మలయ పర్వతము చందనవృక్షాలకు ప్రసిద్ధి, కాబట్టే మలయజమంటే చందనమని అర్థము.)

(౪) భరతవిద్యా ధురంధరుడు = భరతనాట్య మనే విద్యయందు ఆరితేరిన వాడు, దౌటన్ = అగుటచేత, రంగస్థలంబున్ = నాటకరంగస్థలాన్ని, రామా అలంకృతంబు =

స్త్రీలతో అలంకరించబడిన దానిగా, చేసెన్ = చేసెను. అంతేకాదు:— భరతవిద్యాధురంధరుడు = శ్రీరామసోదరుడైన భరతుని వివేకమువంటి వివేకముగలవాడు, ఔటన్ = అగుటచే, రంగస్థలంబుగా = శ్రీరంగక్షేత్రమును, రామ అలంకృతంబు = శ్రీరామ విగ్రహముతో అలంకరించబడినదానిగా, చేసెను.

ఔరా = ఆహా! రఘునాథనృపతిమౌళి = రఘునాథరాజశ్రేష్ఠుడు, కర్ణాట......లలిత కేళి - కర్ణాటసింహాసన = కర్ణాటదేశం పాలిస్తున్న (విజయనగర) రాయలవారి, అధిరాజ్య = రాజ్యాధికారమును, భరణ = పోషించుట (నిలుపుట) యందు, నిపుణ = నేర్పుగలిగి, రణ = యుద్ధములలో, ఉద్దండ = ప్రచండమైన, బాహుదండ = దండమువంటి భుజమువల్ల, జనిత = కలిగించబడిన, సాపత్న్య = సవతితనము వల్ల కలిగిన, సంవాద = వాదులాటగల, జయ రమా = విజయలక్ష్మి యొక్కయు, మహీ = భూదేవి (రాజ్యలక్ష్మి) యొక్కయు, లలితకేళి = ముచ్చటైన క్రీడ కలవాడు (ఆ ఇద్దరి సపతుల వాదులాటను చూస్తూ వినోదించేవాడు).

తాత్పర్యము :

రత్నాకరాంత రాజ్యమును పాలించినవాడు కాబట్టి రత్నహారములను చేయించాడని, బ్రాహ్మణ అగ్రహారములను నిర్మించాడని); అమితమైన దానవినోదిగా మదించిన గజములను చూచేవాడని, దానధారకు ఉపకరించు పూర్ణకుంభములను ఉపయోగించుటయందు ఉత్సాహశక్తి కలవాడని; దక్షిణనాయకోత్తముడయి, స్త్రీల సమూహమును, దక్షిణదేశమును ఏలేవాడని; భరతవిద్యా ధురంధరుడౌట రంగస్థలమును స్త్రీలతో అలంకరించాడని, శ్రీరంగక్షేత్రమునందు శ్రీరామవిగ్రహము నెలకొల్పాడని అభిప్రాయం.

ప్రచండమైన రఘునాథరాజు బాహుదండము రాజ్యాన్ని భరిస్తూ ఉంది (భూమిని మోస్తున్నది); విజయాల నార్జిస్తూంది. కాబట్టి రాజ్యలక్ష్మి, విజయలక్ష్మి ఒకరితోనొకరు ఈ బాహుదండము నాదంటే నాదని సవతులవలె వాదులాడడము రాజుకు వినోదకారణముగా ఉంది అని భావము.

*విశేషము :*

ఈ పద్యము పెద్దపాదములలో మొదటి దళమున కారణమును, రెండవ దళమున కార్యమును కవి పేర్కొన్నాడు. శ్లేషవల్ల ఒక్కొక్క దళమునకు రెండేసి అర్థాలను సాధించి, మొత్తము ఎనిమిది మహాకార్యములను కవి సూచించాడు. వానిలో రఘునాథరాజుకు వ్యక్తిగతంగా ఉన్న ప్రియకార్యములు—ముక్తాహారప్రీతి, గజముఖదర్శనము, విదుషీమణుల ఆదరణ, నాటకాభిరుచి అనిన్నీ, రాజుగా అతని కార్యాలు అగ్రహారాలివ్వడము, దానాలు చేయడము, దేశపరిపాలనము, దేవాలయో

ద్ధరణ (శ్రీరంగమున శ్రీరామ విగ్రహము నెలకొల్పడము)అనిన్నీ, చమత్కారంగా కవి సూచించాడు.

మొదటి చరణంలో "రత్నాకరాంతోర్వరా విహారుండౌట" అన్నదానికి పూర్వ వ్యాఖ్యాతలు రెండర్థాలు చెప్పలేదు. కవి ప్రక్రమాభిమానానికి భంగం కలగకుండ ప్రయత్నించాను. రత్నాకర = రత్నాలుదొరికే స్థలమనీ, సముద్రమనీ చెప్పడం తప్పు కాదు; సమంజసం గూడ.

రెండవ పాదమున భద్రకుంభీక్షణత రఘునాథ రాజునకు అలవాటు అయినట్లు పైన "మాద్యద్దంతి ముఖార్చనా నియమమున్" అన్నపద్యము సాక్ష్యము.

మూడవపాదమునకు తార్కాణముగా మధురవాణి రామభద్రాంబాదులు రఘునాథరాజు ఆదరణలో ఉన్నారు.

పలువురు భార్యలందు సమముగా ప్రవర్తిస్తూ, అందర్నీ సంతోషపరచువాడిని దక్షిణ నాయకుడంటారు. ఇతడు శృంగార నాయకులలో ఒకడు.

చేమకూరకవి కాలములో, అనగా 1600ప్రాంతంలో, కర్ణాటకరాజ్యము పాలించే రాజును చెప్పవలసి వచ్చేటప్పుడు రాయలవారనీ, "సింహాసనము" అనీ, వ్యవహరించడము ఉండేది. రాయల ఆజ్ఞ అనడానికి సింహాసనం ఆజ్ఞ అనేవారు - ప్రస్తుతము "కోర్టు ఉత్తరువైనది" అన్నప్పుడు జడ్జీగారి ఉత్తర్వు అయినది అని మనము అర్థముచేసుకున్నట్లే. కాబట్టి, 'కర్ణాట సింహాసనాధిరాజ్యభరణ' అన్నమాటలకు కర్ణాట రాజుయొక్క రాజ్యాధికారమును పోషించుట, నిలుపుట అన్న అర్థమే చెప్పవలెను.

అంతేగాని, వేంకటరాయశాస్త్రిగారు వ్యాఖ్యానించినట్లు, "కర్ణాటసింహాసన...... భరణ = కర్ణాటదేశపు గద్దియయందు రాజాధిరాజత్వమును వహించుటయందు" అని అనకూడదు బులుసువారివలె, "రాజుల నందరినీ జయించి కర్ణాటరాజ్యము నేలినవాడని" గూడ అనకూడదు.

చారిత్రకంగా రఘునాథరాజు పెనుగొండలోను, తోపూరులోను విజయనగర రాజ్యశత్రువులను ఓడించి రాయలను సుస్థిరంగా సింహాసనముమీద కూర్చుండ బెట్టాడే గాని, తాను కూర్చోలేదు. ఈ సత్యాన్నే రఘునాథరాజు కొడుకు విజయ రాఘవ నాయకుడు తన రఘునాథ నాయకాభ్యుదయ కావ్యములో తెలిపాడు.

"దురములో నల పాండ్య తుండీర పతుల
చేరి గెల్చిన గెల్పు. సింహాసనమున
ఆ రామదేవ రాయల నిల్పుటయును
పదరక వ్రాసిన భావముల్ మెరయ...."

కాబట్టి, రఘునాథరాజు కర్ణాటక రాజును సింహాసనమునందు నిలిపిన వాడేగాని, ఆరాజ్యమును ఏలినవాడుకాడు. ఆ ఉద్దేశము ఉన్నవాడూకాడు. రాయలకు విశ్వాస పాత్రుడైన మిత్రుడు.

"రంగస్థలంబు రామాలంకృతంబుచేసె"-తన తండ్రి అచ్యుతనాయకుడు మహా భక్తితో కైంకర్యములు నడిపించే శ్రీరంగ క్షేత్రములో రఘునాథరాజు ఇష్టదైవత మైన శ్రీరామచంద్ర విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. ఇంతేగాక అనేక పుణ్యస్థలాల్లో, దేవాలయాల్లో, రామవిగ్రహము లేనిచోట ఆ విగ్రహాన్ని నెలకొల్పి తన రామభక్తిని ప్రకటించాడు.

ఈ విషయాన్నే తాను వ్రాసిన వాల్మీకి చరిత్రలో ఆశ్వాసాంతగద్యలో...... "రామసేతు, శ్రీరంగ, విజయరాఘవపురి, కుంభకోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామభద్ర......"అని రఘునాథ నాయకుడు వ్రాసుకున్నాడు.

ఆరోజులలో స్త్రీలు నాటకాలలో పాల్గొనేవారుకారు. పురుషులే ఆడవేషాలు వేసేవారు. రఘునాథుడు స్త్రీలచేత గూడా నాటకా లాడించేవాడు.

*పాఠాంతరాలు :*

వేంకటరాయశాస్త్రిగారు, గీతపద్యములోని "రణోద్దండ బాహుదండ'' అనడానికి బదులు, ''గుణోద్దండ బాహుదండ" అన్నపాఠం ఎత్తుకొని, "రాజత్వమును వహించుటయందు నేర్పు గల గుణముచేత సమర్థమైన......'' అని వ్యాఖ్యానించారు.

తిరుపతివారు పద్యారంభములో "రత్నాకరాంతర్ వరద్వీప హరుదౌట" అన్నపాఠం అంగీకరించారు. అప్పుడు సముద్ర మధ్యమున ఉన్న శ్రేష్ఠమైన ద్వీపములను పాలించినవాడు అని అర్థము చెప్పుకోవాలి. కాని ఈ అర్థము బ్రాహ్మణులకు అగ్రహారములు ఇచ్చెను అనుదానికి అనుగుణముగా ఉండదు.

వేంకట కృష్ణమాచారిగారు ''జయరమా మహీయువతికేళి" అన్నపాఠం ఎత్తుకున్నారు.

*అలంకారము :*

శ్లేష.

రాజున్ భోగియు సౌమ్యుఁడుఁ గవియు సర్వజ్ఞుండు నీ డౌననన్
దేజః ప్రౌఢవచో వివేక నయ భూతి శ్లాఘలన్ మించు; నౌ
రాజుఁ భోగియు సౌమ్యుఁడుఁ గవియు సర్వజ్ఞుండు నెబ్బంగులన్
యోజింపఁ రఘునాథ భూరమణవర్యుండే ధరామండలిన్. 22

అర్థము :

రాజున్ = చంద్రుడును, భోగియున్ = ఆదిశేషుడును (భోగము అనగా పడగ, కలది పాము). సౌమ్యుఁడున్ = (సోముడు అనగా చంద్రుడు, అతని కొడుకు సౌమ్యుడు) బుధుడును, కవియున్ = శుక్రుడును, సర్వజ్ఞుండున్ = శివుడును, ఈడు ఔను అనన్ = సాటియగుదురు అనునట్లుగా, తేజః.........శ్లాఘలన్ -(క్రమంగా) తేజః = కాంతియందు. ప్రౌఢవచః = మాటనేర్పునందు, వివేక = తెలివియందు, నయ = నీతియందు, భూతి = ఐశ్వర్యమునందు, శ్లాఘలన్ మించుఁ = పొగడ్తలచే అతిశయించును, ఔఁ ! అంతేకాదు:— ఎబ్బంగులఁ యోచింపన్ = ఎన్నివిధముల ఆలోచించినను, రాజున్ = పరిపాలించువాడును, భోగియు = భోగముల ననుభవించువాడును, సౌమ్యుఁడు = సమరసభావము కలవాడును, కవియున్ = కవీశ్వరుడును, సర్వజ్ఞుండు = సకల విద్యలు ఎరిగినవాడును, ధరామండలిఁ = ప్రపంచము నందు, రఘునాథ, భూరమణవర్యుండె = రాజశ్రేష్ఠుడే. మరియొకడు లేడని భావము.

తాత్పర్యము :

రఘునాథుడు చంద్రునివంటికాంతిని, ఆదిశేషునివంటి మాటకారి తనమును, బుధునివంటి వివేకమును, శుక్రునివంటి నీతిని శివునివంటి ఐశ్వర్యమును కలవాడు. అంతేకాదు. చక్కని పరిపాలనము, భోగానుభవము, సమరసభావము, ప్రశస్తమైన కవిత్వము, అపారమైన జ్ఞానము కలవాడని భావము.

విశేషములు :

ఈ పద్యములో మొత్తము పది మంచిగుణాలు చెప్పాడు కవి. మొదట ఉపమానాలుగా చెప్పిన రాజు, భోగి, బుధుడు, కవి, సర్వజ్ఞుడు అన్నమాటలు, సుప్రసిద్ధులయిన వ్యక్తులను తెలిపేవి. ఆ మాటలనే ఉపయోగించి మూడవచరణంలో గొప్ప గుణములుగల ఒక్కవ్యక్తిని తెలియజేసి కవి చమత్కరించాడు.

చంద్రుడు మొదలయిన ఆ అయిదుగురు ఒక్కొక్క గుణానికే ప్రసిద్ధులు. కాని రఘునాథుడు ఆ ఐదుగుణాలకూ ప్రసిద్ధి కలవాడని కవిహృదయము.

కొందరనుకొన్నట్లు చివరనున్న "ధరామండలిన్" అన్నది పాదపూరణము కాదు. ఎందుచేతనంటే, పైనచెప్పిన ఉపమానాలన్నీ చంద్రుడు, ఆదిశేషుడు, బుధుడు, శుక్రుడు, శివుడు అన్నవారితో. వీరందరు ఈలోకానికి చెందినవారుకారు. ఈలోకంలో సరిపోల్చ డానికి ఎవరైనా ఉన్నారా అని అడిగితే దానికి కవి ఇచ్చిన బదులు, ఈ "భూరమణ వర్యుండే ధరామండలిన్" అని. ఎంతో అభిప్రాయముతో ఆ పదము ప్రయోగించాడు.

*పాఠాంతరాలు :*

"వేభంగులన్ యోజించినన్" అని. ఎబ్భంగులన్ = ఏలాగు ఆలోచించినా అన్నదానికి బదులు, వేయివిధాల ఆలోచించినా అని అర్థమవుతుంది. భావంలో వ్యత్యాసంలేదు.

తిరపతి కవులు "భోగి = రాహువు, సర్వజ్ఞుడు = అంగారకుడు" అన్న అర్థాలుగూడ చూపించారు. ఈ అయిదుగురిని గ్రహాలుగా చూపాలన్న అభిలాష ; మాటకారి తనానికి రాహువుతో పోల్చడం బాగుండదుకదా. ఏమయినా కవి ఉద్దేశంలో ఆ అర్థంలేదు.

*అలంకారము :*

శ్లేష, క్రమము, వక్రోక్తి.

అరిది సింగపుఁబల్ల మమరించె నేరాజు
మేలుఁ దేజికిఁ బదివేలుసేయఁ,
జికిలి బంగరుదిండ్ల పికిలి కుచ్చుల యంద
లం బెక్కె నేరాజు లక్షసేయఁ,
గనక మయంబుగాఁ గట్టించె నేరాజు
సాటిలేని నగళ్ళు కోటిసేయఁ,
గంఠమాలిక మొదల్గాఁ బెట్టె నేరాజు
గొప్ప సొమ్ములు పదికోట్లుసేయ,
నతఁడు ప్రభుమాత్రుఁడే బహుళాగ్రహార
నిత్య సత్త్ర మహాదాన నిరతపోషి
తాహిమాచల సేతు ద్విజాభిగీర్ణ
పుణ్యవిభవుండు రఘునాథ భూవిభుండు. 23

ఈ పద్యంలో రఘునాథుడు ఉపయోగించిన వస్తువుల ఆధిక్యమున్నూ, అతనికిగల కళా దృష్టిన్నీ కవి సూచిస్తున్నాడు.

అర్థము :

(౧) ఏరాజు, మేలుతేజికిఁ = శ్రేష్ఠమైన తన గుఱ్ఱమునకు, పదివేలు సేయఁ = పదివేల వరహాలు వెలచేయునట్లుగా, అరిది = అపురూపమైన, సింగపు పల్లము = సింహ ముఖముగల జీనును (సింహ చర్మంతో చేసిన జీను అనిగాని), అమరించెఁ = చేయించెనో.

(౨) ఏరాజు, లక్ష సేయఁ = లక్షవరహాలు వెలచేయునటువంటి, చికిలిబంగరుదిండ్ల = బంగారు నగిషీ పనితో నున్న తలగడదిండ్లతో, పికిలి కుచ్చుల అందలంబు = పికిలి పిట్టల పట్టుతో చేసిన కుచ్చులుగల (కుచ్చుల అలంకరణముతో ఉన్న), అందలంబు = పల్లకి, ఎక్కెఁ = ఎక్కెనో,

(౩) ఏరాజు, కోటి సేయఁ = కోటివరహాలు విలువగునట్లు, కనకమయంబుగాఁ = బంగరు (అలంకరణల)తో నిర్మింపబడిన, సాటిలేని, నగళ్ళు = మేడలు, కట్టించెఁ = నిర్మించెనో,

(౪) ఏరాజు, పదికోట్లు సేయఁ = పదికోట్ల వరహాలు విలువయగునట్టి, కంఠమాలిక = కంఠహారం, మొదల్గా, గొప్పసొమ్ములు = విలువైన నగలు, పెట్టెఁ = ధరించెనో,

అతడు, బహుళ.........విభవుండు — బహుళ = అనేకములగు, అగ్రహార = అగ్ర హారముల చేతను, నిత్యసత్త్ర = నిత్యమును భోజనముపెట్టు సత్రములచేతను, మహాదాన = గొప్పగొప్ప దానముల చేతను, నిరత = ఎల్లప్పుడు, పోషిత = పోషింపబడిన, ఆహిమాచల సేతు = హిమవత్పర్వతము మొదలు సేతువు వరకు గల ప్రదేశంలోని, ద్విజ = బ్రాహ్మణుల చేత, అభిగీర్ణ = ఎక్కువగా కొనియాడబడిన, (పుణ్యవిభవుండు = పుణ్యసంపద కలవాడు, రఘు నాథ భూవిభుండు = రఘునాథరాజు, ప్రభుమాత్రుఁడే = సామాన్య ప్రభువా !

తాత్పర్యము :

మిక్కిలి విలువచేసిన సింహపుజీనూ, పికిలికుచ్చుల పల్లకీ, బంగారు అలంకరణలతో ఉన్న మందిరాలూ, అమూల్యమైన ఆభరణాలూ నిర్మించినవాడు. ఈతడిచ్చిన దానాలతో తృప్తిపడ్డ ఆసేతుశీతనగ బ్రాహ్మణులు ఇతనిని పొగుడుతుంటారు.

విశేషము :

ఈ పద్యంలో పదివేలు, లక్ష, కోటి, పదికోట్లు చూపుతూ క్రమాభివృద్ధిని కవి చూపించాడు. రఘునాథరాజు అగ్రహారములు, నిత్యసత్రములు, మహాదాన ములవల్ల, యావద్భరతఖండంలోని బ్రాహ్మణులు (అన్నిమతాలవారు) సంతుష్టులై నారని భావము.

ఇతడు కట్టించిన అందమైన నగళ్ళు, రామసౌధము, ఇందిరామందిరము, విజయవిలాసము (భవనము) మొదలయినవి ఇప్పటికీ ఉన్నాయి.

తంజావూరు సత్రాలు ఆ దినాలలో చాల ప్రసిద్ధిని సంపాదించాయి. రఘునాథుడి కాలంలో ప్రతిదినము ఈ సత్రాలలో వేలకొలది బ్రాహ్మణులు భోజనం చేస్తూండేవారు. ఈ విషయాన్నే రఘునాథనాయకుడు తన వాల్మీకి చరిత్ర కావ్యము గద్యలో వ్రాసిన —

"..........నిర తావారి తాన్నసత్త్రి సంతోషిత ప్రతిదిన పంచాశ త్సహస్ర భూసుర......" అన్నమాట కేవల సత్యమని ఆరోజులలోని సుప్రసిద్ధ కావ్యాలన్నిటిలోనూ ఉన్నది.

ఈ సత్రముల నిర్వహణ రఘునాథుడి కొడుకు విజయరాఘవ నాయకుడి రాజ్యములో మరీ అధికమయింది. ఈయన తన రఘునాథనాయకాభ్యుదయ కావ్యంలో ఆశ్వాసాంతాలనున్న ద్విపదలో

తన తండ్రియే కులదైవ మటంచు
ననిశంబు గొల్చు మహారాజయోగి,
శతసహస్రాధిక సకుటుంబ విప్ర
సతతాన్నదాన దీక్షాగురుండు.
.........................

అన్న సత్యాన్ని ప్రకటించాడు.

పురుషోత్తమ దీక్షితుడన్నకవి "తంజాపురాన్నదాన మహానాటకం" వ్రాశాడు. దానిలో సత్రభోజనాదులను చక్కగా వర్ణించాడు. "..........వేంచేసియున్న సేతు కాశీ స్థలాంతర నిరంతరిత మతత్రయ ధరిత్రీ సుపర్వులకు ఘృత గుడ పాయసాపూప దధ్యన్న దుగ్ధవ్యంజన రంజితంబగుచు......" భోజనాలుతృప్తినిచ్చే వన్నాడు.

ప్రస్తుతం ఆంధ్రదేశంలో "తంజావూరు సత్రం" అన్నది ఒక పలుకుబడిగా వాడుతుంటారు. దీని అర్థం సోమరిపోతులు తిండికి చేరే చోటు అని.

పికిలికుచ్చులు — పికిలిపిట్టలు పిచ్చుకలకంటే కొంచెము పెద్దవిగా ఉంటాయి. కోడిపుంజులలాగ మంచి పోటరి పిట్టలు. పందెములకు వీటిని పెంచుతుంటారు. ఈ పిట్టల తోకలకింద చాల చక్కని ఎరుపు రంగుగల పట్టువంటి ఈకలు చాల కొద్దిగా

మొలిచి ఉంటాయి. ఈ ఈకలు అరఅంగుళం, ముప్పాతికఅంగుళం కంటె ఎక్కువగా పెరగవు. రెండువేళ్ళతో (ముక్కుపొడి చిట్కాలాగ) పట్టుకోగల ఈ ఈకలు తీసి వేస్తే, మళ్ళాపెరిగి, కొన్నాళ్ళకు తిరుగ పట్టు తీసివేయడానికి సిద్ధమవుతుంది.

పిడికెడు పట్టు కావాలంటే కొన్నివందల పిట్టలనుంచి కొన్నివందలసార్లు పట్టును తీసి ఉంచుకోవాలి. ఇలాంటి అపురూపమైన పట్టుతో పెద్దపెద్ద కుచ్చులుగట్టి రఘునాథుడి పల్లకీని అలంకరించారు అంటే, ఎంత వ్యయమో ఊహించుకోవచ్చును. కాబట్టి, "అందలంబెక్కె నేరాజు లక్షసేయ" అనడం కేవలసత్యం, అతిశయోక్తి కాదు.

ఈ పిట్టల పోరులో ఓడిపోయిన పిట్టకున్న పట్టును గెలిచిన పిట్టవాడు తీసుకొని, దానిని చిన్నకుచ్చుగా కట్టి, తనపిట్టకు కట్టిన తాడుకి వేలాడ గడతాడు. ఇలాంటి కుచ్చులు ఎన్ని వేలాడుతుంటే, ఆ పిట్ట అన్నిపందెములలో గెలిచిం దన్నమాట.

పాఠాంతరాలు :

"బహుళాగ్రహార......నికర పోషిత......" ఇక్కడ నికర అంటే సమూహము అని అర్థం చెప్పుకోవాలి.

"పుణ్యవిభవుండు రఘునాథ భూవరుండు" అని మరొక పాఠం. అనుప్రాసకు "భూవిభుండు" అన్న మన పాఠమే బాగుంది.

అలంకారము :

ఉదాత్తము.

త్రికరణ శుద్ధి నచ్యుతుని శ్రీరఘునాథ నృపాలు వైఖరిన్
సకల మహీసురావళికి సత్త్రము లెప్పుడుఁ బెట్టలేఁడకా
యొకదొర, యందులెక్కవిని, 'యొక్కొక నాఁటికె యింతరొక్కః మిం
తకుఁ దెగసాగెనాః' యనక తా ముదమందినఁ జాలు నెమ్మదిన్. 24

ఈ పద్యంలో కవి నాయకరాజుల అన్న సత్రాల ఆధిక్యం వర్ణిస్తున్నాడు.

అర్థము :

అచ్యుతుని = అచ్యుతరాజు కొడుకైన, శ్రీరఘునాథనృపాలు = శ్రీరఘునాథరాజు, వైఖరిన్ = విధముగా, త్రికరణశుద్ధిన్ = మనోవాక్కాయాల నిర్మలత్వంతో, సకల మహీసుర ఆవళికిన్ = సమస్త బ్రాహ్మణుల సమూహమునకు, సత్త్రములు, ఎప్పుడున్ = సర్వకాలము

లందు, ఒకదొర = ఏ ప్రభువైనా, పెట్టలేఁడకా = పెట్టలేడు సరేకదా, అందుఁ = ఆ సత్రము లలో, లెక్కఁ జవిని = అవుతున్న ఖర్చు లెక్కలను (వాటి మొత్తమును) తెలుసుకొని, ఒక్కొక నాఁటికె = ఒక్కొక్క దినమునకే, ఇంత రొక్కమా! = ఇంతధనమా! ఇంతకుఁ దెగసాగెనా = ఇంత ఖర్చుకు సాహసించెనా, అనక = అనకుండా, తాఁ = తాను (ఆదొర), నెమ్మదిఁ = మనస్సు నందు, ముదమందినఁ = సంతోషిస్తే, చాలుఁ = చాలును.

తాత్పర్యము :

ఇతర రాజులు రఘునాథుడిలాగా సత్రాలు పెట్టలేరు సరేకదా, ఆ సత్రాలకు రఘునాథుడు ఖర్చుచేస్తున్న లెక్కలు చూచి ఇంత ఖర్చుచేశాడా అని అనకుండా ఉంటే చాలును. అపార మైన వ్యయముతో సత్రాలు నడిపేవాడని భావము.

విశేషము :

ఈ సత్రాలు నిర్వహించడం ఏదో లాంఛనంగానూ, గౌరవం కోసమూ కాక రఘునాథుడు త్రికరణ శుద్ధిగా చేసేవాడు. బ్రాహ్మణభక్తి, సర్వమత సహిష్ణుతా, ఉన్నవాడు కాబట్టి ఏ ప్రాంతం నుంచి వచ్చిన బ్రాహ్మణులయినాసరే, మృష్టాన్నభోజ నాలకు అర్హులే అయేవారు. ఈతని మహోదారబుద్ధికి గోవింద దీక్షితులు (మంత్రీ, గురువూ)గారున్ను, తిరుమల తాతాచార్యులు (మతగురువు) గారున్ను, దోహదము చేసే వారు.

పాఠాంతరము :

"ఇంతకు మనసొగ్గెనా"

(వేంకటకృష్ణమాచార్యులవారి పాఠం.)

అడుగు మాత్రమె కాక యంత తెక్కుడుగ నీఁ
జాలెనే యల బలిచక్రవర్తి ?
యావేళ కటు దోఁచినంత మాత్రమె కాక
కోర్కి కెచ్చిచ్చెనే యర్కసూతి ?
తూఁగిన మాత్ర మిత్తుననేఁగా కిచ్చువ
చ్చినది కొమ్మనియెనే శిబివిభుండు ?
కలమాత్ర మపుడిచ్చెఁ గాక కట్టడగాఁగ
ననిశంబు నిచ్చెనే యమృతకరుఁడు ?

వారి నేరీతిఁ బ్రతిసేయవచ్చు నెల్ల
యర్థులఁ గృతార్థుల నొనర్చునట్టి యప్ర
తీప వితరణికి మహాప్రతాప తిగ్మ
ఘృణికి నచ్యుత రఘునాథ నృపతి మణికి ? 25

ఈ పద్యములో రాజుగారి దాన విశేషాలు కవి వర్ణిస్తున్నాడు.

అర్థము :

(౧) బలిచక్రవర్తి, అడుగుమాత్రమెకాక = వామనమూర్తి అడుగునకు సరిపడునంత మాత్రమె కాక, అంతకు, ఎక్కుడుగా, ఈ జాలెనా = ఇవ్వగల్గెనా ? (అడుగుమాత్రమె = అడిగినంతమాత్రమె ఇవ్వగలిగెను గాని ఎక్కువ ఇవ్వలేదని చమత్కారము. లేదా, ఒక్క అడుగు-12 అంగుళాల స్థలము మాత్రము అనవచ్చును.)

(౨) అర్కసూతి = సూర్యుని పుత్రుడైన కర్ణుడు, ఆవేళకు = ఆ సమయమునకు, అటు = పురాణములలో చెప్పినట్టు, దోఁచినంతమాత్రమెగాక = బ్రాహ్మణవేషమున ఇంద్రుడు దోచుకొనిన కవచకుండలములు మాత్రమె కాని, కోర్కికి, ఎచ్చు, ఇచ్చెనే = ఇవ్వగలిగెనా? (ఆ సమయానికి, మనస్సులో తోచినంత మాత్రమె ఇవ్వగలిగాడు గాని, కోరినదాని కన్న ఎక్కువగా ఇవ్వలేక పోయాడని చమత్కారము.)

(౩) శిబివిభుండు = శిబిచక్రవర్తి, తూఁగిన మాత్రము = శరణార్థియై వచ్చిన పావురాకు బదులు, దాని బరువుకు సమానమైన తనశరీరమాంసము మాత్రము దేగకు, ఇత్తుననెకాక = ఇస్తానన్నాడేకాని, ఇచ్చవచ్చినది = ఇష్టమువచ్చినదానిని, కొమ్మ అనియెనే = తీసుకో అని అన గలిగాడా? (తూగినమాత్రము = తనశక్తికి వీలయినంతమాత్రమే ఇస్తానన్నాడని చమత్కారము.)

(౪) అమృతకరుడు = తన కిరణములలో అమృతముకల చంద్రుడు, కలమాత్రమె = తనలోనున్న పదహారు కళలలో ఒక్క కళను మాత్రమే, అపుడు = ఏ దినానికాదినము, ఇచ్చె గాక = ఇచ్చాడేకాని, కట్టడకాఁగఁ = ఒక్క నీమముతో, అనిశంబుఁ = ఎల్లప్పుడు (నిశకాని సమయములలో కూడ అనగా, పగటియందుగూడ), ఇవ్వగల్గెనా ? (చంద్రుడు, కలమాత్రము = తనకు కలిగినంత మాత్రమే; కల = పదహారోవంతు మాత్రమే - అదిగూడ రాత్రివేళ లందే ఇవ్వగలడు అని చమత్కారము.)

ఎల్లయర్థులఁ = యాచకుల నందరిని, కృతార్థులఁ ఒనర్చునట్టి = సఫల మనోరథు లుగా చేయునటువంటి, అప్రతీప వితరణికి = ఎదురులేని దాతయు, మహాప్రతాప = గొప్పతేజ మునందు, తిగ్మఘృణికిఁ = వేడివెలుగుగల సూర్యునితో సమానమైన వాడును, (అగు) అచ్యుత రఘునాథ నృపతిమణికి = అచ్యుతరాజకుమారుడు రఘునాథ రాజశ్రేష్ఠునికి, వారిఁ = ఆ బలి, కర్ణ, శిబి, చంద్రులను, ఏ రీతి ప్రతిసేయవచ్చు= ఏ విధముగా సరిపోల్చవచ్చును ?

తాత్పర్యము :

మహాదాతలని పురాణ ప్రసిద్ధినొందిన పై వారికన్నా రఘునాథరాజు ఎక్కువ దాన పర తంత్రుడు అని భావము.

అలంకారము :

శ్లేష, అతిశయోక్తి, వ్యతిరేకము, అంత్యానుప్రాసము.

తప్పులు వేయుఁ గల్గినను దాళును నమ్మినవారిపట్లఁ; దాఁ
జెప్పినమాట యూర్జితముసేయు; నొకం డొరుమీఁదఁ గొండెముల్
సెప్పిన వానికై మనవి చెప్పిన రీతిగ నెంచు; నీడుగా
రిప్పటి రాజు లచ్యుత నరేంద్రుని శ్రీరఘునాథ శౌరికిన్. 26

అర్థము :

నమ్మినవారి పట్లన్ = తనను నమ్మిన వారియందు, తప్పులు, వేయు = అనేకము, కల్గినను, తాళును = తొందరపడి శిక్షించడు; తాన్, చెప్పినమాట, ఊర్జితము సేయున్ = నెరవేర్చును; ఒకండు = ఎవ్వడయినా, ఒరుమీఁదన్ = ఇతరునిమీద, కొండెముల్‌చెప్పినన్ = చాడీలు (నేరములు) చెప్పినయెడల, వానికై = ఆ ఇతరుని పక్షమున, మనవి చెప్పిన రీతిగన్ = విజ్ఞప్తి చేసినట్లుగా, ఎంచున్ = భావించును (ఒకడు రెండవ వానిపై కొండెము చెప్పి నప్పుడు, రెండవ వానికి శత్రువులున్నారుగదా అని గ్రహించి అతనిని దయతో చూచునని భావము), ఇప్పటిరాజులు = ఈ కాలపురాజులు, అచ్యుత...శౌరికిన్ = అచ్యుతరాజ కుమారుడు రఘునాథ రాజునకు, ఈడుకారు = సరిపోరు.

విశేషము :

చేమకూరకవి చాల కుశాగ్ర బుద్ధితో ఆనాటి సంస్థానాధీశ్వరులలోనూ, వారి నాశ్రయించి ఉన్న కవిపండితాదులలోనూ ఉండిన అవలక్షణాలను పరిశీలించే స్వభావం కలవాడు. తా నలాగు గుర్తించిన లోపాలను పరోక్షంగా రఘునాథుడి వర్ణనలోనూ, ధర్మరాజు వర్ణనలోనూ ఈ కావ్యములో చమత్కారంగా పొందుపరిచాడు. ఆరోజు లలో రాజులు స్వల్పమైన తప్పు చేసినందుకు శిక్షించడమూ, వాగ్దానాలు గాలిపాలయి పోవడమూ, చాడీలు విని బాధపెట్టడమూ సాధారణంగా జరుగుతుండేవి. కొండెము చెప్పడం విశేషంగా ఉండేది. మనకవికి గూడా కొండేల ధాటి తగిలినట్లు విజయ విలాస కావ్యాన్నిబట్టి సూచన కనబడుతుంది.

*పాఠాంతరము* :

వేదంవారూ, బులుసువారూ

> తప్పులు వేయుగల్గినను దాళును: నమ్మినవారిపట్లఁ దాఁ
> జెప్పినమాట యూర్జితము సేయు:.........

అని పఠించారు. దీనిలో మొదటి గుణము తాళునతో సరిపోతుంది. రెండవ గుణం, నమ్మినవారిపట్లఁ దాఁజెప్పిన మాట యూర్జితము చేయుట అవుతుంది. మాట నిల్పుకోవడం నమ్మినవారి పట్లనే, ఇతరులపట్లకాదు. ఈ గుణము అందరిపట్ల ఉండదగినది. కాబట్టి 'నమ్మినవారిపట్ల' అన్న దానిని తప్పులు వేయు గల్గినను తాళును అన్నమాటలతో కలిపి చదవడం మంచిది.

వేంకట కృష్ణమాచార్యులవారు

> .........యూర్జితము సేయు ననూయ నొకండు కొండెముల్

అని పఠించారు. కొండెము చెప్పడంకాబట్టి ఇంకొకని మీదననే తెలుసుకోవచ్చును.

ఆకారమున నలునంతవాఁ డౌనెకా,
హయసమ్యగారూఢి నంతవాఁడె ;
యతి దయామతి రామునంతవాఁ డౌనెకా,
యసమాన గురుభక్తి నంతవాఁడె ;
యమృషోక్తి ధర్మజునంతవాఁ డౌనెకా,
యన్నసత్త్రి ఖ్యాతి నంతవాఁడె ;
యాలంబునఁ గిరీటియంతవాఁ డౌనెకా,
యమిత నాట్యప్రౌఢి నంతవాఁడె ;
రసికమాత్రుండె యంతఃపుర ప్రవీణ
సారసాక్ష్యధర సుధారస లస దాళు
కవన నతముఖ బహుకలా కలన హృష్ట
బుధజ నాస్థాని రఘునాథ భూమిజాని ! 27

*అర్థము* :

(౧) ఆకారమునన్ = రూపమునందు, నలునంతవాఁడు = నలునితో సమానమైనవాడు, ఔనె కా = అవడమేకాదు, హయ సమ్యక్ ఆరూఢిన్ = గుర్రములను చక్కగా స్వారిచేయుట యందు గూడా, అంతవాఁడె = ఆ నలునితో సమానుడె. (నలచక్రవర్తి మంచిరూపముకలవాడనీ, అశ్వహృదయము నెరిగిన వాడనీ ప్రసిద్ధి).

(౨) అతి దయామతిన్ = మిక్కిలి దయగల మనస్సు గలుగుటయందు, రామునంత వాడు = శ్రీరామునియంతటివాడు, ఔనెకా = అవడమేకాదు, అసమాన గురుభక్తిన్ = సాటిలేని పితృభక్తియందుకూడా, అంతవాఁడె. (శ్రీరామచంద్రుడు దయకూ, పితృభక్తికీ పేరుపడిన వాడు).

(౩) అమృష ఉక్తిన్ = (మృషకాని) అసత్యముకాని మాటయందు (సత్యముపల్కుట యందు), ధర్మజునంతవాఁడు = ధర్మరాజంతటివాడు, ఔనెకా, అన్నసత్త్రఖ్యాతిన్ = భోజనములు పెట్టే సత్రముల నిర్మించిన కీర్తి యందుగూడా, అంతవాఁడె. (ధర్మరాజు సత్యవాక్యములకును, అన్నదానమునకును పేరుపడ్డవాడు).

(౪) ఆలంబునన్ = యుద్ధమునందు (పరాక్రమమునందు), కిరీటి = అర్జునుని, అంతవాఁడౌనెకా, అమితనాట్యప్రౌఢిన్ = ఎక్కువైన నాట్యమునందలి నేర్పులోకూడా, అంతవాఁడె. (అర్జునుడు మహాశూరుడు, నాట్యమునందు నేర్పరి అని ప్రసిద్ధి. బృహన్నలగా ఉత్తరకు నాట్యవిద్య నేర్పినవాడుగదా).

ఈ సీసపద్య పాదాలు నాల్గింటిలో రఘునాథనాయకుడి ఎనిమిదిగుణాలను కవి వర్ణించాడు. ఉపమానాలుగా చెప్పినవారు నలుడు, రాముడు, ధర్మరాజు, అర్జునుడు – అందరూ జగత్ ప్రసిద్ధులు.

అంతఃపుర.........బుధజ నాస్థాని___అంతఃపుర = రఘునాథనాయకుని రాణివాసం లోనున్న, ప్రవీణ = (కవన పాండిత్యాలలో) మంచి నేర్పరులైన, సారసాక్షి = కాంతల యొక్క, అధర = పెదవులయందలి, సుధారస = అమృతరస (సంపర్కము) వల్ల, లసత్ = ప్రకాశిస్తున్న (అనగా మధురంగా రుచిస్తున్న), ఆశుకవన = (నిలబడ్డ పాటున చెప్పే) ఆశు కవిత్వముచేత, నతముఖ = వంచబడిన తలలుగల, బహుకలాకలన = అనేక విద్యలుతెలియడం చేత, హృష్ట = సంతుష్టి పొందిన, బుధజన = పండితులుగల, ఆస్థాని = సభకలవాడు అయిన, రఘునాథ, భూమిజాని = రాజు, రసిక మాత్రుండె = సాధారణ రసికుడా(అసాధారణమైన సరసత కలవా డన్నమాట).

తాత్పర్యము :

అంతఃపురం లోని కవయిత్రులు ఆశుకవనం చెప్పుతూ ఉన్నప్పుడు ఆకవన మాధుర్యానికి ఆకాంతల పెదవులనున్న అమృతరసం మరింత తీయదనాన్ని కలిగిస్తూ ఉంటుందనీ, అనేక విద్యలలో పారంగతులయి రఘునాథుడి సభలలోనున్న విద్వాంసులు కూడ ఆ కాంతలవలె, మధుర కవిత్వం చెప్పలేముకదా అని సిగ్గుతో తలలు వంచుకొని ఉంటారనీ భావం.

విశేషము :

ఇటువంటి అసాధారణ ప్రతిభగల కాంతలను తన అంతఃపురములో ఉంచుకొనిన రాజు మహారసికుడని చెప్పనక్కరలేదు.

రఘునాథుడి కీర్తికాంత వాగ్బంధన విద్యతో "శేషఫణి మూగన్ జేయ" గలిగిందన్న 18వ పద్యంలో ఈ తలలు వంచడాన్నే కవి సూచించాడు.

ఈ వర్ణనలో అతిశయోక్తి లేదని రూఢిచేయడానికి మధురవాణి, రామభద్రాంబల వంటి "సారస్వత సామ్రాజ్య పీఠారూఢలు" ఉండడమే నిదర్శనము.

రఘునాథుడి ఆస్థానంలో అనేక విద్యలలో ఆరితేరిన కవిపండిత ప్రకాండులుండే వారన్నది చారిత్రక సత్యము.

*పాఠాంతరాలు :*

ఈ ఎత్తుగీతానికి మరి మూడు పాఠాలున్నాయి.

పైని మనము అవలంబించిన పాఠం తిరుపతి వేంకటకవు లంగీకరించినది.

1. వేదం వారు తీసుకున్న పాఠము :

రసిక మాత్రుండె యంతఃపుర ప్రడీన
సార సారస్వ తాధార శారి కాళు
కవన కృతముఖ శుక కలాకలన హృష్ట
బుధజ నాస్థాని రఘునాథ భూమిజాని.

దీనికి వారి వ్యాఖ్యానము :

"అంతఃపుర......స్థాని — అంతఃపుర = రాణిగార్ల యొద్దనుండి - ప్రడీన = ఎగిరి వచ్చినవియు - సార సారస్వత ఆధార = శ్రేష్ఠమైన విద్యకు తావలములును-(అగు)-శారికా = గోరువంకలయొక్క-ఆళుకవన = తాత్కాలిక కవిత్వముచేత- కృతముఖ = (పలుకులందు) నేర్పరులైన - శుక = చిలుకలయొక్క - కలా = విద్యను - ఆకలన = గ్రహించుటచేత - హృష్ట = సంతసించిన - బుధజన = పండితులుగల - ఆస్థాని = సభకలవాడయిన, రఘునాథ - భూమిజాని = రాజు - రసికమాత్రుండె = సాధారణ రసికుడా ?

(రాణిగార్లచే గోరువంకలు శిక్షితములు, గోరువంకల వలన చిలుకలు నేర్చినవి అని భావము)".

ఈ వ్యాఖ్యానం గురించి ఒక్క మాట చెప్పవలసి ఉంది. దీనిలోఉన్న పిట్టల ప్రావీణ్యము చక్కని అతిశయోక్తి. అయినా అంతఃపురంనుంచి బయలుదేరినవి గోరువంకలు, ఆస్థానానికి వచ్చినవి చిలుకలు. ఆ గోరువంకలకు రాణీగార్లు శిక్షణ ఇచ్చారన్నది వాచాగా చెప్పలేదు. ఆ గోరువంకలు చిలుకలకు నేర్పా యన్నదిగూడా ప్రత్యక్షముకాదు. ఆ గోరువంకలను త్రోవలోనే విడిచి పెట్టారు శాస్త్రిగారు.

దీనిని సమర్థించడానికి గాటోలు బులుసువారు తమ వ్యాఖ్యానంలో "రఘునాథరాయల రాణులు గొప్ప విదుషీమణులనియు, వారు శారికలకు విద్యనేర్పుదు రనుటచే అంతఃపురమున పక్షిజాతిలోగూడ పురుషులకు ప్రవేశము లేదనియు తెలియుచున్నది." అని విశేషం చూపించారు. అలాగే ఆస్థానానికి ఆడుపిట్టలు (గోరింకలు) రాకూడదని గూడా అంటారా ?

వేదంవారి పాఠాన్నంగీకరించినవారు, "సారస్వతాధారములైన గోరువంకలయొక్కయు, ఆశుకవనమందు నేర్పుగల చిలుకల యొక్కయు (రెంటియొక్క) విద్యలకు సంతసించార"ని అన్వయించడం సమంజసము.

2. బొబ్బిలి దొరగారినాటి ప్రఖ్యాతపండితుడు వేంకట కృష్ణమాచారిగారి పాఠం :

రసిక మాత్రుండె యంతఃపుర ప్రవీణ
సారసాక్షి సుధారస ధారణాంశు
కావనతముఖ బహుకలాకలన హృష్ట........

ఈ పాఠంలో అచ్చుతప్పు లున్నట్టుంది. "ధారణాశుకవన నతముఖ......" అని ఉందేమో ! ఏమయినా, ఈ పాఠంలో ప్రవీణ, సారసాక్షి సుధారస......నతముఖ మొద లయిన మాటలను పట్టిచూస్తే, పిట్టలులేవు; తలలు వంచడం ఉంది. అంటే మన మంగీకరించిన పాఠాన్నే వారుగూడా అంగీకరించారని చెప్పవచ్చును.

పైన చూపిన"......ధారణాశుకవన నతముఖ..."అన్న సవరణను అంగీకరిస్తే, ఈ పాఠంలోని భావం "నేర్పరులయిన కాంతల యొక్క సుధారస ధారణకల ఆశుకవనం (వినుట) చేత వంచబడిన తలలుగల బహువిద్యా పారంగతులున్న ఆస్థానము కలవాడు." అని అవుతుంది. దీనిలోగూడ మధురవాణీ, రామభద్రాంబల ప్రాశస్త్యం కనబడుతుంది.

3. ఈగీతానికి మరొక పాఠాంతరం గూడా తిరుపతి వేంకటకవుల విజయవిలాసంలో చూపించారు.

రసికమాత్రుండె యంతఃపుర ప్రవీణ,
సార సర్వస్వ సాకార సరస శుక పి
క నతముఖ బహుతర కళా కలిత హృష్ట,
బుధజనాస్థాని రఘునాథ భూమిజాని.

అంతఃపురము నందలి నేర్పరులైన కాంతల దగ్గర ఉన్న సకల కవిత్వ సారములు రూపొందినట్లు కనబడే శుక పికములచేత నతముఖులుగ చేయబడిన అనేక విధములైన విద్యలు నేర్చిన పండితులుగల ఆస్థానము అని భావము.

అనగా, అంతఃపురస్త్రీల దగ్గరుండే చిలుకలు కోకిలలు ప్రదర్శించిన సరసత సర్వము చూచి మహాపండితులుగూడ తలవంచుకొనే వారని భావము. ఇందులో కోకిలలు గూడ ఉన్నాయి. కోకిలలను పెంచడం కొంచెం అసాధారణం.

*అలంకారము :*

ఉల్లేఖము, స్వభావోక్తి, అనుప్రాసము.

మాటల నేర్పులా, సరసమార్గములా, కొలువుండు రీతులా,
పాటల గంధులా, కళలభాగ్యములా, బహుదానలీలలా,
నాటక శాలలా, యొక టనన్వల దెన్నిటఁ జూడ నన్నిటన్
మేటియుఁ గీర్తిలోలుఁడుఁ జుమీ రఘునాథనృపాలుఁ డిమ్మహిన్. 28

*అర్థము :*

మాటల నేర్పులా = మాట లాడడములో చమత్కారములా, కొలువుండు, రీతులా = పద్ధతులా, పాటలగంధులా = అందగత్తెలా, కళల భాగ్యములా = విద్యలయొక్క సంపదలా, బహుదాన(ములయొక్క) లీలలా = విలాసములా, నాటకశాలలా, ఒకటి అనన్ వలదు = ఇది అది అని చెప్పనక్కరలేదు, ఎన్నిటన్ జూడన్ = ఎన్ని విషయములలో చూచినా, అన్నిటన్, = అన్నిటియందు, ఇమ్మహిన్ = ఈలోకములో, రఘునాథ నృపాలుడు, మేటియు = అధికుడును, కీర్తిలోలుడున్ = కీర్తియందు ఆసక్తికలవాడును, (అగున్) చుమీ = అవునుసుమా.

పైన పేర్కొన్న విషయములందేకాక, ఇంకా అనేక విషయములందు ఈరాజు అభిరుచి కలవాడు మాత్రమే కాక, ''మేటియు," ఆయా అంశములయందు కీర్తి కాముడును అని భావం.

*విశేషము :*

మాటల నేర్పు లనడానికి : కవిచౌడప్ప సులభంగా దేనినిగాని, ఎవరినిగాని మెచ్చేవాడుకాడని ప్రసిద్ధి. అటువంటివాడు ఈ రఘునాథరాజు సభను గురించి

నేరుతునని మాటాడగ
వారిజభవు నంతవాని వశమే తంజా
వూరి రఘునాథ నాయని
గారి సభను కుందవరపు కవిచౌడప్పా.

అని అన్నాడంటే ఆ సభలో అత్యంత చాకచక్యంతో సంభాషిస్తూండే వారనీ, అక్కడ మాటకారి అనిపించుకోవడం చాల కష్టమనీ తేటపడుతుంది.

సౌందర్యపిపాసి, అలంకరణ ప్రియుడు, కళాభిరుచికలవాడు, కాబట్టి సరస మార్గాలూ, చిత్రవిచిత్రమయిన కొలువు పద్ధతులూ ఉండక తీరదు.

పాటలగంధు లనడానికి మధురవాణి మొదలైన కవయిత్రులూ, నట్టువధాంద్రూ (బిరుదుపాత్రలు) సాక్ష్యము.

కళలభాగ్య మనడానికి :— కవనము, సంగీతము, నృత్యము, చిత్రలేఖనము, శిల్పము, మందిరనిర్మాణము మొదలైన వన్నీ ఉండేవి. కవులూ, కవయిత్రులూ ఎందరో! సంగీతంలో కొత్తరాగాలూ, తాళాలూ, సరికొత్త వీణ మేళవింపులూ, యక్ష గానాలూ, ఎన్నో !

బహుదాన లీలలనడానికి :— తులాభార, హిరణ్యగర్భ మొదలైనవేకాక, అనేకాగ్రహారాలు, నిత్యసత్రాన్నదానాలు ఎన్నో !

అలంకారము :

ఇన్ని తార్కాణలున్నాయి కాబట్టి ఈ పద్యంలో అలంకారం అతిశయోక్తి కాదు; స్వభావోక్తి.

అని రఘునాథ మహీకాంతు ననంత శోభన గుణమ్ములలోనఁ గొన్ని
యభివర్ణించి, 29

అర్థము :

మహీకాంతు = రాజుయొక్క, అనంత = అంతులేని (అనేకములైన), శోభనగుణమ్ములలోన = మంచిగుణములలో, కొన్ని = కొన్నిటిని మాత్రమే, అభివర్ణించి = తెలియజేసి.

## కృతి ఇవ్వాలన్న సంకల్పం

నన్నునడిపిన బహుళ సన్మానమెంచి,
యఖిల విద్యావిశారదుఁ డగుటఁగాంచి
యవని నింతటి రాజెవ్వఁ డని గణించి,
కృతులొసఁగఁ గీర్తి కలదని మతిఁ దలంచి, 30

అర్థము :

నన్ను = కవిని (చేమరకూర వేంకటరాజును) గూర్చి, నడిపిన, బహుళ = అనేక విధములైన (పా. అం. అధిక సన్మానము), సన్మానమును = గౌరవమును, ఎంచి = యోచించి, (రఘునాథుడు) అఖిలవిద్యా = అన్ని విద్యలయందును, విశారదుడు = విద్వాంసుడు, అగుట, గాంచి = చూచి, అవనిన్ = భూమిమీద (ఈదేశమున), ఇంతటిరాజు, ఎవడు, అని గణించి = అని ఆలోచించి, కృతులు = కావ్యములను, ఒసఁగన్ = అంకిత మిచ్చిన ఎడల, కీర్తి, కలదు, అని, మతిఁ తలంచి = మనస్సునందు అనుకొని.

తాత్పర్యము :

తనకు రాజు చూపిన అనేక విధాలైన ఆదరగౌరవాలకు కృతజ్ఞత, అన్ని విద్యలలోను ఆరితేరిన ప్రభువు కంకిత మిస్తే కీర్తి లభిస్తుందన్న ఆకాంక్ష కవిని ప్రేరేపిస్తున్నాయి.

కవికి చేసిన సన్మానాలలో "రఘునాథ భూపాలదత్త హస్తముక్తా కటకం" ఒకటి.

పాఠాంతరము :

వేదంవారి పాఠము "రాజెవ్వడని నుతించి(=పొగడి") అని. ఈపద్యములో కవికి మనస్సున కలిగిన ఆకర్షణకు కారణాలున్నాయి. కాబట్టి పొగడి అన్న అర్థం పొసగదు. గణించి అనడమే సమంజసము.

కృతిఇవ్వాలని అనుకొని, రాజుకి "చెవిసోఁక చెప్పగలనా?" అని దిగువ పద్యములో కవి జంకుతున్నాడు.

తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయుఁ జమ
త్కారము నర్థ గౌరవముఁ గల్గ ననేక కృతుల్ ప్రసన్న గం
భీరగతిఁ రచించి మహి మించినచో నిఁక శక్తు లెవ్వ ర
య్యా! రఘునాథభూప రసికాగ్రణికిన్ జెవిసోఁకఁ జెప్పఁగన్. 31

ఈ పద్యములో రఘునాథరాజు కవిత్వము లోని గుణవిశేషాలను కవి పేర్కొన్నాడు.

అర్థము :

రసపుష్టిమైఁ = శృంగారాది రసములను చక్కగా పోషించుచూ, ప్రతిపదంబునఁ = ప్రతిపలుకునందు (అత్యంత విశేషముగ), జాతియుఁ = స్వభావ వర్ణనలును, వార్తయుఁ = కథను నడిపించు నేర్పును, చమత్కారమును, అర్థగౌరవము = చక్కని అర్థపుష్టియు, కల్గఁ = కలుగునట్లు, ప్రసన్న = ప్రసాదము అను కావ్యగుణముకల్గి (సులభముగ అర్థమగునట్లుగ), గంభీర = లోతగు విశేష అర్థమును కల్గినట్టి, గతిఁ = విధమున, అనేక కృతుల్ = పెక్కు కావ్యములను, తాన్ = రాజే స్వయముగా, రచించి, మహిఁ మించినచోన్ = ఆంధ్రదేశమందు ప్రఖ్యాతినిపొందియుండగా, రఘునాథభూప, రసికాగ్రణికిఁ = రసికశ్రేష్ఠునకు, చెవిసోఁకఁ = విననింపగునట్లు(నచ్చినట్లు), చెప్పఁగఁ = చెప్పుటకు, శక్తులు = సమర్థులు, ఇఁకఁ ఎవ్వరయ్యా = మరెవ్వరు ఉండగలరు?

తాత్పర్యము :

రసపుష్టి మొదలైన అన్ని మంచి లక్షణాలు ఉన్న కావ్యాలెన్నో వ్రాసి కీర్తిని పొందిన రఘునాథుడికి నచ్చినట్టు చెప్పగల కవులుంటారా?

*విశేషము :*

ప్రసాదగుణమువలన ప్రసిద్ధ పదములతో తేటగ ఉండుట, గాంభీర్యగుణము వలన యోచించినకొలది విశేషార్థాలు కానవచ్చుచుండుట (ప్రౌఢి) అని తెలియవలెను.

రాజు కవనములో కలవు అని చెప్పిన ఈ గుణాలన్నీ "చేమకూర" కవిత్వం లోనే చూడవచ్చును. ఇన్ని సత్కావ్య లక్షణాలతో రఘునాథరాజు స్వయంగా అనేక గ్రంథాలను సంస్కృతాంధ్రములలో వ్రాసిన కవీశ్వరుడు. అటువంటివానిని కవిత్వం చెప్పి మెప్పించడం చాల కష్టకార్యమని మనకవి కొంత జంకుతాడు.

జాతిని గురించి నరసభూపాలీయములో (కావ్యాలంకార సంగ్రహములో)—

సహృదయ హృదయంగమమై
మహి నున్నది యున్నయట్ల మాటలతేటల్
బహుళంబులుగాఁ జెప్పిన
మహితోక్తియె జాతియయ్యె మహినెట్లన్నన్

దీనినే స్వభావోక్తి అని గూడ అంటారు. జాతికీ, స్వభావోక్తికీ స్వల్పమయినభేదము లేకపోలేదు.

వార్త అనగా వర్ణిస్తున్న విషయంగాని, కథావస్తువు గాని, కంటికి కట్టినట్టు-హృదయానికి హత్తినట్టు-అనుగుణమయిన దేశకాలాది వాతావరణంతో-వాస్తవమా అనిపించేలాగ రచించడం అనవచ్చును. సూక్ష్మంగా చెప్పాలంటే - కథాకథన నైపుణ్య మనవచ్చును.

రఘునాథనాయకుడి కవిత్వం గురించి మన కవిచెప్పిన విశేషాలన్నీ రఘునాథరచనలలో సుస్పష్టంగా కనబడతాయి. ఆ రచనలు :- వాల్మీకిచరిత్ర, నలచరిత్ర, రఘునాథరామాయణము, శృంగారసావిత్రి, అచ్యుతాభ్యుదయము, సంగీతసుధ, పారిజాతాపహరణము, గజేంద్ర మోక్షము, రుక్మిణీకృష్ణవివాహము, జానకీ పరిణయము మొదలయినవి. వీటిలో యక్షగానాలూ, ద్విపదకావ్యాలూ, శాస్త్రగ్రంథాలూ, ప్రబంధాలూ, పురాణాలూ, అన్ని రకాల కావ్యాలూ ఉన్నాయి.

అటువంటి పండితకవిని నా కవిత్వంతో మెప్పించగలనా అని చేమకూరకవి కొంచెము సందేహించడం న్యాయమేకదా !

కలిగెంగా తన సమ్ముఖం బనియు, సత్కారంబు తాఁ జేయ నా
తల నెందే శిరసా వహింతు రనియుం, దాఁగాక లేదెందు సా
ధులకుం దిక్కనియుం, దయజ్ఞ మనువు రీతుల్గాక శక్యంబె వి
ద్యల మెప్పింపఁగ నచ్యుతేంద్రరఘునాథస్వామి నెవ్వారికిన్? 32

రాజు తానెంతటి కవి అయినా, ఇతర కవులను మెచ్చలేదా ? అంటే మెచ్చాడు అని, అందుకు కారణాలు చెప్పుతున్నాడు కవి.

అర్థము :

తన సమ్ముఖంబు = (వచ్చిన కవికి) తనదర్శనము, కలగెంగా = లభించెకదా అనీ, (అనగా దర్శనమునకు వచ్చిన పిమ్మట ఊరక పంపగూడదనీ). తాఁ = రఘునాథరాజు, సత్కారంబు చేయఁ = గౌరవించినఎడల, ఆతలఁ = వెలుపలి సంస్థానములయందు, ఎందేఁ = ఎక్కడైనా, శిరసావహింతు రనియుఁ (అనగా తాము సత్కరించిన ఎడల ఇతరులు విశేషముగా గౌరవిస్తారనీ), సాధులకుఁ = మంచివారలకు (కవులకు), తాఁకాక, ఎందుఁ, దిక్కు లేదు, అనియు = పండిత ప్రభువైన తాను కాకపోతే ఇంకెవ్వరు ఆశ్రయము ఇవ్వగలరనీ, (ఈ మూడు అభిప్రాయాలు కలిగి ఉండడంవల్ల) దయఁ = కరుణతో, మనుపు = పోషించు, రీతుల్ = విధములే, కాక, అచ్యుతేంద్ర రఘునాథస్వామిఁ, విద్యలన్ = కేవలం విద్యలచేత, మెప్పింపన్ కన్ = మెచ్చునట్లు చేయుటకు, ఎవ్వారికిన్ = ఎటువంటి పండితకవులకైనా, శక్యంబె !

తాత్పర్యము :

విద్యాధిక్యముచేత రాజును మెప్పించలేక పోయినా, రాజు తన ఉదార భావములచేత కవిని సత్కరిస్తాడనీ, రిక్త హస్తాలతో పోనీయడనీ భావము.

విశేషము :

"మాటల నేర్పులా......" అన్న 28 వ పద్యములో కవిచెప్పిన రఘునాథుడి "సరస మార్గములకు" ఈ పద్యమొక నిదర్శనము.

రఘునాథుడు చేసిన సత్కారాన్ని ఆ ప్రాంతంలోని సంస్థానా లెంత గౌరవంతో చూచేవో తెలిపాడు కవి.

రాజు చేమకూరకవిని మెచ్చి 'హస్తముక్తా కటకము' (చేతికి ముత్యాల కంకణము) బహూకరించాడు. ఆ మెచ్చుటకు కారణాలు పైమూడేకాని తన విద్యయందలి గొప్పతన మేదీ కాదని వినయంతో నిగర్విగా భావించాడన్నమాట. ఈ పద్యంలో చెప్పిన రాజుగారి ఔదార్య గుణంవల్ల మనకవికి కొంత ధైర్యం కలగడానికి అవకాశం ఏర్పడింది.

అని గణియించి, యైనను గుణాంశ మొకించుక కల్గినఁ బళా
యనుఁ, నదికాక మిక్కిలి నిజాశ్రిత పక్షము కల్గు సత్కృపా
ఖని, యణుమాత్రమైన నొక కానుక దెచ్చినఁ గొండగాఁ గనున్
మనమున, నచ్యుతేంద్ర రఘునాథుఁడె శ్రీరఘునాథుఁ డెన్నఁగన్. 33

అర్థము :

అని గణియించి = ఆలోచించి (ఆలోచించినవాడు మనకవి), అయినను, గుణాంశము = గుణముయొక్క భాగము, ఒకించుక = కొంచమైనను, కల్గినన్ = ఉన్న ఎడల (గుణలేశమే మాత్రముండినా), బళాఅనున్ = బాగుబాగు అని ప్రశంసిస్తాడు, అదికాక, మిక్కిలి = విశేషముగా, నిజ ఆశ్రిత = తన్ను ఆశ్రయించిన వారియందు, పక్షము = పక్షపాతము (దయ), కల్గు = కలిగిన, సత్ కృపాఖని = మంచి దయకు గనివంటివాడు, అణుమాత్రమైనన్ = ఇసుమంత అయినను (ఎంత స్వల్పమయినను), ఒక కానుక తెచ్చినన్, (దానిని) కొండగాన్ = కొండతో సమానముగ (మిక్కిలిపెద్ద దానిగా), మనమునన్, కనున్ = భావించును, ఎన్నఁగన్ = వీటన్నిటినిపట్టి చూడగా, అచ్యుతేంద్ర రఘునాథుడే, శ్రీరఘునాథుఁడు = శ్రీరామచంద్రుడు (అని తేటపడుతుంది).

పైన చెప్పిన (1) గుణాంశములకు సంతసించడం, (2) సుగ్రీవాదులయందు ఆశ్రిత పక్షపాతము చూపే సత్కృపాఖని అవడం, (3) చిన్న కానుకను (శబరి ఇచ్చిన దానిని, ఉడుత తెచ్చిన ఇసుకనూ, కొండగా భావించడం, అన్నిగుణములు శ్రీరామునియందున్నవే. కాబట్టి రఘునాథరాజునకు శ్రీరామచంద్రునికి అభేదము చెప్పినాడు కవి.

''నాపాలిటి రామభద్రుడు'' అనడానికి ఇదొక నిదర్శనం.

32 వ పద్యములో మన కవికి కలిగిన ధైర్యం ఈ ఆలోచనతో దృఢపడ్డది. జంకు తీరిపోయింది. అంకితం ఇవ్వడానికి నిశ్చయించుకున్నాడు.

అలంకారము :

ఉపమేయోపమ.

కావున, నేనొనరించిన
యీ విజయవిలాసమనెడు కృతిరత్నంబుఁ
గేవల భక్తిని గానుక
గావించెద, నని నితాంత కౌతూహలినై, 34

అర్థము :

కావునన్, నేను, ఒనరించిన = రచించిన, ఈ విజయవిలాసము, అనెడి, కృతి రత్నంబున్ = శ్రేష్ఠమైన కావ్యమును, కేవలభక్తిని = నిష్కళంకమైన (కల్తీలేని) భక్తితో, కానుక, గావించెదన్, అని = ఊహించి, నితాంత = (ఆ అభిప్రాయముతో) మిక్కుటముగా, కౌతూహలినై = ఉత్సాహము కలవాడనై.

విశేషము :

కవికి పై పద్యములలోని సంకోచమంతా పోయింది.

కావ్యం కానుకగా ఇస్తాను అన్న నిశ్చయానికి రాగానే అత్యధికమైన కుతూహలము కలిగింది.

ఈ కానుక కేవలం భక్తితోనే సమర్పిస్తున్నానన్నాడు కవి. అంటే కావ్యలక్షణాలు మంచివి ఉన్నాయనికాని, పాండిత్య విశేషా లున్నాయని కాని, ఇతర గుణాల వల్ల యోగ్యత కలిగిం దనికాని కాదు. కవి వినయానికి ఇది ఒక సూచన.

## కృతిసమర్పణ సన్నాహము

శుభవాసరమున నయ్యెడ
నిభ వాజి ముఖోపదా నిరీక్షేచ్ఛ మహా
విభ వాభిరాముఁడై భా
వభ వాకృతి భద్రపీఠ వాసోజ్జ్వలుఁడై, 35

అర్థము :

శుభవాసరమునన్ = మంచిదినమున, అయ్యెడన్ = కొలువుకూటమందు, ఇభ...... రాముడై - ఇభ వాజి = ఏనుగులు, గుర్రములు, ముఖ = మొదలైన, ఉపద = కానుకలను (సామంతులు సమర్పించేవి), నిరీక్ష = చూచుటయందలి, ఇచ్ఛా = కోరికతో, మహావిభవ = గొప్ప ఐశ్వర్యముచేత, అభిరాముడు ఐ = మనోహరంగా ఉండి, భావ ...... జ్వలుడై — భావభవ = మన్మథుని (యొక్క), ఆకృతిన్ = ఆకారముతో, భద్రపీఠ = సింహాసనమునందు, వాస = ఉండడముచేత, ఉజ్వలుడై = ప్రకాశించువాడై.

తాత్పర్యము :

రఘునాథరాజు మన్మథుని రూపుతో సింహాసనమున కూర్చొని, సామంతులు కానుకలుగా తెచ్చిన ఏనుగులు గుర్రములు మొదలైన వాటిని చూస్తుండగా........

విశేషము :

రఘునాథుడు చాల అందమైన వాడని ఆనాటి కవులు, కవయిత్రులు, విశేషంగా వర్ణించారు. కొడుకు విజయరాఘవనాయకుడు గూడ అలాగే వర్ణించాడు. "ఆకారమున నలునంతవాడౌనెకా" అని, మన కవి అన్నమాటలు సత్యములే. కేవల అతిశయోక్తులు కావు. దీనికి తార్కాణముగా రఘునాథుడు తన వాల్మీకి చరిత్ర గద్యలో, "రూపరేఖా విజిత కుసుమసాయక, సకల ధర్మసంధాయక, రఘునాథ నాయక ప్రణీతంబైన..." అని వ్రాశాడు. కాబట్టి ఇది సత్యదూరముకాదు.

పాఠాంతరాలు :

(1) ఇభరాజముఖోపధా నిరీక్షిచ్ఛ మహా
విభ వానుభ వాగతభా
వభ వాకృతి భద్రపీఠ వానోజ్వలుడై.

— తిరుపతివారు, వేంకటకృష్ణమాచార్యులుగారు.

(2) శుభవాసరమున నయ్యేడ
నిభవాజి ముఖోపధాన నియత తను మహా
విభ వాభిరాముడై తగు
విభ వాకృతి భద్రపీఠి విలసోజ్వలుడై.

అన్న పాఠాన్ని కూడ తిరుపతివారు పుట అడుగున చూపించారు.

(3) "ఇభరాజముఖోపదా"

వేదంవారూ, బులుసువారూ యెత్తుకున్నపాఠం.

కుందనంపుఁ బసిండి కుళ్లాయి జగలపైఁ
జౌకట్లు నిగనిగ ల్దొలఁకళింప,
హురుమంజి ముత్యాల యరచట్టపై గొప్ప
పతకంపు హారము ల్పరిఢవిల్ల,
వెలఁ జెప్పరాని కెంపుల వంక జముదాడి
పీతాంబరంబుపైఁ బెరిమె నెఱప,
గబ్బిమన్నె కుమారగండ పెండారంపు
జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప,

దొరల మంత్రులఁ గవుల నాదరణ సేయు
కరము కంకణకాంతి నల్గడల నిండ
నిండుకొలు వుండె గన్నుల పండువుగను
ఠీవి నచ్యుత రఘునాథ భూవిభుండు. 36

పై 35వ పద్యములో చెప్పిన 'మహావిభ వాభిరాముడు' ఎలాగున్నాడో ఈ పద్యంలో కవి చూపిస్తున్నాడు.

*అర్థము :*

(౧) అచ్యుతరఘునాథ భూవిభుండు, కుందనంపున్‌పసిండి = మేలిమి బంగారపు, కుళ్లాయి = పాగా (కిరీటము) యొక్క, జగలపైఁ = కాంతులమీద, చౌకట్లు = చెవులపోగుల యొక్క (ఈ చౌకట్లు చాలవిలువగల ముత్యములతోడివని తరువాతి పద్యములలో ఉంది), నిగనిగల్ = కాంతులు, చౌకళింపఁ = గంతులు వేస్తుండగా,

(౨) హురుముంజి = (ఉర్‌ముజ్) పారశీకసింధుశాఖ ప్రాంతమునగల ప్రదేశపు — అనగా శ్రేష్ఠమైన, ముత్యాల (అమర్చికుట్టిన), అరచట్టపైఁ = చొక్కామీద, గొప్ప, పతకంపు = పతకములు కల్గిన, హారముల్ = రత్నహారములు, పరిఢవిల్లఁ = ప్రకాశిస్తుండగా,

(౩) వెలచెప్పరాని = అమూల్యమైన, కెంపుల(తో తాపబడిన),వంక = వంకరగానుండు, జముదాడి = కటారి (బాకు), పీతాంబరముపైఁ = పసుపువన్నె పట్టువస్త్రముమీద, పెరిమెఁ = సౌందర్యమును, నెఱపఁ = వ్యాపింపచేస్తుండగా,

(౪) గబ్బి.........జిగి—గబ్బి = గర్వించియున్న, మన్నెకుమార = మన్నెపురాజుల పుత్రులను, గండ = జయించినవాడు (అనితెల్పు), పెండారంపు = కాలి బిరుదు అందెయొక్క, జిగి = కాంతి, పద అగ్రంబుపైఁ = ముంగాలిమీద, చెంగలింపఁ = దుముకుచుండగా,

దొరలఁ = సామంతరాజులను, మంత్రులఁ, కవులఁ, ఆదరణసేయు, కరము = చేతియందలి, కంకణకాంతి = కంకణములందలి రత్నముల కాంతులు, నల్గడలఁ = అన్ని దిక్కులను, నిండఁ = వ్యాపిస్తుండగా, ఠీవిఁ = సొగసుతో, కన్నుల పండువుగఁ = కనువిందుగా, నిండుకొలువుండెను.

*విశేషము :*

ఈ పద్యమున మాటలతో కవి రఘునాథరాజు పటమును నిర్మించిచూపించాడు. ఆకాలపు రాజఠీవి ఎట్టిదో తేటపడగలదు. "మాటలనేర్పులా......"అన్న 28 వ పద్యములో కవిసూచించిన "కొలువుండు రీతుల" లో ఇది ఒక రీతి. దీనియందు రాజుకి గల అలంకరణప్రీతి, కళాప్రియత్వము చక్కగా కనబడుతుంది.

"గబ్బి మన్నెకుమారగండ పెండారము" గురించి ఒక్కమాట: కాలున తొడిగిన రత్నఖచితమైన పెండారములో రఘునాథరాజు యుద్ధములో హతమార్చిన పాండ్యుని విగ్రహం గూడ పొందుపరిచి ఉంటుంది.

చూడండి :

పరగ పాండ్య నృపాల ఫాల పట్టమున
మురువైన నవరత్నములు దీర్చినట్టి
బిరుదు పెండేరంబు పెరిమె దీపింప
చరణాంబుజంబున సవరించి...

— విజయరాఘవ నాయకుడు.

అట్లు లొడ్డోలగం బున్న యవసరమున
వినయ భయ సంభ్రమములు నావెంట నంట
ననుఁ గృపాదృష్టిఁ జల్లగాఁ గనుచు నుండ
సమ్ముఖమ్మున కరిగి యంజలి ఘటించి, 37

*అర్థము :*

అటులు, ఒడ్డు ఓలగంబు ఉన్న = (పెద్ద) నిండుకొలువుతీర్చి ఉన్న, అవసరమునన్ = సమయమందు, వినయ = అణకువ, భయ = భయము, సంభ్రమములు = తొట్రుపాటు(లు), నావెంటన్ అంటన్ = నన్ను అంటియే యుండగా, ననున్, కృపాదృష్టిన్ = దయతోడి చూపులతో, చల్లగాన్, (రాజు) కనుచునుండన్, సమ్ముఖమునకు = ఎదుటికి, అరిగి = వెళ్ళి, అంజలి = నమస్కారమును, ఘటించి = చేసి, తరువాతి పద్యముతో అన్వయము.

*విశేషము :*

కవికి వినయం సహజలక్షణం. భయం గౌరవంవల్ల, సంభ్రమం — కార్య ఉత్కృష్టతవల్ల. అంతలో రాజుముఖం చూచాడు కవి. చల్లని కరుణ కనిపించింది. తొట్రుపాటు పోయింది. కాలుకదిలింది; నోరుమెదిలింది. చక్కని పద్యము.

ఏలిక మాత్రమేః మహిమ నీశ్వరుఁడే తలపోసి చూడ, నా
పాలిటి రామభద్రుఁ డని బంగరుఁబూవులఁ బూజ చేసి నేఁ
జాల నలంకృతిం బొసఁగు సత్కృతి కానుక చేసి కీర్తి భూ
శ్రీ లలితాంగులన్ వలవఁ జేసిన శ్రీ రఘునాథ శౌరికిన్. 38

అర్థము :

ఏలికమాత్రమే = అందరివంటి ప్రభువు మాత్రమా, మహిమఁ = ప్రభావములో, తలపోసి = యోచించి, చూడఁ, ఈశ్వరుఁడే = దేవునంతటివాడే.(అంతేకాక) నాపాలిట, రామభద్రుఁడు = శ్రీరామచంద్రమూర్తియే, అని, బంగరుపూవులఁ పూజచేసి = అత్యంతమగు శ్రద్ధాభక్తులతో పూజచేసి, నేఁ, చాలఁ అలంకృతిఁ = అనేకములగు అలంకారముల (నగల)తో (శబ్దాలంకారములతోను, అర్థాలంకారములతోను), పొసఁగు = ఒప్పుచున్న, సత్కృతిఁ = మంచి కావ్యమును, కీర్తి భూ శ్రీ లలితాంగులఁ = కీర్తికాంతను, భూదేవిని, లక్ష్మీదేవిని (ముగ్గురు కాంతలను), వలవఁ = తన్ను వలచునట్లుగా, చేసిన, శ్రీరఘునాథ శౌరికిఁ, కానుకచేసి = కానుకగా తీసికొనిపోయి,

ఈ క్రింది రీతిగా (39 నుండి 46వ పద్యము వరకు) విన్నవించాడని ఊహించాలి.

తాత్పర్యము :

రఘునాథరాజు ఇంతకుముందే ముగ్గురు స్త్రీలను వలపించినవాడు. ఈకృతికాంత నాల్గవది. రఘునాథరాజు గొప్పకీర్తిని పొంది, విశాలమైన రాజ్యము ఏలుతూ, మహా ఐశ్వర్యము కలవాడై ఉన్నాడని భావము.

విశేషము :

ఈ పద్యంలో మనకవి కన్యాదాత అవుతున్నాడు. విజయవిలాసకృతి తన కన్య; రఘునాథుడు వరుడు. ఈవరుడు కీర్తికాంతను, భూకాంతను, శ్రీకాంతను తాను ప్రేమించడమేకాక, ఆకాంతలు తన్ను ప్రేమించేలాగ ప్రవర్తించగల సరళహృదయము, ప్రణయ భావము ఉన్న దక్షిణనాయకుడు, కాబట్టి కృతికన్యను చక్కగా ఏలుకుంటాడు. పైగా ఇతడు నలుగురివంటి ప్రభువుకాడు. తనపాలిట సాక్షాత్తు భగవంతుడే. అన్నివిధాలా యోగ్యుడు అని బంగరుపూలతో వరపూజచేసి, అనేక రకాల అలంకారాలతో ముస్తీబు చేసిన తన కూతురిని సాలంకార కన్యాదానము జేయడానికి పూనుకొని.....

శ్రీ రసభావముల్ వెలయఁ జెప్పి ప్రబంధము లెన్నియేని మీ
పేరిట నంకితం బిడిన, బిడ్డల నెందఱఁ బేరుపెట్టినఁ,
దీరునె మీఋణం? బయినఁ దెచ్చితిఁ గాన్క పరిగ్రహింపు మ
య్యా రఘునాథ భూప రసికాగ్రణి, మామక కావ్యకన్యకఁ. 39

అర్థము :

శ్రీ......భావముల్ - శ్రీ = బుద్ధి, రస = రసమూ, భావమూ, వెలయఁగా = ప్రకాశించునట్లు, ప్రబంధములు = మహాకావ్యములు, ఎన్నియేని = ఎన్నైనా, చెప్పి = రచించి, మీపేరిటఁగా = మీపేరున, అంకితంబు ఇడినఁగా = అంకితమిచ్చినా, బిడ్డలఁగా ఎందఱఁగా, పేరు పెట్టినఁగా = ఎందరు బిడ్డలకు మీపేరుపెట్టుకొనినా, మీ ఋణంబు తీరునె = మీరుచేసిన మేలుకు సరియౌనా (కాదు అని), అయినఁగా, మామక = నాదైన, కావ్యకన్యకఁగా = కావ్యమనే కన్యను (వివాహముకానిది), కానుకఁ దెచ్చితిఁగా, అయ్య, రఘునాథభూప, రాజులలో రసికాగ్రణి = రసజ్ఞ శ్రేష్ఠుడా, పరిగ్రహింపుము = చేపట్టుము (అనగా పెళ్ళియాడుము).

తాత్పర్యము :

రఘునాథరాజు తనయందు చూపిన ఆదరానికి ఋణపడి ఉన్నట్లు కవి భావించాడు. ఎన్ని కావ్యాలు కృతి ఇచ్చినా, ఎందరు పిల్లలకు రాజుపేరు పెట్టినా ఆఋణము తీరేదికాదు. అయినా ఈ కానుక వలన రాజుగారి ఋణము రవ్వంతైనా తీరుతుందని కవి హృదయము.

విశేషము :

రాజును "రసికాగ్రణి" అని కవి ఈ పద్యములో అన్నాడు. కవి ఋణము అపారము; ఏమిచేసినా తీరేదికాదు. అయినా ఒక్క కృతికన్యను ఇవ్వడానికి వచ్చాడు (లక్షరూపాయలు ఋణముండగా పదిరూపాయ లివ్వడానికి వచ్చినట్టు). ఋణదాత నిరాకరించ దగినదే. కాని, రాజు 'రసికాగ్రణి' కాబట్టి తెచ్చినదాని విలువను చూడడు, ఆ తెచ్చుటలో ఉన్న భావమును (భక్తివిశ్వాసాలను) గ్రహించి, ఆదరిస్తాడు అని అభిప్రాయము.

అంతేకాదు. 33 వ పద్యంలో కవిచెప్పినట్టు రఘునాథుడు "అణుమాత్రమైన నొక కానుక తెచ్చిన కొండగాగను" రాజు.

అలంకారము :

రూపకము, పరికరాంకురము.

39 వ పద్యం తరువాత "సమరనిశ్శంక రఘునాథ సాహసాంక" అని ఉన్న ఏడు పద్యాలు వేంకటకృష్ణమాచారిగారి (1856) విజయవిలాసంలో లేవు. ఈ 7 పద్యాలు రఘునాథుడి విజయాల ప్రశంస.

ఘోటక ఖుర పుట క్షుణ్ణ ధరా జాత
పాంసువు పై నుల్లభంబుగాఁగ,
భట సింహ విక్రమోద్భట సింహనాదముల్
స్వస్తి వాదంబుల చంద మొందఁ,
బదిదిక్కు లొక్కటఁ బగిలి బీఁటలువాఱఁ
భేరీ నినాదముల్ బూరటిల్ల,
విజయ సమారబ్ధ వేళఁ గౌతుకమున
మొగమున గరువంపుమురువు దోఁప,

నౌర! పెండ్లికి నేఁగిన ట్లనికి నేఁగి
యక్ష తంత్రంబు లివి యేటి లక్షమనుచు
రేకమోవక గెల్చుట నీకె చెల్లు
సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 40

అర్థము :

సమరనిశ్శంక = యుద్ధమునందు జంకులేనివాడా, సాహసాంక = సాహసమునే భూషణముగా కలవాడా.

౧. ఘోటక ......... పాంసువు — ఘోటక = గుర్రములయొక్క, ఖురపుట = దొప్పలవంటి డెక్కలచేత, క్షుణ్ణ = నలగగొట్టబడిన, ధరా = భూమినుండి, జాత = పుట్టిన, పాంసువు = ధూళి, పైఁ = తన తలమీదుగా పట్టిన, ఉల్లభంబుగాగన్ = (పెండ్లిళ్ళలో రాకపోకలలో గొడుగువలె పట్టునటువంటి) మేలుకట్టువలె (చాందినీవలె) ఉండగా.

౨. భట.........నాదముల్ — భటసింహ = శ్రేష్ఠులగు భటులయొక్క, విక్రమ ఉద్భట = పరాక్రమముతో అతిశయించిన, సింహనాదముల్ = సింహగర్జనలు, (పెండ్లిలోనుండే) స్వస్తివాదంబుల చందము = స్వస్తివాచనముల విధము, ఒందన్ = పొందియుండగా,

౩. పదిదిక్కులు, ఒక్కట = ఒక్కసారిగా, పగిలి = బద్దలై, బీటలువాఱన్ = పగుళ్ళిచ్చునట్లు, భేరీనినాదముల్, బూరటిల్లగా = నిండుకొనగా, (పెండ్లిలో నుండే మంగళవాద్యాలు విశేషించినట్లుండగా).

౪. విజయ.........వేళ — విజయ = విజయము కొరకు (విజయయాత్ర కొరకు), సమారబ్ధ = ప్రారంభించబడిన, వేళన్ = ముహూర్తమందు కలిగే (విజయయాత్రకు నిర్ణయించబడిన ముహూర్తమున కలిగే), కౌతుకమునన్ = ఉత్సాహమువల్ల, మొగమునన్ =

ముఖమునందు, గరువంపు మురువు = ఠీవితోనున్న అందము, తోఁపఁగా = కనబడుతుండగా (పెండ్లి ఆసన్నమయినప్పుడు పెండ్లికొడుకు ముఖమున కనబడే "పెండ్లి కళ"వలె ఉండగా).

ఔరా ! పెండ్లికిఁగా, ఏఁగినట్లు = వెళ్ళినట్లు, అనికిఁగా = యుద్ధమునకు, ఏఁగి = వెళ్ళి, అక్ష తంత్రంబులు ఇవి = ఈ యుద్ధములు పాచికల ఆటలు, ఏటిలక్షము = ఏమిలెక్క, అనుచుఁగా, రేక మోవక = తనశరీరమున చిన్నగంటు (గాయము)ను గూడ పొందకుండ, (అనగా శ్రమలేక). గెల్చుట = జయించుట, నీకె, చెల్లుఁగా = తగును, (ఇలాగు గెల్చుట ఇతరులకు సాధ్యముకాదు).

*తాత్పర్యము :*

పెండ్లికి పోవునపుడు, మేలుకట్టు, స్వస్తివాదములు, మంగళవాద్యములు, ముఖమున పెండ్లికళలు ఉంటాయి. యుద్ధమునకు పోవువేళ రఘునాథునికి అవి అన్నీ కలిగినవని భావము.

*విశేషము :*

యుద్ధమునకు పెండ్లికొడుకువలె వెళ్ళిన రఘునాథరాజు విజయలక్ష్మిని చేపట్టి వస్తాడని ధ్వని.

*పాఠాంతరము :*

"విజయ సమారబ్ధవేళ కౌతుకమున"

అని వేదంవారి పాఠం. దీనికి వారు చెప్పిన అర్థము—

"గెలుపుచేత ఆరంభింపబడిన యుత్సాహము యొక్క కుతూహలముచేత"అని. ఇంచుమించు ఆదారినే వెళ్ళిన బులుసువారు, "విజయముచే నారంభింపబడిన యుత్సాహపు గుతూహలముచే" అని చెప్పారు. రాజు యుద్ధానికి వెళ్ళబోతున్నాడు; ఇప్పుడే విజయం ఫలితాలను చెప్పడం సమంజసం కాదు.

"రేక మోయఁగ గెల్చుట నీకెచెల్లు"

తిరపతివారిపాఠం.

వీరి అర్థమేమో తెలుసుకోడానికి మన కవకాశంలేదు. సాధారణంగా అందరూ అంగీకరించిన పాఠం "రేకమోవక గెల్చుట" అన్నదే.

ఇక్కడొక్కమాట మనవి చేయవలసి ఉంది. "రేకమోవక" అన్నది ఒక చక్కని పలుకుబడి. ఈ పద్యంలో సందర్భాన్ననుసరించి ఎవ్వరయినా "శ్రమలేక-చెక్కు-చెదరక" అని అర్థం చెప్పగలుగుతారు. దీనికి వేదంవారు "అవలీలగా" అని అర్థం చెప్పారు. ఏమన్నా

ఈ సన్నివేశానికి సరిపోతుంది. అందుచేత ఆ పలుకుబడికి సరియైన అర్థం తెలుసుకోడానికి మన వ్యాఖ్యాతలు ప్రయత్నించవలసిన అవసరం కనబడలేదు. కాని ఈ కావ్యంలో మొదటి ఆశ్వాసం 196 వ పద్యం "కన్నె నగుమోము తోడఁగా...'' అన్న పద్యం దగ్గరకు వచ్చినప్పుడు ఇలాంటి అర్థం పనికిరాదని బోధపడ్డది. అక్కడ "రేకమోవకయున్నఁగా'' అన్న పలుకుబడికి అర్థం చెప్పడానికి ప్రయత్నించక తప్పిందికాదు. జూలూరు అప్పయ్యగారి దగ్గర నుంచి వేదంవారి వరకు ఈవిషయంలో పొరపడ్డారని చెప్పకతప్పదు[1].

అలంకారము :

ఉపమ.

ఎంచి రంటివి గాని యీసారి గట్టిగాఁ
దెగుఁ గార్య మనువార్తఁ దెలుపవైతి,
మించి రంటివి గాని మేదిని యదరంగ
నడచె సైన్యంబని నుడువ వైతి,
వంటి రంటివి గాని యాఖీలతర భటో
ద్భట సంగరంబని పలుక వైతి,
మొగిసి రంటివి గాని ముకుటముల్తెగి రాజ
శేఖరుల్ పడుట సూచింపవైతి,
వనుచు నీ ధాటి కెరవాఱు నహితవీరు
లదరునను మాట వెడలక బెదరి పల్కఁ
జారుఁ గని నేర మెంతురు సారె సారె,
సమర నిశ్శంక రఘునాథ సాహసాంక. 41

ఈ పద్యములో రఘునాథనాయకుని శత్రురాజుల అవస్థ వర్ణించాడు కవి.

అర్థము :

సమర నిశ్శంక రఘునాథ సాహసాంక = యుద్ధమున జంకులేని వాడా, సాహసమె భూషణముగా గలవాడా, రఘునాథరాజా, అదరునను = భయముచేత, మాట వెడలక = నోట మాటరాక, బెదరిపల్కఁ (చుండిన), చారున్ = వేగుల వానిని, కని, నీధాటికిన్ = నీ విజృంభ

(1) "రేకమోవక" విమర్శన ఈ గ్రంథంలోని 1-196 వ్యాఖ్యానంలో చూడవచ్చును.

జకు, ఎరవాఱు = బలియైన, అహితవీరులు = శత్రువులైన శూరులు, సారెసారె = మాటి మాటికి, నేర మెంతురు = (చారుని మీద) తప్పు మోపుతారు (నిందిస్తారు). ఏ విధముగా అంటే :

౧. ఎంచిరి = (రఘునాథరాజు మా మీద) నేరమెంచినారు, అంటివిగాని = అనే చెప్పావు కాని, ఈ సారి, గట్టిగా = ఘోరముగా, తెగుణా కార్యము = పనితీరిపోవును, అనువార్తణా = అన్న సంగతి, తెలుపవైతివి, (అని చారుని నిందిస్తారు - చారుడు ఎంచిరని మాత్రమే అన్నాడు కాని, ఈసారి రఘునాథరాజు తమపని పట్టిస్తాడని చెప్పలేదని నింద).

౨. మించిరి = బయలుదేరినారు, అంటివికాని, మేదిని = భూమి, అదరంగణా = కదలునట్లు, సైన్యము = రఘునాథరాజు సైన్యము, నడచెణా, అని, నుడువవైతివి (చెప్పలేదని నింద).

౩. అంటిరి = (యుద్ధమున) తాకిరి, అంటివి గాని, ఆభీల......సంగరంబు—ఆభీలతర = మిక్కిలి భయంకరులైన, భట = భటుల యొక్క, ఉద్భట = ఘోరమైన, సంగరంబు = యుద్ధము (జరుగును), అని, పలుకవైతివి (అని నింద).

౪. మొగిసిరి = కలియబడిరి, అంటివి గాని, ముకుటముల్ = కిరీటములు (తలలు), తెగి, రాజ శేఖరుల్ = (మనపక్షంలోని) రాజ శ్రేష్ఠులు, పడుట = కూలిపోవుట, సూచింపవైతివి = తెలుప లేదు (అని నింద).

*విశేషములు :*

రఘునాథరాజు పరాక్రమమును చూచినందువల్ల కలిగిన భయమూ, తన ప్రభువు ఏమంటాడో అని భయమూ పొందిన చారుడు, ఆ భయమువల్ల నోటమాట వెడలక, చిన్నచిన్న మాటలుగా ఎంచిరి, మించిరి, అంటిరి, మొగిసిరి, అని మాత్రము చెప్పాడే కాని, ఘోరమైన యుద్ధము జరుగునని పెక్కు మాటలలో చెప్పలేదు. కాబట్టే, ఓడిపోయిన శత్రు రాజులు, తమ అపజయమును చారుని నెత్తిని రుద్ది, పై విధముగా నిందిస్తారు. తమ అసమర్థతే అపజయానికి కారణమని అంగీకరించరు, పౌరుషము కలవారు కాబట్టి.

ఖిన్న కటంబులై పేరు పెంపును లేక
గంధనాగంబు లెక్కడ నడంగె?
బాహ్లిక శక సింధు పారసీ కోద్భవ
హయ ఘట్ట మేగొంది యందు డిందె?

పోటు గంటులఁ దూఱిపోవు దారుణమైన
మాస్టీల గమి యెందు మ్రగ్గిపోయె?
గర్వంబు మేనులఁగన్నట్టు లుండెడు
దొరల యామిక లెందుఁ దొలఁగి పోయెఁ?
బరుల పాళెంబు లీరీతి బన్నమొంద,
మాయఁ బన్నెను నీఖడ్గ మంత్రవాది;
గెలిచినను నేమి మేలైన గెలుపు గంటి?
సమర నిశ్శంక రఘునాథ సాహసాంక 42

అర్థము :

సమరనిశ్శంక రఘునాథ సాహసాంక,

౧. భిన్న కటంబులై = బ్రద్దలైన చెక్కిళ్ళు కలిగినవై, పేరుపెంపును లేక = నామ రూపాలు లేకుండా, గంధనాగంబులు = (శత్రువుల) మదించిన ఏనుగులు, ఎక్కడఁ అడంగెఁ = ఎక్కడ అణగి (కానరాకుండా) పోయెను ?

౨. బాహ్లిక, శక, సింధు, పారసీక (దేశములయందు), ఉద్భవ = పుట్టిన, హయ ఘట్టము = (ఈ దేశములనుంచి వచ్చిన) గుఱ్ఱముల సమూహము, ఏ గొందియందు = ఏ ఇరుకున (సందున), డిందెఁ = నశించెను ?

౩. పోటు గంటులఁ = శత్రుసైనిక శ్రేణిని పొడిచి, గంటుపెట్టి, ఆగంటులోనుండి, దూఱిపోవు = శత్రు సేనలలో చొచ్చుకొని పోవగలిగిన, దారుణమైన = భయంకరమైన, మాస్టీలగమి = (శత్రులలోని) శూరుల సమూహము, ఎందు మ్రగ్గిపోయెఁ = ఎక్కడ అణగి పోయెను ?

౪. గర్వంబు మేనులు కన్నట్టులు = గర్వమే శరీరమును దాల్చెనా అన్నట్లు, ఉండెడు, దొరల = శత్రురాజుల, ఆమికలు = మదములు (అహంకారములు), ఎందు, తొలఁగి పోయెఁ? (ఆము = మదము).

పరుల = శత్రువుల, పాళెములు = సేనాశిబిరములు, ఈ రీతిఁ, బన్నము ఒందఁ = భంగపడునట్లు(నశించునట్లు), నీఖడ్గమంత్రవాది = నీకత్తి అనేమాంత్రికుడు, మాయఁబన్నెను = మాయచేసెను.

మంత్రవాది వస్తువులను మాయచేసినట్లు, రఘునాథుని కత్తి పైవాటిని క్షణములో కనబడకుండా—ధ్వంసము—చేసెనని భావము.

గెలిచినను = నీవు గెలిచినప్పటికీ, ఏమి మేలైన గెలుపు కంటివి = ఏమి గొప్ప జయ మును పొందితివి ? ఈ గెల్పులో మంత్రబలమే కనబడుతుంది గాని, రాజు పరాక్రమం కాన రాదు. కాబట్టి మేలైన గెల్పుకాదని చమత్కారము. నిందించినట్లు కనబడుతున్నా ఇది ప్రశంసే.

పైన చెప్పిన శత్రు రాజుల ఏనుగులు బాగామదించినవి. గుఱ్ఱములు బాహ్లికాది దేశాల నుంచి వచ్చిన ప్రశస్తమైనవి. బంట్లా, దారుణమైనవారు; బలగర్వం రూపుపొందిన ట్లున్నవారు దొరలు. ఈలాటి ప్రశస్త గుణములు కలిగి ఉండినా ఒక్కక్షణములో మాయమాయెననీ, తనకత్తి అటువంటి వానినన్నిటిని మంత్రబలము చేతనో అన్నట్లు అవలీలగా, నిశ్శేషము చేయ గలిగెననీ భావము.

"పోటుగంటుల దూరిపోవు" అన్నదొక పదబంధము. దీని అర్థము సుబోధకంగా కనబడదు. సాధారణంగా "యుద్ధములో కత్తివ్రేటులవల్ల గాయాలు కలిగి, వాటినుంచి నెత్తురు కారుతూ ఉన్నా లక్ష్యపెట్టకుండా శత్రుసేనలో దూరి విజృంభించేవారు'' అని, సుగమమైన అర్థం చెప్పుకోవచ్చును. వేదంవారుగూడా అలా తేలికగానేభావించి, ఆ పదబంధానికి అర్థమే చెప్పలేదు. బులుసువారు ''పోటుగంటులన్ = పొడుచుటచే కలిగిన రంధ్రములనుండి" (దూరిపోవునట్టి) అన్న అర్థం సూచించారు.

పింగలి సూరన్నగారు కలాపూర్ణోదయములో 1_32 లో (కలభాషిణీ వర్ణనలో)

బెళుకులఁ జిమ్ముచుఁ గలికి
విత్తరిచూపు సరత్నకుండలాం
చల కషణోజ్జ్వలత్వము
పసల్ నెరపం జళిపించుచుఁ భుజం
గుల హృదయస్థలుల్ వొడిచి
కొంచక తోడన పోటుగంట్లఁ దూ
ఱె లలన యౌర ! యొక్కొకతఱిఁ
పుపుబోండ్లు కటారికత్తియల్.

అని హృదయ స్థలాన్ని పొడవడమూ, ఆ పోటుగంటులో దూరిపోవడమూ స్పష్టంగా చెప్పారు. ఇది శూరుల సాహసానికి తార్కాణగా భావించాలి. ఎంత సూక్ష్మమయిన సందు దొరికినా, దానిని వినియోగించుకొని శత్రుసేనలో ప్రవేశించడ మన్నమాట_కౌశలము.

ఇదిలా ఉండగా ఈ చేమకూరకవే 3_25 పద్యములో

పాముకోరలతోడ సాముచేసిన గాడ్పు
  విసపువిత్తై సోకివెగటు చూప,
క్రౌంచాచలము పోటుగంటు దూఱిన రాజ
  హంసముల్ వడి హాళాహళులు సేయ ..

అని చంద్రాదుల ఉపాలంభనలో చెప్పాడు. దీనినిబట్టి ''పోటుగంటు దూఱిపోవడం''లో ఒక క్రూరత్వము, మోటుతనము ఉంటుందని అనుకోవాలి.

*పాఠాంతరాలు* :

(1) "గెలిచెనని నేటి మేలైన గెలుపుగంటి ?"

(2) "పోటుగంటుల దూఱిపోవు దారుణులైన మాస్టీలగమి......"

*అలంకారము* :

వ్యాజస్తుతి.

రంభ వాకిటను దోరణములు గట్టెడు
  తీవర మొకకొంత దీలుపడియె;
మేనక యింటిలో మేల్కట్లు నవరించు
  సంరంభ మొకకొంత నడలువాఱెఁ;
గనకాంగి యింటిలోఁ గర్పూరవేదికల్
  నవరించు టొకకొంత జాగుపడియె;
హరిణి బంగరు మేడ నరవిరి సెజ్జలు
  నిర్మించు టొకకొంత నిలుకడయ్యె;
మబ్బు గబ్బున, నీశౌర్యమహిమ వినక
తెగువ తోడుత నెదిరించి తిరిగి విఱిగి
పాఱిపోయిన మన్నీల పాటు నూచి
సమర నిశ్శంక రఘునాథ సాహసాంక. 43

రఘునాథుడి శౌర్యమహిమను లక్ష్యము చేయక గర్వంతో శత్రురాజులు రఘునాథుని ఎదిరించినప్పుడు, ఈ యుద్ధములో ఈ మన్నీలు కూలి వీరస్వర్గము పొంది తమతో కలియడానికి వస్తారని భావించి రంభా మేనకాది అప్సరసలు తమతమ పడకటిండ్లను అలంకరింప మొదలా

పెట్టారు. ఇంతలో ఆ మన్నీలు రఘునాథుని ధాటికి ఆగలేక పారిపోవుట చూచి, అప్సరసలు ఆ మన్నీలు ఇకరారనీ, తాము వేగిర పడవలసిన పనిలేదనీ ఆగినట్లు కవి చక్కగా వర్ణించాడు. యుద్ధాలలో చచ్చినవారికే వీరస్వర్గము; పారిపోయినవారి కది దక్కదు. వీరస్వర్గం లభించినవారికే రంభాదుల కలయిక.

అర్థము :

సమర......సాహసాంక = ఓ రఘునాథమహారాజా, మబ్బుగబ్బునన్ = చీకటి క్రమ్ము గర్వముచేత (గర్వాంధులయి), నీ శౌర్యమహిమన్ = నీశౌర్యముయొక్క గొప్పతనమును, వినక = లక్ష్యపెట్టక, తెగువతోడుతన్ = తెంపరితనముతో, ఎదిరించి, తిరిగి = వెనుకకుమరలి, విఱిగి = చెదరిపోయి, పాఱిపోయిన, మన్నీల = శత్రురాజులయొక్క, పాటు = అవస్థను, చూచి = చూచుటవలన.

౧ రంభ, వాకిటన్ = ద్వారమునందు, తోరణములు, కట్టెడు తీవరము = కట్టుట యందలి తొందర, ఒక కొంత = కొంచెము, దీలుపడియెన్ = తగ్గిపోయెను.

౨, మేనక ఇంటిలో, మేల్కట్లు = చాందినీలు, సవరించు, సంరంభము = తొందర, ఒకకొంత, సడలువాఱెన్ = మందగించెను.

౩. కనకాంగి ఇంటిలో, కర్పూర వేదికల్ = పచ్చకర్పూరముతో అలంకరించిన తిన్నెలు, సవరించుట, ఒక కొంత, జాగుపడియెన్ = ఆలస్యమాయెను.

౪, హరిణి బంగరుమేడన్, అరవిరి = సగము వికసించిన పువ్వులతో, సెజ్జలు = పాన్పులు నిర్మించుట, ఒక కొంత, నిలకడ అయ్యెన్ = నిలచి పోయెను.

విశేషము :

అప్సరసలు త్వరపడి పడకటిళ్ళను సవరించడానికి కారణం—

రఘునాథనాయకుడితో యుద్ధానికి వెళ్ళిన వారు నిముషాలమీద (చాల త్వరగా) చచ్చిస్వర్గానికి వస్తారని ధ్వని. ఆ సవరింపులు ఇంకా పూర్తి కాకముందే, అనగా యుద్ధమారంభమైన అత్యంత స్వల్పకాలములోనే-కొన్ని నిముసాలలోనే అందామా—ఆ శత్రురాజులు వెనుకకు తిరగడం, విరగడం, పారిపోవడం అన్నీ జరిగాయి. అది చూచి అప్సరసలు మరేమీ తొందరలేదని సవరింపులు మెల్లగా నడిపారు. శత్రురాజులు అంత త్వరగా పలాయనం చిత్తగించారని ధ్వని.

*పాఠాంతరము :*

"మబ్బు గొబ్బున నీ శౌర్య మహిమ వినియు" అన్న పాఠము వ్యాఖ్యాతలు ఎత్తుకొని 'అజ్ఞానాతిశయము చేత' అని వాఖ్యానించారు. గొబ్బున = శ్రీఘ్రముగ అన్న అర్థమే వస్తుందికాని, అతిశయమన్న అర్థం రాదు. శౌర్యమహిమ వినిగూడా శత్రువులు అజ్ఞానము చేత ఎదిరించారు అనడంకంటె, గర్వము చేత అన్న అర్థము చక్కగా అతుకుతుంది. గబ్బు = గర్వము—మబ్బు అంటె చీకటి. కాబట్టే మబ్బు గబ్బు అన్న పాఠము శ్రేష్ఠము.

*అలంకారము :*

అతిశయోక్తి, ఉత్ప్రేక్ష.

అతుల ఘూరి ప్రతాపార్క దీధితి చేత
గట్టిగాఁ గాఁకలు పుట్టు పిదప,
ఘోరారి గళరక్త ధారాళ వృష్టిచే
నాని దుక్కికిఁ బదనైన పిదప,
హయ ధట్టి ఖుర పుట హల్యా ముఖంబున
నంతట దున్నిన యట్టి పిదప,
మొలచిన నీ కీర్తి మొలకలు తఱుచుగా
వెదపెట్టి పైరు గావించు పిదపఁ.
గాపు నిలుపవె బేతాళ గణము నెల్ల,
నట్టి పట్టుల కరిగి నీ వరుల నోడె
పాటు చేసితి వనుట యేపాటి తలఁప
సమర నిశ్శంక రఘునాథ సాహసాంక. 44

*అర్థము :*

సమర......సాహసాంక = రఘునాథనాయకా.

(౧) అతుల....చేతఁ— అతుల = సాటిలేని, ఘూరి = ఎక్కువైన, ప్రతాప = ప్రతాపము అనెడి, అర్కదీధితి చేతఁ = సూర్యకాంతి (ఎండ) చేత, గట్టిగాఁ = ఎక్కువగా, కాకలు = వేడిమి, పుట్టు పిదపఁ = కలిగిన తర్వాత —

(౨) ఘోర......వృష్టి చేతఁ— ఘోర అరి = భయంకర శత్రువుల యొక్క, గళ రక్త = కంఠమునుండి కారిన రక్తము, అనెడు, ధారాళ = తెంపు లేని, వృష్టిచేతన్ = వర్షము చేత, నాని, దుక్కికిఁ = దున్నుటకు, పదను = తగినంతతడి, ఐన పిదప —

(౩) హయధట్ట......ముఖంబునఁ—హయధట్ట = గుఱ్ఱముల సమూహము యొక్క, ఖురపుట = డొప్పల వంటి డెక్కలు అనెడు, హల్యా ముఖంబునఁ = నాగళ్ళ మొనల (కఱుల) చేత, అంతటన్, దున్నిన యట్టి పిదపఁ —

(౪) మొలచిన, నీ కీర్తి మొలకలు = నీ కీర్తి అనెడు మొలకలు (నారు), తఱుచుగా = దట్టముగా, వెదపెట్టి = ఊడ్చి (నాటి), పైరు, కావించు పిదపఁ—

బేతాళ గణమున్ ఎల్లన్ = బేతాళుని అనుచరుల నందరిని (పిశాచాదులను), కాపునిలుపవె = కావలిగా ఉంచలేదా ! అట్టి, పట్టులకు = చోటులకు, అరిగి = పోయి, నీవు, అరులఁ = శత్రువులను, ఓదెపాటు చేసితివి = కట్టలు కట్టలుగా నరికి పడవేసితివి, అనుట, తలపఁ, ఏ పాటి = ఏమి విశేషము !

*విశేషము :*

ఇంత ప్రయత్నంచేసి బాగా పైరు గావించిన తర్వాత నీవు ఓదెలుగా పడవేయుట సహజమే. విశేషమేముంది ? అని చమత్కారము.

కీర్తి మొలకలు మొలిచిన తర్వాతనే వెదపెట్టి పైరు కావించినట్లు కవి చెప్పాడు. కాబట్టి "వెదపెట్టి" అంటే 'విత్తి, విత్తనములుచల్లి' అని అర్థము చెప్పరాదు. ఆ మొలకలే నారు ; ఆ నారును దట్టముగా నాటి (వెదపెట్టి) పైరు కావించాడనడం సమంజసము.

రణరంగమున చనిపోయిన శత్రుబలముల కళేబరముల కోసం కాచుకొని పిశాచాదు లుంటాయి. కాబట్టి వాటిని కావలి నిల్పినట్లు కవి వర్ణించాడు.

ఇక్కడ, ఎండ వేడిమి తర్వాత వానతో పదునైన పిమ్మట, దున్నిన వెనుక, వెదపెట్టి పైరుచేసి, ఓదెలుగా (కుప్పలుగా) వేయుట, అన్న వ్యవసాయ కార్యమంతా రఘునాథుని విజయములకు కవి సరిపోల్చాడు. ప్రతాపము ఎండ; శత్రు రక్తము వాన; గుఱ్ఱపుడెక్కలు నాగళ్ళు; కీర్తి నారు; బేతాళుడు కావలి; శత్రువుల కళేబరములు ఓదెలు.

**అట్టి పట్టుల కరిగి నీ వరుల నోదె**
**పాటు చేసితి వనుట యే పాటి తలప !**

ఈ రెండు చరణాలలోను కవి ఇమిడ్చిన భావము చాల మనోహరము. శ్రద్ధగా చూడవలసినది.

అట్టి పట్టులు అని కవి చూపినవి రెండు : (1) యుద్ధరంగము. (2) పంట పొలము.

"నీ వరులన్" అన్నది (1) నీవు, అరులన్ = శత్రువులను అనీ, (2) నీ వరులన్ = నీయొక్క ధాన్యాలను అనీ, (3) నీవరులన్ (ఒక్కమాట) = నీవారములు అనీ, పదవిభజన చేయవచ్చును.

"అనుటయేపాటి" అన్నది (1) అనుట (అని అర్థంచెప్పడం) ఏపాటి = పెద్ద విశేషమా ? అనీ, (2) అనుట, ఏపాటి = ఏమిన్యాయము ? (పాటి అంటే పాడి, అంటే న్యాయము) అనీ, (3) అనుటయే పాటి = అనడమే సమంజసము, న్యాయము అనీ అర్థాలు చెప్పుకోవచ్చును.

శ్లేషకింత ఆనుకూల్య మున్నచోట మనకవి, (మాట విరుపులతో మహా చమత్కారం చూపించే వాడన్న ప్రసిద్ధి కలిగిన చేమకూరకవి) తేలికగా విడిచి పెడతాడా ?

యుద్ధరంగ సందర్భం: నీవు అరులన్ (శత్రువులను) కుప్పలు కుప్పలుగా నరికి పడవేశావు అనడం ఏపాటి ? రఘునాథుడి వీరవిహారానికి తగిన ప్రశంస కాదన్న మాట.

అనుట యేపాటి ? అనడంలో కవి పాఠకుడికి ఒక హెచ్చరిక ఇస్తున్నాడు. ఏ మనంటే-"ఈ అర్థం ఎవరైనా చెప్పగలరు; విశేషమేముంది ! ఇంతకన్నా విశేషార్థం ఉందా : చూడు" అని హెచ్చరింపు.

పద్యంలో విశేషార్థం ఉన్నప్పుడు సాధారణంగా ఇలాంటి హెచ్చరిక లివ్వడం మనకవికి చక్కని అలవాటు. చూడండి:

తెమ్ము బంగారు కుండ జలమ్ములనుచు,
తెమ్ము లతకూన మంచి సుమమ్ములనుచు,
తెమ్ము బాగైన కొమ్మ ఫలమ్ములనుచు,
మించు బోడిని నేరుపు మించఁ బలుకు.

అని దీనిలో ఉన్న "నేర్పు" ఏమిటో తెలుసుకో అంటాడు.

పంట పొలము సందర్భంగా : నీవరులన్ = నీవార ధాన్యములను, ఓదెపాటు చేశావని అర్థం చెప్పవచ్చును. కాని, నివ్వరి, నీవరి, నివారము, నీవారము, ఈ

రూపాలకన్నిటికీ అర్థం, "దున్నకుండా, విత్తనం వెయ్యకుండా, అడవులలో తమంత టవి పండిన గునుగు, దూసరి, గంటె, చామ మొదలైన గడ్డి ధాన్యాలు" అని. అటు వంటి 'నీవరులను' కుప్పతెప్పలుగ పడవేశావని అర్థం చెప్పడం ఏపాటి ? = ఏమి న్యాయం ? ఏమంటే, ఈ పద్యంలో రఘునాథుడు 'పైరుగావించినది' దున్ని వెద పెట్టినందుకు ఫలితంగా కలిగినదే. కాబట్టే అలా నీవరులు అని చెప్పడం అధర్మం అంటాడు కవి.

ఇక మిగిలిన విరుపు, నీ వరుల నోదె పాటు చేయడ మన్నది. ఇక్కడ వరి (బహువచనం వరులు) అన్నది వడ్లు, ధాన్యము అన్న అర్థంలో కవి ప్రయోగించాడు. (చూడండి 1-69 వ పద్యములో "నల్గడల భూమి వరులు మేలన").

నీ వరులన్ అంటే నీవు పైరుకావించిన (పండించిన) ధాన్యము అని భావము. కీర్తి మొలకలు వెదపెట్టి (నాటి) పైరు చేసింది కాబట్టి ఈ పంట కీర్తి పంటే కావాలి. దానిని కుప్పతెప్పలుగ (ఓదెపాటు) సమకూర్చుకున్నావు, అంటే నీవు అత్యధికమయిన కీర్తిని ఆర్జించావన్నమాట. ఇలాగ "అనుటయే" అర్థం చెప్పడమే, పాటి = న్యాయము, సమంజసము అని అంటాడు కవి.

సేద్యంలాగ వర్ణించిన ఈ వీర విహారం వల్ల రఘునాథరాజు అపారమైన కీర్తిని ఆర్జించాడని అభిప్రాయము.

నీవరులన్ = (నీవారధాన్యాన్ని) అనిగాని, నీ వరులన్ (నీవు పండించిన వరులను) అనిగాని విరిచినప్పుడు ఒక్క చిక్కు కలుగుతుంది. ఏమిటంటే—యతి భంగం. కాని వేదంవారు తమ వ్యాఖ్యానంలో "నీ వరుల నోదె పాటు చేసితివి = నీవు పైరు కావించిన కీర్తి సస్యములను కోతకోసి ఓదెలు కావించితివి; అనగా..." అని విశేషార్థం చూపించారు. అనగా, యతి భంగాన్ని వారు లక్ష్యపెట్ట లేదన్నమాట. దీనికి కారణం : అందమైన విశేషార్థం సాధించినప్పుడు ఇలాంటి స్వల్ప వ్యత్యాసాలను పాటించ రాదన్న ఉదార భావమే అనాలి.

కీర్తి మొలకలు అనడానికి ఆముక్తమాల్యదలో కృష్ణదేవరాయల ప్రశంస యందు ఈ కింది (1-42) పద్యం చూడండి :

అలుకన్ ఘోటక ధట్టికా ఖురపుటీ హల్యన్ ఖురాసాని పు
చ్ఛలు వో దున్ని, చల చ్ఛమూ గజ మదాసార ప్లుతిన్ గీర్తి పు
ష్కలసస్యం బిడి యేకధాటి ఖళిరా! కట్టించి తా దృష్టి కే
దులఖా నోగ్ర కపాల మర్దప హరిద్భూ జాంగల శ్రేణికిన్.

పాఠాంతరాలు :

1. అట్టి పట్టుల కరిగి నీ వరుల యోడు
   పాటు చేసితి వనుట.......

ఓడుపాటు = అపజయము పాలు చేశా వనడము. దీనిలో వ్యవసాయ సంబంధమయిన అందము లేదు.

2. ఘోరారి గళరక్తధా రాతివృష్టిచే......

అతివృష్టి పంటలకు హానికరము; కాబట్టి ధారాళవృష్టి అనడమే మంచిది.

అలంకారము :

రూపకము, శ్లేష.

ఒకరు వోయిన దెస కొకరు వోవక పాఱ
నరివీరులకు దాహగరిమ మించె,
గడగడ వడఁకి నల్గడల కేఁగక భీతిఁ
జెందిన వారిపైఁ జెమట పుట్టె,
మున్నాడి యెలగోలు మూఁకలఁ బోట్లాడు
పరుల మైఁ బాటల ప్రభలు మీఱెఁ,
జేగ దెచ్చుక కొంత సిగ్గున నెదిరించు
రాజుల యొప్పు వీరము దొలంగెఁ,
దెగువ తోడుత ధరియించి తీవ్ర తాప
భరిత రూక్షాక్షి నిజముఖ ప్రభల పేర
నీవు ఘర్మార్క విస్ఫూర్తి నెఱపునపుడు
సమర నిశ్శంక రఘునాథ సాహసాంక. 45

వేసవి ఎండలవలన జనులకు దాహము, చెమట, కంధి బోవుట, నీరసము కలిగినట్లే, రఘునాథుని తీవ్ర దృష్టుల వల్ల శత్రువులకు ఆ యవస్థలే కలిగాయని వర్ణన.

అర్థము :

సమరనిశ్శంక రఘునాథ సాహసాంక = ఓ రఘునాథరాజా! తెగువ తోడుతన్ = సాహసముతో, తీవ్రతాప భరిత = తీవ్రమైన కాక (వేడి) తో నిండిన, రూక్ష = తీక్షణమైన, అక్షి = కన్నులు (చూపు), ధరించి = కలిగి, నిజముఖ = నీ ముఖము యొక్క, ప్రభల పేరన్ = కాంతులనే పేరుతో (ఆనెపముతో అన్నమాట), ఘర్మ అర్క విస్ఫూర్తిన్ = ఎండ కాలపు సూర్యుని యొక్క ప్రకాశమును, నీవు నెఱపునపుడు = ప్రసరింప జేసినప్పుడు—(అనగా వేసవి ఎండవలె తీక్షణమైన దృష్టులతో నీవు చూచినపుడు),

౧. ఒకరు పోయిన దెసకు ఒకరు పోవక, పాఱు = పారిపోవుచుండు, అరివీరులకున్ = శత్రుశూరులకు, దాహగరిమ = ఎక్కువ దప్పి, మించెన్ = కల్గెను;

౨. గడ గడ వడఁకి, నల్గడలకు = ఏ దిక్కుకైనను, ఏఁగక = పోవజాలక, భీతిఁ జెందిన వారిపైన్ = భయపడి నిలిచిపోయిన శత్రువుల మీద, చెమటపుట్టె;

౩. మున్నాడి = శత్రువులలోనుంచి ముందుకువచ్చి, ఎలగోలు మూఁకలన్ = (రఘునాథసేనలోని) ముందునడిచే దండుతో పోట్లాడు, పరుల మైన్ = శత్రువుల శరీరములందు, పాటలప్రభలు = (గాయములరక్తము వలన) ఎఱ్ఱని (కందిపోయిన) కాంతులు మీఱెన్ = అతిశయించెను;

౪. చేగ (చేవ) = బలము—ఇక్కడ పౌరుషము, తెచ్చుక = తెచ్చుకొని, కొంత సిగ్గున = (ఇంతకు ముందు అపజయము పొందిన వారు కాబట్టి) కొంత సిగ్గుపడుతూ, ఎదిరించు రాజుల, ఒప్పు = అందమూ, బీరము = పరాక్రమమూ, తొలంగె = అంతరించి పోయాయి;

ఎండవేడిమి వల్ల నిర్వీర్యులయినట్టు అని భావము.

తాత్పర్యము :

చెట్టొక పిట్టగా పారిపోతుండే శత్రురాజులకు దాహమెక్కువయింది. భయముతో ఎటుపోవడానికీ తోచకుండా ఉండే వారికి చెమటలు పుట్టాయి. ముందుగా వచ్చి రఘునాథ రాజు సైనికులతో పోట్లాడే శత్రువుల శరీరాలు ఎఱ్ఱగా కందిపోయాయి. పౌరుషము తెచ్చుకొని ఎదిరించిన రాజుల ఠీవీ దర్పమూ అంతరించాయి. ఈ దురవస్థ అంతా రఘునాథరాజు వేసవికాలపు సూర్యునిలాగా తీక్ష్ణమైన చూపులతో చూచినందువల్ల కలిగినదే.

విశేషము :

నాలుగో సీసచరణంలోని రాజులు ఇంతకు ముందు అపజయంపొందిన వారని ధ్వని. కాబట్టే కొంత సిగ్గుతో పౌరుషము తెచ్చుకొని ఎదిరించారని భావము.

"రాజు" అంటే చంద్రుడు అన్న అర్థంగూడా ఉంది; పద్యంలో 'ఘర్మార్క విస్ఫూర్తి' (వేసవి సూర్యుడి ప్రకాశము) ఉంది. సూర్య చంద్రులు ఇద్దరూ ఉండడం వ్యాఖాతలకు గిలిగింతలు కలిగించింది. వేంకటరాయశాస్త్రిగారు "రాజుల = (ఎదిరి) దొరల యొక్క (చంద్రుల యొక్క అనియు)" అని అర్థం చెప్పారు. బులుసు వారు గూడ అలాగే "రాజులు = శత్రురాజులు, చంద్రులు" అని అర్థం చెప్పారు. సూర్యుడున్నందువల్ల చంద్రుల ఒప్పూ బీరమూ పోయాయన్న సొగ సున్నట్టు భావించారు.

కాని, ఇది నేల విడిచిన సాము అనాలి. చంద్రులు అన్న బహువచనాన్ని గాని, ఒప్పూ బీరమూ అన్నమాటల చంద్రపరమైన పొందికలు గాని, మనము సమర్థించలేము. చేమకూరకవి కవితా నియమాలనుబట్టి చూచినా, ఈ చంద్రులన్న భావము అతనికి లేదనే చెప్పాలి.

కవి ప్రక్రమప్రియుడు. ముఖ్యంగా సీసపద్యాలలో చాల పట్టుదలతో ప్రక్రమము పాటించేవాడు. ఒక సీసపాదములో ఏలాంటి సొగసో, శ్లేషో ఉంటుందో, తక్కిన సీసపాదాలలోనూ అలాంటి సొగసునూ, శ్లేషనూ ఉంచకుండాపోడు. 'రాజులు = చంద్రులు' అన్న సూచనవంటి ఏర్పాటు మొదటి మూడు సీసపాదాలలోనూ కానరాదు. కాబట్టి ఈ అభిప్రాయం కవికి లేదని నిర్ధారణ చేయవచ్చును.

పాఠాంతరాలు

1. తెగువ తోడుత ధరియించి తీవ్రకోప
భరిత రోషాగ్ని నియమిత ప్రభలపేర
నీవు ధర్మాత్మ విస్ఫూర్తి నెరపునపుడు—

—తిరుపతి వేంకట కవులు.

2. తెగువ తోడుత ధరియించి తీవ్ర కోప
భరిత రూక్షాక్షి నియమిత ప్రభలపేర
నీవు ఘర్మార్క విస్ఫూర్తి నెఱపునపుడు—

—వేదమువారి పాఠము.

వేదము వేంకటరాయశాస్త్రిగారు ఈ పాదములో "తీవ్రకోప...ప్రభలపేరన్"అంటే, "ఉగ్రమయిన కోపముతో నిండిన తీక్ష్ణమైన కంటియందు బద్ధమయియున్న కాంతులవేడు నెపముచేత"అని అర్థం చెప్పారు.

బులుసువారు "ఎక్కువ కోపముతో నిండిన వాడిచూపుల యందు బద్ధమైయున్న కాంతులనెడి పేరితో—కాంతుల నెపమున" అని అర్థం ఇచ్చారు.

అలంకారము :

అపహ్నుతి.

తలలు వీడఁగఁ బాఱు ధరణీశ్వరులఁ జూచి
యంటి వెన్నాడని యట్టి మహిమ,
పడిన యేనుంగుల ప్రక్కల కొదిఁగిన
రాజులఁ జూడని రాజసంబు,
జళిపించు చంద్రహాసములు పాఱఁగవైచి
మ్రొక్కువారలమీఁద మొనపు కరుణ,
నెత్తురు గనుపట్టు హత్తిన ఖితిచేఁ
గలవరించిన వారిఁ గాచు గరిమ,
మెన్నఁ దన మీఁద బలముతో నెనసి మొనసి
విఱుగు రాఁణువఁ బొమ్మను వీరవరుని
కీర్తిఁగంటివి; జగదేక కీర్తనీయ
సమర నిశ్శంక రఘునాథ సాహసాంక. 46

అర్థము :

సమర నిశ్శంక రఘునాథ సాహసాంక ...

౧. తలలు = తలజుట్లు (తలపాగలు) వీడఁగణ = వీడిపోవునట్లు, పాఱు = పారిపోవు, ధరణీశ్వరులణ = శత్రురాజులను, చూచి, అంటి = వెంబడించి, వెన్నాడనట్టి = తరుమనట్టి, మహిమ = గొప్పతనము,

౨. పడిన = చచ్చిపడిన, ఏనుంగుల ప్రక్కలకు, ఒదిగిన = దాగుకొనడానికి చేరిన, రాజులణ = శత్రురాజులను, చూడని = కన్నెత్తి అయినా చూడని, రాజసంబు = రాజఠీవి.

౩. జళిపించు = చేతిలో ఆడించుచున్న, చంద్రహాసములను = కత్తులను, పాఱఁగవైచి, మ్రొక్కువారలమీఁద, మొనపు = చూపునట్టి, కరుణ.

ళ. నెత్తురు, కనుపట్టఁగా = కనబడగా, హత్తిన = కలిగిన, భీతిచే, కలవరించినవారి = క్షోభపడుతున్న వారిని, కాచు = రక్షించే, గరిమ = ఔదార్యము,

ఎన్నన్ = (ఆ మహిమ, రాజసము, కరుణ, గరిమ - ఈ గుణాలను) స్తుతించేలాగ, తనమీఁదన్, ఎనసి = తలపడి, మొనసి = విజృంభించి, విఱుగు = చెదరిపోయిన, రాణువన్ = శత్రుసైన్యమును, పొమ్మను = తొలగిపొండని విడిచి పెట్టిన, వీరవరుని = వీరశ్రేష్ఠుడన్న, కీర్తిన్ కంటివి = కీర్తినార్జించినావు, జగత్ఏక కీర్తనీయ = లోకమంతా కీర్తించదగినవాడా.

తాత్పర్యము :

యుద్ధములో తన్నెదిరించిన వారైనా, పారిపోతున్నప్పుడూ, దాగోడానికి ప్రయత్నిస్తున్నప్పుడూ, దండం పెడుతున్నప్పుడూ, రక్తభీతితో క్షోభపడుతున్నప్పుడూ వారిని విడిచిపెడుతూ రఘునాథరాజు జగత్ ప్రఖ్యాతి పొందాడని భావము.

విశేషము :

పారిపోతున్నవారిని, పూరిగరచినవారిని, కత్తులుపారవైచి మొక్కుతున్నవారిని, భీతితోకలవరిస్తున్నవారిని, దాగొనడానికి ప్రయత్నిస్తున్నవారిని విడిచిపెట్టడం సత్ శూరుల ధర్మం. ఆ ధర్మాన్ని రఘునాథుడు పట్టుదలతో పాటిస్తాడని ప్రఖ్యాతి.

ఒక్కమాట :

"సమర నిశ్శంక రఘునాథసాహసాంక" అన్న మకుటంతో ఉన్న ఈ ఏడుపద్యాలూ అంకితమిచ్చే సమయములో చెప్పడం కొంత అప్రస్తుతంగా కనబడుతుంది. బహుశః ఈ పద్యాలు రఘునాథుడు ఒక మంచి యుద్ధవిజయం సాధించి వచ్చినప్పుడు మనకవి విడిగా రచించిన ప్రశంసా పద్యాలు కావచ్చును. వాటిని ఏ లేఖకుడో ఈ అంకితమిచ్చే సన్నివేశంలో ఇరికించి ఉండవచ్చును.

ఆ కారణముచేతనే గాబోలు, మాః వేంకటకృష్ణమాచార్యులవారు 1856 లో పరిష్కరించి ముద్రించిన విజయవిలాసములో ఈ ఏడు పద్యాలూ కానరావు. అనగా 39 వ పద్యము తరవాత 'అని విన్నవింప...' అన్న 47 వ పద్యం చదవాలన్న మాట. అప్పుడు గ్రంథము లోని విషయగమనము కుంటుపడకుండా సాఫీగా సాగుతుంది. అనగా,

"......తెచ్చితి కాన్కఁ పరిగ్రహింపుమ
య్యా! రఘునాథ భూప రసికాగ్రణి మామక కావ్య కన్యకన్"

అని కవి అన్నతరువాత "అని విన్నవింప జిత్తము ననలొత్తఁ బరిగ్రహించి......" అన్న పద్యముతో కలిపి చదవాలి.

అని విన్నవింపఁ జిత్తము
నన లొత్తఁ బరిగ్రహించి నాపై నింతిం
తనరాని వత్సలత్వము
కనిపింపఁగ హర్షభర విక స్వర ముఖుఁడై, 47

అర్థము :

అని విన్నవింపన్ (పై 39 వ పద్యములో "పరిగ్రహింపుమయ్యా.........మామక కావ్య కన్యకన్) అని వేడు కొనగా, చిత్తము = కవియొక్క మనస్సు, ననలు ఒత్తగా = పుష్పించినట్లు (సంతసించినట్లు), పరిగ్రహించి = స్వీకరించి, నాపైగా, ఇంతింత, అనరాని, వత్సలత్వము = వాత్సల్యము (ప్రేమ), కనిపింపఁగన్ = కనిపించునట్లు, హర్షభర = సంతోష అతిశయముచేత, వికస్వర = వికసించిన, ముఖుఁడై = ముఖము కలవాడై,.........రాజు ఈ క్రింది విధంగా అన్నాడు.

విశేషము :

వత్సలత్వము అనగా ఆవుకి దూడ యందలి ప్రేమ వంటి ప్రేమ. అనగా పెద్దవారికి పిన్నలయందుగల ప్రేమ. రాజు ముఖమున కానవచ్చిన హర్షము, అట్టి వాత్సల్యముచేతనే (కాని తన యోగ్యత కాదు) అని భావించి కవి తన నిగర్వి లక్షణ మును వెల్లడి జేశాడు.

చివరను రాజు "హర్షభర వికస్వర ముఖుఁడై" నట్టు కవి చెప్పాడు కాబట్టి, పైని చెప్పిన "చిత్తము ననలొత్త" అన్నది రాజుకికాక, కవికే అన్వయించడము న్యాయము.

## కవి ప్ర శం స

కలనయిన మిమ్ముగా కన్యుఁ గొలువ నంటి;
కృతు లొకరి కీను, మీకె యంకితము లంటి,
పలికిన ప్రతిజ్ఞ చెల్లింప వలదె యిట్లు ;
వాఙ్నియమ రూఢి నీయంత వాఁడి కేఁడి. 48

(48, 49, 50, 51— ఈ పద్యములు రాజు కవిని గూర్చి చెప్పినవి).

అర్థము :

కలనైనన్ = కలలోనైన, మిమ్ముగాక (రఘునాథునిగాక అని), అన్యున్ = ఇతరుని, కొలువను + అంటి = సేవింపను అని శపథము చేశావు, కృతులు = నీవు వ్రాసిన కావ్యములు, ఒకరికి = ఇంకొకరికి (ఇతరులకు), ఈను = అంకితము ఇవ్వను, మీకె (రఘునాథునికే), అంకితములు, అంటి (వి) = ప్రతిజ్ఞ చేశావు, పలికిన ప్రతిజ్ఞ = చెప్పిన మాటను, (చేసిన శపథము), ఇట్లు = ఈ విధంగా, చెల్లింప వలదె = నిలుపుకో వలదా !, (చాలచక్కగ నిలుపు కున్నావు అని భావము), వాక్ నియమ రూఢిన్— వాక్ = పదముల యొక్క, నియమ = కట్టు బాటునందలి, రూఢిన్ = ప్రసిద్ధియందు, నీయంతవాఁడు, ఇఁక ఏఁడి (అంగా రూఢియైన పదనియమమున, అంటే, కవిత్వములో శబ్ద ప్రయోగ నైపుణ్యమున, ఈ కవిని పోలినవాడు లేడని భావము).

విశేషము :

అప్పుడప్పుడు, ప్రసంగములలో చేమకూరకవి "నే నింకొకరిని కొలవను" అనీ; "కృతు లింకొకరి కివ్వను" అనీ అనేవాడని మనము ఊహించుకోవాలి. ఇటు వంటి ప్రసంగాలు రావాలంటే, ఇతర రాజులు మనకవిని తమకొలువులోనికి రావల సిందనో, తమకు కృతులను అంకితము చేయాలనో కోరి ఉండవలెనని గూడ మన మూహించు కోవాలి.

వేదం వారు "వాక్ నియమ రూఢిఁ = మాట యొక్క నిశ్చయము యొక్క స్థాపన యందు— పలికిన ప్రతిజ్ఞను నెరవేర్చుట యందు అనుట" అని అర్థము చెప్పారు. దానికే బులుసువారు "వాఙ్నియమ రూఢిఁ = మాటల నిలుకడ యందు" అని సూక్ష్మముగా చెప్పారు. అంతమాత్రమే అర్థమైతే, పద్యములోని మూడవ చరణానికీ, నాలుగవ చరణానికీ అర్థము ఒక్కటే అయి, పునరుక్తి దోషము కలుగు తుంది.

ఈ పద్యంలో చమత్కార మిక్కడే ఉంది. మూడో చరణంలో ఉన్న భావాన్నే కొంచెం ప్రౌఢంగా చెప్పినట్లు కనబడుతూ ఈ నాల్గో చరణం కవికున్న ప్రధానమైన కావ్య గుణాన్ని శ్లేషరూపంగా ప్రకటిస్తుంది.

మనకవి ప్రసిద్ధ వాగ్వైభవము కలవాడని అతని సారంగధర చరిత్రలోని "ప్రసిద్ధవాగ్వైభవ సుధాసార జనిత..." అన్న ఆశ్వాసాంత గద్యవల్ల తేటపడుతున్నది. కాబట్టి వాఙ్నియమ రూఢికి పదనియమ ప్రసిద్ధి అని అర్థము చెప్పడం సముచితము.

పాఠాంతరాలు :

(1) పలికిన ప్రతిజ్ఞ చెల్లింప వలయునంటి

— వేంకట కృష్ణమాచారిగారు.

ఈ పాఠంలో మొదటి మూడు చరణాలలోనూ మూడు కవి నిశ్చితాభిప్రాయాలు చెప్పినట్టవుతుంది. అప్పుడు నాలుగోచరణానికి వేదంవారూ, బులుసువారూ చెప్పిన "మాట నిలకడ'' అన్న అర్థం సరిపోతుంది, పునరుక్తి ఉండదు. ఆపైని "పదనియమ ప్రసిద్ధి" అన్న అర్థం శ్లేష వల్ల సాధించ వచ్చును.

(2) వాఙ్నియమ రూఢి నీయంత వాడు లేడు.

అలంకారం :

శ్లేష, అనుప్రాస.

వాసించుఁ గవిత చెప్పిన;
వీసర వో వొకట; భక్తివిశ్వాసంబుల్
నీ సొమ్ములు; సామాన్యుఁడవే?
సూర్యవర ప్రసాది విజగమెఱుఁగఁగ. 49

అర్థము :

కవిత చెప్పినన్ = నీవు కవిత్వము చెప్పిన యెడల, (అది) వాసించున్ = పరిమళించును-అన్ని దిక్కులను వ్యాపించి అందరినీ ఆహ్లాదమున ముంచును, (వాసి = ఆధిక్యము, ఇంచున్ = మనోహరముగా కనుపించును, అనిగూడా గ్రహించవచ్చును) ; ఒకటన్ = వీరసమును వర్ణించుట యందైనా — ఎట్టికష్టములైన కవితా సన్నివేశము లందైనా, వీసరవోవు = వెలితిపడవు, సమర్థతతో రచిస్తావు; భక్తివిశ్వాసంబుల్ నీ సొమ్ములు = రాజునందు భక్తివిశ్వాసము మాత్రమే కాక, పాత్రాది వర్ణిత విషయాలందును భక్తివిశ్వాసములు (అనగా సహజ ఉచిత వర్ణనలు చేయుట) నీ సొమ్ములు. ఈజగ మెఱుఁగన్ = ఈ ప్రాంతముల వారందరికీ తెలిసినట్లు, సూర్యవరప్రసాదివి = సూర్యుని వరమువలన పుట్టినవాడవు, సామాన్యుఁడవే (అసాధారణ ప్రతిభ గలవాడ వన్న మాట).

తాత్పర్యము :

నీవు కవిత్వం చెప్పుతే అది మంచి పరిమళంలాగ సభామంటపమంతటా వ్యాపించి అందరినీ సంతోషపెడుతుంది. భక్తివిశ్వాసాలు నీ సొమ్ములు. నీవు సూర్యవర ప్రసాదివి; సామాన్యుడవు కావు.

*విశేషము :*

రఘునాథుడికీ, ఆ కాలములోని కవులకూ కవిత్వము పరిమళించునట్లుండవలె నని ఒక గాఢమైన అభిప్రాయ ముండేది. ఆనాటి చెంగల్వ కాళకవి కవితమ

"ఒక్కొక్క యెడఁ దాని నెక్కొన విరజాజి
సరము లెత్తిన రీతి బరిమళింప ........"

వలయునని సూచించాడు.

రఘునాథరాజే కవిత్వ స్వరూపములు వాల్మీకి చరిత్రలో

"చెప్పవలె కప్పురంబులు
కుప్పలుగా బోసినట్లు, కుంకుమ పైపై
గుప్పిన క్రియ, విరిపొట్లము
విప్పినగతి, ఘుమ్మనన్ గవిత్వము సభలఁ"

అని నిర్దేశించాడు - ఆ భావమే "వాసించు కవిత చెప్పిన" అన్నపుడు ఉందనడం సమంజసము.

పూర్వ వ్యాఖ్యాతలు వాసి = భేదము, ఇంచుఁ = మనోహరముగ ఉండును అని అర్థం చెప్పారు. అంటే మన కవి కవిత్వం ఇతర కవుల కవిత్వానికి భిన్నంగా (ఒక ప్రత్యేక గుణంతో) ఉంటుందని భావము.

రాజుగారియందు భక్తివిశ్వాసా లెంత గాఢంగా ఉన్నాయో ఈ పీఠికలోని ప్రతి పద్యము రుజువు చేస్తుంది.

ఈ పద్యము వేంకటకృష్ణమాచార్యులవారి 1856 ముద్రణలో లేదు.

వాసించు = పరిమళించు అను అర్థానికి ప్రమాణము ——

"అక్షయ్యంబగు సొంపరాయని తెలుంగాధీశ కస్తూరికా,
భిక్షాదానముచేయరా ... వరగంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు దద్వాసనల్"

— శ్రీనాథుడు

ప్రతి పద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు: వెల్లెడఁ బెళుకౌ
కృతి వింటి మపారముగా;
క్షితిలో నీమార్గ మెవరికిఁ రాదు సుమీ. 50

అర్థము :

ప్రతి పద్యమునందున్, చమత్కృతి = శబ్దంలోనో అర్థంలోనో భావంలోనో చమత్కారము, కలుగన్, చెప్పనేర్తువు = కవిత్వముచెప్ప సమర్థుడవు, ఎల్లెడన్ = అన్ని విషయముల (వర్ణనల) యందును-పద అర్థ రస భావ అలంకారాది అన్ని విషయములందును, బెళుకు ఔ = సొగసైన, కృతిన్ = నీ కావ్యమును, అపారముగాన్ = హద్దులేకుండా (ఎన్నోసార్లు), వింటిమి = వినజాలితిమి; నీమార్గము = నీ కవితాపద్ధతి, క్షితిలోన్ = ఆంధ్ర ప్రపంచములో, ఎవరికిన్ రాదు సుమీ.

తాత్పర్యము :

నీవు రచించిన ప్రతిపద్యములోను ఏదో ఒక చమత్కారముంటుంది. అన్నివిధాలా రమ్యమైన నీ కవనము అనేకసార్లు విన్నాము; దానివల్ల మాకు కలిగిన అభిప్రాయ మేమిటంటే; ఆంధ్రలోకంలో నీ కవన పద్ధతి ఇంకెవ్వరికీ లభ్యం కాదని.

విశేషము :

"ఎల్లెడ బెళుకౌకృతి వింటిమి అపారముగాన్" అంటే పూర్వ వ్యాఖ్యాతలు "అన్ని విషయముల యందును మెరుగైన ఇతరుల కృతులను లెక్కలేక విన్నాము. కాని, క్షితిలో నీ మార్గమెవ్వరికిన్ రాదు సుమీ" అను మాటలతో అన్వయించారు. ఇక్కడ కృతికి బహువచనార్థమున్నూ, "ఎల్లెడ బెళుకౌ" అను విశేషణమును ఇతరుల కవనమునకు చెప్పడమూ, "అపారము" అంటే లెక్కలేక అని చెప్పడమూ ఆలోచించదగిన విషయాలు.

కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రిగారు తమ "ఆముక్త మాల్యద-సంజీవనీ వ్యాఖ్య పీఠికలో శ్రీ కృష్ణదేవరాయల కవిత్వం గురించి చెప్తూ, "ముక్కు తిమ్మనార్యుని పలుకుల ముద్దును, చేమకూర పాకరుచులును, పాండురంగవిజయుని దిట్టతనమును ఒరులకురావు; కాన వారితో పోటీవలదు" అని ఈ అభిప్రాయాన్నే ప్రకటించారు.

అభినవ భోజుడైన రఘునాథుడు చేసిన ఈ ప్రశంస చేమకూర కవికి ఒక ప్రతిజ్ఞవంటిది కాక తప్పదు. ఏ పద్యం చూచినా ఈ మాటలు జ్ఞాపకానికి రాక తప్పవు. కాబట్టి రాజు అన్నాడన్న మాటలు సుస్పష్టంగా తెలిసికోవడం అవసరం.

అయినా ఈ పద్యంలో "అపారముగ"అన్నమాట సంతృప్తికరంగా అన్వయించడం లేదు. దీనిలోని "కృతి"అన్నది మనకవిదా? ఇతరులదా? అదీ సందిగ్ధం

గానే ఉంది. అందుచేతనే పాఠాంతరాలు చూడడం మంచిది. రాజు మాటలలో అర్థ గౌరవము కనబడాలి అని వేరే చెప్ప నవసరముండదు.

*పాఠాంతరాలు :*

1. ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు వెల్లెఁ గృతి వై
కృత పాఠము బాధముగా.........

— తిరుపతి వేంకట కవుల పాఠము

ఇక్కడ 'అపారముగా'వల్ల కలిగిన చిక్కు పోయింది. 'ఎల్లెడ' అన్నది, వైకృత పాఠము' అన్నది రెండు కొత్తమాటలు వచ్చాయి. కొందరు సంస్కృతము, ప్రాకృతము, వైకృతము అని, భాషకు మూడు శాఖలు చూపించారు. దీనిలో వైకృత మన్నది తెలుగు, దేశ్యము. వైకృత పాఠము అంటే తెలుగు రచన అన్నమాట. రఘునాథుడి సభలో సంస్కృతానికి ఎక్కువ ప్రాబల్యముండేది. ఆ రోజులలో తెలుగు కవిత్వాన్ని వైకృతపాఠము అన్నందుకు ఆశ్చర్యపడ నక్కరలేదు; మనకవి రచనలో ఉన్నంతగా జాతీయ చమత్కారమూ, తెనుగు శ్లేషలూ, మాటవిరుపులూ, మొదలైన సొగసులు మరేకవి రచనలోనూ లేవని ఆంధ్ర సహృదయులు అంగీకరించారు.

కాబట్టి - తిరుపతి వారి పాఠానికి "కృతియందు, వైకృత పాఠము (తెలుగు రచన), బాఢముగా - విశేషముగా - (ఉపయోగిస్తూ), ప్రతి పద్యమునందు, ఎల్లెడ - ఏ రూపంగా నయినా (శబ్దరూపంగానో, అర్థరూపంగానో, భావరూపంగానో), చమత్కృతి గలుగఁ జెప్ప నేర్తువు, క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదుసుమీ" అని అర్థం చెప్పాలి. మన కవి కవిత్వాన్ని గురించి రెండు మాటలలో చెప్పాలంటే తెలుగు పదాల శ్లేషలతోనూ మాట విరుపులతోనూ మనోహరంగా ఉంటుందనీ, ప్రతి పద్యంలోనూ ఏదో చమత్కారము ఉంటుందనీ అంటాము. ఆ రెండు లక్షణాలకే ప్రాధాన్య మిచ్చింది తిరుపతివారి పాఠం. అది ప్రత్యక్షరసత్యము.

2. మరొక పాఠాంతరం—

......చెప్ప నేర్తు వెల్లెడ బెళుకై
కృతి పాఠము బాఢముగా....

— వేంకట కృష్ణమాచార్యులు.

పాఠభేదాలన్నిటిలోనూ కనబడుతున్న ముఖ్య విషయం ప్రతి పద్యములోనూ చమత్కృతి ఉంటుందనీ, చేమకూర కవి కవిత్వ పద్ధతి ఇంకొకరికి రాదనీ, నాటినుండి నేటి దాకా కవి పండిత ప్రకాండు లందరూ అంగీకరించారు - అవిశిలాక్షరాలు.

క్షత్ర ధర్మమ్మె కద నీకుఁ గలది మొదలఁ,
దమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ము గొలిచి,
తిపుడు కృతియును జెప్పి మా కింపొనర్చి,
తొకటఁ గా దన్నిటను బ్రయోజకుఁడ వీవు. 51

అర్థము :

నీకు, మొదలన్ = తొలుతనుండి, కలది = ఉన్నది, క్షత్రధర్మమ్మె = శూరుల ధర్మమే, కదా, తమ్ములు, సుతుల్ = కొడుకులు, హితులు = స్నేహితులు, కూడన్ = కూడి యుండగా, మముఁ గొలిచితి = మా ఉద్యోగములో ఉన్నావు, ఇపుడు, కృతియున్ = కావ్యమును కూడా, చెప్పి = అంకితమిచ్చి, మాకు, ఇంపు ఒనర్చితివి = సంతసమును కూర్చితివి, ఈవు = నీవు, ఒకటఁగాదు, అన్నిటను, ప్రయోజకుఁడవు = ఉపయోగమైనవాడవు.

విశేషము :

చేమకూర వేంకటరాజు శూద్రకులమున పుట్టినవాడనీ, కొంత కాలము క్షత్ర ధర్మముతో సైన్యములో ఉండి, ఇప్పుడు కావ్యవ్యాసంగములో ఉన్నాడనీ, తమ్ముల తోను కొడుకులతోను రాజోద్యోగములో ఉండేవాడనీ, ఇప్పటికి కొంత వయసు మళ్ళిన వాడనీ దీని వలన తెలుస్తుంది.

అని సుధా మధు రోక్తుల నాదరించి
మంజుల పదార్థ భూషణాంబర కదంబ
కరి తురం గాది వాహ నోత్కరము లిచ్చి
న న్నసాధారణముగ మన్నన యొనర్ప, 52

అర్థము :

అని (అనగా 48 నుండి 51 వరకు కలమాటలను చెప్పి), సుధామధుర ఉక్తులన్ ఆద రించి = అమృతమువలె తీయనైన మాటలతో సత్కరించి, మంజుల.....ఉత్కరములు - మంజుల = మనోహరములైన, పదార్థ = వస్తువులు, భూషణ = నగలు, అంబర = వస్త్రములు, (వీటి) కదంబ = సమూహములున్నూ, కరి = ఏనుగులు, తురంగ = గుర్రములు, ఆది = మొదలైన, వాహన, ఉత్కరములు = సమూహములు, ఇచ్చి, నన్ను, అసాధారణముగా = ఇతర కవులకు చేసిన దానికన్న ఎక్కువగా, మన్నన ఒనర్పన్ = గౌరవించగా,

*విశేషము :*

ఇక్కడ పదార్థభూషణ అంబరములు బహుమతులుగా ఇచ్చారనీ, కరితురం గాది వాహనాలతో ఉత్సవము చేశారనీ భావించవలెను.

"నన్నసాధారణముగ మన్ననయొనర్చఁగ"-దీనిలో అసాధారణమంటే 'సాధారణంగా కవులకుచేసే మన్ననకంటే హెచ్చుగా' అనేకాదు. రఘునాథుడు చేమకూర కవిని చాల సన్మానిస్తూ ఉండేవాడు. కాబట్టే "నన్ను నడిపిన బహుళ సన్మానమెంచి" అని ఇంతకు ముందు 30 వ పద్యములో అన్నాడు. అందుచేత ఈ అసాధారణ శబ్దంవల్ల ఆ బహుళ సన్మానాల నన్నిటిని మించినటువంటి సన్మాన మనిగూడ అనాలి.

అభినవ భోజరాజ బిరుదాంకుఁడు శ్రీరఘునాథ శౌరి నఁగ
శుభమతి నేలినందులకు సూడిద చేసితి నౌర ! మిక్కిలిఁగ
సభల గణింప మన్నన లొనర్చెఁ, బ్రబంధము నింత యుత్తమ
ప్రభునకు నంకితం బొనరుపం గలిగెం గద యంచు వేడుకఁగ. 53

52 వ పద్యములో రాజు కవిని అసాధారణముగ మన్నన చేశాడు. దాని ఫలితంగా కవి ఈ53వ పద్యంలో ఊహించుకుంటున్నాడు.

*అర్థము :*

ఔర ! = ఓహో ! ఎంతగొప్ప విషయము. మిక్కిలిఁగ = ఎక్కువగా, సభలఁగ = పండిత సభలలోనూ రాజాస్థానాలలోనూ, గణింపఁగ = గౌరవించేలాగ, మన్నన ఒనర్చెఁగ = (నన్ను ఈరాజు) గౌరవించాడు, ఇంత ఉత్తమ ప్రభునకుఁగ = ఇటువంటి ఉదారబుద్ధిగల ప్రభువుకు, (నా) ప్రబంధము, అంకితంబు, ఒనర్పన్ = ఇచ్చుటకు, కలిగెఁగగద = అదృష్టము కలిగిందికదా, అంచు, వేడుకఁగ = ఉత్సాహముతో, అభినవ భోజరాజ బిరుదాంకుఁడు = కొత్త భోజరాజు అన్న బిరుదుగల, శ్రీరఘునాథ శౌరికిఁగ = రాజుకి, శుభమతిఁగ = మంచి మనస్సుతో, ఏలినందులకు = నన్ను పాలించినందుకు, సూడిద చేసితిని — కానుక ఇచ్చాను.

*తాత్పర్యము :*

ఇతర పండిత సభలలోగూడ నన్ను గౌరవించేలాగ ఈరాజు నన్ను ఆదరించాడు. ఇటువంటి ప్రభువు కంకితం ఇవ్వడమొక అదృష్టమే అని కానుక చేశాను, అని కవి తనలో అనుకున్నాడు.

విశేషము :

అభినవ భోజరాజు : కొన్ని శతాబ్దాలకు పూర్వం ఉజ్జయినీనగరం పాలించిన భోజరాజువలె సాహస ఔదార్య పాండిత్యాది మహాగుణములు గలిగి ఈరోజులలో ఉన్నరాజు—అన్నదే రఘునాథుడికి బిరుదు.

పాఠాంతరాలు :

(1) ............శ్రీరఘునాథ శౌరికిన్
శుభమతి నేలినందులకు నూడిద చేసితి నౌర ! మిక్కిలిన్
సభల గణింప మన్నన యొనర్పఁ బ్రబంధము........
— వేదంవారి పాఠము.

ఇక్కడ "గణింపన్", "మన్నన్యొనర్పన్" రెండూ ఒక్క అర్థాన్నే ఇస్తాయి

(2) శుభమతి నేలినందుననె నూడిదజేసిన నౌర ! మిక్కిలిన్
సభల గణింప మన్నన యొనర్చె......
— వేంకట కృష్ణమాచార్యులు.

అనతి యిచ్చెనా, యది శిలాక్షర; మెవ్వనినేని మెచ్చెనా,
వానిఁ గృతార్థుఁజేయుఁ; బగవాఁడయినన్ శరణంబుఁ జొచ్చెనా,
యా నరు నేరమెంచక తనంటివాని నొనర్చు; నిచ్చెనా,
యేనుఁగుపాఁడి, యీడుగలదే రఘునాథ నృపాలమౌళికిన్ ? 54

అర్థము :

అనతి = ఆజ్ఞ, ఇచ్చెనా = ఇచ్చినట్లయితే, అది శిలాక్షరము = రాతిమీదవ్రాత (అనగా శిథిలముగాకుండునది; అతిక్రమించరానిది), ఎవ్వనిన్ఏనిన్ = ఎవరినైనా, మెచ్చెనా, వానిన్, కృతార్థున్ చేయున్ = కోరిక లన్నియు తీరిన వానిగా చేయును; పగవాఁడయినన్, శరణంబున్చొచ్చెనా, ఆ నరు నేరము = ఆ పగవాడు (ఇంతకుముందు) చేసిన తప్పిదమును, ఎంచక = యోచించక, తనంతటివాని (గా) ఒనర్చున్; ఇచ్చెనా, ఏనుఁగుపాఁడి = ఏనుగు పాలిచ్చినట్లుగా (మిక్కిలి విశేషముగా) ఇచ్చును. రఘునాథ నృపాలమౌళికిన్ = రాజశ్రేష్ఠునకు, ఈడు = సాటి, కలదే = ఉన్నదా!

విశేషము :

రఘునాథరాజు ఇచ్చినది గొఱ్ఱెపాడి, ఆవుపాడిలాగా తక్కువగాక, ఏనుగు పాడివలె విశేషముగ ఉంటుందని భావము.

ఈ పద్యంలో ఇచ్చెనా, మెచ్చెనా, చొచ్చెనా, ఇచ్చెనా.........శబ్దాలంకారము.

ఎందును విద్యలే యెఱుఁగ రెవ్వ; రెఱింగినఁ గొంతమాత్రమే,
యందును సాహితీరస మహత్త్వమెఱుంగ; రెఱింగిరేని, యా
యంద మెఱుంగలే; రెఱిఁగినప్పటికిన్, విని మెచ్చి యీయ; రె
న్నందగు నచ్యుతేంద్ర రఘునాథ విభుండె ప్రవీణుఁ డన్నిటన్. 55

అర్థము :

ఎందును = దేశంలో ఎక్కడైనా (అన్నిచోట్లయందు). ఎవ్వరున్ = చాలమంది, విద్యలే = ఇక్కడ విద్య అంటే కావ్యపరిచయమన్నమాట, ఎఱుఁగరు = తెలిసి ఉండరు. (ఒక వేళ ఎవరైన) ఎఱింగినన్ = తెలిసి ఉన్నప్పటికీ, కొంతమాత్రమే = కొంచెము మాత్రమే (పూర్ణముగాకాదు). అందునున్ = ఆ ఎరిగిన కొంతమందిలోనూ, సాహితీరస మహత్త్వము = సాహిత్యములోని రసముయొక్క గొప్పతనమును, ఎఱుంగరు, ఎఱింగిరేని = (ఒకవేళ ఆ రస మహత్త్వము గూడా) తెలిసి ఉండినప్పటికీ, ఆ అందము = ఆ కావ్యములోని అది ఇది అని చెప్పవీలుగాని సొగసును, ఎఱుంగలేరు, ఎఱిఁగినప్పటికిన్ = (ఒకవేళ అదిగూడ) తెలిసిఉన్నా, విని = ఇతరుల కవిత్వమునువిని, మెచ్చి, ఈయరు = బహూకరించరు, అన్నిటన్ = (అర్థమును, రసమహత్త్వమును, అందమును, ఎరిగి, విని, మెచ్చి, ఇచ్చుట అను) అన్ని విషయములయందును, అచ్యుతేంద్ర రఘునాథవిభుండె, ఎన్నందగు = లెక్కించతగిన, ప్రవీణుఁడు = సమర్థుడు.

తాత్పర్యము :

కావ్య పరిచయమూ, సాహిత్యజ్ఞానమూ కలిగి, కవిత్వంలోని అందము గ్రహించి, మెచ్చి బహూకరించగలవారు చాలచాల తక్కువ. అన్నిటిలోను ఈ రాజే మేటి.

విశేషము :

దీనిని బట్టి ఈకవి రచనలో సాధారణ అర్థము, రసమహత్త్వముతోడి విశేషాలూ, ఆ పైని ఇంకా సొగసులూ, పరిశీలిస్తే కనబడతాయని సూచన.

పాఠాంతరము :

(1) "ఎందును విద్య మే లెఱుఁగ రెవ్వరు"

— వావిళ్ళవారి పాఠం.

విద్యలోని మేలంటే సాహితీరస మహత్త్వమే అవుతుంది కాబట్టి సరికాదు.

(2) "అందును చాతురీ రసమహత్వ......"

— వేంకటకృష్ణమాచార్యులవారి పాఠం.

అలంకారము :

సారాలంకారము.

ఏ రాజు భుజశౌర్య మేదులఖా నాది
వజ్రీల చెలిమికి వశ్య విద్య,
యే రాజు విక్రమ సారంబు విద్వేషి
మహిమ పలాయన మంత్రశక్తి,
యే రాజు వీక్ష సమీహిత కర్ణాట
రమ నాట్య విద్యకు రంగభూమి,
యే రాజు చరితంబు వారాశి వేష్టిత
మేదినీ పతులకు మేలుబంతి,
యతఁడు చెలువొందుఁ జినచెవ్వ యచ్యుతేంద్ర
బహు జనన పుణ్య పరిగణ్య ఫల నిభాత్మ
పుత్రభావ ప్రమోద సంపూర్ణ హృదయ
పంకజాక్షుండు రఘునాథ పార్థివుండు, 56

(ఈ 56, 57, 58 మూడు సీసపద్యాలూ, కవి ఏదో ఒక సన్నివేశములో రఘునాథరాజును గూర్చి వ్రాసిన ప్రశంసా పద్యములై ఉండవచ్చును. వాటిని లేఖకులు ఈ కావ్యములో చేర్చి ఉంటారు. కవి ఈ అవతారికలో "ఎందును విద్యలే యెఱుఁగ రెవ్వరు" అన్న పద్యము తర్వాత, "ఇచ్చు నెడఁజా బదార్థ మడిగిచ్చునొ" అన్న 59 వ పద్యమే వ్రాసి ఉంటాడు. అదే భావక్రమము గూడా).

అర్థము :

౧. ఏదులఖాఁ = ఆదిల్‌ఖాన్ అను బీజపూరు నవాబు, ఆది = మొదలైనట్టి, వజ్రీల = వజీరులయొక్క-మహ్మదీయ ప్రభువులయొక్క, చెలిమికి = స్నేహమునకు, ఏరాజు, భుజ శౌర్యము, వశ్యవిద్య = ఇతరులను వశపరచుకొనగల విద్యయో, భుజశౌర్యము వజీరుల స్నేహమును తన వశముగా చేయునని భావము - పరాక్రమముగల రాజగుటచేత రఘునాథుని స్నేహము కావాలని (బీజపూరు, అహ్మద్‌నగరు, గోల్కొండ, బీరారు, మొదలగు) నవాబులందరూ అపేక్షించేవారని చరిత్ర.

౨. ఏరాజు విక్రమసారంబు = పరాక్రమముయొక్క ఆధిక్యము, విద్వే...... శక్తి— విద్వేషి = శత్రువులయొక్క, మహిమ = గొప్పతనము,పలాయన=పరుగెత్తిపోవుటకు, మంత్ర శక్తి = మంత్రబలముగా ఉండునో — అనగా ఇతని పరాక్రమముచేత శత్రువుల గొప్పతన మంతా మంత్రబలము చేతనేమో అన్నట్లు అవలీలగా మాయమై పోవునని.

దీనికి మరొకపాఠం : "ఏరాజు విక్రాంతి బీరంపు విద్వేషి......"

౩. సమీ.........విద్యకు—సమీహిత = అందరూ కోరినటువంటి, (ఎప్పుడు మరల చూడగలుగుతామా అని నిరీక్షిస్తున్న), కర్ణాటకరమ = కర్ణాటరాజ్యలక్ష్మి యొక్క, నాట్యవిద్యకు, ఏ రాజు, వీక్ష = చూపు, రంగభూమి = నాట్యరంగస్థలమో - అనగా ఈతని కటాక్షము వలననే విజయనగర సామ్రాజ్యలక్ష్మి మరల సంతోషముతో నృత్యము చేయుచుండెనని,

౪. వారాశి......పతులకు — వారాశి = సముద్రముచేత, వేష్టిత = చుట్టుకొనబడిన, మేదినీపతులకు = రాజులకు, ఏరాజు, చరితంబు = ప్రవర్తన, మేలుబంతి = చూచివ్రాతకు పెట్టిన ఒరవడియో - అనగా ఈతని నడవడి చూచి చుట్టుప్రక్కల నున్న రాజు లందరు తమ ప్రవర్తన సరిచేసికొందురని,

అతడు = అట్టి రాజైన, చిన......ఘుండు - చినచెవ్వ అచ్యుతేంద్ర = చినచెవ్వప్ప కుమారుడైన అచ్యుతప్ప నాయకునియొక్క, బహుజనన = అనేక జన్మములయందు చేసిన, పుణ్య = పుణ్యములకు, పరిగణ్య = సరిపోవునట్టి(తగినంత), (పుణ్య)ఫల = ఫలముతో, నిభ = సమానమగునట్టి, ఆత్మ = అచ్యుతునికి, పుత్రభావ = కొడుకుతనము (పుత్రుడుగా ఉండుట) వలని, పరిమోద = సంతోషముతో, సంపూర్ణ (మైన), హృదయ = మనస్సుగల, పంకజాక్షుండు = విష్ణుమూర్తి (అగు), రఘునాథ పార్థివుండు, చెలువు ఒందున్ = ప్రకాశించుచుండును.

తాత్పర్యము :

అచ్యుతరాయలు చేసిన అనేక పుణ్యాలకు ప్రతిఫలరూపముగ మహావిష్ణువే అతనికి కుమారభావముతో పుట్టె నన్నట్లు రఘునాథరాజు ప్రకాశించుచుండెనని భావము.

విశేషము :

అచ్యుత నాయకుడు రంగనాథస్వామి (విష్ణు అవతారం) భక్తివిశేషంగా ఉన్నవాడు; అనేకమయిన దేవ కైంకర్యాలూ, పుణ్యకార్యాలూ, చేసినవాడు — ఈ విషయం ఈ పీఠికలోని 12, 13 వ పద్యాలలో కవిచెప్పాడు. అంతేకాదు. ఆపుణ్యకార్యాల ఫలితంగానే అతనికి రఘునాథనాయకుడు పుట్టాడని 16 వ పద్యంలో చెప్పాడు. ఆ అభిప్రాయాన్నే ఇప్పుడీ ఎత్తుగీతిలో మరింత మనోహరంగా చెప్పుతున్నాడు.

తన భక్తుడు చేసిన పుణ్యాలకు తగినంత ఫలం ఇవ్వాలని, అది ఒక రుణం వంటిదని విష్ణుమూర్తి తలచాడు. ఏమిచ్చినా ఆ పుణ్యాలకు తగినంత ప్రతిఫలం కాజాలదని అనుకున్నాడు. తానే అచ్యుతనాయకుడికి కొడుకుగా (అతని కడుపున) పుట్టి సంపూర్ణమైన సంతృప్తిని పొందాడు.

"ఈ మేలు చెయ్యి నాయనా, చచ్చి నీ కడుపున పుడతాను అని అర్థించడం వాడుకలో ఉంది. ఉపకారానికి ప్రత్యుపకారం చేయలేని పరిస్థితులలోనూ రుణం తీర్చ లేని సందర్భాలలోనూ ఇలాగ "నీకడుపున పుడతాను" (అంటే, పుట్టి రుణం తీర్చు కుంటానని) అంటుంటారు; అదే ప్రత్యుపకారము; అదే రుణవిముక్తికి మార్గము. ఈ సూత్రాన్నే మనకవి ధ్వని మర్యాదను ఇక్కడ సూచించాడు.

ఆదిల్‌ఖాఁ నవాబు రఘునాథరాజు వద్దకు తన ప్రతినిధిగా అనుమోజీ పండితుని పంపించాడని చరిత్ర.

రఘునాథరాజు సహకారము వల్లనే విజయనగర సామ్రాజ్యము శత్రుబారిని పడకుండా నిలువ గలిగినది.

రఘునాథుని కళాభిరుచి కవిపండిత పోషణము చూచి ఆనాటి, పాండ్య, జింజి, పుదుక్కోట మొదలగు సంస్థానములవారు సైతము కవుల నాదరించి కళలను పోషించుటకు మొదలుపెట్టారు. కాబట్టి ఈ పద్యమున గలవన్నియు చారిత్రక సత్యములు.

పాఠాంతరము :

దీనికొక పాఠాంతరము తిరుపతి వారిది :

"......జననపుణ్య పరిగణ్య పరిధిభాగ్య......"

అలంకారము :

రూపకము, ఉత్ప్రేక్ష, అంత్యానుప్రాస.

సింహాసనము[1] మాట శిథిలమౌటలు విని
గట్టిగా నిలుపఁ గంకణము గట్టెఁ;
గోటిసంఖ్యలు మీఱఁ గూర్చిన ధనరాశిఁ
గొల్చు వారల కిచ్చెఁ గొల్చువలెనె;
తుండీర పాండ్యాది మండలేశ్వరులపై
దండెత్తి విడిసె నుద్దండ మహిమ;
నేల యీనినయట్లు నిలిచిన వైరులఁ
బంచబంగాళమై పాఱఁ దఱిమెఁ;

(1) ఇక్కడగూడ సింహాసనము అన్నమాట 'రాయలవారు' అన్న అర్థంతోనే ఉపయోగించాడు కవి. ఆ దినాలలో రాయలవారి ఆజ్ఞలను ధిక్కరించి తిరుగుబాటుదార్లు కుట్రలు పన్నుతుండేవారు. ఆ స్థితి మాన్పించడానికి రఘునాథరాజు కంకణంకట్టి సాధించాడని చరిత్ర.

గర్వి తారాతి మస్తక ఖండనోత్థ
రక్తధా రానుషం గాతిర క్త ధార
నిజ కృపాణికఁ గావేరి నీటఁ గడిగె,
నిఖిల గుణశాలి రఘునాథ నృపతిమౌళి. 57

అర్థము :

నిఖిల గుణశాలి = అన్ని మంచిగుణములుగల, రఘునాథ, నృపతిమౌళి = రాజశ్రేష్ఠుడు,

(౧) సింహాసనముమాట = విజయనగర సామ్రాజ్యము యొక్క స్థితి, శిథిలము ఔటలు = అంతఃకలహముల వలన పాడుబడుతూండడం (లేక, వారి ఆజ్ఞను సామంతులు ధిక్కరిస్తుండడం), విని, గట్టిగా నిలుపగ = (దానిని) సుస్థిరముగా నిలుపుటకు, కంకణము కట్టెగ = ప్రతిజ్ఞ పూనెను.

(౨) కోటిసంఖ్యలు, మీఱన్ = మించునట్లు, కూర్చిన = ఆర్జించిన - ప్రోగుచేసిన, ధనరాశిగ = ధనముల ప్రోవును, కొల్చవలెనె = ధాన్యమును కుంచములతో కొల్చునటులనే, కొల్చువారలకు = తన కొలువులో పనిచేయువారికి, ఇచ్చెన్;

(౩) తుండీర (అనగా చెంజీదేశము), పాండ్య (మధురదేశము), ఆది = మొదలైన, మండలేశ్వరులపై = రాజులమీద, ఉద్దండమహిమన్ = భయంకరమయిన ప్రభావముతో, విడిసెగ = దండెత్తెను;

(౪) నేల యీనినయట్లు = భూమే భటులను ఈనిందా అన్నట్లుఁ (బహుసంఖ్యాకులుగా), నిలిచిన = ఎదిరించి నిలిచిన, వైరులన్ = శత్రువులను, పంచబంగాళమై = పటాపంచలై, పాఱగ = పరుగిడి పోవునట్లు, తఱిమెగ ;

గర్వి...... కృపాణికగ — గర్విత = గర్వించిన, అరాతి = శత్రువులయొక్క, మస్తక = తలలను, ఖండన = నరుకుటచేత, ఉత్థ = వెడలిన, రక్తధార = నెత్తుటిధారల యొక్క, అనుషంగ = కూడికచేత, అతిరక్త = మిక్కిలి ఎఱ్ఱగనున్న, ధార = అంచు (వాదర) గల, నిజకృపాణికగ = తన ప్రియమైన కత్తిని, కావేరినీటగ = కావేరీనది నీటిలో, కడిగెగ.

తాత్పర్యము :

విజయనగర రాయలగు రామదేవరాయలకు, జగ్గరాయాదుల వలన రాజ్య భ్రష్టత కలిగిన సంగతివిని, ఆతనిని సుస్థిరముగా నిలుపుటకు ప్రతిజ్ఞ పట్టి రఘునాథుడు పెనుగొండలో కృత కృత్యుడయాడు. ధాన్యమును కుంచములతో కొలుచునట్లే తన ఖజానాలోని కోట్లకొద్దీ ద్రవ్య మును విశేషముగా తన భటులకిచ్చి ఉత్సాహము కలిగించాడు. జగ్గరాయల మిత్రులూ, విజయ నగర శత్రువులూ అయిన చెంజీ, మధుర నాయకాదులను ఓడించడానికి దాడి వెడలి, అవిరళ

సంఖ్యాకులై ఎదిరించి నిలిచిన శత్రు వీరులు చెల్లా చెదరై పారిపోవునట్లు తరిమి, రక్తసిక్తమైన తన ప్రియమైన కత్తిని కావేరీనదిలో కడిగాడని భావము.

విశేషము :

కృపాణిక, ఇక్కడ క ప్రత్యయము అనురాగ సూచకము; చిన్న దన్న అర్థము కాదు. శత్రువుల తలలు నరికినది.

ఇచ్చట సింహాసనము అనగా రాజు కూర్చునే ఆసనముకాదు-ఆనాటి రచయితలు విజయనగర రాయలను[1] సింహాసనము అని వాడు తుండేవారు.

అలంకారము :

తద్గుణము, అంత్యానుప్రాస, యమకము.

ఘన ఘనాఘనముల కాల సంతెలఁ బెట్టు
పాండ్యుని వెన్నాడి పాఱఁ దఱిమెఁ,
దుండీర నాథుండు దురమునఁ బఱవంగఁ
జూచి ప్రాణము దయఁ గాచి విడిచెఁ,
గయ్యాన వెనుకఁ ద్రొక్కని రాజు లెదిరింపఁ
జేరిన రాజ కౌశికులఁ బట్టెఁ,
బోరాడఁగా రాని వైరుల కోటులు
పంపులచే లగ్గపట్టి తివిచె,
నితడు సామాన్యుఁడే ధర నెంచిచూడ
విజయ నిస్సాణ రావ నిర్విణ్ణ హృదయ
భీత రాజన్య సైన్య నిర్భీతిదాన
బిరుద నిజపాణి రఘునాథ భిదుర పాణి! 58

(1) ఈ పీఠికలో 21 వ పద్యం వివరణ చూడవచ్చును. శ్రీకృష్ణదేవరాయలనాటి రాజ్య విశేషాలు అనేకం తెలియజేసే "రాయవాచకం"లో గూడ సింహాసనం అన్నమాటను "రాయలవారు" అన్న అర్థంలో ఉపయోగించారు; "దళనాయకులను పిలువనంపగా వారువచ్చి పొడగని నిలిచి వినయము తోడట్టు సింహాసన రాజ్యములో గల గిరిదుర్గ వనదుర్గ జలదుర్గ స్థలదుర్గములయందు..." ఇక్కడ సింహాసన రాజ్యము అంటే రాయలవారి రాజ్యమన్న మాట.

అర్థము :

(౧) ఘన ఘనాఘనముల — ఘన = గొప్పవైన, ఘనాఘనముల = వర్షిస్తున్న మేఘముల యొక్క, కాలన్ = కాళ్ళకు, సంకెలల్ పెట్టు = సంకెళ్ళు తగిలించిన (వాడన్న కీర్తి గల), పాండ్యునిన్ = పాండ్యరాజును, వెన్నాడి = వెంబడించి, పాఱన్ తఱిమెఁ = పారిపోవునట్లు తరిమెను;

పాండ్య రాజులలో ఒకడు మేఘముల కాళ్ళకు సంకెలలు వేశాడని (వాటిని ఎటూ పోకుండా ఆపివేశాడని) ఒక హాలాశ్య మాహాత్మ్యము కథ.

కాలిసంకెళ్ళు వేసిన పాండ్యునిచేత పరుగులెత్తించినవాడు రఘునాథుడని చమత్కారము.

(౨) తుండీరనాథుండు = చెంజినాయకుడు, దురమునన్ = యుద్ధమునందు, పఱవంగన్ = పారిపోవు చుండగా, చూచి, (వాని) ప్రాణమున్, దయఁ, కాచి, విడిచెఁ;

శూరులు వెన్నుచూపిన వారినీ, పూరిగరచిన వారినీ చంపరు.

(౩) కయ్యానఁ = యుద్ధమునందు, వెనుక త్రొక్కని రాజులు = తిరిగిపోవని రాజులు, ఎదిరింపఁ చేరినఁ = తనతో పోరాడుటకు అందరూ కలిసివచ్చి నప్పుడు, రాజకౌశికులన్ పట్టెన్ = (ఆ) గొప్పరాజులను బంధించెను;

జగ్గరాజు పక్షము, మహమ్మదీయుల పక్షము, మధుర చెంజి రాజుల పక్షము కొంతవరకు పోర్చుగీసువారూ— అందరూ కలిసి ఎదిరించారని చరిత్ర.

(౪) పోరాడఁగాన్ = యుద్ధముచేయుటకు, రాని = తమతమ దుర్గములనుంచి వెలుపలికి రానట్టి, వైరుల = శత్రువుల, కోటలు = దుర్గములను, పంపులచేన్ = (తన) సేనాభాగములతో, లగ్గపట్టి = ముట్టడి చేసి, తివిచెన్ = వెలుపలికి ఈడ్చెను ;

చోలగుడు అన్న దొంగల నాయకుడిని ఈవిధంగానే లగ్గపట్టి బయట కీడ్చి అవమానించె నని చరిత్ర. అందుకే "చోలగ మాన భంజన" అని రఘునాథుడికి బిరు దుంది.

దీనికి పాఠాంతరాలు : (1) "చేరి చూడగరాని వైరులకోటలు, పంపులచే లగ్గపట్టితీసె", (2) "పోరాడగా రాని వైరుల కోటలు పంపులు చెలగంగ పట్టితీసె".

విజయ...పాణి— విజయ నిస్సాణ = విజయభేరులయొక్క, రావ = ధ్వనికి, నిర్విణ్ణ = బెదరిన, హృదయ = హృదయములు కలిగి, భీత = భయపడిన, రాజన్య సైన్య[illegible] శ్రేష్ఠుల సేనలకు, నిర్భీతి = అభయమును, దాన = ఇచ్చుట యందు, [illegible] (ప్రసిద్ధి) గల, నిజపాణి = స్వహస్తము కలవాడు (అగు), ఇతడు, రఘునాథ[illegible] = రఘునాథేంద్రుడు (భిదుర = వజ్రా యుధమును, పాణి = చేతి యందుగల వా[illegible]

ధరన్ = లోకములో, ఎంచి చూడఁగా, సామాన్యుఁడే! అనగా తన విజయభేరీ ధ్వనికి బెదరి పోయిన శత్రు సేనలకు అభయ దానము ఇచ్చునట్టి చేయి కలవాడు అని.

రఘునాథుడు భిదుర పాణి, భయంకరమైన వజ్రాయుధమును చేతియందు కలవాడైనా, (నిర్భీతి) అభయదాన బిరుద పాణి అయినాడని చమత్కారము.

దీనికి పాఠాంతరము : "విజయ నిస్సాణ రాణ నిర్భిన్న హృదయ..."

అలంకారము :

అంత్యానుప్రాస.

ఈ మూడు సీసపద్యాలలోను రఘునాథరాజు పరాక్రమముతోపాటు అతని ధర్మ యుద్ధ సూత్రాలూ, ఔదార్యమూ కవి వర్ణించాడు.

ఇచ్చునెడన్ బదార్థ మడి గిచ్చునొ, తా దయచేయఁ గాదనన్
వచ్చునొ, మించి యొక్కఁ డన వచ్చినఁ దా నది యిచ్చగించునో,
యిచ్చిన నిచ్చునే, సరగ నెవ్వరిపై దయసేసెఁ జేసెనే!
య చ్చతురాస్యుఁడుం దెలియఁ డచ్యుతు శ్రీరఘునాథ చిత్తమున్. 59

అర్థము :

ఇచ్చునెడఁగా = ఇచ్చునపుడు, పదార్థమున్ = ఏవస్తువును ఈయవలయునో అని, అడిగి = ఎవరినైనా అడిగి, ఇచ్చునొ = ఇస్తాడా ? తాన్, దయసేయఁగా = అనుగ్రహించిన ఎడల, కాదు, అనన్, వచ్చునొ ? మించి = అతిక్రమించి, ఒక్కఁడు = ఎవ్వడైనా, అనవచ్చినన్ = కాదు అనడానికి వచ్చిన ఎడల, తాను, అది = ఆ ప్రవర్తనను, ఇచ్చగించునో? (అట్టిదేమియు లేదు.) ఇచ్చినఁగా, ఇచ్చునే = ఇచ్చితీరును (అనగా ఇతరుని అడిగి చేయడు), సరగఁగా = ఒప్పునట్లుగా, ఎవ్వరిపై దయచేసెన్, చేసెనే, ఆ చతురాస్యుడున్ = ఆనాలుగుముఖాల బ్రహ్మగూడా, అచ్యుతు శ్రీరఘునాథ, చిత్తమున్ = మనసులో ఉన్న విషయమును, తెలియఁడు = తెలిసికొనలేడు.

తాత్పర్యము :

రఘునాథరాజు ఇచ్చుటయందు, ఆదరణ చేయుటయందు స్వతంత్రముగా వ్యవహరించును గాని ఒకరి సలహా తీసుకొని చేయువాడు కాడు. కాబట్టి బ్రహ్మకైనా ఆయన అభిప్రాయము తెలియదు.

చతురాస్యుఁడు అంటే ఒక్కతలకాక నాలుగు తలలు కలవాడైనా రాజు అభిప్రాయము గుర్తించలేడని చమత్కారము.

## ష ష్ఠ్యం త ము లు

ఏతాదృ గ్గుణ ఖనికిఁ,
సీతా దృఙ్మోహ నాంఘ్రి సేవా ధనికిఁ,
శాతాసి కలిత బాహా
న్వి తాసిక విమతరాజ నిఖిలావనికిఁ. 60

అర్థము :

ఏతాదృక్ = ఈ విధమైన, గుణ = సుగుణములకు, ఖనికిఁ = గనియైన వానికి, సీతా ......ధనికిఁ — సీతా = సీతాదేవియొక్క, దృక్ = నేత్రములను, మోహన = మోహింపజేయు వాని (అనగా శ్రీరామచంద్రుని), అంఘ్రి = పాదములయొక్క, సేవా ధనికిఁ = సేవయే ధనముగా గలవానికి (అనగా శ్రీరామపరమభక్తునికి), శాతా......వనికిఁ—శాత = వాడియైన, అసి = కత్తితో, కలిత = కూడిన (అనగా కత్తిధరించిన), బాహా = భుజమునందు, అన్విత = చేర్చబడిన, ఆసిక = స్థానముకల (భుజములందు నిలిచిన), విమతరాజ = శత్రురాజులయొక్క, నిఖిల అవనికిఁ = సమస్తమైన భూమికలవానికి (అనగా శత్రురాజ్యములన్నీ రఘునాథుని భుజమునందు ఉనికిని ఏర్పరచుకొన్నవి - శత్రురాజులను జయించి వారి రాజ్యములను స్వాధీనము చేసుకొన్న వానికి అని).

తాత్పర్యము :

అనేక శోభన గుణాలు కలిగి, గొప్ప రామభక్తుడయి, శత్రురాజుల రాజ్యాలను స్వాధీనము చేసుకొన్న రఘునాథునికి - అభ్యుదయ పరంపరాభివృద్ధిగా అని అన్వయము.

ఈ షష్ఠ్యంత పద్యాలన్నిటిలోను చక్కని అంత్యానుప్రాసలు, ద్విప్రాసలు, త్రిపాసలు ఉంచడము మన కవుల సంప్రదాయము.

చూడండి : మొదటి రెండు చరణాలలో 'తాదృ' ద్విప్రాస. 3, 4 చరణాలలో 'తాసిక' త్రిప్రాస.

అలంకారము :

రూపకము, పర్యాయోక్తి, అనుప్రాస, యమకము.

సాక్షా న్మనోజునకు, క్షో
దక్షమ రస భావ సుకవితా భోజునకుఁ,
దాక్షిణ్య గణేయునకుఁ
దక్షిణ సామ్రాజ్య విభవ ధౌరేయునకున్, 61

అర్థము :

సాక్షాత్ = ప్రత్యక్షముగ కనబడే, మనోజునకున్ = మన్మధునకు (అసలు మన్మధుడు రూపులేనివాడు కాబట్టి కనబడేవాడు కాడని భావము), క్షోదక్షమ...... భోజునకున్ — క్షోదక్షమ = కఠినపరీక్షకు నిలువగల (అనగా దోషములేని), రస = శృంగారాది రసములతోనూ, భావ = రతి మొదలైన భావాదులతోనూ కూడిన, సుకవితా = మంచి కవనము చెప్పుటకు, భోజునకున్ = భోజరాజయినవానికి (భోజరాజుతో సమానమైనవానికి), దాక్షిణ్య = దయయందు, గణేయునకున్ = గణింపదగినవానికి (అనగా గొప్ప దయగలవానికి), దక్షిణ సామ్రాజ్య = దక్షిణదేశపు సామ్రాజ్యముయొక్క, విభవ = ఐశ్వర్యమును, ధౌరేయునకున్ = భరించినవానికి (అనగా మంచి ఐశ్వర్యముగల దక్షిణదేశమును పాలించినవానికి).

విశేషము :

రఘునాథుడు చాల అందమైనవా డనడానికి "ఆకారమున నలునంత వాడౌనెకా" అన్న 26వ పద్య వివరణ చూడండి. ఇతడు చక్కని నిర్దుష్టమైన కవిత్వం చెప్పే వాడనీ, అభినవ భోజరాజనీ ప్రసిద్ధి కలవాడు.

అలంకారము :

అనుప్రాస, రూపకము.

సుస్థిర లక్ష్మీ మహిత మ
ణిస్థగిత గృహాంగణునకు, నేపాళ నృపా
ల స్థాపన చణునకు, సక
లాస్థాన ప్రణుత వర గుణాభరణునకున్, 62

అర్థము :

సుస్థిర = మిక్కిలి నిలకడగల, లక్ష్మీ = సిరిచేత (సాధారణముగా లక్ష్మి నిలకడలేనిదని చమత్కారము), మహిత = గొప్పదైన, మణిస్థగిత = మణులు పొదిగిన, గృహాంగణునకున్ = ఇంటిముందు వాకిలి గల వానికి (రఘునాథరాజు కట్టించిన మందిరములలో "ఇందిరా మందిరము" = లక్ష్మీమందిరము ఒకటి), నేపాలనృపాల = సింహాళములోని యాల్పాణా అన్న జాప్నాదీవి యొక్క రాజును, స్థాపన = తిరుగ తన రాజ్యమున నెలకొల్పుటయందు, చణునకున్ = నేర్పరియైన వానికి (సమర్థునకు), సకల = అన్ని, ఆస్థాన = రాజసభలలోను, ప్రణుత = బాగుగా పొగడబడిన, వర = శ్రేష్ఠమైన, గుణ = గుణములే, ఆభరణునకున్ = అలంకారములుగా కలవానికి, (ఇతని గుణములను సమస్త రాజసభలయందు కొనియాడు చుండేవారు అని).

విశేషము :

మణిస్థగితమయిన లక్ష్మీమందిరము, నేపాళ (జాఫ్నా) రాజును సింహాసనమున నెలకొల్పడము, ఇతర సంస్థానములలో రఘునాథుడు పొగడ్తలను పొందడము, అన్నీ చారిత్రక సత్యములే.

పోర్చుగీసువారిచేత రాజ్యభ్రష్టుడైన జాఫ్నా రాజును తిరిగి రాజ్యమున నిలిపిన వాడు రఘునాథుడు.

ఈ నేపాళము హిమాలయ ప్రాంతమునందలి నేపాళ రాజ్యము కాదు.[1]

కీర్త్యౌదా ర్యాధరి తా
మర్త్య మహీరుహ సుధాబ్ధి మహికాఘృణికి౯,
ధౌర్త్యవ దరి కరి సృణికిన్,
మూర్త్యంబా గర్భశుక్తి ముక్తామణికిన్, 63

అర్థము :

కీర్త్యౌ......ఘృణికిన్—కీర్తి = కీర్తిచేతను, ఔదార్య = దానబుద్ధిచేతను, అధరిత = క్రిందుచేయబడిన, అమర్త్య = దేవతల, మహీరుహ = వృక్షమును —అనగా కల్పవృక్షమును, సుధ అబ్ధి = పాలసముద్రమును, మహికా ఘృణికి౯ = (మంచుకిరణములుగల) చంద్రుని కల వానికి, (అనగా రఘునాథునికీర్తి కల్పతరువు, క్షీరసముద్రము, చంద్రులకంటే తెల్లగా ఉన్న దనిన్నీ, అతని ఔదార్యము కల్పవృక్షము, పాలసముద్రము, చంద్రులకంటె ఎక్కువనిన్నీ భావము). ధౌర్త్యవత్ అరి కరి సృణికి౯—ధౌర్త్యవత్ = ధూర్తలక్షణములుగల, అనగా పొగరుబోతుతనముకలవారైన, అరి = శత్రువులనెడు, కరి = ఏనుగులకు, సృణికిన్ = అంకుశమైన వానికి, మూర్తి అంబా = మూర్తిమాంబయొక్క, గర్భ = గర్భము అను, శుక్తి = ముత్తెపు చిప్పను పుట్టిన, ముక్తా మణికి౯ = శ్రేష్ఠమైన ముత్యమయిన వానికి—అనగా శుక్తి యందు ముత్యమువలెనే మూర్తిమాంబ గర్భమునందు రఘునాథుడు పుట్టెనని భావము.

విశేషము :

కీర్తి తెల్లగా ఉంటుంది. కల్పవృక్షమూ, పాలసముద్రమూ, చంద్రుడూ తెల్లదనానికి ప్రసిద్ధిపొందినవి ; రఘునాథుడి కీర్తి ఆ మూడింటిని మించినంత తెల్లగా ఉంటుందని భావము. ఆలాగే , ఆ మూడూ దానానికి (త్యాగానికి) గూడా ప్రసిద్ధి చెందినవే. రఘునాథుడి దానశీలము వాటినిగూడ మించిపోతుందని వర్ణన.

(1) ఉపోద్ఘాతములో ఉన్న నా "నేపాళ-చోలగ" శబ్దముల వివరణ చూడదగి.

సాధారణముగ మూర్తమ్మ అని వాడుకలో ఉన్నా, సరియైనది మూర్తిమాంబయే. మూర్తి + అంబా = మూర్త్యంబా అయింది. లేకపోతే మూర్తాంబా కావాలి.

అలంకారము :

రూపకము, వ్యతిరేకము, క్రమము.

అఘటన ఘటనా చాతు
ర్య ఘనోర్జిత కార్య నిర్వహణ ధూర్వహ ధీ
మఘ వాచార్యున కచ్యుత
రఘునాథ వసుంధ రాధిరా డ్వర్యునకుఁ. 64

అర్థము :

అఘటనఘటనా = సమకూడని కార్యములను సమకూర్చగల, చాతుర్య = నేర్పునందునూ, ఘన = గొప్పవైన, ఊర్జితకార్య = మంచి పనులను, నిర్వహణ = నెరవేర్చే, ధూర్వహ = భారమునువహించకల్గిన, ధీ = బుద్ధియందునూ, మఘవ = ఇంద్రుని, ఆచార్యునకున్ = గురువైన బృహస్పతికి, అనగా బృహస్పతివంటివానికి, అచ్యుతరాజు కొడుకయిన, రఘునాథ, వసుంధర అధిరాట్ వర్యునకు = రాజాధిరాజ శ్రేష్ఠునకు,

తాత్పర్యము :

అసాధ్యములనుకొనే కార్యాలను గూడా సాధించే నేర్పు ఎటువంటి ఘనకార్యమయినా బాధ్యతవహించి చేయగల బుద్ధి కలిగి, అపర బృహస్పతి అయిన రాజుకి అభ్యుదయపరంపర.

అలంకారము :

రూపకం.

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన విజయ విలాసంబను శృంగార ప్రబంధమ్మునకుఁ గథా క్రమం బెట్టిదనిన, నైమిశారణ్య మహర్షులకు రౌమహర్షణి యిట్లనియె : 65

అర్థము :

అభ్యుదయ = శ్రేయస్సుల, పరంపర = వరుసల, అభివృద్ధిగాన్ = అతిశయము కలుగునట్లుగా (అనేక శుభములు కలుగునట్లుగా), నా ఒనర్పన్ పూనిన = నేను రచించ తలపెట్టిన, విజయవిలాసంబు, అను, శృంగార, ప్రబంధమ్మునకు, కథాక్రమంబు, ఎట్టిదనిన, [నైమిశ అరణ్యములోని మహర్షులకు, రౌమహర్షణి = రోమహర్షముని కుమారుడైన సూతుడు, ఇట్లనియె = ఈ విధముగా చెప్పెను:

# కథాప్రారంభము

## (పురవర్ణన)

చంద్రప్రస్తర సౌధ ఖేలనపర శ్యామా కుచద్వంద్వ ని
స్తంద్ర ప్రత్యహ లిప్త గంధ కలనా సంతోషిత ద్యోధునీ
సాంద్ర ప్రస్ఫుట హాట కాంబురుహ చంచ చ్చంచరీ కోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిలు రమాహేలా కళావాసమై. 66

అర్థము :

చంద్ర...... త్కరంబు — చంద్రప్రస్తర = చంద్రకాంతమణులతో — చలువరాళ్ళతో కట్టబడిన, సౌధ = మేడలమీద (ఉపరిభాగములందు), ఖేలనపర = ఆటలయందు ఆసక్తి కలిగిన, శ్యామా = నడియౌవనములో ఉన్న కనకాంగులయొక్క, కుచద్వంద్వ = చనుగవలందు, నిస్తంద్ర = అశ్రద్ధ లేక - చాల శ్రద్ధతో, ప్రత్యహ = ప్రతిదినమును, లిప్త = పూయబడిన, గంధ = కస్తూరీ కుంకుమాది లేపనల పరిమళముయొక్క, కలనా = పొందికచేత (కూడికచేత), సంతోషిత = సంతోషించినట్లు చేయబడిన, ద్యోధునీ = ఆకాశగంగ యందలి, సాంద్ర = దట్టముగా ఉన్న, ప్రస్ఫుట = బాగా వికసించిన, హాటక అంబురుహ = బంగారు పద్మములయందు, చంచత్ = తిరుగుచున్న, చంచరీక = తుమ్మెదలయొక్క, ఉత్కరంబు = సమూహము కలది (అగు), ఇంద్రప్రస్థపురంబు = ఇంద్రప్రస్థనగరము (హస్తినాపురమునకు చేరువలో ఉన్నది), రమా హేలా కళావాసమై — రమా = సంపదకు, హేలా = విలాసమునకు, కళా = విద్యకు, ఆవాసమై = ఉనికిపట్టయి (ఇంకా - రమా = లక్ష్మికిని, హేలా = పార్వతికిని, కళా = సరస్వతికిని, ఆవాసమై = ఉనికిపట్టయి, అనగా త్రిమూర్తుల భార్యలకు, "చల్లని పుట్టినిండ్లుగల చానలకు", ఉనికిపట్టయి), భాసిలుః = ఒప్పును.

తాత్పర్యము :

చలువరాతి మేడలమీద ఆడుకొనే ఎల జవ్వనుల వక్షములందు పూసుకొనిన కస్తూర్యాది లేపనముల పరిమళములవల్ల సంతోషిస్తున్న ఆకాశగంగ యందుండే బంగారు తామరపువ్వులలో తిరుగుతున్న తుమ్మెదలు కలిగి ఇంద్రప్రస్థపురము సంపదకు, విలాసానికిః విద్యకు (లక్ష్మి పార్వతి సరస్వతులకు) ఉనికిపట్టయి ఉన్నది.

విశేషము :

ఈః పరిమళము ఆ తుమ్మెదలకు అందుబాటులో ఉన్నది. మేడలు ఆకాశమునంటి ఉన్నవని భావము.

కుచములందు కస్తూరిని పూసుకొనే ఆచారము ఉండేది. శ్రీనాథుని నైషధములో "కాలాంతఃపురకామినీ కుచతటీ కస్తూరికా సౌరభ శ్రీ లుంటాకము..." అన్నాడు.

విజయవిలాసములో పద్యము (ఆశ్వా. 1-203) "కొమ్మ కౌగిటజేర్చ గోరంట నంటిన మొనగుబ్బ కస్తూరి మురువుచూచి......" అని ఉంది. ఈ గంధలేపనలూ, మకరికాపత్ర రచనలూ ఒక లలితకళగా ఆ దినాలలో అలవర్చుకొనేవారు.

వేదంవారు "రమా = సిరియొక్క, హేలా = విలాసముయొక్క, కళా = విద్యకు, ఆవాసమై = ఉనికిపట్టై" అని అర్థము చెప్పారు. ప్రతి పద్య చమత్కారముగల విజయవిలాస కావ్యములో మొదటి పద్యమున రమా హేలా కళావాసమై అన్న నాలుగు మాటలకు పై వ్యాఖ్యానములో చెప్పిన అర్థము చాల పేలవంగా ఉన్నదని వేరే చెప్ప నక్కరలేదు.

చలువరాతి మేడలు తెల్లనివి. ఆ మేడలమీద ఆడుకొనే శ్యామల కుచద్వంద్వములు బంగారు వన్నె కలవి. కస్తూరిలేపనములు నల్లనివి. అటు ఆకాశగంగ తెల్లనిది. అందలి తామరలు బంగారు వన్నెవి. వాటిలో విహరించే తుమ్మెదలు నల్లనివి. ఇచ్చట బింబప్రతిబింబ భావము కవి చమత్కారముగ సూచించాడు.

దేవతలకు కస్తూరి లేదని ఒక నమ్మకం మన కవులకుంది. కాబట్టి అక్కడ ఆకాశ గంగలోని పద్మాలలో విహరిస్తుండే తుమ్మెదలకు ఈ "ప్రత్యహాలిప్త గంధ కలన" అపూర్వము, అపురూపముగా ఉంటుంది. అందుకే అవి సంతోషించి తిరుగుతున్నాయి.

ఆకాశగంగలోనివి బంగారు పద్మాలు అనడానికి 'చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు భోజనంబులుమాకు పూవుబోణి' అని శ్రీనాథు డన్నాడుకదా.

చంద్రప్రస్తర సౌధాలున్నవి కాబట్టి సంపదకు (రమా), ఖేలన పరలగు శ్యామలున్నారు కాబట్టి విలాసమునకు (హేలా), నిస్తంద్రప్రత్యహ లేపనములు కలవు కాబట్టి విద్యకు (కళా) ఆవాసము అని చక్కని క్రమాలంకారాన్ని ఈ కవి పద్యములో పాటించాడు.

హేల : నానార్థములు — పార్వతి, విలాసము — విశ్వనిఘంటువు.

*పాఠాంతరము :*

"నిస్తంద్ర ప్రత్యవలిప్త......" వేంకటకృష్ణమాచార్యులవారూ, మొదటి వావిళ్లవారూ ఇచ్చారు.

*అలంకారము :*

అతిశయోక్తి, క్రమము, శ్లేష.

ద్వారక ముద్దుఁ జెల్లెలఁట తన్నగరీమణి; సృష్టి యన్నిటన్
దేరుగడైనచో నిదియ నేర్పుల మేరని యెంచిచేసెఁబో
ధారుణి విశ్వకర్మ, గుఱి దానికి నెక్కడ సీడులేని సిం
గారము గల్గు, టట్లు వెనుకన్ సృజియింపక యుండుటే సుమీ. 67

అర్థము :

తత్ నగరీమణి = ఆ శ్రేష్ఠమైన పట్టణము (ఇంద్రప్రస్థపురము), ద్వారక = (శ్రీకృష్ణుని రాజధానియైన) ద్వారకానగరమునకు, ముద్దు చెల్లెలఁట = గారాబుతోబుట్టువు అని అంటారు— అన్ని విధములా దానిని పోలినదని అర్థము చెప్పు కుంటారు. కాని అదిసరికాదు. విశ్వకర్మ = దేవతల శిల్పి, సృష్టి = సృజించే నేర్పు, అన్నిటన్ = అన్ని విధములయందును, తేరుగడ ఐనచోన్ = ఆరితేరి మంచికౌశలము కలిగిన తరువాత, ఇదియ = ఈ పురమే, నేర్పుల మేర అని = పనితనమునకు హద్దు అని (దీనిని మించిన నేర్పు మరిలేదని), యెంచి = తలంచి, ధారుణిన్ = భూమియందు, చేసెన్ పో = చేసెనుసుమా, (దీనికి) గుఱి = ఈ మాటకు తార్కాణము, దానికిన్ = ఆ ఇంద్రప్రస్థపురమునకు, ఎక్కడన్, ఈడులేని, సింగారము, కల్గుట, అట్లు = ఆ పురమును పోలినట్లు, వెనుకన్ = ఆ తర్వాత, సృజింపక యుండుటే = నిర్మించ కుండుటయే, సుమీ.

తాత్పర్యము :

పై చెప్పిన రెండు తార్కాణలచేత దేవశిల్పి అన్నిటను ఆరితేరిన తరువాత, నగర నిర్మాణ కౌశలమునకు పరమావధి ఇదేనుసుమా అని తెలుపుటకు ఇంద్రప్రస్థపురమును నిర్మించాడని భావము.

విశేషము :

పాండవులుండే ఇంద్రప్రస్థమును వర్ణిస్తున్నప్పటికీ మన కవి పాఠకుల దృష్టికి ద్వారకా నగరమును చూపి కృష్ణుని కనబరిచాడు. 'ముద్దుచెల్లెలు' అన్నమాటవల్ల ప్రధాన కథానాయిక ఆ కృష్ణుని చెల్లెలు అయిన 'సుభద్ర'ను స్మరణకుతెచ్చి కథ ఆదినీ అంతాన్నీ ముడిపెట్టాడు. ఇది ఒక చమత్కారము.

తేరుగడ = నేర్పు కలిగినట్లు - ఆరితేరినట్లు అని చెప్పడానికి : ఈ కావ్యంలో ఆ. 3 పద్యం 211 లో ఈకవే

"కన్నె యుండాక నే మెరుంగదు గదయ్య
తేరుగడగాగ మెల్లన దిద్దుకొమ్మ"

అన్నాడు.

ఈ పద్యములో 'చెల్లెలు' అన్నమాట పోలికను చెప్పడానికి కవి ఉపయోగించాడు. అంటే ఉపమావాచకంగా వాడాడు. ప్రతిపద్య చమత్కృతి సాధించడానికి చేమకూరకవి కున్న సాధనాలలో ఉపమావాచకాలు, తిరస్కారపదాలు ఇలాంటివి చాల ముఖ్యమైనవి. సన్ని వేశానికి తగినట్లు వాటిని ఉపయోగించి, ఎక్కడలేని అందాన్నీ, ఎవ్వరికీ అందని సొగసునూ కలిగిస్తాడు. వాటిమీద దృష్టిపెట్టకపోతే పాఠకుడు కవి హృదయాన్ని సంపూర్ణంగా గ్రహించ లేడని మనవి చేస్తాను. చూడండి.

"జయంతుని తమ్ముడు సోయగంబునన్"
"ఊదుకపోవు శంఖము నహో గళరేఖ"

ద్వారక ముద్దుచెల్లెలట — ఇది ప్రజల అభిప్రాయము — కవి అభిప్రాయముకాదు. అంద మున ద్వారకను మించినదని అతని భావము. ద్వారకా నగర నిర్మాణం అయిన తరువాత, అన్ని విధాలా ఆరితేరిన కౌశలముతో విశ్వకర్మ ఈ ఇంద్రప్రస్థపురాన్ని నిర్మించాడు. ఇదే "నేర్పులమేర" అన్నాడు. కాబట్టి ఈ నగరం ద్వారక కంటే అందమయిన దన్నమాట. దానిని ద్వారకకు పోలియున్నది అన్న అర్థంలో "ముద్దుచెల్లెలు" అనడం సమంజసం కాదని చెప్పడానికే "ముద్దుచెల్లెలట" అని 'అట' చమత్కారంగా ప్రయోగించాడు. 'ఎంత తెలివి తక్కువ!' అని సూచించాడు.

పాఠాంతరాలు :

"తీరుగడైనచో......"

— అని వేదంవారి పాఠము.

'తీరుగడ = సమాప్తము, ముగిసినది' అని అర్థమిస్తూ సూర్యరాయాంధ్ర నిఘంటువువారు ఈ పద్యాన్నే ప్రమాణం చూపించారు.

"యెంచి చూడఁబో...."

— వేంకటకృష్ణమాచార్యులు.

"యెంచి చేయబోల్......"

— వావిళ్ళ.

అలంకారము :

ఉత్ప్రేక్ష, వ్యతిరేకము.

వెండియుఁ బైఁడియుఁ దడఁబడు
చుండుం బురి నెందుఁ జూడ, నుగ్రాణములై
యుండంగావలె నందలి
ఘుండులఁ గైలాస మేరు పృథ్వీధరముల్. 68

*అర్థము :*

పురిఁ = ఆ ఇంద్రప్రస్థ పురమునందు, ఎందున్ చూడఁ = ఎక్కడ చూచినను, వెండియుఁ పైఁడియుఁ = వెండివస్తువులూ బంగారువస్తువులూ, తడఁబడుచుండుఁ = క్రింద మీదపడుచు - ఒకదానిమీద నొకటి పడుచుండును, అనగా విశేషముగా కనబడుచుండును. (దీనిని బట్టి చూడగా) కైలాస మేరుపృథ్వీధరముల్ = వెండికొండ కైలాసము, బంగారుకొండ మేరువు అనే పర్వతాలు, అందలి యిండులన్ = ఆ నగరములోని గృహములలో, ఉగ్రాణ ములై యుండంగా వలెఁ = భండారములు (ఇంటి సామగ్రిని నిలువచేసుకొనే స్థలములు) అయి ఉండవలెను.

గృహములలో సామగ్రులను నిలువచేసుకొనే (Store room) భాగము ఉగ్రాణమని ఇప్పటికీ దక్షిణదేశమున వాడుక ఉంది.

*పాఠాంతరాలు :*

వెండియుఁ బైఁడియుఁ దడఁబడు
చుండున్ పురినెందుఁ జూడ, నుండఁగవలయుఁ
భండారములై యందలి
యిండులఁ గైలాస మేరు పృథ్వీధరముల్

— తిరుపతివారూ, వేంకటకృష్ణమాచార్యులవారూ.

'ఉగ్రాణము' పరిచయములేని పరిష్కర్తలు ఆమాటను తొలగించారు. కవి తంజావూరు వాడు కాబట్టి ఉగ్రాణమనే వ్రాసి ఉంటాడు.

నోరి గురులింగ శాస్త్రిగారు తమ విజయవిలాసము (టీకాతాత్పర్య సహితము)లో తడబడుచుండుఁ = (కాళ్ళకు) తగులుచుండును అని అర్థం చెప్పుతూ, కాళ్ళకు అన్నమాటను కలిపారు. శ్రీ బులుసువారు తమ విజయవిలాస ముకుర వ్యాఖ్యలో తడబడుచుండుఁ = కాళ్ళలో పడుచుండును - సమృద్ధముగ నుండునని భావము అని వ్రాశారు. ఇక్కడ కాళ్ల ప్రసక్తి సమంజసముకాదు.

తడబడు = నిండియుండు - పూర్ణమగు అని సూర్యరాయ నిఘంటువు.

..........వెండియుఁ బైఁడియు నిండ్లలోపలఁ
దడఁబడఁ దారు బాంధవులు
తామర తంపరలై ............

— క్రీడాభిరామము.

తడబడు అంటే కిందమీదపడు, ఒకదానిపై నొకటి పడు అన్న అర్థంలోనే శ్రీకృష్ణ దేవరాయలు తన ఆముక్తమాల్యదలో

"శయపూజాంబుజములఁ ఘటిం దడఁబడఁగా"

అని ప్రయోగించాడు.

దీని తరువాతి పద్యములో "తడబాటు" అన్నమాటను 'క్రింద మీదగు, వ్యత్యస్తముగా ఉండు' అన్న అర్థములోనే ఉపయోగించాడు కవి.

అలంకారము :

అతిశయోక్తి, క్రమము.

## ప్ర జ ల వ ర్ణ న

తడఁబాటు గలదు వేదముల నాతని కంచుఁ
 బరమేష్ఠి మెచ్చరు ధరణిసురులు ;
కడమాటు పగవానిఁ గని చేమఱచె నంచు
 భార్గవు మెచ్చరు బాహుజనులు ;
పనికి రా కొకమూలఁ బడియె నాతని వస్తు
 వని కుబేరుని మెచ్చ రర్యజనులు ;
వీటిపాటైన నాఁగేటి పాటున నేమి
 యని హలాయుధు మెచ్చ రంఘ్రిభవులు ;
పాడిఁ దప్పక ధర్మంబు పట్టువిడక,
లక్షలకు నమ్మఁజాలి, నల్గడల భూమి
వరులు మేలనఁదగి, యిట్లు పురిఁ బొలుతురు
చదువు సాముల ధన ధాన్య సంపదలను. 69

అర్థము :

౧. వేదములఁ = వేదములు పఠించుటయందు, ఆతనికిఁ (బ్రహ్మకు), తడఁబాటు = పొరపాటు_వ్యత్యాసము కలదు, అంచుఁ = అని లోపమెంచి, పరమేష్ఠిఁ = బ్రహ్మను, ధరణిసురులు = (ఆ ఇంద్రప్రస్థపురములోని) బ్రాహ్మణులు, మెచ్చరు = నిరసిస్తారు, (సోమకాసురుడు వేదములను దొంగిలించుకొని పోయినప్పుడు, బ్రహ్మకు వేదపఠనమున పొరపాట్లు కలిగాయని ప్రసిద్ధి పరమేష్ఠి, ఉత్కృష్టమైన యజ్ఞములు చేసినవాడే అయినా, ఈ తడబాటుండడం వల్ల ఆ పురిబ్రాహ్మణులు బ్రహ్మనుగూడా మెచ్చరు. ఆ పురిబ్రాహ్మణులు పొరపాటు లేకుండా వేదములను పఠించగల సమర్థులు అని భావము);

౨. కడమాటు = కడపటి పర్యాయము, పగవానిగా, కని = చూచినప్పుడే, చేమఱచెన్ = హస్తకౌశలమును కోల్పోయెను—చేతిపట్టు (నేర్పు) విడిచిపెట్టెను, అంచుగా, భార్గవుగా = భృగుమహర్షి పుత్రుడు, పరశురాముని, బాహాజనులు = (బ్రహ్మ భుజములనుండి పుట్టిన) క్షత్రియులు, మెచ్చరు.

మొదట తానెంత పరాక్రమశాలి అయినా, తుట్టతుదను; దశరథరాముని ఎదిర్చినప్పుడు, తన గొప్పతనమును కోల్పోయి తన చేతిలోని వింటిని శ్రీరామునికిచ్చివేసిన ఆ పరశురాముని ఇతడేపాటి శూరుడు అని ఆ పట్టణ రాజకుమారులు నిరసిస్తారు. ఆజన్మాంతము శత్రువులకు లొంగనట్టి శౌర్యము కలవారని భావము.

౩. ఆతని (ఆ కుబేరుని యొక్క), వస్తువు = ధనము, పనికిరాక = నిష్ప్రయోజనముగా, ఒకమూల పడియెన్, అని కుబేరుని, అర్యజనులు = వైశ్యులు, మెచ్చరు.

ధనాధిపతియగు కుబేరుడు ఉత్తర దిక్కునకు అధిపతి. వాని ధనములు-నవనిధులు - ఆమూలనే ఉన్నవి. అతడెంత కుబ్జితుడైన బేరగాడైనా, అంతధనమును లాభము నార్జించకుండా నిరర్థకముగా ఉంచెనని, వట్టి చేతకానివాడని, ఆ ఊరి వైశ్యులు అతనిని మెచ్చరు.

ఆ ఊరివైశ్యులు తమ ద్రవ్యమును విశేష లాభదాయక మగునట్లు ఉపయోగించ సమర్థులు అని భావము.

౪. వీటిపాటు అయిన = పురమునకు నాశనము తెచ్చిన, నాఁగేటి = నాగలియొక్క, పాటునగా = కృషివలన, ఏమి = ఏమిప్రయోజనము (నిష్ప్రయోజనము), అని, హలాయుధుగా = (నాగలి ఆయుధముగాగల) బలరాముని, అంఘ్రి భవులు = (బ్రహ్మపాదములనుండి పుట్టిన) శూద్రులు, మెచ్చరు.

బలరాముడు తన నాగలితో హస్తినాపురమును ఊడబెరికి యమునలో త్రోయ ప్రయత్నించడం పురాణ ప్రసిద్ధము. ఈ ఊరిలోని శూద్రులు పట్టణమును ఐశ్వర్యవంతముచేయుటకు తమనాగళ్ళు ఉపయోగిస్తారని భావము.

(ఈ నాల్గుజాతులవా రందరూ) పాడి తప్పక = న్యాయమును విడిచి పెట్టక, ధర్మంబు పట్టువిడక = తమతమవిధులను మరవక, లక్షలకుగా నమ్మకగా చాలి = లక్షలకొలది ద్రవ్యమును వారి దగ్గర ఉంచినను భయములేదు అన్ననమ్మకము ప్రజలలో కలుగునట్లు, నల్గడల = నాలుగు దిక్కులనున్న, భూమివరులు = రాజులు, మేలు అనఁగాతగి = మెచ్చుకొనుటకు తగిన ప్రవర్తన గలవారై చదువు, సాము, ధనము, ధాన్యము (మొదలగు), సంపదలను = వైభవములతో, పురిగా = పురమునందు, పొల్తురు = ఒప్పుచుందురు.

ఇంతేకాక మరొక విశేషము : విడివిడిగా, బ్రాహ్మణులు పాడితప్పక = వేదములందలి పాఠక్రమమును (బ్రహ్మవలె కాక) తప్పిపోక; క్షత్రియులు ధర్మంబు పట్టువిడక (ధర్మము

అనగా విల్లు) వింటిని పట్టువిడువక = (పరశురామునివలెకాక) విడిచి పెట్టక; వైశ్యులు లక్షల కుఁ అమ్మఁ చాలి = లక్షల కొలది లాభములు వచ్చునట్లు అమ్ముటకు (కుబేరుని వలెగాక) సమర్థులై; శూద్రులు నల్గడల భూమిన్ = నాలుగు దిక్కులనున్న ప్రదేశములలో, వరులు = వీరు పండించిన వరిధాన్యములు, మేలు అనన్ = చాల మంచివి అనునట్లు (బలరాముని వలెకాక) పండించుటకు సమర్థులు.

ఇంకా మరొక క్రమం : బ్రాహ్మణులు చదువు, రాజులు సాము, వైశ్యజనులు ధనము, శూద్రులు ధాన్యము కలిగి ఆపురమున ఉన్నారు అని గీతము మొత్తము మీద అన్ని జాతులకు అన్వయించ వచ్చును. గీతములో మూడు చరణములను నాలుగు జాతులకు క్రమం గాను; నాల్గో పాదము మరల నలుగురకు క్రమంగాను అన్వయించడము చాలచక్కని చమత్కారము.

విశేషము :

ఈ సీసపద్యం పెద్దచరణాలలో తిరస్కృతు లయిన వారందరూ సుప్రసిద్ధులు — వేదపఠనానికి బ్రహ్మ, పరాక్రమానికి పరశురాముడు, ధనానికి కుబేరుడు, నాగలికృషికి బలరాముడు. వీరిలో ఒక్కొక్క లోపం ఎంచి ఈపురంలోని నాలుగు జాతులవారు వారిని నిరసిస్తారు అని చెప్పడం చాల సమంజసంగా ఉంది.

ఆ లోపాలు గూడా పురాణాలు అంగీకరించినవే. ఆలోపాలు లేకుండా ఈప్రజలు పాడి తప్పక...ప్రవర్తించా రనడమూ చాల అందంగా ఉంది.

ఈలాంటి వర్ణనే చేయబోయి అల్లసాని పెద్దనామాత్యుడు మనుచరిత్రలో

అచటి విప్రులు మెచ్చ రఖిల విద్యాప్రౌఢి
ముదిమది దప్పిన మొదటి వేల్పు......

అని సీసపద్యం ఆరంభించాడు. ఆ విప్రులు ముసలితనములో మతిచెడి ఉన్న బ్రహ్మను నిరసిస్తారు— మూడు సంవత్సరాలు సాముచేసి మూలనున్న ముసలిని ఓడించినట్లు. ఆ మను చరిత్ర పద్యంతో గాని, ఆలాంటి ఇతర ప్రబంధాలలోని చాతుర్వర్ణ్య వర్ణన పద్యాలతో గాని సరిపోల్చి చూచినప్పుడు మనకవి చూపించిన చమత్కారం కరతలామలకంగా బోధపడుతుంది.

చేమరచు = హస్త కౌశలశూన్యుడగు అని సూర్యరాయ నిఘంటు అర్థం ఇస్తూ, విజయ విలాసంలోని ఈ పద్యాన్ని గూడ ప్రయోగంగా చూపించింది. (అనగా చేతినేర్పును పోగొట్టు కొన్న వాడు అని.) కాని, పద్యంలో పరశురాముని లోపమెంచిన క్షత్రియులు "ధర్మంబు పట్టు విడక" ఉంటారని ఎత్తుగీతిలో కవి చెప్పుతున్నాడు. అంటే చేతిలోని వింటిని పట్టువిడక అని అర్థం చెప్పకోక తప్పదు. కాబట్టి దీనికి అనుగుణంగా ఉండడానికి "చేమరచె = చేతినేర్పు (పట్టు) పోగొట్టు కున్నాడు" అని చెప్పవలసి వచ్చింది. అదే కవిహృదయం అనాలి.

నల్గడల భూమి వరులు మేలన - ఇక్కడ శ్లేషలో నాలుగుదిక్కులనున్న ప్రదేశములో, వరులు (ధాన్యములు). మెచ్చుకొనేలాగు అనిఅర్థం చెప్పుకున్నాము. వరికి బహువచనము వడ్లు అయినా, వరులు అనడం ఎందుకంటే అనేక విధాలయిన వరి అనితెల్పడానికే. తంజావూరు రఘునాథరాజు కాలములో (ఇప్పుడుగూడ) చాల సుభిక్షముగా ఉండి దక్షిణ దేశంలో ధాన్యపు కొట్టుగా ప్రసిద్ధి పొందింది. ఆ ప్రదేశంలో ఆరోజులలో పండిస్తూ ఉండే వరి రకాలు రఘునాథనాయకుడే —

పుష్పమంజరు, లిప్పపువ్వు రాజనములు,
కస్తూరి నిగరాలు, గంధసరులు,
గంగాజలంబులు, బంగారు తీగియ,
లేనుంగు దంతముల్, దీనసరులు,
సన్నవంకలు, ముత్తెసరులు, ప్రానంగులు,
రాయమెచ్చులు, నీశ్వర ప్రియములు,
నయములు, రామబాణములు, సీతాభోగ
ములు, బాలకేసరుల్, మోసనములు,
కరియ మేనులు, సన్నబ్రక్కొండ మరియు
గలుగు ధాన్యంబులెల్ల ముక్కారు బండి
నిండి యెల్లెడ జూచిన నెగడుచుండు
క్షామమనుపేరు నెరుగరా భూమిజనులు.

అని వర్ణించాడని నిడుదవోలు వెంకటరావుగారు ప్రకటించారు.

బాహుజనులు అన్నచోట జనులు = పుట్టినవారు.

ఆర్యజనులు అన్నచోట జనులు = ప్రజలు

*అలంకారము :*

క్రమము, వ్యతిరేకము, శ్లేష, యమకము.

## కందకము - కోటకొమ్మలు

"నీ సరియైన దేవతతినిం గలఁగించెద, నీ పడంపుమా
నానరి శేషపన్నగ ఫణానివహంబు" నటంచు నప్పురీ
ఖాసలు సేసికొన్నవన ఖాసిలు సాలశిఖాళి ఖేయముల్;
మోసమె యైన, విష్ణుపదమ్మున్ ఖలిషితము ముట్టనేటీటీ[illegible] 70

కందకమూ, కోటకొమ్మల వరుసా, తమకు అందరాని శత్రువులను మిత్రలాభముతో జయిం చుట కొరకు చేసుకొన్న ఒడంబడిక ఈ పద్యములో ఉంది. లోతునా వెడల్పునా కందకమునకు ఆకాశ గంగానదితో వైరము. ఆలాగే ఎత్తునా, మణిమయాది సౌందర్యమునా, కోటకొమ్మలకూ పాతాళలోకము లోని ఆదిశేషుని పడగలకూ శత్రుత్వము. కందకమునకు ఆకాశగంగ అందదు. కోటబురుజులు పాతాళ మునకు పోజాలవు. కాబట్టే ఈ ఒడంబడిక.

అర్థము :

అప్పురిన్ = ఆ పట్టణమందు (కోటకొమ్మల వరుస కందకముతో చెప్పినది) "నీసరి యైన = నీతో పంతమునకువచ్చే, దేవ తటినిన్ = దేవనదియైన ఆకాశగంగను, కలఁగించెదన్ = నేను కలతచెందిస్తాను (శిక్షించి నీ పగసాధిస్తాను). దీనికి ప్రత్యుపకారముగా నీవు (కందకము), నాసరియైన = నాతో (కోటకొమ్మల వరుసతో) పంతానికి వచ్చే, శేషపన్నగ = ఆదిశేషునియొక్క, ఫణా = పడగలయొక్క, నివహంబును = సమూహమును, అడంపుమా = క్రిందకు అణచివేయుమా (గర్వభంగము కావించి నా పగసాధించుమా), అటంచు = అని (ఇరు వురు అంగీకారంతో), బాసలు = ప్రమాణములు, చేసికొన్నవి అనన్ = చేసికొన్నవా అన్నట్లు, సాలశిఖాళి ఖేయముల్ = కోటకొమ్మల వరుసా, కందకమున్ను, భాసిలున్ = ఒప్పుచున్నవి, (ఈ బాసలు చేసుకోవడం) మోసమెయైనన్ = నిజముకాదంటే, (సాలశిఖాళి) విష్ణుపదమున్ = విష్ణుదేవుని పాదమునూ, (ఖేయము) బలిపీఠమున్ = ధ్వజస్తంభముదగ్గరి బలిహరణపీఠమునూ, ముట్టనేటికిన్ = ముట్టుట ఎందుకు? ప్రమాణాలు చేసేటప్పుడు గుడిలోవిష్ణుపాదాన్నీ బలిపీఠాన్నీ తాకుట లోక ప్రసిద్ధము. ఇక్కడ నిజంగా అవి తాకుతున్నాయా అని ప్రశ్నిస్తే కొమ్మల చాలు విష్ణుపదము, అనగా ఆకాశమును తాకుతున్నది; కందకము బలిపీఠము - అనగా పాతాళమును తాకుతున్నది.

విశేషము :

ఇద్దరు వ్యక్తులు ప్రమాణము చేసుకున్నట్లు కవి భావించాడు. ఖేయము (కందకము) ఒక వ్యక్తిగాను, సాలశిఖ ఆళి (కోట కొమ్మల నన్నిటినికలిపి) రెండో వ్యక్తిగాను, ఒడంబడికలో 'నీ' 'నా' అనడానికి తగినట్లు, కవి పేర్కొన్నాడు. ఈ వ్యక్తిత్వము పాటించే శత్రువును శేష పన్నగఫణా నివహంబు (సమూహముగా) ఒక్క వ్యక్తిగానే జాగరూకతతో చెప్పాడు.

ఆకాశగంగ నీరు కాబట్టి దానిని కలగచేయడమూ (కలియబెట్టడము), ఎత్తుగాలేచి ఉండే ఫణానివహమును అడంచి క్రిందికి నొక్కడమూ అన్నవి శిక్షలుగా చేయడం కవి నేర్పు.

కందకములో ప్రతిబింబించిన కోటకొమ్మల వరుసను చూచినందు వల్ల, ఆరెండూబాసలు చేసుకొంటున్నవనే భావము కవికి కలిగి ఉండవచ్చును.

ఇంతకూ వర్ణించిన విషయము : కోటకొమ్మలు ఆకాశమును తాకుతున్నవనీ, అగడ్త పాతాళము నంటుతున్నంత లోతుగా ఉన్నదనీ అతిశయోక్తులు.

పాఠాంతరాలు :

"నీ వడంపుమూ నా నమమైన
శేషుని ఫణానివహంబు.........."

— వేంకటకృష్ణమాచార్యులు.

"......శేష పన్నగ ఫణచ్ఛట
నం చొడబాటుమై పురిఁ"

— తిరుపతివారి పాఠం.

అలంకారము :

ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, శ్లేష.

రే లమృతాంశులో శశము రెమ్మఁద మంచుఁ దలంచి జాళువా
మేలి పసిండి సోయగపు మేడల గుజ్జనగూళ్ళ నందడిఁ
బాలిక లుండి యావలఁ జనం గని, చింతిలి వంటయింటికుం
దే లిది యెందు బోఁగలదు ? నేఁటికి నేమని యందు రందులఁ. 71

అర్థము :

అందులఁ = ఆ పట్టణమునందు, రేలు = రాత్రులందు, జాళువా = జాళువాదేశపు, మేలి పసిండి = ప్రశస్తమైన బంగారముతో చేయబడిన (జాళువాదేశముది చాల హెచ్చువన్నె బంగారమని అంటారు), సోయగపు = అందమైన, మేడలఁ = మేడలమీద, బాలికలు, అమృతాంశులో శశమున్ = చంద్రునియందున్న కుందేలును, రెమ్మదము = పట్టి (బయటికి) లాగుదాము, అంచుఁ, తలంచి, గుజ్జనగూళ్ళ నందడిన్ ఉండి = గుజ్జనగూళ్లు వండుకునే బొమ్మల ఆటలోమరచి ఉండి (ఇంతలో), ఆవలఁ = (చంద్రుడు) దూరము, చనఁ = పోగా, కని = చూచి, చింతిలి = అయ్యో పోయిందికదా అని విచారించి, (అంతలో ధైర్యము తెచ్చుకొని) ఇది వంటయింటి కుందేలు = వంటఇంటి రుచిమరగిన కుందేలు, మరల మరల ఆవంట ఇంటికి రాకుండ ఉండదు, ఎప్పుడు కావలసిన అప్పుడే పట్టుకొనగలము, కాబట్టి తప్పించుకొని పోజాలనిది, ఎందుబోగలదు = ఎక్కడికి పోవును, నేఁటికిఁ ఏమి అని అందురు = ఈనాడు తప్పించు కొనిన నేమిలే అని అంటారు.

తాత్పర్యము :

ఆ పురములో వెన్నెల రాత్రులందు జాళువా బంగారపు మేడలపైన [illegible]
చంద్రుడు తమ మేడమీదకు వచ్చినప్పుడు ధాటితోని కుందేలును [illegible]

గుజ్జెనగూళ్ళ ఆటల్లోపడి మరచి, చంద్రుడు దూరం పోవడం చూచి విచారించి, అయితేనేమి, ఇది వంటఇంటి కుందేలేగదా ఎక్కడికి పోతుంది, ఈ రోజు గాకపోయినా మరేనాడైనా పట్టుకో వచ్చును, అని అనుకొంటారని తాత్పర్యము.

విశేషము :

చంద్రునిలోని మచ్చను శశము(కుందేలు)గా వర్ణించారు. కాబట్టే చంద్రుడు శశాంకుడు. బాలికలు పట్టతలచిన శశము అమృతఅంశుని లోనిది. అమృతము దేవతల ఆహారము. అందుచేత ఆ అమృతమును తన కిరణాలనుంచి ఇచ్చే అమృతాంశుని భోజనపాత్రగను, వంటఇల్లుగను కవులు చమత్కరిస్తారు. కాబట్టి ఈ శశము అమృతపు వంట ఇంటి లోనిది. ఇక్కడ అమృతాంశుడు అన్నది సాభిప్రాయమైన పదము. అందుచేత ఈ శశము అక్షరాలా వంట ఇంటి కుందేలు. ఇంతేగాక, పద్యములోని శశము, ఆ బాలికలు గుజ్జెనగూళ్ళు వండుకుంటున్న ఇంటికి (వంట ఇంటికి) వచ్చి వారు ఆటల సందడిలో ఉండగా అవలకు పోయిన కుందేలు. అనగా వంట ఇంటి రుచిమరిగినది కాబట్టి మళ్ళా రాకుండా ఉండదు, అని చమత్కారము. పిల్లిగాని, చెవులపిల్లిగాని రుచిమరిగినచోటికి మళ్ళీరాక తప్పదని కుందేలు వేటగాళ్ళంటారు.

అలంకారము :

లోకోక్తి, అతిశయోక్తి.

పున్నమరేలఁ దత్పురము పొంతనె పో శిఖరాళి దాఁకి వి
చ్ఛిన్నగతిౕ సుధారసము చింది పయిం దిగవాఱు నంతనుం
డి న్నెల సన్నగిల్లు; నది నిక్కము గాదనిరేని యా పదా
ర్థన్నె పసిండి మేడలకు రాఁబనియే మిటు సౌధనామముల్? 72

పైపద్యములోని జాణవా మేలిపసిండి సోయగపు మేడలకు సౌధములు అన్నపేరు కల్గడానికి కారణము, మేడల శిఖరాలు గుచ్చుకొనడంవల్ల పూర్ణచంద్రుడిలోని సుధ (అమృతము) కారి వాటిమీద ప్రవహించడం వల్లనే అని కవి చమత్కరించాడు.

కాబట్టే పున్నమనాటినుండి చంద్రుడు క్షీణిస్తుంటాడని రుజువు చేశాడు.

అసలు సౌధము అనడానికి కారణము : సుధతో అనగా సున్నముతో కట్టబడినది అని.

అర్థము :

పున్నమరేలౕ = పున్నమరాత్రులందు, చంద్రుడు, తత్పురము = ఆ పట్టణము, పొంతనె = చేరువగా, పోౕ = పోవునప్పుడు, శిఖర ఆళి = (మేడల) శిఖరాల వరుస, తాకి = తగిలి (గుచ్చుకొని), విచ్ఛిన్నగతిౕ = చిదుగడంవల్ల, సుధారసము = (చంద్రుడిలోని)

అమృతరసము, చింది = ఒలికి, పయిన్ = మేడలమీద (నిలువునా), దిగవాఱన్ = జారగా, అంతనుండిన్ = ఆ పున్నమనాటినుండి, నెల = చంద్రుడు, సన్నగిల్లు = క్షీణిస్తుంటాడు, అది = ఆ మాట, నిక్కము = సత్యము, కాదనిరేని, ఆ పదారు వన్నె, పసింది = బంగారు, మేడలకు, ఇటన్ = ఈ ప్రదేశమునందు, సౌధనామముల్ = సుధతోకట్టిన సౌధములు అన్న పేరులు, రాన్ = వచ్చుటకు, పనియేమి = కారణమేమి ?

ఆ పురములోని మేడలు అంత ఎత్తుగ నున్నాయని భావము.

*పాఠాంతరము :*

'రా బని యే మిల'

*అలంకారము :*

ఉత్ప్రేక్ష, నిరుక్తి, అతిశయోక్తి.

వేడుక నప్పురీ హరుల వేగము గన్గొని లేళ్లు గాడ్పుతోఁ
"గూడి చనన్వలెన్ మనము, కూడఁగ నోపక యోడినట్టి వా
రోడనివారి మోచుట"ని యొద్దికఁ బందెమువైచి కూడలే
కోడెను గాక, మోయఁగఁ బ్రయోజన మే మనిలుం గురంగముల్? 73

వేగముగా పోవడానికి లేళ్ళు, గాలి ప్రసిద్ధమైనవి.

ఇక్కడి గుర్రాలు వాయువేగముగ పోగలవు అని కవి అభిప్రాయము.

వాయుదేవుడికి లేడి వాహనము అవడానికి కారణము కవి ఈ పద్యమున చమత్కారముగా సూచించాడు.

*అర్థము :*

అప్పురీహరులు = ఆ నగరమందలి గుర్రములయొక్క, వేగమున్ = వడిగల పరుగును, వేడుకన్ = కుతూహలముతో, కన్గొని = చూచి(చూచినవి లేళ్లూ, గాడ్పూ), లేళ్లు, గాడ్పుతోన్ = (వడిగ వీచే గాలికి గాడ్పు అంటారు) గాలితో, "మనము, కూడి = ఆ గుర్రములతో కూడి, చనన్వలెన్ = పరుగెత్తవలెను, కూడఁగన్ ఓపక = కలసి పరుగెత్తలేక, ఓడినవారు = అపజయముపొందినవారు, ఓడనివారిని = గెల్చినవారిని, మోచుట = మోయడము", అని, ఒద్దికన్ = స్నేహభావముతో, పందెమువైచి = పందెము వేసుకొని, కూడలేక = పరుగెత్తలేక, (లేళ్ళు) ఓడెన్ = ఓడిపోయాయి, కాక = అలాకాకపోతే, అనిలున్ = వాయువును, కురంగముల్ = లేళ్ళు, మోయఁగన్ = మోయడానికి, ప్రయోజన మేమి ? (కారణమేమి) దేని కొరకు ?

తాత్పర్యము :

ఇంద్రప్రస్థంలోని గుఱ్ఱాలు చాల వడిగలిగి వాయువేగంగా పోగలవని భావము.

విశేషము :

ఒడ్డికఁ = విరోధముతో గాక ఆటలలో సహజమయిన స్నేహభావముతో వేసిన పందెము అని. ఈ ఒడ్డిక పందెము వేయడమూ, వేడుకతో కనుగొనడమూ అన్న మాటలవల్ల, మన కవి ఆటలలో మంచి అనుభవమూ, కుతూహలమూ కలవాడని తేటపడుతుంది.

ఏదైనా ఒక ఆట నేర్చినవారు ఇంకొకరు ఆ ఆటనే చమత్కారముగా ఆడడం చూచి అసూయాదులు పొందక ఎంతో వేడుకపొందుతారు ; ఇది ఆటగాంద్ర సల్లక్షణము. అందుకే పద్యారంభంలో 'వేడుకఁ' అని ప్రయోగించి కవి దానికి ప్రాధాన్యమిచ్చాడు. అలా వేడుకతో చూచిన తరువాత ఆ విధంగా ఆడాలన్న ఉత్సాహం కలగడమూ, ఒడ్డిక పందెము వేసుకోవడమూ అత్యంత సహజములు.

గుఱ్ఱాలు వాయువేగంగా పోతాయనడానికి బదులు ఈ పద్యములో కవి "వాయువు అశ్వ వేగంతో పోతుం"దని చమత్కరించాడు.

లేళ్లనే తొలుత పందెమునకు కాలు దువ్వినట్లు చెప్పి, తుదకు వాటినే ఓడించడం వల్ల కవి, ఆటలలోని సారస్యం వెల్లడి చేశాడు.

గుఱ్ఱముతో పందెము కాబట్టి ఓడినవారు సవారీ మోయుటగూడా చమత్కారమే. పిల్లల ఆటలలో, ఓడినవాడు గెలిచిన వానిని మోసుకొని కొంతదూరము నడవడం ఇప్పటికీ వాడుకలో ఉంది.

వసుచరిత్రలో "సతియూరు ద్యుతి" అన్న పద్యములో ఈలాగే గిరికాదేవి తొడలను చూచి అరటిచెట్టూ ఏనుగు తొండమూ స్పర్థవహిస్తాయి. ఏనుగు తొండము నెగ్గజాలక వైరము పూనుతుంది.

మన కవి తన సారంగధర చరిత్రలో వర్ణించిన పావురా పందాలు చాల స్వభావ సిద్ధంగా ఉండి, అతనికి ఆటలలో ఉన్న చక్కని అనుభవాన్ని ప్రకటిస్తాయి.

రఘునాథరాజు చెప్పినట్టు "క్షత్రధర్మమ్మె" కలవాడు కాబట్టి, చేమకూరకవి సాము గరిడీలు, ఆటలూ బాగా అభ్యాసం చేసి ఉంటాడు.

అలంకారము :

ఉత్ప్రేక్ష, స్వభావోక్తి.

చుట్టును గట్టియుండు నొకచో నెడ మించుక లేకయుండఁ ద
త్పట్టణ బాహ్యభూముల మదావళ మండల మేమిచెప్పఁ, ని
ట్టట్టు దెమల్పరా కరి భయంకరమై దివితోడ రాయుచున్
బెట్టనికోట గాదె గజబృందము లెందును రాజధానికిన్. 74

'గజబృందములు నగరానికి పెట్టని కోటవంటివి' అన్న సత్యాన్ని కొన్ని సమాన లక్షణాలను చూపుతూ కవి ఈ పద్యములో సాధిస్తున్నాడు.

అర్థము :

మదావళ = ఏనుగులయొక్క, మండలము = (వలయము) సమూహము, ఇట్టు అట్టు తెమల్పఁగారాక = ఇటుకాని అటుకాని కదల్చడానికి సాధ్యము గాకుండ, అరి భయంకరమై = శత్రువులకు భయముకలుగజేసే దయి, దివితోడన్ = ఆకాశముతో, రాయుచున్ = రాపాడుతూ (మిక్కిలి ఎత్తయిన వన్న మాట), ఒకచోన్ = ఏచోటనైనను, ఎడము ఇంచుక లేక = సందు ఏమాత్రమును లేక, తత్పట్టణ = ఆ పురముయొక్క, బాహ్యభూములన్ = వెలుపలి ప్రదేశములయందు, చుట్టును = అన్ని ప్రక్కలను, కట్టియుండును = కట్టబడియుండును, ఏమి, చెప్పఁగా = చెప్పుటకు వీలుకాదు (అత్యాశ్చర్యకరము), ఎందును = ఏ విధముగా చూచినా, రాజధానికిన్ = రాజధానీనగరానికి, గజబృందము = ఏనుగుల సమూహము, పెట్టనికోట కాదె = (రాయిమొదలగు వస్తువులతో) నిర్మించని కోటగోడయే కదా!

విశేషము :

కోటగోడకూ గజములవలయానికీ సమానధర్మాలు. 1. చుట్టూకట్టి ఉండడం; 2. ఎడమించుక లేక ఉండడం—కోటగోడకు సహజముగా సందులుండవు; ఏనుగులను చాల దగ్గరదగ్గరగా కట్టిఉస్తారు. 3. పట్టణ బాహ్యభూములలో ఉండడం—నగరం కోటలోపలనే ఉంటుంది. కాబట్టి కోటగోడ నగరం వెలుపలే ఉంటుంది. ఏనుగులను గూడా బాహ్యభూముల్లోనే కడతారు; 4. ఇట్టట్టు తెమల్పరాకుండడం; 5.అరిభయంకరమై ఉండడం; (కోటశత్రువులకు దుర్భేద్యముగా ఉంటుంది. ఆ దినాలలో చతురంగాలలో గజబలము శత్రువులకు భయకారణమే కదా!) 6. దివితోడ రాస్తుండడం. (కోటగోడలు ఆకాశాన్నంటుతున్నవా అన్నంత ఎత్తుగా వుంటాయి; ఏనుగులు గూడా అంతే).

ఈ పద్యంలో చేమకూరకవి కవితా పద్ధతి కొంత సుస్పష్టమవుతుంది. "పెట్టని కోట గాదె" అన్న మాటలకు "కోట లాగానే రాజధానిని కాపాడుతూ ఉంటుంది" అని, స్థూలంగా చెప్పి సంతోషించడు. అంగాంగ సాదృశ్యం ప్రకటిస్తూ, ఆ మాటలలో ఉన్న సత్యాన్ని కరతలామలకంగా కనబరుస్తాడు. పలుకుబడులూ, సామెతలూ తన రచనలో ఉపయోగించినప్పు

డంతా ఈ సూత్రాన్నే పాటిస్తుంటాడు. ఆ పరిశీలనతోనే మనమూ పఠించాలి; అప్పుడే కవి హృదయాన్ని తెలుసుకోగలుగుతాము.

చుట్టూకట్టి ఉంచే ఏనుగుల సమూహానికి పుంజము, వరుస, బృందము అనకుండా వలయాకారాన్ని సూచించే మండలము అన్న పదం ప్రయోగించడం సాభిప్రాయము.

పాఠాంతరము :

"డెమల్పరా కరి భయంకరమై దివితోడ రాయు:
నా; పెట్టని గోడ గాదె..."

— వేంకట కృష్ణమాచార్యులు.

అలంకారము :

అర్థాంతరన్యాసము, రూపకము, పరికరము.

గాళకు లాపురీ భటశిఖామణు లెక్కటి యుక్కు తున్క; లా
ఖీల తరాశనుల్ చిదిమిపెట్టిన బంటులు; పోరికల్ల బే
తాళుఁడు వచ్చి డగ్గఱిన దబ్బరగా దొక దెబ్బతీయఁగాఁ
జాలుదు; రేమి చెప్ప! మఱి సాదన నేటును సాహసమ్మునున్. 75

అర్థము :

గాళకులు = దిట్టలైనటువంటి, అపురీ భట శిఖామణులు = అపురము నందలి శ్రేష్ఠులైన భటులు, ఎక్కటి = ఈడులేని, ఉక్కుతున్కలు = ఉక్కుముక్కలు, ఆఖీలతర = మిక్కిలి భయంకరమైన, అశనుల్ = పిడుగులను, చిదిమిపెట్టిన = చిన్నచిన్న ముక్కలుగా నరికివేయ గలిగిన, బంటులు = వీరులు (బంటియొక్క బహువచనము బంటులు కాబట్టి, చిదిమిపెట్టిన బంటులు = చిదిమివేసేపాటి వారు అని అర్థం. మోకాలు బంటి అన్నప్పుడు లాగానే పరి మాణాన్ని తెల్పుతుంది), పోరికి = యుద్ధమునకు, అల్ల బేతాళుఁడు = సుప్రసిద్ధుడైన అపిశాచ నాథుడు, వచ్చిడగ్గఱినన్ = సమీపించినా, దబ్బరగాదు = అబద్ధముకాదు, ఒకదెబ్బ తీయఁగాన్ = వానిని కొట్టిపంపించడానికి, చాలుదురు = చాలినంత సాహసంకలవారు, (వారి) సాదనన్ = పరి శ్రమను, ఏటును = వేటు బలమును, సాహసమ్మునున్ = తెగువను, మఱి ఏమిచెప్పన్ = ఇంకేమి చెప్పగలము! అనగా అత్యద్భుతము అన్నమాట.

తాత్పర్యము :

అక్కడి భటులు ఉక్కుతునకలలాగ గట్టిపడిన శరీరము కలవారు. పిడుగునైనా చిదిమి పెట్టగల ఏటువాటము కలవారు. బేతాళుడే వచ్చినా అతడిని కొట్టి పంపించగల సాహస మున్నవారు అని భావము.

*విశేషము :*

గరిడీసాధనలో శరీరము గట్టిపడడంవల్ల ఉక్కు-తున్కలు ; ఏటున (కత్తిదెబ్బతో) పిడుగులను సైతము చిన్నచిన్న ముక్కలుగా చిదిమిపెట్టేపాటి వారు ; సాహసములో బేతాళుడంతటి వానినిగూడా ఒక దెబ్బతీయజాలినవారు అని క్రమము.

పందిని వేసినవాడే బంటు అంటాము. ఇక్కడ బంటు అంటే పోటరి అనే అర్థం.

*పాఠాంతరము :*

ఈ పద్యముగూడా మన వ్యాఖ్యాతలకూ, పరిష్కర్తలకూ, కొంచెం చిక్కు కల్పించింది. అందుచేతనే దీనికి పాఠాంతరాలు మూడు నాలుగు కనిపిస్తున్నాయి.

"అఖిల తరాశనుల్ చిదిమి
పెట్టిన బంటులు వైరికెల్లఁ బే
తాలుడు వచ్చి...."

వేదము వారూ, బులుసు వారూ.

ఈ పాఠముతో వేంకటరాయ శాస్త్రిగారు, "వైరికిన్ ఎల్లన్ = ఎల్ల పగతురకును, అఖిలతరాశనుల్ = మిక్కిలి భయంకరమైన పిడుగులను, చిదిమిపెట్టిన బంటులు = చిదిపిచేసిన కొలఁదివారు (ఇట బంటిశబ్దము పరిమాణార్థకము)"అని వ్యాఖ్యానించారు. "ఎల్లపగతురకు భయంకరమైన పిడుగులను చిదిపి చేసిన కొలదివారు" అంటే ఏమిటో ? దీనిలో సందిగ్ధంగా ఉన్న భావాన్ని ఆతరువాత, "ఏటున అశని తుల్యులై" అని వారే వివరించారు. అంటే పిడుగుతో సమానమైన ఏటుగల వారన్నమాట. అప్పుడు చిదిమిపెట్టిన బంటు లనడమెందుకు ?

బులుసువారు "వైరికెల్ల" తరువాత : ఈగుర్తుపెట్టి, 'శత్రువులందరికి మిక్కిలి భయంకరములైన పిడుగులైనవారు; చిదిపి సరిసమానముగ చేసిన పరిమాణము కలవారు' అని అర్థం ఇచ్చారు. వీరు ఈ పద్యభాగాన్ని రెండుముక్కలుచేసి (1) శత్రువులకు పిడుగులైనవారు (2) సరిసమానముగ చేసిన పరిమాణము కలవారు - ఒడ్డూ పొడవూ ఒక్కలాగే ఉన్నవారు అన్న భావాన్ని సూచించారు. దీనిలో క్రమాలంకారము దెబ్బతింటుంది.

ఏలాగు చూచినా, వైరికెల్ల అన్నమాటలు 'చిదిమిపెట్టిన బంటుల'తో కలిపి, సరళమైన అన్వయం చూపలేము.

2. అందుకే గాబోలు తిరుపతికవులూ, వేంకటకృష్ణమాచార్యులవారూ, నోరి గురులింగ శాస్త్రిగారూ-అందరూ -

...చిదిమిపెట్టిన బంటులు వైరికల్లఁ బే
తాలుడు వచ్చి డగ్గరిన ....

అన్నపాఠాన్నే పాటించారు.

అప్పుడు 'వైరికి' అంటే వైరిసహాయార్థము, అల్ల బేతాలుడు వచ్చి, డగ్గరిన = ఎదిరించిన అని ఊహించారో, లేక,

వైరికి అంటే వైరానికి - ధర్మిధర్మ సంబంధముతో - అన్వయించారో తెలుసుకోడానికవకాశములేదు.

ఈబాధ తప్పించుకోడానికి "వోరికల్ల బేతాలుడు" అని చదవడం సమంజసంగా కనిపించింది. దీనితో పద్యములోని క్రమము చాల చక్కగా కుదురుతుంది.

ఈ క్రమంలో రెండోవిషయం 'ఏటును'గురించి. ఏటు అంటే కత్తివ్రేటు, నరుకు, వోటు. ఆ ఏటు అఖిలతరాశనులనుగూడ చిదిమి చిన్నచిన్న ముక్కలుగా చేయగలదన్నమాట.

వైరికెల్ల అన్నమాటల తరవాత కామాగాని, సెమికోలన్‌గాని పెట్టి వాక్యాలు విరిస్తే, "బేతాలుడు" తన ప్రసిద్ధి వాచకం లేకుండ, 'బోడి' బేతాలుడౌతాడు.

3. మరొక్క పాఠం :

"సాదన మేలును సాహసంబునుఁ"

దీనిలో క్రమాలంకారముందన్న దృష్టే కనిపించదు.

అలంకారము :

క్రమం.

ఆరామసీమల యందు నుండి పవళ్ళు
ముదమెసంగ వసంతుఁ డెదురుసూచు,
మునిమాపుకడలఁ గ్రొన్ననవింటి నెఱజోదు
కేళిమందిరముల కెలనఁ జూచుఁ,
ప్రొద్దుపోయినవేళ రోహిణీ ప్రాణేశుఁ
డుదిరిమేడలమీఁద వెదకి చూచుఁ,
దెలతెలవాఱంగ మలయ గంధవహుండు
సోరణ గండ్లలోఁ జొచ్చిచూచు,
నాపురి విలాసవతుల యొయ్యారములకుఁ
గడుసొగసి వారిరాకలు కాచికాచి;
విరహులఁ గలంచువారె యివ్విధముగాఁగ,
నున్నవారల నిఁక వేఱె యెన్ననేల ? 76

వియోగంలో ఉన్న ప్రేమికులకు విరహవేదన కల్గించేవారు: వసంత, మన్మథ, చంద్ర, మలయానిలులు. వీరు గూడా ఇంద్రప్రస్థములోని అందకత్తెల సౌందర్యానికి ముగ్ధులై, వారి రాకల కోసం కాచికాచి, అవస్థపడుతూ ఉంటారని కవి చమత్కారంగా ఆ యువతుల సౌందర్యాన్ని వర్ణిస్తున్నాడు.

అర్థము :

ఆపురి విలాసవతుల = ఆ పట్టణములోని సొగసుకత్తెల, ఒయ్యారములకు = విలాసాలకు-వారి విలాసచేష్టలు చూచి, కడుసొగసి = మిక్కిలి మోహించి, వారి = ఆవిలాసవతుల, రాకలు = రాకపోకల సమయాలు, కాచికాచి = (ఎప్పుడు చూడ గల్గుదుమా అని ఎక్కువగా) కని పెట్టుకొని,

౧. వసంతుడు, పవళ్ళ = పగటిపూటలయందు, ఆరామసీమల యందున్ = ఉద్యానవన ప్రదేశములందు, ఉండి, ముద మెసంగగన్ = సంతోషము కలుగునట్లు, ఎదురుచూచుగా = నిరీక్షిస్తుంటాడు;

౨. క్రొన్ననవింటి నెఱజోదు = క్రొత్తపూవులతో చేయబడిన విల్లుకల గొప్ప వీరుడు (మన్మథుడు), మునిమాపు కడలగా = సాయంకాలము (చీకటిపడుతుండే) వేళలలో, కేళిమందిర ముల కెలనగా = పడకగదుల వైపు, చూచుగా;

౩. రోహిణీ ప్రాణేశుఁడు = రోహిణీ (నక్షత్ర) భర్త (చంద్రుడు), ప్రొద్దుపోయిన వేళన్ = రాత్రులయందు, ఉదిరి మేడల మీఁదగా = బంగారు మేడల పైభాగములందు, వెదకి చూచుగా;

౪. మలయ గంధవహుండు = మలయమారుతము (దక్షిణమునుంచి వచ్చు చల్లనిగాలి), తెలతెల వాఱంగన్ = తెల్లవారుజామున, సోరణగండ్ల లోగా = కిటికీలలో, చొచ్చిచూచున్;

(ఇటుల) విరహులగా = వియోగములో ఉన్నవారిని, కలంచువారె = బాధపెట్టేవారే - ఈ వసంత, మన్మథ, చంద్ర, గంధవహులే, ఇవ్విధము కాగన్ = ఈ విధముగా అయినప్పుడు (అనగా తహతహ పడునప్పుడు), ఉన్నవారలగా = తక్కినవారిని - సాధారణ మానవులను, ఇఁక వేఱె యెన్న నేల = ఇంకా ప్రత్యేకించి చెప్పవలసిన అవసరమేముంది ?

విశేషములు :

ఒయ్యారవతులు పగటి పూటలలో ఉద్యానవనాలలో విహరిస్తుంటారని తెలిసే వసంతుడు అక్కడ కాచుకొని ఉంటాడు. మునిమాపు వేళలందు ఆ సుందరాంగులు తమ పడక గదులు అలంకరించుకుంటూ ఉంటారు కాబట్టి, మన్మథుడు వారికోసం ఆ ప్రదేశాలను కనిపెట్టు కొని ఉంటాడు. రాత్రివేళలందు ఈ కాంతలు మేడలపై వెన్నెలలో విహరిస్తుంటారు కాబట్టి, చంద్రుడు ఆ ధాబాలమీద వారికోసం వెదకుతుంటాడు. తెల్లవారుజామున వారు సుఖముగా వారి

గదులలో నిద్రిస్తుంటారు కాబట్టి, మలయ పవనుడు కిటికీలగుండా ఆగదులలో ప్రవేశించి చూస్తుంటాడు.

ఈ పద్యంలో వసంతుడు ఎదురు చూస్తాడని, మన్మథుడు కెలన చూస్తాడని, చంద్రుడు వెదకి చూస్తాడని, గంధవహుడు దొచ్చి చూస్తాడని, నాలుగు విధములుగా వారు కనిపెట్టుకొని ఉంటారని ఎంతో చక్కగా కవి ప్రకటించాడు.

ఈ కాంతలు ఉద్యానవనాలకు వెళ్ళినప్పుడు. అంతకు ముందే అక్కడున్న వసంతుడు వారికై "ఎదురుచూచు" నట్లుంటుంది.

మునిమాపు వేళల ఈ సొగసుకత్తెలు తమ కేళిమందిరములలో ఉన్నప్పుడు, మన్మథుడు వారికి కానరాకుండా పొంచి చూస్తుంటాడు కాబట్టి "కెలన"—ప్రక్కవాటుగా చూచినట్టుంటుంది.

రాత్రులు చంద్రుడు (తన గమనా న్ననుసరించి) ఒక మేడ తర్వాత ఇంకొక మేడ మీదికి తన కాంతి ప్రసరింప జేస్తుంటాడు గాబట్టి "వెదకి" చూస్తున్నట్టే ఉంటుంది.

రాత్రి కేళిలో బడలిన సుందరులు తెల్లవారుజామున నిద్రిస్తుంటారు కాబట్టి, పవనుడు నిర్భయముగా కిటికీలగుండా గదులలో ప్రవేశిస్తాడు, "దొచ్చి" చూస్తున్నట్టుంటుంది.

ఏ స్థలంలో ఏ సమయంలో ఈ సొగసుకత్తెలను చూడడానికి తమకు అనుకూలంగా ఉంటుందో అదంతా బాగా తెలుసుకొనే ఈ విధంగా ప్రవర్తిస్తారు. ఈ పద్యంలో ఉన్నవారు విలాసవతులు కాబట్టి వారికి ఇంటి పనిపాటులులేవు. పగళ్ళు ఉద్యానవనవిహారాలు, సాయం కాలముల పడకగదుల అలంకరణ, రాత్రులలో మేడలమీద క్రీడలు, తెల్లవారువరకు నిద్ర.

పాఠాంతరాలు :

1. ఆ పురి విలాసవతుల యొయ్యారములకు
   కడుసొలసి వారిరాకలు......

2. విరహుల గలంచువారె యీ పెతలు పడఁగ.....
   — వేంకటకృష్ణమాచార్యులు

అలంకారము :

కావ్యార్థాపత్తి.

మగవానిని మగవాఁడును
మగువను మగువయును వలచు; మఱి యేమన న
న్నగరపు రాజకుమారుల
జిగిబిగి సోయగము, చెలుల సింగారమ్మున్. 77

*అర్థము :*

రాజకుమారులలో, మగవానిని, మగవాడే ప్రేమిస్తాడు. రాజకుమార్తెలలో, మగువను మగువయును = స్త్రీని స్త్రీయే, వలచుఁ = ప్రేమిస్తుంది. ఆ నగరపు రాజకుమారుల (యొక్క) జిగిబిగి సోయగము = కాంతీ పటుత్వమూ కలిగి ఉన్న సౌందర్యమునూ, చెలుల = (ఆరాజ కుమారికల, సింగారమ్మున్ = అలంకరణ విధానమును, మఱి, యేమి అనఁ = ఇంతకు ఎక్కువగా ఏమి చెప్పగలము.

*విశేషము :*

మగవానిని మగువా, మగువను మగవాడూ ప్రేమించడం ఉందిగాని, మగవాడిని మగవాడూ, మగువను మగువా ప్రేమించడ మంటే — ఇదేదో విపరీతంగా కనబడుతుంది. కాని— మగవారిని మగవారు వలవడం క్రొత్తదికాదు. శ్రీరాముని ఋషులు వలచి అవల కృష్ణావతారములో గోపికలైనారని పురాణ ప్రసిద్ధి ఉన్నది కదా!

జిగిబిగి సోయగము = కాంతితోకూడిన పటుత్వము — ఆకారసౌష్ఠవముతో కూడిన శరీరపటుత్వముకల రాజకుమారులను చూచి మగవారుకూడ ముచ్చట పడతారన్న మాట.

ఆలాగే రాజకుమారికలు తాము సింగారించుకోడములో కనబరిచే కళాభిరుచీ, సౌందర్య దృష్టీ, రచనా నైపుణ్యమూ, అహ్లాదకరంగా ఉండి, ఆడువారిని సైతం ఆకర్షిస్తాయని భావము.

*పాఠాంతరము :*

మగవానికి మగవాడును
మగువకు మగువయును వలచు....

తిరుపతివారూ, వేంకటకృష్ణమాచార్యులవారూ.

*అలంకారము :*

క్రమము.

పొలయలుకల్ వహించి వలపుల్ మొలిపించు పిసాలి గబ్బి గు
బ్బల జవరాండ్రు మై గగురుపాటున, "నేటికి వచ్చెనమ్మ యీ
పిలువని పేరఁటం" బనుచు బెగ్గిలి, నాథులఁ గౌఁగిలింపఁగాఁ
బొలుపుగ నందుఁ బెండ్లి నడుపుల్ నడుపున్ వలి నాలి తెమ్మెరల్. 78

యౌవనవతులు అప్పుడప్పుడు లేనికోపం ఉన్నట్టు నటిస్తుంటారు. దీనినే ప్రణయకోపం అంటారు. ఈలాగు చేసినందువల్ల వారి ప్రియుల ప్రేమ నిత్యనూతనంగా అభివృద్ధిపొంది అల్లుకుంటుం

దని నమ్మకము. కాబట్టి ఆ సుందరులు ప్రియుల లాలనలకూ ప్రార్థనలకూ లొంగకుండా వీలయినంత కాలం బింకం చూపుతుంటారు. అటువంటి యువతులను ఈ పద్యంలో కవి బాల చమత్కారంగా వర్ణిస్తున్నాడు.

అర్థము :

పొలయలుకల్ = ప్రణయకోపం, వహించి = అవలంబించి—పూని, వలపుల్ = ప్రేమలను, మొలిపించు = అంకురింపజేసి - అభివృద్ధిపరిచే - (ఉద్దేశముతో ఉన్న). పిసాలి = మనోహరమై, గబ్బి = బలిసి ఉన్న, గుబ్బల = స్తనాలుకల, జవరాండ్రు = యౌవనంలో ఉన్న సుందరాంగులు, (చల్లని మలయమారుతం _ వలినాలి తెమ్మెర - వీచినందువల్ల) మై = శరీరము, గగురుపాటునన్ = జలదరించినందువల్ల, (చలివల్లా, కామోద్దీపనవల్లా మైగగురుపాటు), బెగ్గిలి = అయ్యో బింకం సాగనీయ లేదే అని చింతించి, ఏటికి వచ్చెనమ్మ ఈ పిలువని పేరటంబు = అనవసరమైన జోక్యం కలిగించుకొని ఈచలిగాలి ఎందుకువచ్చిందమ్మా, అనుచున్ = అని గొణుగుకొంటూ, నాథులన్ = ప్రియులను, కౌఁగిలింపగాన్ = (తమంతట తామే పోయి) కౌగిలించేలాగ చేస్తూ, వలి = చల్లని, నాలి = మందంగావీచే, తెమ్మెరల్ = గాలులు, అందు = ఆ ఇంద్రప్రస్థపురంలో, పెండ్లి నడుపుల్ = నాయికా నాయకులను కలపడమనే పెళ్ళి కార్యాలను, పొలుపుగన్ = అందంగా, నడుపున్ = సాగిస్తూ ఉంటాయి.

తాత్పర్యము :

ప్రణయకోపంతో బింకంచూపుతూ ప్రియుల లాలనలకు లొంగకుండా ఉన్న యువతులు, చల్లని మలయమారుతం వీచినందువల్ల, చలితోపాటు కామోద్దీపన కలిగి, తాముగా ప్రియులను ఆలింగనం చేసుకోక తప్పిందిగాదు. ఈలాగ ఈ కార్యము జరగడానికి కారణము ఈవలినాలి తెమ్మెరలే — అందుకే "పిలువని పేరటం" అని తమ అయిష్టం ప్రకటిస్తారన్న భావం.

విశేషము :

యువతుల ప్రణయకోపంలో ఉన్న అంతరార్థం "వలపుల్ మొలిపించుట" అని కవి ఒక ప్రణయ రహస్యం తెలియజేశాడు.

సాధారణంగా బింకమూ ఉద్రేకమూ చూపే వారే చివరకు అపజయం పాలౌతారన్న లోకధర్మాన్ని కవి చూపించాడు. ప్రియుల ప్రార్థనలకు లొంగకుండా బింకం సాగిస్తూ ఉన్న అందకత్తెలను, తమంతట తామే నాథులను కౌగిలించుకొనేలాగ చేసి పాఠకులకు అహ్లాదం కలిగించాడు.

దీనికి కారణం : వలినాలి తెమ్మెరలు, చల్లని మందమారుతం. ఈ మారుతం సాధారణంగా తెల్లవారుజామున వీస్తూంటుంది. అ మాటే కవి "తెలతెలవారంగ మలయగంధవహుండు సొరణ గండ్లలో చొచ్చి చూచు" అని 76 వ పద్యములో అన్నాడు. అందుచేత ఈ సంఘటన (గగురుపాటుతో ప్రియులను ఆలింగనం చేసుకోవడం) తెల్లవారుజామున జరిగిందని కవి చెప్పకుండా (ధ్వని మర్యాదను) చెప్పాడు.

ఈ ధ్వనిని అంగీకరిస్తే, ఆ రాత్రి ప్రేమికులు ఏ విధంగా గడిపారో సరసులు ఊహించుకోవచ్చు.

వివాహాలలో సాధారణంగా అన్ని పనులూ పేరంటాళ్ల చేత చేయిస్తారు. ముఖ్యంగా శోభనంనాడు పెండ్లి కూతురుని పడక గదిలోనున్న వరుడి దగ్గరకు పంపించేకార్యం పేరంటాళ్ళు చాల ఉత్సాహంతో చేస్తుంటారు. ఆ పేరంటాండ్ర పనే ఇక్కడ ఈ తెమ్మెరలు చేశాయి, నాయికను నాయకుడి దగ్గరకు పంపించాయి. కాని, వీటి నెవ్వరూ బొట్టుపెట్టి పిలువలేదు; పైగా, బింకంచూపే ఈ సమయంలో రావడం ఆ యువతులకు ఇష్టంలేదు. సామెతను ఉపయోగించిన అందము చూడండి.

ఇష్టంలేని పనే కాబట్టి ఈ గాలులను 'నాలి' తెమ్మెరలని కవి అన్నాడు. నాలి అంటే మెల్లన అనేకాక, కుచ్చితపు — వంచకపు అన్న అర్థాలుగూడ ఉన్నాయి. చూడండి: నాలిముచ్చు-నాలిమాటలు మొదలయినవి. ఇష్టంలేకపోవడం సూచిస్తూ ఈ నాలి చక్కని అర్థగౌరవంతో ప్రయోగించాడు కవి.

పెండ్లి నడుపుల్ అంటే 'పెండ్లినడకలు' అనిగూడ అర్థముంది. పెండ్లినడక ఒక పలుకుబడి, మెల్లగాసాగేది అని అర్థం. చూడండి : ఏమిటా పెండ్లినడకలు, త్వరగా రండి అంటాము. అప్పుడు "పెండ్లి నడుపుల్ నడుపున్ = పెండ్లినడకలు సాగించును" అని అర్థం గూడ చెప్పుకోవాలి. అందుకే 'నాలి' = మెల్లన అన్నాడు కవి.

*పాఠాంతరము :*

> (1) పొలయలు కానియున్న పువుఁబోఁణులు, ఖండిత నాయకా లలా
> మలు, మది నియ్యకోల్ వలయు మానిను 'లేటికి వచ్చెనమ్మ తాఁ
> బిలువని పేరఁటం'బనుచు......
>
> —వేంకటరాయశాస్త్రిగారి పాఠం.

ఈ పాఠంలో మూడు విధాలైన యువతులున్నారు.

(౧) పొలయలుక గలవారు, (౨) ఖండితనాయకా లలామలు (ప్రియుడు ఇంకొక స్త్రీతోగడిపి ఇంటికి వచ్చినందుకు అలిగిన కాంతలు), (౩) మదిని ఇయ్యకోల్ వలయు మానినులు (ప్రియులు తమ్ము ప్రార్థించి తమ్ము ఒప్పించవలెనని కోరే మానవతులు).

ఈ పాఠములో "మైగగురుపాటు" (రోమాంచం) అన్నకారణం కానరాదు. అంతేకాక, ఈ పాఠములో చేమకూర రుచి గూడా కనబడదు.

మరొక పాఠం :

(2) కలియఁగ నందు పెండ్లి
నడకల్ నడుచున్ వలినాలి తెమ్మెరల్.

—తిరుపతివారు చూపినది.

ఈ పాఠములో మందగమనమే ఉంది గాని, పేరంటాల పని ఏమీ కనబడదు. 'పిలువని పేరంటము' అన్న పలుకుబడిలోని రెండో సొగసు అంతరించిపోతుంది.

(3) పెండ్లినడుపుల్ నడుచున్ వలినాలి తెమ్మెరల్.

—ఇది మరొక పాఠము.

దీనిలో గూడా మందగమనమే ఉంది గాని పెండ్లికార్యములేమ. పేరంటం కుంటుపడు తుంది.

ఆ నగరములోని యువతీయువకుల ప్రణయ జీవితం ఈ పద్యాన్నిబట్టి ఊహించు కోవచ్చును.

*అలంకారము :*

లోకోక్తి.

## పుష్పలావికలు

ప్రాయపు నాయకుల్ వెల నెపాన నెనాదిగఁజూడ, "నేర్పు లౌ
రా యువి, దండమీఁదఁ గొసరం దొరకొంటిరి, మంచి సాములే
పో, యటులైనచో సరసముల్ గద మీకిపు" డంచు నప్పురిఁ
గాయజు తూపు లమ్ముదురు కందువ మాటలఁ బుష్పలావికల్. 79

ఇంద్రప్రస్థనగరంలో పూవులమ్మే అందకత్తెలకూ, బేరమాడే నెపముతో సరసాలకు పూనుకొనే వయసుకాండ్రకూ జరిగిన ఒక సన్నివేశాన్ని కవి ఈ పద్యములో వర్ణించాడు.

ఈ పుష్పలావికా వర్ణనలలో (1) పూవుల బేరాలకు సంబంధించిన అర్థమూ, (2) సరసాలకు సంబంధించిన అర్థమూ (రెండూ) ఉంటాయని వేరే చెప్పనక్కరలేదు.

అర్థము :

(౧) పూవులకు సంబంధించిన అర్థము —

ప్రాయపు = మంచి వయసులో ఉన్న, నాయకుల్ = (కవి దృష్టినున్నవారు తంజావూరి నాయకులే) ప్రభువులు, వెల = (వారు కొనబోయే పూవుదండల) ఖరీదును, నెపానన్ = ఏదో ఒక నెపము పెట్టి (వెల తగ్గించడానికి వీలు లేకపోతే కొసరు పేరున మరొక దండ తీసుకొనడానికి), ఎగాదిగఁ జూడఁ = దండలు ఎక్కువ చేయడానికో వెల తక్కువ చేయడానికో ప్రయత్నిస్తుంటే, పుష్పలావికల్ = పూలూ పూలదండలూ పూలచెండ్లూ అమ్మే యువతులు, "ఏర్పులు ఔరా ఇవి = మీరు తీసిన దండలన్నీ ఏర్చి యేర్చి తీశారుగదా! మంచి మంచి వాటినే మీరు ఎంచినారే (మిగిలిన వాటికి సరియైన వెలరాదని భావము), మీఁదఁ = పైపెచ్చు, దండ = మరొక పూలదండను, కొసరఁ = కొసరుగా తీసుకోడానికి, దొర కొంటిరి = పూనుకున్నారు, మంచిసాములే పో = మంచిప్రభువులేపొండి (ఇక మేము బ్రతికినట్టే లెండి), అటుల ఐనచోఁ = మీరడిగిన కొసరు లేకుండానే, మీకిపుడు సరసముల్ గద = చాలచవుకగా వచ్చినట్టుకాదా", అంచున్ = అని సమాధానము చెప్పుతూ, అప్పురిన్ = ఆఇంద్ర ప్రస్థపురములో, కందువమాటలన్ = నేర్పుగల మాటలతో, కాయజుతూపులు = (మన్మథుని బాణాలైన) పూవులను, అమ్ముదురు = అమ్ముతుంటారు, దక్షిణాదిని సరసమంటే చవుక అని ఇప్పటికీ వాడుక.

(౨) ఇంక సరసాలకు సంబంధించిన అర్థము —

ప్రాయపునాయకుల్ = యువకులైన శృంగారనాయకులు (సరసులు), వెల నెపానఁ = వెల (ఎంత పైకం ఇవ్వాలో) తెలుసుకుంటున్నట్టు నటిస్తూ, ఎగాదిగఁ జూడఁ = ఆ కాంతల సౌందర్యం—కిందనుంచి మీదకూ మీదనుంచి కిందకూ — నఖశిఖపర్యంతం — చూస్తూ ఉంటే, "నేర్పులు ఔరా ఇవి = ఇదేనా మీనేర్పు—ఇంతేనా మీగడుసుతనము? దండమీఁదన్ = కౌగిలి (కైదండ) వెల విషయమే, కొసరన్ = ఇంత బేరమాడడానికి, దొరకొంటిరి = పూను కున్నారు, మంచిసాములే పో = (ఆ సంకోచము మీ కక్కరలేదు) మావిమంచి మరుసాములే (రతిక్రీడలే) సుమండి, అటులైనచోఁ = అలాగ మంచి రతిక్రీడలుంటే, మీకు, ఇపుడు, సరసముల్ కద = సరసాలకు తగినవి కావా?" అంచుఁ, కందువమాటలఁ = చమత్కారమైన మాటలతో, అప్పురిఁ, కాయజుతూపులు = మన్మథుడి బాణాలు — కామోద్దీపన కలిగించేవి (పువ్వులు), అమ్ముదురు.

తాత్పర్యము :

౧. "ఏర్చి యేర్చి మంచి దండలన్నీ మీరు తీసుకున్నారు. మిగిలిన దండలను మేము తక్కువధరకే అమ్ముకోకతప్పదు. ఇంకా ఒక దండ కొసరు ఇమ్మంటున్నారు, ఇది అన్యాయం" అని నేర్పుగా మాటలాడి వారిని ఒప్పించి అమ్ముతారు— ఇది బాహ్యార్థము.

౨. "కౌగిలికి ఇవ్వవలసిన పైకం గురించే కొసరికొసరి బేరమాడుతున్నారు ; ఇదేనా మీనేర్పు ? మా రతిక్రీడలు సామాన్యమైనవి కావు. చాల మంచివి సుమండి ; మీ సరసాలకు తగినట్టు ఉంటాయి" అని చమత్కారంగా మాటలాడి ఒప్పిస్తారు— ఇది అంతరార్థము.

*విశేషము :*

మన ప్రబంధకవులు, చాలమంది, పుష్పలావికా వర్ణన చేసినవారే.

ఆ వర్ణనలో యువకులు (విటులు) గడుసుతనముతో మాటలాడడమూ, వారికి తగినట్టుగా, చమత్కారముగా ఆ పువ్వులమ్మే యువతులు బదులు చెప్పడమూ ఆహ్లాదకరంగా ఉంటాయి. అందుచేత ఈ వాక్యోపవాక్యాలలో శ్లేష చాల ప్రయోజనకారి అని చెప్పనక్కరలేదు. మనకవి వీరవిహారం చేయడా ?

"వెలఁది యీ నీ దండ వెల యెంత ?"
"నా దండకును వెలపెట్ట నెవ్వనితరంబు"

శ్రీకృష్ణదేవరాయలు.

"పొన్నపూ వొడి నేల పొదవితే చెలి ?"
"యది పొదమె బల్ దీవిపై, పొదువ వలదె ?"

రామరాజభూషణుడు.

"కొనుఁడివే విరు" లన్న "కొననేల నినుజూడ
మరుఁడు రువ్వెడు విరుల్ విరివి" యనుచు

పింగళి సూరన్న.

వీటిలో ఏ చరణంలోని విషయం ఆ చరణంలోనే ముగిసిపోతుంది. మనకవి పై కవులలాగా కాక, ఈ పద్యమంతటిలోనూ ఒక్క సన్నివేశాన్నే నిండుగా వర్ణించాడు.

'నేర్పులౌరాయివి' అన్న దగ్గరనుంచి 'సరసముల్గద మీకిపుడు' అన్నంతవరకు ఆ పుష్పలావికలు చెప్పినమాటలు. ఈ మాటలనుబట్టే ఆ యువకనాయకులు ఏమిచేశారో, ఏమన్నారో, స్పష్టంగా తెలుస్తూ ఉంది, మాటలలో చెప్పకుండా ఈలాగు తెలియజేయడం చాల మంచి చమత్కారము.

దండమీద కొసరఁగా దొరకొంటిరి – రలలకు అభేదంకదా; దీనిని 'దండమీద కొసలఁగా' చేయవచ్చును. దండమీదకు ఒసలడం అంటే పక్కవాటుగా తొలగడం లేక ఒరగడం. ఈ నాయకులు ఆ దండ ఈ దండ అని చూపిస్తున్నట్టు నటిస్తూ ఆ యువతుల భుజాలపైపు ఒరిగిపోతున్నారేమో, గడుసువారుకదా !

*పాఠాంతరము :*

ప్రాయపు గాయకుల్ వెల నెపాన...

— వేదంవారూ, తిరుపతివారూ.

'గాయకుల్ = కొనువారు' అని అర్థం ఇచ్చారు. వేదంవారు గూడా ఆ అర్థాన్నే ఇచ్చారు. కాని బులుసువారు ఆ అర్థాన్ని అంగీకరించలేదు.

గాయికుడు = కొనువాడు అన్న అర్థం సూర్యరాయ నిఘంటువు ఇచ్చింది. అంతేకాక, గాయకము అని వెల అధికమన్న అర్థంలో ఉపయోగిస్తారని ఆ సూ. ని. యే అంగీకరించింది. కాబట్టి గాయక శబ్దానికి కొనడం అమ్మడంతో సంబంధముందని తేటపడుతుంది. అందుచేత ఆ పెద్దలిచ్చిన 'కొనువారు' అన్న అర్థం మనమూ అంగీకరించవచ్చు.

కాదంటే ఆ గాయకులన్న పాఠాన్నే ఉంచుకొని "ప్రౌఢులు, చతురులు" అన్న అర్థం చెప్పుకోవచ్చును.

ఏమయినా, ప్రాయపునాయకుల్ అన్న పాఠమే సముచితం. ఏమంటే, కవి తంజావూరు వాడు; ఆరోజులలో రసికశేఖరుడైన నాయకరాజు పాలిస్తున్నాడు. రాజబంధువులైన నాయకులలో వయసువాళ్ళు బాహాటంగా ఈలాంటి సరసాలకు పూనుకోవడంలో ఆశ్చర్యమేమీలేదు. ఈ ఇంద్రప్రస్థ నగర వర్ణనవల్ల ఆ నాయకయువకులూ వారి చేష్టలూ ఆనాటి శ్రోతలకు స్మరణకు రాకపోవు. ఇతరులకు నాయకులంటే శృంగార నాయకులు అన్న అర్థం చాలును.

*అలంకారము :*

శ్లేష.

## నాట్యకత్తెలు

గొప్పలై మిన్నందు చప్పరా లెక్కి లాఁ
గులు వైచుచోఁ జంద్రి కళలనంగఁ,
గనకంబు వర్షించు ఘనుల ప్రోల నటించి
మెఱయుచోఁ దొలకరి మెఱపు లనఁగ,
మాటికిఁ జూపఱ మది కానగొల్పుచోఁ
బ్రతిలేని బంగారు ప్రతిమ లనఁగఁ,
గుపిత నాథులఁ గూర్మిఁ గొసరు జంకెన నాటఁ
గనుచో మరు శిలీముఖము లనఁగఁ

జెలఁగి యింపుగ నగఁ బాడఁ జెప్పఁ జదువ
వలవ వలపింప నేర్చిన యలరుఁ బోండ్లు
విపుల భరత కళాశాస్త్ర నిపుణలైన
బిరుదుపాత్రలు గలరు తత్పురమునందు. 80

ఈ పద్యంలో ఇంద్రప్రస్థపురములోని నాట్యకత్తెలను వర్ణించే నెపముతో కవి తంజావూరు రఘునాథనాయకరాజు కాలంలో ఉండిన నాట్యకత్తెలను పాఠకులకు పరిచయం చేస్తున్నాడు. రఘునాథ నాయకుడు "భరతవిద్యా ధురంధరు"డని ఇదివరకే చెప్పాడుకదా.

నాట్యకత్తెలు ఒక్కొక్కప్పుడు ఎత్తుగా నిర్మించిన మంచెల (చప్పరాల) మీద—చాలమందికి చక్కగా కనిపించడానికి వీలుగా—నృత్యం చేస్తుంటారు. ఒక్కొక్కప్పుడు ప్రభువులూ పెద్దలూ కూర్చొనిఉన్న చోటనే వారి ఎట్టయెదుట అభినయిస్తుంటారు. అటువంటప్పుడు ప్రేక్షకులలోని సరసులు వారిమీద బంగారు నాణెములు (వరహాలు మాడలూ దీనారాలు) విసిరి, కురిపించి తమ ఆనందాన్ని ప్రక టిస్తుంటారు. కొందరు అత్తరు పన్నీరు మొదలైన సుగంధజలాలను పిచ్చికారీలతో ఎక్కడ పడేదీ చూచుకోకుండా కొడుతుంటారు.

మొదటి సీసచరణంలో చప్పరాలమీది నాట్యమూ, 2, 3, చరణాలలో ఈ అభినయ సంబంధమయిన —మేజువాణీ (దీనినే ఆటకచేరీ, చదురు అంటారు) అభినయమూ. దానిలో నాట్యకత్తెలకూ ప్రేక్షకుల లోని సరసులకూ కలిగే భావాలూ కవి చాల అనుభవ జ్ఞానముతో వర్ణించాడు — ఎన్ని మేజువాణీలు చూచుంటాడో!

ఈ నాట్యకత్తెలను చంద్రకళలు, తొలకరి మెరుపులు, బంగారు ప్రతిమలు, మారుబాణాలు అని అనడం ఉంది కదా! అలా అనడం చాల సమంజసమని అందరూ అంగీకరించేటట్టు, చక్కని సన్నివేశాలు కల్పించి, కవి ఆ పేరులను చమత్కారంగా సమర్థించాడు.

అర్థము :

౧. గొప్పలై = అందమయి విశాలమై, మిన్ను అందు = ఆకాశమునంటుతుండే (చాల ఎత్తుగానున్న), చప్పరాలు = పందిళ్ళ (మంచెల) వంటి మండపాలు, ఎక్కి, లాఁగులు వైచుచోన్ = నాట్యసంబంధమైన గంతులు వేస్తున్నప్పుడు, చంద్రకళలు అనంగన్ = చంద్రుని కళలు అనడానికి తగినట్టుంటారని ఉత్ప్రేక్ష.

ఎందుకంటే, చంద్రకళలుగూడా ఆకాశాన్నంటుతున్న (చప్పని) రాళ్ళ (కొండల) మీద గంతినట్టు ఎగబడుతుంటాయి అని భావము. దీపాలకాంతిలో వారి తళుకుబెళుకులు మెరుస్తూ చంద్రకళలలా గుంటాయి.

౨. కనకంబుల = ధనమును, బంగారు నాణెములను, వర్షించు = ఊరక నాట్యకత్తెల మీద విసురుతూ ఉన్న, ఘనులమ్రోలన్ = గొప్పవారి ఎదుట (దగ్గర), నటించు = అభినయ

ముతో నటిస్తూ (లేని ప్రేమ ఉన్నట్టు నటిస్తూ), మెఱయుచోఁ = ప్రకాశిస్తున్నప్పుడు, తొలకరి మెఱపు లనఁగఁ = తొలకరి కాలములో కనిపించే (చాలప్రకాశవంతమైన) మెరుపు లనడానికి తగిన ట్లుంటారని ఉత్ప్రేక్ష.

కారణం : తొలకరి మెరుపులుగూడా ఘనుల - అంటే మేఘాల ఎదుట ఆడుతూ ప్రకాశిస్తాయి. ఈ మేఘాలు కూడా 'కనక' అంబు వర్షిస్తుంటాయి - అంటే ప్రజల అవసరము తెలుసుకోకుండానే (కావలసినచోట ఎండ బెడుతూ, అక్కరలేనిచోట కురుస్తూ అన్నమాట) వర్షిస్తుంటాయి ఒక్కొక్కప్పుడు.

మంచిపంట పండినప్పుడు బంగారం పండిందనీ, మంచి అదనులోపడిన వర్షం బంగారం కురిసిందనీ కర్షకులు అంటారు. కాబట్టి కనకంబువర్షించు ఘనులు అంటే ఆబంగారం పంటలకు చాల విలువయిన వర్షం కురిసే మేఘాలు అని గూడా చెప్పవచ్చును.

ఈ నర్తకులు ఆ ఘనుల ఎదుట మెరుస్తూ ఉంటారు. కాబట్టి తొలకరి మెరుపులనడానికి తగినట్టుంటారని ఉత్ప్రేక్ష.

౩. మాటికిన్ = మాటిమాటికి, చూపఱ = ప్రేక్షకుల, మదికి, ఆస గొల్పుచోఁ = ఆస కలిగించుచున్నప్పుడు, ప్రతిలేని = సాటిలేని, బంగారు ప్రతిమలు = బంగారుబొమ్మలు, అనఁగన్ = అనడానికి తగినట్టు ఉంటారని ఉత్ప్రేక్ష.

కారణం : బంగారంతో చేసిన బొమ్మ చూసినప్పుడల్లా ఆస కలిగిస్తుంటుంది. ఈ నాట్యకత్తెలు గూడా చూచినప్పుడల్లా ఆ సరసులకు ఆస పుట్టిస్తూ ఉంటారు.

తమ అభినయం అంతా ఒక్కనిమీదనే పట్టక, ఎదుటనున్న నలుగురైదుగురి మీద మార్చిమార్చి సాగిస్తూ అక్కడి ధనికనాయకులకు శృంగారరసము పంచిపెడుతుంటారు. ఒకడి మీది దృష్టి మరొకడి మీదకు తిప్పినప్పుడు ఈ మొదటి ఘనుడు మళ్లా ఎప్పుడు తన వైపు వస్తుందో అని ఆసతో చూస్తుంటాడు. ఇది ఆటకచేరీలలో సహజము. ఈ భావాన్నంగీకరించి "మాటిమాటికి, చూపు = నర్తకి విలాసపు చూపు, అఱఁ = తగ్గిపోయినట్టుచేస్తూ, మదికాస గొల్పుచోన్ = సరసుల మనసుల కాస పుట్టిస్తూ ఉన్నప్పుడు" అన్న అర్థంకూడా చెప్పుకోవాలి. అఱు = నశించు, క్షీణించు (తగ్గు) అన్న అర్థాలున్నాయి. అఱఁ = తగ్గిపోగా.

ఈ పద్యములోని విషయమంతా నాట్యకత్తెల విషయం కాబట్టి, దీనిలోని అన్ని చరణాలకూ అభినయంతో సంబంధమున్న అర్థం చెప్పుకోవడం అవసరం. ఈ మూడో చరణానికి మొదట ఇచ్చిన అర్థానికి అభినయంతోగానీ నాట్యంతోగానీ సంబంధము లేదన్నమాట గుర్తించాలి. నాల్గో చరణంలో ఈ అభిప్రాయన్నే కవి వాచాగా ప్రకటించాడు.

౪. ఆటఁ = ఆటకచేరీలో (చదురులో), కుపితనాథులఁ = (ఇంకొకరి మీద ఎక్కువ అభినయం పడుతున్నందుకు గాబోలు) కోపము తెచ్చుకొని ఉన్న సరసులను, కూర్మికొసరు =

(కోపముమాని) స్నేహం - ప్రేమ - చూపండి అని కోరుతున్న, జంకెనణ = తీక్ష్ణమైన (చుర చుర) చూపుతో, కనుచోన్ = చూచినప్పుడు, మరుశిలీముఖములు = మన్మథబాణాలే, అనగణ = అన్న ట్లుంటారని ఉత్ప్రేక్ష.

"జంకెన నాటణ = తీక్ష్ణమైనచూపు హృదయములో నాటుకొనేలాగ" అని గూడా అర్థము. ఆ జంకెనచూపు ఆ సరసుల హృదయాలలో నాటి, మన్మథబాణాల లాగానే, స్నేహం (ప్రేమ) కలిగిస్తాయనీ, వారు కోపం విడిచిపెడతారనీ భావము.

చెలఁగి = అభ్యాసంచేసి, ఇంపుగన్ = మనోహరంగా, నగన్ = నవ్వడానికీ, పాడన్ = పాడడానికీ, చెప్పణ = కథలు మొదలగునవి చెప్పడానికీ, చదువణ = చదవడానికీ, వలవన్ = సరసులను ప్రేమించడానికీ (నటనలో), వలపింపన్ = సరసులు తమ్ము ప్రేమించునట్లుచేయడానికీ, నేర్చిన = నేర్పు గలిగిన, అలరుఁబోండ్లు = సుందరాంగులు, విపుల = అనేక విషయాలతో నిండిన-బ్రహ్మాండమయిన, భరత కళా శాస్త్ర = భరతముని చెప్పిన నాట్య అభినయాల శాస్త్రం లోనూ, కొక్కోకాదులు చెప్పిన కళాశాస్త్రంలోనూ, నిపుణలైన = ఆరితేరి ప్రవీణలైన, బిరుదుపాత్రలు = బిరుదులు పొందిన - ప్రసిద్ధలయిన నాట్యకత్తెలు, తత్పురమునందుణ = ఆ నగరములో, కలరు.

విశేషము :

పాత్రలు అంటే నాట్యకత్తెలు; దీనినిపట్టే 'పాతరలాడు' అంటే 'చిందులు తొక్కు' అన్న అర్థం వచ్చింది. ఈ సీసపద్యములో కవి వర్ణించిన విషయం "పాత్రలు" నాట్యకత్తెరే కాని, సాధారణ స్త్రీలుకారు. కాబట్టి మనము గూడా నాట్యకత్తెల విషయమే అర్థం చెప్పుకోవాలి. దానికి మనకు సహకారిగా కవి అన్ని సీసచరణాలలోనూ చిన్నచిన్న శ్లేషలను పొందుపర్చాడు. మొదటి చరణంలో 'చప్పరాలు', రెండో చరణంలో 'ఘనులు', మూడోచరణంలో 'చూపఱ' (చూపఱ అంటే ప్రేక్షకులు-బహువచనం-అనీ, చూపు అఱన్ అంటే చూపుతగ్గగా అనీ), 'ప్రతి లేని బంగారు ప్రతిమలు' గూడ చెప్పుకుందాము, నాల్గవ చరణంలో 'జంకెన నాటన్' - జంకెనన్ ఆటణ అని ఉద్దేశపూర్వకంగానే ప్రయోగించాడు.

ఈ నాట్యకత్తెల నేర్పు — నవ్వులలో హేళనము, ఆమోదము, అనంగీకారము, క్రోధము......తెల్పేవి; పాటలలో అనేకవిధాలయిన రాగాలతో ఉండేవి; చెప్పడములో వాస్తవమయినా కాకపోయినా నిజమని ఇతరులు నమ్మేలాగ చెప్పడం, గొప్పవిషయాలను తేలికగాను, తేలిక విషయాన్ని గొప్పగాను......చెప్పడం మొదలైనవి.

పాఠాంతరాలు :

"కుపితనాథుల గూడి కొసరు జంకెన...."

— వేంకట కృష్ణమాచార్యులవారూ, నోరి గురులింగ శాస్త్రిగారూ.

"చెలఁగి యింపుగఁ గనఁ బాడఁ జెప్పఁ జదువ

ఇక్కడ ఇంపుగఁ = మనోహరంగా, కనన్ = చూడడానికి అని అర్థం చెప్పుకోవాలి. ఈ కనడంలో నేర్పులు : వలపు, కోపం, జంకెన, సంతోషం...తెలిపే చూపులని భావం.

అలంకారము :

వేదంవారు పద్యంలో భ్రాంతి ఉన్నట్టు భావించారు. కాని ఆటకచ్చేరీలో ఘనులముందు నటిస్తున్న నాట్యకత్తెను చూచి తొలకరి మెరుపన్న భ్రాంతి పొందడం అసంభవము. ఆలాగే తక్కిన పాదాలలో గూడ భ్రాంతిలేదని గ్రహించాలి.

ఇక్కడున్న అలంకారాలు : ఉత్ప్రేక్ష, శ్లేష, ఉల్లేఖము.

## వేశ్యలు - విటులు

అతివినోదము గాఁగ రతుల మెప్పించు నీ
పచ్చల కడియాల పద్మగంధి;
చక్కెర మోవిచ్చి చవులఁ దేలించు నీ
ముత్యాల కమ్మల మోహనాంగి;
తృణముగా లోఁజేయు నెంతటి వాని నీ
నీలాల ముంగఱ నీలవేణి;
వెలలేని పొందిక విడివడ మెఱయు నీ
కెంపుల బొగడల కీరవాణి;
అనుచుఁ దమలోన నెరజాణతనము మీఱ
వారకాంతామణుల మేలువార్త లెల్లఁ
దెలుపుచును, వెన్నెల బయళ్ళఁ గలసి నగుచు,
విటులు విహరింతు రప్పురి వీథులందు. 81

వెన్నెల రాత్రులలో విటులు భోగంవారి వీథులలోనూ, బయళ్ళలోనూ తిరుగుతూ ఆయా వేశ్యల గురించి తమకుతెలిసిన విషయాలు ముచ్చటలాడుకుంటూ ఉండడం కవి ఈపద్యంలో వర్ణిస్తున్నాడు.

సీసపాదాలలో ఒక్కొక్కటి ఒక్కొక్క విటుడు చెప్పినట్టు భావించడం సమంజసం.

అర్థము :

౧. ఈ పచ్చల కడియాల = పచ్చలు తాపిన కడియాలుగల, పద్మగంధి = కాంత (తామరపూవాసన సహజంగా శరీరంలో కలది)— ఆమె పేరు పద్మగంధి, అతి వినోదము

గాంగఁగ = మిక్కిలి సంతోషము (సరసులకు) కలిగేలాగ, రతులన్ = రతిక్రీడలందు, మెప్పించును = మెచ్చేలాగ ప్రవర్తిస్తుంది.

బంగారము వెండి మొదలైనవాటిని తూచడానికి తులాలు లాగానే, వజ్రాలూ, పచ్చలూ తూచడానికి మనము 'రతులు' ఉపయోగిస్తాము. విదేశీయులు 'కారెట్‌లు' వాడతారు. ఇక్కడ ఈ పద్మగంధి పచ్చలకడియాలు కలది కాబట్టి (తూకం) రతులతో మెప్పిస్తుందని చమత్కారము. పద్మగంధి రతిక్రీడలతో మెప్పిస్తుందని భావము.

౨. ముత్యాల కమ్మల = ముత్యాలతో చేసిన చెవి కమ్మలు కల, ఈ మోహనాంగి = మనోహరమైన శరీరము కల ఈ సుందరి - ఆమెపేరు మోహనాంగి, చక్కెరమోవి ఇచ్చి = తీయని అధరమును (పానము చేయుటకు) ఇచ్చి, చవులన్ = (శృంగారరస సంబంధమయిన) రుచులతో, తేలించును = (సరసులను) ఒళ్ళు మరచిపోయినట్టు చేస్తుంది. మోహనాంగి అధర పాన రుచులతో ఆనందాన్నిస్తుందని భావం.

పచ్చలూ వజ్రాలూ తూచడానికి రతులలాగానే, మన రత్నవర్తకులు మంచి ముత్యాలు తూచడానికి 'చౌ' అన్న ఎత్తును వాడుక చేస్తుంటారు. ఉదా : ఈ ముత్యం 36 చౌలు (బరువు) ఉందంటారు. ముత్యాల కమ్మలది కాబట్టి, 'చవుల' తేలిస్తుందని చమత్కారము.

ఈ చౌల (చవుల) సంగతి తెలియక పూర్వవ్యాఖ్యాతలు "చవులనగా ముత్యములకాంతి విశేషము—దీనినే నీరు అందురు" అని అర్థం చెప్పుకున్నారు. పై చరణములో 'రతుల మెప్పించును' అన్నట్లే ఈ చరణములో 'చవుల తేలించును' అన్నాడుకవి.

౩. నీలాల ముంగఱ = (ఇంద్ర)నీలమణులు కూర్చిన ముక్కర-నత్తువంటి ఆభరణము గల, ఈ నీలవేణి = నల్లనిజడగల ఈ నీలవేణి అన్న వారకాంత, ఎంతటివానిన్ = ఎంతటి మనస్థైర్యమూ నిష్ఠా కలవాడినైనా, తృణముగాన్ = గడ్డిపోచనుచేసి, తేలికగా, లోఁజేయున్ = లోబరుచుకుంటుంది.

మంచి జాతినీలము 'తృణగ్రాహి' అనగా గడ్డిపోచను ఆకర్షించే గుణం కలిగి ఉంటుందని రత్నశాస్త్రము. నీలాలముంగర కలది కాబట్టి తృణముగా లోబరుచుకుంటుందని చమత్కారము.

ఈ నీలవేణి ఎంతటి 'ఇనుప కచ్చడం'-కట్టిన వాడినైనా, అవలీలగా అతడ్ని వశపర్చుకుంటుందని భావము.

౪. కెంపుల బొగడల = కెంపులుతాపి చేసిన బొగడ లనే కర్ణభూషణాలుధరించి ఉన్న, ఈ కీరవాణి = ఈ చిలుకవంటి పల్కులుగల వారకాంత - పేరుకీరవాణి, వెలలేని = ఎంత విలువ ఇచ్చినప్పటికీ చాలని (అమూల్యమైన), పొందికన్ = కలయికలలో, విడివడన్ = తననేర్పు కనబడేలాగ, మెఱయున్ = ప్రవర్తిస్తుంది. విడి = పరాక్రమము (నేర్పు).

పొందికలలో (= కూటములలో) ఈ కీరవాణిచూపే నేర్పుకు ఎంతవెల ఇచ్చినా చాల దని భావము.

పొందిక అనగా నగలకోసం బంగారంలో రత్నాలు పొదిగి కట్టడము. ఈపని చేసిన స్వర్ణకార్లను, కట్టడపు పనివారంటారు. మంచి నేర్పుతో చక్కని జాతికెంపులు పొదిగి కట్టినట్టయితే, ఆ కెంపుల (ఎఱ్ఱని) కాంతి మరింత ఎక్కువగా ప్రకాశిస్తుంది.

విడి అంటే ఎఱ్ఱనికాంతి అని గూడా అర్థం ఉంది. విడివడ మెఱయున్ = అధికమయిన అరుణ కాంతితో ప్రకాశిస్తుందన్నమాట. ఈ విడివడడం కెంపులకే గాని తక్కిన రత్నాలకు చెల్లదు.

కెంపుల బొగడలు గలది కాబట్టి 'విడివడ' మెరుస్తుందని చమత్కారము.

అనుచు = పైనచెప్పిన ప్రకారము వారివారికి తెలిసినవిషయాలు చెప్పుకుంటూ (విటులు), తమలోనన్ = వారిలోవారు, నెఱజాణతనము మీఱగ = తమకున్న పరిపూర్ణ రసికత్వము వెల్లడి అయేలాగ — అర్థగౌరవమూ చమత్కారమూ కలమాటలతో, వారకాంతామణుల = వేశ్యలలో శ్రేష్ఠలయినవారి యొక్క. మేలువార్తలు ఎల్లన్ = ఆధిక్యాల గురించిన ముచ్చటలన్నీ, తెలుపుచును = తెలియ జేసుకొంటూ, అప్పురి వీథులందుగ = ఆనగరంలోని (భోగము వారి) వీథులందున్నూ, వెన్నెలబయళ్ళగ = నిండు వెన్నెలలున్న ఆరుబయటి స్థలములలోనూ, విటులు, కలసి = ఒకరినొకరు కలుసుకొని (చిన్నగుంపుగా), నగుచు = నవ్వుకొంటూ, విహరింతురు = తిరుగుతుంటారు.

వెన్నెల రాత్రులలో ఆ నగరంలోని విటులు భోగంవారి వీథులగుండా పోతూ, ఆయా ఇండ్లదగ్గర కనబడిన వేశ్యల చాకచక్యం గురించి ముచ్చటలాడుకుంటూ, సందర్భాన్ని బట్టి నవ్వుకొంటూ తిరుగుతుంటారని భావము.

పాఠాంతరాలు :

1. చక్కెర మోవిచ్చి చవులఁ దేలించు నీ
ముత్యాల కమ్మల ముద్దులాడి.

— వేంకటరాయశాస్త్రిగారూ, తిరుపతివారూ.

ఈ వెన్నెల షికార్లు చేసే విటులకు ఆవారకాంతల పేరులు తెలిసే ఉంటాయి. కాబట్టి పెద్దచరణాల చివరనున్న పద్మగంధి, కీరవాణి, నీలవేణి అన్నవి కేవలం స్త్రీ అన్న అర్థాన్నే కాక, ఆ కాంతల పేర్లను గూడా తెలియజేయడం బాగుంటుంది. వారి పరిచయమున్నవారు కాబట్టి పేరుతో నిర్దేశించడం అందంగా ఉంటుంది.

ఆ మూడుపేర్లు సాధారణంగా వారకాంతలలో ప్రచారంలో ఉండేవే. 'ముద్దులాడి' అన్నపేరు అలాంటిదికాదు. అందుచేత ఈపాదంలో 'మోహనాంగి' అన్నపాఠమే సమంజసము.

2. వారకాంతామణుల మేలివార్తలెల్ల
వెన్నెల బయళ్ళఁ గేలిగావించి నగచు...
— బులుసువారి పాఠం.

ఆ విటులు ఆకాంతల మేలివార్తల నన్నిటిని ఎగతాళిచేస్తూ నవ్వుకుంటారని అర్థమవుతుంది. కాని ఈ పద్యములో గేలికి సూచన ఏదీ కానరాదు.

అలంకారము :

శ్లేష, ఉదాత్తము.

## తోటలు

పోఁక మ్రాఁకుల మహిమ, కప్పురపు టనఁటి
యాకుఁదోటల సౌభాగ్య మందె కలదు;
ప్రబలు మౌక్తిక సౌధసంపదల గరిమ,
వీటి రహి మెచ్చవలయుఁ బో వేయునోళ్ళ. 82

అర్థము :

పోఁకమ్రాఁకుల = పోకచెట్లయొక్క, మహిమ = గొప్పతనము, కప్పురపు అనఁటి ఆకు తోటల = కర్పూరపు అరటితోటల యొక్కయూ, తములపాకుతోటల యొక్కయూ, సౌభాగ్యము = ఆధిక్యము, అందె = ఆఇంద్రప్రస్థపురములోనే, కలదు—ఇంక ఎక్కడా అంత మహిమా, అంత సౌభాగ్యమూ కనబడవని భావము, మౌక్తికసౌధ = ముత్యపు సున్నముతో కట్టిన మేడలయొక్క, సంపదల = కలుముల — అందముల, గరిమ = ఆధిక్యము, ప్రబలుణ = విశేషముగా కనబడును, వీటి = వీడు(నగరము)యొక్క, రహి = సౌందర్యము, వేయునోళ్లన్ = వేయినోళ్లతో, మెచ్చవలయుణ పో = పొగడవలెను సుమా.

తాత్పర్యము :

తోటలూ మేడలూ ఉన్న ఆ నగర సౌందర్యం మెచ్చాలంటే ఒక్క నోరు చాలదు; అది శేషుడిలాగా వేయినోళ్లు ఉండాలని భావము.

*విశేషము :*

ఈ పద్యములో కవి పోకలు, పచ్చకర్పూరము, తములపాకులు, ముత్యపు సున్నము ఇచ్చి, చక్కని తాంబూలం — వీటి అంటే తాంబూలమని అర్థము — రుచి చూపుతున్నాడు. ఆ వీటి (విడెము) రహి (రుచి) ఆ తాంబూలం వేసుకున్న నోళ్లే మెచ్చాలి గాని, వేయని నోళ్లు మెచ్చలేవని విశేషార్థాన్ని కనబరిచాడు.

మౌక్తికసౌధాలు అంటే ముత్యాలతో (అలంకరించిన) మేడలు అని అతిశయోక్తి అర్థం చెప్పుకున్నా, అసలు అర్థం మరచిపోరాదు. ముత్యాలు (ముత్యపు చిప్పలూ గుల్లలూ) కాల్చి సున్నము చేయవచ్చును. ఆ సున్నము మౌక్తికసుధ. ఆ మౌక్తిక సుధతో (మంచి ధావళ్యంగల ఆ సున్నంతో) కట్టిన మేడలు విశేషంగా కనబడతా యన్నమాట.

విషయాల ఆధిక్యాన్ని తెల్పడానికి కవి మహిమ, సౌభాగ్యము, గరిమ అన్న పదాలు వాడాడు.

ఈ పద్యంలో కవి 'పిట్టచూపు' గా తంజావూరు నగరశోభను — పోకతోపులు, అరటి తోటలు, తములపాకుతోటలు, తెల్లని మేడలు అన్నిటిని వర్ణించాడు.

*పాఠాంతరము :*

"పర్విలు మౌక్తిక సౌధసంపదల మహిమ"

— పరిష్కర్తలు అందరూ.

ఈ చిన్న పద్యములో ఆధిక్యాన్ని తెలియజేసే మూడు మాటలలో రెండు సార్లు "మహిమ" అన్న మాటనే చేమకూరకవి ఉపయోగించి ఉండడనీ, మహిమవంటిదే గరిమ అనీ 'మౌక్తిక సౌధ సంపదల గరిమ' అనడమే సమంజసమనీ అనుకున్నాను.

*అలంకారము :*

శ్లేష.

ఆణి మెఱుంగు ముత్తెపు టొయారపు ముగ్గులు, రత్నదీపికా
శ్రేణులు, ధూపవాసనలు, హృద్య నిరంతర వాద్య ఘోషముల్
రాణఁబొసంగఁ బ్రోలు మిగులం గనువిం దొనరించు, నిత్య క
ల్యాణముఁ బచ్చతోరణమునై జనులెల్లరు నుల్లసిల్లఁగన్. 83

అర్థము :

అణి = ఏలాంటి లోపములేని గుండ్రదనము కలిగి, మెఱుఁగు = మంచి ప్రకాశము (నీరు) గల, ముత్తెపు = ముత్యాలతో నిర్మించిన, ఒయారపు = సొగసుగల, ముగ్గులు = ముగ్గులున్నూ, రత్నదీపికాశ్రేణులు = రత్నాలతో చేసిన దీపాల వరుసలున్నూ, ధూపవాసనలు = సుగంధధూపాల వాసనలున్నూ, హృద్య......ఘోషముల్ — హృద్య = మనోహరమైన, నిరంతర = ఎడతెరిపి లేకుండ (వినబడే), వాద్య = వీణ, నాదస్వరము మొదలైన వాద్యాల యొక్క, ఘోషముల్ = ధ్వనులున్నూ, రాణ౯ = శోభను, పొసంగ౯ = కలుగజేస్తుండగా, నిత్యకల్యాణము = వివాహాది శుభకార్యాలలో ఉండే లక్షణాలు ఎల్లప్పుడూ కలిగి, (నిత్య) పచ్చ తోరణమును ఐ = ఎల్లప్పుడు ఉత్సవ సూచకములైన అలంకరణలతో, జనులు ఎల్లరు = ప్రజలందరు, ఉల్లసిల్ల౯ క౯ = సంతోషించేలాగ, ప్రోలు = పట్టణము, మిగుల౯ = విశేష ముగ (ఎంతచూచినా తనివితీరనట్లు), కనువిందు = కన్నులపండుగు, ఒనరించున్ = చేస్తుండును.

తాత్పర్యము :

ముత్యాల ముగ్గులూ, రత్నాలదీపాలూ, ధూపవాసనలూ, వాద్యధ్వనులూ ఎల్లప్పుడూ ఉండడంవల్ల పట్టణము, నిత్యకల్యాణము పచ్చతోరణంగా ఉంటుందని భావము.

విశేషము :

పద్యంలో కంటికీ, ముక్కుకీ, చెవికీ ఆనందం కలిగించేవి ఉండగా, కనులకు మాత్రము పండు గనడం భావ్యము కాదంటే—మిగులంగను = ఎక్కువగా, విందొనరించును = పండువు చేయును — ఆనందం కలిగించును అని అర్థం చెప్పుకోవచ్చును.

కనుట విడిపదంగా ఉంటే దానికి తాకుట, వినుట, వాసనచూచుట మొదలైన అర్థాలు చెప్పుకోవచ్చును. "కంటే బ్రాహ్మణు డెన్ని కాలు లఱచె౯" అని అల్లసానిపెద్దన కవీంద్రుడు 'వింటే' (వింటివే) అనడానికి 'కంటే' అని ప్రయోగించాడు. కాని, 'కనువిందు' లాటి సమాసాలకు 'వినువిందు—వీనులవిందు' అని అర్థం చెప్పలేము.

సున్నపు పొడితో కాక ముత్యాలతో నిర్మించిన ముగ్గులు కాబట్టి చెరిగిపోయేవికావు. రంగురంగుల రత్నాలనే దీపాలుగా ఏర్పాటు చేసి ఉంటారు కాబట్టి ఆ దీపాలు ఆరిపోవు. ధూపవాసనలూ వాద్యధ్వనులూ సుఖంగా జీవిస్తున్న ప్రజల సంతోషానికి సూచనలు — ఈ ఉత్సవ లక్షణాలు ప్రతిదినమూ ఉండడంచేత నిత్యకల్యాణమూ పచ్చతోరణ మనడం సార్థకం. లోకోక్తులను ఉపయోగించడంలో తనకున్న నియమాన్ని కవి ఈ పద్యములో గూడ పాటించాడు.

అలంకారము :

అతిశయోక్తి, లోకోక్తి.

## ధ ర్మ రా జు

ఆ పురమేలు ' మేలు, బళి ' యంచుఁ బ్రజల్ జయవెట్టుచుండ, నా
జ్ఞా పరిపాలన వ్రతుఁడు, శాంతి దయాభరణుండు, సత్య భా
షా పరతత్త్వ కోవిదుఁడు, సాధుజ నాదరణుండు, దాన వి
ద్యా పరతంత్ర మానసుఁడు ధర్మతనూజుఁ డుదగ్రతేజుఁడై. 84

అర్థము :

ఆజ్ఞా పరిపాలన వ్రతుఁడు = తానుచేసిన ఆజ్ఞల ప్రకారము తానుగూడ ప్రవర్తించాలన్న దీక్షకలవాడు, శాంతి దయ ఆభరణుండు = శాంతి దయ అన్న మహాగుణాలను భూషణాలుగా గలవాడు, సత్య...కోవిదుఁడు—సత్యభాషా = నిజము చెప్పడములో ఉన్న, పరతత్త్వ = ఉత్కృష్టమైన (రహస్యాన్ని) స్వరూపాన్ని, కోవిదుఁడు = బాగా తెలుసుకున్నవాడు, సాధుజన ఆదరణుండు = మంచివారలను ఆదరించిపోషించేవాడు, దాన... మానసుఁడు-దానవిద్యా = దానం చేయడమన్న విద్యయందు, పరతంత్ర = ఆసక్తిగల, మానసుఁడు = మనసుగలవాడు, ఉత్ అగ్రతేజుడై = మిక్కిలి తీక్షణమైన పరాక్రమము కలవాడై, ధర్మతనూజుఁడు = యమధర్మ రాజు కొడుకయిన ధర్మరాజు, మేలు, బళి, అంచున్, ప్రజల్, జయవెట్టుచుండ = జయ జయ అని జేజేలు కొట్టేలాగ(ప్రజారంజకుడుగా), ఆపురము = ఆ ఇంద్రప్రస్థ పట్టణాన్ని, ఏలున్ = పాలిస్తుండేవాడు.

తాత్పర్యము :

తన ఆజ్ఞలను తాను గూడ పాటిస్తూ, శాంతము దయా సత్యమూ సజ్జనపోషణ, దాన శీలము కలిగి, పరాక్రమానికి లోటు లేకుండా ఆ పట్టణాన్ని పాలిస్తున్న ధర్మరాజును ప్రజలు విశేషంగా ప్రశంసిస్తుంటారని భావము.

విశేషము :

కథలో ధర్మరాజన్న కొత్తపాత్రను ఈ పద్యంలో ప్రవేశపెడుతున్నాడు. దానికోసం విటులు వేశ్యలు మొదలైన వ్యక్తుల మీదకు పోయిన వర్ణనను "అణి మెఱుంగు" పద్యముతో మళ్ళా పట్టణం మీదకు తిప్పి, ఆ పురమేలుతున్నాడని ధర్మజపాత్ర ప్రవేశానికి అవకాశం కలిగించుకున్నాడు కవి.

ధర్మరాజు సుగుణాలెన్నో ఉన్నప్పటికీ మొట్టమొదట 'ఆజ్ఞాపరిపాలన వ్రతుఁడు' అని చెప్పడం ఒక విశేషము. సాధారణంగా ప్రభువుల ఆజ్ఞలు ప్రజలకేగాని తమకు కావన్నట్టు వారు ప్రవర్తిస్తుంటారు. ఆ దినాలలో వ్యాప్తిలో ఉన్న ఈ లోపము గుర్తించిన మనకవి దీనికే ప్రాముఖ్యమిచ్చాడు.

సత్యభాషాపరతత్త్వ కోవిదు డనడంలో "సత్యమే దైవము, దైవమేసత్యము" అన్న ఉదారభావాన్ని కవి సూచించాడు.

దానం చెయ్యడం ఒక విద్యగా మనవారు గణించారు. శ్రీనాథుఁడు "దానకలాకలాప సముదంచిత సారవివేక సంపదన్......" అని, దానాన్ని ఒక కళగా (విద్యగా) పేర్కొన్నాడు.

పద్యంలో ధర్మరాజుకు చెప్పిన గుణాలనుపట్టి, అతడు మెత్తమెత్తని వాడని అనుకుంటా రేమో అని కవి చిట్టచివరను 'ఉదగ్రతేజుఁడై' అని, అతడు గట్టి పరాక్రమశాలి సుమండీ అని చమత్కారంగా తెలియజేశాడు.

ఈ ధర్మరాజు వర్ణనలో కవి రఘునాథనాయకుడినే కనబరుస్తున్నాడన్న మాట పాఠకులు మరచిపోకూడదు.

అలంకారము :

అనుప్రాస, ఉల్లేఖము.

దేవ బ్రాహ్మణ భక్తి ప్రోవు, ప్రియ వక్తృత్వంబు కాణాచి, వి
ద్యావైదుష్యము దిక్కు, ధర్మమునకున్ దార్కాణ, మర్యాదకున్
తా, వౌచిత్యము జీవగఱ్ఱ, హిత శిష్ట వ్రాత సంతోషణ
శ్రీ వజ్రాంగి, యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్. 85

అర్థము :

దేవ......ప్రోవు = దేవతలయందూ బ్రాహ్మణులయందూ గల భక్తికి రాశి (ప్రోగు). ప్రియ వక్తృత్వంబు = ప్రియముగా మాటలాడే గుణానికి, కాణాచి = నివాసస్థలము, విద్యా వైదుష్యము = వివిధమయిన విద్యలయందుగల నేర్పుకి (పాండిత్యానికి), దిక్కు = ఆశ్రయ మైనవాడు, ధర్మమునకున్, తార్కాణ = నిదర్శనముగా చూపదగినవాడు, మర్యాదకున్ = సభ్య (గౌరవ) ప్రవర్తనకు, తావు = స్థానమయినవాడు, ఔచిత్యము = ఉచితము అనుచితము (తగినది తగనిది) అన్న జ్ఞానానికి, జీవగఱ్ఱ = ప్రాణాధారము—ప్రాపు, హిత...వజ్రాంగి - హిత = స్నేహితుల యొక్కయు, శిష్ట = సజ్జనుల యొక్కయు, వ్రాత = సమూహాన్ని, సంతోషణ = సంతోషపెట్టే, శ్రీ = బుద్ధే, వజ్రాంగి = పటిష్ఠమైన కవచంగా (గట్టి రక్షణగా) కలవాడు, (అయిన) అజాతశత్రుఁడు = ధర్మరాజు, చూడఁగన్, మహీభృన్మాత్రుఁడే = సాధారణ రాజా ; అసాధారణ ప్రభువన్నమాట.

తాత్పర్యము :

దేవతలను బ్రాహ్మణులనుచాలా భక్తితో చూస్తాడు. అప్రియమైన మాటలుగాని, కటువయిన మాటలు గాని ఆడనివాడు. విద్యలలో ప్రవీణులైన వారి నాదరించేవాడు. ధర్మములు (విధులు) నిర్వహించడములో దృష్టాంతంగా (ఆదర్శంగా) చెప్పుకో దగినవాడు. సత్యప్రవర్తనకు నిలయమైనవాడు. ఉచితజ్ఞతకు ఆధారము. హితులనూ సజ్జనులనూ సంతోషపెట్టా లన్న బుద్ధితో నిరపాయంగా జీవించేవాడు అయిన ధర్మరాజు సాధారణరాజు కాడని భావము.

విశేషము :

ఈ పద్యంలో చెప్పిన మంచి గుణాలు కలిగిన వాడికి శత్రువన్నవాడు ఉండడని చెప్పనక్కరలేదు. అందుచేతనే ఇక్కడ ధర్మరాజును 'అజాతశత్రు'డని పేర్కొన్నాడు. అజాతశత్రుడంటే ఎవడికి శత్రువన్నవాడు పుట్టలేదో వాడు. ధర్మరాజు కున్న పేరులలో ఇదొకపేరు. పై గుణవర్ణనవల్ల కవి ఆ పేరును సమర్థించి సార్థకం చేశాడు.

వజ్రాంగి అంటే 'వజ్రకవచము' అని పూర్వ వ్యాఖ్యాతలందరూ అర్థం చెప్పారు వజ్రకవచమంటే వజ్రాలతో చేసిన లేక వజ్రాలు తాపి చేసిన కవచమని అర్థం అవుతుంది. ఇది సరి కాదు ; ఇదొక పలుకుబడి ; దీని అర్థము = మిక్కిలి పటిష్ఠమైన, కాపాడే, రక్షణము. దీనినే 'వజ్రాంగిజోడు' అని గూడ వాడుతుంటారు. వజ్రం చాల గట్టి పదార్థమని ప్రసిద్ధి కదా !

పాఠాంతరాలు :

........ విద్యావైశద్యము దిక్కు ......

— వేంకటకృష్ణమాచార్యులు.

అలంకారము :

రూపకము, పరికరము, ఉల్లేఖము.

అవలఁబోయిన వెన్కనాడు తెన్నఁడు లేదు,
మొగము ముందఱ నంట మొదలె లేదు,
మనవి చెప్పినఁ జేయకునికి యెన్నఁడు లేదు,
కొదవగా నడుపుట మొదలె లేదు.
చనవిచ్చి చౌకచేసినది యెన్నఁడు లేదు,
పదరి హెచ్చించుట మొదలె లేదు,
మెచ్చినచోఁ గొంచె మిచ్చు టెన్నఁడు లేదు,
మొక మిచ్చకపు మెచ్చు మొదలె లేదు,

మఱియుఁ దొల్లిటి రాజుల మహిమ లెన్ని
యితఁడెపో సార్వభౌముఁ డప్రతిముఁ డనఁగఁ
బ్రజలఁ బాలించె సకల దిగ్భాసమాన
కీర్తి వినరుండు, పాండ వాగ్రేసరుండు. 86

రాజుల కొలువులో జరిగే విషయాలను సవిమర్శంగా చూచేవాడు కాబట్టి ఈ పద్యములోనూ, దీని తరువాతి పద్యములోనూ మనకవి రాజులలో సాధారణంగా ఉండే లోపాలను చమత్కారంగా సూచిస్తున్నాడు.

(౧) అవలపోయిన వెన్క నాడడ మెప్పుడు లేదు, మొగము ముందు అనడం మొదలె లేదు అంటే ఎప్పుడూ అనకుండా మూగగా ఉండడంకాదు. వెన్క నాడడమంటే, ఆ అవల పోయిన వాడిని గురించి చెడ్డగా మాటలాడడము; మొగముముంద రనడం అంటే, ముఖప్రీతి కోసం (వాస్తవంకాని) మంచిమాటలు—ప్రశంసలు చెప్పడము. ఈరెండూ ధర్మరాజులో లేవు. మన ప్రభువులలో సర్వసాధారణంగా కనబడేదే ఈ అవలక్షణం.

(౨) ఏదయినా సహాయంకోసం మనవి చేసుకుంటే, ఆ సహాయం చేయకుండా ఉండడం ఎప్పుడూలేదు; ఆ సాయం చేసినప్పుడు అరకొరగా (ఏదో చేశాం అనిపించుకోడానికి) కాక, చేయవలసిన దంతా - సంపూర్ణంగా చేస్తాడు.

(౩) ఎవరయినా కొత్తవారు పరిచయ మయినప్పుడు ఆరంభంలో ఎక్కువగా మర్యాద చేస్తుంటారు. నాలుగు రోజులు పోయిన తరువాత వారివైపు చూడనైనా చూడరు. ఈ అవలక్షణాన్నే "పృథివి నధిపులు నూతన ప్రియులుగారె" అని కవులన్నారు. దీనికి కారణము : ఈ ప్రభువులు వారి మంచి చెడ్డలు తెలుసుకోకుండానే తొందరపడి (పదరి) వారిని గౌరవిస్తారు; యోగ్యతను గుర్తించి చూపిన గౌరవంకాదు. ఈ లోపం ధర్మరాజులో లేదని భావము.

(౪) పండితులనూ ప్రవీణులనూ మెచ్చినప్పుడు, వారికి కొంచెమివ్వడం లేదు; అలాగని ఎవరినీ ముఖప్రీతి కోసం మెచ్చడము మొదలేలేదు. నిజమయిన అర్హత ఉంటేనే మెచ్చడమూ, అలా మెచ్చినప్పుడు చాలసంతృప్తికరంగా పారితోషిక మివ్వడమూ ధర్మరాజు పద్ధ తన్నమాట.

మఱియు = ఇంతేకాకుండా, తొల్లిటి = పూర్వకాలపు, రాజుల = సుప్రసిద్ధులయిన రాజుల యొక్క, మహిమలు = గొప్పగుణాలను, ఎన్ని = పరిశీలించి (ఇప్పటి ప్రభువులలో లోపించి పోయిన మంచిగుణాలు ధర్మజుడిలో ఉండడం గుర్తించి అన్నమాట), ఇతఁడెపో = ఈ ధర్మరాజే సుమా, అప్రతిముడు = సాటిలేని, సార్వభౌముఁడు = చక్రవర్తి (భూమికంతటికిని ప్రభువు) అనఁగ౯ = అనడానికితగినట్టుగా, సకల...వినరుండు—సకల దిక్ = అన్ని దిక్కులందు, భాసమాన = ప్రకాశిస్తున్న, కీర్తి వినరుండు = కీర్తిసమూహము గల (ఇతని అనేక విధాలయిన కీర్తిగురించి నాలుగు దిక్కులనున్న లోకులువింటూ ఉంటారని భావము), పాండవ అగ్రేసరుఁడు = పాండవులలో జ్యేష్ఠుడు, ప్రజల౯, పాలించె౯ = ఏలెను.

*విశేషము :*

సార్వభౌము డంటే సర్వభూమికి ప్రభువు. అన్నీ ఉన్నవాడు కావాలి. ఇక్కడ ధర్మ రాజుకు అదిలేదు, ఇదిలేదు, ఇదిలేదు. అదిలేదు—ఏదీలేదు. అయినా ఇతడే "సార్వభౌముడు" అని ప్రజలంటున్నారు. ఇలాంటి సార్వభౌముడి నెక్కడా చూడ మంటాం మనము. అందు కోసమే ''అప్రతిముడు" = సాటిలేనివాడు అని కవే చమత్కారంగా చెప్పాడు.

సీసంలో సాధారణ లోపాలు లేనివాడయి అప్రతిము డయాడు. గీతములో ఏమీలేని సార్వభౌము డయి అప్రతిము డయాడు.

*పాఠాంతరము :*

మఱియుఁ దొల్లిటిరాజుల మహిమలెన్న
నితఁడె సార్వభౌము డప్రతిముఁ డనుచు

— వేదమువారు.

*అలంకారము :*

విభావన, పరికరాంకురము - అంత్యానుప్రాసము.

ఎంత లెస్సగ నున్న నంత వేడుకె కాని
ప్రజల కల్మి కసూయపడుట లేదు,
తనుఁ గొల్వవలె నంద అనుప్రియంబే కాని
మానిసి వెగటించుకైన లేదు,
నిచ్చవేఁడిన నర్థి కిచ్చు చిత్తమె కాని
మును పింత యిచ్చితి ననుట లేదు,
రే వగల్ ధర్మ మార్గించు దృష్టియె కాని
న్యాయంబు దప్పిన నడక లేదు,
"కలఁడె యిటువంటిరాజు లోకమున నెందు !
జలధి వలయిత వసుమతీ చక్రమెల్ల
యేలవలె శాశ్వతముగాఁగ నీ ఘనుండె;
యేలవలె నన్యు"లన నృపాలుఁ డలరె. 87

సుగమమయిన ఈ సీసపద్యంలో గూడ ఈ రోజుల రాజులలో ఉండే కొన్ని అవగుణాలను కవి సూచిస్తున్నాడు.

(౧) ప్రజలు ఎంత సుఖంగాఉంటే ధర్మరాజు అంత సంతోషించేవాడే కాని, వీరికంత సౌఖ్యమా అని ఓర్వలేని గుణం కలవాడు కాడు.

(౨) అందరూ తనతో ఆపనీ ఈపనీ చేసుకుంటూ ఉండాలని కోరేవాడేకాని, వాడొద్దు వీడు కిట్టడు అని ఎంచేవాడు కాడు.

(౩) నిచ్చ = ఎల్లప్పుడు—అంటే మాటిమాటికి—వచ్చి అది ఇవ్వండి ఇదివ్వండి అని కోరుతూ ఉండినా, యాచకులకు ఇచ్చేవాడేకాని, మొన్నమొన్న ఇంత ఇచ్చానుకదా అని సాగనంపేవాడుకాడు.

(౪) రాత్రింబగళ్లు ధర్మకార్యాలు చేస్తూ ఆరూపంగా పుణ్యంసంపాదించా లనేవాడేకాని, నాయము (నీతి) తప్పి ప్రవర్తించేవాడు కాడు.

"ఇటువంటి రాజు లోకమునఁ, ఎందుఁ = ఎక్కడైనా, కలడె = ఉన్నాడా ? (లేడని భావం), జలధి...చక్రమెల్ల—జలధి = సముద్రముచేత, వలయిత = చుట్టబడిన, వసుమతీ చక్రము ఎల్ల = భూమండల మంతటినీ, ఈ ఘనుండె = గొప్పగుణాలు గల ఈ ధర్మరాజే, శాశ్వతముగాఁ గఁ = ఎల్లప్పుడు, ఏలవలెన్ = పరిపాలించాలి, అన్యులు = ఇతరులు, ఏల = ఎందుకు, వలెన్ = కావలెను? (కేవలము అనవసరమని భావము)", అనన్ = (ఈ ప్రకారం) ప్రజలు అనేలాగ, ఆ నృపాలుఁడు = ఆ ధర్మరాజు, అలరెఁ = ఉండెను.

*పాఠాంతరము :*

'ఇచ్చ వేడిన నర్థికిచ్చు చిత్తమెకాని...'

—నోరి గురులింగశాస్త్రిగారు.

ఈపాఠములో 'మునుపింత యిచ్చితి' ననడానికి బిగువు తగ్గుతుంది.

*అలంకారము :*

యమకము.

కోప మొకింతలేదు, బుధకోటికిఁ గొంగు పసిండి, సత్యమా
రూపము, తారతమ్యము లెఱుంగు స్వతంత్రుఁడు, నూతన ప్రియా
టోపము లేని నిశ్చలుఁ, డిటుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపర లక్షణం బనఁగ వచ్చునొకో యల ధర్మనందనుఁ. 88

అర్థము :

కోపము, ఒకింత = కొంచెమైనా, లేదు, బుధకోటికిఁ = పండితుల సమూహానికి, కొంగు పసిండి = కొంగున మూటగట్టుకొని ఉన్న బంగారము (ఎప్పుడు కావలిస్తే అప్పుడు ఉపయోగించుకో దగినది), సత్యమా = సత్యం చెప్పడం సంగతంటారా, రూపము = దాని స్వరూపమే అతడు (మూర్తీభవించిన సత్యభాషణు డన్నమాట), తారతమ్యములు = మనుష్యులలో ఉన్న హెచ్చు తక్కువలు (వ్యత్యాసము), ఎఱుంగుఁ, స్వతంత్రుఁడు = వారూవీరూ చెప్పినట్టు చేయక తానే స్వయముగా మంచి చెడ్డలను ఆలోచించి నిర్ణయాలూ కార్యాలూ చేయడంలో స్వతంత్రుడు, నూతనప్రియ ఆటోపము = కొత్తవిషయాల యందు ప్రేమచూపించే ఆడంబరము, లేని = ఏమీ లేనటువంటి, నిశ్చలుఁడు = స్థిరస్వభావము కలవాడు (అనగా కొత్తవ్యక్తిగానీ విషయంగానీ వింతగానూ, పాత రోతగానూ చూడకుండా—చపలత లేకుండా ప్రవర్తించేవాడు).

ఇట్లు, కృతలక్షణుఁడై = ప్రసిద్ధమైన మంచి లక్షణములు కలవాడై (కృతయుగములో ఉండదగిన మంచి లక్షణములు కలవాడై అని గూడ), చెలంగఁగన్ = ప్రవర్తిస్తుండగా, అల ధర్మనందనుఁ = యమధర్మరాజు కొడుకు ఆ ధర్మరాజును – ధర్మాచరణ యందే సంతోషము పొందేవాడిని, ద్వాపరలక్షణుండు = సందిగ్ధమైన లక్షణాలు కలవాడు (ద్వాపరయుగంలో ఉండ దగిన లక్షణాలు అని గూడ), అనఁగఁ వచ్చునొకో = అనవచ్చునా ? కూడదని భావము.

తాత్పర్యము :

కోపంలేకుండా, పండితాదరణ కలిగి, ఎవరు ఏపాటివారో గ్రహించి, స్వయంగా ఆలోచించి కార్యాలు చేస్తూ, కొత్త వింత అని ఆడంబరం చూపకుండా ఉండేవారు కృతయుగ మనుష్యులు. ఆ కృతయుగ లక్షణాలన్నీ పైనిచెప్పినట్లు ధర్మరాజు కున్నాయి. అయినా అతడు ద్వాపరయుగంలో జీవించాడు కాబట్టి ద్వాపరలక్షణుండు అనడం న్యాయంకాదు ఎందుచేతనంటే, ద్వాపరలక్షణుడు అంటే సందిగ్ధమైన గుణాలు కలవాడు అన్న అపార్థం గూడా ఉంది.

విశేషము :

కొంగుపసిఁడి _ అవసరానికి ఆదుకొనే అధికారి _ సులభంగా దొరుకుతాడు.

నూతన ప్రియాటోపము _ ఆ ప్రభువులలో సర్వసాధారణంగా ఉన్న అవలక్షణము. అందుకే 'పృథివి నధిపులు నూతన ప్రియులు కారె?' అన్నారు.

స్వతంత్రుడు — అనుయాయుల సలహాలమీద ఆధారపడి నిర్ణయాలూ కార్యాలూ చేసే అసమర్థుడు కాడు, స్వయంగా చూడగల సమర్థు డన్నమాట.

అలంకారము :

శ్లేష, అపహ్నుతి.

దుర్జయ విమ తాహంకృతి
మార్జన, యాచనక దైన్య మర్దన, చణ దోః
ఖర్జులు గల రతనికి భీ
మార్జున నకుల సహదేవు లను ననుజన్ముల్. 89

అర్థము :

దుర్జయ......ఖర్జులు—దుర్జయ = (వీరిని) జయించ శక్యముకాదని ప్రసిద్ధిపొందిన, విమత = శత్రువుల, అహంకృతి = గర్వాన్ని, మార్జన = తుడిచి వేయడానికిన్నీ, యాచనక = యాచకులయొక్క, దైన్య = దీనత్వాన్ని, మర్దన = నిర్మూలించడానికిన్నీ, చణ = నేర్పుగలిగిన —సమర్థమైన, దోఃఖర్జులు = బాహువుల దురద (తిమురు) కలవారు, భీమ, అర్జున, నకుల, సహదేవులను, అనుజన్ముల్ = తమ్ములు, అతనికి = ఆ ధర్మరాజుకు, కలరు = ఉన్నారు.

తాత్పర్యము :

ఆ ధర్మరాజుకున్న నలుగురు తమ్ములు దుర్జయులని పేరుపొందిన శత్రువులను ఓడించడానికీ, యాచకుల దీనత్వం పోగొట్టడానికీ, ఎల్లప్పుడూ ఉత్సాహం కలిగి ఉండేవారని భావము.

విశేషము :

చేతుల (కండూతి) దురద ఒకరిని కొట్టడానికో, ఎవరికైన ఇవ్వడానికో అని మనవారు నమ్ముతారు. ఈ పద్యములో కవి ఆ రెండు ఫలితాలూ కనబరిచాడు. వారు శత్రువులను కొడతారు, యాచకులకు పెడతారు.

ఈ నలుగురు సోదరులు చాల పరాక్రమవంతులున్ను, ఉదారస్వభావం కలవారున్ను అని భావము.

పంచామర తరులో, హరి
పంచాయుధములొ, గిరీశు పంచాస్యములో
యంచున్ సకల జనంబులు
నెంచన్ బాండవులు వెలసి రేవురు ఘనులై. 90

అర్థము :

పాండవులు, ఏవురు = ఐదుగురూ, పంచ అమర తరులో = అయిదు దేవతా వృక్షాలో, హరి పంచ ఆయుధములొ = విష్ణుమూర్తియొక్క అయిదు ఆయుధాలో, గిరీశు = ఈశ్వరుని యొక్క, పంచఆస్యములో = అయిదు ముఖాలో, అంచున్, సకల జనంబులు = లోకులందరూ

(శత్రువులు గూడ అని భావము), ఎంచన్ = పొగిడేలాగ, ఘనులై = గుణాలచేత గొప్ప వారయి, వెలసిరి = ప్రవర్తించిరి.

విశేషము :

దేవతా వృక్షాలు : మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము అని అయిదు. ఇవన్నీ కోరిన కోరికలను ఇచ్చే స్వభావం కలవి.

విష్ణుమూర్తి ఆయుధాలు : పాంచజన్యము (శంఖం), సుదర్శనము (చక్రం), కౌమోదకి (గద), నందకము (ఖడ్గం), శార్ఙ్గము (విల్లు) అని అయిదు. ఇవి ఎల్లప్పుడు జయించే స్వభావం కలవి.

ఈశ్వరుడి ముఖాలు : సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అని అయిదు. ఇవన్నీ మహాపవిత్ర మయినవి.

పాండవులయొక్క దానబుద్ధి చూచి దేవతా వృక్షాలా అనీ, యుద్ధవిజయాలు చూచి విష్ణు ఆయుధాలా అనీ, పవిత్ర ప్రవర్తన చూచి ఈశ్వరుడి ముఖాలా అనీ ప్రజలందరూ సందేహించేవారు.

కోరిన కోర్కె లివ్వడములోను, శత్రువులను జయించడములోను, పవిత్ర ప్రవర్తనలోను పాండవులందరూ గొప్పవారని భావము.

అలంకారము :

ఉదాత్తము, సందేహము.

ఒరిమయు భక్తియు న్నెనరు నోర్పు గనంబడఁ, బెద్ద పిన్న యం
తరువు లెఱింగి, మాట జవదాఁటక, చెయ్వుల వేఱులేక, యొం
డొరుల మనమ్ములో మెలఁగుచుండిరి, "పాండు కుమారు లెంత నే
ర్పరు, లిల నన్నదమ్ముల సరాగము వారలదే సుమీ" యనఁగ. 91

అర్థము :

ఒరిమయు = స్నేహభావము (పొత్తు), భక్తియున్, నెనరు = ప్రేమ, ఓర్పు = సహనము, కనంబడ = కనబడేలాగ, పెద్ద పిన్న అంతరువులు = చిన్నాపెద్ద అన్న వ్యత్యాసాలు, ఎఱింగి = తెలుసుకొని, మాట జవదాఁటక = ఒకరిమాట ఒకరు మీరకుండ, చెయ్వులన్ = చేసేపనులయందు, వేఱులేక = భేదభావాలు లేకుండ, ఒండొరుల మనంబులోన్ = ఒకరి మనసులో ఒకరు - ఒకరి మనసు ననుసరించి ఒకరు నడుచుకుంటూ, "పాండుకుమారులు,

ఎంతనేర్పరులు ! ఇలన్ = లోకములో, అన్నదమ్ముల, సరాగము = ఒద్దిక (పరస్పరప్రేమ), వారలదే సుమీ", అనన్ = అని ప్రశంసించేలాగ, మెలఁగుచుండిరి = ప్రవర్తించుచుండిరి.

తాత్పర్యము :

స్నేహము, భక్తి, సహనము కలిగి, చిన్నా పెద్దా అనే వ్యత్యాసాలు చూచుకుంటూ, ఒకరి మాట ఒకరు పాటిస్తూ, అందరూ ఒక్క మనసుతో పనులుచేస్తూ, అన్యోన్య ప్రేమతో పాండు కుమారులు ప్రవర్తిస్తుండేవారు. వారిని చూచి ప్రజలు అన్నదమ్ముల ఒద్దిక అంటే వారిదే అని ప్రశంసించే వారని భావము.

విశేషము :

ఒండొరుల మనమ్ములో మెలగడంలో చమత్కారముంది. ధర్మరాజు మనసులో భీముడు ఉండిపోతే, భీముడి మనసులో ధర్మరాజుండడానికి వీలుండదు. అయినా పాండవు లయిదుగురూ అలాగు ఉండగలిగారు. కాబట్టే "పాండుకుమారు లెంత నేర్పరులు !" అన్న ప్రశంస.

పాఠాంతరము :

నెరిమియు భక్తియు న్నెనరు నేర్పు గనంబడ......

—తిరుపతి వేంకట కవులు.

నెరిమి అన్న మాటకు అర్థం స్పష్టంగా కనబడదు. ఈ చరణంలోనే 'నేర్పుగనంబడ' అని చెప్పుతూ చివరను, "ఎంత నేర్పరులు !" అని ఆశ్చర్య పడడంలో సారస్యములేదు.

అలంకారము :

సముచ్చయము.

## అర్జునుడు

అన్నలపట్లఁ దమ్ముల యెడాటమునన్ సముఁడంచు నెన్నఁగా
నెన్నికగన్న మేటి, యెదు రెక్కడ లేక నృపాలకోటిలో
వన్నెయు వాసియుం గలిగి వర్తిలు పౌరుషశాలి, సాత్త్వికుల్
తన్ను నుతింపఁగాఁ దనరు ధార్మికుఁ డర్జునుఁ డొప్పునెంతయున్. 92

అర్థము :

అన్నలపట్లన్ = అన్నల యెడలను, తమ్ముల ఎడాటమునఁ = తమ్ముల యెడలను, సముఁడు అంచు = సమానమైన భావాలుకలవాడని, ఎన్నఁగాన్ = ప్రజలనుకొనేలాగ, ఎన్నికఁ గన్న మేటి = పేరు పొందిన ఘనుడు (అన్నలయందు చూపిన గౌరవస్నేహ భావాలనే తమ్ముల యందుకూడ చూపుతూ ప్రవర్తిస్తాడని భావము) నృపాలకోటిలోఁ = రాజులసమూహములో- కోటిమంది రాజులలోనైనా అని చమత్కారము, ఎదురు = ఎదిరించి నిల్వగలవాడు, ఎక్కడ లేక, వన్నెయుఁ = ప్రసిద్ధిని, వాసియుఁ = గొప్పతనమును, కలిగి, వర్తిలు = ప్రవర్తించే, పౌరుషశాలి = పరాక్రమవంతుడున్ను, సాత్త్వికుల్ = సత్వగుణముకలవారు-శాంతస్వభావులు, తన్ను, నుతింపఁగాఁ = ప్రశంసించే విధంగా, తనరు = ఉండే, ధార్మికుడు = ధర్మప్రవర్తన కలవాడున్ను అయిన, అర్జునుఁడు, ఎంతయుఁ ఒప్పుఁ = చాల ఘనతతో ఉన్నాడు.

తాత్పర్యము :

అర్జునుడు అన్నలయందూ తమ్ములయందూ సమబుద్ధితో మెలగుతూ ఉంటాడు. తన్ను ఎదిరించి నిల్వగలవాడు రాజలోకంలో ఎవ్వడూ లేడని శూరులు పొగుడుతూ ఉంటారు. సత్వ స్వభావము కలవారు ఇతడు చాల ధర్మప్రవర్తన కలవాడని ప్రశంసిస్తుంటారు.

విశేషము .

అర్జునుడు అన్నలకు అణకువ చూపుతూ తమ్ములమీద అధికారం చెలాయించేవాడు కాక సమబుద్ధితో మెలగేవాడు.

అన్నలవైపు లెక్కపెడితే ఇద్దరున్నారు, తమ్ములవైపునా ఇద్దరున్నారు. ఎటులెక్క పెట్టినా సముడే, మూడోవాడే, పాండవ మధ్యముడు అని చమత్కారం. ఈ చమత్కార మీ పద్యంలో ఉందని పాఠకుడిని హెచ్చరించడానికే కవి 'ఎన్నగా, ఎన్నికగన్న' అన్న పదాలు ఉపయోగించాడు. ఎన్నుట = లెక్కపెట్టుట.

నృపాలకోటిలో అన్నప్పుడు 'కోటిమంది రాజులలోనైనా' అన్న చమత్కారార్థంకూడా కవికి ఉందనాలి. ఇతడికి ఎదురెక్కడ లేదని పౌరుషశాలురు ప్రశంసిస్తుండగా, సాత్వికులు ఇతడి ధర్మప్రవర్తన పొగుడుతుంటారు. ఉభయ రంగాలలోనూ పేరు పొందినవాడని భావము.

వన్నెవాసీ-ఇదొక పలుకుబడి, కీర్తి ప్రతిష్ఠలని అర్థం.

అలంకారము :

శ్లేష, ఉదాత్తము.

అతని నుతింప శక్యమె ! జయంతుని తమ్ముఁడు సోయగమ్మునన్,
బతగ కులాధిప ధ్వజుని ప్రాణసఖుండు కృపారసమ్మునన్
క్షితిధర కన్యకాధిపతికిన్ బ్రతిజోదు సమిజ్జయమ్ము నం,
దతని కతండె సాటి చతురబ్ధి పరీత మహీతలమ్మునన్. 93

అర్థము :

(౧) అతనిన్ = అర్జునుని, నుతింపన్ = (తగినంతగా) పొగడడానికి, శక్యమె = (ఎవరికైనా) శక్యమా ? - శక్యముకాదని భావము, (ఎందుచేతనంటే అతడు) సోయగమ్మునన్ = అందములో, జయంతుని తమ్ముఁడు = (సౌందర్యానికి ప్రసిద్ధిపొందిన) జయంతుడి వంటివాడు. ఇక్కడ 'తమ్ముడు' అన్న పదము ఉపమానాన్ని తెలియజేసేమాట.

ఈ జయంతుడు ఇంద్రుడి కొడుకు. అర్జునుడు గూడ ఇంద్రుడికీ కుంతికీ పుట్టినవాడే. కాబట్టి, పురాణాలనుపట్టి చూస్తే అర్జునుఁడు జయంతుడికి తమ్ముడే అవుతాడు. ఆ సంబంధాన్ని తెలిపే 'తమ్ముడు' నే ఉపమావాచకంగా ఉపయోగించడం చక్కని చమత్కారము.

(౨) కృపారసమ్మునన్ = దయారసములో, పతగ కులాధిపధ్వజుని—పతగ = పక్షుల యొక్క, కుల = జాతికి, అధిప = ప్రభువయిన గరుడుని, ధ్వజుని = ధ్వజముగాగల (గరుడ ధ్వజుడైన) విష్ణువునకు (కృష్ణునికి), ప్రాణసఖుండు = ప్రాణస్నేహితుడు — పోలినవాడు. ఇక్కడ సఖుడన్న పదము గూడ ఉపమావాచకము.

దయారసానికి విష్ణువు సుప్రసిద్ధుడు - లోకాలను పోషించేవాడు. ఆ విష్ణుడికి(కృష్ణుడికి) అర్జునుడు ప్రాణసఖుడని పురాణాలు. ఈ నేస్తము నరనారాయణుల కాలంనుంచీ వస్తున్నది. ఈ సంబంధాన్ని తెలిపే "ప్రాణసఖుండ"న్న మాటనే ఉపమావాచకంగా కవి వాడాడు.

(౩) సమిత్ జయమ్మునన్ = యుద్ధవిజయాలలో, క్షితిధర...పతికిన్—క్షితిధర = పర్వతముయొక్క, కన్యకా = కూతురైన పార్వతికి, అధిపతికిన్ = భర్త అయిన ఈశ్వరుడికి, ప్రతిజోదు = పోటీ—ఎదిరి వీరుడు, అంటే పోలినవాడు, ఇక్కడ 'ప్రతిజోదు' అన్న పదము ఉపమావాచకము.

త్రిపుర సంహారము చేసిన ఈశ్వరుడు పరాక్రమానికీ, యుద్ధవిజయానికీ ప్రసిద్ధుడు, పురాణాలనుపట్టి చూస్తే పందికోసం శివుడు కిరాత వేషంలో ఉండగా అర్జునుడు అతడి నెదిరించి పాశుపతాస్త్రం సంపాదించాడు. ఆ సంబంధాన్ని తెలిపే "ప్రతిజోదు" అన్నమాటనే కవి ఉపమావాచకంగా ఉపయోగించాడు.

(౪) చతుర...తలమ్మునన్—చతురబ్ధి = నాలుగు సముద్రములచేత, పరీత = చుట్టుకొనబడిన-సమస్తమైన, మహీతలమ్మునన్ = భూమండలమందు, అతనికి, అతండె, సాటి = సమానుడు (ఇతరు లెవ్వరూ సాటి కారు).

తాత్పర్యము :

అర్జునుడు అందములో జయంతుని, దయాస్వభావంలో విష్ణుమూర్తిని, యుద్ధవిజయంలో ఈశ్వరుడిని పోలి ఉంటాడు. భూమండల మంతటిలోను అతడి కతడేసాటి. అతనిని తగినట్టు పొగడడం కష్టమని భావము.

విశేషము :

ఉపమానం చెప్పవలసి వచ్చినప్పుడు "వాడితమ్ముడు వీడని, వీడినేస్తం వాడని, వాడి జోడు (డీ) వీడని" అంటూఉంటాము. ఈ పద్యంలో జయంతుడిని, విష్ణువుని ఈశ్వరుడిని పోలినవాడు అనడానికి క్రమంగా తమ్ముడు, ప్రాణసఖుడు, ప్రతిజోదు అని, వారివారి కున్న పురాణసంబంధాలను సూచించే పదాలనే చమత్కారంగా కవి ఉపయోగించాడు.

పురుషులలో అందానికి ప్రసిద్ధి పొందినవారు నలకూబరుడు, చంద్రుడు, జయంతుడు, మన్మథుడు అని అల్లసాని పెద్దన్నగారు

ఎక్కడి వాఁడొ యక్షతన యేందు జయంత వసంత కంతులన్
చక్కఁదనంబునన్ గెలువఁ జాలెడు వాఁడు......

అన్న పద్యంలో అంగీకరించారు.

విష్ణుడు లోకాల నన్నిటినీ పోషించి రక్షిస్తుంటాడు కాబట్టి, కృపారసానికి పేరు పొందిన వాడు. అలాగే, త్రిపురాసురులను జయించిన శివుడి పరాక్రమము భీమపరాక్రమమని ప్రఖ్యాతిని గాంచింది.

మొదటి మూడుచరణాలలో ముగ్గురితో పోల్చి, నాలుగో చరణంలో "అతని కతండె సాటి" అని చెప్పడం కొంచెం అసందర్భంగా కనిపిస్తుంది. దానినిపట్టి "చతురబ్ధి పరీత మహీ తలమ్మునఁ" అన్నదంతా పేలవంగానూ, కేవల పాదపూరణంగానూ భావించవచ్చును.

కాని అదికాదు. పై చరణాలలో సాటిచెప్పిన జయంతుడు స్వర్గంలోనివాడు, విష్ణుడు వైకుంఠంలోనివాడు, శివుడు కైలాసంలోనివాడు—ముగ్గురూ ఈ లోకంలోనివారు కారు. ఈ లోకంలో సాటిచెప్ప దగిన వాడెవడు అని అడిగితే, "ఈ నాలుగు సముద్రాలచేత చుట్టబడిన సర్వప్రపంచంలోను సాటిచెప్ప తగిన వాడు లేడు, అతని కతడే సాటి'' అని కవి బదులు చెప్పాడు.

ఇంత చక్కని చమత్కారముతో ఉపయోగించిన "చతురబ్ధి పరీత మహీతలమ్మునఁ" అన్నమాటలు చాల అర్థగౌరవంకలిగినవేగాని, పాదపూరణాలుకావు. "అతని నుతింపశక్యమె" అన్నమాటలు గూడ అర్థవంతమయినవే.

అలంకారము :

శ్లేష, ఉల్లేఖము, అనన్వయము.

పాఱఁ జూచినఁ బరసేన పాఱఁజూచు,
వింటి కొరగిన రిపురాజి వింటి కొరగు,
వేయునేటికి ? నల పాండవేయుసాటి
వీరుఁ డిల లేఁడు; ప్రతి రఘువీరుఁ డొకఁడె. 94

అర్థము :

(అర్జునుడు) పాఱన్ చూచినన్ = తేరిపారచూచిన మాత్రాన, పరసేన = శత్రువుల సైన్యము, పాఱన్ చూచున్ = పారిపోవడానికి ప్రయత్నించును, వింటికి = విల్లు ఎత్తిపట్టుకోడానికి, ఒరగినన్ = వంగినంత మాత్రాన, రిపు = శత్రువులయొక్క, రాజి = సమూహము, వింటికి = ఆకాశానికి (ఇక్కడ స్వర్గాని కన్నమాట), ఒరగున్ = అభిముఖమయి వెళ్లును, అనగా ఆ శత్రువులు చచ్చి వీరస్వర్గము పొందుతారన్నమాట, వేయున్ ఏటికి = వెయ్యిమాటలెందుకు ? అల పాండవేయుసాటి = ఆ అర్జునునితో పోల్చదగినటువంటి, వీరుఁడు = పరాక్రమవంతుఁడు, ఇలన్ = లోకములో లేఁడు, ప్రతి = అతనిసాటి అయినవాడు, రఘువీరుఁడు = రామచంద్రుడు, ఒకడె (ఇంకొకడు లేడనిభావము).

తాత్పర్యము :

అర్జునుడు కొంచెం తీక్షణంగా చూచాడంటే చాలు, శత్రుసేనలు పలాయనం చిత్తగిస్తాయి; విల్లు ఎత్తుకోడానికి వంగితే చాలు, శత్రువులు వీరస్వర్గానికి దారి తీస్తారు. ఆ అర్జునుడితో సాటిచెప్ప దగినవాడు ఒక్క దశరథరాముడేగాని వేరొకడు లేడు.

విశేషము :

'వా డటేఒరగుతాడు' అంటే ఆ పక్షానికే అభిముఖంగా పోతాడన్నమాట. రెండో వింటికొరగుటకు అలాంటి అర్థమే చెప్పుకోవాలి.

యుద్ధంలో చచ్చినవారు వీరస్వర్గానికి పోతారని ఒక నమ్మకముంది. అర్జునుడు విల్లు పట్టుకున్న కొన్ని క్షణాలలోనే శత్రువులు చచ్చి ఆ స్వర్గానికి పోతారని భావము.

విను, విన్ను అంటే ఆకాశము - ఇక్కడ పైని ఉన్న స్వర్గము అని చెప్పుకోవాలి. 'వినువీథి'వంటి సమాసాలలోనే కాక, విడిపదంగా గూడ 'విను' ఆకాశ మన్న అర్థంలో వాడారు. మార్కండేయపురాణము ఆ. 2 లో 'విను పుష్పవృష్టిఁ గురిసెన్' అన్నారు.

పాఠాంతరము :

వీరుఁడిఁక లేఁడు, ప్రతి రఘువీరుఁ డొకఁడె
— తిరుపతివారు.

వింటి కరిగిన రిపురాజి వింటి కరుగు,
— మరొకపాఠం.

అలంకారము :

యమకము, అతిశయోక్తి, విభావన, శ్లేష.

అతిలోక సమీక జయో
న్నతిచే ధర్మజున కింపొనర్చుచు, వినయా
న్వితుఁడై సమస్తజన స
మ్మతుఁడై నరుఁడుండె నిటు లమానుషచర్యన్. 95

అర్థము :

అతిలోక = మానవ లోకానికి అతీతమైన, సమీక జయ = యుద్ధ విజయాల యొక్క, ఉన్నతిచేన్ = గొప్పతనముచేత—గొప్ప గొప్ప విజయాలచేత, ధర్మజునకు = ధర్మరాజుకు, ఇంపు ఒనర్చుచున్ = ప్రీతిని కలిగిస్తూ, వినయాన్వితుఁడై = అణకువతో కూడిన వాడై, సమస్తజన సమ్మతుఁడై = జనులందరికీ ఇష్టుడై, నరుఁడు = అర్జునుడు - మనుష్యుడు అనిగూడ, ఇటుల్ = ఈ ప్రకారము, అమానుషచర్యన్ = మనుష్యులకు అలవికానిప్రవర్తనతో, ఉండెన్.

తాత్పర్యము :

లోకాతీతమైన విజయాలు సాధించి ధర్మరాజుని ఆనందపరుస్తూ, వినయముతో అందరికీ ఇష్టుడయి, మానవుల కలవికాని గుణాలతో నరుడు (అర్జునుడు - మానవుడు) ఉండెను.

విశేషము :

అంత గొప్ప విజయాలు సాధించిగూడా వినయంతో ఉండడమూ, ఎందరినో శత్రువులను జయించిగూడా సర్వజన సమ్మతి పొందడమూ మనుష్య మాత్రులకు సాధ్యముకాదని భావము. ఇదే అమానుషచర్య.

మానవుడు (నరుడు) అమానుషచర్య నున్నాడని ఒక విరోధము కనబడుతుంది. కాని, నరుడు అంటే అర్జునుడని అర్థం చెప్పతుంటే ఆ విరోధము తీరిపోతుంది.

అలంకారము :

విరోధాభాసము.

గ దు ని రా క

అంతట నొక్కనాఁడు గదుఁ డన్ యదువంశ భవుండు రుక్మిణీ
కాంతుఁడు కూరిమిం బనుపఁగాఁ గుశలం బరయంగ వచ్చి యే
కాంతపువేళ ద్వారవతి యందలి వార్తలు దెల్పుచుఁ దటిత్
కాంతి మనోహరాంగులగు కన్నెల చక్కఁదనంబు లెన్నుచున్. 96

అర్థము :

అంతటన్ = ఈలాగుంటూ ఉండగా, రుక్మిణీకాంతుఁడు = రుక్మిణీభర్త (కృష్ణుడు), కూరిమిన్ = ప్రేమతో, కుశలంబు అరయన్ = పాండవుల క్షేమవార్తలు తెలుసుకొని రమ్మని, పనుపఁగాన్ = పంపినందువల్ల, గదుఁడు అన్ = గదుడన్న పేరుగల, యదువంశ భవుండు = యదువంశంలో పుట్టినవాడు (యాదవుడు), ఒక్కనాఁడు, వచ్చి, (ధర్మరాజాదులతో సంభాషణలయిన తరువాత) ఏకాంతపు వేళన్ = అర్జునుడి దగ్గర ఇతరులెవ్వరూలేని సమయములో, ద్వారవతియందలి = ద్వారకానగరములోని, వార్తలు తెల్పుచున్, తటిత్...రాంగులు అగు— తటిత్ = మెరుపువంటి, కాంతి (కలిగి), మనోహర అంగులు అగు = అందమైన శరీరములు కలవారగు, కన్నెల = కన్యలయొక్క, చక్కఁదనంబులు = అందచందాలను, ఎన్నుచున్ = వివరిస్తూ—

తాత్పర్యము :

పాండవుల క్షేమవార్తలు తెలుసుకురమ్మని కృష్ణుడు గదుడిని ఇంద్రప్రస్థం పంపించాడు. అతడు ఇంకెవ్వరూ దగ్గరలేనప్పుడు అర్జునుడితో మాట్లాడుతూ ద్వారకలో సుందరులైన కన్యకలను గూర్చి ముచ్చటిస్తూ (కిందివిధంగా వర్ణిస్తాడు).

విశేషము :

కృష్ణుడు గదుడిని పంపడం కేవలం క్షేమవార్తల కోసమే కాదు. సుభద్ర విషయం గూడ చెప్పుమన్న అంతరార్థముంది. దానికోసమే అర్జునుడితో ఏకాంత సంభాషణ.

ఆ ఏకాంతంలో ముచ్చటించినప్పుడు ఆఊరి వివాహిత లయిన కాంతలను వర్ణన చేయడం భావ్యముకాదు. అందుకే కవి "కన్నెల" చక్కదనంబు లెన్నుచున్ అన్నాడు. కన్నె_కన్య (అవివాహిత, పెండ్లి కాని యువతి, కాబట్టి వివాహానికి యోగ్య) అన్న పదము ప్రయోగించి కవి ఔచిత్యము పాటించాడు.

ఈ కావ్యంలో కృష్ణుడిని కవి మొట్టమొదటిసారిగా పాఠకులకు పరిచయం చేస్తున్నాడు. ఈ సందర్భంలో కృష్ణుడిని "రుక్మిణీకాంతుడు" అని పేర్కొనడం చాల భావగర్భితం.

ఆనాడు కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకొని పోయినట్టే ఈ కావ్యంలో అర్జునుడు సుభద్రను ఎత్తుకొని పోతాడని కవి సూచించాడు. "ద్వారక ముద్దుచెల్లెలట తన్నగరీమణి..." అన్న 86వ పద్యములో లాగానే, ఈ పద్యములో 'రుక్మిణీ కాంతుడు' అన్న పేరుతో ముందు రాబోయే కథను చమత్కారంగా చెప్పుతున్నాడు.

## సుభద్ర వర్ణన

కనఁ సుభద్రకుఁ సమంబుగాఁగ నే మృగీ విలో
కనఁ; నిజంబుగాఁగ నే జగంబునందుఁ జూచికా
కనఁ; దదీయ వర్ణనీయ హావ భావ ధీ వయః
కన న్మనోజ్ఞ రేఖ లెన్నఁగాఁ దరంబె గ్రక్కునన్ ? 97

అర్థము :

సుభద్రకున్, సమంబుకాఁగఁ = (అందములో) సమానమౌనట్టి, ఏ మృగీవిలోకనఁ = ఆడుజింక వంటి కన్నులుగల ఏకన్యకను, కనఁ = చూడలేదు, నిజంబు కాఁగన్ = వాస్తవంగా, జగంబునందు = లోకంలో, చూచికాక = చూడనిదే - చూడకుండానే, అనఁ = అనేవాడనుకాను (ప్రపంచంలో చాలమంది కన్యకలను చూచిన తరువాతనే ఈ అభిప్రాయము చెప్పుతున్నానని భావము), తదీయ...రేఖలు—తదీయ = ఆ సుభద్రయొక్క, వర్ణనీయ = పొగడదగిన, హావ భావ = హావభావాలు, ధీ = చక్కనిబుద్ధి, వయః = యౌవనప్రాయము, కనత్ = ప్రకాశిస్తున్న, మనోజ్ఞ = మనోహరమైన, రేఖలు = సౌందర్యవిశేషాలు, గ్రక్కునఁ = త్వరగా—నాలుగు మాటలలో, ఎన్నఁగాన్ తరంబె = వర్ణించడం సాధ్యమా ? (కాదు.)

తాత్పర్యము :

"ప్రపంచంలో ఎందరినో కన్యలను చూచే చెప్పుతున్నాను : అందంలో సుభద్రతో సమానమైన కన్యను ఎక్కడా చూడలేదు. ఆమె హావభావాలూ బుద్ధిప్రాయాలూ సౌందర్య విశేషాలూ నాలుగు మాటలలో వర్ణించడం సాధ్యము కాని పని" అని, గదుడు చెప్పుతున్నాడు.

విశేషము :

భావము = మనసులో మదనవికారము (ప్రేమ) మొట్టమొదటి సారిగా పుట్టడము. హావము = కనులు మొదలైనవాటి చలనమువల్ల ఆ భావాన్ని తెలియజేయడము.

అంత అందమైన కాంతను టూకీగా వర్ణించాలంటే జరిగేపని కాదంటూ గదుడు, సుదీర్ఘమయిన వర్ణనకే పూనుకుంటానని సూచించాడు. దాదాపు పది పద్యాలలో వర్ణించాడు.

సుభద్రను వర్ణిస్తున్నప్పుడు గదుడికి కలిగిన ఉత్సాహాతిశయాన్ని తెలియజేయడానికే కవి ఇక్కడ ఈ పంచచామర వృత్తము ఉపయోగించి అయిదు 'కనన్' లు వాడాడు.

పాఠాంతరాలు :

దీనిలోని నాలుగు చరణాలు 'కనన్' తోనే ఆరంభించి, చివరనుగూడా 'కనన్' అన్న పదాన్నే ఉంచి పద్యం ఆద్యంతాలను అందంగా కలియగట్టాడు. కాబట్టి

......ఎన్నఁగాఁ దరంబె గ్రక్కునన్

అన్న పాఠాంతరాన్ని అంగీకరించలేము. గ్రక్కునన్, గ్రక్కునన్ అని రెండు రూపాలూ ఉన్నాయి.

మరొక పాఠాంతరము :

......తదీయ వర్ణనీయ హావ భావ రేఖలే
కనన్మనోజ్ఞరేఖ లెన్నఁగాఁ దరంబె గ్రక్కునన్.

—తిరుపతివారు.

అలంకారము :

చక్కని శబ్దాలంకారము.

ప్రాయపుఁ డెక్కునన్ జెలువ పల్కులు చిల్కల గారవించుఁ గం
దోయి చకోరపాళి దయతోఁ బెనుచుం, జనుకట్టు మచ్చికల్
సేయు సదా రథాంగ యుగళిన్, నడ లంచల బుజ్జగించు ; నౌ !
నేయెడ నింపుగావు గణియింప నవీన వయో విలాసముల్ ? 98

అర్థము :

ప్రాయపుఁడెక్కునన్—ప్రాయము టెక్కునన్ = యౌవన సౌందర్యమువల్ల కలిగిన అతిశయముతో, చెలువ పల్కులు = ఆ సుభద్రయొక్క మాటలు, చిల్కలన్, గారవించున్ = ఆదరించును, కన్దోయి = కన్నులజంట (రెండు కనులు) చకోరపాళిన్ = చకోరపక్షుల సమూహమును, దయతోన్, పెనుచున్ = పెంచును, చనుకట్టు = స్తనముల కుదురు, రథాంగ యుగళిన్ = జక్కవపక్షుల జంటను, సదా = ఎల్లప్పుడు, మచ్చికల్‌చేయున్ = చనవిచ్చి దగ్గరే ఉంచుకొనును — మాలిమిచేయును, నడలు = నడక, అంచలన్ = హంసలను, బుజ్జగించున్ = లాలనము చేయును, ఔన్ = అవును—న్యాయమే, గణియింప = ఆలోచించగా, నవీన వయో విలాసముల్ — నవీన = నూతనమైన, వయః = యౌవనముయొక్క, విలాస

ముల్ = వినోదాలు - వేడ్కలు, ఏ ఎడఁ = ఏ విషయములందు - ఏ వస్తువులందు, ఇంపు కావు ? = ప్రియముచెందవు ? (ఎలప్రాయములో ఉన్న వారికి అన్నీ ఇంపుగానే ఉంటాయని భావము.)

మరొక అర్థము :

వయః అంటే పక్షి అని గూడ అర్థం ఉంది. పద్యములో చెప్పిన చిల్కలూ, చకోరాలూ, జక్కవలూ, హంసలూ అన్నీ పక్షులే. దీనినిపట్టి ఈ నాల్గో చరణానికి గణియింపఁ = ఆలోచించగా, నవీనవయః = లేతవయసుగల పక్షులయొక్క, విలాసముల్ = లీలలు, ఏ ఎడఁ = ఎవరికి, ఇంపుగావు ? = ఇంపుగా ఉండవు ? (అందరికీ ఇంపుగానే ఉంటాయనీ, కాబట్టే సుభద్ర ఈ పక్షులను ఆదరించిందని భావము.)

తాత్పర్యము :

యౌవనాతిశయంచేత సుభద్ర పల్కులు చిల్కల నాదరిస్తుంటాయి, కనులు చకోర పక్షులను పెంచుతుంటాయి, స్తనముల కుదురు జక్కవ పిట్టలను మచ్చిక చేస్తుంటుంది, నడక హంసలను లాలన చేస్తుంటుంది. ఎలప్రాయంలో ఉన్నవారికి, అన్ని వస్తువులూ ప్రియంగానే ఉంటాయికదా. (కొత్త కొత్త పక్షుల క్రీడలు ఎవరికి ప్రియంగా ఉండవు ? అని గూడ భావము.)

విశేషము :

ఈ పద్యానికి వ్యాఖ్యానం వ్రాస్తూ వేదంవారు ఇలా అన్నారు : "ప్రాయపుటెక్కునఁ = ఎలజవ్వనంపు విలాసముచేత, చెలువ = సుభద్రయొక్క. గారవించున్—దయతోఁ బెనుచుఁ— మచ్చికలుసేయుఁ— బుజ్జగించున్—ఈ పదములు సామ్యమును చెప్పును — పోలును అని తాత్పర్యము......"

జూలూడువారూ, బులుసువారూ. నోరివారూ గూడా ఆ అభిప్రాయాన్నే ప్రకటించారు. ఈ నాలుగు మాటలూ సాధారణంగా వాడే ఉపమావాచకాలు కావు.

ఉపమావాచకాలు కాని ఇతర పదాలను ఒక్కొక్కప్పుడు ఉపమావాచకాలుగా ప్రయోగించి సహృదయులను మెప్పించ గల నేర్పు చేమకూర కవికి ఉంది; నిజమే.

'అతని నుతింప శక్యమె జయంతుని తమ్ముడు సోయగంబునఁ'

అన్న ౧౩వ పద్యములో తమ్ముడు, సఖుడు, ప్రతిజోదు అన్నమాటలు ఈలాంటివే. కాని వాటిని ఉపమానార్థంలో ఉపయోగించడానికి ఎంతో బలమూ సమర్థనా (పురాణ సంబంధమయినదో, సహజగుణాలకు సంబంధించినదో) ఉండాలి.

అలాంటి బలము ఈ పద్యములోని గారవించు మొదలైన పదాలకు కానరాదు.

ఈ పద్యములో కవి నిరూపించినది 'సామ్యము' కాదు. ఆధిక్యము. మాధుర్యగుణములో సామ్యము ఉన్నందువల్ల స్త్రీల పల్కులకు చిలుకపల్కులను ఉపమానంగా చెప్పుతారు కవులు. కాని సుభద్ర పల్కులు ఆ ఉపమానాన్ని అంగీకరించవు. గుణాధిక్యముతో ఆ చిల్కలను ఆదరిస్తా యని కవి అభిప్రాయము, గురువు శిష్యుడిని ఆదరించినట్లు.

గారవించు అంటే గౌరవించు అన్న అర్థం చెప్పితే ఈ తళుకు ఉండదు; ఆదరించు అన్న అర్థం చెప్పడం అవసరము. విరాటపర్వములో సైరంధ్రిగా వెళ్ళిన ద్రౌపది సుదేష్ణతో చెప్పిన అబద్ధాలలో చూడండి :

......నాకు ప్రాణంబు ప్రాణమై నన్నుఁ దన్న
కాగ భావించి యాదేవి గారవించు

—భార. విరా. 1-319.

(గారవించు = ఆదరించు — సూ. వి.)

'ప్రాయపుటెక్కు'తో ఆరంభించిన ఈ పద్యములో ఆ 'టెక్కు' ఎలాంటిదో కవి చమత్కారంగా చూపిస్తున్నాడు. మాధుర్యగుణములో పోలిక ఉండినా, ఆ మాధుర్య పరిమితిలో ఆధిక్యముందని సుభద్రపల్కులు సమానతనూ అంగీకరించవు, ద్వేషభావాన్నీ చూపవు.

అలాగే కన్నులు అందములో ఆధిక్యము చూపుతూ చకోరపక్షులను దయతో పెంచు తాయి; చనుకట్టు ఆకార సౌష్టవములో ఆధిక్యం చూపుతూ జక్కవలను మచ్చికచేసి దగ్గరే ఉంచుకుంటుంది; నడక వయ్యారములో ఆధిక్యము చూపుతూ హంసలను లాలన చేస్తుంది. అదీ సుభద్ర 'ప్రాయపుటెక్కు'. కాబట్టి 'పోలును' అని చెప్పడం కాక, 'మించును' అని చెప్పడమే కవి ఉద్దేశము అని నిర్ధారణ చేయవచ్చును.

ఈ వ్యత్యాసము మనసులో ఉంచుకొని ఆమెను కీరవాణి, చకోరాక్షి, కోక ( = జక్కవ) స్తని, హంసయాన అని అనవచ్చును, ప్రమాదము లేదు.

ఏ చెట్టునో అడవినో ఉండే చిలుకలను ఆదరించి పంజరాలలో ఉంచడం సమంజసము- గురువు శిష్యునిలాగా అని ధ్వని.

అలాగే, చంద్రుడి కోసం కనిపెట్టుకొని ఉండి, బారాది దూరంపోయి వెన్నెలలను తిని బ్రతుకుతుండే చకోరపక్షులను పోషించి పెంచుతుం దనడం చక్కగా ఉంది - దీనులను పోషించి నట్లు అని ధ్వని.

సాయంత్ర మయేసరికి జోడు విడిపోయి వియోగబాధ పొందుతూ ఉండే జక్కవ జంటను మచ్చికచేసి, విడిపోకుండా ఉంచుతుం దనడం బాగుంది-విడిపోయే వారిని చక్కట్లు దిద్దినట్లు అని ధ్వని.

ఒయ్యారమైన మందగమనము అలవర్చుకోలేక కాళ్ళుచుట్టూ తిరుగుతుండే హంసలను తొందరపడవద్దని లాలనచేయడం గూడ సొగసే, తొందరపడే వారిని మందలించినట్లు అని ధ్వని.

అలంకారము :

శ్లేష, వ్యతిరేకము, అర్థాంతరన్యాసము,

అతివ కుచంబులుఁ, మెఱుఁగుటారును, వేనలియుఁ, ధరాధిపో
న్నతియు, నహీనభూతి కలనంబు, ఘనాభ్యుదయంబు, నిప్పుడొం
దితి మని మాటిమాటికిని నిక్కెడు, నీల్గెడు, విఱ్ఱవీగెడున్;
క్షితి నిటుగాదె యొక్కొకనికిఁ నడుమంత్రపుఁగల్మి కల్గినన్. 99

అర్థము :

అతివ = సుభద్రయొక్క, కుచంబులున్ = స్తనములును, మెఱుఁగు ఆరును = నిగనిగలాడు నూగారును, వేనలియున్ = జుట్టును, (ఈ మూడు విషయాలు క్రమంగా) ధరాధిప ఉన్నతియున్ = (కుచములు) రాజుల ఐశ్వర్యమును (పర్వతరాజువంటి ఎత్తుకలిగి ఉండడమని ఇంకొక అర్థము), (నూగారు) అహీన...నంబు—అహీన = హీనముకాని అనగా ఎక్కువయిన, భూతి = ఐశ్వర్యముయొక్క, కలనంబు = ప్రాప్తిని (అహి = సర్పముల, ఇన = రాజు-అనగా కృష్ణసర్పముయొక్క, భూతి కలనంబు = ఐశ్వర్యప్రాప్తి అని మరొక అర్థము), (కొప్పు) ఘన = గొప్ప, అభ్యుదయంబు = శోభను (ఘన = మేఘముల, అభ్యుదయము = శోభను అని మరొక అర్థము), ఇప్పుడు = ఈ యౌవన సమయమందు, ఒందితిమి = ఈశోభను పొందినాము, అని, మాటిమాటికిని = తరుచుగా-అదేపనిగా, నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీగెడున్ = అత్యధికమయిన గర్వముతో ప్రవర్తించుచుండును, మాటకు మాటగా, అనగా క్రమంగా, కుచములు నిక్కను—పొడుచుకొని ఉండును, నూగారు నీల్గును—నాభినుంచి సాగి కనబడును, కొప్పు కిందుమీదయి విరగబడుచుండును. క్షితిన్ = లోకములో, ఒక్కొకనికిన్ = కొంతమందికి, నడుమంత్రపు కల్మి = మొదట లేక మధ్యకాలములో వచ్చిన సంపద, కల్గినన్ = కలిగినప్పుడు, ఇటుగాదె ? = ఈలాగే (నిక్కి-నీల్గి విర్రవీగడం) ఉంటుందికదా.

తాత్పర్యాము :

సుభద్ర పుట్టినప్పుడు లేని శోభ ఈ ఎలప్రాయములో కలిగి నందుకు స్తనాలూ, నూగారూ, కొప్పూ, నిక్కుతూ నీల్గుతూ విర్రవీగుతూ ఉంటాయి. లోకములో నడుమంత్రపు సంపద కలిగినప్పుడు కొందరు ఈ లాగే గర్వముతో ప్రవర్తిస్తారు కదా!

విశేషము :

'మాటి మాటికిన్' అని అనడంలో కవి క్రమాలంకార సూచన పాఠకుడి కిస్తున్నాడు. ఇది 'మాట మాటకుఁ' చాల దగ్గరగా ధ్వనిస్తుంది. వర్ణించినవి మూడు : స్తనాలు, నూగారు, కొప్పు. ఇక్కడి చేష్టలు మూడు : నిక్కడం, నీల్గడం, విర్రవీగడం. మాటకు మాటగా అన్నందువల్ల మొదటి మాటకు మొదటి చేష్టా, రెండోదానికి రెండో చేష్టా, మూడోదానికి మూడో చేష్టా అన్వయించాలి సుమా అని హెచ్చరిస్తాడు. లేకపోతే 'నిక్కెడు నీల్గెడు, విర్రవీగెడున్' అన్న మాటలన్నిటికీ 'విశేషముగా గర్వించి ఉండును' అని స్థూలంగా అర్థం చెప్పుకొని ఊరుకుంటా రేమో అని కవి తాపత్రయం.

సారంగధర చరిత్రలో చిత్రాంగి రత్నాంగిని తూలనాడుతూ (3-55) ఉన్న సన్నివేశంలో ఈ కవే ఇలా వ్రాశాడు :

జలరుహనేత్ర నన్నిపుడు సారెకు దూఱుచు గేరి నిక్కుచున్
నిలుగుచు విఱ్ఱవీగుచును నిక్కముగాఁగను నాతఁడేమియున్
తెలియఁడు, సాదువిడ్డఁడని నేరుపు మాటలఁ దేలనాడి గా
దిలి నుతు చేఁత చక్కటులు దిద్దెద వెంతటి నంగనాచివే !

అక్కడ స్థూలంగా గర్వచేష్ట లనే అర్థం చెప్పుకుపోతాము కదా ! ఇక్కడాలాగు కాదనీ, క్రమం చూడాలనీ 'మాటిమాటికిఁ' అని కవి ప్రయోగించాడు.

నడుమంత్రపు సంపద కలిగినప్పుడు అందరూ నిక్కి నీలిగి విర్రవీగుతా రనకుండా, 'ఒక్కొకనికిఁ' అని, ఆ చెడ్డగుణము కొందరికే పరిమితంచేసి కవి తన సౌమ్యస్వభావాన్ని ప్రకటించాడు.

అలంకారము :

క్రమము, శ్లేష, అర్థాంతరన్యాసము.

కేళికాసరసిలోఁ దేలియాడుటఁ జేసి
శైవాల లత కొంతసాటి వచ్చుఁ,
బుష్పమాలికలతోఁ బొందు సల్పుటఁజేసి
యెలదేఁటి గమి కొంత యీడు వచ్చుఁ,
గంటి కింపగు రేఖ గలిగి యుండుటఁ జేసి
మినుకుఁ గాటుక కొంత దినుసు వచ్చుఁ,
బిఱుద నొయ్యారంబు మెఱయుచుండుటఁ జేసి
చమరివాలము కొంత సమము వచ్చుఁ,

గాక నీలత్వమున సరిగావు తెలియ
నెఱిగలిగి యొక్క మొత్తమై నిడుదలై ద
శమ్ములై మెర్గులై కారుక్రమ్ముచున్న
వికచకమలాక్షి నును సోగ వెంట్రుకలకు. 100

ఈ పద్యములో కవి సుభద్ర తలవెంట్రుకలు వర్ణిస్తున్నాడు.

అర్థము :

౧. కేళికా సరసిలోఁ = జలక్రీడ లాడుకొనే చెరువులో, తేలియాడుటఁ జేసి = తేలి కదలుతుండడంచేత, శైవాల లత = నాచుతీగ, కొంతసాటి వచ్చున్ = ఒక కొంచెము—పూర్తిగా కాదు—సరిపోవును.

జలక్రీడలలో సుభద్ర తలవెంట్రుకల లాగానే నాచుతీగ గూడా సరస్సులో తేలి ఆడు తుంటుంది కాబట్టి పోలిక కొంతవరకు చెప్పవచ్చునని భావము. నీటిలో తేలియాడడము ఇక్కడ సమాన గుణము.

౨. పుష్పమాలికలతోన్ = పూలదండలతో, పొందుసల్పుటఁ జేసి = కలిసి ఉండడం వల్ల, ఎలతేటి గమి = కొదమ తుమ్మెదల సమూహము, కొంత ఈడు వచ్చుఁ = ఒక కొంచెము పోలును.

సుభద్ర కొప్పు లాగానే తుమ్మెదలు గూడ పూలమాలలతో కలిసి ఉంటాయి కాబట్టి, కొంత పోలిక అని భావము. మాలలతో కలిసి ఉండడమే సమాన గుణము.

౩. కంటికి, ఇంపు అగు రేఖ = ఆనందాన్ని కలిగించే సౌందర్యము, కలగి ఉండుటఁ జేసి, మినుకు కాటుక = మెరుగుగల కాటుక, కొంత దినుసు వచ్చున్ = ఒక కొంచెము సాటి అవును.

సుభద్ర జుట్టు కంటికి ఇంపయిన రేఖ—అందము కలిగి ఉంటుంది; ఆలాగే కాటుక గూడా కంటికి రెప్పలనంటి అందాన్నిచ్చే రేఖ (గీత) గా ఉంటుందనీ భావము. కొప్పు కంటికి అందంగా కనిపిస్తుందని భావము. కంటి కందంగా ఉండడమే సమానగుణము.

౪. పిఱుదఁ = వెనుకవైపున, ఒయ్యారంబు = అందము, మెఱయుచుండుటఁ జేసి = ప్రకాశించినట్లుండడంవల్ల—వెనుక ప్రక్కను అందంగా ఉంటూ ఉండడం వల్ల, చమరి వాలము = చామరము (చమరీమృగము యొక్క తోకతోనే చామరాలు తయారు చేస్తారు), కొంత సమము వచ్చు.

జుట్టులాగానే చామరము గూడా వెనుక ప్రక్కను ఒయ్యారంగా ఉంటుందని భావము. వెనుకప్రక్క అందంగా ఉండడమే సమానగుణము.

కాక = అంతేకాని - ఆపాటి సమానమగు గుణాలవల్ల కలిగిన స్వల్పమైన పోలికలు మాత్రమేకాని, నెఱి కలిగి = (పాము నడక వలె) వంకరలు కలిగి, ఒక్కమొత్తమై = గుంపుగా ఉండి, నిడుదలై = పొడవుగా ఉండి, దళమ్ములై = దట్టముగా ఉండి, మెఱుగులై = తళతళ ప్రకాశిస్తూ ఉండి, కారుక్రమ్ముచు ఉన్న = నల్లని కాంతిని వ్యాపింపజేస్తున్న, వికచ కమల అక్షి = (వికసించిన పద్మమువంటి కనులుగల) సుభద్రయొక్క, నును సోగ పెంద్రుకలకు = నున్నగానూ సోగగానూ ఉన్న తలవెంద్రుకలకు, నీలత్వమునన్ = నలుపుకాంతియందు, సరికావు = (పైని చెప్పినవేవియు) సమానము కాజాలవు.

తాత్పర్యము :

నాచుతీగ, తుమ్మెదలగుంపు, కాటుకరేఖ, చామరము, ఈనాలుగూ ఒక్కొక్క సమాన గుణము కలిగి ఉండడంవల్ల కొంత (స్వల్పముగ) మాత్రమే సాటి అవుతాయి; అంతేగాని సుభద్రయొక్క వంకరలు కలిగి మొత్తమై నిడుదలై ...నునుసోగ పెంద్రుకలకు నీలత్వమున సాటి కాజాలవు అని భావము.

విశేషము :

యువతుల తలవెంద్రుకలకు సాధారణంగా కవులు చెప్పే ఉపమానాలు : నాచుతీగ, తుమ్మెదలు, కాటుక, చామరాలు మొదలైనవి. సుభద్ర కొప్పు గీత భాగములో చెప్పిన ఎనిమిది గుణాలతో అత్యంతమయిన నీలత్వము కలది. ఆ గుణాలలో ఒక్కొక్కదానిలో సామ్యము మాత్రము కలిగినవే ఈ నాలుగూ అని అభిప్రాయము.

నాచుతీగ నీటిలో ............ ఈలాగున పామునడక వలె ఎంతదూరమైనా వ్యాపిస్తుంటుంది. ఆ వంకరనే నెఱికలిగి అన్నమాటతో కవి సూచించాడు; పూలమాలికల పొందు ఎలతేటి గమి అని గుంపును సూచించాడు; కాటుకరేఖ అని గీతలాగ నిడుదగా ఉంటుందనీ, చామరము లాగా దళముగా ఉంటుందనీ చెప్పాడు.

ఆరునెలలు స్నేహంచేస్తే వారు వీరవుతారని ఒక సామెత ఉంది. సాహచర్యము - సాంగత్యము - వల్ల ఒకరి గుణాలు ఒకరికి అలవడతాయని భావము. ఆ లక్షణాన్ని మనసులో ఉంచుకొని, పద్యములో ఉన్న కేళికా సరసి, పుష్పమాలికలు, మొదలైనవి నాలుగూ ఎక్కడెక్కడివో కాక సుభద్రకు చెందినవే అని అన్వయించుకుంటే గుణసామ్యానికి మరింత చమత్కారము కనబడుతుంది.

సుభద్ర తన కేళికా సరసిలో స్నానము చేస్తున్నప్పుడు, తన తలవెంద్రుకలతోపాటు నాచుతీగ గూడా తేలియాడుతుంది. ఆ సాంగత్యము వల్ల కొంత సమానత్వము కలిగింది. అలాగే తన పుష్పమాలికలతో కూడి ఉండినందు వల్ల తుమ్మెదలతోను, తన కంటికి ఇంపుగా

ఉండడం వల్ల కాటుకతోను, తన వెనుకనే ఉండడం వల్ల చామరాలతోనూ కొంత సామ్యము ఏర్పడుతుంది.

చామరాలు వెనుక ప్రక్కనే ఉపయోగిస్తారనడానికి భర్తృహరి—

పశ్చాచ్ఛ్లీలా వలయ రణితం చామరగ్రాహిణీనామ్

ఈ ఉపమానాల కున్న నాలుగు గుణాలే కాక, సుభద్ర తలవెంట్రుకలకు మరి నాలుగు గుణాలున్నాయని ఆధిక్యాన్ని రూఢిచేశాడు.

*పాఠాంతరము :*

1. రెండో సీసపాదానికి మరొక పాఠము :

ముద మతిశయ మొంద మురుపు జూపుటఁజేసి
నెమలి ఫించము సరి నెనయ వచ్చు

— నోరివారూ, వేంకటకృష్ణమాచార్యులవారూ.

దీనిలో ప్రక్రమము పోయింది; 'కొంతసాటి' కానరాదు.

2. నాలుగో సీసపాదానికి మరొకపాఠము :

పిఱుఁదు నొయ్యారంబు మెఱయుచుండుటఁ జేసి
చమరివాల మొకింత సమము వచ్చు

— వేదంవారూ, బులుసువారూ, నోరివారూ.

పిరుదుల అందాన్ని – తలవెంట్రుకలు సుభద్ర పిరుదుల అందాన్నీ, చామరాలు చమరీమృగం యొక్క పిరుదుల అందాన్నీ — ప్రకాశింప జేస్తాయనీ, కాబట్టే కొంత సామ్యము కలిగిందనీ వారి భావము.

ఈ పాఠములో "ఒకింత సమము" అని ఉంది. పై మూడు పాదాలలోనూ, 'కొంత' అనే ఉపయోగించాడు కవి. నియమ భంగము కలుగకుండ 'చమరివాలము కొంత సమము వచ్చు' అని ఉంచడం సమంజసము.

*అలంకారము :*

వ్యతిరేకము, క్రమము.

నలిన లీల సంచు నలినలి గావించు,
నించుమించు లాడు నించు మించు,
లేమ నగవుజూపు లేమన నగు, బాపు !
జగ మెఱుంగు దాని జగమెఱుంగు. 101

అర్థము :

లేమ = సుభద్రయొక్క, నగవుచూపులు = ఎప్పుడూ నవ్వుతున్నట్లు ఆనందమును ప్రకటించే చూపులు, నలిన లీల సంచుగా = పద్మముయొక్క విలాసమందలి అందమును (కాంతిని), నలినలి కావించుగా = బాగుగా నలిపివేయును—తిరస్కరించును; ఇంచు = మనోహరమయిన, మించుగా = మెరుపును, ఇంచుమించులు ఆడుగా = ఎక్కువ తక్కువ లాడును (తిరస్కరించును), బాపు ! = బాపురే ! ఓహో ! ఏమనగా అగుగా = ఏమని వర్ణించగలము, దాని = ఆ సుభద్రయొక్క, జగమెఱుంగు = ప్రశస్తమైన సౌందర్యము, జగము ఎఱుంగుగా = లోకులందరూ ఎరుగుదురు—అనగా, ఆ సౌందర్యము జగత్ ప్రసిద్ధ మన్నమాట.

తాత్పర్యము :

సుభద్ర చూపులు ఎప్పుడూ నవ్వుతూ ఉన్నట్టే ఉండి, పద్మాల సౌందర్యాన్నీ, మెరుపు అందాన్నీ తిరస్కరిస్తుంటాయి. ఆమెది జగత్ప్రసిద్ధిగల లావణ్యము.

ఆమె తామరసాక్షి అనీ, చంచలాక్షి అనీ భావము.

ఇంకొక విధంగా అన్వయించవచ్చును.

లేమ = సుభద్రయొక్క, నగవు జూపులు — నగవున్నూ చూపున్నూ, క్రమంగా— (నగవు) నలిన లీల సంచుగా = పద్మవిలాసము—వికాసము—లోని అందమును, నలినలి కావించుగా = చిందరవందర చేయును—నలిపివేయును, (చూపు) ఇంచుమించుగా = మనోహరమైన మెరుపును, ఇంచుమించు లాడుగా = నీవెంత నీ గొప్పతనమెంత అన్నట్టు హెచ్చు తక్కువలుగ మాటలాడును,...... అని గూడ అన్వయించవచ్చును.

వికసించిన పద్మముయొక్క అందాన్ని నవ్వు తిరస్కరిస్తుందనీ, అందమైన మెరుపును చూపు తిరస్కరిస్తుందనీ భావము.

నవ్వుతున్న ముఖాన్ని వికసిస్తున్న పద్మముతో పోల్చడం చాల సమంజసము కదా !

విశేషము :

నలినలీల, ఇంచుమించు అన్న రెండు విషయాలను కవి వాటి పేరులతోనే — నలినలి కావించుననీ, ఇంచుమించు లాడుననీ—తిరస్కరించినట్టు చెప్పడము చమత్కారము.

జగ = ప్రశస్తమయిన అని అర్థము. జగదొంగ, జగజెట్టి మొదలైన మాటలు వాడుకలో ఉన్నాయి.

*పాఠాంతరము :*

"లేమ నగవు పాటు లేమన నగుబాటు"

—తిరుపతివారు చూపిన పాఠాంతరము.

దీనిలో చూపు వర్ణనే లేదు.

"జగమెఱుంగు దాని జిగి మెఱుంగు"

— వేంకట కృష్ణమాచార్యులవారు.

దీనిలో యమకము లోపిస్తుంది. జిగి అంటేనే మెరుగుకదా.

*అలంకారము :*

వ్యతిరేకము, యమకము, (క్రమము గూడ).

జలరుహగంధి వీనుల పసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్,
చెలువ నఖాంకురాళి నెలచేడియ సైకముఁ దా నుచుక్కనున్,
బొలఁతుక గబ్బి చన్నుఁగవ పువ్వుల చెండ్లను లేదుబంతనున్,
గలికి ముఖారవింద మల కల్వలరాయని త్రోసి రాజనున్. 102

సుందరాంగుల చెవులకు, గోరులకు, స్తనాలకు, ముఖానికి, తొమ్మిది అంకెను, తారలను, పూల చెండ్లను, చంద్రుడిని ఉపమానంగా కవులు వర్ణిస్తారు. వాటిని మనకవి మహా చమత్కారంగా తిరస్కరిస్తున్నాడు.

*అర్థము :*

(౧) జలరుహగంధి = పద్మమువంటి పరిమళ మున్న శరీరము గల సుభద్ర యొక్క, వీనుల పసల్ = చెవుల అందము, నవసంఖ్యన్ = తొమ్మిది అన్న అంకెను, అది ఏమి లెక్క = అదొక లెక్కా ?—ఏ పాటిది ?, అనున్ = అని తిరస్కరించును; (మరొక అర్థము) అది ఏమి ? = అదేమిటి ? లెక్క = ఒక అంకెయేకదా, అనున్ అని.

ఆమె చెవులు తొమ్మిది అంకెకంటే ఆకార సౌష్ఠవము కలిగి ఉన్నాయని భావము.

(౨) చెలువ = సుభద్రయొక్క, నఖ అంకుర ఆళి = గోరు మొలకల వరుస—లేత గోరుల వరుస, నెల = చంద్రుని, చేడియ = భార్య అయిన తారయొక్క, సైకమున్ = అంద

మును, తాను, ఉచుక్ అనుః = తిరస్కరించును; (మరొక అర్థము) తాను చుక్క-అనుః = తార ఒక చుక్కే-కదా అనును అని.

ఆమె గోరులు తారలకంటే ఎక్కువ అందంగా ఉంటాయని భావము.

(3) పొలఁతుక = సుభద్రయొక్క, గబ్బి చన్ను కవ = (నిక్కిన) బిగువైన చనుదోయి, పూవుల చెండ్లను = పూబంతులను, లేదుబంతి అనుః = తిరస్కరించును.

లేదుబంతి అంటే అబద్ధము-వట్టి బూటకము అని అర్థము. (మరొక అర్థము) పూవుల చెండును "విశేషము లేదు, అది ఒక బంతియే" అనును అని.

ఆమె స్తనములు పూలచెండ్లకంటే రమణీయంగా ఉంటాయని భావము.

(4) కలికి = సుభద్రయొక్క, ముఖ అరవిందము = పద్మమువంటి ముఖము, అల = ప్రసిద్ధుడయిన, కల్వలరాయని = కలువల రాజును-చంద్రుని, త్రోసిరాజనున్ = మిక్కిలి అవమానపరుచును - తిరస్కరించును; (మరొక అర్థము) త్రోసివేసి, అతడు రాజు (= చంద్రుడే) కదా అనును అని.

ఆమె ముఖము చంద్రుని కంటే మనోహరంగా ఉంటుందని భావము.

తాత్పర్యము :

సుభద్ర చెవులు తొమ్మిది అంకెకంటె, గోరులు నక్షత్రాలకంటె, స్తనములు పూలచెండ్ల కంటె, ముఖము చంద్రుడికంటె ఎక్కువ అందంగా ఉండి, ఆయా ఉపమానాలను తిరస్కరిస్తా యని భావము.

విశేషము :

ఈ పద్యములో తిరస్కారాన్ని సూచించడానికి కవి వాడిన పలుకుబడులు నాలుగు : అదేమి లెక్కనున్, తా నుచుక్కనున్, లేదుబంతనున్, త్రోసిరాజనున్. నవసంఖ్య నిజంగా ఒక లెక్కే (అంకెయే); తార (నెలచేడియ) నిజంగా చుక్కే; పూలచెండు నిజంగా బంతియే; కల్వలరాయడు నిజంగా రాజే (రాజు = చంద్రుడు).

సహజమయిన ఈ మాటలనే తిరస్కారం తెలిపే మాటలుగా ఉపయోగించడము చక్కని చమత్కారము.

అదేమిలెక్క = లెక్కలోనికి తీసుకోవలసింది కాదు, అతిస్వల్పవిషయ మన్నమాట.

తానుచుక్కనున్—ఉచుక్ అన్నది అనాదరణమూ విచారమునూ తెలిపే ధ్వని అను కరణము-వ్చ్ః = పనికిరానిది అని నిరసించినట్లు. తాను చుక్క అనున్ అని పద విభజన చేసి—అది ఒక్క బొట్టు—బిందువు అని అల్పత్వము గూడా చూపు నన్నమాట.

లేదు బంతనున్—సహపంక్తి భోజనాలకు అర్హతలేదు. మా పంక్తిలోనికి రాదగినది కాదని నిరాకరణ.

ఈ పలుకుబడిని బొంకు, బూటకము అన్న అర్థంలో కూడ ఉపయోగిస్తారు—

'గెంటించి లేదుబంతి యన్న ట్లల్లంత నుండి......'

—మనుచరిత్ర 4-115.

లేదుబంతి అన్నట్లు = అసత్య మనినట్లు అని మనుచరిత్రలోని వ్యాఖ్యానము.

ఈ పలుకుబడిని ఈ అర్థంలోనే మన చేమకూరకవి సారంగధరచరిత్రలో వాడాడు: చిత్రాంగి చేసిన ఘోరము తెలుసుకొని పురజనులు ఆమెను నిందిస్తున్నారు—

—ఆ. 3-219.

తెలియఁగఁ జూచినట్లనె మదిన్ బుధు లారసి తప్పు నీపయిన్
గలదని పల్కఁ-చోఁ గుచయుగం బటు బట్టబయల్గఁ జేసి తో
యలికచ లేదుబంతి యన సందటి డెందము నిశ్చయమ్ము పెం
పొలయఁగఁ గల్లతోడ నిజ మోపదుగా తలపోసి చూచినన్.

నాలుగో పలుకుబడి 'త్రోసి రాజనున్' అని. ఇది చదరంగపు ఆటలోనిది. ఆ ఆటలో 'తోసి రాజూ ఆటకట్టూ' అన్నది చాల అవమానకరమైన అపజయము. మంత్రీ ఏనుగూ మొదలైన పెద్దబలముతో కాక, ఒక బంటును ముందుకుతోసి ఎదిరి రాజును కదలనీయకుండా చేయడమని దీని అర్థము.

నవసంఖ్య—ఇది మనము వాడుతున్న ఇంగ్లీషు (అరబిక్) 9 గాని, తెలుగులోని ౯ అంకెగాని కాదు. అది సంస్కృతంలో ఉపయోగించే ९ అంకె అని గుర్తుంచుకోవాలి.

ఉచుక్ అను—అనాదరణను తెలుపు ధ్వని అనుకరణ. దీనికి బ్రౌణ్య నిఘంటువులో

ఉచుక్కుమనుట = to sob, moan ఉచుక్కుమను (అనుకరణము)

అని ఇచ్చారు. ఇది వారి దృష్టిని విషాద సూచకమే.

అనాదరణ సూచనకు ప్రయోగము:

...... ఈ వనజాక్షి మెచ్చఁ జన దెవ్వరి నెట్టి మహానుభావు తే
జో విభవంబుఁ దెల్పిన నుచుక్కను......

— కువలయాశ్వచరిత్ర 3-72.

కలికి ముఖము అరవిందము—పద్మము. కల్వలరాయడు చంద్రుడు—కాబట్టి పగవాడు. అతనికి రాజన్న పేరు గూడా ఉంది. ఆ రాజుని ఆటకట్టిస్తుం దన్న సొగసుగూడా చూడవచ్చును.

**అలంకారము:**

ప్రతీపము, శ్లేష.

అయ్యారే ! చెలువెక్కడ !
న య్యారే గెలువఁ జాలు నంగజు నారిన్;
వెయ్యాఖులలో సరిలే
రయ్యా, రుచి రాంగ రుచుల నయ్యంగనకున్. 103

అర్థము :

అయ్యారే ! = ఓహోహో ! చెలువు ఎక్కడ = ఆ సుభద్ర అందము ఎక్కడ - తక్కిన కాంతల అందమెక్కడ (హ_స్తిమశ కాంతర మన్నమాట). (మరొక విరుపు) చెలువ ఎక్కడ = ఆ సుభద్ర ఎక్కడ — తక్కిన కాంతలెక్కడ. ఆ ఆరే = సుభద్రయొక్క నూగారే. అంగజు = మన్మథునియొక్క. నారిన్ = వింటి అల్లెత్రాడును (తుమ్మెదలపం_క్తిని). గెలువన్ చాలున్ = గెల్వగలదు - ఓడించగలదు. (మరొక అర్థము) అంగజు నారిన్ = మన్మథునిభార్య రతీదేవిని. గెలువఁ జాలును (నూగా రొక్కటే రతీదేవిని గెలుస్తుందని ఈలాగా కవి నిరూపించాడు). రుచిర అంగ రుచులన్ = మనోహరమైన (యావత్) శరీరమునందుగల అందములలో. ఆ అంగనకున్ = ఆ సుభద్రకు. సరి = సమాన మయిన అందక_త్తెలు. వెయ్యాఖులలోన్ = వేలకొలది కాంతలలో. (ఎవ్వరూ) లేరు అయ్యా = లేరుసుమా !

తాత్పర్యము :

సుభద్ర నూగారు మన్మథునినారి అయినను తుమ్మెదల చాలును మించి నల్లగా ఉంది; ఆ ఆరు ఒక్కటే మన్మథుని నారిని (భార్య రతీదేవిని) మించును. ఆ సుభద్రకు సమానమైన కాంత వేలకొలది యువతులలో కానరాదని భావము.

విశేషము :

మన్మథుడి విల్లు చెరకనీ, అల్లెత్రాడు తుమ్మెదల వరుసనీ మన కవుల అభిప్రాయము. సుభద్రయొక్క నల్లని నూనూగు ఆరు ఆ తుమ్మెదల వరుసను మించిన అందముతో ఉంటుందట.

నారి అంటే అల్లెతాడూ, స్త్రీ (భార్యా) అని రెండర్థా లున్నాయి. ఆ ఆరే అంగజునారిని - అందగ_త్తెలలో అందగత్తె - రతీదేవిని గెలవగలిగి నప్పుడు, సంపూర్ణమయిన శరీరసౌందర్యములో ఆమెతో ఎవరు సరికాగలరు అని అర్థాప_త్తి (అలంకారము) సూచించాడుకవి.

వెయ్యారులలో - ఇదొక పలుకుబడి - అత్యధిక సంఖ్యాకులలో అని అర్థము. దీనికి వెయ్యి ఆరూ అని అర్థం చెప్పడానికి చూడడం సరసంగా కనబడదు.

అలంకారము :

శ్లేష. యమకము.

కడుహెచ్చు కొప్పు, దానిఁ
గడవన్ జనుదోయి హెచ్చు, కటి యన్నిటికిఁ
కడుహెచ్చు, హెచ్చు లన్నియు
నడుమే పసలేదుగాని నారీమణికిఁ. 104

చక్కని ఈ చిన్న పద్యంలో కవి సుభద్ర కొప్పూ, స్తనాలూ, కటిప్రదేశమూ, నడుమూ వర్ణిస్తున్నాడు.

అర్థము :

నారీ మణికిఁ = కాంతారత్నమయిన సుభద్రకు, కొప్పు = జుట్టు, కడుహెచ్చు = చాల పెద్దది, దానిఁ కడవన్ = దానిని మించి, చనుదోయి = కుచముల జంట, హెచ్చు = పెద్దది, కటి = జఘనము, అన్నిటికిన్ = అన్నిటికంటే, కడుహెచ్చు = చాలాపెద్దది, నడుమే, పసలేదుకాని = సారంలేదు - స్వల్పము - కాని, హెచ్చు లన్నియుఁ = తక్కినవన్నీ హెచ్చులే.

తాత్పర్యము :

సుభద్ర కొప్పు పెద్దది, దానిని మించి చనుకట్టు పెద్దది, అన్నిటికంటె కటిప్రదేశము పెద్దది. అన్నీ పెద్దవేకాని నడుమే సారంలేని స్వల్పవిషయమని భావము.

కొప్పును మించి చనుదోయీ, దానిని మించి కటిప్రదేశమూ ఉందంటే, కొప్పుకీ స్తనాలకూ గాని, వాటికీ కటికీ గాని పోటీ (తారతమ్యము) ఏమిటి అని సవ్యంగా అర్థం కాకపోవచ్చును.

విందులో పంకాయకూర బాగుంది అని ఒకరంటే, అంతకంటె బాగుంది దోసకాయ పచ్చడి అని ఇంకొకరు అనవచ్చునుకదా ! ఆ మాటలు అర్థం చేసుకున్నట్టే పైపద్యాన్ని అర్థం చేసుకోవాలి.

కొప్పు కుండవలసిన గుణాలలో కొప్పూ, స్తనాల కుండవలసిన గుణాలలో స్తనాలూ, కటి కుండవలసిన గుణాలలో కటీ ఆధిక్యం కలిగి ఉన్నాయి. ఆ ఆధిక్యం యొక్క కొలతలో- పరిమాణము, డిగ్రీలో - తారతమ్యము ఉందని అర్థం చేసుకోవాలి.

ఈలాగు అనడం సంభాషణలలో చాల సహజమూ సరళమూను. అయినా ఈ అన్వయం చేతికి పట్టుదొరకలేదని కొందరు అనవచ్చును. వారికి ఈలా మనవి చేస్తున్నాను :

కొప్పు అంటే మరొక అర్థం గూడా ఉంది. జుట్టుముడివేసి, ఆ ముడిని ఒక చెవిపైపు, తలవెంట్రుకలలో దూర్చి బిగించే పద్ధతి. దీన్నే కొప్పుపెట్టడ మంటారు. దేవతా విగ్రహ శిల్పాలలోనూ, అజంతా చిత్రాలలోనూ కనబడడమే కాకుండా, ఇప్పటికీ జానపదుల స్త్రీలలో కొప్పుపెట్టే ఆచారం ఉంది. ఈ పెట్టిన కొప్పు ఒక బంతిలాగా కనబడుతుంది. ఆలాంటి ఆకారమే స్తనమునది. కటిగూడా అలాంటి వర్తులాకారముతో ఉన్నదే.

దీనినిపట్టి ఆ సుభద్ర పెట్టిన కొప్పు చాల పెద్దది; దానిని మించి స్తనములూ, అన్నిటినీ మించి జఘనమూ పెద్దవని చెప్పవచ్చును.

మరొకవిధంగా గూడా అన్వయించవచ్చును : తల వెండ్రుకలను మేఘంతో పోలుస్తారు. గొప్ప దానబుద్ధికి ప్రసిద్ధి పొందిన వాటిలో మేఘము ఒకటి. ముక్కుతిమ్మన్న పారిజాతాపహరణములో కృష్ణరాయని దానశీలమును వర్ణిస్తూ—

...ఘన తాపని తారకాళిక ద్యుచరగవీ
......వని తాత్మ నితాంత దాన పరతంత్రునకున్.

ఆ 1-32.

అని ఘన — మేఘాన్నీ, తాపని — కర్ణుడినీ, తారకాళిక — చంద్రుడినీ, ద్యుచరగవీ — దేవతలగోవు కామధేనువునీ సుప్రసిద్ధ దానశీలురుగ చెప్పాడు.

దాని అంటే దానమిచ్చే దాత అనీ, దానము - మదము-గల ఏనుగు అనీ రెండర్థాలున్నాయి.[1] కాబట్టి దానిన్ అంటే మేఘాన్నీ అని అర్థం చెప్పవచ్చును.

ఇప్పుడీ పద్యం—

కడుహెచ్చు కొప్పు దానిన్ ;
కడవన్ చనుదోయి హెచ్చు ;....

అని చదివితే, కొప్పు మేఘాన్ని బాగామించును; చనుదోయి కడవఁ—కడవలను, మించును అని అర్థం చెప్పుకుంటే ఏ ప్రమాదమూ లేదు. కడవఁ అన్నది జాత్యైకవచనముగా అంగీకరించాలి.

మరొక విధంగా—

కడుహెచ్చు కొప్పు ; దానిన్
గడవన్ జనుదోయి హెచ్చు ;...

అనవచ్చును. అప్పుడు కొప్పు చాలా గొప్పది అనీ, చనుదోయి దానిఁ (ఏనుగును)— అనగా ఏనుగు కుంభస్థలములనూ, కుండలనూ మించును అనీ అర్థం చెప్పుకోవచ్చును.

ఇక నిది చాలించి తక్కిన పద్యభాగానికి వెళ్దాము. కటి అన్నిటికిఁ కడుహెచ్చు అన్నాడు. దీనికి నోరి గురులింగశాస్త్రిగారు "అన్ని యని చెప్పునప్పుడు చక్రాకారము నభి

---

1. "దాని అంటే దాత. ఏనుగు అన్న రెండర్థాలను జోడించి 'ఘనుల కొండలపాలుగాఁ జేసిన కొరంత....' అన్న సీసపద్యం (ఆ. 1-107)లో రామరాజభూషణుడు ఒక చక్కని వర్ణన చేశాడు. దానిలో బ్రహ్మ తన సృష్టిలో చేసిన కొన్ని లోపాలను సవరించుకోడానికి ప్రయత్నిస్తాడు. ఆ లోపాలలో "దానికేల్ వసులక్ష్మి పూవఁజేయని రట్టు" ఒకటి అన్నాడు. దాని (=దాత)చేతిలో డబ్బు లేకుండా చేయడమూ, (మరొక అర్థము) దాని(=ఏనుగు) తొండమును కాంతి లేకుండా చేయడమూ అని.

నయించి చూపుట లోకప్రసిద్ధము కనుక — చక్రాకారము కంటే పిఱుదులు గుండ్రముగా ఉన్నవని భావము" అని వ్యాఖ్యానించారు.

పైవన్నీ హెచ్చులని గొప్పగా చెప్పి, 'నడుమే పసలేదు' అన్నాడు కవి. ఏదో లోపం చెప్పుతున్నట్టు. కాని ఇది లోపం కాదు. నడుము ఎంత సన్నగా ఉంటే అంత అందమంటారు. అందగత్తెలను సింహమధ్య, అణుమధ్య అని అనడం సర్వసాధారణము.

చూడండి :

ఒత్తుకొని వచ్చు కటి కుచోద్వృత్తి జూచి
పొలఁతి తనుమధ్య మెచటికో తొలఁగిపోయె ;
ఉండెనేనియు కనఁబడ కుండు టెట్లు ?
ఉద్ధతుల మధ్య నిరుపేద కుండఁ దరమె ?

దీనిలో నడుము లేనే లేదన్నాడు కవి. పసలేదనడం నింద కాదు ; పొగడ్తే.

*అలంకారము :*

సారాలంకారము, శ్లేష, వ్యాజస్తుతి.

అంగము జాళువా పసిఁడి యంగము, క్రొన్నెలవంక నెన్నొసల్,
ముంగురు లింద్రనీలముల ముంగురు, లంగజు డాలు వాలుఁ జూ
పుంగవ, యేమిచెప్ప ! నృపపుంగవ, ముజ్జగ మేలఁజేయు న
య్యంగనఁబోలు నొక్క సకియుం గనఁబో, నెఱిమించ నన్నిటన్. 105

అర్థము :

అంగము = ఆ సుభద్రయొక్క శరీరము, జాళువా పసిఁడి అంగము = జాళువాదేశపు (మేలిమి) బంగారపు ముక్క, క్రొన్నెలవంక = క్రొత్త నెలవంక — విదియనాటి చంద్రవంక వంటిది, నెన్నొసల్ = అందమైన నుదురు, ముంగురులు = నుదురుమీద పడుతుండే తల వెండ్రుకలు, ఇంద్రనీలముల = ఇంద్రనీలమణుల యొక్క, మున్ గురులు = మొదటి గురువులు (ఆ మణులను మించినవని భావము), వాలు చూపు కవ = పొడగా ఉన్న కన్నుల జంట, అంగజు = మన్మథుని, డాలు = కేతనము—జెండా (అంటే చేప—మన్మథుడు మీనకేతను డంటారు), ఏమి చెప్పన్ = ఇంకేమి చెప్పగలను ? నృపపుంగవ = రాజశ్రేష్ఠుడా—అర్జునా, అన్నిటన్ = అన్ని విషయాల-లక్షణాలలోను, నెఱి = అందము, మించన్ = అతిశయిస్తుండగా, ముజ్జగము = మూడు లోకాలను, ఏలన్ చేయున్ = (తన భర్త) పాలించేలాగ చేయగలదు,

ఆ అంగనన్ = ఆ సుభద్రను, వోలు = సరిపోలినట్టి, ఒక్క సకియన్ = మరొక స్త్రీని, కనఁబోన్ = ఇక మీదనైనా చూడబోను.

తాత్పర్యము :

సుభద్ర శరీరము బంగారమే, నుదురు విదియనాటి చంద్రవంక, ముంగురులు ఇంద్ర నీలాలు, కనులు మీనములు. ఇటువంటి లక్షణాలనుపట్టి చూస్తే, ఆమె భర్త చక్రవర్తి అవుతా డని నిర్ణయించవచ్చు. ఇటువంటి సుందరిని నేనికముందు గూడా చూడబోను అని భావము.

విశేషము :

యుద్ధములో బంట్లు కుడిచేతను కత్తి, ఎడమచేతను డాలూ పట్టుకుంటారు. డాలుతో తమ్ము కాపాడుకుంటూ కత్తితో నరుకుతారు. కనుగవ అంగజు డాలు అనడములో మన్మథుడు ఆ కనుల వెనుక పొంచిఉండి, ఇతరులను మోహింప జేస్తుంటా డన్న అర్థ విశేషముగూడా ఉంది.

సుభద్ర సౌందర్య విశేషాలన్నీ పై పద్యాలలో వర్ణించి, గదుడు దీనిలో సాముద్రిక శాస్త్ర జ్ఞానముతో ఆ సుభద్రను వివాహము చేసుకొన్నవాడు మూడులోకాలూ పాలిస్తాడని అర్జును డికి ఆన గూడా చూపుతున్నాడు.

అయ్యంగనఁబోలు నొక్క సకియం గనఁబో నెఱిమించ నన్నిటన్ అన్నదానిలో ఒక్క సకియన్ = మరొక సుందరిని అనేకాక, ఎక్కువమంది కాకపోయినా ఒక్కతెనైనా అన్న చమత్కారం గూడా చూడవచ్చును.

కనఁబో నెఱిమించ నన్నిటఁ అన్నందుకు కొందరు వ్యాఖ్యాతలు, కనన్ పో అని పద విభాగముచేసి "కనఁ = చూడఁజాలను - చూడలేదనుట" అని చెప్పారు.

గదుడు సుభద్రవర్ణనను

కనన్ సుభద్రకున్ సమంబు గాఁగ నే మృగీవిలోకనఁ....

అనే ఆరంభించాడు. మళ్లా ఆమాటే ఇక్క డన్నాడంటే అతడికి పునరుక్తిదోషం పడుతుంది. ఆమాట మనము మరచిపోయినా, కవి మరచిపోలేదు. కాబట్టి ఇక్కడ "కనఁబోన్" = ఇక మీదట - భవిష్యత్తులో నైనా - చూడబోను అని అర్థం చెప్పడం సమంజసము.

నీవామెను పెండ్లాడి మూడులోకాలూ పాలించు అని ధ్వని.

పాఠాంతరాలు :

1. ముజ్జగమెల్లఁజేయు ..

— తిరుపతిచారు.

మూడులోకాలకు సరియైన విలువ కలది అని అర్థము చెప్పుకోవాలి.

2. ముజ్జగ మేలనేల......

— వావిళ్ళవారు.

మూడులోకాల పాలన మెందుకు ఆ సుభద్రే ఉన్నట్టయితే అని అనాలి.

3. ఒక్క సకియం గన నెన్నఁగ మించు నన్నిటన్.

—నోరి వారూ, బులుసువారూ.

ఒక్క సకియన్ కనన్ (చూడలేదు). ఎన్నగన్ (ఆలోచించగా) అన్నిటన్ మించున్ అని అర్థంచేసుకోవాలి.

*అలంకారము :*

రూపకము, యమకము.

ఎక్కడఁ జెప్పినాడఁ దరళేక్షణ చక్కఁదనమ్ము నింక ? న
మ్మక్క ! యదే మనంగ; నిపు డందు శతాంశము దెల్పలేదు నే
నొక్కొక యంగ మెంచ వలయుం బదివేల ముఖంబు; లాయెఁబో !
చొక్కపుఁజూపులో సొలపు చూచినఁ గాక యెఱుంగవచ్చునే? 106

*అర్థము :*

తరళ ఈక్షణ = చంచలములగు కన్నులుగల సుభద్రయొక్క, చక్కదనమ్ములు = అందములను, ఇంకన్ = ఇంత చెప్పిన తర్వాత గూడ, ఎక్కడ చెప్పినాడ = పూర్తిగా చెప్పగల్గితినా - లేదు, అమ్మక్క = ఓహో ! అదేమనంగ = దానిని గురించి ఏమిచెప్పగలను (రెండును ఆశ్చర్యమును తెలుపునవే). అందు శత అంశము = ఆ చక్కదనములందు నూరవ భాగమైనా, నేన్ = నేను, ఇప్పుడు = ఇంతవరకు, తెల్పలేదు = చెప్పలేకపోయాను, ఒక్కొక అంగము = ఆ సుభద్రయొక్క ఒక్కొక అవయవమును, ఎంచన్ = వర్ణించుటకు, పదివేల ముఖంబులు = పదివేల నోరులు, వలయున్ = కావలసి ఉండును, ఆయెన్‌బో = అది నాకు సాధ్యమా ? (ఆలాగు వేయి ముఖములతో చెప్పినప్పటికీ) చొక్కపు చూపులో సొలపు = అందమగు ఆ చూపులోని ఒయ్యారము, చూచినన్ గాక = స్వయముగా చూచిననే తప్ప, యెఱుంగవచ్చునే = (వర్ణనలద్వారా) తెలుసుకో వశమా ?

*తాత్పర్యము :*

ఆమె అందంలో నూరోవంతైనా వర్ణించలేకపోయాను. ఆమె అవయవాలలో ఒక్కొక దానిని నుతించాలంటే పదివేల నోళ్లు కావాలి, ఒక్కనోరేమి చేయగలదు ? ఎన్ని విధముల

వర్ణించినా ఆమె చక్కని అంగముల సౌందర్యము కొంత తెలిస్తే తెలుసునేమోకాని, ఆ చూపు లోని అద్భుతమైన హొయలు మాత్రము తెలియదు; దాని అంద చందములు తెలుసుకోవాలంటే వెళ్లి ఆ సుభద్రను ప్రత్యక్షముగా చూడవలసినదే; వేరు మార్గం లేదు. నీవు పోయి స్వయంగా చూడాలని సూచన.

*విశేషము :*

దీనితో కవి సుభద్ర వర్ణనను ముగించడం సమంజసము.

అమ్మక్క, ఏమనంగ, ఆయెబో, ఇన్ని ఆశ్చర్యార్థకాలవల్ల తాను పొగడవలసిన విషయాల ఆధిక్యాన్ని, తగినంతగా వర్ణన చేయలేని తన అసమర్థతనూ గదుడు స్పష్టము చేశాడు; ఆ రూపంగా ఆ సౌందర్యముయొక్క ప్రశస్తిని ప్రకటించాడు.

ఈ పద్యమువల్ల సుభద్రను స్వయముగా చూచితీరవలె నన్న కుతూహలము అర్జునునకు కలిగేలాగ చేసి గదుడు తన రాకలోగల ఆంతరంగి కాభిప్రాయాన్ని సార్థకం చేసుకున్నాడు.

ఈ పది పద్యాలలోను సుభద్ర విషయమై గదుడి హృదయములో ఉన్న అసాధారణమైన ప్రశంసనూ, వర్ణనాతీత గౌరవ భావాన్ని కవి వెల్లడించాడు.

అని బహుభంగులం బొగడ నంగన ముంగల నిల్చినట్లుఁ దాఁ
గనుఁగొని నట్లునై, నృపశిఖామణి డెందమునందుఁ బట్టఁజా
లని యనురక్తి న వ్వరవిలాసిని నెన్నఁడు చూడఁగల్గునో
యని తమకించుచున్న సమయంబున గ్రక్కున దైవికంబుఁగన్. 107

*అర్థము :*

అని = ఈ ప్రకారముగా, బహుభంగులన్ = అనేక విధములుగా, (గదుడు) పొగడన్ = వర్ణింపగా, (అర్జునుడికి) అంగన = ఆ సుభద్ర, ముంగల నిల్చినట్లు = ఎదుటనే నిలిచినట్లు, తాన్ కనుగొనినట్లు = తాను చూస్తూ ఉండినట్లు, ఐ = తోచి, నృపశిఖామణి = రాజశ్రేష్ఠుడైన అర్జునుని, డెందమునందున్ = మనస్సునందు, పట్టఁజాలని = ఇముడ్చుకొనడానికి శక్యముగాని, అనురక్తిన్ = ప్రేమతో, ఆ వరవిలాసినిన్ = విలాసముగల స్త్రీలలో శ్రేష్ఠురాలగు ఆ సుభద్రను, ఎన్నఁడు చూడ కల్గునో = చూచుటకు ఎప్పుడు వీలగునో అని, తమకించుచున్న = తత్తరపడుచున్న, సమయంబునన్ = సమయ మందు, గ్రక్కునన్ = హఠాత్తుగా, దైవికంబుఁగన్ = దైవప్రేరణవలన, తరువాతి పద్యంతో అన్వయము.

తాత్పర్యము :

గదుని వర్ణనవల్ల అర్జునునికి సుభద్ర కంటికి కట్టినట్టయి, చెప్పరాని ప్రేమకలిగి, ఎప్పుడా కాంతను చూడగలుగుతానో అని తత్తరపడుతుండగా, దైవవశాత్తు......తరువాతి పద్యంలోని విషయం జరిగింది అని భావము.

విశేషము :

బహుభంగులంటే వర్ణించి కొంత, సూచించి కొంత, చెప్పకుండానే ఊహించుకొనేలాగ చేసి కొంత అని చమత్కారము. గదుడి వర్ణనలలో ఈ మూడు రకాలూ గుర్తించాముకదా.

ఎప్పుడు చూడగల్గుదునో అని అర్జునుడు తమకిస్తున్న సమయంలోనే దానికి వీలుకలిగే మార్గం చిక్కింది. ఇక్కడ పాత్ర ప్రవేశము చమత్కారముగా, నాటక సరళిని నడిచింది.

అంగన ముంగల నిల్చినట్లు తా కనుగొనినట్లు అన్నందువల్ల గదుడివర్ణన బలమూ, అర్జునుడి ఊహాబలమూ రెండూ తేటపడతాయి.

పాఠాంతరము :

దైవికం బనన్

దేవుని ప్రేరణా అన్నట్లు.

దైవికంబునఁజా

అదృష్టవశమున.

అలంకారము :

భావికము.

ఒక భూమిదివిజుండు చోరహృత ధేనూత్తంసుఁడై వేఁడికొం
టుకు రా ధర్మజు కేళిమందిరము దండంబోయి కోదండ సా
యకముల్ దెచ్చుటఁ బూర్వ క్లృప్త సమయ న్యాయానుకూలంబుగా
నొకయేఁ డుర్విప్రదక్షిణం బరుగు నుద్యోగంబు వాటిల్లినన్. 108

అర్థము :

ఒక భూమిదివిజుండు = ఒక బ్రాహ్మణుడు, చోరహృత ధేను ఉత్తంసుఁడై-చోర = దొంగలచేత, హృత = అపహరించబడిన, ధేను ఉత్తంసుఁడై = శ్రేష్ఠమైన ఆవుకలవాడై

(తన మంచి ఆవును దొంగలు ఎత్తుకొనిపోగా అని అర్థము). వేడికొంటకు రాఁగా = ప్రభువులతో మనవి చేసుకొనుటకు రాగా. (107 వ పద్యములోని నృపశిఖామణి—అర్జునుడు) ధర్మజు = ధర్మరాజు యొక్క, కేళిమందిరము = రహస్యక్రీడా గృహముయొక్క, దండఁగా = ప్రక్కకు, పోయి, కోదండ = విల్లూ, సాయకముల్ = అమ్ములూ, తెచ్చుటఁగా = తీసుకొనివచ్చిన పొరపాటుకు, పూర్వ...కూలంబుగఁగా-పూర్వ = పూర్వమందు, క్లృప్త = నిర్ణయించుకొనబడిన, సమయ = ప్రతిజ్ఞ యందలి, న్యాయ అనుకూలంబుగఁగా = న్యాయమునకు తగినట్లుగా (ఇంతకు ముందు పాండవులు తాము ఏర్పరుచుకున్న ప్రతిజ్ఞ ప్రకారము). ఒకఏఁడు = ఒక సంవత్సరము. ఉర్వీప్రదక్షిణంబు = భూ ప్రదక్షిణము. అరుగు = వెళ్ళవలసిన. ఉద్యోగంబు = పని. వాటిల్లినన్ = కలుగగా-ఒక సంవత్సరము భూ ప్రదక్షిణ పోవలసిరాగా. (తర్వాతి పద్యముతో అన్వయము).

తాత్పర్యము :

తన ఆవును దొంగ లెత్తుకుపోయారని ఒక బ్రాహ్మణుడు మొరపెట్టుకుంటే, ఆ దొంగలను చంపి ఆవును విడిపించుకొని రావాలని విల్లూ బాణాలూ తీసుకోడానికి ధర్మరాజూ ద్రౌపదీ ఉన్న కేళీ గృహంవైపు వెళ్ళినందుకు వారి పూర్వ ప్రతిజ్ఞ ప్రకారము, అర్జునుడు ఒక యేడు భూప్రదక్షిణ చేసుకొని రావలసిన పని కలగగా,

విశేషము :

ద్రౌపది ఒకరితో ఉన్న సమయంలో తక్కిన నలుగురిలో ఎవరైనా ఆ పరిసరాలకు పోగూడదని నారద మహర్షి సలహా ప్రకారము పాండవులు తమలోతాము ఒక నియమము చేసుకొన్నారు. ఆ నియమమును అతిక్రమించినవారు ఒక్క సంవత్సరము భూప్రదక్షిణముచేసి రావాలని ప్రాయశ్చిత్తం నిర్ణయించుకున్నారు.

ఈ భూప్రదక్షిణ కార్యం అర్జునుడికి ఒక ఉద్యోగం (పని) కలగడమే కాదు ; ఈ సందర్భంగా సుభద్రను పెండ్లిచేసుకొనే అవకాశం కలగడం అన్న ఉత్ = గొప్ప, యోగం = జాతక యోగం-కళత్రయోగం కూడా కలిగింది అని చమత్కారం.

అర్జును డీపొరపాటు చేయడానికి కారణము :

సుభద్రయందు లగ్నమై ఉన్న మనస్సుతో పరధ్యానముగా ఉండడమూ, గోవు దొంగతనము తెలిసినందువల్ల, పాండవులు బ్రాహ్మణభక్తి ప్రోవులు కాబట్టి, ఆ బ్రాహ్మణుడి కష్టము తీర్చడానికి సంరంభమూ, రెండూ కలియడంచేత పూర్వము చేసుకొన్న ఒడంబడిక మరపున పడ్డది. తటాలున ధర్మజుని కేళిమందిరము ప్రక్కకు వెళ్ళాడు. ఇది ప్రతిజ్ఞకు భంగము.

ఉత్ యోగంబు అన్న శబ్దంవల్ల ఇకముందు జరగబోయే సుభద్రా పరిణయమును కవి సూచించాడు.

విజయవిలాస కథకు ప్రధానమయిన ఈ ప్రతిజ్ఞను గూర్చి వివరాలను చెప్పి కాలయాపన చేయకుండా కవి ఆ పూర్వకథ నంతటినీ "పూర్వకృప్త సమయ న్యాయానుకూలంబుగన్" అన్న నాలుగు మాటలతో ముగించి, కథాకథన చమత్కారాన్ని ప్రదర్శించాడు. అంతే కాదు. ఆ గోవును మరల ఆ బ్రాహ్మణుడికి ఇచ్చాడన్న విషయముగూడ పాఠకుల ఊహకే విడిచిపెట్టాడు. అర్జునుడి తత్తరానికీ, కథాగమనానికీ తగినట్టు, అంతా నిమిషాలమీద జరిగించాడు కవి.

*పాఠాంతరము :*

కొందరు రెండవచరణమున "వేడికొంటకుఁ దా ధర్మజు..." అన్న పాఠమును అంగీకరించారు. అప్పుడు వేడికొంటకున్ = వేడుకొనుటకు ఫలితంగా, తాన్ = అర్జునుడు, అని చెప్పుకోవాలి. కాని 107 వ పద్యములో 'గ్రక్కునన్', 'దైవికంబుగన్' అన్నట్లు జరిగినది రాక గాని వేడికొనుట గాదు. కాబట్టి 'వేడికొంటకు రాన్' అన్నపాఠమే సరియైనది.

అన్నకు మ్రొక్కి, 'తీర్థభజనార్థముగాఁ జనివిందు' నంచుఁ దా
విన్నప మాచరించుటయు, 'విప్రహితమ్మున కన్న ధర్మ మే
మున్నది, గోప్రదక్షిణమె యుర్విప్రదక్షిణ' మంచు నిట్టు లే
మన్నను మాన కన్నరుఁడు ప్రార్థనసేయఁగ నెట్టకేలకున్, 109

ఈ పద్యములోని విషయము అర్జునుడు గోసంరక్షణచేసి వచ్చిన తరువాత జరిగినది.

అర్థము :

అన్నకు మ్రొక్కి = ధర్మరాజుకు నమస్కరించి, 'తీర్థభజనార్థముగాన్ = పుణ్యక్షేత్రములను సేవించుట కొరకు, చనివిందును = సెలవు తీసుకుంటాను — పోయివస్తాను', అంచు = అనుచు, తాన్ = అర్జునుడు, విన్నప మాచరించుటయున్ = మనవిచేయగా, (ధర్మరాజు) విప్రహితమ్మున కన్నన్ = బ్రాహ్మణులకు మేలుచేయుటకంటే, (గొప్ప) ధర్మము ఏమున్నది? (నీయందు దోషములేదు, అయినప్పటికీ, నీప్రతిజ్ఞ పాటించక తప్పదని అంటే) గోప్రదక్షిణము = ఆవును చుట్టివచ్చుటే, ఉర్వి ప్రదక్షిణము = భూమిని చుట్టివచ్చుట (రెంటికీ ఫలమొక్కటే). అంచున్, ఇట్టుల = ఇటువంటి ఉపాయములు, ఏమన్నను = ఎన్నిచెప్పినను, మానక = తన ప్రయత్నమును విడిచి పెట్టక, ఆ నరుడు = ఆ అర్జునుడు, ప్రార్థన సేయఁగన్ = తప్పక తన్ను పంపమని (ధర్మరాజును) వేడుకోగా, ఎట్టకేలకున్ = తుట్టతుదకు—మిగుల కష్టముతో (తరువాతి పద్యముతో అన్వయము).

తాత్పర్యము :

విముషాలమీద దొంగనుచంపి, ఆవును బ్రాహ్మణుడి కిచ్చి, అన్నగారిని చూచి అర్జునుడు ప్రతిజ్ఞ ప్రకారము భూప్రదక్షిణకు సెలవడిగాడు. 'బ్రాహ్మణులకు మేలుచేయడంకంటే ధర్మ మేమున్నది ? నీవు చేసిన అధర్మము ఏమీలేదు. అంతగా కావాలంటే గోప్రదక్షిణచేస్తే సరిపో తుంద'ని, ఎన్నివిధాల చెప్పినా మానకుండా ధర్మరాజును ప్రార్థించాడు. తుట్టతుదకు......

విశేషము :

తన కేళీమందిరము చెంతను పోవుటవల్లనే ఇది అంతా కలిగిందికదా అని ధర్మరాజు అర్జునిని ప్రయత్నము మాన్పడానకి ప్రయత్నించడము చాల సమంజసము.

గో అన్న శబ్దానికి ఆవు అనీ, భూమి అనీ అర్థాలున్నాయి. కాబట్టి భూప్రదక్షిణమంటే గో ప్రదక్షిణమే అని సమర్థించబోయాడు.

ధర్మతత్పరుడయిన ధర్మరాజు ప్రతిజ్ఞా భంగము చేయరాదు. కాబట్టి ఈ సూక్ష్మమార్గ మును చూపించాడు.

కాని, అర్జునుడి కీ ప్రయాణము తీర్థమేగాక, స్వార్థముగూడా_సుభద్రను చూచే అవకాశము కోసము. కాబట్టి ఎన్నిచెప్పినా మానక అర్జునుడు ధర్మరాజును ప్రార్థించాడు. సోదరప్రేమ చేత ధర్మరాజు విడువలేక విడువలేక విడిచిపెట్టబోతున్నాడు. కాబట్టి 'ఎట్టకేలకు' అన్నది చక్కని ప్రయోగము.

అర్జునుడి పట్టుదల అంతా ప్రతిజ్ఞా పాలనకోసమే అని అక్కడివారందరూ, ధర్మరాజుతో సహా అనుకున్నారంటే ఆశ్చర్య మేముంటుంది!

తనదు పురోహితుం డయిన ధౌమ్యుని తమ్ముని గారవంపు నం
దనుని విశారదుఁ డనఁ సకలధర్మ విశారదు వెంటఁబోవఁగా
నొనరిచి కొందఱఁ బరిజనోత్తములఁ నియమించి, యాదరం
బెనయ సమస్త వస్తువులు నిచ్చి, యుధిష్ఠిరుఁ డంపఁ వేడుకన్. 110

అర్థము :

యుధిష్ఠిరుడు = (యుద్ధములందు స్థిరముగానుండు) ధర్మరాజు, తనదు పురోహితుండైన ధౌమ్యుని తమ్ముని (యొక్క), గారవంపు నందనునిఁ = ప్రియమైన కుమారుడున్నూ, సకల ధర్మవిశారదున్ = అన్ని ధర్మములు బాగుగా ఎరిగిన వాడున్నూ (అయిన), విశారదున్ = విశారదుడను పేరుగల వానిని, వెంటన్ పోవఁగాన్ ఒనరిచి = అర్జునునివెంట వెళ్ళునట్లుచేసి,

పరిజన ఉత్తములన్ = సేవకులలో శ్రేష్ఠులగు వారిని, కొందఱన్ = కొందరిని, నియమించి = వెంటపోవుటకు ఆజ్ఞాపించి, ఆదరంబు ఎనయన్ = మిక్కిలి ఆదరముతో, సమస్త వస్తువుల నిచ్చి = ప్రయాణమునకు కావలసిన అన్ని వస్తువులను ఇచ్చి, అంపఁ = ధర్మరాజు సాగనంపగా, వేడుకఁ = (అర్జునుడు) సంతోషముతో—తర్వాత పద్యముతో అన్వయము.

తాత్పర్యము :

తమ్ముడి యాత్రకు సమ్మతించి ధర్మరాజు తన పురోహితుడి సోదర పుత్రుడయిన విశారదుడన్న బహుశాస్త్రవేత్తను వెంటవెళ్ళడానికి నియమించి, తగిన సేవకులనూ, కావలసిన సామగ్రినీ ఇచ్చి పంపించగా అర్జునుడు చాల సంతోషముతో —

విశేషము :

సుభద్ర సౌందర్య వర్ణనల ఘట్టము అయిన తర్వాత కథ ఆరంభించడానికి "ఒక భూమీ దివిజుండు" అని ఎత్తుకొని, ఏ పద్యముతోనూ ఆగక, సన్నివేశాలను త్వరగమనముతో పద్యమునుంచి పద్యానికి అతుకు ఉంచినట్లు చెప్పుకుంటూ రావాలన్న అభిప్రాయము కవికున్నట్లు తేటపడుతుంది.

కాబట్టి ఈ ధార 110వ పద్యముతో ఆగక, 112 వరకూ పోవడము సమంజసమే అవుతుంది.

ధర్మరాజుకు తమ్ముని యందు గల శ్రద్ధ పద్యములో స్పష్టముగా కనబడుతుంది. అర్జును డెంతటి శూరాగ్రేసరుడైనా, ధర్మరాజుకు చిన్న తమ్ముడేకదా; చిన్నవారల ప్రయాణాలలో పెద్దవారు ఈలాగు ఆదరము చూపడం లోక ప్రసిద్ధము.

విశారదుని నియమించడములో ఉన్న విశేషము : చిరకాల ఆశ్రిత కుటుంబములోని వాడున్నూ, అన్ని ధర్మములూ తెలిసిన వాడున్నూ-అనగా ఒక్కొక్క ధర్మశాస్త్రము తెలిసిన పదిమంది ధర్మశాస్త్రవేత్తలు చేయదగిన సహాయమును విశారదు డొక్కడే చేయగలడని నమ్మకముతో ధర్మరాజు అతడిని నియమించాడు.

పాఠాంతరము :

యుధిష్ఠిరు డంపె వేడుకఁ

— వేదమువారూ, తిరుపతివారూ.

ధర్మరాజు సంతోషముతో పంపెను అని అర్థము. 109 వ పద్యములో ఉన్న "ఎట్టకేలకు" ఇష్టము లేకపోవుటకు ఈ వేడుకఁ అంపెఁ అన్న అన్వయము సరిపడదు. తన తమ్ముడు ధర్మమునందు ఇంత పట్టుదల కలవాడు అని వేడుకకు కారణము ఉండినప్పటికీ; ఈలాగ సాగనంపుతున్నప్పుడు వేడుకపొందడం మానవతత్వము కాదనుకుంటాను.

కాబట్టి 'యుధిష్ఠిరుడంప' అని ధర్మరాజు కార్యక్రమము ముగించి, వేడుకఁ అన్న పదాన్ని తరువాతి పద్యము 'పరిణయ మౌట కేఁగుగతి'తో కలిపి, ఈ వేడుక అర్జునుడిదే అనడం సమంజసము.

అర్జునుడు తమకించుట, మాన కన్నరుడు ప్రార్థన చేయుట, ముందు పద్యాలలో చూపించినందువల్ల, ఈ పద్యములో ధర్మజుని అంగీకారము కలిగింది కాబట్టి, అర్జునుడు వేడుక పడ్డాడు. దానితోనే పెండ్లికి పోయినట్లు పోతాడు.

అలంకారము :

యమకము.

పరిణయమౌట కేఁగుగతిఁ బౌరు లనేకులు వెంటరా శుభో
త్తరముగ నయ్యెడం గదలి తద్దయుఁ దాలిమి మీఱ ధర్మత
త్పరుఁడయి యందునందు నులుపాలు నృపాలు రొసంగఁగా నిరం
తరమును బుణ్యతీర్థములఁ దానములాడుచు నేఁగి, యవ్వలన్, 111

అర్థము :

అర్జునుడు (112 వ పద్యములోని సునాసీర సూనుండు), పరిణయము ఔటకు = పెండ్లి యాడుటకు, ఏఁగుగతిఁ = వెళ్ళుచున్నట్లు, పౌరులు = పురజనులు, అనేకులు = చాలమంది, వెంటరాఁ = వెంటవచ్చుచుండగా, శుభ ఉత్తరముగఁ = శుభము వెంటనే కలుగ చేయునట్టి శుభలగ్నమున, ఆ ఎడఁ కదలి = ఆ ఇంద్రప్రస్థమును విడిచిపెట్టి, తద్దయున్ తాలిమిమీఱఁ = మిక్కిలి ఓర్పు అతిశయించునట్లు, ధర్మతత్పరుఁడయి = ధర్మమునందు ఆసక్తి కలవాడై, అందుఁ అందుఁ = ఆయారాజ్యములలో, నృపాలురు = రాజులు, ఉలుపాలు = కానుకలు, ఒసంగఁగాఁ = సమర్పించుచుండ, నిరంతరమును = విరామము లేకుండా, పుణ్యతీర్థములఁ = పావనమైన నదులలోను సరస్సులలోను, తానములాడుచుఁ = స్నానములు చేయుచు, ఏఁగి = వెళ్ళి, అవ్వలన్ = ఆ దిక్కున (తర్వాత పద్యముతో అన్వయము).

తాత్పర్యము :

చాలమంది పురజనులూ, సేవకులూ, విశారదుడూ మొదలైన బ్రాహ్మణులూ, కావలసిన వస్తువులతో వాహనాలూ వెంట వస్తుండగా, తన ముఖములో ఉత్సాహకళ స్పష్టముగా కనబడు తుండగా అర్జునుడు పెండ్లికి తరలి వెళ్తున్నట్టు శుభముహూర్తమున బయలుదేరి, త్రోవలో సామంతు లిచ్చిన కానుకలు తీసుకుంటూ, ఎంతో ఓర్పుతో పుణ్యతీర్థాలలో స్నానాలు చేస్తూ పోయిపోయి......

*విశేషము :*

శుభలగ్నమున పౌరులందరు వెంటరాగా బయలువెడలిన అర్జునుడు పెండ్లికి వెళ్లుతున్నట్టే కనబడ్డాడు. ఈ ప్రయాణ ఫలితము మూడు పెళ్ళిల్లు; కాబట్టి రానున్న కార్యమును ముందుగానే "పరిణయమౌట కేఁగు గతి" అని కవి సూచించాడు.

అర్జునుడి మనస్సులో ఉన్న సుభద్ర మీది అనురాగము, ఒక్కసారి ఎగిరి సుభద్ర ఉన్నచోటికి పోవాలని ప్రేరేపిస్తుండినా, ధర్మతత్పరుడు కాబట్టి అతడు తన పర్యటన క్రమము తప్పించకుండ, తీర్థసేవ చేస్తూ, యాత్ర సాగించాడు. అతని తమకము ఇంతంత అనరానిది; అట్టి దానిని అణచడానికి విశేషమైన ఓర్పు కావాలి. కాబట్టే 'తద్దయు తాలిమి మీఱు' అని కవి అన్నాడు.

నిరంతరముగా ఎన్ని తీర్థాలు చూపినా, విసుగు చెందకుండా చాల తాలిమితో స్నానాలు చేస్తూ అని గూడ ఊహించాలి.

ఈ పద్యంలో గూడా కథ ఆగకుండా పరుగెడుతూ ఉంది.

*పాఠాంతరము :*

అందునందు నరపాలురు కాన్క లొసంగగా...

దీనిలో అనుప్రాస కొరవడింది.

## గంగాస్నానము

సునాసీర సూనుండు సూచె న్నిమజ్జ
జ్జనౌ ఘోత్పతత్పంక శంకాకరాత్మో
ర్మి నిర్మగ్న నీరేజ రేఖోన్నమ ద్భృం
గ నేత్రోత్సవ శ్రీని, గంగా భవానిన్. 112

*అర్థము :*

"నిమజ్జ......నేత్రోత్సవ శ్రీనిన్"—నిమజ్జత్ = స్నానము చేయుచున్న, జన = మనుష్యులయొక్క, ఓఘ = సమూహములనుండి, ఉత్పతత్ = పైకి ఎగిరి పోవుచున్న, పంక = పాపమా (అన్న), శంకా = సందేహమును, కర = కలుగ జేయుచున్న (లేక) శంకా = సందేహమునకు, ఆకర = స్థానమైన, ఆత్మ = తనయొక్క (గంగా నదియొక్క), ఊర్మి = తరంగములయందు, నిర్మగ్న = మునుగుచున్న, నీరేజ = తామరపూవుల యొక్క,

రేఖా = వరుసనుండి, ఉన్నమత్ = పైకిలేచుచున్న, భృంగ = తుమ్మెదల వలన, నేత్రఉత్సవ = కన్నుల పండువైన, శ్రీనిన్ = శోభగలదానిని, గంగా భవానిణ = భవునకు (ఈశ్వరునకు) భార్యయైన గంగను, సు నాసీర సూనుండు = ఇంద్రుని కుమారుడగు అర్జునుడు, చూచెన్ = చూచెను.

సు = లెస్సయైన, నాసీర = సేనాముఖము కలవాడు — అనగా ఇంద్రుడు. అతని సూనుండు = కొడుకు — అర్జునుడు అని అర్థము.

తాత్పర్యము :

గంగానది పాపహారిణి అనీ, దానిలో మునిగిన వారి పాపాలు ఎగిరి పోతాయనీ, పాపము నల్లగా ఉంటుందనీ ప్రసిద్ధి. ఆ గంగా తరంగాలు అప్పుడప్పుడు తామరల మీద పొర్లినప్పుడు ఆ పువ్వులలోని తుమ్మెదలు నల్లగా పైకి ఎగిరిపోతుండడం చూచినప్పుడు, ఆ నదిలో స్నానము చేస్తున్న వారి పాపాలే ఎగిరిపోతున్నవా అన్న భ్రాంతిని కలుగజేస్తున్న గంగానదిని అర్జునుడు చూచాడని భావము.

విశేషము :

గంగానదిలోని తామరలు 'జనఓఘు' - జన సమూహముగాను, పైకి ఎగిరిపోతున్న తుమ్మెదలు స్నానము చేస్తున్న వారి పాపాలుగాను పోల్చడం ఈ సందర్భములో చాల సమంజసము.

ఎంతో తత్తరముతో ఎక్కడా ఆగకుండా - పద్యంమీద పద్యంతో - వచ్చిన అర్జునుడు ఈ నదీ పావనత్వము చూచి ఆగక తప్పలేదు.

గంగా దర్శనోత్సాహము ప్రకటించడానికే ఇక్కడ భుజంగ ప్రయాత పద్యాన్ని కవి ప్రయోగించాడు.

సాధారణంగా తామర పువ్వులు నీటిపైనే కనబడుతుంటాయి. కాని, కెరటాలు కలిగినప్పుడు, అప్పుడప్పుడు ఆ కెరటాలు తామరలమీద పడుతుంటాయి. ఆ సమయములో వాటిలో ఉండిన తుమ్మెదలు పైకి ఎగిరిపోక తప్పదు. పాపమూ, తుమ్మెదలూ, రెండూ నల్లనివే. కాబట్టి మునుగుతున్న మనుష్యుల పాపాలే అలాగు పైకి పోతున్నాయా అన్నట్టు కనబడుతుంది.

ఇంత చక్కని ప్రకృతి సౌందర్యము ఉన్నది కాబట్టే 'నేత్రోత్సవశ్రీ' అని కవి పేర్కొన్నాడు.

అలంకారము :

భ్రాంతిమంతము, అంత్యానుప్రాసము.

సంతోష బాష్ప ధారలు
దొంతరగాఁ జూచి మ్రొక్కి తోయధి వరసీ
మంతిని, నా త్రిజగ ద్దీ
వ్యంతిని భాగీరథీ స్రవంతిని బొగడెన్. 113

అర్థము :

సంతోష బాష్ప(ముల వలన కలిగిన) ధారలు, దొంతరగాఁ = ఒకధారవెంట ఒకటి-పరంపరగా కలిగేలాగా, (అర్జునుడు ఆ గంగా భవానిని) చూచి, మ్రొక్కి = నమస్కరించి, తోయధి......మంతినిఁ — తోయధి = సముద్రునియొక్క, వర = శ్రేష్ఠమైన, సీమంతినిఁ = భార్యయైన దానిని, ఆ, త్రిజగత్ = మూడు లోకాలలోనూ, దీవ్యంతినిన్ = ప్రకాశిస్తూ ప్రవహిస్తుండే దానిని, భాగీరథీ స్రవంతిని = గంగానదిని, పొగడెన్ = (ఈ క్రింది విధంగా) స్తోత్రం చేశాడు.

విశేషము :

గంగానదిని చూడగానే అర్జునుడికి ఆనంద బాష్పాలు వెల్లువలుగా కలిగాయి.

సముద్రుడికి నదులన్నీ భార్యలే; ఆ భార్యలలో గంగానది సర్వోత్తమ; అది స్వర్గ మర్త్య పాతాళములలో ప్రవహిస్తుంటుందని ప్రసిద్ధి. కాబట్టే త్రిజగత్ దీవ్యంతిని.

భగీరథుడు గొప్ప ప్రయత్నముచేసి తెచ్చినది కాబట్టి భాగీరథి అని గంగకుపేరు.

ఈ పద్యములో బాష్పధారలతో దొంతర నిర్మించడము ఒక సొగసు. ఈలాగే మనకవి 'మునుసిగ్గును' కూడా దొంతరులుగా చూపించాడు (ఆ. 1-169).

అలంకారము :

అనుప్రాసము.

తా నైరింప కపర్ది యుండఁగ భవ ద్గర్భమ్మునం దాల్చి తే
జోఽసహ్యున్ శరజన్ముఁ గాంచి యల నీహార క్షమాభృత్ కుమా
రీ సాపత్న్యముఁ గన్న మోహపుఁ బురంధ్రీ రత్నమౌ దీవ; కా
వే, సర్వజ్ఞుఁడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవీ! 114

అర్జునుడు గంగానదిని ఈ మూడు (114 – 116) పద్యాలలో పొగుడుతున్నాడు.

అర్థము :

జాహ్నవీ = ఓ గంగాదేవీ, తేజః అసహ్యాన్ = తేజస్సుచేత సహింప నలవిగాని వాడు, అనగా భరించజాలనంత తేజస్సుకలవాడైన, శరజన్మన్ = కుమారస్వామిని, తాఁ సైరింపక = తాను భరించలేక, అపర్ణ = పార్వతీదేవి, ఉండగఁ = (అసమర్థురాలై) ఉండగా, భవత్ గర్భంబునఁ = నీ కడుపున, తాల్చి = భరించి, కాంచి = (ఆ శరజన్ముని) కని, అల = ప్రసిద్ధ యైన, నీహార క్షమాభృత్ కుమారీ = మంచుకొండ కూతురు అయిన పార్వతి యొక్క, సాపత్న్యముఁ = సవతితనమును-అనగా ఈర్ష్యను, కన్న = పొందినటువంటి, మోహపు పురంధ్రీ రత్నము = ఎక్కువ అనురాగముగల శ్రేష్ఠురాలగు కుటుంబినివి, ఔదు ఈవ = నీవే అగుదువు, కావేఁ = అలాకాని ఎడల, సర్వజ్ఞుఁడు = సర్వమూ తెలిసిన ఈశ్వరుడు, నిన్ను, తలపైన ఎక్కించుకోఁ ఏల ? = తలపైన ఎందుకు ఎక్కించుకున్నాడు, అనగా ఎందుకు అంత ఎక్కువగా గౌరవిస్తున్నాడు ?

తాత్పర్యము :

ఓ గంగాదేవీ, భరించనలవిగాని తేజస్సు గల కుమారస్వామిని పార్వతి సహింపజాలక ఉండగా నీవు నీ గర్భమందు ధరించి అతడిని కన్నావు; దానితో పర్వతరాజ కుమారి యైన పార్వతికి సవతివయి ఈశ్వరుడికి గారాబు భార్యవైనావు; కాబట్టి అన్నీ తెలిసిన పరమేశ్వరుడు నిన్ను తలపై పెట్టుకొని అమితముగా గౌరవిస్తున్నాడు - అని తాత్పర్యము.

విశేషము :

అపర్ణ = శివుడి కోసం తపస్సుచేస్తున్నప్పుడు, పర్ణ = ఆకులను గూడ తినకుండా ఉండి నందు వల్ల పార్వతికి ఈ పేరు వచ్చింది. గొప్ప తపోమహిమ గల ఆ అపర్ణగూడా శరజన్ముని భరించలేక పోయిందని సూచన.

శరజన్మ - శరమనగా నీరు, రెల్లు అని గూడ అర్థాలున్నాయి.

గంగ యందు పుట్టినవాడు కాబట్టి గాంగేయుడనీ, రెల్లులో పుట్టినవాడు కాబట్టి శరజన్ముడు, శరవణభవుడు అనీ కుమారస్వామికి పేర్లున్నాయి.

పురంధ్రీరత్నము - ఈశ్వరుడికి సత్‌సంతాన ప్రాప్తి కలిగించినందు వల్ల గంగ పురంధ్రీ రత్నము - అత్యుత్తమ కుటుంబిని అయిందని తెలుసుకోవాలి.

ఎవడో ఒక అజ్ఞానికాక, సర్వజ్ఞుడు (అన్నీ తెలిసినవాడు) అయిన ఈశ్వరుడు తలపై ఎక్కించుకున్నా డంటే దానికి చాలినంత కారణ ముందని వేరే చెప్పనక్కర లేదు. దానినే పై రూపంగా తెలిపి కవి సమర్థించాడు.

తలపై ఎక్కించుకొనడం : నిజంగా ఈశ్వరుడు గంగను తలపైనే ఉంచుకున్నాడని పురాణాలు. అది ఒక పలుకుబడి; అమితంగా గౌరవించడం అని దాని అర్థము. శ్లేషవల్ల వాస్తవాన్నీ, పలుకుబడి అర్థాన్నీ జోడించి కవి చమత్కారము చేశాడు.

జాహ్నవి = జహ్నుముని కూతురు. భగీరథుడు గంగను భూమికి తీసుకొని వచ్చినప్పుడు ఆ గంగ జహ్నుమహర్షి ఆశ్రమమును ముంచివేస్తుంటే ఆ మహర్షి గంగను త్రాగివేశాడు. తరువాత భగీరథుడు ప్రార్థించగా ముని తన చెవిలోనుంచి గంగను విడిచిపెట్టాడు. కాబట్టి గంగకు జాహ్నవి - జహ్నుముని బిడ్డ - అన్న పేరు వచ్చింది.

ఎక్కడో మునిపల్లెలోని కన్య అయి గూడ ఈ జాహ్నవి (నీహార) క్షమాభృత్ = (మహారాజ) కుమారిక కన్న మిన్నఅయినది అని చమత్కారము. కాబట్టే గంగను జాహ్నవి అని చిన్న పేరుతోనూ, పార్వతిని 'నీహారక్షమాభృత్కుమారి' అని పెద్ద పేరుతోనూ కవి సూచించాడు.

*అలంకారము :*

పరికరం, కావ్యలింగ, శ్లేష.

పెల్లుసెగఁ జల్లు విస మా
తెల్లనిదొర కుతికమోవఁ దిని బ్రతుకుట నీ
చల్లదనమ్మునఁ గాదే ?
కల్లోలవతీ మతల్లి గంగమ తల్లీ. 115

*అర్థము :*

కల్లోలవతీ మతల్లి — కల్లోలవతీ = (అలలు కలిగినది)నదులలో, మతల్లీ = శ్రేష్ఠురాలా, గంగమ తల్లీ = గంగాదేవీ, పెల్లు = అధికమైన, సెగ = వేడిమిని, చల్లు = వ్యాపింపజేస్తున్న, విసము = కాలకూటమన్న విషాన్ని, (అధికమైన అగ్నిజ్వాలలు కక్కుతున్న విషాన్ని) కుతికమోవఁ = గొంతుమోయా (కడుపునిండుగా, ఈశ్వరపరంగా గొంతువరకు మాత్రమే), తిని = తినినప్పటికీ, ఆ తెల్లనిదొర = తెల్లని దేహచ్ఛాయగల ఆ ఈశ్వరుడు, బ్రతుకుట = (ఆ విషమువల్ల మరణించక) జీవించి ఉండడం, నీ చల్లదనమ్మునఁ గాదె = నీచలువ వల్లనే కదా (నీ మంగళసూత్ర మహిమవల్లనే కదా).

*తాత్పర్యము :*

అగ్నిజ్వాలలు కక్కుతుండే కాలకూటవిషాన్ని కడుపునిండా తిని గూడా నీభర్త ఈశ్వరుడు బ్రతికి ఉండడం నీ చలువవల్లనేకదా గంగమతల్లీ అని భావము.

విశేషము :

విషము, అగ్నిజ్వాలలు కక్కుతూ ఉండేది. తినినవాడు, తెల్లని దొర - సుకుమారుడైన రాచబిడ్డడు. తినడము, కుతికమోవ—కడుపునిండుగా. చనిపోవడానికి కావలసిన కారణాలు అన్నీ ఉండినా, ఆలాగు జరుగలేదు — బ్రతికే ఉన్నాడు. దీనికి కారణం గంగ అతని తలపైన, మంచుటోపీ లాగా, చల్లగా ఉండడమే అని సూచన.

అంతేకాదు. భర్తకు రానున్న విపత్తు తప్పినప్పుడు అది అంతా భార్యచల్లదనమే అని భావించడం లోకములో ఉంది. కాబట్టి ఈశ్వరుడు బ్రతకడం భార్యయైన గంగాదేవి యొక్క మంగళసూత్ర మహిమ అనే అంటాడు కవి.

ఈలాంటి అభిప్రాయాన్నే అల్లసానివారు మనుచరిత్రలో కనబరిచారు :

....రతి లోచ నాంబువుల వాన నిగిర్చితె పాంథబాధకై
మడియ కనంగ, ఆవెలఁది మంగళసూత్ర మహత్వ మెట్టిదో॥

(ఆ. 3-46)

గంగ పూజ్యురాలు కాబట్టి ఆమెను దేవతాభావముతో గంగమ తల్లీ అని సంబోధించాడు.

ఈశ్వరుడు విషమును కుతికవరకే మ్రింగినాడని ప్రసిద్ధి. కాబట్టే అతడు నీలకంఠుడు. గరళకంఠుడు అయ్యాడు. ఈ పురాణవిషయాన్ని కుతికమోవ—కడుపునిండా అన్న శ్లేషతో ప్రయోగించి కవి చక్కని చమత్కారము చూపించాడు.

పాఠాంతరాలు :

ఈ పద్యములో చివరిభాగము 'గంగా తటినీ', 'గంగాజననీ', 'గంగాతల్లీ' అని పఠించారు. మన కవికి ప్రియమైన అంత్యానుప్రాసం పోతుంది. ఇంత చక్కని భావంతో వ్రాసిన పద్యానికి అంత్యానుప్రాసము మరికొంత సొగసు నిస్తుంది. కాబట్టి 'కల్లోలవతీ మతల్లి, గంగమ తల్లీ' అన్న పాఠమే బాగుంది.

అలంకారము :

విశేషము, శ్లేష, అంత్యానుప్రాసము.

పువ్వారుఁ బోఁడిపై నరి
యెవ్వా రన, భీష్ముఁ గాంచి యింపొందితి వీ;
వవ్వావి యెఱుఁగుదువె మా
యవ్వా, పోషింపఁ బాడియగు నను నీకున్, 116

అర్థము :

(పువ్వు అరుమేను) పువ్వారు(బోఁడివై = పూవువంటి(కోమలమైన) శరీరముగలదానవై, సరి ఎవ్వారు అనఁగా = నీకు ఎవ్వరు సాటిలేరన్నట్లు, భీష్ముని, కాంచి = కని, ఇంపు ఒందితివి ఈవు = నీవు శోభను (కీర్తిని) పొందితివి, ఆ వావి = ఆ చుట్టరికపు వరుస, ఎఱుఁగుదువే = నీకు తెలుసునా, మా అవ్వా = తల్లీ (వరుసకు ముత్తవ్వ, ప్రపితామహి), ననుఁగా, పోషింపఁగా, నీకు, పాడి = న్యాయము, అగుఁగా.

తాత్పర్యము :

స్త్రీ రూపములో నీవు మాతాత భీష్ముడిని కన్నావన్న సంగతి నీకు తెలుసునా అవ్వా : ఆ వరసనుపట్టి గూడా నీవు నన్ను ఆదరించడం ధర్మమని అర్జును డన్నాడు.

విశేషము :

పువ్వారు బోడివై — జలమయమైన ఈ నదిరూపంగా కాక, పూవులాగా కోమల మయిన శరీరముగల సుందరాంగి రూపంగా ఉండి అన్నమాట.

ఆరూపములో గంగ శంతనుడిని వివాహం చేసుకొని, శాపగ్రస్తులైన అష్టవసువులను కుమారులుగా కన్నది. వారిలో కడపటివాడే భీష్ముడు, తనకు (అర్జునుడికి) తాత.

కాబట్టి అర్జునుడికి గంగ తాతతల్లి — ముత్తవ్వ. ఈ పద్యంలో గంగను "అవ్వా" అని సంబోధించడం ఎంతో అందంగా ఉంది. అవ్వ అంటే అమ్మ, ఆడుది అన్న అర్థాలు గూడా ఉన్నాయి.

భీష్ముడు పుట్టిన తరువాత మూడుతరాల కాలం సాగిపోయింది. ఈ మధ్యకాలములో పుట్టి పెద్దలయినవారు పాండవాదులు. ఆసంగతి గంగకు తెలుసునో తెలియదో అని "అవ్వావి యెఱుఁగుదువే ?" అని అన్నాడు అర్జునుడు—ఈ విధంగా ఎరిగించాడన్న మాట.

భక్తిని చూచేకాక, బంధుత్వము చూచి గూడా గంగ తన్ను కాపాడాలని న్యాయ నిర్వచనం చేశాడు. అవ్వా మనుమల ముచ్చట్లు !

పువ్వారము అంటే తాటి, ఈత మొదలైన చెట్లయొక్క పువ్వు అని శబ్దరత్నాకరము. తాటి పూవులకూ, లేత తాటి ఆకులకూ పట్టే మెత్తటి బూజువంటి పదార్థము అని గూడ అర్థం ఇచ్చారు నిఘంటువులవారు. పువ్వారు = పువ్వు అని, పువ్వారుతీఁగ, పువ్వారుబోఁడి అన్న మాటలు చూపించారు సూ. ని. వారు.

పూవువలె కోమలమైన దేహం కలిగిన దానవైనా, భీష్ముడిని( = భయంకరుడిని) కన్నావు. కాబట్టి 'నీ సరి ఎవరు న్నార'ని చమత్కారము.

లేదా, సరియెవ్వారు అనదగిన భీష్మ గాంచినావు అని అన్వయించినప్పుడు 'పువ్వారు బోడిపై సరియెవ్వారను భీష్మగాంచి' అన్న పాఠం అంగీకరించాలి.

భీష్మగాంచి యింపొందితివి - గంగ శంతనుడి భార్యగా కనిన ఏడుగురు వసువులను పుట్టగానే 'తొలి ఒడంబడిక ప్రకారం' నీటిలో విడిచిపెట్టి వేస్తూ ఉందేది. అంతేగాని పుత్ర ప్రేమతో అల్లారుముద్దుగా కన్నకుమారుని పెంచి పెద్దజేయడములో ఉన్న ఆనందాన్ని అనుభవించలేక పోయింది. ఆ కొరత తీర్చుకోడానికే భీష్ముడిని గంగపాలు చేయకుండా ఆ ఆనందాన్ని (ఇంపును) పొందింది అనిభావము.

*పాఠాంతరము :*

పువ్వారుఁబోడి నీసరి
యెవ్వారన భీష్మ....

— తిరుపతివారు.

*అలంకారము :*

పరికరము.

సకల శుభమ్ము లిమ్మనుచు సన్నుతు లీగతిఁ జేయ నా స్రవం
తిక దయఁ దెల్పఁ బంచిన గతిం జనుదెంచె నుదంచ దూర్మికా
నికర విలోల ఖేల దళినీ కలగాన లసత్ ప్రఫుల్ల హ
ల్లక సుఖడోలికా విహృతి లాలన బాలసమీర మయ్యెడన్. 117

బంధుత్వం తెలియజేసి, నన్ను పోషించడం నీకు ధర్మమనిచెప్పి, ఆ పోషించడం ఏలాగంటే సకల శుభాలూ ఇవ్వవలసిందని వివరించాడు.

*అర్థము :*

సకల శుభమ్ములు = అన్ని విధములైన శుభములను, ఇమ్ము అనుచున్, ఈ గతిన్ = ఈ విధముగా, సన్నుతుల్ చేయన్ = (అర్జునుడు) స్తోత్రములుచేయగా, ఆ స్రవంతిక = ఆ గంగానది, దయన్ తెల్పన్ = తనకు అర్జునుని యందుగల దయను తెల్పుట కొరకు, పంచిన గతిన్ = పంపించినదా అన్నట్లు, అయ్యెడన్ = ఆ సమయమున, ఉదంచ....బాలసమీరము—ఉదంచత్ = మిక్కిలి మెరయుచున్న, ఊర్మికా = తరంగముల, నికర = సమూహమందు, విలోల = ఎక్కువగా కదలుచు, ఖేలత్ = ఆడుకొనుచున్న, అళినీ = ఆడుతుమ్మెదల యొక్క, కలగాన = మనోహరమైన పాటలచేత, లసత్ = ప్రకాశించుచున్న, ప్రఫుల్ల = బాగుగా వికసించిన, హల్లక = ఎఱ్రతామర లనే, సుఖడోలికా = హాయిగా ఉండే మెత్తని ఉయ్యేల

అందలి, విహృతి = విహారమునందు, లాలస = ఆసక్తిగల, బాల సమీరము = పిల్లవాయువు, చనుదెంచెన్ = వచ్చెను.

తాత్పర్యము :

అన్ని శుభాలూ ఇచ్చి నన్ను కాపాడవలసిందని అర్జునుడు ప్రార్థించగా, గంగానది తన వాత్సల్యం తెలియజేయడానికి పంపించిందా అన్నట్టు పిల్లవాయువు వీచిందని భావము. ఈ పిల్ల వాయువు కదులుతూఉండే ఎర్రతామర ఉయ్యేలలో తుమ్మెదల పాటలు వింటూ ఆడుకుంటూ ఉండేదని వర్ణన.

విశేషము :

అది బాల సమీరము—వాయువుపిల్ల. కాబట్టి బాలకులకు కావలసిన పరికరాలన్నీ కవి సమకూర్చినాడు.

బాగా వికసించిన ఎర్రతామర మెత్తని ఊయెల, ఆ ఉయ్యేలను తరంగములు ఊపుతున్నాయి, ఆడుకుంటూన్న తుమ్మెద కాంతలు లాలిపాటలు పాడుతున్నారు. ఈ సమీరబాలకుడు లాలిపాటల నిద్రమత్తులో మందముగా వస్తున్నాడని కవి హృదయము.

తరగలు ఊపుతుండడంవల్ల శైత్యము, ఎర్ర తామరలలో ఉండడంవల్ల సౌరభము, లాలిపాటలవల్ల మాంద్యము, అన్న మూడు ప్రధానలక్షణములను ఈ పిల్లవాయువులు కలిగి ఉన్నాయని అభిప్రాయము.

"బాల సమీరము" చేత గంగ తన దయను అర్జునుడికి తెలియ చేయడము ఎందుకు ?

గంగకు అర్జునుడు మునిమనుమడు; గంగ దృష్టిని చిరుతవాడే. కాబట్టి చిరుత (బాల) సమీరమునే పంపించిందని చమత్కారము.

పద్యము నడక ఊయెల ఊగినట్లే ఉండడం మరొక అందము.

అలలు పైకి లేచినప్పుడు సూర్యకాంతివల్ల తళుక్కు మనడం సహజము. కాబట్టి ఉదంచత్ - మిక్కిలి మెరయుచున్న అని కవి అన్నాడు.

హల్లకం అంటే ఎర్రకలువ అని వ్యాఖ్యాత లన్నారు. కాని, సమయము పగలు, తామరలలో నుంచి తుమ్మెదలు ఎగురుతుంటాయి. కాబట్టి కలువ అనడం భావ్యంకాదు. ఎర్రతామర అనడం న్యాయము.

అలంకారము :

ఉత్ప్రేక్ష, సమాసోక్తి, రూపకము.

చనుదెంచిన, హా ! యని, య
జ్జన నాయకుఁ డలరుచుఁ‌‌గా విశారదుఁ గని, యీ
యనుకూల మారు తాగతిఁ
గనుఁగొన నామోద సూచకం బైనదిగా. 118

అర్థము :

చనుదెంచినన్ = ఆరీతిగా పిల్లవాయువు రాగా, ఆ జననాయకుఁడు = ఆరాజు-అర్జునుడు, హా ! అని అలరుచుఁగా = హాయి అని సంతోషము పొందుతూ, విశారదున్, కని = చూచి, ఈ, అను...గతిఁగా—అనుకూల = అనుకూలముగా వీచుతున్నట్టి, మారుత = గాలియొక్క, ఆగతిఁగా = రాకను, కనుఁగొనఁగా = చూడగా, ఆమోద సూచకంబు = (మన ప్రార్థనకు) సమ్మతిని తెలియజేసే, సూచన, ఐనదిగా = ఐనదికదా - మనకోర్కెను గంగ అంగీకరించినట్లు తేటపడుతున్నదికదా. (అనుకూలముగా వీస్తున్న గాలి కాబట్టి ఆమోదసూచకము అని భావము.)

తాత్పర్యము :

అనుకూలంగా వీచిన గాలికి అర్జునుడు సంతోషించి, విశారదా, ఈ గాలివల్ల గంగానది మన ప్రార్థనను అంగీకరించినట్టు తేటపడుతున్నదికదా అన్నాడు.

విశేషము :

హా ! అనడం ఆ గాలివల్ల కలిగిన సౌఖ్యానికీ, గంగ ఆమోదము తెలిపినందుకూ అని భావించాలి.

ఈ ఆమోదములో పరిమళమూ అంగీకారమూ రెండూ ఉన్నాయి.

ఇంతేకాదు. అనుకూల — కూలమును (గట్టును) అనుసరించిన, అనగా. ఏటి గట్టులను ఒరసికొని వస్తున్న, మారు తాగతిఁగా = గాలిరాకవల్ల, కనుఁగొనన్ = కన్నులయొక్క కొనలయందు - కటాక్షములయందు - కానవచ్చే, ఆమోదసూచకంబు = సమ్మతిని తెలుపునట్టిది అని గూడా విశేషార్థము కవి ఊహించాడు. పెద్దలు తమ ఆమోదమును (సమ్మతిని) క్రేగంటితో ప్రక్క చూపులతో తెలియచేయడం సహజముగదా. గాలి గట్టులను ఒరసికొని, ప్రక్కవాటుగా వస్తుండడము చేత - క్రేగన్నుల సూచన అని చమత్కారము.

గాలి అనుకూలంగా ఉండడం శుభశకునంగా గూడ భావిస్తారు. అదే ఉలూచి కథ.

అలంకారము :

శ్లేష.

తల నీ గంగాతీర్థము
చిలికినవాఁ డీశ్వరుండు; చేరెఁడు లోఁ గోఁ
గలిగినఁ దరఁగలఁ దేలం
గలిగినఁ దన్మహిమ లెన్నఁగాఁ దర మగునే? 119

ఈ పద్యములో అర్జునుడు విశారదుడికి గంగా మాహాత్మ్యము చెప్పుతున్నాడు.

అర్థము :

ఈ గంగాతీర్థము = ఈ గంగాజలమును (పవిత్రతను తెల్పడానికి తీర్థము అన్నాడు), తలన్ = శిరస్సుమీద, చిలికినవాడు = చల్లుకొన్నవాడు (చిలికినంత మాత్రాన), ఈశ్వరుండు = ఈశ్వరుడితో సమానుడౌతాడు (గంగ నీశ్వరుడు తలపై నుంచుకోవడం ప్రసిద్ధమే), చేరెఁడు = చేరెడు జలమును, లోన్ = లోపలికి, కోన్ = గలిగినన్ = పుచ్చుకొన అనగా త్రాగ కలిగినా, (లేక), తరఁగలన్ = (ఆ గంగానది) అలలయందు, తేలన్ కలిగినన్ = స్నానముచేయ గలిగినా, తత్ మహిమలు = అతని ప్రభావములు, ఎన్నఁగాన్ = ఊహించగా, తరము అగునే = శక్యమా ?

తాత్పర్యము :

తలపై కొంచెము నీరు చిలికినంతమాత్రాన ఈశ్వరునంతటివాడు అవుతుండగా, చేరెడు నీరు త్రాగినా, ఆ నీటిలో స్నానము చేసినా ఎంత గొప్ప ఫలము పొందునో అని భావము.

విశేషము :

ఈశ్వరుడు తన తలపైన గంగను చిలికికొన్నవాడు. ఈ పురాణప్రసిద్ధ విషయమును చెప్పుతూ గంగా జలమును తలపై చిలికికొన్న ప్రతివాడూ ఈశ్వరునితో సమానుదవుతాడని కవి చమత్కరించాడు.

అలంకారము :

అర్థాపత్తి, వక్రోక్తి.

'మునుకలు గంగానదిలో
నొనరించుటకన్న భాగ్య మున్నదె ?' యనుచున్
మునుకలు గంగా దిగి, పరి
జనములు తైలా గొనంగ స్నానోన్ముఖుఁడై. 120

అర్థము :

గంగానదిలోఁ, మునుకలు = స్నానములు, ఒనరించుటకన్నఁ = చేయుటకంటె, భాగ్యమున్నదె = అదృష్టముకలదా? అనుచుఁ = అని విశారదునితో చెప్పుతూ, పరిజనములు = అనుచరులు, కైలాగు = చేయూతను, ఒసంగఁ = ఇస్తుండగా, మునుకలుగంగా = అందరికంటె ముందుగా, దిగి = నదిలోదిగి, స్నాన ఉన్ముఖుఁడై = స్నానము చేయుటకు సిద్ధపడినవాడై — తరువాతి పద్యముతో అన్వయము.

మరొక విధము :

మును కలుగంగాన్ = తనముందు కొందరు (లోతూ రాళ్ళూ వగైరాలు తెల్పడానికి) ఉండగా, తాను దిగి, పరిజనములు, కైలాగొసంగ = చేయూత నివ్వగా, స్నానోన్ముఖుడై — ఈ అర్థము చెప్పినప్పుడు అర్జునుడిముందు ఒకరిద్దరు దిగి నడుస్తుంటారు; తనతో ఒకరిద్దరు సేవకులు చేయూత నిస్తుంటారు.

ప్రభువు విషయం తీసుకున్న శ్రద్ధ దీనిలో కనబడుతుంది.

పాఠాంతరము :

మునుకలు గంగానదిలో
నొనరించుటకన్న భాగ్యమున్నదె ? యనుచుఁ
మును కలుగంగా నదిఁ బరి
జనములు కైలా గొసంగ స్నానోన్ముఖుఁడై

— తిరుపతివారూ, నోరివారూ.

అప్పుడు గంగానదిలో స్నానము చేయుటకన్న భాగ్యమున్నదా అనుచు, మునుకలు గంగాఁ అది = అభాగ్యము, మును = మొట్టమొదట, కలుగంగాఁ = కలుగునట్లు, పరిజనములు కైలా గొసంగ స్నానోన్ముఖుడై అని అన్వయించుకోవాలి.

ఈ పాఠములో యమకానికి మరిరెండు అక్షరాలు జత కలుస్తాయి.

అలంకారము :

యమకము.

తమి నిగుడ గుడాకేశుం
డమరనదీ విమలవారి నాడుచునుండఁ
యమునానదిఁ గూడిన తో
యమునా నది తనరెఁ దత్కచాఘేచకమై. 121

గుడా అనగా చూపుడు వ్రేలికొనా, బొటనవ్రేలికొనా కలిపినప్పుడు ఏర్పడే వలయము. తలవెంట్రుకలను పట్టి చూచినప్పుడు ఆ వలయమునిండా ఉన్నంత దట్టమైన జుట్టు కలవాడు "గుడాకేశుడు"— ఇక్కడ అర్జునుడు.

*అర్థము :*

తమి నిగుడన్ = ఆసక్తి అతిశయించినట్లు, గుడాకేశుండు = అర్జునుడు, అమరనదీ = దేవనదియైన గంగయందలి, విమల వారిన్ = నిర్మలమైన నీటిలో, ఆడుచున్ ఉండన్ = స్నానమాడుచుండగా, తత్కచ ఆమేచకమై—తత్ = అతనియొక్క, కచ = తలవెంట్రుకల చేత, ఆమేచకమై = అంతటను నలుపు వర్ణము కలిగినదై (మిక్కిలి నల్లగానుండి), అది = ఆ నిర్మలోదకము, యమునానదిన్ = యమునానదితో, కూడిన = కలిసిన, తోయమునాన్ = జలమా అనునట్లు, తనరెన్ = ఒప్పెను.

*తాత్పర్యము :*

నిర్మలమైన గంగానదిలో అర్జునుడు స్నానము చేస్తుండగా, అతని తలవెంట్రుకల వల్ల ఆ నీరు యమునాది నీరులాగా నల్లగా కనిపించిందని భావము.

*విశేషము :*

యమునానది నీరు నల్లగా ఉండుననీ, గంగాజలము తెల్లగా ఉండుననీ ప్రసిద్ధి. తెల్లగా ఉండే గంగాజలము అర్జునుని గుడాకేశాలవల్ల మిక్కిలి నల్లగా కన్పడుతూ, నల్లని నీరుగల యమునానదిని గూడిన నీరా అన్న భ్రాంతి కలిగింది. తోయము = నీరు, విధము.

ఇంకా—నది = ఆ గంగానది, యమునానదిన్ = యమునానదితో, కూడిన = కలిసిన, తోయమునన్ = విధముగా, తనరెన్ = ఒప్పెను అని కూడ అర్థాంతరముంది.

వ్యాఖ్యాతలు 'గుడాకేశుఁడు' అన్న మాటకు "గుడాక = ఆలస్యమునకు, ఈశుడు = ప్రభువు—ఆలస్యము లేనివాడు అనగా అర్జునుడు" అని అర్థము చెప్పారు. ఈ అర్థం ఎంత సరియైనదైనా, ఈ పద్యములో అది సరిపడదు.

దీనిలో ప్రధాన విషయము అర్జునుని తలవెంట్రుకలు. వాటి సమృద్ధివల్ల తెల్లనైన గంగాజలము యమునానది గూడిన దానిలాగా నల్లబడి కనపడుతుంది. 'తత్ కచామేచకమై' అని అందుకే అన్నాడు కవి.

గుడాకేశ — ఈ శబ్దంలో ప్రస్ఫుటంగా కేశ (తలవెంట్రుకలు) అన్న మాట ప్రత్యక్షంగా కనబడుతూ ఉంది.

చేమకూర వేంకటకవి, పద్యములలోని కల్పనలకు అనుగుణమై అందాన్నిచ్చే పదాలనే సాభిప్రాయంగా ప్రయోగించి "వాఙ్మయమరూఢి నీయంత వాడికేది," అన్న ప్రఖ్యాతి

నార్జించిన వాడు. కాబట్టి ఈ పద్యంలో 'ఆలస్యమునకు ప్రభువు' అన్న అర్థములో గుడాకేశ శబ్దం ఉపయోగించి ఉండడనడం నిస్సందేహము. తర్జని అంగుష్ఠాగ్ర సంయోగ వలయానికి సరిపడినంత దట్టమైన తలవెంట్రుకలు ఉండడం స్త్రీలలో గూడా చాల అరుదని వేరే చెప్ప నక్కరలేదు.

పై పద్యములో తాను సూచించిన స్నానాసక్తినే ఆధారముగా చేసుకొని ఈ పద్యము 'తమినిగుడకా' అని ఆరంభించాడు.

పాఠాంతరము :

......అమర ధునీ విమల వారి......

— వేంకట కృష్ణమాచారిగారు.

అలంకారము :

తద్గుణము, భ్రాంతిమంతము, యమకము.

దానము లెన్నియే నచటి తైర్థిక భూసుర సంఘమెల్ల డెం
దాన ముదమ్ముచెందఁగ నొనర్చి, దృఢవ్రతచర్య నిత్యముం
దానము చేయుచుక, హరికథా శ్రవణం బొనరించుచుండె నం
దా నముచి ద్విష త్తనయుఁ డాశ్రిత కల్పమహీరుహం బనన్. 122

అర్థము :

అందు = ఆ గంగాతీరమందు, ఆ నముచి ద్విషత్ తనయుఁడు = నముచి అన్న రాక్షసుని విరోధి (అనగా జయించినవాడు అగు ఇంద్రుని) కుమారుడు - అర్జునుడు, ఆశ్రిత = ఆశ్రయించుకొని ఉన్న వారలకు, కల్పమహీరుహంబు అనన్ = కోరిన కోర్కెలనిచ్చే కల్పవృక్షము వంటి వాడని అనుకొన్నట్లు, అచటి, తైర్థిక భూసుర సంఘము ఎల్లన్ = తీర్థయాత్రకు వచ్చిన వారి యొక్క బ్రాహ్మణుల యొక్క సమూహ మంతా, డెందానక = మనస్సునందు, ముదంబు చెందఁగన్ = సంతోషముపొందునట్లు, ఎన్నియేక దానములు = అనేకమైన దానములను, ఒనర్చి = చేసి, దృఢవ్రతచర్యక = సడలని వ్రతనిష్ఠతో, నిత్యముక = ప్రతిదినమును, తానము చేయుచుక = (పుణ్యతీర్థ) స్నానములుచేస్తూ, హరికథా శ్రవణంబున్ ఒనరించుచు = విష్ణుకథలను వింటూ, ఉండెన్.

తాత్పర్యము :

ఆశ్రితులకు కల్పవృక్షములాగా యాత్రికులకు అనేక విధాలయిన దానాలు చేస్తూ, వ్రతచర్య సడలనీయక, నిత్యమూ తీర్థస్నానాలూ, విష్ణుకథల శ్రవణమూ చేస్తూ అర్జునుడు గంగా తీరమున ఉండెనని భావము.

*విశేషము :*

పద్యములో ద్విప్రాసమునూ, నాలుగు 'దానము'లునూ చూడదగినది.

కల్పమహీరుహము ఇంద్రుని సొత్తు. దానివలె కోరిన కోర్కెలు ఇస్తున్నవాడు కాబట్టి అర్జునుడిని ఈ పద్యంలో ఇంద్రుడు కుమారుడు అన్న అర్థమిచ్చే 'నముచి[1] ద్విషత్ తనయుడు' అని సాభిప్రాయంగా కవి ప్రయోగించాడు. ఇంద్రుడి సంబంధమువల్ల అర్జునుడు కల్పవృక్షము వంటి వాడయాడని చమత్కారము.

*అలంకారము :*

ఉత్ప్రేక్ష, యమకము.

## ఉలూచి కథ

భోగవతినుండి యెప్పుడు
భాగీరథి కడకు వచ్చి భాసిలు మున్నె
నాగకుమారిక య య్యెల
నాగ యులూచి తమి నొక్కనాఁ డటఁ జెంతన్, 123

*అర్థము :*

ఏ నాగకుమారిక = ఏ సర్పకన్యక, భోగవతినుండి = భోగవతి అన్న నాగలోక రాజధాని నుంచి, మున్నె = ఇంతకుముందు, ఎప్పుడుఁ = నిత్యము—తరుచుగా, భాగీరథి కడకుఁ = గంగానది ఒడ్డునకు, వచ్చి, భాసిలున్ = ఆనందిస్తుండేదో, ఆ ఎలనాగ ఉలూచి = ఉలూచిఅనే ఆ లేత్రాయపు చిన్నది, తమిన్ = చీకటిలో-చీకటి ఉంటుండగనే - వేకువజామున అన్నమాట, ఒక్కనాఁడు = (అర్జునుడు గంగాతీరాన విడిసియున్న రోజులలో) ఒక రోజున, అటఁ = ఆ గంగాతీరమున, చెంతన్ = ఒక వైపున - ఒక ప్రక్కను ... పై పద్యముతో అన్వయము.

1. నముచి :— దేవదానవ యుద్ధములో ఇంద్రుడు నముచి అన్న అసురుడిని వజ్రాయుధంతో కొడతాడు. నముచికి ఏమీ బాధ కలుగదు. అప్పుడు ఆకాశవాణి "ఈ నముచి తడిసినదాని వల్ల గాని, ఎండినదాని వల్ల గాని చావులేకుండా ఉండేలాగ వరము సంపాదించాడు" అని చెప్పుతుంది. అది విని ఇంద్రుడు ఫేనము (= నురుగు) తో కొట్టి వాడిని చంపాడని పురాణ కథ.

తాత్పర్యము :

నాగలోక రాజధాని భోగవతీ నగరంనుంచి తరుచుగా గంగా తీరానికి వస్తూఉండే ఉలూచి అన్న నాగకన్యక ఆ నాడు తెల్లవారు జామున ఆ గంగానది ఒడ్డున ఒక ప్రక్కను...తరువాతి పద్యంతో అన్వయము.

విశేషము :

ఈ ఉలూచీఘట్టములో కవి చాలా శ్రమా శ్రద్ధా తీసుకొని రచనసాగించాడు. స్థలాన్ని గురించిన వివరాలూ, కాలము ఎలాగ గడిచిందో ఆ వివరాలూ, మనసు ఏ విధంగా మారుతూ వచ్చిందో ఆ వివరాలూ పాఠకులకు వాచాగా చెప్పకుండానే, చాల చమత్కారంగా అందిచ్చాడు. అందుకే ఈ ఘట్టాన్ని శ్రద్ధగా చదవాలని మనవి.

ఉలూచి నాగకన్యక. అయినా ఎప్పుడూ – చాల తరుచుగా గంగా తీరానికి వస్తూ ఉండేది. అలా రావడానికి ప్రత్యేకమయిన కోరిక గాని, ఉద్దేశం గాని లేదనీ, షికారుకోసమే వస్తూండే దనీ మనము భావించాలి.

తమిఁ = కోరికతో అని చెప్పడానికి ఎవ్వరికీ అభ్యంతరం లేదు. కాని ఆ కోరిక ఏమిటో ఇక్కడ గాని, ఇక మీదట గాని కవి చూపలేదు. అందుచేత 'తమిఁ' అన్నది అర్థ గౌరవంలేని ఊత పదమవుతుంది.

దానిని మన మంగీకరించలేము. కాబట్టి తమిన్ అంటే చీకటి ఉంటూ ఉండగనే — వేకువజామున అని అర్థం చెప్పకున్నాము. తమి అంటే చీకటి అని గూడా అర్థముంది. అయినా ఆ అర్థం ఇక్కడ చెప్పడానికి చాలినంత ఆధార ముండాలి కదా? చూడండి :

దీని తరువాతి పద్యములో 'హిమరసైక సైకతము' = మంచుతో బాగా తడిసిన ఇసుక తిన్నెను కవి చూపించాడు. ఇంకా ఎండ ఎక్కలేదన్న మాట.

దీనికితోడు, భారతములో నన్నయభట్టు గూడ ఈ సన్నివేశము "ఒక్కనాడు ప్రభాతంబ విధిపూర్వకంబుగ..." (ఆది. 8-127) జరిగినట్టు చెప్పాడు. ప్రభాతంబ = ప్రభాతమునందే అని నిశ్చయం.

ఈ 'తమి' కాలాన్ని తెలియజేసినట్టే, నాలుగో చరణం చివరనున్న 'చెంతఁ' అన్నది స్థలాన్ని తెలియజేస్తుంది.

చెంతఁ = సమీపమున అని చెప్పతే కాదనే వారుండరు. కాని ఇక్కడ 'సమీపమున' అని అర్థం చెప్పి, దీని తరువాతి పద్యంలోని 'దవులనే చూచి' అన్నమాటలతో సమన్వయించడం కష్టమవుతుంది. ఆ 'దవులనే చూచి' అన్న మాటలు చాల అర్థగౌరవంతో కవి ప్రయోగించాడు. కాబట్టి ఈ అర్థానికే ప్రాధాన్యమివ్వాలి; సమీపమని చెప్పకూడదు.

అందుచేత 'చెంతన్ = ఒక ప్రక్కను, ఒక వైపున' అని అర్థం చెప్పుకున్నాము. ఈ అర్థాన్ని సమర్థించడానికి 125 వ పద్యములో 'మనమునఁ బెనఁ గొనఁగఁ జేరి మాయాన్వితయై' అని కవి ఉలూచి మాయాన్వితయై దగ్గరకు వెళ్ళిందని చెప్పాడు.

అది విశాలమైన ఇసుక బయలు. అర్జునుడు యాత్రికులతోనూ, బ్రాహ్మణులతోనూ, పరివారంతోనూ మజిలీ చేసి ఉన్నాడు. కాబట్టి ఉలూచి మొదట ఆ గుంపు దగ్గరకు పోవడానికి వెనుక తీస్తుంది. తరువాత అతడిని దగ్గరగా చూడాలన్న ఉద్దేశం కలిగినప్పుడు 'మాయాన్వితయై' చేరుతుంది.

1. ఉలూచి అర్జునుడిని చూడడము వేకువజామున అనీ, 2. దూరమునుంచే మొదట చూచిందనీ మన మీరెండు విషయాలూ జ్ఞాపకముంచుకోవాలి.

హిమ రసైక సైకతమునందు విహరించు
కైరవేషు వేషు, ఘన నిభాంగు,
నెనరు దవుల దవులనే చూచి క్రీడిగా
నెఱిఁగి, యౌర! యౌర గేందు వదన, 124

ఉలూచి తొలిచూపునూ, దాని పర్యవసానాన్నీ ఈ క్రింది పద్యాలలో కవి వర్ణిస్తున్నాడు.

అర్థము :

హిమరస ఏక = మంచు నీరు ప్రధానముగా ఉన్న—మంచు తడి బాగుగా ఉన్న, సైకతమునందు = ఇసుక బయలుమీద, విహరించు = ఇటునటు తిరుగుచుండిన, కైరవ ఇషు వేషుణ్—కైరవ = తెల్లకలువను, ఇషు = బాణముగాగల మన్మథునియొక్క, వేషుణ్ = రూపముకల వానిని, ఘన నిభ అంగున్ - ఘన = మేఘముతో, నిభ = సమానమైన (నల్లనైన), అంగున్ = శరీరముగల వానిని (అర్జునుడిని), దవులనే = దూరమునుంచియే, చూచి, నెనరు = వలపు - ప్రేమ, తవులన్—తగులన్ = తనకు కలిగిన కారణముచేత, క్రీడి గాన్ = ఇతడే అర్జునుడని, ఔర! = ఎంత ఆశ్చర్యము! ఔరగ ఇందువదన—ఔరగ = ఉరగ (సర్ప) సంబంధమైన, ఇందువదన = చంద్రముఖి (ఉలూచి), ఎఱిఁగి = గుర్తించి... తరువాతి పద్యముతో అన్వయము.

తాత్పర్యము :



మంచుతో తడిసి ఉన్న గంగాతీరమున పచారుచేస్తూ ఉండిన ... రుడిని దూరం నుంచి చూచి, అతనియందు తన మనసులో ప్రేమ కలిగినందువల్ల ... దే ... నుడని అ ద్భుతంగా ఉలూచి గుర్తించి......

*విశేషము :*

ఉలూచి ఇంతకు పూర్వము అర్జునుడిని చూచి ఉండలేదు. అయినా ఇతడే అర్జునుడని గుర్తించింది. దీనికి కారణం అతడియందు తనకు నెనరు కలగడమే.

ఇక్కడ నెనరు అంటే కొంచెము అభిప్రాయ భేదము కనబడుతుంది. వేదమువారూ, బులుసువారూ "నెనరు దవులన్ = స్నేహభావము తగులుకొనునట్లుగా" అని అర్థం చెప్పారు.

ఆ నెనరు కేవలము స్నేహభావమే అయితే దానివల్ల అర్జునుడని గుర్తించడానికి అవకాశ ముంటుందా ? ఎలాగు ?

'నెనరు = (స్త్రీపురుషుల) వలపు, మోహము' అని సూర్యరాయ నిఘంటువు వారు అర్థముచెప్పి, దానిప్రయోగానికి విజయవిలాసములోని ఈ పద్యాన్నే చూపించారు. కాబట్టి నెనరు అంటే వలపు, ప్రేమ అని చెప్పడమే సమంజసము.

ఆమె హృదయము ఇంతకు పూర్వమే, ద్రౌపదీ స్వయంవర విషయము నాగులు చెప్పగా వినినందువల్ల, అర్జునుడికి అర్పితమయి ఉంది. ఈ మాట దీని తరువాతి పద్యములలో తేట పడుతుంది. అర్జునార్పితమయిన తన మనసును ఆకర్షించిన వ్యక్తి అర్జునుడు కాక మరొక్కడు కాజాలడని ఉలూచి నిశ్చయించింది.

శాకుంతలములో దుష్యంతుడు ఈ లాంటి 'హృదయ ప్రవృత్తి' నే ఆధారంగా చేసుకొని రుషి ఆశ్రమములో ఉన్నప్పటికీ శకుంతల తాపసాంగనకాదు అని నిశ్చయించాడు కదా !

అపూర్వమయిన విషయం కాబట్టే ఇక్కడ కవి 'ఔర ! ఔరగేందువదన' అని ఆశ్చర్యం ప్రకటించాడు. ఈ అర్థ గౌరవం లేకుంటే ఈ ఔరా ! కేవలం అనుప్రాసకోసం వేసుకున్న మాటగానే కనిపిస్తుంది.

ఈ పద్యములో ఉలూచి ప్రేమలో ఉన్న ఆధిక్యాన్ని కవి నిరూపించాడు

అర్జునుడు నల్లనివాడూ అందమైనవాడూ అని రెండోచరణ భావము.

*అలంకారము :*

కావ్యలింగ, చక్కని ఛేకానుప్రాసము.

మును ద్రౌపదీ స్వయంవర
మున కేఁగిన కామరూప భోగుల వలనన్
వినియున్న కతనఁ దమకము
మనమునఁ బెనఁగొనఁగఁ, జేరి మాయాన్వితయై, 125

అర్థము :

మును = ఇంతకు పూర్వము, ద్రౌపదీ స్వయంవరమున కేఁగిన, కామరూప = ఇష్టమైన అకారమును ధరించగల, భోగులవలనన్ = నాగులవలన, వినియున్న కతనన్ = వినియుండిన కారణముచేత, తమకము = మోహము, మనమునన్ = మనస్సునందు, పెనఁగొనఁగన్ = పెనవేసుకొనగా—అతిశయించగా, మాయాన్వితయై = మాయతోకూడినదై, చేరి = (ఎవ్వరికీ కనబడకుండా) అర్జునునకు దగ్గరగా పోయి—తరువాతి పద్యముతో అన్వయము.

తాత్పర్యము :

కామరూపాలతో ద్రౌపదీవివాహము చూడడానికి వెళ్ళిన నాగులవలన ఇంతకు పూర్వము విని ఉండిన కారణంచేత, తన మనసులో అర్జునుడి యందుగల మోహము అతిశయించింది; ఉలూచి తన మాయవల్ల ఇతరులకు కనిపించకుండా అర్జునుడి దగ్గరగా పోయి...

విశేషము :

ద్రౌపదీ స్వయంవరానికి వెళ్ళినప్పుడు నాగులు సర్పాకారంలో కాక, మానవ రూపాలలో వెళ్లారనీ, అలా వెళ్ళడానికి వారికున్న కామరూప శక్తిని ఉపయోగించారనీ భావము.

ఇప్పుడు భారతవర్షములో ఉన్న అస్సాం ప్రాంతానికి కామరూపదేశమన్న పేరుంది. అంతేకాక, అక్కడ ఇప్పుడు గూడా నాగజాతివా రున్నారు. ఈ అభిప్రాయముగూడా మనకవికి ఉండవచ్చును. కామరూపభోగులు = కామరూపదేశంలోని నాగులు అని విశేషార్థము గ్రహించవలసుంటుంది.

కామరూప భోగులు - కామ = మన్మథుని యొక్క, రూప = రూపముగల, భోగులు = నాగులు (సుందరులైన నాగకుమారులు) అని గూడా అర్థం చెప్పవచ్చును. అట్టివారు పొగడడం వల్ల అర్జునుడు వారికంటే ఎక్కువ అందముగలవాడని, ఉలూచి భావించింది.

వీరుడూ అందగాడూ అయిన ఆ అర్జునుడినే వరించాలని ఇంతకుముందే నిశ్చయించుకుంది.

ఉలూచికి మొదటనే నాగుల మాటలవల్ల అనురాగము అంకురించి ఉంది. ఈ ఘట్టములో (ఇప్పుడు పైపద్యములో) ఆ సుందరాకారుని చూచింది; అనురాగము కలిగింది. చూచినందువల్ల కలిగిన అనురాగమున్నూ, వినికిడివల్ల కలిగిన అనురాగమున్నూ, రెండూ తీవలలాగా పెనుచు కున్నాయి. అందుచేతనే "మనమునఁ బెనఁగొనఁగా" అని సాభిప్రాయముగా కవి అన్నాడు.

దగ్గరగా ఉండి అర్జునుడిని తనవితీర చూడాలనే అభిలాష కలగడం సహజము. ఏలాగ పోగలదు ? అపరిచిత. కాబట్టి ఇతరులకు కనిపించకుండ 'మాయాన్వితయై' దగ్గరగాపోయింది అని గ్రహించాలి.

గు ట్టసియాడ, గబ్బి చను గుట్టలపైఁ బుల కాంకు రావళుల్
తెట్టువ గట్టఁ, గోరికలు దేటలు వెట్టఁగ, వేడుకల్ మదిన్
దొట్టికొనంగ, నచ్చెరువు తొంగలి ఱెప్పల వీఁగనొత్తఁగాఁ,
బెట్టిన దండ దీయక విభీత మృగేక్షణ సూచె నాతనిన్. 126

అర్జునుడిని వరించిన సంగతి ఇంతవరకు తాను బయటపెట్టలేదు. తన ప్రేమను గుట్టుగానే ఉంచింది. ఈ రహస్యము ఇప్పుడు బయటవేయడమా, మానడమా అని మనసు ఊగులాడుతున్నది.

*అర్థము :*

గుట్టు = తన రహస్యము, అసియాడన్ = ముందువెనుక లాడుచుండగా, గబ్బి = పుష్టి గల, చనుగుట్టల పైన్ = కొండలవంటి చనుల పైన, పులక అంకుర ఆవళుల్ = పులకల మొలకల వరుసలు, తెట్టువ కట్టన్ = తెట్టెగా ఏర్పడుతుండగా, కోరికలు, తేటలు పెట్టఁగన్ = తేరుకొంటూ ఉండగా, వేడుకల్ = వినోదములు—అనుభవాలు, మదిన్ = మనస్సునందు, తొట్టికొనంగన్ = ఒకదాని వెనుక ఒకటి (అలలవలె) నెట్టుకొంటుండగా, అచ్చెరువు = ఆశ్చర్యము, తొంగలి ఱెప్పలన్ = వాలు రెప్పలను, వీఁగన్, ఒత్తఁగాన్ = వెనుకకు నెట్టుచుండగా (కనుగ్రుడ్లుముందుకు పొడుచుకొని వచ్చినవా అన్నట్లు) విభీత మృగ ఈక్షణ = బెదిరినలేడి వంటి కన్నులుగల ఆ ఉలూచి, పెట్టిన దండ = ఎక్కడ ఉంచిన చేతిని అక్కడే ఉంచి, తీయక = కదల్చకుండా (కొయ్యబారినట్లు), ఆతనిన్ చూచెన్ = ఆ అర్జునుని చూచెను.

*విశేషము :*

అర్జునుని చూడకుండానే ఉలూచి ఏనాడో అతడిని ప్రేమించింది. దూరంనుంచి అతడిని చూచిన తొలిచూపులోనే ఆమెమనసున చలనము కలిగింది. అతడే అర్జునుడని నిశ్చయించింది.

ఆమె ప్రేమను ఇంతవరకు, ఎవ రేమనుకుంటారో అని, గుట్టుగానే ఉంచింది. ఇప్పుడా గుట్టును బయల్పరచడమా మానడమా అన్న సమస్య ఆమెకు కలిగింది.

తాను అతడిని ప్రేమించినట్లుగా వెల్లడిస్తే అతడు ఆ మాట నమ్మునో నమ్మడో లేక, తప్పుగా భావించునేమో? బయటపెట్టకపోతే, మరల ఇటువంటి అవకాశం చిక్కుతుందా (లోకము గాని లోకము వాడు కదా) అని మనస్సు ముందు వెనుకలాడుతూఉంది. దీనినే కవి 'అసియాడుట'అని సూచించాడు.

ఈ ఆందోళనలో రహస్య ప్రకటన తప్పకుండా చేయాలని తాను అనుకొనినప్పుడు, ఆమెలోని ఉష్ణరక్తము ఉద్రేకముచెందింది. నరనరాలు ఉత్తేజిత మవుతాయి. "అవును అదే మంచిది" అని ఆ అభిప్రాయాన్ని బలపరుస్తున్నట్లు శరీరములో రక్తము పరువులెత్తుతుంది. దీని ఫలితంగా స్తనాది ప్రదేశములందు గగుర్పాటు కలుగుతుంది. తన ఊహాబలానికి ఈ రక్త

బలము తోడయినందువల్ల రెట్టించిన బలముతో సందేహాలన్నీ తొలగిపోయి, అభిప్రాయాలు (కోరికలు) తేటపడతాయి; అర్జునుడికి తన్నెరుకపరచుకోవడమే కర్తవ్యము అని స్పష్టమవుతుంది.

ఇంకేముంది? అర్జునుడికి తన్ను తెలియపరచుకుంటుంది, అతడు తప్పక అంగీకరిస్తాడు, తర్వాత—ఇద్దరూ ఆనంద డోలికలలో ఊగుతూ, వేయివిధాల వినోదాలతోనూ, క్రీడలతోనూ కాలక్షేపము చేస్తుంటారు, అని తాను అనుభవించబోయే సౌఖ్యాలు—ఒకదానిని త్రోసుకుంటూ ఇంకొకటిగా కానవస్తాయి. దీనినే కవి 'వేడుకల్ మదిన్ దొట్టికొనంగ, అన్నాడు.

ఆహా! ఎంత ఆనందము! ఎంత వినోదము! ఇదంతా నాదే కదా? అని ఆశ్చర్యముతో గుడ్లప్పచెప్పి చూడడం సహజము. అప్పుడు రెప్పలను వెనుకకు నెట్టి, గుడ్లు ముందుకు వస్తున్నాయా అన్నట్లు కనబడతాయి. దీనినే 'తొంగలి ఱెప్పల వ్రీఁగ నొత్తగా' అన్నాడు మన కవి.

ఈ విధంగా ఊహల వల్ల కలిగిన ఆనందంతో కదలక మెదలక కొయ్యబారినట్టు చూస్తుండడానిని కవి 'పెట్టిన దండ తీయక' అని వర్ణించాడు.

ఆశ్చర్యమూ, ఆనందమూ ఆమె కన్నులలో కనబడుతున్నాయి. కాబట్టి ఉలూచిని ఈ పద్యములో కవి 'విభీత మృగేక్షణ' అని సార్థకముగ పేర్కొన్నాడు.

ఈ మానసిక పరిణామాన్ని మన చేమకూర కవి క్రీ. శ. 1600 ప్రాంతములో వర్ణించాడు. 1900 ప్రాంతంలో ఎచ్, జి. వెల్సు అన్న మహామేధావీ, రచయితా, తన 'లవ్ అండ్ లూయిషామ్' అన్న నవలలో ఈలాటి వర్ణనే చేశాడు: తర్కబలానికి రక్తబలము లభించినప్పుడే కర్తవ్యం నిర్ణయించడం జరుగుతుందని చెప్పాడు. ఆ వర్ణన:

(Youthful blood took up the suggestion.)

The thought of Bonover (the obstacle) arose only to be dismissed and besides —

Yes. he would go out and find her and speak to her. Nothing could stop him.

Once that suggestion was taken, his imagination became riotous with things he might say, attitudes he might strike and a multitude of vague fine dreams about her. He would say this, he would say that; his mind would do nothing but circle round this wonderful pose of lover.

What a cur he had been to hide from her so long! What could he have been thinking about?......

అనువాదము :

"(ఆమెతో మాట్లాడాలన్న సూచనను యౌవన రక్తము అంకించుకుంది.)

ఇంతవరకు అవాంతరంగా కనబడిన బొనొవర్ ఒక్కసారి స్ఫురణకు వచ్చాడు. ఆ స్ఫురణ అర నిముషములో అంతరించిపోయింది. ఇంతేకాదు—

అవును, తాను బయలు దేరాలి, ఆమెను చూడాలి, ఆమెతో మాటలాడాలి, తన్ను ఏదీ అడ్డలేదు.

ఈ నిశ్చయంతో అతని మనసంతా అల్లకల్లోలమయింది. అనదలచిన మాటలూ, చేయదలచినపనులూ మనసులో నిండిపోయాయి స్ఫుటంగా లేనటువంటి స్వప్నవినోదాలు, వేలసంఖ్యను, భావమంతా భర్తీ అయి పోయాయి. ఈలా గంటాను, అలాగుచెప్పుతాను, అని ఊరక అతని మనసు తన అనురాగభావము చుట్టూ వలయాలు చుడుతూ పరిభ్రమిస్తూ ఉంది.

ఇన్నాళ్లు ఆమెతో చెప్పకుండా ఉండడం ఎంత తెలివిమాలిన పని! ఎందుకాలాగు చేశాను? ......"

నిన్నమొన్నటి ఎచ్. జి. వెల్సు మహామేధావికీ, మున్నూటయాభై సంవత్సరాల నాటి చేమకూర కవికీ ఉన్నటువంటి భావసాదృశ్యము గుర్తించడం మనకు గర్వకారణం కాదా!

ఇంత అమోఘమైన భావముతో చేమకూరకవి వ్రాసిన ఈ పద్యమును మన సుప్రసిద్ధ వ్యాఖ్యాతలు - జూలూరువారూ, వేదమువారూ - ఏవిధంగా అర్థముచేసుకున్నారో తెలుసుకోవడం పాఠకులకు శ్రేయస్కరము.

జూలూరువారు ; "గుట్టసియాడ - గుట్టనగా మర్మస్థానము అది ఆసియాడ ననగా లోగా చలించగానున్న, గబ్బి చనుగుబ్బలపై (అది వారి పాఠము) = చలించ నటువంటిన్నీ గుబ్బల వంటిన్నీ చన్నులమీద......" అని వ్రాశారు.

వేదమువారు : "గుట్టు = మర్మస్థానము, అసియాడగ = చలింపఁగా......" అని వ్యాఖ్యానించారు.

ఉలూచి మాయాన్వితయై చేరి చూడగానే, మన వ్యాఖ్యాతలు పెద్ద గంతువేసి "మర్మ స్థానాన్ని" చలించినట్టు చేశారు. ఈ పద్యములో ఉన్న తక్కిన విషయాలను సవిమర్శంగా అవగాహన చేసుకొన్నట్టు కనబడదు; వాటిలో ఉన్న కార్యకారణ సంబంధము వారికి గోచరించినట్టులేదు. అసహజమూ, అపసవ్యమూ, అనదగిన అర్థము చెప్పారనక తప్పదు.

మహాపండితులయిన వారు ఈలాంటి అన్యాయము చేయడానికి కారణము ఏమయి ఉంటుందని ఆలోచిస్తే, మనకు ఒక్క విషయము కనబడుతుంది - వారు గొప్ప లాక్షణికులు

కాబట్టి ఇటువంటి సందర్భాలలో కవులు వర్ణించే [1]సాత్త్వికభావాలను ఎన్నింటికి వీలుంటే అన్నింటిని ప్రకటించడమే వ్యాఖ్యాతల కర్తవ్యమనుకొని ఉంటారు.

పులకాంకురాలు (గగుర్పాటు) ఉంది కాబట్టి 'రోమాంచము' అన్న సాత్త్వికభావమూ, పెట్టిన దండదీయక (కొయ్యబారినట్లు) నిలిచింది కాబట్టి 'స్తంభము' అన్న సాత్త్విక భావమూ పద్యములో కనబడుతున్నాయి కాబట్టి, వాటికి 'కంపము'ను కూడ కలపవచ్చునని ఆ గుట్టును కదిలించారనుకోవాలి.

ఈ విషయములోనే ఇంత అన్యాయ మూహించినవారు ఈ పద్యములోని ఇతర సొగసులను గుర్తించలేక పోయారంటే ఆశ్చర్య మేముంటుంది.

పద్యములోని తెట్టువ కట్టడమూ, తేటలు పెట్టడమూ, తొట్టికొనడమూ అన్నమాటల ఉపయోగంవల్ల వారి కంటికి నీరు కనిపించి ఉండదనే అనాలి.

ఈ పద్యములో చూపించిన చక్కని మానసిక పరిణామాల వర్ణనతోగూడా మన కవి తృప్తిచెందలేదు. మరికొంత చమత్కారాన్ని అందాన్ని దీనితో జతపరిచాడు.

గాలివీచినప్పుడు చెరువులోగాని, గుంటలోగాని ఉన్న నీటిలో కొంత కదలిక కలుగుతుంది. అప్పుడు ఆనీటిమీద తేలుతూఉన్న గడ్డీగాదరా, ఆకూ అలమూ, అంతా పోయిపోయి చెరువులో ఉన్న ఏ కొయ్యచుట్టో, ఏ రాతిచుట్టో—ఏదీ లేకపోతే — గట్టుదగ్గరో తెట్టెకట్టి ఉంటుంది. అప్పుడు దానిలోని నీరు తేటగా కనిపిస్తుంది. ఆ తేటనీటిలో అలలు ఒకదానిని ఒకటి తోసుకుంటూ స్పష్టంగా కనిపిస్తాయి.

నిత్యమూ జరుగుతుండే ఈ విషయాన్ని కవి ఈ పద్యములో చమత్కారముగా ఉపయోగించాడు.

గుట్టుఅంటే చెరువు మధ్యభాగము అన్న అర్థముగూడా ఉంది. దీనియందు గాలివల్ల కలిగిన చలనము అసియాడడము; దానివల్ల గుట్టలవంటి చనుగుబ్బల దగ్గర పులకలు అన్న గడ్డి మొదలైనవి తెట్టెకట్టడము; దీనిఫలితముగా కోరికలు తేటలుపెట్టడము; అప్పుడు తా ననుభవించబోయే వేయివిధాల వినోదాలు అలలులాగా ఒకదాని నొకటి నెట్టుకుంటూ స్పష్టముగా కనబడడము—అన్నీ కవి నిరూపించాడు.

---

1. సాత్త్విక భావాలకు 'కావ్యాలంకార సంగ్రహము :

స్తంభ మచంచలత్వ; మపసత్వ మగుం బ్రళయంబు; దృగ్జలో
జ్జృంభణ మశ్రువౌఁ; జెమట స్వేదము; గద్గదవాక్య వైఖరీ
గుంభము నిస్స్వరత్వము; తగుం బులకంబున రోమహర్షణా
రంభము; కంపమౌ వడఁకు; రామతఁ బాండురుచుల్ వివర్ణతల్.

దీనిని పాఠకుడు గుర్తించవలెనన్న ఉద్దేశముతోనే, ఆశ్చర్యము అని అనడానికి అబ్బురము అనిగాని, విస్మయము అనిగాని అనకుండా "అచ్చెరువు"అన్న పదమును ప్రయోగించాడు. ఆమాటలోనే 'చెరువు' ఉంది. అదే పాఠకుడికి హెచ్చరికగా కవి సొగసుగా ఉపయోగించాడు.

"చెఱువు - అచ్చెరువు" ఈ రెంటికీ దగ్గర సంబంధము ఉంచి చమత్కారము చూపవచ్చునన్న అభిప్రాయము కవికి ఈనాటిదికాదు. సారంగధర చరిత్ర వ్రాసిననాటికే అతడీ సొగసును గుర్తించుకొని ఉన్నాడు.

గుండుమెడ గట్టి భూభుజంగుండు నిండు
చెఱువులోఁ బడఁబోఁగ నచ్చెరువుగాఁగ

—సారంగధర (3-248)

అని వ్రాశాడు. కాబట్టి అచ్చెరువు అని వ్రాసినప్పుడు చెఱువు అన్న భావము కవికి స్పష్టముగా ఉన్నదని నిర్ధారణ చేయవచ్చును.

శ్లేషవల్ల ఈలాటి చమత్కారము కనపరచిన సన్నివేశంలో చెఱువు, అచ్చెరువు అన్న మాటలలోని ఱ—రల విచక్షణ మడికట్టుకొన్న లాక్షణికులు గూడా చేయరు.

ఇటువంటి సన్నివేశాన్నే అల్లసాని పెద్దన మనుచరిత్రములో —

మునుముఁ బుట్టెడు కొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతఁ
జొనుపన్ కోర్కులు ద్రేళ్ళు ద్రిప్ప, మది మెచ్చుల్ ఔప్ప లల్లార్ప, న
త్యనుషంగ స్థితి ఱిచ్చపాటొదవ............

అని వర్ణించాడు. దానికీ దీనికీ ఉన్న వ్యత్యాసము సహృదయులు గుర్తించగలరనే నమ్ముతాను.

మానసిక పరిణామాలను వర్ణించడము మన కవులలో చాల అరుదన్న అపవాదు తొలగించా లన్న ఉద్దేశముతోనే ఈ పద్యాని కింత విపులంగా వ్రాశాను. దీనిని పాఠకమహాశయులు మన్నిస్తారనే ఆశిస్తున్నాను.

*అలంకారము :*

స్వభావోక్తి, శ్లేష, సమాసోక్తి.

ఏణాక్షి నపుడు వెడ సిం
గాణిం గొని యలరుఁ దూపుగమిఁ జక్కెరయే
శాణముగాఁ గలిగిన కం
ఖాణపు దొర పింజపింజ గాఁడఁగ నేసెన్. 127

అర్థము :

చక్కెరయే = పంచదారయే, ఖాణముగాన్ కల = ఆహారముగా కలిగిన (చిలుక), కంఖాణముదొర = వాహనముగాగల రాజు (అనగా, చిలుకరౌతు-మన్మథుడు), అపుడు = ఆలాగు 'పెట్టిన దండతీయక విభీత మృగేక్షణ'గా ఉలూచి చూస్తు ఉండిన సమయమున, వెడ సింగాణిఁ = చెరకు వింటిని, కొని = అందుకొని, అలరు తూపుగమిన్ = పూవు బాణాల సమూహమును, పింజపింజ గాడఁగఁ = ఒకబాణము పిడిని దాని తరువాత వేసిన బాణముపిడి తాకుతూ వెళ్ళినట్లు - త్వరత్వరగా, ఏణాక్షిఁ = ఆ లేడికన్నులుగల ఉలూచిని, ఏసెఁ = గురిచేసికొట్టెను.

తాత్పర్యము :

ఆలాగు కొయ్యబారి చూస్తున్న ఉలూచి నప్పుడు మన్మథుడు, మరికొంత ఉద్రేకము కలిగించడానికి పూవుటమ్ములు - పిడికిపిడి తగుల్తూ పోయేలాగా - గురిచేసి కొట్టాడని భావము.

విశేషము :

ఈ పద్యము లో కవి మన్మథుడిని వర్ణించడములో చక్కని చమత్కారము చూపించాడు. ఈ మన్మథుడికి విల్లా, చెరకు—తీయనిది; బాణములా, అలరుతూపులు—మృదువులూ మధుర పరిమళవంతములూ; వాహనమూ, చక్కెర దాణాగా తిని బ్రతికే చిలుక. వీటివల్ల ఉలూచికి కలిగిన కామోద్దీపనము గూడ తీయని వలపులను పుట్టిస్తుందని ధ్వని.

ఆహారాన్నిపట్టే స్వభావ ముంటుందని ఒక సిద్ధాంతము,

జన్యజనకంబులకు భేద శంకలేదు.
దేహ మన్నజ మిందు సందేహమేది

— శ్రీనాథుడు.

కాబట్టి చిలుకా తీయనిదే అవాలి.

పింజ - (సం. పుంఖ) బాణములో ములికి కాని చివర. పుంఖానుపుంఖము అనగా ఒక బాణానికీ దాని తరువాత వేసిన బాణానికీ మధ్య ఎడము లేకుండా అని భావము.

బాణాలకు పింజదగ్గర పక్షి ఈకలు గూడా ఉస్తారు. అవి త్వరగా పోతూన్నప్పుడు గొరు వంకరొాదలని గూడా కవులు వర్ణిస్తారు. వెండితోనూ బంగారముతోనూ గూడా ఈ పింజలు తయారు చేస్తారని మన పురాణాలు తెలుపుతాయి.

126 వ పద్యములో కవి చూచిన విభీతమృగేక్షణ ఈ పద్యములో గూడ అలేడి చూపుల తోనే కవి ఎదుట కనిపిస్తుంది. కాబట్టే 'ఏణాక్షిని' అని కవి ఇక్కడ అనడము చూడదగినది.

పాఠాంతరాలు :

చక్కెరయే
బోణముగాఁ గలిగిన కం
ఖాణముదొర.......

— తిరపతివారు.

ఇక్కడ బోణము అంటే బోనము ఆహారము.

పైపయిఁ గౌతుకంబు దయివాఱి యిటుండఁగ, నంత మజ్జనం
బై, పువుఁ జప్పరమ్మున నొయారముగాఁ గయిసేసి, దాన లీ
లా పరతంత్రుఁడై కలకలన్ నగుచుండెడి సవ్యసాచి నిం
ద్రోపల రోచిఁ జూచి తలయూఁచి, యులూచి రసోచితంబుగన్, 128

అర్థము :

కౌతుకంబు = ఉత్సాహము, పైపయిన్ = మిక్కిలి విశేషముగా, దయివాఱి = పొంగి పొర్లుతూ, యిటుండఁగన్ = ఉలూచి ఈరీతి (మాయాన్వితయై) నిలిచి ఉండగా, అంతన్ = అప్పుడు, మజ్జనంబై = (అర్జునుడు) స్నానముచేసి, ఒయారముగాన్ = సొగసుగా, కయిసేసి = అలంకరించుకొని, పువు చప్పరమ్మునన్ = పూవుల మంటపమునందు, దానలీలా పరతంత్రుడుఐ = దానముచేయడంవున్న ఇష్టకార్యమందు ఆసక్తికలవాడై, కలకలన్ నగుచుండెడి = ముఖము కళకళలాడుతూ (మిక్కిలి ఆనందముతో) ప్రకాశిస్తూ వున్న - అనగా చాల శోభాయమానముగా ఉన్న, ఇంద్ర ఉపల రోచిన్ = ఇంద్రనీలమణుల కాంతివంటి కాంతి కల వాడైన, సవ్యసాచిన్ = అర్జునుని, చూచి, ఉలూచి, రస ఉచితంబుగన్ = శృంగార రసానికి తగినట్లు, తల ఊఁచి, తరువాతిపద్యముతో అన్వయము.

తాత్పర్యము :

అక్కడ అర్జునుడు గంగా స్నానము చేసి, అలంకరించుకొని, పూల మంటపములో దానాలు చేస్తూ ఎంతో ఆనందంతో ఉండగా, అతడిని చూచి ఉలూచి మెచ్చుతూ — తరువాతి పద్యముతో అన్వయము.

విశేషము :

ఈ పద్యములో 'కలకల న్నగుచుండెడి సవ్యసాచి అంటే కలకలమని నవ్వుతూ ఉన్న అర్జునుడిని' అని వ్యాఖ్యాతలు అన్నారు. కాని దానాలు ఎంతో ఆసక్తితో చేస్తూ ఉన్నప్పుడు ఈ నవ్వు ఎందుకు ? సమంజసముకాదు.

ఇక్కడ కలకలలాడుతూ ఉన్న - సంతోషముతో ప్రకాశిస్తూ ఉన్న ముఖముతో అని అర్థం చెప్పడము న్యాయము.

సవ్యసాచి — రెండు చేతులతోనూ బాణాలు ప్రయోగించగలవాడు - కవ్వడి.

ఉలూచి తన తలను రసోచితముగా ఊచిందంటాడు కవి. తన్ను ఆవరించి ఉన్నది శృంగారరసము. దానికి తగినట్టుగా - మెప్పును సూచిస్తూ - తల ఉచిందని భావించాలి.

పద్యం చివరను సవ్యసాచి అన్న దగ్గరనుంచి 'చి' అన్న అక్షరము అయిదుసార్లు తల ఊపించ గలుగుతుంది. అలా తల లూపించడానికే ఇన్ని 'చి' లు; అంతేగాని కేవలం అనుప్రాస మీది అభిలాష కాదు.

అర్జునుడు స్నానముచేసి, అలంకరించుకొని దానాలు చేస్తూ ఉన్నాడంటే, సమయము ఉదయమని మనము గ్రహించాలి. ఉలూచి అర్జునుడిని మొదట చూచినది 'తమిన్' - వేకువ జామున. దీని తరువాత దానాలూ మొదలయిన పనులు. ఇంతకాలమూ ఉలూచి వాళ్లకు కనబడకుండా దగ్గరనుంచే చూస్తూ ఊహించుకుంటూ ఉందన్నమాట.

అలంకారము :

వృత్త్యనుప్రాస.

సిగ సంపెఁగపూ లొనపరి
వగ, కస్తురి నామ మొఱపు, వలెవా టౌరా !
'సొగ సిటు లుండఁగ వలె'నని
సొగసి లతాతన్వి వాని సొగను నుతించెన్. 129

ఈ పద్యము మొదలుకొని 8 పద్యాలలో అర్జునుడి అందచందాలను మెచ్చుకుంటూ ఉలూచి తనలో తా ననుకున్న విశేషాలు కవి ప్రకటిస్తున్నాడు.

అర్థము :

సిగన్ = జుట్టుముడిలోని, సంపెఁగపూల = సంపంగిపువ్వుల, ఒనపరి వగ = అందమైన తీరు—సిగలో పూవులు తురిమిన సొగసున్ను, కస్తురి నామము (యొక్క), ఒఱపు = చక్కదనమున్ను, వలెవాటు ఔరా! = ఉత్తరీయము వల్లెవాటుగా వేసుకున్న అద్భుతమైన అందమున్ను. ఓహో ! సొగసు ఇటులుండఁగ వలెన్ అని = సొగసంటే ఈలాగుండవద్దా అని, సొగసి = పరవశురాలై, లతాతన్వి = లతలాగా సన్ననైన ఉలూచి, అతని సొగసు, నుతించెన్ = మెచ్చుకొనెను.

తాత్పర్యము :

అర్జునుడు సిగలో సంపెంగ పువ్వులు చెరివినతీరూ, కస్తూరి నామము తీర్చిన అందమూ, వల్లెవాటు వేసుకున్న సొగసూ చూచి ఉలూచి, "సొగసంటే ఈలాగుండాలని" అతడి సొగసు తనలోతాను మెచ్చుకుంటూ ఉందని భావము.

విశేషము :

128 వ పద్యములో అర్జునుడు స్నానముచేసి, అలంకరించుకొని పూలమంటపంలో దానాలిస్తున్నట్టు కవి వర్ణించాడు. ఈ పద్యములో ఆ అలంకరణ ఏలాంటిదో ఉలూచి ఊహల రూపంగా కవి ప్రకటిస్తున్నాడు.

అర్జునుడు గుడాకేశుడు; అతడిసిగ నిండుగానూ నల్లగానూ ఉండడాన్ని చూస్తూ ఉండినా ఉలూచిని ఆకర్షించినది సంపెంగ పూలు చెక్కిన అందమే. అలాగే విశాలమైన నుదురుచూస్తూ ఉన్నప్పుడు, దానిమీద సన్నగా తీర్చిన కస్తూరి తిలకమే తన్నాకర్షించింది. కండలుతిరిగి చక్కి కట్టిన వక్షము చూచినప్పుడు, దానిపైని వేసిన వల్లెవాటు హొయలు చూచింది. సొగసంటే ఈలాగుండాలని మెచ్చుకుంది.

అర్జునుడి శరీర సౌష్ఠవమూ కళాలాలిత్యమూ రెండూ ఉలూచిని ఆకర్షించాయని భావించాలి. సంపంగి పూలకు 'ఒసపరివగ' అనిన్నీ, కస్తురినామానికి 'ఒఱపు'అనీ ప్రశంసా పదాలు ఉపయోగించి, వలెవాటుకి ఏమీవిశేషం చెప్పలే దనుకోకూడదు. 'ఔరా' అని చెప్పడంవల్ల ఆ వలెవాటు ఎంత చెప్పనలవికాని అందముతో ఉందో తెలియజేస్తూ కవి తనప్రక్రమనియమాన్ని మరచిపోలేదు.

కవికి ఉన్న లలితకళా దృష్టి ఈ పద్యములో స్ఫుటంగా కనబడుతుంది. ఈలాంటి లాలిత్యమే ఈ కావ్యములో ముందు ముందు రాబోయే 'మీసాలలో నవ్వులు', 'దరహాసము మీసముదీర్ప' మొదలైన ప్రయోగాలలో కనబడుతుంది.

అలంకారము :

యమకము, అనుప్రాసము.

రాకొమరు నెఱులు నీలపు
రాకొమరు నిరాకరించు రాకాచంద్రుఁ
రాకొట్టు మొగము, కెంజిగు
రాకుఁ గని పరాకుసేయు నౌర! పదంబుల్. 130

ఇంకా ఉలూచి ఈలాగు మెచ్చుకుంటూ ఉంది.

అర్థము :

ఔర ! = ఓహో !, రాకొమరు = రాజకుమారుడైన అర్జునుడి, నెఱులు = తలవెంట్రుకలు, నీలము రా = ఇంద్రనీల మణుల యొక్క, కొమరున్ = నవకమును—చక్కదనమును, నిరాకరించున్ = తిరస్కరించును. మొగము = ముఖము, రాకా చంద్రుణ = పున్నమనాటి చంద్రుడిని, రాకొట్టుణ = నీచముగ చూచును (రారా, పోరా అన్నట్టు), పదంబుల్ = పాదములు, కెంజిగురాకుణ - కెంపు చిగురు ఆకున్ = ఎఱ్ఱని చిగురుటాకును, కని = చూచి, పరాకు చేయున్ = నిర్లక్ష్యముగా ఉండును.

తాత్పర్యము :

ఆతని తలవెంట్రుకలు, ముఖము, పాదాలూ క్రమంగా ఇంద్రనీల మణులను, పున్నమ చంద్రుడిని, ఎఱ్ఱని చిగురుటాకును మించిన అందముతో ఉన్నవని భావము.

విశేషము :

జుట్టులో నీలత్వమూ, ముఖములో పూర్ణత్వమూ, పాదాలలో అరుణత్వమూ మంచి సాముద్రిక లక్షణాలని అంటారు.

నీలపు రా కొమరు నిరాకరించడము, రాకాచంద్రుడిని రాకొట్టడము, కెంజిగురాకును పరాకుచేయడము తిరస్కార సూచకాలు.

అలంకారము :

యమకము, అనుప్రాస, వ్యతిరేకము.

తీరిచినట్టు లున్నవిగదే కనుబొమ్మలు; కన్ను లంటిమా
చేరలఁ గొల్వఁగా వలయుఁ; జేతుల యందము చెప్ప గిప్ప రా;
దూరులు మల్చివేసినటు లున్నవి; బాపురె ! ఱొమ్ములోని సిం
గారము ! శేషుఁడే పొగడఁగావలె నీతని రూపరేఖలన్. 131

అర్థము :

కనుబొమ్మలు, తీరిచినట్టులు = చిత్రకారుడు దిద్ది పెట్టినట్లు, ఉన్నవికదే, కన్నులు అంటిమా = ఇంక కన్నుల విషయమా, చేరలన్ = చేరలతో, కొల్వఁగా వలయున్ = కొలత చేయవలయును (అనగా చేరెడేసి కన్నులు కలవాడని భావము), చేతుల యందము, చెప్పగిప్ప రాదు = చెప్పడానికి వశమేకాదు, ఊరులు = తొడలు, మల్చివేసినటులు = శిల్పి శిలావిగ్రహాలలో సానపట్టి చేసిన విధంగా, ఉన్నవి, ఱొమ్ములోని సింగారము = వక్షస్థలములోని అందము,

బాపురే! = అత్యధికము. ఈతని, రూపరేఖలన్ = ఆకారసౌందర్యాలను. శేషుఁడే = (రెండువేల నాల్కలున్న) ఆదిశేషుడే. పొగడఁగావలె = వర్ణించవలెను (ఇతరులకది అసాధ్య మన్నమాట).

తాత్పర్యము :

చిత్రకారుడు తీర్చిదిద్దిన లాగున్న కనుబొమ్మలూ, చేరెడేసి కళ్ళూ, చెప్పనలవికాని అందముగల చేతులూ, శిల్పిచెక్కి సానపట్టినట్లున్న తొడలూ, అద్భుతమయిన బొమ్మలోని సింగారమూ - వీటినన్నిటినీ వర్ణించాలంటే ఏ వెయ్యితలల ఆదిశేషుడో కావాలి గాని, సాధారణులు పనికిరారని భావము. ఆదిశేషుడు గొప్ప భాషావేత్త గూడా.

*విశేషము* :

చెప్పగిప్పరాదు : చెప్పడానికీ గిప్పడానికీ (అలాంటి ప్రయత్నం చెయ్యడానికి) వశము కాదన్నమాట. 'రాముడూ గీముడు నాతో సరిరాగలడా' అన్నట్టు, నీచార్థంలో గిగీలు ఉపయోగిస్తారు.

మల్చివేసినటు అని చెప్పడంవల్ల రాతి శిల్పములో లాగా కండలు తిరిగి, నిగనిగ మెరుస్తూ దృఢత్వాన్ని తొడలు ప్రకటిస్తున్నా యన్నమాట.

చిత్రకారుడు తీర్చి దిద్దినట్టు కనుబొమ్మలున్నాయి; శిల్పి మల్చినట్టు తొడలున్నాయి.

బొమ్మలోని సింగారము బాపురే అన్న ఆశ్చర్యార్థకంతో విడిచిపెట్టడంవల్ల ఆసింగారము గూడా వర్ణనకు అతీతమని సూచిస్తున్నాడు కవి.

దీనినే కవి తరువాత ఒక పద్యములో 'సాము కండెపు పిసాలి యురంబున......' అని నోరారా చెప్పాడు.

రూపు : అలంకారాలు ఏమీలేకుండా కేవలము శరీర అవయవాల సౌందర్యాన్ని రూప మంటారు. రేఖ = అవయవాల అమరిక, సౌష్ఠవము.

అకటా! నన్నితఁ డేలిన,
నొకటా? నచ్చికము లేక యుండఁగ వచ్చున్;
నిక టామృత ధారలు మరు
ని కటారి మెఱుంగు లీతని కటాక్షంబుల్. 132

పై పద్యములోని రూపురేఖలు చూచిన ఉలూచికి కోర్కెలు కొనలు సాగాయి. కాని, పర్యవసాన మేలాగుంటుందో అన్న సందేహము లేకపోలేదు.

అర్థము :

అకటా ! = అహా ! నన్ను ఇతడు ఏలినన్ = నన్నితఁ డంగీకరించినఎడల, ఒకటా? = ఒక ఆనందమా ? ఎన్నో లభించునుగదా. నచ్చికము లేక = ఏకొరతా లేకుండా. ఉండఁగఁ వచ్చుఁ = జీవించవచ్చును. ఈతని కటాక్షంబుల్ = ఇతని కడకంటి చూపులు, నికట... ధారలు___నికట = సమీపమందున్న, అమృతధారలు = అమృతపు సోనలు (సంతతయౌవ నానందాన్ని కలిగిస్తాయి), (అంతేకాదు), మరుని = మన్మథుని, కటారి = కత్తియొక్క, మెఱుంగులు = తళతళలు గూడ అవుతాయి (అనగా భయకారణా లవుతాయని భావము).

తాత్పర్యము :

ఈతడు నన్ను అంగీకరిస్తే కొరత లేకుండా ఎన్నో ఆనందాలు అనుభవించవచ్చునుగదా! ఈతని కడకంటి చూపులు అనుకూలంగా ఉంటే అమృత ధారలే అవుతాయి. లేదా, మన్మథుడి కత్తి తళతళలలాగా భయకారణా లవుతాయి.

విశేషము :

అకటా అని పద్యమారంభించాడు కవి. ఇది విచార సూచకమని అనుకో నక్కరలేదు. మనుచరిత్రలో ___

ఎక్కడివాఁడొ యక్షతన యేందు జయంత వసంత కంతులఁ
జక్కదనంబునఁ గెలువఁ జాలెడివాఁడు, మహీసురాన్వయం
బెక్కడ ? యీ తనూ విభవ మెక్కడ ? పోఁ ద్రవని బంటుగా మరుం
డక్కఁగొనంగ రాదె యకటా ! నను వీఁడు పరిగ్రహించినన్.

— (2-36)

దీనిలో కేవల విచార సూచనగా అర్థము చెప్పలేము గదా !

అందుకే ఇక్కడ అకటా = అహా ! అని అర్థం చెప్పుకున్నాము. అది రెండు విధాల ఆలోచనలకూ సరిపోతుంది.

ఒక వైపున నచ్చికము లేని ఆనంద జీవితము నూహించుకుంటూ ఉండినా ఉలూచి మనసులో కొంచెము సందేహము గూడ ఉంది. అంగీకరిస్తే అందుబాటులో ఉన్న అమృతధార - సంతతము యౌవన ఆనందము నిచ్చేది; లేదా, ఝళిపిస్తున్న మన్మథుని కత్తి - ప్రాణాలు తీసేది.

ఒకటా : ఒకటియా అని కవి కలవాటయిన ఇకారసంధితో అర్థము చెప్పుతున్నాము. కొందరు 'ఒకటన్ నచ్చికములేని' ఒక్క విషయంలో గూడా కొరతలేని అని అర్థము చెప్పారు.

పద్యములోని ద్విప్రాసము, మూడు 'నికటా'లు, అయిదు కటాలూ చూడదగును.

అలంకారము :

యమకము, రూపకము.

ఆ దరహాస చంద్రికల యందము, నాప్తులఁమీదఁజిల్కు న
త్యాదర శీత లేక్షణ సుధారస ధారయుఁ, జూడఁజూడ నా
హ్లాదము గొల్పఁగాఁగల కలామహిమంబుఁ, దలంచి చూచినన్
మాదిరి సేయవచ్చు జననాథు మొగంబును జంద్రబింబమున్. 133

ఇంతలో అక్కడ అర్జునుడు దానాలుచేస్తూ తనపరివారములోని వారితో ఉండిన సౌమ్యవిధము చూచి మెచ్చుకుంటుంది.

అర్థము :

ఆ దరహాసచంద్రికల = ఆ చిరునవ్వు అనే వెన్నెలలయొక్క, అందము (ను), అప్తుల మీఁదన్ = తనవారిమీద, చిల్కు = చిలుకుతున్న, అత్యాదర...ధారయున్—అతి ఆదర = మిక్కిలి ఆదరముతో కూడిన, శీతల = చల్లనైన, ఈక్షణ = చూపులు అనే, సుధారస = అమృతరసము యొక్క, ధారయున్ = ప్రవాహమును, చూడన్ చూడన్ = చూచినకొద్దీ, ఆహ్లాదము కొల్పఁగాన్ కల = సంతోషమును కలిగించజాలిన, కలామహిమంబు = కళల యొక్క అతిశయమును, తలంచిచూచినన్ = (పైమూడు గుణములను) ఆలోచించి చూచిన ఎడల, జననాథు మొగంబును = రాజు(అర్జునుడి) ముఖమును, చంద్రబింబము (ను), మాదిరి సేయవచ్చున్ = సాటిచేయవచ్చును - పోల్చవచ్చును.

తాత్పర్యము :

వెన్నెలవంటి చిరునవ్వూ, అమృతధారవంటి చల్లనిచూపులూ, ఎంతచూచినా ఆనందాన్ని కలిగించే కళల ఆధిక్యమూ ఉండడం చేత అర్జునుడి ముఖమును చంద్రబింబముతో సరిపోల్చ వచ్చునని భావము.

విశేషము :

చంద్రుడికి మూడు ప్రసిద్ధ గుణాలున్నాయి : 1. వెన్నెల, 2. అమృతము, 3. ఎంతచూచినా తనివితీరని 'ఆసేచనకము'అన్న గుణము. అర్జునుడి చిరునవ్వు వెన్నెలగాస్తూఉంది; ఆదరముతోడి చల్లనిచూపులు అమృతమును చిలుకుతున్నాయి; అతని కళ - లావణ్యము - ఎంతచూచినా ఇంకా చూడాలనే విధంగా ఉంది. ఈ మూడు సామ్యాలనుపట్టి రాజు ముఖాన్నీ చంద్రబింబాన్నీ మాదిరి చేయవచ్చునని కవి సకారణంగా నిరూపించాడు.

కలామహిమ ; చంద్రుడిలో పదహారు కళలుంటాయి; అర్జునుడిలో కళా - లావణ్య - మహిమఉంది. అతనిది మంచి కళగల ముఖము అంటాముకదా.

సాధారణంగా స్త్రీ ముఖాన్నే చంద్రుడితో పోలుస్తారు. కొందరు పురుషుల ముఖాన్ని గూడా అలా పోల్చడం లేక పోలేదు. ఆంధ్రకవితాపితామహుడు —

... ఇందు బింబముఁగా కిమ్మననీదు మోము

అని, వరూధినిచేత ప్రవరాఖ్యుడిని వర్ణింపించాడు.

*పాఠాంతరము :*

ఆహ్లాదము గుల్కగాఁగల......

—వావిళ్ళవారు.

*అలంకారము :*

రూపకము, ఉపమ.

ఊఁదుకపోవు శంఖము నహో! గళరేఖ; శరాసనంబులన్
వాదుకుఁ బట్టుఁ గన్బొమల వైఖరి; వంతలు తీరుచున్ గటా
క్షోదయలీల సాయక సమూహములఁగా; విషమాస్త్రు గెల్చుఁబో;
యే దొర సాటి యీనరున కెన్నఁగ వీరవిలాస సంపదన్. 134

అందమైనకల్పనతో అపారమైన శ్రద్ధతో వ్రాసిన ఈపద్యము ఎంత చక్కనిదో అంత చిక్కలది గూడా అయింది. కాబట్టి ఇది పాఠకులకు శ్రద్ధా పాత్రమని మనవి.

ఈ పద్యాన్ని పరిష్కర్తలూ, వ్యాఖ్యాతలూ అందరూ, నాటినుండి నేటిదాకా, ఈ క్రింది విధంగా పఠించి చాల తికమకల పాలయారు ; అస్తవ్యస్తమయిన వ్యాఖ్యానాలు చేశారు :

ఊఁదుకపోవు శంఖము నహో; గళరేఖ, శరాసనంబులన్
వాదుకుఁ బట్టి కన్బొమల వైఖరి వంతలు తీరుచున్, గటా
క్షోదయలీల సాయక సమూహములన్ విషమాస్త్రు గెల్చుఁబో,
యే దొరసాటి ఈ నరున కెన్నఁగ వీరవిలాస సంపదన్[1]

వేదమువారితో పాటు వారందరూ చేసిన వ్యాఖ్యానము దాదాపు ఈ రీతిగాఉంది: "కంఠము యొక్క సౌందర్యము (మన్మథుని) శంఖమును తిరస్కరించును; ఊఁదివేయును; భ్రూ

1. దీనిలోని కామాలూ, వారి వ్యాఖ్యానములోని సెమికోలనులూ, వేదము వారుంచినవి.

విలాసము (మన్మథుని) సింగిణి విండ్లను వివాదమునకు తలపెట్టి వంపులు దిద్దును (కుంటు వోఁగొట్టును); కడగంటి చూపులు పొడము విధము బాణముల మొత్తములతో మన్మథుని (క్రూరములగు బాణములు గలవాని నని యు భావము) గెల్చు(బో'' అని.

అనగా, "కంఠము (మన్మథుడి) శంఖము నూదివేయును, కన్బొమలు (మన్మథుడి) విండ్లను వంపులుదిద్దును, కడగంటిచూపులు బాణసమూహములతో విషమాస్త్రుని (మన్మథుడిని) గెల్చును" అనికదా భావము ?

విండ్లను వంపులు దిద్దును (కుంటు వోఁగొట్టును) అని వేదమువారు తొలగించాలన్న 'కుంటు' అసలు వారి వ్యాఖ్యానానికే సంక్రమించింది.

దీనిలో మూడో తిరస్కారము కటాక్షోదయలీల చేస్తుంది. దీనికి బాణముల మొత్తము లతో మన్మథుని గెల్చు(బో అని వ్యాఖ్యాతలు అర్థం చెప్పారు.

ఈ అర్థములోని 'బాణముల మొత్తములు' ఎవరివి? (1) వీటిని ఉపయోగించి కటాక్షములు మన్మథుడిని గెలుస్తాయా? లేక (2) కటాక్షాలు 'బాణాల మొత్తాలతో ఉన్న మన్మథుడిని గెలుస్తాయా! ఏలాగు చెప్పినా హాస్యాస్పదంగానే ఉంటుంది.

'ఈ పద్యములోని తిరస్కార పదములకు తత్తదుపమాన నైసర్గిక వృత్తము ధ్వనిత మగుట రమణీయముగా నున్నది' అని వేదమువారు చెప్పిన మాటలు అందరూ అంగీకరించ వలసినవే కదా!

ఇక్కడ కటాక్షాలకు విషమాస్త్రుడు ఉపమానమని అనవలసివస్తుంది.

అలాగుచేసినా చిక్కువిడదు. తిరస్కారపదము 'గెల్చు' అవుతుంది. ఈ తిరస్కార పదము ఉపమానానికి (విషమాస్త్రుడికి) నైసర్గిక వృత్తముకావాలి—శంఖానికి ఊదబడడం లాగా. ఈ సూత్రాన్నిపట్టి చూస్తే మన్మథుడికి గెల్వబడడమే నైసర్గిక వృత్తమవుతుంది. ఎవ్వరూ దానినంగీకరించలేరు. కాబట్టి ఈ తిరస్కారాలను మరొకసారి పరిశీలించాలి.

కంఠము శంఖాన్ని ఊదేస్తుందన్న మొదటి తిరస్కారాన్ని అందరూ అంగీకరిస్తారు.

రెండో తిరస్కారము విండ్లకు, వంకలు తీర్చడం వీటికే అయితే, 'వాదుకు(బట్టి'అన్న మాటలు అనవసరమే కాక, కవి ప్రక్రమాభిలాషకు వ్యతిరేకము. మన సాహిత్యములో ఎన్నో గ్రంథాలలో యుద్ధవర్ణనలున్నాయి. వాటిలో దేనిలో గూడా వీరుడు తనవింటిని వంకలుతీరుస్తున్నాడని కనబడదు. యుద్ధానికి సిద్ధమవుతున్నప్పుడు వీరుడు విల్లుపట్టుకుంటాడు, నారి బిగిస్తాడు, ధనుష్టంకారము చేస్తాడు కాని, వంకలు తీర్చుకుంటూ ఉండడు.

అంతే కాక, విండ్లకు వంక ఉండాలి. కాబట్టి వంకలు దీర్చుట నిరర్థకము గూడ.

నిజంగా వంకలు తీర్చవలసినవి బాణాలు. వంక తీర్చకపోతే. అవి సూటిగా లక్ష్యానికి పోజాలక, ఆ వంకను అనుసరించి 'బూమిరాంగ్' అన్న ఆయుధములాగా వంకరగాపోయి, చుట్టు తిరిగి ప్రయోగించిన వాడి దగ్గరకే వస్తుంది.

బాణాలకు వంక తీర్చడము చాల ముఖ్యము. ఈ వంకతీర్చడం విండ్లకు కాదు. ఈ అభిప్రాయాన్నే మన కవి —

పంకేజాతములన్ దినంతు లడచున్ బాలామణీ పాదముల్,
వంకల్ దీర్చు మనోజ సాయకములన్ వాల్చూపులు.........

అని, సాయకాలకు (బాణాలకు) వంకలు తీర్చాడు.

క్రీడాభిరామ గ్రంథములో శ్రీనాథ మహాకవి వ్రాసినది దీనికి తోడు :

తియ్యని వింటి జోదు రతిదేవి చనుంగవ నొత్తగిల్లి యొ
య్యొయ్యన వంక చక్కఁబడ నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్.

ఈ విమర్శనముపట్టి పరిష్కర్తలూ వ్యాఖ్యాతలూ చూపిన వాక్య విభజన సరికాదని రూఢి అవుతుంది. వంకలు తీర్చడము విండ్లకు కాదనీ, బాణాల సమూహానికే అనీ తేటపడుతుంది. అప్పుడు 'వాదుకు పట్టడమే' విండ్లకు తిరస్కారమవుతుంది. కాబట్టే అది 'పట్టి' కాదు, 'పట్టు' అని పఠించాము.

ఇంక మనపాఠం అర్థవిశేషాలను చూచుకుందాము.

అర్థము :

అహో! = బాపురే!, గళరేఖ = (అర్జునుని) కంఠము యొక్క సౌందర్యము, శంఖమున్, ఊదుకపోవుఁ = పూరించుకొనిపోవును—పూ అని ఊదివేయును (తిరస్కరించును); కన్‌బొమల వైఖరి = కనుబొమ్మల సొగసు, శరాసనంబులఁ = విండ్లను, వాదుకు పట్టుఁ = పోరాడుటకు పట్టును—రచ్చకీడ్చును (నిరాకరించును); కటాక్ష ఉదయలీల = కడకంటిచూపులు పొడమే సొగసు, సాయకసమూహములఁ = బాణాల సమూహములను, వంకలు తీరుచుఁ = వంపులు దిద్దును—తిన్నగా చేయును (తిరస్కరించును); విషమ అస్త్రుఁ = ఎటువంటి క్రూరమైన బాణాలు కలిగిన వాడినైనా (మన్మథుని), గెల్చుఁ పో = గెలువ గలదు సుమా; వీర విలాస సంపదఁ = వీరుల విలాసముల భాగ్యమునందు—వీరత్వముతో కూడిన విలాస సంపదయందు, ఈ నరునకుఁ = ఈ అర్జునుడికి—ఈ నరలోక వాసికి, ఎన్నఁగఁ = సరిపోల్చిచూడగా, ఏ దొరసాటి? = ఏ రాజు సమానము కాగలడు ? (వీరవిలాస సంపదలో ఎవ్వరూ ఈడు కారని భావము.)

తాత్పర్యము :

అర్జునుడి కంఠము శంఖాన్నీ, కనుబొమలు విండ్లనూ, చూపులు బాణాలనూ అందములో తిరస్కరిస్తాయి. మన్మథుడినైనా గెల్వగలవాడు, విలాసములో ఈ నరుడికి సాటియయిన వాడెవడూ లేడని భావము.

శంఖ మూదుకుంటూ విల్లు పట్టుకొని బాణాలను తిన్నగాచేస్తూ యుద్ధసంరంభంలో ఉన్న ఈ నరుడు ఎంత క్రూరమైన బాణాలు కలవాడినైనా జయించగలడు; వీరసంపదలో ఇతనికి సాటియయిన రాజెవడు? అనిగూడా భావము.

విశేషము :

సాధారణంగా కవులు మెడను శంఖంతోనూ, బొమలను విండ్లతోనూ, చూపులను బాణాలతోనూ పరిపోలుస్తారు. ఇక్కడ వాటిని మనకవి తిరస్కరించాడు.

వి సమ అస్త్రుడు = సమసంఖ్య కానటువంటి—బేసిసంఖ్యగల బాణాలుగలవాడు— పంచబాణుడు = మన్మథుడు. విషమ = మిక్కిలి కఠినమైన — క్రూరమైనబాణాలు కల వాడని గూడ.

ఈ పద్యములో కవి వీరత్వానికే ప్రాధాన్యమిచ్చినా, విలాసం మీద దృష్టిని మరచిపోలేదు. గళానికి రేఖ—అందము అనీ, కనుబొమలకు వైఖరి—సొగసు అనీ, కటాక్షాలకు లీల—విలాసము అనీ, విలాస సూచకాలయిన పదాలను జోడించాడు.

ఉలూచి పాతాళలోకంలోనిది కాబట్టి 'ఈ నరునకు' (ఈ మర్త్యునికి) అని అర్జునుడిని పేర్కొనడము చమత్కారము. నరుడు అంటే అర్జునుడు అని గూడ అర్థముంది. 'అందందు నరుగ నరు గానరుగా' అని సుభద్ర యతివేషధారిని అడుగుతుంది. నరనారాయణులలోని నరుడు అర్జునుడే అని పురాణప్రసిద్ధి.

ఈ పద్యములో తిరస్కరించిన శంఖము, విండ్లు, బాణాలు మన్మథుడివని అర్థం చెప్పి, జూలూరువారూ, వేదమువారూ వాటి సౌందర్యాన్ని పెంచాలని చూచారు. కాని అది సమంజసముగా కనబడదు. ఎందుచేతనంటే—పద్యములో అర్జునుడు 'విషమాస్త్రు గెల్చుఁబో' అని భవిష్యత్తులో గెలుస్తాడని స్పష్టంగా చెప్పుతున్నాడు కవి. ఆ విషమాస్త్రుడి శంఖాన్నీ, వింటినీ అర్జును డేలాగు ఉపయోగించగలుగుతాడు? అవి అర్జునుడి వశములో ఉంటే, గెల్చుబో అని చెప్పక, గెల్చెబో అని భూతకాలములోనే వ్రాసేవాడు. కాబట్టి మన మా సౌందర్యాతిశయాన్ని ఆశించకూడదు.

యుద్ధసన్నాహములో వీరుడు 1. శంఖాన్ని ఊదుతాడు, 2. విల్లు పట్టుకుంటాడు, 3. బాణాలను వంకలు తీర్చి తిన్నగా చేస్తాడు. తరవాత శత్రువుని ఎదిరిస్తాడు.

ఈ వరుసతో మనము చేసిన వాక్యవిభజన :

1. గళరేఖ శంఖమును ఊదుకవోవును.

2. కన్బొమల వైఖరి శరాసనంబులను వాదుకుపట్టును[1]..

3. కటాక్షోదయ లీల సాయకసమూహములను వంకలు తీరుచున్.

సన్నాహముతో ఈ నరుడు విషమాస్త్రుని గెల్చును.

దీనితో అపుష్టార్థము అంతరించింది ; ప్రక్రమ భంగము పటాపంచలయింది ; అన్వయ కాఠిన్యము తొలగిపోయింది ; కవి సంప్రదాయాలకు భంగము అదృశ్యమయింది; అర్జునుడి యందే ప్రాధాన్యము నిలిచింది. (కటాక్షములే విషమాస్త్రుని గెల్చునన్నప్పుడు ఆ ప్రాధాన్యము లేదు కదా?)

ఇంక నాలుగో చరణాన్ని చూదాము : 'ఏ దొరసాటి ఈ నరున కెన్నగ వీరవిలాస సంపదన్.' దీనిలో నర శబ్ద ప్రయోగములో ఉన్న హాయిని మళ్లా చెప్పనక్కరలేదు.

వీర విలాస సంపదన్ —— దీనికి వేదమువారు 'వీరుల విలాసముల యొక్క భాగ్యము నందు' అన్నారు ; నోరివారు 'వీర్య (అదివారి పాఠము) విలాసముల యొక్క సంపదచేతను' అన్నారు ; జూలూరువారు 'పరాక్రమ సమృద్ధిచేతను' అన్నారు.

కవి హృదయము ఇంకా లోతు. దీనిలో వీరకార్యాలు చేస్తూ ఉన్నవి - గళము, కన్బొమలు, కటాక్షములు. ఈ మూడింటికి కవి రేఖ, వైఖరి, లీల అని క్రమంగా మూడు మాటలు జోడించాడు. ఈ మూడూ విలాసము అన్న అర్థాన్ని ఇచ్చేవే. కాబట్టి వీరసంపదా, విలాససంపదా రెండూకలిసి ఉన్నాయని అనాలి. వీరము - ధీరము శౌర్యము అని నిఘంటువులు.

దీనిలో ఊదుకవోవు, వాదుకుపట్టు, వంకలుతీరుచు అను తిరస్కారపదములు తిరస్కృతములైన శంఖమునకు, వింటికి, బాణములకు సహజముగా జరిగే పనులే! వేదమువా రనినట్లు మిక్కిలి రమణీయముగా అర్థగౌరవముతో ఉన్నవి.

వాదుకు ఉకారాంత షష్ఠికి నుగాగమము (వాదునకు) రాలేదని ఒక కొరత చూపుతారు. చూడండి - శృంగార నైషధములో "నిషధేంద్రు బిచ్చుకుణా" అని శ్రీనాథుడున్నా, ప్రభావతీ

1. నేను చూచిన ముద్రిత, అముద్రిత ప్రతులన్నిటిలోనూ 'వాదుకుబట్టి' అనే ఉంది. ఒక్క దానిలో మాత్రము 'ట్టు' కి చేరువగా ఉన్నట్టు ఆ అక్షరము కనిపించింది —— సంతోషించాను. కాని ఆ ప్రతి తప్పులతడిక. లేఖకుడు చాల అసమర్థుడు. కాబట్టి దానిని విసర్జించాను. అన్వయ సౌలభ్యము కోసమూ, ప్రక్రమాభిలాష పాటించడం కోసమూ, అది 'వాదుకు బట్టి' కాదనీ, 'వాదుకు బట్టు' అనీ నిర్ధారణ చేయడానికి సాహసించాను. సహృదయులు అంగీకరిస్తారని నమ్ముతున్నాను.

ప్రద్యుమ్నములో రాచిలుకను "వాదుకుఁ గవితచెప్పఁగ దా నియమించి" అని పింగళి సూరన్న గారున్నూ ఈలాగే ప్రయోగించారు.

అలంకారము :

కావ్యలింగ, కావ్యార్థాపత్తి, శ్లేష, వ్యతిరేకము.

కమ్మని జాళువా నొరయఁ గల్గిన చెక్కుల టెక్కువాఁడు, చొ
క్కమ్మగు జాతికెంపు వెలగాఁగొను మోవిమెఱుంగువాఁడు, స
త్యమ్మగు రూపసంపద ధనాధిప సూనుని ధిక్కరించువాఁ,
డమ్మకచెల్ల ! నాహృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్. 135

అర్జునుడి పరాక్రమము గురించి విని ఉలూచి తనహృదయాన్ని అతడికి అర్పించింది. ఇప్పుడు అతడి అందచందాలు చూచి వేగిరపడుతుంది. వీరవనితలు పరాక్రమ విక్రీతలని అంటారుగదా.

అర్థము :

కమ్మనిజాళువాన్ = అందమగు జాళువాదేశపు మేలిమి బంగారమును, ఒరయఁగల్గిన = పరీక్షించగల (రాచిగీటుపెట్టగల, అనగా తిరస్కరించగల), చెక్కులటెక్కువాఁడు = చెక్కిళ్ళ అందము గలవాడు. చొక్కమ్మగు = ప్రశస్తమయిన, జాతికెంపు = పుట్టురత్నమును, వెలగాన్‌కొను = దాని వెలకు కొనగల అనగా తిరస్కరించగల, మోవిమెఱుంగువాఁడు = పెదవియొక్క ప్రకాశము గలవాడు, సత్యమ్మగు = యథార్థమయిన, రూపసంపదన్ = రూపము యొక్క కలిమిచేత, ధనాధిప సూనుని = చాల అందగాడని ప్రసిద్ధి పొందిన నలకూబరుని (ధనాధిప-కుబేరుని, కొడుకు), ధిక్కరించువాఁడు, అమ్మకచెల్ల ! = ఓహూ ! ఆశ్చర్యము!, వీనికిన్ = ఈ అర్జునుడికి, ఇయ్యెడన్ = ఈ చోటనే, ఈక్షణముననే, నా హృదయము = నా ప్రేమ, అమ్మక చెల్లదు = విక్రయించక - స్వాధీనము చేయక-తప్పదు.

తాత్పర్యము :

మేలిమి బంగారాన్ని గీటుపెట్టగల చెక్కులుగల అందగాడున్నూ, జాతికెంపును పరీక్షించ జాలిన పెదవికాంతికల సొగసుగాడున్నూ, నలకూబరుడినిగూడా రూప సంపదలో ధిక్కరించ గల సుందరుడున్నూ అయిన ఈ అర్జునుడికి ఇక్కడ, ఇప్పుడే నాహృదయము అమ్మకపోతే దానిని అమ్మగల అవకాశము మరి దొరకదని ఉలూచి నిర్ణయించుకుందని భావము.

విశేషము :

ఈ పద్యానికి గూడా మన వ్యాఖ్యాతలు తగినంత చక్కగా వివరణ ఇవ్వలేదు.

కమ్మని జాళువా నొరయగల్గిన చెక్కుల టెక్కువాడు. అంటే వేదమువారు 'చక్కని మేల్మిబంగారమును రాపాడగలిగినట్టి చెక్కిళ్ళ అందముగలవాడు' అన్నారు. ఈ అర్థాన్నే జూలూరువారూ, నోరివారూ ఇచ్చారు. రాపాడ గల్గడములోని అర్థాన్ని బులుసువారు 'ఎదిరింప గలిగిన (సరిపోలునట్టి అనుట)' అని వివరించారు.

అర్జునుడునల్లనివాడని – ఘననిభాంగుడని – మనము మరచిపోకూడదు. జాళువాతో రాపాడ గలవాడంటే సరిపోదుకదా !

'ఒరయ' అన్నమాట స్వర్ణకారుల 'ఒరగల్లు'ను స్మరణకు తెస్తుంది. ఈ ఒరగల్లు నున్నగా, నిగనిగలాడుతూ ఉండే నల్లని రాతిపలక. బంగారాన్ని దీనిమీద గీటుపెట్టి స్వర్ణపరీక్షకులు ఆ బంగారమువన్నె నిర్ణయించి తాటాకుమీద (ఇప్పటికీ) వ్రాసి ఇస్తారు. ఈ తాటాకు ముక్కకు 'ఉల్లాకు' అంటారు. ఉల్లాకు వేయించడమంటే వన్నె, ధరా కట్టించడమన్నమాట.

"సత్యమ్మగు రూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించువాఁడు"—వాస్తవమయిన రూపసంపదయందు నలకూబరుని ధిక్కరించువాడు. నలకూబరుని రూపసంపద కవీశ్వరుల కల్పన గాని, ఈతని రూపసంపద నిజమయినది యని భావించాలి.

ఉలూచి. తన హృదయమనే అమూల్యమయిన రత్నాభరణమును అమ్మతలుచుకుంది. రత్నాభరణమును మొదట బంగారు పరీక్షకుడు వన్నెకట్టాలి, తరువాత రత్నపరీక్షకుడా రత్నముల వెల నిర్ణయించాలి. ఆతరువాత ఇంత ఎక్కువ ఖరీదు ఈయగల ధనికుడు కావాలి. అప్పుడుగాని ఆ రత్నాభరణమును అమ్మడానికి వీలుండదు.

ఈ మూడుగుణములు అర్జునునియందు కనబడుతున్నాయి. జాళువానొరయ గల్గుట, కెంపువెలగా కొనుట, ధనాధిపసూనుని ధిక్కరించుట. కాబట్టి అక్కడే, ఆతనికే, అప్పుడే, అమ్మక తప్పదు అని నిశ్చయించుకుంటుంది.

ఈ అవకాశము చేయిజారిపోతే మళ్ళా ఇటువంటి అవకాశం కలుగునో లేదో, ఎప్పుడో ఎక్కడో ? అనిభావము.

*పాఠాంతరము :*

సత్యమ్ముగ రూపసంపద......

ఈ పద్యమున అల్లసాని పెద్దన మనుచరిత్రలోని

కమ్మని కుందనంబు కసుగందని మే, నెలతేఁటి దాఁటులం
బమ్మెరవోవఁ ద్రోలు తెగబారెడు వెంట్రుక, లిందుబింబముం
గి మ్మననీదు మోము, గిరిశ్రేణులు మూఁపులు, కౌను గానరా
దమ్మకచెల్ల ! వాని వికచాంబకముల్ శతపత్త్రజైత్త్రముల్.

అన్న పద్యము కవి స్ఫురణలో ఉన్నదనక తప్పదు. నాయకుని రూపవర్ణనమే రెండు పద్యములలోని విషయము. కమ్మని యను పదముతో మొదటి చరణమున్ను, అమ్మకచెల్ల ! అను పదముతో కడపటి చరణమున్ను చూడదగినవి. కేవలము ఆశ్చర్యార్థకముగా అల్లసాని పెద్దన విడిచి పెట్టిన అమ్మకచెల్లను, అమ్మక చెల్లదు అని విరిచి, అపూర్వమైన అర్థగౌరవముతో ఒక యమకమునిచ్చి ఈ కవి అపూర్వాధిక్యము పొందినాడు.

జాతికెంపును వెలకు కొనగల ఎఱ్ఱనిపెదవి కలవాడు. ఇక్కడ వెలకు కొనగలగడం పెదవి ఆధిక్యాన్ని తెలుపుతుంది.

వెల అన్నది వెల్ల అన్న మాటకు సూక్ష్మరూపము—తెల్లని అని అర్థము. 'వెలవెల' లోనూ, వెల్వెలలోనూ తెల్లని అన్న అర్థములోనే 'వెల' రూపము కనబడుతూ ఉంది. దీనిని పండితులు సాధారణంగా అంగీకరించక పోయినా, విశేషార్థము కనబరుస్తున్నప్పుడు సైరించక పోతారా.

చూడండి—

………రతిక్రాంతాంగనా నేత్రకో
ణ నికాయంబుల డాచి తద్ధవళిమన్ తాఁబూనెనో చొప్పు మా
ర్ప ననన్ వెల్వెలబాఱె దీపకళికా వ్రాతంబు శాతోదరీ.

—అల్లసాని మనుచరిత్ర.

పెదవి జాతికెంపును 'వెలగా' తెల్లదానిగా, కొనుఁ = భావించును. ఆ రూపంగా తన ఆధిక్యమును స్థిరపరుచుకొనును. అంతేకాదు, జాతి కెంపును రత్నపరీక్ష చేసి, వెలగాగొనున్ = వెలకట్టును అని గూడ అర్థమున్నది.

ఉలూచి మనసులోని అభిప్రాయము : ఈ చెక్కుల చెక్కువాడు — కమ్మనిజాళువా నొరయ గల్గినవాడు; ఈ మోవి మెఱుంగువాడు—చొక్కమ్మగు జాతికెంపు వెలగాగొనువాడు; ఈరూప సంపదవాడు ధనాధిపసూనుని ధిక్కరించువాడు.

తన హృదయము అమూల్యమైన రత్నాభరణము కాబట్టి చాలా ధనమున్నవాడే గాని ఆ పాటీపాటి ధనికులు కొనలేరని ధ్వని.

*అలంకారము :*

ప్రతీపము, యమకము.

ముద్దాడ వలదె యీ మోహనాంగుని మోముఁ
గండచక్కెర మోవి గల ఫలంబు ?
రమియింప వలదె యీ రమణు పే రురముపై
వలి గుబ్బ పాలిండ్లు గల ఫలంబు ?
శయనింప వలదె యీ ప్రియుని సందిటిలోనఁ
గప్పు పెన్నెఱికొప్పు గల ఫలంబు ?
వసియింప వలదె యీ రసికు నంకమునందుఁ
జెలువంపు జఘనంబు గల ఫలంబు ?
రాజనము తేజరిల్లు నీ రాజుఁ గూడి
యింపుసొంపులు వెలయఁ గ్రీడింప వలదె
నాకలోకంబువారలకైన లేని
యలఘుతర భోగభాగ్యముల్ గల ఫలంబు ? 136

తనకున్న అపూర్వమయిన సౌందర్యము సార్థకము కావాలంటే ఈ మోహనాకారుడితో కూడి ఉండవలసిందే, వేరుమార్గము లేదని ఊలాచి మరికొంత ఊహావిహారం చేస్తూంది.

అర్థము :

(౧) కండచక్కెరమోవి = కలకండవలె మధురమైన అధరము, కల ఫలంబు = నేను కలిగి ఉన్నందుకు ఫలముగ, ఈ మోహనాంగుని మోమున్ = ఈ సుందర శరీరుని ముఖమును, ముద్దాడవలదె = ముద్దుపెట్టుకొన వలదా ? (లేకుంటే ఆ మాధుర్యము అంతా వ్యర్థమవుతుందని భావము.)

ముద్ద అడ వలదె అని పద విభాగముచేసి, ముద్ద ముద్దగా మ్రింగివేయవలదా, అని వేదమువారు సూచించారు.

(౨) వలి = వట్రువలైన, గుబ్బ పాలిండ్లు = గుబ్బలవంటి స్తనములు, కల ఫలము (గా), ఈ రమణు = ఈ అందగాని యొక్క, పేరు ఉరముపైన్ = విశాలమయిన వక్షస్థలము మీద, రమియింప వలదె = క్రీడించవద్దా ? (లేకుంటే స్తన సౌష్ఠవమంతా నిరర్థకమని భావము.)

(౩) కప్పు = నల్లనైన, పెను నెఱికొప్పు = పెద్దదయి నొక్కులుగల కొప్పు, కల ఫలంబు, ఈ ప్రియుని, సందిటిలోనన్ = కౌగిలియందు (అతని చేతిమీద తలపెట్టుకొని), శయనింపవలదె = పరుండవలదా ? కాకుంటే ఈ సొగసంతా వ్యర్థముగదా ? (సందిలి = చేతిదండ.)

(ళ) చెలువంపు జఘనంబు = అందముగల కటిప్రదేశము - పిరుదు, కల ఫలము, ఈ రసికు = ఈ సరసుని, అంకమునందున్ = తొడమీద, వసియింప వలదె = కూర్చుండవద్దా? (లేకుంటే ఆ చెలువము సార్థకముగాదని భావము.)

నాకలోకంబు వారలకైనన్ = స్వర్గలోక వాసులకు సైతము, లేని = లేనటువంటి, అలఘుతర = మిక్కిలి గొప్పవైన, భోగభాగ్యముల్ = భోగములును భాగ్యములును, కల ఫలంబు (నాకలోకవాసులకు లేని— అనగా, ఉలూచికి ఉన్న— భోగ భాగ్యముల్, అనగా, భోగ = పడగ యొక్క, భాగ్యము = సంపద, కలఫలము), రాజసము = ఠీవివల్ల, తేజరిల్లు = ప్రకాశించుచున్న, ఈ రాజుగా గూడి, ఇంపు సొంపులు = ఇష్టవిలాసములు, వెలయన్ = ఒప్పునట్లు, క్రీడింప వలదె = సుఖించవద్దా? (లేకుంటే నిష్ఫలమని భావము.)

తాత్పర్యము :

తనకున్న తీయనిమోవీ, బటువుగుబ్బలూ, నొక్కులకొప్పూ, అందమైన పిరుదులూ సార్థకం కావాలంటే సుందరాంగుడైన ఆ అర్జునుని, క్రమంగా, ముద్దుపెట్టుకోవాలి, ఆలింగనము చేసుకోవాలి, సందిటిలో పండుకోవాలి, తొడమీద కూర్చోవాలి. లేకపోతే వాటి సౌందర్యమంతా వ్యర్థమయినట్టే అని ఉలూచి ఊహించుకుంటూ ఉంది. దేవతలకైనా లేని భోగభాగ్యాలు తనకున్నందుకు ఆతనితో చక్కగా క్రీడించాలి, లేకపోతే నిష్ప్రయోజనమే అనుకుంటుంది.

విశేషము :

ఏ వస్తువుకయినా మంచిగుణ మున్నంత మాత్రాన ప్రయోజనం లేదు; దాని సద్వినియోగము వల్లనే అది సార్థక మవుతుంది. గొప్పపాండిత్య ముండినా, పదిమందికీ దానిని పంచిపెట్టినప్పుడే ఆ పాండిత్యము సఫలమవుతుంది. ఈ సూత్రాన్నే ఉలూచి ఈ పద్యములో పాటిస్తూ ఉంది.

న + అకము—నాకము : క అంటే సుఖము. అకమంటే దుఃఖము. న అకమంటే దుఃఖము లేనిది, అనగా స్వర్గము.

భోగభాగ్యాలు — ఇదొక పలుకుబడి; మంచి అనుభావాలు అని అర్థము. దీనిని భోగ-భాగ్యము అని విడదీసి, భోగ = పడగల, భాగ్యము = సంపద అని నాగలోక ఆధిక్యాన్ని కవి చమత్కారంగా చూపించాడు.

ఈ పద్యములో ఉలూచి తన సౌందర్యాన్ని తాను పొగుడుకొంటున్నట్టు కనబడుతుంది. కాని, అదిగాదు. తనకున్న అందము విలాస సంపన్నుడైన అర్జునుడితో క్రీడించడానికి తగునని నిశ్చయ పరచుకుంటూందని భావించాలి.

ఉలూచి దృష్టి అర్జునుడి ముఖము, వక్షము, సందిలి, తొడ, వీటిమీద పడ్డది. ఆతడిలో ఉన్న రాజసము తన్నాకర్షించింది. తనజన్మ ధన్యము కావాలంటే తానేమి చేయాలో నిశ్చయించుకుంది.

అలంకారము :

శ్లేష.

అని యిటు లువ్విళ్ళూరెడు
మనమునఁ గొనియాడి, యంత మాపటివేళన్,
గనుఁ(బ్రామి, చొక్కుఁ జల్లిన
యనువున నందఱు వితాకులై యుండంగన్, 137

ఈ పద్యములో ఉలూచి కార్యోన్ముఖి అయింది; ఊహాలు చాలించింది.

అర్థము :

అని ఇటులు, ఉవ్విళ్ళు ఊరెడు = (136 వ పద్యములో కలిగిన కోరికలతో) ఆతుర పడుతున్న, మనమునఁ = మనస్సునందు, కొనియాడి = అర్జునుడిని మెచ్చుకొని, అంతన్ = తరువాత, మాపటి వేళఁ = సాయంకాలమునందు, కనుఁ(బ్రామి = కనుకట్టు మాయజేసి, చొక్కుఁ చల్లిన అనువునఁ = చోరులు మత్తుపొడిని చల్లిన విధముగా, అందఱున్ = అర్జు నుని పరిజను లందరు, వితాకులై = స్మృతితప్పి, యుండంగఁ, తరువాతి పద్యముతో అన్వయము.

తాత్పర్యము :

సాయంకాలము వరకు వేచి ఉండి, అర్జునుని పరిజను లందరినీ ఒళ్ళు మరచి ఉండేలాగ మాయజేసి, అతనిని మాత్రము తీసుకొని పోయిందని భావము.

విశేషము :

ఉలూచి గంగాతీరమున అర్జునుడిని దూరంనుంచి చూచినప్పుడు ఆతడు హిమరసైకత సైకతమునందు విహరిస్తున్నాడు. మాయచేసి ఉలూచి అర్జునుడిని తీసుకుపోయి నప్పుడు "మాపటివేళ".

దీనిని పట్టి, ఉలూచి తొందరపాటుగా కాక, సుదీర్ఘంగా (దాదాపు పంద్రెండు గంటల కాలము) సాధకబాధకాలన్నీ యోచించే అర్జునుడిని తీసుకుపోయిందని తేటపడుతుంది.

ఈ యోచనే "గుట్టనియాడ......" అన్న పద్యంలో కవి నిరూపించాడు.

ఉలూచి ఈ ఆలోచనలలో ఉండగా, అర్జునుడు పచారుచేసి, స్నానాలూ దానాలూ భోనాలూ అయిన తరువాత తన ఆప్తులతో సరదాగా ముచ్చటిస్తూ నవ్వుకుంటూ ఉండి, సాయం కాలము జపము చేసుకుంటూ ఉంటాడు—జపము చేసుకుంటున్నా డన్న సంగతి దీని తరువాతి పద్యములవల్ల తెలుసుకుంటాము.

దూరాన ఉన్న ఉలూచి దగ్గరకు, మాయాన్విత అయి, వచ్చింది. అర్జునుడి శరీర సౌం దర్యమేకాక, అతడి వ్రతనిష్ఠ, దానశీలమూ, ఆప్తులమీది దయా మొదలైన స్వభావసౌందర్యము గూడా చూచిందని మనము గ్రహించాలి.

ఇటు జపియించినఁ బిడుతునే నిను నే నిఁక నంచు జాహ్నవీ
తటమున సంధ్యవార్చి జపతత్పరుఁడై తగువాని యామినీ
విటకుల శేఖరుం గొనుచు వే పురికిం జని నిల్పె నట్టె యు
న్నటులనె మాయ యచ్చుపడ నల్ల భుజంగి నిజాంగణంబునన్. 138

అర్థము :

ఇటు జపియించినన్ విడుతునే నిను నేను ఇఁకన్ = ఇట్లు జపించినంత మాత్రాన నేను నిన్ను ఇంక విడిచిపెట్టుదునా, అంచు = అనుకొని, జాహ్నవీ తటమునన్ = గంగానది ఒడ్డున, జపతత్పరుఁడై = జపమునందు ఆసక్తిగలవాడై, తగువానిన్ = ఉన్న వానిని, యామినీ విట కుల శేఖరున్ = రాత్రికి విటుడైన చంద్రుని యొక్క వంశమునందు శ్రేష్ఠుడగు వానిని, కొనుచు = తీసుకొని, వే = వేగముగ, పురికిన్ చని = తన పట్టణమయిన భోగవతికిపోయి, మాయ అచ్చు పడంగన్ = తా జేసినమాయ స్పష్టమయినట్టు, ఉన్నటులనె = మొదట తానుండిన రీతిగనే - అనగా జపము చేసుకుంటున్నట్టులనే, అట్టె = తేలికగా, అల్లభుజంగి = ఆ నాగకాంత, నిజ అంగణంబునన్ = తన ఇంటి లోగిలిలో, నిల్పెన్ = ఉంచెను.

తాత్పర్యము :

జపము చేసుకుంటున్నంత మాత్రాన నిన్ను విడిచిపెట్టబోనని, గంగా తీరాన జపము చేసుకుంటున్న అర్జునుడిని తన మాయా బలముతో తన నగరానికి తీసుకొనిపోయి, గంగఒడ్డున జపము చేసుకుంటున్నప్పు డున్నట్టుగానే ఉంచింది.

విశేషము :

విడుతునే నిను నే నిఁకనంచున్—ఇక్కడి నిను, నేను, ఇక అన్న మూడు చిన్న చిన్న మాటలలో కవి చాల పెద్ద భావాన్నే ఇమిడ్చాడు.

నిను - సుందరుడు, వీరాగ్రేసరుడు, తన హృదయం వశపర్చుకున్నవాడు అనీ, నేను - ఎన్నాళ్ళ నుంచో ప్రేమించి ఈ నాడు చూడగలిగిన నాగలోక కన్యననీ, ఇఁక - ఇటువంటి అవకాశం అదృష్టవశాన చిక్కి - మళ్లా దొరుకుతుందన్న ఆశకు ఆస్కారం గూడా కనబడకుండా ఉన్నప్పుడు అనీ కవి భావము.

*పాఠాంతరము :*

.... పురికింజని నిల్పె నెప్పుడు
న్నటులనె మాయ యచ్చుపడ....

— తిరుపతివారూ, వేంకట కృష్ణమాచార్యులవారూ.

ఎప్పుడున్నటులనె = మామూలు విధంగానే అనాలి.

జపించినా విడిచిపెట్టక పోవడము లోకోక్తిగా వ్యవహారములో ఉంది.

యామినీ విటుడు—చంద్రుడు ; ఆ విటుని కులములోనివాడు అర్జునుడికి విటుడి గుణాలు, శృంగార భావాలు, ఉంటాయని నమ్మకము.

భుజంగము = సర్పము, భుజంగి = సర్పకాంత—ఉలూచి. భుజంగి అంటే విటకత్తె అన్న అర్థం గూడా ఉంది. కాబట్టి ఇద్దరికీ సమాన ధర్మము విటత్వమని కవి చమత్కారంగా సూచించాడు. వారు కలియడం సహజ మంటాడు కవి.

అట్టె ఉన్నటులనె—'అట్టె' వల్ల రెప్పపాటు కాలములో, చాల తేలికగా అన్నమాట.

నిజాంగణంబునఁ—ఇక్కడ అంగణమంటే ముంగిలి అని అర్థం చెప్పుతారు. కాని రాబోయే 140 వ పద్యములోని విషయాన్నిపట్టి చూస్తే అది మందిరములోని భాగమేగాని, ముంగిలి కాదని తేటపడుతుంది. అందుకే 'లోగిలి' అని అర్థం చెప్పుకున్నాము.

*అలంకారము :*

పరికరము, వృత్త్యనుప్రాసము.

నిలిపిన జప మెప్పటివలెఁ
జలిపినవాఁ డగుచుఁ బాకశాసని యంతన్
దళుకుం బిసాళి వాలుం
దెలి గన్నులు విచ్చి చూచె నివ్వెఱతోడన్. 139

అర్థము :

నిలిపినఁ, జపము, ఎప్పటివలెఁ, చలిపినవాఁడు = చేసినవాడు, అగుచుఁ, పాకశాసని = ఇంద్రుని కుమారుడైన అర్జునుడు, అంతన్ = ఆసమయమందు, తళుకుఁ పిసాళి = తళతళ ప్రకాశిస్తూ ఉన్న, వాలుం తెలికన్నులు = తెల్లని వాలుగన్నులను, విచ్చి = తెరచి, నివ్వెఱతోడన్ = ఆశ్చర్యముతో, చూచెఁ = చూచెను.

తాత్పర్యము :

ఉలూచి తన నగరిలో నిలిపిన తరువాత అర్జునుడు ఎప్పటిలాగానే జపము చేసుకొని, కళ్ళు విప్పి ఆశ్చర్యముతో చూచాడని భావము.

విశేషము :

ఎప్పటివలె జపము సల్పి అంటే మామూలు ప్రకారము అని భావము. అంటే, ఆనాడు అర్జునుడి జపానికి భంగం కలుగ లేదన్నమాట. ఇక్కడ 'నిలిపిన' అంటే కూర్చోబెట్టిన అని అర్థం చేసుకోవాలి.

అర్జునుడి నిక్కడకు తెచ్చినది మొదలు ఎప్పుడతడు కళ్ళు విప్పుతాడో అని ఉలూచి తన దృష్టినంతా ఆ కళ్ళమీదనే నిలిపింది. విప్పినప్పుడు ఆకళ్లు ఉలూచికి నాలుగు గుణాలతో కనిపించాయి-తళుకూ వికాసమూ కలిగిన తెలి వాలు కన్నులు. ఆ గుణాలనే కవి పేర్కొన్నాడు.

పాకశాసని: పాకుడన్న రాక్షసుడిని జయించినందువల్ల ఇంద్రుడిని పాకశాసను డన్నారు. అతని కొడుకు పాకశాసని అవుతాడు; అంటే అర్జునుడు.

దట్టంపుఁ దెలినీటి తరఁగ చాల్కడ కొత్తి
నెలకాల జగతి దా నిలుచు టేమి?
కొలఁకుఁ దెమ్మెర గంధములఁ గ్రిందఁ బడవైచి
కలపంపుఁ దావి దాఁ గవియు టేమి?
చివురు జొంపపు మావి జీబు మాయము సేసి
పసిఁడి యుప్పరిగ దాఁ బ్రబలు టేమి?
నిద్దంపు టిసుము తిన్నియ పొన్నుఁ దిగఁ ద్రోచి
యలరుల పాన్పు దా హత్తు టేమి?

మసమసక సంజకెంజాయ మఱుఁగువెట్టి
మిసిమికెంపుల కాంతి దా మెఱయు టేమి?
మొదల నే గంగతటి నున్నయదియు లేదొ,
మాయయో కాక యిది యంచు మరల చూడ. 140

నిర్వైరతో చూచినప్పుడు అర్జునుడికి తన పరిసరాలలో కనబడిన మార్పును ఈ పద్యములో కవి చూపిస్తున్నాడు.

అర్థము :

౧. దట్టంపు = అనేక ముండుటచేత దట్టమయిన, తెలినీటి తరఁగ చాల్ = తెల్లని నీటి తరంగాల వరుసను, కడకు ఒత్తి = తొలగనెట్టి, నెలఱాల = చంద్రకాంత శిలలతో నిర్మించిన, జగతి = స్థలము, తాఁ = ఆ జగతి, నిలుచుట ఏమి = ఆస్థానములో తానే ఉండడము ఏమి?

౨. కొలఁకు తెమ్మెర గందములు = నీటిమీదనుంచి వచ్చిన గాలియొక్క వాసనలను, క్రిందఁ పడఁ ౖపై చి = క్రిందపడవేసి, కలపంపు = కస్తూరి కర్పూరము మొదలైన సుగంధ ద్రవ్యముల కదంబము - మిశ్రము-యొక్క, తావి = పరిమళము, తాన్ కవియుట ఏమి = అతావే కమ్ముకొనడము ఏమి?

౩ చివురుజొంపపు మావి జీబుఁ = చిగురుటాకు గుత్తులతోడి మామిడితోపును, మాయ ముచేసి = కనబడకుండాచేసి, పసిఁడి ఉప్పరిగ = బంగారపుమేడ, తాఁ ప్రబలుట ఏమి = తానే విస్తరిల్లడము ఏమి?

౪. నిద్దంపు = మెరుస్తున్న, ఇసుము తిన్నియ పాన్పు = పరుపులాగా ఉండిన ఇసుక తిన్నియను, దిగఁ ద్రోచి = పడద్రోసి, అలరుల పాన్పు = పూవులసెజ్జ, తాఁ హత్తుట ఏమి = తానే తాకుటేమి?

మసమసక సంజ కెంజాయ = మసమసక లాడుచున్న సంధ్యాకాలపు ఎర్రకాంతిని, మఱుఁగువెట్టి = కప్పి వేసి, మిసిమి కెంపుల కాంతి = ప్రకాశముగల కెంపుల కాంతి, తాఁ మెఱయుటేమి = తానే ప్రకాశించడము ఏమి?

మొదల = మొదట,నేను, గంగతటిని = గంగానది ఒడ్డున, ఉన్నయదియు = ఉండడమే, లేదొ = అబద్ధమో, కాక, మాయయో ఇది = ఇదే మాయయో, అంచుఁ = అనుకుంటూ, మరల చూడఁ = మరొకసారి చూడగా, (మరలిచూడ-పాఠాంతరము = తిరిగిచూచునప్పటికి) ...... తరువాతి పద్యముతో అన్వయము.

విశేషము :

ఉలూచి "అట్టె యున్నటులనె మాయ యచ్చుపడ" 137 వ పద్యములో విల్వెనుగదా ! అట్టెయున్నటుల అంటే ఏమో ఇక్కడ కవి చెప్పుతున్నాడు.

గంగాతీరము నందుండే ఆయావస్తువులకు కొంత సరియయినట్టు కనబడే వస్తువులున్నట్టి స్థలమునందే నిలిపిందని భావము - మసమసక కాంతిలో చూస్తే, స్థలములో మార్పు ఉన్నట్టు కనబడకుండా ఉండేలాగా.

ఇక్కడ గుణసాదృశ్యమును గుర్తించాలి. "గంగానది తెలినీటి అలలు దట్టమయి ఉండడమువల్ల ఆ స్థలమంతా తెల్లగా కనబడుతుందిగదా. దానికి బదులు ఇక్కడ చలువరాతి పలకలు పరిచిన జగతి తెల్లగా ఉండే దానిని చూచాడు. కొలకు తెమ్మెరల వాసనలకు బదులు ఇక్కడ కస్తూరి కర్పూరము మొదలైనవాటి కదంబముయొక్క - కలపంపు - వాసన; లేత చివుళ్ళతో (పసిమివన్నెగల వనుకోవాలి) జొంపముగ ఉన్న మామిడితోపుకి బదులు పసిడీ వన్నె - బంగారపు - మేడ; మెరుస్తున్న ఇసుక తిన్నియకు బదులు పువ్వులపాన్పు ఉంది; సంజకెంపుజాయకు మారుగా ఇక్కడ మిసిమి కెంపుల కాంతి ఉన్నది. కాబట్టే కవి "అట్టె యున్నటులనె" అని చెప్పాడు.

ఇంకా, ఆయా వస్తువులను తొలగించుటకున్నూ, వాటికి మారుగా ఇతరములు వచ్చుట కున్నూ, ప్రయోగించిన క్రియాపదములు చాల భావగర్భితంగా ఉన్నాయి.

1. కడకొత్తి - నిలుచుట - ప్రక్కకు నెట్టివైచి, తానాస్థానములో నిలుచుట (చూపరులలో నొకనిలాగా).

2. క్రిందబడవైచి — కవియుట - క్రిందను తోసివేసి కలియబడుట (మల్లులలాగ).

3. మాయముచేసి - ప్రబలుట - కాన రాకుండచేసి, ఇంకొక దానిని చూపుట (గారడీ వానిలాగా).

4. దిగద్రోచి—హత్తుట (సెజ్జమార్చినట్లు).

5. మరుగుపెట్టి - మెరయుట — ఒకదానిని కప్పివేసి మెరయుట (మేఘములాగా).

ఇంతేకాక, 'బదులుగా నిలిచి ఉన్నవి' అన్న అర్థములో ప్రయోగించిన మాటలు గూడ అర్థగౌరవము కలిగినవే. చూడండి —

నెలరాల జగతి స్థిరముగా నిలిచి ఉంది.
కపురంపు తావి కవిసింది (కమ్మింది).

పసిడి యుప్పరిగ ప్రబలింది (విశాలముగ కనబడింది).
అలరులపొన్పు శరీరానికి హత్తింది.
కెంపుల కాంతి మెరిసింది.

"మొదల నే గంగతటి నున్నయదియు లేదొ" అని చెప్పడంవల్ల, ఇప్పుడు ఇక్కడ కనబడుతున్న నెలరాలజగతి మొదలైన వస్తువులను, భ్రమచేత, గంగానదీతీర విషయాలని అనుకున్నానో, లేక ఇదే మాయయో అని సందేహము.

విషయాల జంటలన్నీ చాల పోలిక కలిగినవని భావము.
మరల చూడడము నిశ్చయము చేసుకోడానికి

కొలకు తెమ్మెర :

....కమ్మని తమ్మి కొలంకు తెమ్మెరల్
వొలయ....

— పారిజాతాపహరణము (1-72).

మసమసక అంటే స్ఫుటముగా కనిపించని తక్కువకాంతిలో – గుడ్డికాంతిలో అన్నమాట.

*పాఠాంతరములు :*

1. కొలఁకు దామర గంధములు క్రిందఁ బడవైచి

— వేదమువారు.

ఈపాఠములో కొలఁకుదామర అంటే నీటి తామరల పరిమళమని ఇక్కడ భావించాలి— మెట్టతామరలు కావన్నమాట.

2. నిద్దంపు టిసుము తిన్నియ పొన్పు దిగఁద్రావి...

దిగతాగి హత్తడము కై పెక్కిన వానివలె అని అనుకోవాలి. కాని పొన్పు దిగతాగడము అని చెప్పడములో సొగసులేదు.

*అలంకారము :*

సందేహము.

తెలుకుఁ గాటుకకంటి సొలపుఁ జూ పెదలోనఁ
బట్టియుండెడి ప్రేమఁ బట్టియూయఁ,
జికిలి బంగరుప్రాఁత జిలుఁగు టొయ్యారంపుఁ
బైఁట గుబ్బల గుట్టు బై టవేయ,

సొగసుఁ గుచ్చెల నీటువగలు కన్నుల పండు
గలుగ మాయపుఁ గౌనుఁ గలుగఁజేయ,
నిడుద సోగ మెఱుంగు జడకుచ్చు గరువంపుఁ
బిఱుఁదు రేఖకు గెల్పుబిరుదు చాటఁ
గంటసరి నంటు కస్తురి కమ్మవలపు
కప్పురపు వీడియపుఁ దావిఁ గలసి మెలఁగ,
నొఱపులకు నెల్ల నొజ్జయై యుండె నపుడు
భుజగ గజగామిని మిటారి పొలుపు మీఱ. 141

మరల చూచేసరికి ఉలూచి కనబడింది.

అర్థము :

౧. బెళుకు కాటుకకంటి = మెరుస్తున్న కాటుకకన్నుల యందలి, సొలపుఁజూపు = ప్రేమను తెలిపే చూపు, ఎదలోన పట్టి ఉండెడి ప్రేమన్ = ఇంతకుముందే హృదయమున అంటుకొని ఉండిన ప్రేమను, పట్టి ఈయఁగా = (దాగి ఉన్న దొంగను పట్టి ఇచ్చినట్లు) తెలియ జేస్తుండగా,

౨. చికిలి బంగరు వ్రాఁత = తళుకుగల బంగారు (జలతారు) దారములతో చిత్రించిన పూవులు గలిగి, జిలుగు = సన్నమై, ఒయ్యారంపు = చక్కదనము గలిగిన, పైట = పయ్యెద, గుబ్బలగుట్టు = చాటుగా ఉంచిన కుచముల అందమును, బైటన్ వేయఁగా = బైట పెట్టుచుండగా (గుట్టుగా ఉన్న వానిని బైటపెట్టినట్టు కనబరుస్తుండగా).

౩. సొగసు కుచ్చెల = అందమయిన కుచ్చెళ్ళయొక్క, నీటువగలు = చక్కని యొయ్యారములు, కన్నుల పండుగలుగ = కన్నులకు విందులుగా, మాయపు కౌనున్ = లేవినడుమును, కలుగఁజేయఁగా = ఉన్నట్లు తోపిస్తుండగా (శూన్యమైన నడుము, కుచ్చెళ్ళవల్ల ఉన్నట్లు, గారడీలోవలె) కనబడుతుండగా,

౪. నిడుద సోగ మెఱుంగు = పొడవు గలిగి సోగగా ఉండి ప్రకాశిస్తున్న, జడకుచ్చు = జడచివరనుండే కుచ్చు — జడగంటలు, పిఱుఁదురేఖకు = పిరుదులయొక్క అందమునకు, గెల్పుబిరుదుగా = గెలుపును సూచించే బిరుదును (ఉలూచి పిరుదు అందముల పోటీలో జయించిం దన్న భావము), చాటఁగా = చాటుతుండగా (బిరుదుగా గంటలను గలిగి ఉన్నదని భావము).

కంటసరిగా = కుత్తుకనంటుకొని ఉండే ఆభరణమును, అంటు = అంటుకొని ఉన్న, కస్తురి కమ్మవలపు = కస్తూరియొక్క చక్కని పరిమళము, కప్పురపు వీడయపు తావిగా =

పచ్చకర్పూరం వేసిన తాంబూలముయొక్క వాసనతో, కలసి, మెలఁగఁగా = ప్రదేశమంతా వ్యాపించగా, ఒఱపులకు ఎల్లఁగా = అన్ని సౌందర్యములకూ, ఒజ్జయై = గురువై, భుజగ గజ గామిని మిటారి = విలాసవతియైన ఆనాగకాంత, పొలుపు మీఱి = చక్కదనమున అతిశయించి, అపుడు, ఉండెఁగా = కనబడెను.

తాత్పర్యము :

అర్జునుడు ఆ విధంగా మళ్ళా చూచినప్పుడు తన కాటుకకంటిలోని ప్రేమచూపుల వల్ల మనసులో ఉన్న వలపును తెలుపుతూ, సన్నని బుటేదారీ పైటలోనుంచి చనులపొంకము కనబడుతూ ఉండగా, కుచ్చెళ్ల కూర్పు వల్ల లేని నడుము ఉన్నట్టు కనిపిస్తూండగా, పిరుదుల అందానికి బిరుదు ఇచ్చారా అన్నట్టు జడగంటలుంటూండగా, అందాలకు గురువన్నట్టుగా ఉలూచి కనిపించింది. కుత్తిగంటుకు అంటించిన కస్తూరివాసన తాంబూలములోని కర్పూర వాసనతో కలిసి ఆ ప్రదేశమంతా పరిమళవంతమయింది.

విశేషము :

కాటుకకన్ను - సహజముగనే కాటుక పెట్టినటు లుండే కన్నులు-అదృష్టసూచకాలంటారు.

తానిప్పుడున్న స్థలము కొత్తది; ఇప్పుడు చూచినకాంత కొత్తది. ఆమెను చూడడ మిదే తొలిసారి.

అర్జునుడి దృష్టి శిరసునుంచి పిరుదువరకు ఒక్కొక్క విషయము శ్రద్ధగా చూచింది. కాటుక కళ్ళు, వలుపుచూపూ, పొంకమైన చనుకట్టూ, సన్నని నడుమూ, విశాలమైన పిరుదులూ కనిపించాయి. ఉలూచి కంటసరి నంటించిన కస్తూరి వాసనతో ఆమె తాంబూలపు కర్పూర వాసన కలిసి తెలియవచ్చింది.

ఈ పరిమళాన్నే 140 వ పద్యములో 'కలపంపుతావి' అని కవి అన్నాడు.

కంటసరి (కుతిగంటు-కుత్తిగంటు) అను కంఠాభరణము అవివాహితలగు స్త్రీలు మాత్రమే ఉపయోగిస్తారనీ, అది ధరించిన కాంత కన్యక అనీ గ్రహించాలి. ఆ కుతిగంటుకే కస్తూరి అంటిస్తారు - తరువాత ఆ గౌరవం మంగళసూత్రానికి కలిగిస్తారు. ఈలాంటిదే 'రూపు' అన్న కంఠాభరణము.

ఈ వర్ణనలోని ఔచిత్యము గమనించాలి. ఏమంటే; ఉలూచి అవివాహిత అని తెలుసుకో లేకపోతే, ఇంక మీద వచ్చే వర్ణనలు చేయకూడదు. ధర్మపరుడు, ఉత్తమవ్యక్తి అయిన అర్జునుడు పరకాంతల స్తనాది అవయవాలను వర్ణించడం సమంజసముకాదు.

నాయికా నాయకుల ప్రథమసమాగమములో నాయకుడుగానీ, అతని ప్రతినిధి (విదూషకుడు వగైరా) గానీ నాయికను చూచి, ఆమె వివాహితా లేక అవివాహితా అన్న విషయం మొదట ధృవపర్చుకొని గాని, ఆమె అవయవాది వర్ణనలకు పూనరు.

శ్రీనాథుడు —"గ్రీవాలంకృత పట్ట [1]సూత్ర లతికా"........ ...అని దమయంతినీ, రామరాజభూషణుడు—"లతాంగి రూపు కన్నారఁగఁ జూచి వచ్చితి" నని గిరికాదేవినీ పేర్కొనడము ఈ కన్యాత్వ నిరూపణకోసమే.

మన కవి గూడా గ్రంథారంభములో గదుడన్న కృష్ణరాయబారి అర్జునుడితో ఏకాంతము నందు "ద్వారవతి యందలి కన్నెల జక్కదనంబు లెన్నుచుఁ" అని కన్యాత్వ నిరూపణచేసిన తరువాతనే సుభద్ర అవయవ వర్ణనలకు పూనుకున్నాడు.

దీనినిబట్టి మనకవులు ఔచిత్య పోషణముకొరకు ఎంత శ్రద్ధవహిస్తుండేవారో తెలిసికో వచ్చును.

పెద్ద చరణాలలో రెండో దళాలలో పట్టి - పట్టి, బైట - బైట, గలుగ - గలుగ, బిఱుదు - బిరుదు అని ఒక అనుప్రాస నియమము పాటించి కవి ఈపద్యాన్ని మరింత మనోహరంగా చేశాడు.

ఈ సొగసు గుర్తించలేక కొందరు మూడోచరణంలో కన్నుల 'పండువులుగ...' అని పరిష్కరించారు. పండుగ అన్నది సరియైన రూపము కాదనీ; పండుగు - పండువు అనాలనీ వారి ఉద్దేశము. కాని పండుగ - పండువ అన్న రూపాలు గూడా సరియైనవే.

కొందరు 'మిటారి పొలుపు' అన్న పాఠము ఎత్తుకొని శ్రేష్ఠమైన చక్కదనము అన్న అర్థము నిచ్చారు. కాని "మిటారి" అనగా మిటారముగలది. మిటారము, గర్వము, మదము, లోనగువానివలన కలిగిన "నిక్కు" కాబట్టి, "భుజగ గజగామిని మిటారి"—మిటారియైన నాగ కాంత అని చెప్పడము సమంజసము.

అలంకారము :

యమకము.

అటులున్న కొమరుఁ బ్రాయపుఁ
గుటిలాలకఁ జూచి మదన గుంభిత మాయా
నటనంబో యిది గంగా
ఘటనంబో యని విచార ఘట నాశయుఁడై, 142

1. ఈ పట్టసూత్రలతికను గురించి వేదమువారు తమ శృంగార నైషధ వ్యాఖ్యానములో (పుట133) ఈలాగు వ్యాఖ్యానించారు :

"ఇందుఁ జెప్పిన పట్టసూత్రము వరుఁడుగట్టు మంగళసూత్రముగాదు. వివాహమునకు పూర్వము కన్యలు ధరించునట్టిది."

అర్థము :

అటులున్న = ఆ రీతిని ఒరపులకునెల్ల ఒజ్జయైయున్న. కౌమరుప్రాయపు = లేత వయసుగల, కుటిల అలకన్ = వంకరలైన ముంగురులుగల ఉలూచిని. చూచి. యిది = గంగా తటము మాయమై ఈ కొత్తస్థలములో ఈ యువతి ఉన్నట్లు కనబడడము, మదనగుంభిత మాయా నటనంబో = మన్మథునిచేత కూర్చబడిన మాయా నాటకమో (మన్మథ మాయయో). లేక, గంగా ఘటనంబో = గంగచేసిన కార్యమో, అని, విచారఘటన ఆశయుడై = విచారము జేయునట్టి అభిప్రాయముగలవాడై, తరువాతి పద్యముతో అన్వయము.

అలంకారము :

యమకము, సందేహము.

తియ్యని వింటివాని వెనుతియ్యక డగ్గఱఁ జాలు న య్యసా
హాయ్య తనూవిలాసి, దరహాసము మీసముఁ దీర్ప, నప్పు డా
తొయ్యలి వంకఁ గన్గొని, "వధూమణి, యెవ్వరి దాన వీవు ? పే
రెయ్యది నీకు? నొంటి వసియింపఁగఁ గారణమేమి?", నావుడున్ 143

అర్థము :

తియ్యని వింటివానిన్ = చెరకువిల్లుగల మన్మథుని. వెనుతియ్యక = భయపడకుండ, డగ్గఱఁజాలు = ఎదిరింప జాలిన, ఆ - అసాహాయ్య = ఇతర సహాయము లేకుండానే, తనూ విలాసి = శరీరసౌందర్యముగల అర్జునుడు, మీసమున్, దరహాసము దీర్పన్ = చిరునవ్వే దిద్దుచుండగా, అపుడు, ఆ తొయ్యలి వంకన్ = ఆ ఉలూచి దిక్కు, కన్గొని = చూచి, వధూ మణి = ఓ కాంతామణి, ఎవ్వరిదానవు, పేరెయ్యది నీకు ? ఒంటి వసియింపగన్ = ఒక్కతెవై ఉండుటకు, గారణమేమి?, నావుడున్ = అని అనగా, తరువాతి పద్యముతో అన్వయము.

తాత్పర్యము :

సహజసౌందర్యముతో మన్మథుడిని ఎదిరించ గలిగిన అర్జునుడు చిరునవ్వుతో ఉలూచిని చూచి నీ వెవ్వరిదానవు. పేరేమిటి, ఒక్కతెవు ఉండడమేమి ? అని అడిగాడు.

విశేషము :

తియ్యని వింటివాడు - ఎక్కుపెట్టిన ధనువును తీసివేయకుండా ఉండే మహావీరుడినైనా, సహాయము లేకుండానే - ఏ ఆయుధ సహాయమూ లేకుండా - ఎదిరించగల ధైర్యశాలి.

ఎట్టి ఆభరణాదులు లేకపోయినా స్వభావసిద్ధమైన శరీర సౌందర్యముచేత, మన్మథుని ఎదిరించగల అందగాడు.

చిరునవ్వు నవ్వినప్పుడు, పెదవుల కదలికవల్ల, చక్కని మీసము తనకు తానే దిద్దు క్కొంటూ కనబడడము స్వభావసిద్ధము. కవి కళాదృష్టిని ఆ విషయ మాకర్షించింది.

ఈ పద్యములో అర్జునుడికి ఉలూచి సంగతి ఏమీతెలియదు. కాబట్టి కేవలం 'వధూమణి' అని సంబోధించాడు. అంతేకాని శృంగారరస సంబంధమయిన సంబోధన చేయలేదు. ఇది అర్జునుడి సభ్యవర్తన కొక తార్కాణ.

అలంకారము :

వృత్త్యనుప్రాసము, స్వభావోక్తి.

మేలి పసిండి గాజుల నమేళపుఁ బచ్చల కీల్కడెంపు డా
కేలు మెఱుంగు గబ్బిచనుఁ గ్రేవకుఁ దార్చుచు సోగకన్నులన్
దేలఁగఁ జూచి "యో మదవతీ నవమన్మథ, యీ జగంబు పా
తాళము, నే నులూచి యనుదాన, భుజంగమరాజ కన్యకన్. 144

అర్థము :

మేలిపసిండి గాజుల = మేలిమి బంగారపు గాజులతో, నమేళపు = జతపర్చబడియున్న, పచ్చల కీలుకడెంపు = పచ్చలు తాపిన చీలమురుగులు - మురిడీలు-గల, డాకేలు - (దాపలికేలు) ఎడమచేతిని, మెఱుంగు గబ్బి చను క్రేవకున్ = నిగనిగలాడుచు బలిసియున్న చనుదోయి ప్రక్కకు, తార్చుచు = చేర్చుచు - ఎడమచేతితో పైటసర్దుకుంటూ, సోగకన్నులన్ = దీర్ఘములగు నేత్రములతో, తేలఁగన్ చూచి = ఒయ్యారముగా జూచుచూ, "ఓ మద.........మన్మథ = ఓ యౌవనవతుల పాలిటి నూతన మన్మథుడా ! (మన్మథునితో సమానమైన అందగాడా అని భావము). ఈ జగంబు పాతాళము, నేను ఉలూచియను పేరుగల, భుజంగమరాజ కన్యకన్ = నాగరాజు పుత్రికను

తాత్పర్యము :

బంగారపు గాజులూ, పచ్చల మురిడీలూ కల ఎడమచేతితో పైట సర్దుకుంటూ ఒయ్యార ముగాచూచి, ఓ మన్మథాకారా, ఇది పాతాళలోకము, నేను నాగరాజుకన్యకను, నాపేరు ఉలూచి అంటారు.

*విశేషము :*

ఎడమచేయి చనుగ్రేవకు తార్చడము స్త్రీలకు సహజము. ఈ రూపంగా ఉలూచి అర్జునుని దృష్టిని, తన వక్షస్థలానికి ఆకర్షించిందంటారా ?

భుజంగమరాజ కన్యకన్ అన్న ప్రయోగము తా నవివాహితనని సూచించడానికే అనాలి. కాని ఆమాటను అర్జునుడు కేవలము 'రాజకుమారికను' అన్న అర్థముతోనే గ్రహించి ఉండవచ్చును.

మొదటి రెండు చరణాలలోని వర్ణన అర్జునుడి దృష్టికి కానవచ్చిన దన్నమాట.

"మదవతీ నవమన్మథ" అన్న సంబోధనచేత తాను మదవతిననీ, అతడు మన్మథాకారుడనీ తెలియజేసింది.

ఉలూచి అంత శృంగారరస సంబంధమయిన సంబోధన చేసినా, ఆమె సంగతి అర్జునుడి కింకా తెలియదు కాబట్టి, తాను కేవలం "వధూమణీ" అని సంబోధించి ఊరకున్నాడు; కాని, శృంగారరస సంబంధమయిన సంబోధన చేయలేదు.

*అలంకారము :*

స్వభావోక్తి.

సరిలేని విలాసముగని
వరియించి యిటఁ దోడికొనుచు వచ్చితి నిన్నో
కురువీర, వసింపఁగ నీ
కుఱు వీర, దృఢాంకపాళిఁ గోరిన దానన్. 145

*అర్థము :*

సరిలేని = ఈడులేనట్టి, విలాసమున్ = (నీ) సొగసును, కని, వరియించి = ప్రేమించి, యిటన్ = ఇచ్చటికి, నిన్ను, తోడికొనుచు, వచ్చితిన్, ఓ కురువీర = ఓ కురువంశమునందు పుట్టిన వీరుడా, వసింపఁగన్ = కూర్చోడానికి, నీ కుఱువు = నీతొడను, ఈరా = ఇయ్యి, దృఢఅంకపాళిన్ = బిగియైన కౌగిలిని, కోరినదానన్.

*తాత్పర్యము :*

సాటిలేని నీ విలాసము చూచి నిన్ను వరించి ఇక్కడికి తీసుకొని వచ్చాను. ఓ కురువీరా నీ బిగికౌగిలిని ఆశించి ఉన్ననాకు నీ తొడమీద కూర్చొనే అవకాశము ఇవ్వమని కోరుతున్నాను.

విశేషము :

ఈ పద్యములో 'కురుపీర' అన్న సంబోధనవల్ల ఉలూచికి తన సంగతి కొంత తెలుసు నని అర్జునుడు అర్థంచేసుకుని ఉండాలి.

కురుపీర అన్నపేరు సార్థకము చేయడానికి కురువు( = తొడ). ఈరా ( = ఇవ్వరా) అని చమత్కారము. సరసోక్తులలో కాంతలు రాకొట్టవచ్చునంటారు.

పాఠాంతరాలు :

దరి నీ యందము గనుగొని
వరియిం చిట..........

— వేంకట కృష్ణమాచార్యులు.

ఇక్కడ 'దరిన్' అంటే 'గంగానది ఒడ్డున' అని అర్థము. ఈ పాఠమువల్ల తాను గంగాతీరానికి వచ్చి ఉండిన విషయము గూడ ఉలూచికి తెలుసునని అర్జునుడు తెలుసుకోగలడు. కురుపీర శబ్దాని కిది తోడయి అర్జునుడి విషయం చాల వరకు ఆమెకు తెలుసునని సూచించింది.

సరిలేని విలాసముఁగని
వరియింపఁగఁ దోడికొనుచు...

— తిరుపతివారు.

ఇక్కడ 'వరియింపగఁ' = వరించుట కొరకు అని అర్థము చెప్పుకోవాలి. గంగానది తీరాన్నే వరించి ఇక్కడకు తెచ్చానన్న పాఠములోని సారస్యము దీనిలో కానరాదు.

కురుపీర — కుఱుపీర మాటలలోని ర ఱ ల తారతమ్యము ప్రాసయందు చూడనక్కర లేదంటారు.

అలంకారము :

యమకము.

మం పెసఁగఁగ గటాక్ష లవ మాత్రము చేతనె ముజ్జగంబు మో
హింపఁగఁ జేయు ఖార మిఁక నీవు వహించితిగాన గేశినీ
చంపకగంధి బిత్తరపుఁ జన్నులమీఁద సుఖించుచుండు నా
సంపెఁగమొగ్గ ముల్కిగడ సామరి సోమరిగాక యుండునే? 146

*అర్థము :*

మంపు ఎస(గఁగా = మత్తు (కైపు) అతిశయించునట్లు, కటాక్ష లవమాత్రము చేతనె = కడకంటి చూపు యొక్క లేశమాత్రము చేతనే, ముజ్జగంబుల్ = మూడుజగములను, మోహింప(గ(జేయు = మోహము పొందినట్లు చేయవలసిన, భారమున్ = బరువును, నీవు,వహించితి(వి) గానఁగా = పూనుకున్నావు కాబట్టి, కేళినీ చంపకగంధి = సంపెంగవాసనగల శరీరముగల రతీదేవి యొక్క, బిత్తరపు చన్నుల మీఁదఁగా = అందమగు స్తనములపై, సుఖించుచుండు = సుఖముగా ఉండే, ఆ సంపె(గమొగ్గ ముల్కి-గడ సామరి = సంపెంగమొగ్గ కొన ఉన్న బాణాకఱ్ఱతో సాముచేసే మన్మథుడు, సోమరి = పనిలేనివాడు, కాకయుండునే = కాకుండునా ? (తప్పక సోమరి అవుతాడని భావము).

*తాత్పర్యము :*

సంపెంగమొగ్గమొనకల బాణాకఱ్ఱతో సాముచేస్తూ ఈమూడు లోకాలూ మోహింపజేసే మన్మథుడి పనిని నువ్వు కటాక్షమాత్రాన చేయడానికి పూనుకున్నావు కాబట్టి, ఆ మన్మథుడికి పనీపాటా ఉండదు. అందుచేత అతడు రతితో పొద్దుపుచ్చుకుంటుంటాడని భావము.

*విశేషము :*

"కేళినీ చంపకగంధి బిత్తరపు( జన్నులమీ(ద సుఖించుచుండు..." అన్న వర్ణన, నీవు కూడా ఆవిధముగా సౌఖ్యము పొందు అని అర్జునుని ఊరిస్తున్నట్లున్నది. మన్మథుడి అధికారము పొందినవాడవు కాబట్టి అతడనుభవించే సౌఖ్యాలు కూడా నీవు అనుభవించవచ్చునని సూచన.

"సంపెంగమొగ్గ ముల్కి-గడ సామరి" అంటే, సంపెగమొగ్గను ముల్కి-గా ఉంచిన గడ-కఱ్ఱతో సాదన చేయువాడు (మన్మథుడు). సంపెగపువ్వు మన్మథుని బాణాలలోనిది కాదు. కాబట్టి ఇక్కడ "ముల్కి-" అన్నమాటకు బాణము అన్న అర్థము చెప్పరాదు.

*పాఠాంతరము :*

సంపె(గ మొగ్గ ముల్కి- గడు సామఱి........

ఈ పాఠానికి సంపెగమొగ్గ ముల్కి-, గడుసు, అము, అఱి అని పదవిభాగము చేసి, సంపెగమొగ్గను బాణముగాగల, గడుసు = నేర్పరి (మన్మథుడు), అము = తన మదము - గర్వము, అఱి = కోల్పోయి అని అర్థము చెప్పుకోవాలి. ఈ పాఠములోని యతిపీ. అరల అభేదాన్ని సమర్థించుకోవచ్చును.

*అలంకారము :*

అతిశయోక్తి, కావ్యలింగ.

అను నెచ్చెలి వాక్యంబులు
విని యచ్చెరువంది "రూప విభ్రమ రేఖా
ఖను లెందు నాగకన్యలె
యని" విందుము; నేఁడు నిక్కమయ్యెఁ జూడన్. 147

అర్థము :

అను నెచ్చెలి వాక్యంబులు = అనే ఆయువతి మాటలు, విని, అచ్చెరువు = ఆశ్చర్యము, అంది = పొంది, ఎందుఁ = అన్నిచోటులా, నాగకన్యలె, రూప విభ్రమ రేఖా ఖనులు = రూపము విలాసము (రేఖా) అందము అన్నగుణాలకు పుట్టినిళ్ళు అని, విందుము = వింటుంటాము, (ఆమాట) నేఁడు = ఈదినమున, చూడన్ = కంటితో చూచుటచేత, నిక్కమయ్యెఁ = రూఢి అయింది.

తాత్పర్యము :

నాగకన్యలు మంచి రూపురేఖలు కలిగిన విలాసవతులని సాధారణంగా వింటూఉంటాము. ఈవేళ ప్రత్యక్షముగా చూచినందువల్ల ఆ మాట రూఢి అయిందని అర్జును డనుకున్నాడు.

విశేషము :

రూపము :– అందము – అలంకారాదులు లేనప్పుడు ఉండే అందము.

విభ్రమము :– వచనము, వచనానుసారముగ అవయవాదుల కదలిక, అలంకారముల యందు వివిధములగు పద్ధతుల ననుసరించిన శృంగారచేష్ట.

రేఖా :– అవయవాదుల యందలి లావణ్యము – అమరిక.

"అనునెచ్చెలి......వినియచ్చెరు......"

"ఖనులెందు.........వినియుందు..."

ఈ జంటలలోని శబ్దచమత్కారము చూడదగును.

అలంకారము :

రూపకము.

అన్నన్న ! మొగము వెన్నుని
య న్నన్న జయించుఁ గన్ను లన్నఁ నలి నా
సన్నములు, నడుము మిక్కలి
సన్నము, మాటలు సుధా ప్రసన్నము లెన్నన్. 148

అర్థము :

అన్నన్న = ఔరౌరా! మొగము, వెన్నుని = విష్ణుమూర్తియొక్క, అన్ను = భార్యయగు లక్ష్మియొక్క, అన్నన్ = సోదరుడైన చంద్రుని, జయించుఁగా = ఓడించును, కన్నులు అన్నఁగా = కన్నులంటామా, నలిన ఆసన్నములు = పద్మములకు దగ్గర సంబంధము కలవి - సమానములు, నడుము మిక్కిలి సన్నము, ఎన్నన్ = ఆలోచించగా, మాటలు సుధాప్రసన్నములు = అమృతమువలె సంతోషమును కలిగించేవి.

తాత్పర్యము :

ఓహో ! ఈ ఉలూచి సౌందర్యము ! ముఖము చంద్రుడికంటే అందమైనది, కన్నులా పద్మాలకు దగ్గరచుట్టాలు, నడుము చాలా సన్నము, మాటలు అమృతము వంటివే అని అర్జునుడు అనుకుంటున్నాడు.

విశేషము :

అర్జునుడు ఉలూచి సౌందర్యాన్ని ఎంత ఉత్సాహంతో మెచ్చుకుంటున్నాడో తెలియజేయడానికే 147-150 వ పద్యాలలో కవి చక్కని శబ్దాలంకార నియమము కనబరిచాడు.

ప్రసాదము అన్నది ఒక కావ్యగుణము. దీనినే కవి

'ప్రసన్నతయును సౌకుమార్యము గనంబడ రాల్గరగించె'

అని ప్రయోగించాడు ఉలూచి మాటలు ప్రసాదగుణము గల కవిత్వంలాగా తన్ను సంతోషపర్చినాయని భావము.

ఈ పద్యములో మూడు అన్నన్నలు, మూడు సన్నములు వాడినా తనివితీరక కవి చివర ఒక "ఎన్నన్" ఉంచాడు.

దీని తరువాతి రెండు పద్యములు కూడ ఈలాంటివే.

నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వని నాసిక,
చివురు సవురు జవురు నువిద మోవి
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతి వేణి
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవ మేను. 149

అర్థము :

జవ్వని = ఈ యౌవనవతి యొక్క, నాసిక = ముక్కు, నువ్వుపువ్వున్, నవ్వుఁ = పరిహసించును (నువ్వుపువ్వుకన్న అందమైన ముక్కుగలదని భావము). ఉవిద = ఈజవరాలి యొక్క, మోవి = అధరము, చివురు = చిగురుటాకు యొక్క, సవురుఁ = అందమును, జవురుఁ = దండించును (మించియుండును), బిబ్బోకవతి = విలాసవతియొక్క, వేణి = జుట్టు, మబ్బు = మేఘముయొక్క, ఉబ్బుఁ = గర్వమును, గెబ్బుఁ = పడద్రోయును, తెఱవ మేను = ఈ కాంత శరీరము, మెఱపు ఒఱపుఁ = మెరుపుయొక్క అందాన్ని, పఱపున్ = పార దోలును.

విశేషము :

ఈ పద్యములోని పదములన్నీ యౌవనవతియైన విలాసవతినే సూచిస్తున్నాయి. ఇక్కడ రసికుడైన అర్జునుడికి, చక్షుఃప్రీతి కలిగిందన్న భావము కవి ఈపద్యంలో శబ్దాలంకార ఆవేశముతో తేటపరిచాడు.

రవరవలు నెఱపు నీలపు
రవ రవణముతోడఁ జెలి యరాళ కచంబుల్;
కవకవ నవ్వున్ వలి జ
క్కవ కవఁ గలకంఠ కంఠి కఠిన కుచంబుల్. 150

అర్థము :

చెలి అరాళకచంబుల్ = ఈ కాంతయొక్క వంకలుగల (కుటిలమైన) తలవెంట్రుకలు, నీలపురవ = ఇంద్రనీలమణులయొక్క, రవణముతోడఁ = కాంతితోడ, రవరవలు నెఱపుఁ = జగడము చేయును (అనగా మించియుండునని భావము). కలకంఠ కంఠి = కోకిలవంటి కంఠస్వరముగల ఈ కాంతయొక్క, కఠిన కుచంబుల్, వలి జక్కవ కవఁ = గుండ్రని చక్రవాక పిట్టలజంటను, కవకవ నవ్వుఁ = ఎక్కువగా పరిహసించును.

తాత్పర్యము :

ఈ కాంతజుట్టు వంకరలుతిరిగి నీలమణుల నల్లని కాంతితో మెరుస్తూ ఉంది, స్తనములు బిగువుకలిగి జక్కవపిట్టలలాగా గుండ్రములై ఉన్నవని భావము.

విశేషము :

ఈ పద్యములో కచవర్ణనలో రవణము (కాంతి), కుచవర్ణనలో - వలి (గుండ్రదనము) ఇవి ఉపమాన సాదృశ్యములు. వీటినేకాక, కచమునకు - అరాళత్వమూ, స్తనములకు కఠినత్వమూ అన్న విశేషగుణములను గూడ కవి పేర్కొన్నాడు. వీటివల్ల కలిగిన సొగసు :

కచమున కుటిల (వంకర) గుణము అధికముగా ఉండడంచేతనే జగడమాడుట. కుచములు కఠినగుణముగలవి అవడంవల్లనే కవకవ నవ్వుట అని చమత్కరించాడు.

*అలంకారము :*

పరికరము.

చెక్కుల యందముఁ, మొగము చెల్వముఁ, జన్గవ నీటు, వేణి తీ,
రెక్కడఁ జూడ, మన్నిటికి నెక్కువ దేమన సైకతంబుతో
నెక్కటి కయ్యముం జలుపు నిక్కటి యొక్కటి చాలదే మరుం
డక్కగొనఁ రతిం గెలిచి డక్కఁ గొనఁ నవమోహనాంగికిఁ.151

*అర్థము :*

చెక్కుల యందమున్, మొగము (యొక్క). చెల్వముఁ = సౌందర్యమును. చన్గవ నీటు = కుచయుగమునందలిసొగసు. వేణితీరు = తలవెండ్రుకల అమరిక. ఎక్కడఁ చూడము = ఇంకే స్త్రీయందూ కనబడవు. అన్నిటికిన్ ఎక్కువది ఏమనఁ = అన్నిటినీ మించిన విశేష మేమంటే. సైకతంబుతోఁ = ఇసుక తిన్నెతో. ఎక్కటి = ఇంకొక సహాయము లేకుండనే. కయ్యమున్ = యుద్ధమును (అనగా ద్వంద్వయుద్ధమును). సలుపు = చేయునట్టి. ఈకటి = ఈ జఘనము. ఒక్కటి = ఒక్కటియే. మరుం డక్కగొనఁ = మన్మథుని వశపరుచుకొనుట కున్నూ. రతిఁగెలిచి = రతీదేవిని జయించి. డక్కఁ = రతియొక్క సామ్రాజ్య సూచకమైన భేరిని (డక్కను). కొనఁ = తీసికొనుటకున్నూ. నవమోహనాంగికిఁ = నూతన యౌవనముతో మోహింపజేసే శరీరముగల (ఈ ఉలూచికి). చాలదే ?

*తాత్పర్యము :*

చెక్కులూ, ముఖమూ, చనుగవా, కొప్పూ, ఈ ఉలూచి కున్నంత అందంగా మరేస్త్రీకీ లేవు. అన్నిటికంటే విశేషమేమిటంటే ఆమె జఘనము ఒక్కటే విశాలమైన ఇసుక తిన్నెతో ద్వంద్వయుద్ధం చేయగలదు. మన్మథుడిని వశపర్చుకోడానికీ, రతిని గెలిచి ఆమె బిరుదు డక్క (భేరిని) తీసుకోడానికీ ఆ కటి ఒక్కటే చాలును అని అర్జునుడు అనుకుంటున్నాడు.

*విశేషము :*

రాజు లొకరినొకరు జయించినప్పుడు ఓడినవారి రాజ్యసూచకాలైన ఛత్రచామరములు భేరి మొదలగు వానిని తీసికొనే ఆచారము ఉంది.

ఇప్పటికీ ఎందరో సంస్థానాధిపతులు తమ దగ్గరున్న భేర్యాదులను ఏ ఏ యుద్ధములలో తమ పూర్వులు గ్రహించారో చెప్పుతుంటారు.

ఢక్కను బ్రద్దల గొట్టడం పండితులలో ఉండేది.

"పగుల గొట్టించి తుద్భట వివాదప్రౌఢి గౌడ డిండిమభట్టు కంచుఢక్క" అని శ్రీనాథ మహాకవి అన్నాడుగదా.

రతిని గెలిచి ఆమె కింతవరకున్న సామ్రాజ్య చిహ్నమును (ఢక్కను) తీసుకుంటుందని భావము.

వేదమువారు "ఢక్కఁ గొనఁగా = ఢక్క అను వాద్య విశేషమును వహించుటకును (జయభేరి వేయించుటకును)" అని వ్యాఖ్యానించారు. కొనన్ అన్న పదానికి ఆ అర్థము కష్టసాధ్యము. రాజుల కొలువులో ఉండిన మన కవి ఈలాటి ఉద్దేశమును కలిగి ఉండనేరడు.

ఎక్కటి - ఒక్కటే అనిగాని అసాహాయ్యముగ అనిగాని అర్థము. కొందరు 'ఎక్కటి కయ్యము' అనగా పెద్ద జగడము అని చెప్పారు. కాని ఎక్కటి అర్థాన్ని ఆలాగు సాగదీయడ మెందుకో తెలియదు. ఎక్కటి కయ్యము - ద్వంద్వయుద్ధము - సలుపుట ధిక్కరించగల సామర్థ్యముండబట్టేకదా.

మోహనాంగుడు — మోహనవిద్యగాని, మోహనమనే బాణముగాని[1] అంగముగా (చతురంగములవంటి పరికరముగా) గలవాడు - అనగా మన్మథుడు. వానిభార్య మోహనాంగి అవుతుంది. అనగా రతీదేవి. కాబట్టి నవమోహనాంగి అంటే క్రొత్తరతి, అనగా, మొదటి రతికి ప్రతి వచ్చిన రతి. ఈమె చేయదగిన పని : తొలి రతిని జయించి మగని వశపరుచుకొనడము. ఆ రెండుపనులూ ఈ పద్యములో ఉన్నాయి—రతిని గెలుస్తుంది; మన్మథుడిని వశపరుచుకుంటుంది.

*అలంకారము* :

యమకము.

1. మన్మథుడి బాణాలు :—

మోహనము, ఉన్మాదనము, సంతాపనము, శోషణము, నిశ్చేష్టాకరణము అని అయిదు.

అని మదిమెచ్చి యొచ్చె మొకయందును లేని మనోహ రాంగముల్
కనుఁగొనిఁ యౌనెకా ! వ్రతముఁ గై కొని యుండెడి నన్ను నేలఁ దో
డ్కొని యిటఁ దెచ్చె నీవెడఁగుఁ గోమలి ? భూజగ మేడ మారు తా
శన జగ మేడ? యెంత ఘనసాహస మింతుల కంచు నెంచుచున్. 152

అర్థము :

అని మదిన్ = మనస్సునందు, మెచ్చి, ఒచ్చెము ఒకయందునులేని = ఒక్కదానియం దయినా కొరతలేని, మనోహరాంగముల్ = మనసు లోగొనగల అవయవములను, కనుఁగొని = చూచి, (అలాగు చూస్తుండగా ఈమోహనాంగి చేసిన సాహసము మనసున పొడమి) ఔనెకా = (ఔనుగాని) అంతా ఇంపుగా ఉన్నదికాని (కద కాదా యొక్క రూపాంతరమే 'కా'), వ్రతము గైకొని = వ్రతమునాచరించుతూ, ఉండెడి నన్ను, ఇటకు, ఏలన్ = తన్ను ఏలుటకుగా, ఈ వెడఁగుఁ గోమలి = ఈవెర్రి పడుచు, తోడ్కొనితెచ్చె = తనతోకూడా తీసికొని వచ్చింది, ఆహా! భూజగ మేడ = మర్త్యలోక మెక్కడ? మారుత అశన జగము ఏడ = గాలి మేపరలగు నాగులలోక మెక్కడ ? ఇంతులకు = స్త్రీలకు, ఎంత ఘనసాహసము! = ఎంత గొప్పతెగువ ఉన్నది, అంచున్ ఎంచుచున్ = తనలో అనుకొనుచు (తరువాతి పద్యముతో అన్వయము).

తాత్పర్యము :

శరీరసౌష్ఠవములో ఏలాటి లోపమూలేని ఆమెను మెచ్చుకొని, 'అంతా బాగుంది కాని, వ్రతనిష్ఠతో ఉన్న నన్ను ఈ వెర్రిపడుచు ఇక్కడికి తీసికొనివచ్చి తన్ను ఏలుకోమంటూ ఉంది. నరలోకమెక్కడ, నాగలోకమెక్కడ ? ఆడవాళ్ల కెంత సాహసముంటుంది' అని అనుకొని ...

విశేషము :

వేదమువారు 'ఏలఁ దోడ్కొని' అన్న దానిలో శ్లేష ఉందని (i) ఎందుకు తెచ్చెను అనీ, (ii) ఏలుటకుఁ దెచ్చెననీ, అర్థము చూపించారు. తొలి అర్థమున తో దో అగుటకు కళ కారణమనీ, శ్లేషయందు అర్థానుస్వారము పాటించరనీ కారణము చెప్పారు.

కాని, ఉలూచి చెప్పిన మాటలన్నీ విన్న తరువాత గూడా 'ఎందుకు' తెచ్చింది అని అనుకోడానికి అర్జునుడు వట్టి మూర్ఖుడు కావాలి.

ఉలూచి "వరియించ నిట దోడికొనుచు వచ్చితి"ననీ, "నీ కురువీర" అనీ, "దృఢాంకపాళిఁ గోరినదానన్" అనీ అక్షరాలా చెప్పింది. ఇంకా ఎందుకు తెచ్చిందని ప్రశ్నించుకుంటాడా ? రెండవ అర్థమే చెప్పుకోవాలి. ఈ 'ఏల' లోని భావము తరువాతి పద్యంతో తేటపడుతుంది.

వ్రతము కై కొని ఉన్నవాడిని తన్నేలుటకు తెచ్చింది. కాబట్టి, 'వెడఁగుఁ గోమలి' అన్నాడు.

కటుత్వం ఏమీ లేకుండా 'వెఱ్రిపడుచు' అని అనడం కొంత సుముఖత్వాన్ని సూచిస్తుంది. అమాయకురాలన్న భావము.

మారుతాశన జగము: మారుతమంటే గాలి. అశనమంటే ఆహారము. మారుతాశనులు = గాలిని ఆహారముగాగలవారు — నాగులు. వారిజగము = నాగలోకము.

*పాఠాంతరము :*

బౌనెకా అనడానికి బదులు 'యోగికా' అని తిరుపతివారూ, 'మౌనికా' అని వేంకట కృష్ణమాచారిగారూ అన్నారు.

*అలంకారము :*

విషమాలంకారము, అర్థాంతరన్యాసము. వృత్యనుప్రాసము.

కాముకుఁడఁ గాక వ్రతినై
భూమిప్రదక్షిణము సేయఁ బోయెడి వానిన్
గామించి తోడితేఁ దగ
వా, మగువ, వివేక మించుకైనన్ వలదా ? 153

*అర్థము :*

మగువ = ఓ కాంతా ! కాముకుఁడన్ కాక = కామముగల వాడనుగాక, వ్రతినై = వ్రతము పూనిన వాడనై, భూమిప్రదక్షిణము, చేయన్, బోయెడివానిన్, కామించి = మోహించి, తోడితేన్ = తోడ్కొని వచ్చుట, తగవా = న్యాయమా? ఇంచుకైనన్ = కొంచెమైనా, వివేకము = యుక్తాయుక్తజ్ఞానము, వలదా = ఉండవలదా ?

*తాత్పర్యము :*

కామములేకుండా వ్రతము పూని భూప్రదక్షిణచేయడానికి పోతూఉన్న నన్ను మోహించి తీసుకురావడం తగునా ? ఉచితమా కాదా అన్న ఆలోచన ఉండవద్దా అని అర్జునుడు అన్నాడు.

*విశేషము :*

కామించడానికి కాముకుడిని తెచ్చుకోవాలి గాని ఉపయోగములేని వ్రతిని తీసుకురావడము వివేకము కాదని సూచన.

కాముకుడు = స్త్రీవాంఛ కలవా డనేకాక, ధనాదివిషయాలయందు కోరిక కలవాడనిగూడా అర్థము. కాముకుడగాక అంటే ఎటువంటి కోరికలేకుండా, నీమముతో ఉండడం-నిష్కామ వ్రతము, సర్వోత్కృష్టము. అటువంటి వ్రతముతో తిరుగుతున్నవాడను అని ఉలూచి అను కొనేలాగా చెప్పడము చమత్కారమే.

ఉలూచి అభిప్రాయము తెలిసింది; ఆమె చక్కదనాన్ని మెచ్చుకున్నాడు. అయినా శృంగారరస సంబంధమైన సంబోధన చేయకుండా 'మగువా' అని మాత్రము అన్నాడు. అంటే వ్రతము పాలించాలన్న ఉద్దేశముతోనే ఉన్నాడన్నమాట.

నావుడు మోమునన్ మొలక నవ్వొలయన్, వలి గబ్బి గుబ్బ చన్
ఠీవికి గాన టించుక నటించు కవుం గనిపింపఁ, బల్కె రా
జీవదళాక్షి "యో రసికశేఖర, యో జన రంజనైక లీ
లావహ రూప, యో నుతగుణా, తగునా యిటు లానతీయఁగన్?154

అర్థము :

నావుడున్ = (అనిఅర్జునుడు) అనగా, మోమునన్ = ముఖమునందు, మొలకనవ్వు = చిరునవ్వు, ఒలయన్ = ప్రకాశించగా(చిరునవ్వునవ్వి), వలి = గుండ్రనై, గబ్బి = బలిసిఉన్న, గుబ్బచన్ = గుబ్బలవంటి చనులయొక్క, ఠీవికిన్ = వైభవమునకు, కానటు = తాళజాలనట్లు, ఇంచుక = కొంచెము, నటించు = అల్లలనాడుచుండు, కవున్ = నడుము, కనిపింపన్ = కనబడు చుండగా (కుచముల బరువును సహింపజాలనట్లు నడుము కొంచెము చలించగా), రాజీవదళాక్షి = తామరరేకులవంటి కన్నులుగల ఉలూచి, పల్కెన్ = ఇట్లు పలికెను : "ఓ రసిక శేఖర = ఓ రసజ్ఞులలో శ్రేష్ఠుడా, ఓ జన......రూప = జనులను రంజించుటే ప్రధానముగాగల విలాసము గలిగిన రూపు వాడా (రూపులోని విలాసము జనులను ముఖ్యంగా సంతోషపెడుతుంది), ఓ నుతగుణా = పొగడబడిన గుణములు గలవాడా, ఇటులు, ఆనతీయఁగన్ = ఆజ్ఞాపించగా (చెప్పుట), తగునా = ధర్మమా ? (కాదని సూచన).

తాత్పర్యము :

అని అర్జును డనగా, చిన్న నవ్వు నవ్వి, స్తనముల భారానికి తాళలేనన్నట్టు నడుము కొంచెము కదులుతుండగా, ఉలూచి "నీవు రసికశ్రేష్ఠుడవు, లోకులను సంతోషపెట్టగలిగిన రూపము కలవాడవు, నీ గుణాలను అందరూ పొగుడుతుంటారే, ఈలాగు అనడం తగునా" అని అన్నదని భావము.

విశేషము :

నన్ను "తోడితేఁదగవా" అని అన్నావే. నీకిటు లానతీయ తగునా అని ఉలూచి బదులు ప్రశ్న. నాకది తగదంటే నీకిది తగదు అని భావము.

స్తనాల బరువు భరించలేక బలహీన మయిన నడుము ఊగులాడుతున్నట్టుందని భావము.

మొలకనవ్వూ, కొను నటింప జేయడమూ విలాసవతుల యొయ్యారములు. తమకార్య సిద్ధికి అవికొంత సాయం చేస్తాయి.

అర్జునుడి వాదనలో బలములేదని ఉలూచి భావించడం చేతనే, ఈ శృంగార చేష్టలకు అవకాశము కలిగింది. కాముకుడను కానన్నది అబద్ధపు వాదనని తెల్పడానికే రసిక శేఖర - అని సంబోధించింది. సరసత బాగా ఎరిగిన వాడవుగావా అని గద్దించింది. తరువాత, నీ సౌందర్యమంతా జనులను రంజింపనేకదా అని తెలుపుతూ, తన్నుగూడ రంజించుట ధర్మమనీ, ఆ వెనుక, సుతగుణు డగుటచేత ఇట్లు ఆనతిచ్చుట తగదుసుమా అనీ ఎత్తి పొడిచింది. ఈ సంబోధనలన్నీ సాభిప్రాయములే.

అలంకారము :

యమకము, పరికరము.

నిను గీతి సాహితీ మో
హన వాణులు సెవులువట్టి యాడింపంగాఁ
గనియుండి "కాముకుఁడఁ
గానని" పల్కిన నాకు నచ్చికౌనె నృపాలా ! 155

అర్థము :

గీతి...వాణులు — గీతి = సంగీతము, సాహితీ = సాహిత్యము అనే, మోహన వాణులు = రంజింపజేసే వాక్కులుగల స్త్రీలు, నిను = నిన్ను, చెవులుపట్టి యాడింపంగాఁ = స్వాధీనుని జేసికొని - చెప్పినట్లు చేయించుకుంటూ ఉండగా, కనియుండి = చూచికూడా, కాముకుఁడగాను = నేను కామించువాడనుగాను, అని పల్కినఁ = అని నీవు చెప్పినంతమాత్ర మున, నృపాలా = రాజా, నాకు నచ్చిక ఔనె = నాకు నమ్మకము కలుగుతుందా !

తాత్పర్యము :

అర్జునా, సంగీత సాహిత్యాలన్న ఇద్దరుస్త్రీలు నిన్ను బాగా వశపరుచుకొని, చెప్పినట్టు చేయిస్తూ ఉండడము చూచిన తరువాత గూడా కాముకుడను కానని నీ వన్నంతమాత్రాన నమ్మ గలనా ? అని ఉలూచి అన్నది.

*విశేషము :*

గీతి, సాహితి, అనే స్త్రీలు (స్త్రీలింగ రూపాలే కవి వాడాడు) స్వాధీనుని చేసుకొన్నారు గదా నీవేలాగు కాముకుడవుగావు ?

చెవులుపట్టి ఆడించడము ఏలాగంటే : చక్కని సంగీతముగాని, కవనముగాని నీచెవిని పడగానే, ఆ గీతా సాహిత్యాలు నీ చెవినిపట్టి తలను, మెప్పుతోఆడించేలాగా చేస్తాయని భావము.

ఈ పలుకుబడిలోని రెండుభాగాలకూ అర్థం చూపించి, పలుకుబడికున్న 'బాగా లొంగ దీసుకున్న' అన్న అర్థాన్ని సమర్థించడము చమత్కారము.

ఈ ఇద్దరు కాంతలూ చెరి ఒక చెవిపట్టుకున్నారని చమత్కారము. స్త్రీలు చెవులుపట్టి ఆడిస్తున్నారంటే తాను చాలా స్త్రీలోలుడు కావాలికదా !

అర్జునుడన్న రెండుమాటలు 1. కాముకుడనుకాను 2. వ్రతినై ఉన్నాను. వీటిలో కాముకుడ కానన్నదానిని ఈ పద్యములో ఖండించి వేసింది.

*పాఠాంతరము :*

'నచ్చికొనెె నృపాలా'కు బదులు 'నమ్మికొనె నృపాలా' అని.

*అలంకారము :*

శ్లేష.

అతులిత విలాస రేఖా
కృతులఁ జవలపించి యితులఁ ద్రిభువన లీలా
వతుల నలయించుటేనా
వ్రతమనఁగా నీకు, రూపవంచిత మదనా? 156

ఈ పద్యములో అర్జునుడన్న రెండోమాట — వ్రతినై యున్నా నన్న దానిని—ఉలూచి విమర్శిస్తూ ఉంది.

*అర్థము :*

రూపవంచిత మదనా = రూపముచేత తిరస్కరింపబడిన మన్మథుని గలవాడా (మన్మథుని తిరస్కరించే సొగసుగలవాడా). నీకు వ్రతమనగాఁ = వ్రతము అనడానికి నీ అభిప్రాయము, అతులిత = తుల (సాటి) లేని, విలాస = శృంగారచేష్టలచేతను, రేఖా = సొంద

ర్యము చేతను, ఆ కృతులన్ = ఆకారము చేతను, వలపించి = మోహింపజేసి, త్రిభువన = మూడులోకములలో ఉండే, లీలావతులకా = విలాసవతులను, ఇటుల, అలయించుటేనా? = కోరికలు పుట్టించి ఆయాసము కలుగజేయుటేనా? మరేదయినా ఉందా? (లేదని భావము).

తాత్పర్యము :

మన్మథుడిని ధిక్కరించగల అందగాడవు. నీకు వ్రతమంటే ఈ మూడులోకాలలో ఉన్న విలాసవతులను నీ రూపురేఖలతో మోహింపజేసి వారిని ఆయాస పెట్టడమేనా? మరేదయినా ఉందా?

విశేషము :

విలాసమూ, రేఖా, ఆకృతీ — మూడు గుణములున్నాయి కాబట్టి, మూడులోకముల లోను అని సూచన. రూపవంచితమదనుడు గనుకనే ఆతనిలాగా, మూడులోకముల నలయించడము.

భూలోకమున ద్రౌపదిని, నాగలోకమున ఉలూచిని, స్వర్గలోకమున ఊర్వశిని అని కవి స్ఫురింపజేశాడు.

అలంకారము :

పరిసంఖ్య.

తెలియనిదానఁ గాను; జగతీవర, ద్రౌపదియందు ముందు మీ
రల సమయంబు సేయుట, ద్విజార్థము ధర్మజు పాన్పుటింటి ముం
గలఁ జని శస్త్రశాల విలుఁ గైకొను, టందు నిమిత్త మీవు ని
శ్చలమతి భూప్రదక్షిణము సల్పఁగ వచ్చుట, నేనెఱుంగుదున్. 157

ఒకరిని మించిన తెలివితేటలతో వారిద్దరూ వాదోపవాదాలు చేసుకున్న తరువాత, ఉలూచి తనకు పూర్వచరిత్రంతా తెలుసుననీ దానిని చెప్పడం వట్టి కాలయాపనే అనీ సూచిస్తూ ఇలా అంటుంది.

అర్థము :

జగతీవర = ఓరాజా, తెలియని దానకాకాను = మీచరిత్ర తెలియనిదానను కాను (మూడురాలను కాను అని గూడా), ద్రౌపదియందు = ద్రౌపదిని గురించి, ముందు = పూర్వము, మీరు, అల సమయంబు = ఆ ప్రతిజ్ఞ (ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్కని కూడి ఉండినపుడు ఇతరులు ఆమె క్రీడాగారముచెంతకు పోరాదన్న ప్రతిజ్ఞ), సేయుట, ద్విజార్థము = బ్రాహ్మణునికొరకు,

ధర్మజు పాన్పుటింటి ముంగలకా = ధర్మరాజు పడక ఇంటి ముంగలకు, చని = వెళ్ళి, శస్త్ర శాలకా = ఆయుధముల సాలనుండి, విలున్ = వింటిని, కైకొనుట = తీసికొనడము, అందు నిమిత్తము, ఈవు = నీవు, నిశ్చలమతికా = దృఢచిత్తముతో, భూప్రదక్షిణము, సల్పఁగకా = చేయుటకు, వచ్చుట, (ఇది అంతా) నేనెఱుంగుదున్.

తాత్పర్యము :

భూప్రదక్షిణ పూర్వకథ అంతా నాకు తెలుసును - మీరేమీ చెప్పనక్కరలేదు అని భావము.

విశేషము :

'మీ రల సమయంబు సేయుట' అని పలికి తన ఉచిత లజ్జను ఉలూచి నిల్పుకుంది.

వివరణలూ విమర్శనలూ సాగించి కాలయాపన చేయనక్కర లేదని తన తత్తరాన్ని ఈ పద్యం ద్వారా ప్రకటించింది.

పాఠాంతరము :

మీరలు నమయంబు సేయుట......

అలసమయంబు అన్న పాఠములోని సారస్యము దీనిలో లేదు. యతి పోతుంది.

చెఱకు విలుకాని బారికి వెఱచి నీదు
మఱుఁగుఁ జొచ్చితిఁ జేపట్టి మనుపు నన్నుః
ప్రాణ దానంబు కన్నను వ్రతము గలదె ?
యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార ? 158

వ్రతాలలో ఉత్తమమైన వ్రతము ఏదో ఉలూచి తెలుపుతూ ఉంది.

అర్థము :

చెఱకు విలుకాని = చెరకువిల్లు గలిగిన మన్మథునియొక్క, బారికిన్ = బాధకు, వెఱచి = భయముచెంది, నీదు మఱుఁగున్ చొచ్చితికా = నీ శరణు చొచ్చాను, చేపట్టి = రక్షణనిచ్చి - పాణిగ్రహణముచేసి అని గూడా, మనుపు నన్ను = నన్ను బ్రతికించు, లేకపోతే, వాడిబారినిబడి చావక తప్పదు, ప్రాణదానంబు కన్నను = ప్రాణదానాన్ని మించిన, వ్రతము కలదె = నీవేమో వ్రతమంటున్నావు, అన్ని వ్రతములకన్న ఈప్రాణదాన వ్రతముమేలు, దీనినే అవలంబించు,

నృపకుమార = ఓరాజకుమారా. ధర్మపరుఁడవు = ధర్మమునందాసక్తి కలవాడవు - ధర్మపరుఁడవు = ధర్మరాజును మీది వానిగా గలవాడవు (ధర్మజుని తరువాతి వాడవు - తమ్ముడవు.) ఎఱుఁగవే = ఈ వ్రతరహస్యమును తెలిసికోలేవా ?

*విశేషము :*

ఈ మాటలలోనే ఉలూచి తాను దిక్కుమాలిన పక్షిననీ, ఒక చిలుకవంటి దాననసీ, తెలుపుతూ ఉంది. దానికున్న ఆపదలు పంజరబంధనము, లేక వేటకాని చేత చావు.

చెఱకు = పంజరములో బంధనానికి. విలుకాని బారికిన్ = బోయవాని హింసకు. వెఱచి = భయపడి. నీదు మఱుఁగుకు = నీచాటును. చొచ్చితిన్ = ప్రవేశించాను (దాగున్నాను). చేపట్టి = చేతితో పట్టుకొని (చిలుకవలె గ్రహించి). మనుపునన్ను = నన్ను పెంచుకో. ఆరూపంగా నాకు ప్రాణదానము చెయ్యి.

ఇక్కడొక్కమాట చెప్పవలసుంది. అర్జునుడు ఒక సంవత్సరం భూప్రదక్షిణ వ్రతం పట్టాడు. ఆ సంవత్సరములో బ్రహ్మచర్యం నిష్ఠగా పాటించాలని ధర్మశాస్త్రం. ఈ ఏడు తిరగక ముందే ఉలూచి తన్ను తీసుకొనివచ్చింది. ఉలూచి అందచందాలుకల కాంత అని గ్రహించాడు. కాని, ఆ వ్రతనియమము అడ్డుగా కనిపిస్తుంది. ఆ ప్రతిబంధకం లేకుండా ఉలూచి "ప్రాణదానంబుకన్నను వ్రతము గలదె ?" అని ధర్మనిర్వచనం చేస్తుంది. మనకావ్యములో పర్యవసానము వారిద్దరి కలయిక.

పంౘ్రెండు నెలలు దాటకముందే ఈ కల్యాణము జరిగినట్లు మహాభారతం గూడా అంగీకరించింది. ఆ పురాణములో ఈ నియమభంగము సమర్థించడానికి నన్నయభట్టు,

"ఎఱుంగవి దానఁగాను. సర్వతీర్థసేవనంబును సర్వవ్రతంబులు సలుపుటయును సర్వదానధర్మ క్రియలును ప్రాణదానంబుతో సమానంబులుగావు, నామనోరథంబు విఫలం బయిన మనోజానలంబునం బ్రాణ పరిత్యాగంబగుం గావున నన్ను రక్షింపుము. దీన నీకు వ్రతభంగంబు గాదనిన నర్జునుండు దాని మనోరథంబు సలిపి యారాత్రి నాగభువనంబున వసియించి నాగకన్యకయం దిరావంతుండను కొడుకుం బడసి......" అన్నాడు.

కాబట్టి వ్రతభంగదోషము లేదనడానికి మహాభారత ప్రమాణము గూడా ఉందన్నమాట.

*అలంకారము :*

సమాసోక్తి, శ్లేష.

నాయమె నీకు మేల్పడిన నాతి నలంచుటః యంత్ర మత్స్యముగా
మాయఁగఁజేసి ముగా ద్రుపదనందన నేలవెః యంగభూ పతా
కాయత యంత్రమత్స్య మిపు డల్లనఁ ద్రెళ్ళఁగనేసి యేలుకో,
తీయఁగఁ బంచదార వెనుతీయఁగఁ బల్కి ననుగా ద్వితీయఁగన్.159

అర్థము :

మేల్పడిన = వలచిఉన్న, నాతిగా = కాంతను, అలంచుట = ఆయాసపెట్టుట, నీకు, న్యాయమే = ధర్మమా. ముగా = ఇంతకుపూర్వము, యంత్రమత్స్యముగా = చేపవలె కట్టబడిన యంత్రమును, మాయఁగఁజేసి = కనబడకుండా పడినట్లుచేసి, ద్రుపదనందనగా = ద్రుపదరాజు కూతురగు ద్రౌపదిని, ఏలవె = ఏలుకోలేదా ? (అలాగే) అంగభూ...మత్స్యము, అంగభూ = శరీరమున పుట్టినవాడగు మన్మథుని యొక్క, పతాక = ధ్వజమున్నూ, ఆయత = గొప్పదైన, యంత్ర = సాధనమున్నూ అగు, మత్స్యము = చేపను, ఇపుడు, అల్లనన్ = అనాయాసముగ, త్రెళ్ళఁగనేసి = తెగిపడునట్లు కూల్చి, పంచదార = చక్కెర, వెనుతీయఁగ = వెనుకబడేటంత, తీయఁగగా = మాధుర్యముతో, పల్కి = మాటనాడి, ననున్, ద్వితీయగన్ = భార్యగా, ఏలుకో = ఏలుకోవాలి.

తాత్పర్యము :

వలచిన కాంతను ఆయాసపెట్టడం ధర్మంకాదు. ఆనాడు మత్స్య యంత్రాన్ని పడగొట్టి ద్రౌపదిని ఏలుకున్నట్టే, ఈనాడు మన్మథుడి ధ్వజమైన మత్స్యాన్ని అనాయాసంగా భగ్నంచేసి, పంచదారకన్న తీయనైన మాటతో నన్ను భార్యగా ఏలుకోవడం న్యాయము అని ఉలూచి అంటుంది.

విశేషము :

ఇంతకుముం దేలాగుచేశాడో ఇప్పుడు గూడ అట్లే యంత్ర మత్స్యమునేసి ఏలుకో వడంలో కొత్త ఏమీ లేదనీ, పాతపాఠమే అనీ భావము.

ద్వితీయఁగన్ = భార్యగను అనేకాక, రెండవదానిగను (ద్రౌపది మొదట ఉన్నదికదా!) అని గూడ చమత్కారము.

పంచదార : పంచ = అయిదుగురకు, దార = భార్య అని అర్థంచెప్పుకొని "పంచదార" అంటే ద్రౌపది అని కవి చమత్కరించా డనవచ్చును. ఆమె వెనుతీసేలాగా తన్ను రెండో భార్యగా అంగీకరించమని భావము.

ఏలుకొనుము అనడానికి ఏలుకో అనడం అడ్డులేకుండ ఏలుకొనుము, అన్నట్టు ధ్వనించ డము చమత్కారమే.

యం(త్రము - కొందరు యం(త్ర మత్స్యమనగా కపటపుచేప అంటారు.

అలంకారము :

యమకము, శ్లేష.

అనుడు నుడురాజకుల పా
వనుఁడు "సమస్తమ్ము నెఱుఁగు వలతివి గద, యీ
యనుచితము దగునె ? పరసతి
నెనయుట రాజులకు ధర్మమే యహి మహిళా ?" 160

పై వాదోపవాదాలవల్ల అర్జునుడు సుముఖుడయినా, ఉలూచి తన్ను వలచిన కాంత కాబట్టి ఆమెను మరికొంత ఆడిస్తున్నాడు.

అర్థము :

అనుడున్ = అని ఉలూచి చెప్పగా, ఉడురాజకుల పావనుఁడు = నక్ష(త్రములకు అధిపుడైన చం(దుని యొక్క కులమును - చం(ద్రవంశాన్ని - పవి(త్రము చేసిన వాడు - అర్జునుడు, సమస్తమ్ముఁ = అన్ని విషయాలను, ఎఱుఁగు వలఁతివిగద = తెలిసినట్టి నేర్పరివిగదా, అహిమహిళా = ఓ నాగకాంతా ! పరసతిఁ = ఇతరుడిభార్యను (ఇతర జాతిస్త్రీని అని గూడ), ఎనయుట = పొందుట, రాజులకు ధర్మమే? ఈ యనుచితము = ఉచితముకాని ఈపని, తగునే = న్యాయమా?

తాత్పర్యము :

ఇన్ని విషయాలూ తెలిసినదానవు కదా ! ఉత్తమవంశములోని రాజులు 'పరసతిని' పొందుట తగునా ? పాపముకాదా ! అని అర్జును డన్నాడని భావము.

విశేషము :

అర్జునుడు ఇంతకుముందు చూచినదాన్ని బట్టీ, ఉలూచి చెప్పగా విన్నదాన్ని బట్టీ ఆమె-అవివాహిత అని తెలుసుకొనే ఉండాలి. కాబట్టి 'పరసతి' అన్నప్పుడు తన ఊహలో జాతి వ్యత్యాసమే కాని పురుషవ్యత్యాసము లేదని మనము ఊహించుకోవాలి.

అయినా ఉలూచి మా(త్రము 'ఇతరుడిభార్య' అన్న సాధారణార్థముతోనే తరువాతి పద్యములో (ప్రత్యుత్తర మిచ్చింది.

ఇది గూడా ఒకవిధంగా మంచిదే. ఊహలతో నిశ్చయించడంకంటే ఆమె ముఖతా వినడం గట్టి (ప్రమాణముగదా.

కాని ఈ పద్యములో పరసతి అన్నప్పుడు ఇతరజాతి కాంత అన్న అర్థముతోనే అర్జును డన్నా డనడం సమంజసము.

ఈ ఊహకు రెండు బలమైన ఆధారాలున్నాయి :

1. అహిమహిళా - పాపపూబోడీ అని పిలుస్తున్నాడు. జాతివ్యత్యాసము గర్భితము కాకపోతే ఈ సంబోధనము పేలవమున్నూ, మన కవి కనర్హమున్నూ అవుతుంది.

2. ఈ ప్రశ్నకు ఉలూచి ఇతరుని భార్య అన్న ఊహతో బదులు చెప్పింది కాని, తన ఊహకు కాదని, ఈప్రత్యుత్తరము విన్న తరువాత 165 వ పద్యములో అర్జునుడు తన ఊహను స్పష్టంగా వెల్లడి చేశాడు.

ప్రశ్నలో ద్వంద్వార్థ ముండడంవల్ల మనము కోరని బదులు వచ్చినప్పుడు దాన్ని విన్న తరువాత మన మొదటి ప్రశ్ననే మరింత స్పష్టంగా అడుగుతాముగదా !

ఉలూచి ఇంతవరకు చెప్పిన మాటలన్నీ విన్న తరువాత 'ఇతరుని భార్య' అన్న అర్థంతో అర్జునుడు ప్రశ్న వెయ్యకూడదు. ఆ ప్రశ్న అనవసరము. ఈ భావంతోనే ఉలూచి 'అనవల సంటి' = అనవసరప్రశ్న అంటూ చిన్న చెంపపెట్టు పెట్టింది.

చాల చక్కని పద్యమని రసజ్ఞు లంగీకరిస్తారని నమ్ముతాను.

ఉడురాజకుల పావనుఁడు : మనకవి అర్జునుడిని ఈలాగు పేర్కొన్నాడు. అర్జునుని సంతతి వలననే చంద్రవంశము నిలబడినది కాబట్టి ఇతడు కులపావనుడే అవుతాడు.

అలంకారము :

మూడు 'నుడు'లతో ముచ్చట పడ్డాడు కవి.

అనవిని పాఁప పూపజవరా లెదలో వల పోపలేక, యా
తని తెలి ముద్దు నెమ్మొగము దప్పక తేట మిటారి కల్కి చూ
పునఁ దనివారఁ జూచి, "నృపపుంగవ, యన్నిట జాణ వూరకే
యనవల సంటిగా కెఱుఁగవా యొకమాటనె మర్మకర్మముల్ ? 161

అర్థము :

అనఁగా, విని, పాఁప = పాముజాతిదైన, పూప జవరాలు = లేతవయసు పడుచు, ఎదలో వలపు = హృదయములోని మోహమును, ఓపలేక = ఓర్చుకోలేక, ఆతని, తెలి = నిర్మలమైన, ముద్దు నెమ్మొగము = ముద్దు గలుగ జేసే నిండైన ముఖమును, తప్పక = ఏకాగ్రదృష్టిని, తేట

మిటారి కల్కి చూపునన్ = కాంతీ ఒయ్యారమూ కలిగి సొగసైన చూపుతో, తనివారన్ = తనివితీరునట్లు, చూచి, "నృపపుంగవా = రాజశ్రేష్ఠుడా, అన్నిటన్, జాణవు = నేర్పరివి - గడుసువాడవు, ఊరకే = ఊసుపోక, అనవలసి + అంటి = ఏదో అనాలని అన్నావు, కాక = అంతేకాని, ఒకమాటనె = ఒక్కమాటవల్లనే, మర్మకర్మముల్ = రహస్యముగా ఉండే భావాలు, నీ వెఱుఁగవే = గ్రహించలేకుండా ఉన్నావా ?

తాత్పర్యము :

అర్జునుడన్నమాటలు విని ఉలూచి అతని ముఖము అట్టే చూచి, రాజశ్రేష్ఠుడా ! ఊసుపోకకు ఏదో అనాలని ఈమాట అన్నావుగాని, నీకు తెలియదా హృదయాలలో ఉండే భావాలెటువంటివో ! అని భావము.

విశేషము :

పరసతిని అంటే 'ఇంకొకని భార్యను' అనే ఉలూచి అర్థము చేసుకుంది. దానితో ఉలూచి మనసులో ఆందోళన ఆరంభమయింది. నిజంగా ఆ అభిప్రాయము అతనికుందా, లేక, తమాషాకు అలా అన్నాడా ?

144 వ పద్యములో 'భుజంగమరాజ కన్యకన్' అని తను అవివాహితనని చెప్పిందే; వరించి తీసుకువచ్చా నన్నదే; 159 వ పద్యములో తన్ను 'ద్వితీయగన్ = భార్యగా, ఏలుకో అన్నదే.

వాటిలో ఏ ఒక్కమాటవల్ల నయినా తాను అవివాహిత అని తెలుసుకో గలిగి ఉండాలి గదా ! ఈ అడగడ మెందుకు ?

ఊరకే అనవలసి అన్నాడా ?

అర్జునుడి మొగము తప్పక చూడడం - ఈతని భావమేమయి ఉంటుందో తెలుసుకో డానికే ఏమో !

ఇది ఇలా ఉండగా, అర్జునుడు "సమస్తంబు నెఱుఁగు వలతివిగద" అని తనమీద ఒక విసురు విసిరాడు. మాటల నేర్పుగల ఉలూచి, ఆ విసురుకు బదులు విసురు విసరకుండా ఉంటుందా ? అందుకే తన ప్రత్యుత్తరంలో "అన్నిట జాణవు - అన్నీ తెలిసిన నేర్పరివి", ఒక్కమాటవల్ల తెలుసుకోవలసిన విషయాన్ని అడుగుతావా ? అని విసిరింది.

ఎప్పుడెప్పుడని ఉన్న ఉలూచికి ఇదంతా వట్టి కాలయాపనగా తోచింది, కాబట్టి 'ఓపలేక' పోయింది.

తెలి ముద్దు నెమ్మొగము - తెల్లని చక్కని ముఖము అని వేదమువారు అర్థం చెప్పారు. కాని, అర్జునుడు ఘననిభాంగుడు-నల్లనివాడు. కాబట్టి తెల్లని అని చెప్పడం తగదు. వైవర్ణ్యానికి కారణము గూడ కానరాదు. అందుచేత నిర్మలము అన్న అర్థమునే గ్రహించాము.

"కన్నియఁ గాని వేఱొకతెఁ గాను; మనోహరరూప, నీకు నే
జన్నియవట్టి యుంటి నెలజవ్వన మంతయు నేఁటిదాఁక; నా
కన్నుల యాన; నావలపు కస్తురి నామము తోడు; నమ్ము; కా
దన్నను, నీదు మోవి మధురామృత మానియు బాససేసెదన్. 162

ఆ విసురు అర్జునుడి మీద విసిరి 'పరసతి' అన్న విషయాన్ని గురించి సమాధానము ఇస్తూఉంది.

అర్థము :

మనోహరరూప = మనసును దొంగిలించే రూపు గలవాడా, కన్నియన్ = అవివాహితను, కాని వేఱొకతెన్ కాను, నేఁటిదాఁకన్ = ఈదినము వరకూ, ఎలజవ్వన మంతయుణ = నా లేత ప్రాయమంతా, నీకు = నీకొరకు, జన్నియవట్టి ఉంటిణ = ముడుపు (దేవతలకు మీదుకట్టినట్లు) కట్టి ఉన్నాను. నా కన్నులయాన = నాకన్నులమీద ఒట్టు, నా వలవు = నా ప్రేమాస్పదమైన, కస్తురి నామముతోడు = (ఇదిఒక ఒట్టు), నమ్ము, కాదన్నను = ఈ ఒట్టులు పనికిరా వంటే, నీదు మోవి (యందలి) మధురమైన, అమృతము = విషమును, అనియు = త్రాగిగూడా, బాస సేసెదన్ = ప్రమాణము చేస్తాను.

తాత్పర్యము :

నేను అవివాహితను గాని వేరొకతెను కాను. నా కన్నులమీదా, నాకస్తురి నామముమీదా ఒట్టుపెట్టుకొని చెప్పుతున్నాను. నా యవ్వన మంతా ఈవేళదాకా, నీకోసం ముడుపుకట్టి ఉన్నాను. ఈ ఒట్లు పనికిరావంటే నీ అధరములో ఉన్న తీయనివిషము తాగి గూడా ప్రమాణం చేస్తాను - నీ వంగీకరించు అని భావము.

విశేషము :

ఈ పద్యములో ఉలూచి చాలా దూరాలోచనతో మాటలాడుతూ ఉంది.

నేను కన్యను (అవివాహితను); ఇంకే సాంగత్యమయినా చేసిన దాన నమకుంటావేమో, నా యవ్వనమంతా నీకోసం ఈనాటిదాకా మీదుకట్టి ఉంచాను అని ఉలూచి అన్నది.

ఈమాట రుజువు చెయ్యడానికి అవకాశములేదు కాబట్టి ఒట్టుపెట్టుకుంటుంది - ప్రమాణం చేస్తుంది.

ప్రమాణాలు ప్రేమాస్పదమైన విషయాలు ముట్టుకొని గాని, దేవాలయాలలోని పవిత్రమయిన వస్తువులను ముట్టుకొని గాని చేస్తారు.

నా కన్నులయాన అంటే ఇందులో అసత్యముంటే నాకన్నులకు దూరమయిన దాన నవుతానని, పోగొట్టుకొన్న దాన నవుతాననిభావము. అలాగే నే నసత్యము చెప్పిఉంటే నా ప్రేమాస్పదమైన కస్తురినామాన్ని పోగొట్టుకున్న దానను – మాంగల్యానికి దూరమైన దాన నవుతాను.

ప్రమాణాలు మరొకవిధంగా కూడా ఉన్నాయి. అగ్ని, నీరు, విషము ఈలాటి వస్తువుల వల్ల ఏలాటి బాధ పొందకుండా ఉండి దోషములేదని రుజువు[1] పరచడము.

''కాదనినఁ'' నేను చెప్పిన ప్రమాణాలు నీకు పనికిరా వంటే, రెండవ విధమైన ప్రమాణము, విషము తాగి చేస్తాను. (అమృతము అంటే విషము అన్న అర్థం గూడా ఉంది) నీ అధరామృత మియ్యి అన్నది. ఈలాగైనా అధరపానము గలుగుతుందని ఆశించిందంటారా ;

వలపు కస్తురినామము – పరిమళము గల కస్తూరిబొట్టని కొందరు అర్థంచెప్పారు. కస్తురికి వాసన ఉన్నదని అర్జునుడికి చెప్పాలా ? ఒట్లు ప్రేమాస్పదమైన విషయాలపై నే పెట్టుకుంటారు. కాబట్టి ప్రేమాస్పదమైన కస్తూరిబొట్టు అని అర్థము చెప్పుతున్నాము.

మనోహరరూప అని అర్జునుడిని సంబోధించినట్టు చెప్పాము. అలాకాక మనోహర రూపన్ = మనోహరమైన రూపము కలదానను అని చెప్పుకోవచ్చును. అప్పుడు పద్యములోని మొదటిభాగ మంతా ఉలూచిని గురించే అవుతుంది–కన్నెను, మనోహరరూపను, జన్నియబట్టిన దానను.

'అనిట బాసచేసెదన్' అని ఒకపాఠము–ఇక్కడ "ఇట"వల్ల కలిగిన లాభము కానరాదు; "అనియు" అని అంటే బాగుంటుంది. వ్యాకరణసూత్రం బాధా ఉండదు.

"ఇలపయి మత్స్యయంత్ర మొక యేటున నేసి సమస్త రాజులన్
గెలిచిన మేలువార్త లురగీ వరగీతిక లుగ్గడింప, నీ
నులఁ గడు చల్లఁగా విని, నినుఁ వరియింప మనంబు గల్గి, నీ
చెలువము వ్రాసి చూతు నదె చిత్తరువందు ననేక లీలలన్. 163

ఈ కాలయాపన సహించలేక ఉలూచి 'నీవడగడమూ నేను సమాధానము చెప్పడమూ ఎందుకు; ఉన్నదంతా మర్మములేకుండా చెప్తాను విను, అన్నట్టు చెప్పుతూ ఉంది.

1. ఈలాగున రుజువుచేయడాన్ని ordeal by fire, water or poison అని అంటారు. ఇది అనేక విదేశాలలో గూడా ఉండేది. ఇప్పుడూ కొన్ని ప్రాంతాలలో లేకపోలేదు. సీతాదేవి నిర్దోషి అని రుజువు చేయడానికి అగ్నిపరీక్ష చేయడము ఈ పద్ధతి లోనిదే.

అర్థము :

ఇలపయిన్ = భూమిమీద (మాటలాడుతున్నవారు నాగలోకములో ఉన్నారని మరవరాదు), మత్స్యయంత్రము, ఒక యేటునన్ = ఒక్క దెబ్బతో (అవలీలగా), ఏసి = పడగొట్టి, సమస్త రాజులన్ = అప్పుడు యుద్ధమునకు వచ్చిన రాజుల నందరినీ, గెలిచిన = నీవు జయించినావన్న, మేలువార్తలు = శుభవార్తలు, ఉరగీ వరగీతికలు = నాగకాంతల యొక్క శ్రేష్ఠమైన పాటలు, ఉగ్గడింపన్ = కొనియాడుతుండగా, వీనులన్ = చెవులతో, కడుచల్లగాన్ = మిక్కిలి ఆనందంతో, విని, నినున్, వరియింపన్ = వరించుటకు, మనంబు గల్గి = అభిప్రాయము కలిగి, నీ చెలువమున్ = నీ అందమును, చిత్తరువందునన్ = చిత్రపటమునందు, అనేక లీలలన్ = అనేక విధములైన విలాసములతో, వ్రాసి చూతున్ = చిత్రించి చూచుకుంటూ ఉంటాను, అదె = అవిగో ఆ చిత్రపటములు, (అని ఆ చిత్తరువులు చూపించింది).

తాత్పర్యము :

భూలోకములో మత్స్యయంత్రా న్నొక్కదెబ్బతో పడగొట్టి, ఎదిరించిన రాజులనందరినీ ఓడించావన్న వార్తను మా నాగజాతి కాంతలు పాడుతూ ఉండగా విని, నిన్నే వరించాలని నిశ్చయించుకొని, నీ విలాసమంతా ఊహించి బొమ్మలు వ్రాసి చూచుకుంటూ ఆనందిస్తుంటాను. చూడు, అవిగో చిత్రపటాలు అని ఉలూచి వాటిని చూపించిందని భావము.

విశేషము :

ఇలపయి—పాదపూరణము కాదు; సార్థకము.

నాగకాంతలు పాడిన గీతికలు అర్జునుడిని గురించి కాబట్టే ఉలూచికి వర = శ్రేష్ఠములని భావము.

వీనులన్ : ఈమాట అనవసరంగా కనబడుతుంది. వినడం వీనులతోనేకదా ? నాగులు సహజంగా కనులతోనే వింటాయి. అందుకే వాటిని 'చక్షుశ్రవము' లంటారు. అయినా మరింత చక్కగా వినడానికి ప్రత్యేకంగా కామరూపాలలోని చెవులు కలిగి ఉలూచి విన్నదనడము సమంజసము.

మేలువార్తలు అర్జునుడి పరాక్రమ వార్తలన్నమాట. కేవలము అందచందాలనే వరించిన దానను కాను అని సూచించింది.

పాటలలోని వర్ణనలనుపట్టి అర్జునుడికి ఒక రూపము కల్పించ గలగడం ఉలూచి ఊహాశక్తికి నిదర్శనము.

'అనేక లీలలన్' అనడంవల్ల అర్జునుడు మత్స్యయంత్రము కొడుతున్నట్టూ, రాజులతో యుద్ధము చేస్తున్నట్టూ మాత్రమేకాక, తనతో సంతోషంగా వినోదిస్తున్నట్టుగూడా అనుకోవాలి.

ప్రేమాస్పదులు దూరముగా ఉన్నప్పుడు చిత్రలేఖన హృదయవేదనను చల్లారుస్తుంది కదా ! చిత్తరువు చూస్తూ ఉంటానని చెప్పినందువల్ల తానెంత హృదయవేదన పొంది ఉండేదో అర్జునుడు గ్రహించగలడు.

సాధారణ పరిస్థితులలో ఈలాగు తాను పడిన అవస్థలను ఏ విలాసవతిగూడా చెప్పుకోదు. ఇది అసాధారణ పరిస్థితి! అర్జునుడు ప్రశ్నించడం మొదలుపెట్టాడు. కాబట్టి మర్మం లేకుండా ఉన్న సంగతి ఉలూచి చెప్పివేస్తూ ఉంది.

అలంకారము :

ఉరగీ వరగీ - శబ్దాలంకారము.

ఈ క్రింది పద్యములో మరికొంత 'చెప్పరాని విషయం' గూడ ఉలూచి చెప్పుతూ ఉంది.

"చెప్పెడి దేమి నావలపు సేసిన చేఁతలు ? కొల్వులోన ని
న్నెప్పుడు గంటి నప్పుడ పయింబడ నీడిచెఁ; నిల్వఁ బడ్డపా
టప్పు డదెంతయైన గల; దట్టి హళాహళి కింత సేపు నీ
వొప్పెడిదాఁకఁ దాళుట కయో! మది మెచ్చవుగా నృపాలకా." 164

అర్థము :

నావలపు = నాయనురాగము, చేసిన, చేఁతలు = పనులు, చెప్పెడిదేమి ? = చెప్పనలవి కాదు, కొల్వులోనన్ = గంగానది ఒడ్డున మీవారితో ఉండగా, నిన్నెప్పుడు గంటిన్ అప్పుడ = నిన్ను చూచిన తక్షణమందే, పయింబడన్ = నీమీద బడుటకు, ఈడిచెఁ = నన్ను (నావలపు) మిక్కిలి ప్రేరేపించింది, (అపని ఉచితముగాదని) అప్పుడు, నిల్వఁ = ఆగుటకొరకు, పడ్డపాటు = నేనుపడినశ్రమ, అదెంతయైనగలదు = ఎంతయోకలదు - మిక్కిలి ఎక్కువ, అట్టి హళాహళికి = అంతబలీయమైన తత్తరాన్ని అణచుకుంటూ, ఇంత సేపు, నీవు ఒప్పెడిదాకఁ = నీ వంగీకారం తెలిపినంత వరకూ, తాళుటకు = ఓర్చి ఉండుటకు గూడ, మదిన్ మెచ్చవుగా = మనసులో మన్నింపవుగదా, నృపాలకా, అయ్యో !

తాత్పర్యము :

గంగాతీరాన నిన్ను చూచినప్పుడే అమాంతంగా నీమీద పడాలని గట్టిగా బుద్ధికలిగింది. దాని విసురు నాపుకోడానికి నేనుపడ్డ శ్రమ ఇంతంతకాదు. ఇప్పటివరకు - నీవు అంగీకారం తెలిపినంతవరకు - ఓర్చి ఉన్నందుకైనా హర్షించరాదా ?

*విశేషము :*

చెప్పరాని ఈలాంటి రహస్య విషయంగూడా ఉలూచి చెప్పడంవల్ల తానెంతగా తత్తర పడుతూ ఉందో, కాలయాపన ఎంత దుర్భరంగా ఉందో అర్జునుడికి తెలియపరుస్తుంది.

'తాళుటకయో ! మది మెచ్చవుగా నృపాలకా' అన్నందువల్ల, 'అందచందాలకు మెచ్చక పోయినా నా ఓర్పుకయినా సంతోషించి నన్నంగీకరించవా' అన్న భావము కనబడుతుంది.

అనిన 'ఫణిజాతి వీ, వేను మనుజజాతి,
నన్యజాతిఁ బ్రవర్తించు టర్హ మగునె ?
ఏల యీ కోర్కె ?, యనిన రా చూలి కనియెఁ
జిలువ చెలువంపుఁ బల్కులఁ జిలువ చెలువ. 165

పరసతి అనినప్పుడు తన ఉద్దేశానికి తగిన ప్రత్యుత్తరము రాలేదనీ, ఇంకా ఉలూచిని మరి కొంత ఆడించాలనీ ఈ ప్రశ్న.

*అర్థము :*

అనినన్, ఈవు ఫణిజాతివి = నీవు పాముజాతివి, ఏను మనుజజాతిన్ = నేను మనుష్యుల జాతివాడను, అన్యజాతిఁ = ఇతరజాతితో, ప్రవర్తించుట = క్రీడించడము, అర్హమగునె = (నీకుగాని నాకుగాని) కూడదుకదా, ఏల యీ కోర్కె ? అనినన్, రాచూలికి = రాజకుమారునికి, చిలువ చెలువ = నాగకన్యక, చిలువ...పల్కున్ = నాగుపామువంటి అందముకల మాటలతో, అనియెఁ = ఈ క్రిందివిధంగా చెప్పెను.

*విశేషము :*

'పరసతి' అని అన్నందుకు ఉలూచి 161 వ పద్యములో విసిరిన విసురును తప్పించు కోడానికి 'పరసతి అన్నప్పుడు పరజాతి సతి అనే నా ఉద్దేశము', అన్నట్టుగా ఉంది ఈపద్యము.

అంతేకాదు; ఉలూచి తన్ను వలచిన కాంత. తత్తరమూ, ఆవేశమూ అంతా ఆమెవంతు. అర్జునుడు తటస్థంగా ఉండగలడు; ఆమెను ఈలాంటి ప్రశ్నలతో ఆడించవచ్చును. ఆ వినోదము గూడా ఒకవిశేషమే.

రా = రాయి. చూడు : (రాకొమరు నెఱులు నీలపు రా కొమరు నిరాకరించు-180వ పద్యము.) కాబట్టి, రాచూలి = రాతిబిడ్డ - అతికఠినుడు అని ఆ సమయమున ఉలూచికి తోచిం దనవచ్చును. ఆ భావమే తరువాతి పద్యములో, 'నీమన సొక్కచే కరగనేరదు గాని' అని చెప్పింది.

చిలువ చెలువంపుఁ బలుకులఁ జిలువచెలువ : ఇది చక్కని శబ్దాలంకారమున్న చరణము. వ్యాఖ్యాతల కిది కొంచెము శ్రమ కలుగ చేసింది.

వేదమువారు 'చిలువ చెలువంపుఁ బల్కులన్ = చిలువలు పలువలు గల విలాసముతోఁ గూడుకొన్న పల్కులచేత, అని వ్యాఖ్యానించారు.

బులుసువారు గూడా 'చిలువలు, పలువలు, కలిగి చమత్కారమగు మాటలతో, అని వ్రాశారు.

నోరి వారు గడుసు తనముతో 'చిలువచెలువ = నాగకన్యక, చెలువంపు పల్కులన్ = అందమయిన మాటలచేత' అని మాత్రము చెప్పి, ఒక 'చిలువ'ను మింగివేశారు.

ఆ చిలువలూ పలువలూ ఏమిటో, అవి ఉలూచి పలుకులలో ఎక్కడ కనిపించాయో, చిలువలూ పలువలూ అన్న అర్థము ఏ మాటనుబట్టి చెప్పారో...బులుసువారు గాని, వేదమువారు గాని చెప్పలేదు.

అన్ని ప్రతులలోనూ ఇదే పాఠముగాని, వేరుపాఠములేదు. చేమకూర అభిరుచులు తెలిసిన మనము దీని కింకొక పాఠముండదని నిర్ధారణ చేయవచ్చును. కాబట్టి సరియైన అర్థం కోసం ప్రయత్నించాలి.

చిలువ = నాగుపాము. చాల అందమయిన జంతువు. ఆ పడగా, కదలికా, శరీరమూ, ఎంత చూచినా చూడాలనే ఉంటుంది. కాని — భయము.

దీనినిబట్టి చిలువ [1]చెలువము అంటే 'భయము కలిగించే అందము' అవుతుంది. అటు వంటి పలుకులు అంటే, అందముగా వినడాని కింపుగా ఉండి, భయము కలిగించే భావముగల మాటలన్నమాట. అది ఎలాగో చూదాము.

దీనితరువాత ఉలూచి చెప్పే రెండు పద్యాలలోనూ, ఆమె అభిలాష, సమర్థన, దీనత్వము అన్నీ అందంగానే ఉన్నాయని మన మంగీకరిస్తాము.

ఆ మాటలలో గర్భితంగా ఉన్న భావము (మరణమే నాకు గత్యంతర మన్నభావము) భయాన్ని కలిగిస్తుంది.

---

1. గ్రీకు పురాణగాథలలో 'మెడూసా' అని ఒక విపరీత స్త్రీ ఉంది. అది చాలా అపూర్వమైన అందము కలది. దాని ముంగురులు జీవంతో కదులుతూ ఉండే పాములు. దానిని చూచినవారు పాషాణాలుగా మారిపోతారు. దీనిని విదేశీయులు terrible beauty అంటారు. మన 'చిలువ చెలువము' అలాంటి 'టెరిబుల్ బ్యూటీయే' (భయంకర సౌందర్యము).

చిలువ = a wild duck (అడవి బాతు) అని బ్రౌను నిఘంటువు. కాని మనకు దాని అందమేమిటో తెలియదు.

*అలంకారము :*

యమకము.

"ఏమనఁ బోయెదం దగుల యెంచక నీ విటులాడఁ? దొల్లి శ్రీ
రామ కుమారుఁడైన కుశరాజు వరింపఁడె మా కుముద్వతిన్,
గోమల చారుమూర్తి పురుకుత్సుఁడు నర్మదఁ బెండ్లియాడఁడే?
నీ మన సొక్కటే కరఁగనేరదు గాని నృపాలకాగ్రణీ. 166

*అర్థము :*

నృపాలకాగ్రణీ = ఓరాజశ్రేష్ఠుడా, తగులము = ప్రేమను, ఎంచక = ఆలోచించక, నీవు ఇటులాడఁగా = ఈరీతిగా జాతిభేదా లెంచితే, ఏమన బోయెదన్ = ఏమి అనగలను? నీమనసు ఒక్కటే కరఁగనేరదు గాని, తొల్లి = పూర్వము, శ్రీరామ కుమారుడైన కుశరాజు, మా కుముద్వతిన్ = ఆ పేరుగల మా నాగకన్యకను, వరింపడే = పెండ్లియాడలేదా!, కోమల చారుమూర్తి = సుకుమారుడూ సుందరాకారుడూ అయిన, పురుకుత్సుఁడు = పురుకుత్సుడన్న చక్రవర్తి - మాంధాత కుమారుడు, నర్మదన్ = నర్మద అన్న మా జాతి కన్యకను, పెండ్లియాడఁడే? = వివాహము చేసుకోలేదా?

*తాత్పర్యము :*

నీవీలాగున ప్రేమను ఆలోచించకుండా అంటే నేనేమన గలుగుతాను. శ్రీరామకుమారుడు కుముద్వతిని పెండ్లాడలేదా? మాంధాత కుమారుడు మానర్మదను వివాహము చేసుకోలేదా? నీమన సొక్కటే కరగకుండా ఉంది అని ఉలూచి అంటుంది.

*విశేషము :*

మహోత్తమవంశములలో పుట్టినవారూ, సుప్రసిద్ధుల కుమారులూ, సామ్రాజ్యాధిపతులూ అయిన కుశుడికి గాని, పురుకుత్సుడికి గాని లేని ఈ జాతివిచక్షణ నీకెందు కని, అందంగా మందలించింది.

చిలువ చెలువము అనడానికి దీనిలో భయపడవలసిన భావముందా అని చూడాలిగదా!

వేదమువారు ఈలాంటి భావముంటుందని గ్రహించి ఏమన్నారో చూడండి: "ఏమనఁ బోయెదఁగా = ఏమిచెప్పగలను, (ఏన్ = నేను - మనఁబోయెదఁగా = (బ్రదుకుదునా - అని కాకువుగ నేనియు - బ్రదుకను అని విపరీత లక్షణగా నేనియు నొండె) అన్నారు.

బులుసువారు "ఏమనఁ బోయెదన్ అనుచో ఏమనఁ బోయెదఁగా ? = నేను జీవింపఁ గలనా..." అని అర్థాంతరమును గ్రహింతురు" అన్నారు.

వేదమువారు సూచించిన 'కాకువుగ' ఉచ్చరించడ మేలాగో తెలియదు. బులుసువారు 'ఏమనఁ బోయెదఁగా' అన్నమాటలను '?' గుర్తుపెట్టి ఏవిధంగా ప్రశ్నిస్తారో తెలియదు.

ఈ వ్యాఖ్యానాలు ఈలాగు తేలిపోయాయి కాబట్టి ఈ పద్యములో భయపడవలసిన భావమే లేదంటామా ? అనము; ఆ భావము బాగాఉంది.

ఏమనఁ 'బోయెదం దగులమెంచక నీవిటులాడ : దీని పదవిభజన మనము 'ఏఁగా మనఁగా వో ఎదఁగా తగులము ఎంచక నీవిటులాడ...' అని చేదాము.

"ఎదఁగా తగులము ఎంచక = మనసులో ప్రేమను గణించక, నీ విటులాడన్ = నీవీరీతి జాతులెంచితే, ఏన్ = నేను, మనఁగా వో (మనను వో) = బ్రతుకను సుమా''అని రెండోఅర్థం చెప్పి, చిలువ చేలువాన్ని సమర్థిస్తాము. సహృదయులు అంగీకరిస్తారనే మా నమ్మకము.

అలంకారము :

శ్లేష.

"ఈ కలహంసయాన నను నెక్కడి కెక్కడనుండి తెచ్చె ! నా
హా ! కడుదూర మిప్పు డని యక్కనఁ జేర్పక జంపుమాటలన్
వ్యాకుల పెట్టుటేల ? విరహాంబుధి ముంపకపోదు నన్; జలం
బేకద నీకు; మంచి; దిఁక నీఁతకు మిక్కిలి లోఁతు గల్గునే ?" 167

అర్థము :

"ఈ కలహంసయాన = రాజహంసవంటి నడకగల ఈ కాంత, ఇప్పుడు నను ఎక్కడకు ఎక్కడనుండి తెచ్చెను ! ఆహా ! కడుదూరము," అని, అక్కనన్ = రొమ్మునందు, చేర్పక, జంపుమాటలన్ = ప్రొద్దుపుచ్చు మాటలతో, వ్యాకులపెట్టుటేల? = వ్యసనము కలుగజేయడమెందులకు, (పాఠాంతరము - వ్యాకులపెట్టుటెల్ల = ఈ వేధించడమంతా అని భావము). విరహాంబుధి = వియోగ మను సముద్రము, నన్, ముంపకపోదు = తప్పక ముంచివేయును, చలంబేకద నీకు = నీకు కావలసినదంతా నీపట్టుదలయే కదా ? మంచిది = ఆ పట్టుదలే నిల్పుకో, ఇకఁగా, ఈఁతకు మిక్కిలి లోతు గల్గునే = చావుతో అంతముకావి చింత ఉంటుందా ?

తాత్పర్యము :

"ఈ మందయాన ఇంతదూరము నన్ను తీసుకొని వచ్చిందే, ఆ శ్రమకయినా ఆమె కోరిక నెరవేర్చాలే" అని తలచకుండా, ఊరక కాలయాపనచేసి, నన్ను వేధించడమెందుకు? ఈ పరిస్థితిలో వియోగసాగరం నన్ను ముంచక తప్పదు. నీకు కావలసిందంతా నీ పట్టుదలేకదా. సరే ఆలాగే కానీ. ఈతకు మిక్కిలి లోతూ, చావును మించిన చింతా ఉంటుందా?

విశేషము :

'విరహమువల్ల నాకు చావు తప్పదు. చావబోయే వ్యక్తికి ఎటువంటి దుఃఖం కలిగినా సరకుచేయడు' అని ఉలూచి తన తెగువను తెలియజేసింది.

మరేలాంటి అర్హతా నాకు లేకున్నప్పటికీ, నేను పడిన శ్రమకైనా నన్నంగీకరించరాదా. 'ఇంతదూరము తెచ్చెనే' అని ఆదరించవలసింది అది చేయకుండా నన్ను వేధించడమెందుకు?

నీకు కావలసింది నీపట్టుదలే అయితే, నాకు విరహమువల్ల మరణము తప్పదు అని ఉలూచి, దీని ఫలితము ఏలాగుంటుందో తెలియపరిచింది.

ఉలూచికి విసుగూ విచారమూ అధికమయాయి. నిరాశ అంకురించింది. దానితో ఒక విధమయిన తెగువ కలిగింది.

ఈతతో దాటలేని లోతూలేదు; చావుతో అంతమొందని చింతా ఉండదు. అన్ని చింతలూ దానితో తీరిపోతాయని అనుకుంది. సరే, నీ ఇష్టమే జరగనీ అన్నది.

కలహంసయాన = హంసనడకల మందగమన, దూరము తీసుకరావడము మరింత కనికరానికి కారణమని చమత్కారము.

ఇటువంటి సన్నివేశాలలో యువతులు పురుషుల అనంగీకారాన్ని అంగీకరించరు. అల్లసాని పెద్దనగారి ఈ పద్యమును చూడండి :

రా, వైరాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్య చిత్తంబునన్
రావైతేఁ జవిగాని యిందులకు హోరాహోరిగాఁ బోరి యే
లా వాలాయము సేయఁగా? బ్రతుకు నీ వాచార వంతుండవై
చావో యెక్కడొ నీయెడం బొడము వాంఛన్ భూసురగ్రామణీ.

మాటలలో కటుత్వములేదు. జాలిగొల్పే అందమైన మాటలు. కాని, వాటిలోని భావము-నేను ప్రాణత్యాగము చేస్తాను అన్న భావము — భయంకరము. ఈలాగుండడమే 'చిలువ చెలువము'.

పాఠాంతరము :

'చలంబేకద నీకు మంచిది(ఇ)క నీతకు మిక్కిలి......', 'మంచిది ఇక నీతకు...' అనడములో ఒక సహజమయిన తెగువ కనబడుతుంది కాబట్టి మన పాఠమే మేలు.

అలంకారము :

లలితోక్తి, ఆక్షేపము, లోకోక్తి.

అని వచియించునప్పుడు ముఖాబ్జము నంటెడి విన్నఁబాటు, చ
క్కని తెలి సోగ కన్నుఁగవఁ గ్రమ్ముచు నుండెడి బాష్పముల్ గళం
బునఁ గనిపించు గద్గదిక, ముప్పిరిగొ న్వలవంతఁ దెల్ప, ని
ట్లను మదిలోఁ గరంగి రసికాగ్రణి యా కరభోరు భోరునన్. 168

మీది పద్యాలలోని మాటలు ఉలూచి అనినప్పుడు ఆమె ఎంత ఆవేదన చెందిందో ఈపద్యముతో స్పష్టమయింది. అర్జునుడి పట్టుదల పటాపంచలయింది.

అర్థము :

అని వచియించునప్పుడు = ఈమాటలు చెప్పుతున్నప్పుడు, ముఖాబ్జమునః = ముఖకమలమును, అంటెడి = అంటిఉన్న, విన్నఁబాటు = దీనత్వమును, చక్కని తెలి సోగకన్నుఁగవః = అందమై తెల్లగా సోగగా ఉన్న కన్నుల జంటయందు, క్రమ్ముచు ఉండెడి = ఊరుతున్న, బాష్పముల్ = కన్నీళ్ళను, గళంబునః = కంఠస్వరమునందు, కనిపించు, గద్గదిక = డగ్గుత్తిక యున్ను, ముప్పిరిగొః = మిక్కిలి అతిశయించి ఉన్న, వలవంతః = దుఃఖమును, తెల్పః = తెలియచేయగా, రసికాగ్రణి = రసజ్ఞులలో శ్రేష్ఠుడు (అర్జునుడు), మదిలోన్ కరంగి = మనసులో కనికరమును పొంది, ఆ కరభ ఊరుః = కరభమువంటి అందమైన తొడలుగల ఆ ఉలూచితో, భోరునః = త్వరితముగ, ఇట్లనున్.

తాత్పర్యము :

హృదయావేగముతో ఉలూచి పై మాటలు చెప్పుతున్నప్పుడు ఆమె ముఖంలో కనబడిన దీనత్వమూ, కనులలో జమ అవుతున్న కన్నీరూ, కంఠములో కనబడిన బొంగురు స్వరమూ, ఈ మూడూ ఆమె దుఃఖాధిక్యాన్ని ప్రకటించాయి. దానితో అర్జునుడి మనసు కరిగింది. ఈ క్రింది విధంగా ఉలూచితో అన్నాడు.

విశేషము :

నిరాశచేసుకొన్న ఉలూచిలో కనిపించిన ఆ మూడుసూచనలు ముప్పిరి (మూడు + పిరి) మూడుతాళ్ళు పురిపెట్టి పేనినట్టున్న దుఃఖాన్ని (అంటే అత్యధికమైన చింతను) తెలిపాయని సారస్యము.

సాధారణంగా పెనగొను, ముప్పిరిగొను అన్నమాటలు అతిశయించు అన్న స్థూలార్థములో ఉపయోగిస్తారు. కాని మన కవి ఆమాటల వ్యుత్పత్తి వరకు వెళ్ళి సార్థకముగా వాటిని వాడతాడు. చూడండి : "మనమున పెనగొనఁగఁజేరి మాయాన్వితయై" అన్న 125వ పద్యము.

కరభము అనగా మణికట్టునుండి చిటికెనవేలి మొదలు వరకు ఉన్న చేతియొక్క ప్రక్కభాగము. చక్కనితొడ ఆ ఆకారముతో ఉంటుంది. ఏనుగుతొండము గూడ అలాంటి ఆకారము గలదే.

ఘోరనన్ కాదు, బోరనన్ సాధువని, ఒక అభ్యంతరముంది. ఘోరున అన్నది ఒక అనుకరణ పదము. ఉ :- ఘోరున వర్షము కురిసినది; ఘోరున ఏడ్చిరి. నిఘంటువులు వీటిని రూపాంతరాలుగా అంగీకరించాయి. అనుకరణంలో ఒత్తుగల అక్షరాలను ఉపయోగించవచ్చును. ఉదా : డమ్మని (ఢమ్మని) మ్రోగెను. అనుకరణానికి ఆక్షేపణేమిటి ?

ఘోరునన్ = ధారాపాతములాగా - త్వరితముగా అర్జునుడు అన్నాడు. ఏమంటే ఆమె ఉద్వేగమువల్ల రసభంగము కాకూడదుకదా !

అలంకారము :

చేకానుప్రాసము, స్వభావోక్తి.

చక్కెరబొమ్మ నా వ్రతము చందముఁ దెల్పితి, నింతెకాక నీ
చక్కదనంబుఁ గన్న నిముసం బయిన న్నిలు వోప శక్యమే
యక్కునఁ జేర్ప; కంచు దయ నానతి యీఁ, దలవంచె; నంతలో
నెక్కడనుండి వచ్చెఁ దరళేక్షణకున్ నునుసిగ్గు దొంతరల్. 169

సందేహాలూ ప్రశ్నలూ చాలించాడు అర్జునుడు. ఇకమీద శృంగార నాయకుడుగా మాటలాడుతున్నాడు.

అర్థము :

చక్కెరబొమ్మ = సర్వాంగసుందరీ, నావ్రతము (యొక్క), చందమున్ = పద్ధతిని, (ఇది సుమాఅని) తెల్పితిన్, అంతెకాక = అంతేకాని, నీ చక్కదనంబున్, కన్నన్ - కనినన్ = చూచిన తరువాత, అక్కునన్ = వక్షమునందు, చేర్పక (కౌగిలింపకుండ), నిముసం బయినన్ = ఒక్క నిమేషమాత్రమయినా, నిలువోపన్ = ఆలస్యము ఓర్చుకొని ఉండడానికి, శక్యమే = వశమా? అంచున్, దయన్ = దయతో, ఆనతి ఈన్ = చెప్పగానే, తలవంచెన్ = ఉలూచి(సిగ్గున) తలవంచుకున్నది, అంతలోన్ = అంతస్స్వల్పకాలములోనే, తరళేక్షణకున్ =

చంచలాక్షికి, నునుసిగ్గు దొంతరలే = పరంపరగా వస్తున్న ఈఅందమైన సిగ్గుచేష్టలు, ఎక్కడ నుండి వచ్చె(నోకదా)।

తాత్పర్యము :

'సుందరాంగీ నా వ్రతం సంగతి నీకు తెలియజేశాను; అంతేకాని, నీచక్కదనం చూచిన తరవాత నిన్ను ఆలింగనం చేసుకోకుండా ఒక్క క్షణమయినా ఉండశక్యమా ?' అని అర్జునుడు తన అంగీకారం తెల్పగానే ఉలూచి సిగ్గుతో తలవంచింది. ఈ రెప్పపాటు కాలంలో ఎక్కడ నుంచి వచ్చిందో ఈ సిగ్గు అని భావము.

విశేషము :

ఈ ఉలూచి ఘట్టములో ఇంతవరకూ అర్జునుడు ఆమెను వధూమణీ, మగువా, అహి మహిళా అనే సంబోధించాడు గాని శృంగారరస సంబోధనము చేయలేదు - ఆమె సౌందర్యాన్ని మెచ్చుకొని గూడ. ఇప్పుడు చక్కెర బొమ్మ అన్నాడు.

ఇంతవరకు హోరాహోరిగా వాదోపవాదాలు చేస్తూ నిరాశతో తెగించి నిర్ణయాలుచేస్తూ ఉండిన ఉలూచి, ఒక్కమాటతో మారిపోయి సిగ్గుతో తలవంచుకోవడము సహజము.

ఈ సందర్భములో ఉన్న కాంతను తరళేక్షణ అని కవి అనడం సమంజసము.

సిగ్గుదొంతరలు ; తలవంచడం, అటూఇటూ చూడడం, బొటనవేలుతో నేలరాయడం, పైటచెంగు వేళ్ళకు చుట్టుకోవడం ఈలాంటి చేష్టలు.

అంగీకారం తెల్పగానే ఆమె పెళ్ళికూతురయిందికదా. నైషధములో ఈలాగే దమయంతి గద్దెమీద కూర్చొని నలుడితో వాదించిన తరువాత ఒక్క క్షణములో సిగ్గు కనబరిచి తెర వెనుకకు పోయింది.

అంతకయమున్న నలునిగా నతని నెఱిఁగి
యెదురు గద్దియ డిగ్గి పృథ్వీశ తనయ
యవని కాంతరమున నోల మానఁ గొనియె.

— శ్రీనాథుడు.

'నీ చక్కదనంబుగన్న నిమిసం బయినన్ నిలుపోవ శక్యమే' అన్నాడు. తాను ఆమె చక్కదనం చూచాడు, మెచ్చాడు. సందేహాలవల్ల తాను ఆగవలసి వచ్చింది. అదెంత కష్టమో అర్జునుడికి తెలిసింది. గంగాతీరములో ఉలూచి 'నిల్వబడ్డపాటు'లోని కష్టము తెలిపింది. దాని కిది చెల్లు.

తన్ను ఇంతదూరము తెచ్చినందుకు కనికరించి అయినా అక్కున చేర్చమని ఉలూచి సూచించింది. 'కాదు; నీ చక్కదనానికే ఆలింగనము' అని అర్జునుడు అనడము చమత్కారము.

అలంకారము :

స్వభావోక్తి.

> అంకి లెఱింగి యా సరసుఁ డంత "వివాహ విధిజ్ఞుఁడైన మీ
> నాంకుఁ డొనర్చినాఁ డిది శుభైక ముహూర్తము ర" మ్మటంచు ప
> ర్యంకముఁ జేర నెచ్చెలి కరగ్రహణం బొనరించెఁ దన్మణీ
> కంకణ కింకిణీ గణ వికస్వర సుస్వరముల్ సెలంగఁగన్. **170**

సిగ్గు దొంతరలతో ఉన్న ఉలూచి ఇంకా ఏమో సంకోచిస్తూ ఉందని గ్రహించి అర్జునుడు ఈ పద్యములోని విధంగా అన్నాడు.

అర్థము :

అంకిలి = అమె అభిప్రాయము - మర్మము, ఎఱింగి = గ్రహించి, ఆ సరసుఁడు = అర్జునుడు, అంతన్, వివాహవిధిజ్ఞుఁడైన = పెండ్లి పద్ధతులు బాగా ఎరిగినట్టి, మీనాంకుఁడు = మన్మథుడు, శుభైక ముహూర్తము = శుభమునే ముఖ్యముగా ఇచ్చేముహూర్తము (పెండ్లిండ్లకు ప్రధానమైన రెండు ఘడియల కాలము), ఇది = దీనిని, ఒనర్చినాడు = నిశ్చయము చేసినాడు, రమ్మ అటంచు = అనుచు, పర్యంకమున్ చేరఁగా = పాన్పు దగ్గరకు వచ్చేలాగ, నెచ్చెలిన్ = ప్రేయసిని, తత్ మణీకంకణ = ఆమెయొక్క రత్నకంకణముల యొక్కయూ, కింకిణీగణ = చిరుగజ్జలసమూహము యొక్కయూ, వికస్వర = స్ఫుటమైన, సుస్వరముల్ = మంగళ ధ్వనులు, చెలంగన్ = ధ్వనిస్తుండగా, కరగ్రహణం బొనరించెన్ = చేతిని పట్టుకోవడం అన్న పాణిగ్రహణమును (పెండ్లిని) చేసెను.

తాత్పర్యము :

ఇంకా సంకోచిస్తున్న ఉలూచి అభిప్రాయం గ్రహించి "నీకా సందేహ మక్కరలేదు. మన్మథుడే ఈ పెళ్ళిముహూర్తం నిర్ణయించాడు, రా" అని ఆమె చేయిపట్టుకొని మంచము దగ్గరకు తీసుకునివెళ్ళాడు. అప్పుడు ఉలూచి చేతిగాజులూ, మువ్వలూ ఇంపుగా ధ్వనించాయి అని భావము.

సూ. ని. లో అంకిలి = మర్మము, కీలకము అని అర్థమిచ్చి ఈ విజయవిలాస పద్యాన్నే ప్రయోగంగా ఇచ్చారు.

అర్జునుడు చెప్పిన మాటలు వినిగూడా సంకోచిస్తూ ఊరుకున్న ఉలూచి మనసులో 'వివాహము కాలేదే, స్వర్గాది సుఖము లేలాగ పొందవచ్చును?' అన్న అభిప్రాయము (కుల

సతులకు ఉచితమయినది) కలదని అర్జునుడు గ్రహించాడు. ''వివాహ.........రమ్య'' అని ఆ అభిప్రాయానికి సమాధానము చెప్పాడు.

ఈ విధంగా గ్రహించాడు కాబట్టే సరసుడని చెప్పడము. రసికుడుకాని వాడు కర గ్రహణం చేస్తే చేస్తాడుగాని, ఈ సమాధానము చెప్పడు.

ఈ వివాహము మీనాంకు డొనర్చినాడు అనడంలో, ఇందుకు కారణము పరిపూర్ణమైన వలపేగాని, మరి ఏదీ కాదన్న భావముంది.

అతడు వివాహ విధిజ్ఞుడు అనడంవల్ల గట్టి సిద్ధాంతి అనీ, స్త్రీ పురుషులను కూర్చువనిని బాగా తెలిసిన వాడనీ, శుభైక ముహూర్తము కాబట్టి ఆలస్య ముండకూడదనీ తెలుసుకోవాలి. ఈ పాణిగ్రహణానికి మంగళధ్వనులు కంకణ కింకిణులే చేస్తున్నాయి.

పసిడి యుప్పరిగెలోని పర్యంకము – వివాహవేదిక, మన్మథుడు – పురోహితుడు, ముహూర్తము – శుభైకము, కంకణ కింకిణీ స్వరములు – మంగళవాద్యములుగా, చేయిపట్టు కోవడం–పాణిగ్రహణం శాస్త్రసమ్మతంగా జరిగిందన్నమాట.

ఉలూచిని పర్యంకము దగ్గరకు తెచ్చినప్పుడు కంకణాలు మొదలైనవి ధ్వనించాయని అన్నందువల్ల ఆమె లజ్జాభరముచేత కొంచెము పెనుగులాడిందని గ్రహించాలి. అది చాల సహజముగదా.

కంకణాలు చేతినగలు; కింకిణీ గణ అని చెప్పినందువల్ల కాళ్ళగజ్జెలూ, మొలనూలి గజ్జెలు గూడా మోగాయన్నమాట.

ఇది శుభైక ముహూర్తము అని అర్జునుడు – అఖిలశాస్త్రవిదుడు కాబట్టి – అనడానికి సమర్థుడే.

*పాఠాంతరము :*

'పర్యంకముమీఁద నెచ్చెలి కరగ్రహణం బొనర్చె' అని వేదమువారి పాఠము.

పర్యంకము దగ్గరకు (చేర) వచ్చినట్లు కరగ్రహణము చేశాడనడమే సబబు. అంతకు ముందే ఆమె పర్యంకము మీద ఉందని అనలేము. ఆలాగుంటే కంకణ కింకిణీల సుస్వరాలకు అవకాశముండదు.

*అలంకారము :*

శ్లిష్టరూపకము, పరికరాంకురము.

ఒక మాణిక్యపు బొమ్మ, యెట్టి వగ కీలో, జాళువా జాలవ
ల్లిక బాగాల్ కపురంపు టాకుమడుపు ల్వే తెచ్చి రాజున్న చా
యకు నందీయ నతండు లేనగవుతో నావేళ నా వ్యాళ క
న్యక కెంగేల నొసంగి కైకొనియె సయ్యాటంబు వాటంబుగన్. 171

అట్లు పర్యంకము మీద ఇద్దరూ ఉండగానే కాలయాపన కాకుండా కథ త్వరత్వరగా జరుగుతూఉంది.

అర్థము :

ఎట్టి వగకీలో = ఏమి చిత్రమైన మరయోగాని, ఒక మాణిక్యపు బొమ్మ = ఒక రత్న ప్రతిమ, జాళువా జాలవల్లికన్ = మేలిమి బంగారముతో చేయబడిన అడపము (తాంబూలపు పళ్ళెరము)నందు, బాగాల్ = సన్నని పోకలనూ, కపురంపు ఆకుమడుపుల్ = పచ్చకర్పూరము వేసిన తములపాకు మడుపులనూ, వే = శీఘ్రముగా, తెచ్చి, రాజున్న చాయకు = అర్జునుడున్న దిక్కు-కు, అందీయన్, అతండు, లేనగవుతోన్ = చిరునవ్వుతో, ఆవేళన్, ఆ వ్యాళ కన్యక కెంగేలన్ = ఆ నాగకుమారి ఉలూచి యొక్క- (కెంపువలె) ఎర్రగా ఉన్న చేతికి, ఒసంగి = ఇచ్చి, సయ్యాటంబు వాటంబుగన్ = శృంగార చేష్టలు - సరసములు - శోభించునట్లు, కైకొనియెన్ = (తాను ఉలూచి చేతినుండి) పుచ్చుకొనెను.

తాత్పర్యము :

వాళ్ళిద్దరూ మంచముమీద కూర్చోగానే, ఏమి చిత్రమైన కీలుందోగాని, ఒక రత్నపు బొమ్మ బంగారు పళ్ళెములో వక్క-లూ, కర్పూరము వేసిన ఆకుమడుపులూ తెచ్చి రాజుకు అందించింది. అర్జునుడు ఆతాంబూలము ఉలూచిచేతి కిచ్చాడు. ఆమెఅర్జునుడి నోటికందిచ్చింది. ఈ భార్యాభర్తల సయ్యాటతో అర్జును డా తాంబూలాన్ని స్వీకరించాడని భావము.

విశేషము :

కూర్చుండినంత మాత్రాన ప్రతిమ తెచ్చి రాజు చాయ కిచ్చింది. కాబట్టి ఏదో కీలు ఉండాలి.

తాంబూలము తాను వేసుకోకుండా మొదట ఉలూచి కిచ్చి, ఆమెచేతినుంచి చాలసరసముగ దాన్ని పుచ్చుకోవడం అర్జునుడి రసికాగ్రణి తనాన్ని వ్యక్తీకరిస్తున్నది.

ఇంతేకాక తాను ఉలూచి కివ్వడమూ, ఉలూచి తన కివ్వడమూ నిశ్చయతాంబూలాలయి, వివాహం స్థిరపరిచాయన్నమాట. పెళ్ళితంతు అంతా సక్రమంగా జరిగించాడు కవి.

పాఠాంతరము :

సయ్యాటంబు వాటిల్ల గన్

— వేదమువారూ, తిరుపతివారూ,

అర్థగౌరవమూ, అలంకారమూ ఉంది కాబట్టి మనపాఠమే బాగు.

**అలంకారము :**

అనుప్రాసము.

శయ్యకుఁ దార్పఁగాఁ దుఱుము జాఱె; న దంతటఁ జక్కదిద్దఁబోఁ
బయ్యెద జాఱె; న య్యదిరిపాటున గ్రక్కున నీవి జాఱె; రా
జయ్యెడ నవ్విలాసిని యొయారముఁ జూచి కవుంగిలించె; నౌ !
నెయ్యెడ మేలె చూతురు, గణింపరు జాణలు జాఱుపాటులన్. 172

**అర్థము :**

శయ్యకున్ తార్పఁగాన్ = పక్కమీదికి చేరదీస్తుండగా, తుఱుము = జుట్టుముడి, జాఱెన్ = వీడిపోయెను, అంతటన్, అది = ఆకొప్పును, చక్కదిద్దఁబోన్ = చక్కగాసవరించుకొంటుండగా, పయ్యెద జాఱెన్ = పైట జారిపోయెను, ఆ అదిరిపాటునన్ = (దానిని సరిచేసుకొనే) ఆ తొందరలో, క్రక్కునన్ = తటాలున, నీవి = పోకముడి - కట్టువస్త్రము ముడి, జాఱె = సడలిపోయెను, రాజు, ఆయెడన్ = (జారుపాటులు కలిగిన) ఆసమయమున, ఆవిలాసిని = విలాసముగల ఆ ఉలూచియొక్క, ఒయారమున్ = సౌందర్యమును, చూచి, కవుంగిలించెన్ = ఆలింగనము చేసుకొనెను, ఔను = ఇది సమంజసమే, జాణలు = నేర్పుగలవారు - ప్రౌఢులు, ఏయెడన్ = ఏ విషయమందైనా, మేలె చూతురు = మంచినే గ్రహిస్తారు, (కాని) జాఱుపాటులన్ = స్ఖాలిత్యాది లోపాలను, గణింపరు = ఎంచరుగదా.

**తాత్పర్యము :**

పక్కమీదకు తీసుకు వస్తుండగా కొప్పుజారిపోయింది: అది దిద్దబోగా పైటజారింది: అది సవరించుకొనే టప్పటికి పోకముడి సడలి జారింది. ఇన్ని జారుపాటులుండినా అర్జునుడు ఉలూచి ఒయ్యారాన్ని చూచే కౌగిలించుకున్నాడు. తెలిసినవారు దేనిలో నైనా మంచినే చూస్తారు గాని జారుపాటులనూ లోపాలనూ ఎంచరు అని భావము.

**విశేషము :**

కొప్పు, పైట, పోకముడి - వీటిలోని జారుపాటుల నెంచకుండా, ఒయ్యారము చూచే అర్జునుడు అక్కున జేర్చా డనడంలో చేమకూరకవి కావ్య విమర్శకుల సద్ధర్మమును సూచించాడు. కావ్యాలలో ఉండే వ్యాకరణ విరుద్ధాలవంటి స్వల్పలోపాలను గణించక, రసభావాది సుగుణాలనే ఎంచాలని పండిత విమర్శకులకు మనవి చేశాడు.

'ఎయ్యెడ మేలె చూతురు' అనడంలో, జీవిత వ్యవహారంలోనే కాక కవిత్వాది విషయాలలో గూడా అని కవి హృదయము.

ఇన్ని జారడానికి కారణంగా ఇంచుక సిగ్గున పెనుగులాట ఉండి ఉండాలి. అది 'నవ సమాగపు వేళ' చాల సహజము. పెనుగులాటవల్ల కీల్గంటూ, దాన్ని దిద్దబోగా పైటా, దాన్ని సవరించబోగా నీవీ జారడము చాల సకారణము.

తురుము జారినప్పుడు లేని "అదిరిపాటు" పయ్యెద జారినప్పుడు ఉలూచికి కలగడము చాల సహజము.

ఈ జారుపాటులవల్ల ఇనుమడించిన ఒయ్యారము విలాసవతులకు కలుగుతుందని రసిక జనులకు విదితమే. దాని ఫలితమే కౌగిలింత.

*అలంకారము :*

కారణమాల, స్వభావోక్తి, శ్లేష, అర్థాంతరన్యాసము.

కౌఁగిటఁ జేర్చునప్పటి సుఖంబె లతాంగికిఁ బారవశ్యముౕ
మూఁగఁగఁజేసె; మోవి పలునొక్కు లురోజ నఖాంకముల్ మొదల్
గాఁ గల కంతుకేళి సుఖలక్షణము ల్వయిపెచ్చులయ్యెఁ; న
ట్లౌఁగద యెట్టివారలకు నగ్గలపుం దమి గల్గియుండినన్. 173

అర్జునుడాలాగు కౌగిలించినందువల్ల కలిగిన ఫలితమును ఈ పద్యములో కవి వర్ణిస్తున్నాడు.

*అర్థము :*

కౌఁగిటౕ చేర్చునప్పటి = ఆరీతిగా కవుగలించునప్పటి, సుఖంబె, లతాంగికిౕ = తీగవలె పెనగికొన్న శరీరముగల ఆ ఉలూచికి, పారవశ్యముౕ = సుఖాతిశయముచేత పరవశత్వము_మైమరుపు, మూఁగఁగౕ చేసెౕ = కమ్ముకొన్నట్లు చేసెను, మోవి పలు నొక్కులు = పెదవియందలి దంతక్షతములు, ఉరోజ నఖ అంకముల్ = కుచములయందలి నఖక్షతములు, మొదల్గాఁగల = మొదలయిన, కంతుకేళి సుఖ లక్షణముల్ = మన్మథ క్రీడయందలి సుఖము నెరుగజేసే చిహ్నాలు (గుర్తులు), పైపెచ్చులు అయ్యెౕ = (ఊరక ఇచ్చిన) కొసరు లయాయి (ఇంతకుముందే పారవశ్యములో ఉన్నదికాబట్టి) - లేదా, చాలా అధికము అయాయి, అగ్గలపున్ తమి = అత్యధికమైన మోహము, కల్గియుండినౕ, అట్లౌౕ కద = అలాగే అవుతుందికదా!

*తాత్పర్యము :*

అర్జునుడు కౌగిలించగానే - ఆ మొదటి అలింగనముతోనే, ఉలూచిని పరవశత్వము ముంచివేసింది. నఖక్షతలూ దంతక్షతలూ మొదలైన రతిలక్షణాలు మిక్కిలి ఎక్కువ అయాయి. అత్యంతమయిన మోహమున్నప్పుడు అలాగే అవుతుందికదా అని భావము.

విశేషము :

అగ్గలపు మోహముంటే తొలి కౌగిలే పారవశ్యాన్నివ్వడమూ, నఖక్షతాదులు అత్యధికము కావడమూ సామాన్యము.

పెచ్చు అనగా పండ్లు మొదలైనవాటి పైపొర. పెదవులు దొండపండ్లు, స్తనములు కొమ్మ పండ్లు, పై పెచ్చులయ్యె - పంటినొక్కులవల్లా గోటిరక్కులవల్లా పై పొరలు (తోలు) ఊడా యన్నమాట. దంతక్షత నఖక్షతలు చాల గాఢంగా ఉన్నాయని ధ్వని.

ఈనిర్దయ చర్యకు కారణము అగ్గలపుందమి. మోవీ ఉరోజాలూ పండ్లకుపమేయములయి సార్థకముగ ఉన్నాయి.

పై పెచ్చులు అంటే 'కొసరులు' అని వేదమువారన్నారు.

ఆ మొదటి కౌగిలి సుఖము పారవశ్యాన్ని కలిగించడమే కాక మూఁగఁగా (మూగ దానిగ) కూడ చేసిందని చమత్కారము. పరవశత్వమువల్ల ఉలూచి మాటలు స్వచ్ఛంగా ఉచ్చ రించలేకపోయినా, అల్లసానివారు చెప్పినట్టు సొగసుకోర్కెలు పుట్టించ గలిగిన 'కుత్తుకలోని పల్లటీ కూతలకు', పావురా ధ్వనులకు కొరతలేదని సహృదయులు గ్రహించగలరు.

అలంకారము :

కావ్యలింగ, శ్లేష, అర్థాంతరన్యాసము.

చనుఁగవ సాముకండెపుఁ బిసాళియురంబున సారెఁ గాననే
మనసునుచుఁ; సుధారసము మాటికిఁ గ్రోలనె చూచుఁ; జొక్కు గీ
ల్కొను సరసోక్తులఁ వినవె కోరు సదా; యిటు లాదిసంగమం
బుననె విభుండు మూఁడు వలపుల్ వలచెఁ ఫణిరాజకన్యకన్. 174

ఈపద్యములో అర్జునుడి అభిలాషలను కవి వర్ణిస్తున్నాడు.

అర్థము :

సాముకండెపు పిసాళి ఉరంబునఁ = సాములో, సాదన చేయడమువల్ల, కండగట్టి నిగ నిగ మెరుస్తుండే వక్షస్థలముమీద, చనుగవన్ = కుచయుగాన్ని, సారెఁ = మాటిమాటికి, కాననే = (అదుముకొని ఉండగా) చూచుటకే, మనసు ఉనుచుఁ = కోరుతుంటాడు, సుధా రసమున్ = అధరామృతమును, మాటికిన్ = మాటిమాటికి, క్రోలనె చూచుఁ = త్రాగుటకే ప్రయత్నిస్తాడు; చొక్కుఁ = పారవశ్యమును, కీల్కొను = కలిగించే, సరస ఉక్తులన్ = సరసపు వాక్యములను, సదా = ఎల్లప్పుడు - మాటిమాటికి, వినవె కోరున్ = వినడానికే అభిల

షిస్తాడు, ఇటుల = ఈప్రకారముగ, అది సంగమంబునసె = తొలి కూటమిలోనే, ఫణిరాజ కన్యకన్ = నాగరాజు కుమార్తెను, మూఁడు వలపుల్ వలచెన్ = మూడింతలుగల మోహము కనబరిచాడు, మిక్కిలి మోహించాడు.

తాత్పర్యము :

ఆ తొలికూటమిలో అర్జునుడు తన గుండెమీద ఉలూచి చనుగవ అదిమి ఉంచడం మరిమరి చూడడానికీ, మాటిమాటికీ ఆమె అధరోష్ఠము పానము చేయడానికీ, గడియ గడియకు ఆమె మాటలు విని మైమరచిపోవడానికీ ఉవ్విళ్ళూరుతూ ఉండి, మూడువిధాలుగా రతిసుఖము అనుభవించాడని భావము.

విశేషము :

రొమ్మునందు చనుగవను చూడడము, అధరామృతపానము చేయడము, సరసోక్తులు వినడము ఈమూడు వలపులతోనూ వలచినాడని కవి హృదయము.

"రొమ్ములోని సింగారము" అని ఇంతకుముందు కవి సూచించాడు. ఆ సింగారమే "సాముకండెపు పిసాళి" తనమని ఇక్కడ వివరించాడు.

ఈ పద్యమున పంచేంద్రియములలో నాల్గింటిని సుఖభరితాలుగా కవి వర్ణించాడు. మొదటి దానితో త్వక్, నయనాలు, రెండవదానితో జిహ్వ, మూడవదానితో శ్రోత్రములూ సుఖించా యన్నమాట.

రసికశిఖామణులు ఈ 'మూడువలపులకు' ఎంత గంభీరమైన అర్థము చెప్పినా మనము కాదనలేముగదా !

పాఠాంతరము :

సారె కాననే = (సారెకు + ఆననే - అదుముటకే)
సారెఁ గాఁడనే = (సారెన్ + కాఁడనే - నాటుటకే)

వీనియందు ఒక త్వగింద్రియము మాత్రమే సుఖిస్తుంది, కాబట్టి మనపాఠమే మేలు.

నాగరిక ముద్రగల మంచి జాగరి యఁట
నాగవాసములో వింత నటనల దఁట
కులుకుగుబ్బల ప్రాయంపుఁ గోమతి యఁట
వలచి వలపింపదే యెంతవాని నైన. 175

అర్థము :

నాగరిక ముద్రగల = నగరవాసమువల్ల కలిగిన చాతుర్యలక్షణాలున్న, మంచి బాగరి అఁట = గొప్ప అందగత్తె అట. నాగవాసములో వింత నటనల దఁట = నాగలోకములో అసాధారణ మైన సొగసుతో కూడిన ప్రవర్తన గలదట. కులుకు గుబ్బల = బిగికలిగి ఉండడంచేత కొంచెము మాత్రము తుళ్ళుతుండే కుచములుగల, ప్రాయంపుఁ గోమలి = నిండు జవ్వనమున ఉన్న సుకుమార శరీర అట. (ఇన్ని గుణములు గలవు గదా) ఉలూచి, వలచి = తాను ప్రేమించిన యెడల, ఎంతటి వానినైన, వలపింపదే = తన్ను వలచేలాగ చేయలేదా - తప్పక చేయగలదు.

తాత్పర్యము :

నగరవాసమువల్ల కలిగిన నాజూకుతనమూ, నాగలోకములో అద్భుతమయిన ప్రవర్తనా, భరతశాస్త్రజ్ఞానమూ కలిగి, కులుకుగుబ్బల నిండుయవ్వనముతో ఉన్న సుకుమార శరీరము కల ఉలూచి, తాను వలచినట్టయితే, ఇతరులు తన్ను వలచినట్లు చేయలేకపోతుందా అని భావము.

విశేషము :

అర్జునుడు తొలికూటమిలోనే మూడువలపులు వలచినాడు. ఉలూచి వలిచింది, వలపించి జయించింది. అది న్యాయమే అంటాడు కవి.

నాజూకుతనము, గొప్ప అందము, అద్భుతమయిన ప్రవర్తన, బింకము కలిగి స్వల్పంగా తుళ్ళుతుండే కుచాలు, చక్కని యవ్వనము, సుకుమారమైన శరీరము ఇన్ని రమణీయమయిన లక్షణాలున్న తాను వలచినప్పుడు, ఎంతటివాడి నయినా వలపించకపోతుందా అని భావము.

రెండో చరణములో నాగవాసము అనీ నటనలు అనీ రెండుమాటలున్నాయి. నాగవాసము అంటే నాగలోకము, వేశ్యల సమూహము అని రెండర్థా లున్నాయి. అలాగే నటనలు అంటే ప్రవర్తనలు, నటించే నేర్పులు అని రెండర్థా లున్నాయి. ఆ అర్థాలనుపట్టి చూస్తే ఈ పద్యము ఏదో ఒక వేశ్య గురించి చెప్పినట్టు కనబడుతుంది.

80 వ పద్యములో 'బిరుదుపాత్రల' వర్ణనలో, 'వలవ వలపింప నేర్చిన యలరుబోండ్లు' అని ఈ కవే, ఈ మాటలనే ఉపయోగించాడు.

దీనివల్ల అప్రస్తుతమయిన నట్టువరాలి విషయం స్ఫురిస్తూ ఉన్నదనక తప్పదు.

అలంకారము :

సమాసోక్తి, ఉదాత్తము, శ్లేష.

ఈగతి రతికేళీ సుఖ
సాగరమునఁ దేలియున్న సమయంబునఁ ద
ద్యోగం బెటువంటిదొ స
ద్యో గర్భంబున సుపుత్రుఁ డొకఁ డుదయించెన్. 176

*అర్థము :*

ఈగతిన్ = ఈరీతిగా, రతికేళీ సుఖసాగరమునన్ = కామక్రీడలలో కలిగిన సౌఖ్యమన్న సముద్రమున, తేలియున్న సమయంబునన్ = ఈదులాడుచున్న సమయమున, తత్‌యోగంబు = వారి కలయిక (అదృష్ట వస్తు ప్రాప్తి), ఎటువంటిదో = ఏవిధమైనదో గాని, సద్యోగర్భంబునన్ = అప్పటికప్పుడు పూర్తి అయిన గర్భములో, సుపుత్రుఁడు, ఒకఁడు, ఉదయించెన్ = పుట్టెను.

*తాత్పర్యము :*

మహానందంతో వారు రతిక్రీడలలో ఉంటుండగా ఆ కూటమి ఎటువంటిదోగాని అప్పుడే పూర్తి అయిన గర్భములో ఉలూచికి ఒక కొడుకు పుట్టాడు.

*విశేషము :*

సద్యోగర్భము : సద్యః గర్భము — అప్పటికప్పుడే ఏర్పడిన నిండుచూలు.

అటువంటి గర్భము ఏర్పడడము ఆ ఇద్దరి కలయిక మహిమో కాక, జాతకయోగం వల్ల కలిగిన అదృష్టమో చెప్పలేమంటాడు కవి.

యోగము = కూడిక, అదృష్టవస్తు ప్రాప్తి అని అర్థాలు.

*పాఠాంతరము :*

ఈగతి రతికేళి సుధా
సాగరమునఁ దేలియున్న.........

సుధాసాగరము = అమృతసముద్రము.

*అలంకారము :*

శ్లేష, రూపకము.

ఆ చక్కని బాలుఁడు వా
క్ప్రాచుర్యము గాంచు నని శుభగ్రహ దృష్టుల్
చూచి, యిలావంతుం డని
యా చతురుఁడు నామకరణ మలరచి యంతన్. 177

అర్థము :

ఆచతురుఁడు = ఆ నేర్పరి అయిన అర్జునుడు. శుభగ్రహ దృష్టుల్ = (జాతకరీతిని) శుభము గలుగజేయగల గ్రహాల స్థితిగతులనుబట్టి. ఆచక్కని బాలుఁడు. వాక్ప్రాచుర్యముఁ = మాటలనేర్పుకి ప్రసిద్ధిని. కాంచుఁ అని = పొందునని. చూచి = నిర్ణయించి. ఇలావంతుడని = వాక్కు-కలవాడు (ఇలా-వాక్)అన్న అర్థమునిచ్చే పేరుతో. నామకరణము. అలరిచి = చేసి. అంతన్ = తర్వాత - తరవాతి పద్యముతో అన్వయము.

తాత్పర్యము :

ప్రసవ సమయములో గ్రహాల స్థితిగతులనుపట్టి. పుట్టిన చక్కని బాలుడు మంచిమాటకారి అవుతాడని నిర్ణయించి ఆ అర్థం వచ్చేలాగ ఇలావంతుడు అని అర్జునుడు నామకరణము చేశాడని భావము.

విశేషము :

అర్జునుడికి జ్యోతిషము కూడ తెలుసును కాబట్టే 'చతురుడు' అన్నాడు కవి.

గ్రహాలిచ్చే ఫలితాలు ఇతర గ్రహాల చూపులవల్ల మార్పు చెందుతుంటా యంటారు జోస్యులు. శుభగ్రహము పాపగ్రహ దృష్టివల్ల సంపూర్ణమైన ఫలము నీయజాలదు.

అలంకారము :

పరికరాంకురము.

కామినిఁ జూచి, 'రమ్మ గజగామిని, యిక్కడ నొక్కనాఁ డీఁకం
దామసమైన నక్కడ హిత వ్రతి తైర్థిక కోటి యాత్మలో
నేమని యెంచునో యిపుడ యేఁగవలెఁ, దరువాత నీ సుత
గ్రామణి నీవు వచ్చెదరుగా క'ని యూఱడిలంగఁ బల్కినన్. 178

అర్థము :

కామినిఁ జూచి = ఉలూచిని చూచి, గజగామిని = ఏనుగువలె మందమగు నడకగలదానా, రమ్మ = విను(అన్నమాట),ఇఁకన్ = ఇంకా,ఇక్కడ, ఒక్కనాఁడు, తామసమైనన్ = ఆలసించిన ఎడల, అక్కడన్ = గంగయొద్దున, హిత వ్రతి తైర్థిక కోటి-హిత = స్నేహితుల యొక్కయు, వ్రతి = వ్రతము పూనిన వారి యొక్కయు, తైర్థిక = తీర్థయాత్రికుల యొక్కయు, కోటి = సమూహము, ఆత్మలోన్ = మనసులందు, ఏమని ఎంచునో, యిపుడ = ఈ క్షణమే, ఏఁగవలెన్ = పోవలయును, తరువాతన్, ఈ సుతగ్రామణి = ఈకుమార శ్రేష్ఠుడును, నీవున్, వచ్చెదరుగాక = రావలయును, అని యూఱడిలంగన్ = ఓదార్చినట్లు, పల్కినన్ = అనగా, తరువాతి పద్యంతో అన్వయము.

తాత్పర్యము :

ఇంకా ఇక్కడ ఒక్క రోజయినా ఆలస్యము చేస్తే అక్కడ మావారంతా ఏమనుకుంటారో; నే నిప్పుడే వెళ్ళాలి, తరువాత నీవూ కుమారుడూ రావచ్చును, అని ఓదార్చగా - అని భావము.

విశేషము :

ఇంకా కొన్నినాళ్ళయినా తనతో ఉండమని అర్జునుడిని ఉలూచి కోరడము సహజము. అలాగు కోరుతూంది కాబట్టే 'కామిని' అని చమత్కారము. అందుకే ఊరడిలంగ బల్కుట కూడా.

ఈ పద్యములో అర్జునుడి కాశ్రితులయం దున్న ఆదరణ వ్యక్తమవుతుంది.

కొందరు 'నీ సుతగ్రామణి' అని పదవిభజన చేశారు. ఇక్కడి సందర్భాన్ని పట్టి 'ఈ సుతగ్రామణి' అనడము మేలో, 'నీ సుతగ్రామణి' అనడము మేలో పాఠకులు నిర్ణయించగలరు.

'వచ్చెదరుగాక' అని ప్రార్థనార్థకంగా చెప్పడం ఆజ్ఞారూపంగా చెప్పడంకన్న సమంజసము.

ఊరడించవలసి వచ్చింది కాబట్టి ఉలూచి ఎంతో విచారించిందని గ్రహించాలి.

అలంకారము :

పరికరాంకురము.

అంటినప్రేమ జాహ్నవికి నప్పుడ తోడ్కొని వచ్చి యల్ల, వా
ల్గంటి నిజేశ్వరుం దనదు గబ్బి చనుంగవఁ జేర్చి, బాష్పముల్
కంటఁ దొరంగుచుండఁ, దిరుగం దిరుగన్ గనుగొంచుఁ గ్రమ్మఱెన్,
జంటఁ దొఱంగి సంజను దెసంజను జక్కవ పెంటియో యనన్. 179

ఉలూచి అర్జునుడిని సాగనంపడాన్ని కవి ఈ పద్యములో చాల సహజంగా వర్ణిస్తున్నాడు.

అర్థము :

అంటినప్రేమన్ = మనసున నాటుకొని ఉన్న ప్రేమతో, జాహ్నవికి = గంగానదికి, అప్పుడ = ఆలస్యము చేయకుండ, అల్లన్ = మెల్లగా, తోడ్కొని వచ్చి, వాల్గంటి = వాలిన కన్నులుగల ఉలూచి, నిజేశ్వరున్ = తననాథుని, తనదు, గబ్బి చనుంగవన్ చేర్చి = బిగువు చన్నుల నడిమి (బిగ్గ కౌగిలించుకొని), బాష్పముల్ = కన్నీళ్ళు, కంటన్ = కన్నులనుండి, తొరంగుచుండన్ = కారుతుండగా, తిరుగన్ తిరుగన్ = మరలమరల, కనుగొంచు = వెనుకకు చూస్తూ, జంటన్ = జోడును, తొఱంగి = విడిచిపెట్టి, సంజను = సంధ్యాకాలమున, దెసన్ = దిక్కులయందు (ఏదో ఒక దిక్కుకి), చను = పోవునట్టి, జక్కవ పెంటియో యనన్ = ఆడుజక్కవవలె, క్రమ్మఱెన్ = మరలిపోయెను.

తాత్పర్యము :

అర్జునుడిని గంగాతీరానికి మెల్లగా తీసుకొని వచ్చి, కంటనీరుగారుస్తూ, గాఢంగా కౌగిలించి, తిరిగి తిరిగి వెనకకుచూస్తూ, సంజను జోడువిడిచి ఎటోపోయే జక్కవ పిట్టలాగా ఉలూచి మరలి పోయిందని భావము.

విశేషము :

విచారముతో ఉన్నది కాబట్టి ఉలూచిని 'వాలిన కన్నులుగల' దానిగా అర్థం చెప్పడము సమంజసము.

అల్లవాల్గంటి = ఆ ఉలూచి అని అర్థం చెప్తుతారు. ఆ అల్లకు తగినంత అర్థగౌరవము లేదు. అల్లన్ = మందముగా, మెల్లగా అని అర్థము ఉంది. విచారభరితమయిన ఈ సన్నివేశములో ఆ అర్థము చక్కగా కుదురుతుంది.

విడిచిపెట్టునప్పుడు బిగ్గ కవుంగిలించడమూ, తిరిగి తిరిగి వెనుకకు చూడడమూ చాల స్వభావసిద్ధ విషయాలు.

నాథుడిని విడిచి వెళ్ళుతున్న ఉలూచిని సంధ్యాకాలములోని జక్కవ పెట్టతో సరిపోల్చడం చాల మనోహరము.

వాలుకన్నులూ, కంటినీరూ, అల్లన రావడమూ, తిరిగి తిరిగి చూడడమూ, ఏదోదిక్కుకి పోవడమూ ఇవన్నీ విచార సూచకాలు.

పాఠాంతరము :

సంజను వెసం జను జక్కవ పెంటియో యనన్.

— వేదము వారు.

వెసఁ = శీఘ్రముగా, ఇక్కడ శీఘ్ర మనడం రసభంగము. తిరుగన్ తిరుగన్ చూడ డానికి అవకాశముండదు. కాబట్టి దెసఁ అని గ్రహించాము.

అలంకారము :

స్వభావోక్తి, ఉపమ.

అంతట రాజురాకఁ గని యాప్త పురోహిత భృత్య వర్గ మ
త్యంత ముదమ్ము జెంది "యిటు లార్తులఁ గాచుట కేమొ గాక యే
కాంతముగాఁగ నేఁగుదురె యంచుఁ దలంచితి; మీరు వచ్చు ప
ర్యంతము మమ్ము మేమెఱుఁగ; మందఱ ప్రాణము లీవ భూవరా." 180

అర్థము :

అంతటఁ = ఈలా అర్జునుడు వచ్చినంతట, రాజురాకఁ కని = అర్జునుడు రావడం చూచి, ఆప్త = హితులయొక్కయు, పురోహితుల (యొక్కయు), భృత్య = సేవకుల యొక్కయు, వర్గము = సమూహము, అత్యంత ముదమ్ముజెంది = మిక్కిలి ఎక్కువ సంతోషముపొంది, "ఆర్తులఁ = బాధపడుతున్న వారిని, కాచుటకేమొ = రక్షించుటకై యుండును, కాక = కాకున్న, ఇటుల, ఏకాంతముగాఁగఁ = ఒంటరిగానే, ఏగుదురే = వెళ్ళారా, అంచు, తలంచితిమి, ఈరు = మీరు, వచ్చుపర్యంతము = తిరుగ వచ్చినంతవరకు, మమ్ము మేము యెఱుంగము = మాకు మతిపోయినట్టుంది, మా యందఱప్రాణములు, భూవరా = రాజా, ఈవ = నీవేకదా !"

తాత్పర్యము :

రాజు తిరిగి రాగానే అక్కడివారందరూ సంతోషించారు. "ఆర్తరక్షణ కోసమయి ఉంటుంది, లేకపోతే ఒంటరిగా మీరు వెళ్ళారా అని అనుకున్నాము. ఇప్పుడు మిమ్ములను చూచినంతవరకు మాకు మతులు పోయాయి; మా అందరి ప్రాణాలు మీరేకదా !" అని అన్నారు.

విశేషము :

ఒంటరిగ పోవడానికి, ఆర్తసంరక్షణయందు గల సంరంభము తప్ప మరొక కారణము ఉండదని వారి ఊహ. జరిగిన కథకూడా అదే. కామార్తిలో ఉన్న ఉలూచిని రక్షించడానికే పోవడము.

మా అందరి ప్రాణము నీవే కాబట్టి నీవు దూరము పోగా మా ప్రాణాలు మమ్ము విడిచి పెట్టినట్టు లయింది అని భావము.

"ఎందుకు ఒంటరిగ వెళ్ళారు?" అని అడగడానికి బదులు, మర్యాదగా, "ఆర్తరక్షణకే వెళ్ళి ఉంటారనుకున్నాము" అనడము, రాజసేవకుల లక్షణము. ఈమాట లనడానికి చనువు కలవాడు విశారదుడే కావాలి.

ఆభావాన్ని గ్రహించే అర్జునుడు ఈ క్రిందిపద్యములోని విషయాన్ని చెప్పాడని భావించాలి.

*అలంకారము :*

కావ్యలింగ, పర్యాయోక్తి.

అని పలుకఁ బ్రసన్నముఖుఁడై విభుఁ డిష్టసఖుఁ విశారదుం
గని "యొకవింత వింటె? ఫణికన్య యులూచి యనంగ నోర్తు న
న్గొని, తమ నాగలోకమునకుం జని, తన్ను రమించు మంచుఁ, జె
ప్పని ప్రియ మెల్లఁ జెప్పి యొడఁబా టొనరించి, కరంచె డెందమున్.

*అర్థము :*

అని పలుకఁ, ప్రసన్నముఖుఁడై = సంతోషము తెలియజేసే ముఖము గలవాడై, విభుఁడు = రాజు, ఇష్టసఖుఁ = ప్రియస్నేహితుడగు, విశారదుఁ కని, ఒకవింత వింటె = ఈ చిత్రమైన సంగతి విన్నావా? ఉలూచి అనంగన్, ఫణికన్య ఓర్తు = ఒక నాగకుమారిక, నఁ, కొని = తోడ్కొని, తమ నాగలోకమునకుంజని, తన్ను రమించుము అంచుఁ = తన్ను సంతోషపెట్టుమని, చెప్పని ప్రియమెల్ల చెప్పి = చెప్పరాని తన ప్రేమచేష్టలన్నీ తెలిపి, ఒడబా టొనరించి = సమ్మతించినట్టుచేసి, డెందమున్ = మనసును, కరంచెన్ = కరగించి వైచెను (మనసు కరగిపోయినట్లు సుఖింపజేసెను).

*తాత్పర్యము :*

ఆమాటలకు సంతోషించి తన ఇష్టసఖుడితో, 'విన్నావా విశారదా', ఉలూచి అన్న ఒక నాగకన్యక నన్ను తన నాగలోకానికి తీసుకొనిపోయి, తన ప్రేమను, ఏ మర్మము లేకుండా చెప్పి, నన్ను ఒప్పించి మనసు కరగిపోయినట్లు సుఖింపజేసింది.

*విశేషము :*

ఇష్టసఖుడు కాబట్టే ఈ ఉదంతమంతా చెప్పుతున్నాడు.

అలంకారము :

అనుప్రాసము.

చెప్పెడిదేమి ! కన్నుఁగవ చేరల కెక్కుడు, చంద్రబింబమే
తప్పదు మోము, మోవి సవతా చివు రెక్కడిమాట ? గొప్పకుఁ
గొప్ప పిఱుందు, గబ్బి చను గుబ్బలు కౌఁగిటి కెచ్చు, జాళువా
యొప్పుల కుప్ప మేను, నడు మున్నదొ లేదొ యెఱుంగ నింతకుఁ.

విశారదుడు - అట్టులనా, అందకత్తెయేనా? అని అడిగాడు కాబోలు.

అర్థము :

చెప్పెడిదేమి = ఏమి చెప్పమంటావు, కన్నుగవ = రెండుకళ్ళు, చేరలకు ఎక్కుడు = చేరలకంటే విశాలంగా ఉన్నాయి, చంద్రబింబమే తప్పదు మోము, మోవి = అధరానికి, చివురు = చిగురు, సవతి ఆ = సమానమా, ఎక్కడిమాట = ఎవరనగలరు ? (కాదన్నమాట), పిఱుందు = జఘనము, గొప్పకుఁగొప్ప = మిక్కిలి పెద్దది, గబ్బి = బలిసిఉన్న, చనుగుబ్బలు, కౌఁగిటి కెచ్చుఁ = కౌగిలిలో ఇముడవు, మేను = శరీరము, జాళువా ఒప్పుల కుప్ప = జాళువా దేశపు మేల్మి బంగారము యొక్క అందముల రాశియే, ఇంతకుఁ = ఇప్పటికీ - ఇంత గ్రంథము నడిచిన తరువాత గూడ, నడుమున్నదొ లేదొ యెఱుంగఁ - (అంత సూక్ష్మమైన నడుమని భావము).

విశేషము :

నడుము ఉందోలేదో తెలియ దన్నందుకు

అస్తి నాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్

అని మహాకవి శ్రీనాథు డన్నాడుకదా !

ఈ పద్యములో ఆయా వర్ణనలు తెలిపే విధానములో కవి చాల చక్కని చమత్కారము కనబరిచాడు.

పాఠాంతరము :

'నడుమున్నదొలేదొ యెఱుంగ నింతికిఁ'

ఇంతికిఁ = ఆమెకు, నడుమున్నదొ లేదొ ఎరుంగను అని అర్థము.

అలంకారము :

అతిశయోక్తి, రూపకము.

"చంగున దాటు చూపు లిరు చక్కని బేడిస లేమొ, మీటినన్
గంగున వాఁగు గుబ్బలు చొకారపు దాళము లేమొ; చూడ నౌ
నంగున మించు చెక్కిళు లొయారపు టద్దము లేమొ, చొక్కమై
రంగున మీఱు దాని యధరం బిలఁ గెంపగునేమొ నెచ్చెలీ. 183

అర్థము :

నెచ్చెలీ = మిత్రమా విశారదా, చంగున దాఁటు = తటాలున ఎగిరిపడే - తుప్పున తుళ్ళుతుండే, చూపులు, ఇరు చక్కని = రెండు అందమయిన, బేడిస (చేప) లేమొ, మీటినన్ = వేలితో మీటినంతమాత్రాన, కంగున వాఁగు = కంగుమనిధ్వనించే, గుబ్బలు = చనులు, చొకారపు = అందమయిన, తాళము లేమొ = (వాద్యవిశేషమయిన) కంచు తాళపుచిప్పలేమొ, చూడన్ ఔ = (ప్రతిబింబము) చూడడానికి తగిన, అంగున = అందము - మెరుగుతో, మించు = ప్రకాశించే, చెక్కిళులు = బుగ్గలు, ఒయారపు = సొగసయిన, అద్దము లేమొ, చొక్కము ఔ = నిర్మలమైన, రంగున = ఎర్రనిరంగుతో, మీఱు = అతిశయించే, దాని యధరంబు = ఆ ఉలూచి పెదవి, ఇలన్ = మనభూమిలోని, కెంపగునేమొ.

తాత్పర్యము :

విశారదా, తుప్పున తుళ్ళుతుండే చూపులు బేడిస అనుకుంటాను; మీటితే కంగునమోగే స్తనాలు తాళపు చిప్పలయి ఉంటాయి; నీడ చూచుకోడానికి తగినట్టుండే చెక్కిళ్ళు అద్దాలలాగే కనిపించాయి; ఎర్రనిరంగుతో ఉన్న ఆమె పెదవి మన కెంపే అనుకుంటాను. అని భావము.

విశేషము :

కన్నులు (చూపులు) చేపలతోనూ, స్తనాలు తాళపు చిప్పలతోనూ, చెక్కిళ్ళు అద్దాలతోనూ మనకవులు పోలుస్తారు.

అలాగున సరిపోల్చడానికి తగిన కారణాలు చూపించి సమర్థిస్తున్నాడు కవి. ఉలూచి చూపులు చంచలము లని, గుబ్బలు బిగువుగల వని, చెక్కిళ్లు మెరుగెక్కిన వని, అధరము ఎర్రని దని భావము.

ఈ పద్యము నాలుగుచరణాలలో 'ంగున' ప్రాసగా ఉంచడము కవి ఉద్దేశముగా కనిపిస్తుంది. కాబట్టి ఈ పాఠాన్నే మనము నిర్ణయించుకున్నాము.

పాఠాంతరాలు :

1. చెంగున దాఁటు చూపు లిరు చిక్కని బేడిసలేమొ

—వేదముహారూ, బులుసువారూ, వావిళ్ళవారూ.

చెంగున అని ఆరంభించినందువల్ల, 'చిక్కని' అనక తప్పలేదు. అర్థము చెప్పడానికి కష్టపడి వేదమువారు 'ఎడబాయని బేడిసచేపలు' అన్నారు; బులుసువారు 'పొగరెక్కి (మిడిసి పడుచున్న) చేపలు' అని చెప్పారు. ఏలాగో చెప్పలేము.

2. చంగున దాఁటుచూపు లిరుచక్కని....

— నోరివారూ, తిరుపతివారూ.

చెంగున, చంగున— రెండు రూపాలకు ఒకటే అర్థము. ఇరు చక్కని = రెండువైపుల అని అర్థము.

3. ....రూప మానంగనసైన చెక్కిళులు నాణెపు టద్దములే మొ......

— వేదమువారు, తిరుపతివారు, బులుసువారు.

దీనికి 'మన రూపము అందు ప్రతిబింబింపఁగా చూచుకొనఁ దగినవైన కపోలములు' అని వేదమువారు వ్యాఖ్యానించారు.

బులుసువారు 'రూపము ఆనఁగా = స్వరూపమును గ్రహింపఁగా - ప్రతిబింబ మనుట, కనసైన = చూచుటకుఁ దగిన - ప్రతిబింబమును చూచుకొనుటకుఁ దగియున్న' అని అర్థం చెప్పారు.

ఏమయినా 'ఆనఁగా కనన్ ఐన' అని మూడు విరుపులూ, యతికోసము సరళంగా నడవని 'నాణెపు' ప్రయోగమూ చేమకూర వాడివి కావేమో అనిపిస్తాయి.

'అధరంబిల' అనడానికి బదులు 'అధరంబొక' అనీ, 'అధరంబును'అనీ పాఠాలున్నాయి.

ఉపమానాలు నాలుగింటికీ అందాన్ని తెలిపే (చక్కని బేడిసలని, చొకారపు తాళములని, ఒయారపు టద్దములని, చొక్కమౌ కెంపని) పదాలను జోడించాడు కవి. కాబట్టి 'ఇరు చక్కని = రెండువైపుల' అనడము కవి ఉద్దేశము కాదు.

అలంకారము :

ఉత్ప్రేక్ష.

ఆ యెలనాగ వేణి మెఱుఁగారు కటారికి మాసటీఁ డగుం
బో యనవచ్చు, నమ్మెఱుఁగుఁబోఁడి పిఱుందు సమస్త భూమికిం
రాయ లనంగవచ్చు, నల రాజ నిభాస్య యెలుంగు గట్టివా
క్కోయిల కంచు కుత్తికలకున్ బయకాఁ డనవచ్చు, నెచ్చెలీ. 187

అర్థము :

నెచ్చెలీ = ప్రియతముడా ! ఆ యెలనాగ వేణి = ఆ జవరాలి జడ, మెఱుఁగారు = కాంతిగల, కటారికి = నిడుపైన కత్తికి, మాసటీడు = దానిని ఉపయోగించే శూరుడు, అగుఁగా వో = అగునుసుమా (మించును), అనవచ్చుఁగా. ఆ మెఱుఁగుఁబోఁడి = ఆ ప్రకాశవంతమైన శరీరముగలదాని, పిఱుందు = కటిప్రదేశము, సమస్త భూమికిఁగా = భూచక్రమునకు, రాయలు = ప్రభువు, అనంగవచ్చున్ (అతిశయించును). అల, రాజ నిభ ఆస్య = ఆచంద్రముఖియొక్క, ఎలుంగు = కంఠస్వరము, గట్టివా కోయిల = గయ్యాళి కోయిల యొక్క, కంచు కుత్తికలకుఁగా = కంచువలె మ్రోగు కంఠములకు, బయకాఁడు = (సంగీత) విద్యాగురువు (మీఱియుండును), అనవచ్చుఁగా.

తాత్పర్యము :

ఆ ఉలూచి జడ కత్తికి అధిపతివంటిది; పిరుదు భూమికి రాజువంటిది; కంఠస్వరము కోయిలలకు గురువు వంటిది. అనగా జడ పొడవయిన కత్తికంటె బాగుంటుందనీ, కటిప్రదేశము భూమికంటే గుండ్రంగానూ విశాలంగానూ ఉంటుందనీ, గొంతు కోయిలలకంటే శ్రావ్యంగా ఉంటుందనీ అభిప్రాయము.

విశేషము :

మించి ఉంటుంది అన్న అర్థములో ప్రయోగించిన పదాలు ఆయా ఉపమానాలకు అర్థాలైనవిగా ఉండడము చమత్కారము.

కటారి మాసటీని (శూరుని) చేతిలోనిది; సమస్త భూమి రాయల యధీనము, కంచుకుత్తికలను బయకాడు (గురువు) చెప్పి బాగుపరుచును.

ఈ పద్యములో ఇంకొక క్రమము గూడ కనబడుతుంది. "మెఱుఁగు" కటారిని గూర్చి చెప్పిన తరువాత ఉలూచిని మెరుగుబోడి అనీ, 'రాయల' గూర్చి చెప్పిన తరువాత ఆమెను 'రాజనిభాస్య' అనీ ప్రయోగించడము సాభిప్రాయమె అనాలి.

ఈ ప్రయోగాలవల్ల ఉలూచియొక్క వేణి, పిరుదు, కంఠస్వరమునే కాక, ఆమె వయసూ శరీరమూ ముఖమూ గూడా కవి వర్ణించాడు.

గట్టి + వాయి — గట్టి వా అంటే గట్టినోరు గలది = గయ్యాళి.

కంచుకుత్తికలు కంచులాగా ఒక స్వరాన్నే పలుక గలుగతాయి గాని, సంగీతానికి కావలసిన మెలకువలతో పలకలేవు. ఉలూచిగొంతు గురువుగా వాటిని సరిదిద్దుతుందని భావము.

అలంకారము :

వ్యతిరేకము.

"మదిరాక్షి మోవి జిగి ప్రతి
వదనము గావించుఁ గీర పదనముతోడన్;
మదనుని విలు గొనవచ్చున్
సుదతీమణి కన్నుబొమల సుద తీరెంచన్. 185.

అర్థము :

మదిరాక్షి = ఆ కాంతయొక్క, మోవి జిగి = పెదవుల కాంతి, కీర పదనముతోడన్ = చిలుక ముఖముతో – ముక్కుతో, ప్రతివదనమున్ = ఎదురు ముఖమును (ప్రతివాదమును), కావించున్ (చిలుకముక్కు కన్న ఎర్రగ ఉన్నది), సుదతీమణి = ఆ కాంతారత్నము యొక్క, కన్నుబొమల, సుద తీరు = కొనల అందము, ఎంచన్ = ఆలోచించగా, మదనుని = మన్మథుని, విలున్ = వింటిని, కొనన్ వచ్చున్ = వెలపెట్టి కొనవచ్చును (కన్నుబొమల చివరల అందము మన్మథుని విల్లును మించునట్లున్నది).

తాత్పర్యము :

ఆ ఉలూచి పెదవి చిలుకముక్కుకంటే ఎర్రగా ఉంటుంది, ఆమె కనుబొమలతీరు మన్మథుడి వింటికంటె ఎక్కువ అందంగా ఉంటుంది అని భావము.

విశేషము :

మదిరాక్షి అంటే రెండువిధాల అర్థము చెప్పవచ్చును. మదిర అనగా కల్లు. మదిర + అక్షి = కల్లు త్రాగినపుడు, మైకమువల్ల కలిగే వాలు గన్నుల అందము సహజముగనే కన్నుల యందు గలిగిన కాంత.

లేదా, మదింపచేసేది మదిరము. కాబట్టి మదిరాక్షి అంటే, చూచువారలను మదింపచేసే స్వభావము గల కన్నులు గలది.

సుదతి అంటే అందమైన పలువరస గల ఆడుది అని అర్థము.

ఈ పద్యములో పెదవులనూ, బొమలనేగాక (వానికి చేరువగాఉన్న) దంతములను, కనులను గూడ కవి చమత్కారముగ వర్ణించాడు.

సుద తీరు :– సుద అంటే తుద, కొన, అని అర్థము. ఇక్కడ 'కొనలు' అని చెప్పుకోవాలి. ఆమె కనుబొమల ఆది అంతాల సొగసు మన్మథుడి వింటికంటే ఎక్కువ అని భావము.

మన్మథుడి వింటిని వెలకు కొనవచ్చునని అర్థము చెప్పుకున్నాము. కవి అంతటితో తృప్తి పడినట్టు కనబడదు. చూడండి :

మదనుని విలుకొన = వింటియొక్క కొన. సుదతీమణి కన్నుబొమల సుద (కొన) తీరును ఎంచన్ వచ్చున్ = పొగడుటకు వచ్చును. అని గూడ చెప్పవచ్చును. పొగడుటకు రావడము ఆ కనుబొమల ఆధిక్యాన్ని అంగీకరించడ మన్నమాట.

వేదమువారు 'ప్రతివదనము గావించు' దగ్గర "చిలుక పలుకులకన్న మధురములగు పలుకులు ఆమె మోవికడ నుండి వెలువడునని భావము" అని చెప్పారు.

*అలంకారము :*

యమకము, శ్లేష, ఉపమ.

అల జడ యందముఞా, మెఱుఁగు టూరు మిటారము, నాకు ముందుగాఁ
జిలువ కొలం బటంచుఁ జెలి చెప్పకతొల్తనె చెప్పెఁ; ద త్తనూ
విలసన మెన్నఁ గన్నదియు విన్నదిగా; దిలలో లతాంగు ల
ప్పొలఁతుక కాలిగోరులకుఁ బోలరు, పోలునొ యేమొ తారకల్. 186

*అర్థము :*

చిలువకొలంబు అటంచున్ = తనది నాగకులమని, చెలి = ఉలూచి, చెప్పక తొల్తనె = చెప్పకముందే, అల జడ అందముఞా = ఆ జడ సొగసున్ను, మెఱుఁగు...రము = కాంతిగల నూగారు ఒయ్యారమున్ను, (ఈరెండూ) నాకు, ముందుగాఞా = ఆరంభములోనే - ఆమెతో నేను మాటలాడడానికి ముందే, చెప్పెఞా = తెలియపరిచాయి; తత్ తనూ విలసనము = ఆమె శరీర విలాసము, ఎన్నన్ = ఆలోచించగా, కన్నదియు విన్నది కాదు = ఎప్పుడూ చూచికాని వినికాని ఎరగము, ఇలలో లతాంగులు = (మన) భూలోకములోని తీగబోడులు - అందకత్తెలు, ఆ పొలఁతుక = ఆ కాంతయొక్క, కాలిగోరులకున్ పోలరు = కాలిగోరులకు కూడా-రవ్వంతయినా-సరిపోలరు, తారకలు = చంద్రుడి భార్యలయితే, పోలునొ ఏమొ = సరిపోవచ్చు నేమో.

*తాత్పర్యము :*

పాములలాగా ఉన్న ఆ జడా, ఆ నూగారూ ఆ కాంతది నాగజాతి అని మొదటనే — ఉలూచి చెప్పకముందే — తెలియపరిచాయి; అలాటి శరీర విలాసము కనీవినీ ఎరగము. మన భూలోకములోని అందగత్తెలు ఆమె కాలిగోరులకు గూడా సరిపోలరు ఆ చంద్రుడి భార్యలయితే సరిపోతారేమో అని భావము.

*విశేషము :*

అల జడయందము...అల అంటే ఇంతకుముందు (184 వ పద్యములో) వర్ణించిన జడా, నూగారూ అన్నమాట. అవి రెండూ కృష్ణసర్పాలలాగా ఉన్నాయి. కాబట్టి ఆమెది నాగ

కులమని మొదటనే-ఉలూచి 'ఈ జగంబు పాతాళము నేనులూచి యనుదాన భుజంగమరాజ కన్యకన్" అని చెప్పడానికి ముందే—తనకు తెలియజేసినట్టు అర్జునుడు భావించాడు.

నాగలోక ప్రస్తావన వచ్చింది కాబట్టి భూలోకములోని అందకత్తెలు స్మరణకు వచ్చారనడం సమంజసము వారు ఉలూచి కాలిగోరులకు గూడా సరిపోలరని నిశ్చయించాడు.

గోరుల ప్రస్తావన వచ్చింది కాబట్టి గోరులకు కవులు ఉపమానంగా చెప్పే నక్షత్రాలు, చంద్రుడి భార్యలు, జ్ఞాపకానికివచ్చి ఆ చంద్రమండలములోని కాంతలు ఉలూచికి సరిపోవచ్చునేమో అన్నాడు.

కాలి గోరుకి అన్న పలుకుబడికి అర్థము స్వల్పభాగానికైనా - రవంతకైనా - సరిపోరు అని. ఆ పలుకుబడిని విరిచి రెండో అర్థము చెప్పడం మనకవికి అలవాటయిన చమత్కారము.

*అలంకారము :*

ఉత్ప్రేక్ష. శ్లేష.

"మరుని గెల్పుల కథా మహిమమ్ము విలసిల్లు
నొఱపుఁ జిత్తరు రీవి నుల్లసిల్లు;
వీనుల కమృతంపు సోనలై వర్తిల్లు
శారికా ముఖ సూక్తి సందడిల్లుఁ;
గస్తూరి కాది సద్వస్తులఁ బ్రభవిల్లు
పరిమళమ్ముల జోక పరిఢవిల్లుఁ
జెప్పఁ జూపఁగరాని సింగారము ఘటిల్లు
పెక్కు శయ్యల నొంపు పిక్కటిల్లు;
వింత హరువుల పనులచే విస్తరిల్లు;
దివ్య మాణిక్య కాంతులఁ దేజరిల్లు;
నందముల కెల్ల నందమై యతిశయిల్లుఁ;
బాఁప జవరాలి బంగారు పడకటిల్లు. 187

అర్జునుడు ఉలూచి పడకటిల్లు వర్ణించి విశారదుడికి చెప్పుతున్నాడా లేక, ఈరూపంగా చేమకూర కవి తంజావూరు రఘునాథ నాయకుడి పడకటిల్లు పాఠకులకు చూపుతున్నాడా?

అర్థము :

౧. పాపజవరాలి = ఆ నాగయువతియొక్క, బంగారు పడకటిల్లు = బంగారు కేళిమందిరము, మరుని......మహిమము-మన్మథుని విజయములను తెలిపే కథలయొక్క మహిమను. విలసిల్లు = ప్రకటించే, ఒఱపు చిత్తరు తీవిన్ = అందములైన చిత్రపటముల యొక్క సొగసుచేత, ఉల్లసిల్లు = ప్రకాశిస్తుంటుంది.

౨. వీనులకు = చెవులకు, అమృతంపు సోనలై = అమృతము గురిసే జల్లులై, వర్తిల్లు = వినవచ్చే, శారికా ముఖ సూక్తి = గోరువంకలు మొదలగు పెంపుడు పిట్టలయొక్క మధుర భాషణములచేత, సందడిల్లు = సందడి గలిగి ఉంటుంది.

౩. కస్తూరి కాది = కస్తూరి మొదలగు, సత్ వస్తులన్ = మంచి (వాసనగల) వస్తువుల నుండి, ప్రభవిల్లు = పుట్టుతున్న, పరిమళమ్ముల = సువాసనలయొక్క, జోరు = అందము, పరిఢవిల్లు = వ్యాపించి ఉంటుంది.

౪. చెప్పన్ చూపఁగన్ రాని = చెప్పుటకూ చూపుటకూ శక్యముకాని, సింగారము = అలంకరణము, ఘటిల్లు = కలిగియున్న, పెక్కు శయ్యల సొంపు = అనేక విధాలయిన పాన్పుల అందము, పిక్కటిల్లు = ఎక్కువగా ఉంటుంది.

వింత హరువుల పనులచే = విచిత్రమయి మనోహరమైన పనితనములచేత, విస్తరిల్లు = ఒప్పి ఉంటుంది, దివ్య = మిక్కిలి ఉత్కృష్టములయిన, మాణిక్యకాంతులన్, తేజరిల్లు = కాంతి గొల్పుతుంటుంది, అందములకెల్లన్, అందమై, అతిశయిల్లు = అతిశయించి ఉంటుంది.

తాత్పర్యము :

మన్మథుని విజయాలు తెలిపే చిత్రపటాలతోనూ, గోరువంకలు మొదలైన పెంపుడు పిట్టల మధుర ధ్వనులతోనూ, కస్తూరీ మొదలైన సుగంధ ద్రవ్యాల పరిమళములతోనూ, అందమయిన అనేక పాన్పులతోనూ, చిత్రవిచిత్రమైన వస్తువులతోనూ, ప్రశస్తమయిన మాణిక్యాల కాంతులతోనూ అందాలన్నిటిలోను అందమయి ఆ ఉలూచి బంగారు పడకటిల్లు ఉంది విశారదా అని అర్జునుడు అన్నాడు.

విశేషము :

ఈ పద్యములో 'ఒప్పుచుండు' అన్న అర్థములో ప్రయోగించినమాట లన్నీ ఆయా విషయాలకు ఉచితంగా ఉండడము చూడదగినది.

మరుని కథల చిత్రాలున్నాయి కాబట్టి - ఉల్లసిల్లు - ఉల్లాసము కలిగించు నని.

శారికాది ధ్వనులవల్ల —— సందడిల్లు - సందడి చేయు నని.

పరిమళములుగాన — పరిథవిల్లు - వ్యాపించు నని.

పెక్కుశయ్యలవల్ల — పిక్కటిల్లు - నిండుకొను నని.

వింతహరువులుగాన — విస్తరిల్లు - విరివిచెందిన వని.

మాణిక్యకాంతులవల్ల — తేజరిల్లు - కాంతిగొల్పునని.

అన్నిటికన్న అందముగాన - అతిశయించు - మించియుండు నని.

చక్కని ప్రయోగాలు.

పండ్రెండు 'ల్లు'లతో మన కవి ఆ పడకటిల్లు నిర్మించాడు.

పద్యము పెద్దచరణాలలో వరుసగా కంటికీ, చెవులకీ, ముక్కుకీ, (శయ్యలవల్ల) శరీరానికీ — పంచేంద్రియాలలో నాల్గింటికి - ఆనందం సూచించాడు కవి.

అలంకారము :

అంత్యానుప్రాసము, ఉదాత్తము.

"ఆ భోగము, తద్వస్తు చ
యాభోగము నెందు గన్నయవి గావు సుమీ
నాభోగపురము సరియౌ
నా భోగవతీ పురంబు సార్థం బయ్యెన్. 188

అర్థము :

ఆ భోగము = నే ననుభవించిన సౌఖ్యమూ, తత్ వస్తు చయ ఆభోగముల = అచ్చటి శృంగారవస్తువుల సమూహాల సమృద్ధీ, ఎందుల కన్నయవి కావుసుమీ = ఎక్కడా చూచినవి కావు — చూడగలిగినవీ కావు సుమా, నాభోగపురము = స్వర్గపురానికి, సరియౌ = సరియైన, ఆ భోగవతీ పురంబు = ఆభోగవతియన్న పట్టణము, సార్థంబయ్యెల = దాని కాపేరు అర్థవంతమయినది - ఆపురము సార్థకమయినది (అని గూడా).

తాత్పర్యము :

విశారదా అక్కడ నే ననుభవించిన సౌఖ్యమూ, అక్కడి వస్తువుల పరిపూర్ణతా మనమెక్కడా చూచినదిగాని చూడగలిగినదిగాని కావు. ఆభోగవతీ నగరము స్వర్గముతో సరిపోల్చవచ్చును. అది ధన్యమయిన నగరము, దాని కాపేరు అర్థవంతంగా ఉంది.

విశేషము :

నాభోగపురము - దీనికి రెండు విధాల అర్థము చెప్పవచ్చును :

1. భోగము = సుఖము, అభోగము = దుఃఖము. న + అభోగము = దుఃఖము లేనిది-స్వర్గము.

2. నభము = ఆకాశము. నభోగులు = ఆకాశమునందు చరించే దేవతలు. వారి సంబంధమైన పురము - నాభోగపురము = దేవనగరము, స్వర్గము.

అర్జును డనుభవించిన ఆ భోగము, అక్కడి వస్తువుల ఆభోగమూ ఈరెండు 'భోగాలు' కలది గాబట్టి ఆ పురమునకు భోగవతి అన్న పేరు అర్థయుక్తముగ ఉన్నదని భావము.

సార్థమే సార్థకముగూడ; ఆ భోగవతీపురంబు సార్థం బయ్యెన్ అనగా, ఆపురము సార్థకమాయెను - కృతార్థత జెందెను.

అలంకారము :

కావ్యలింగ, యమకము, శ్లేష.

"ఆ మదిరాక్షి భోగవతియన్ నదిఁ గ్రుంకఁగఁజేసి, తత్పుర
స్థేముని హాటకేశ్వరు భజింప నొనర్చి, టు తోడితెచ్చి, న
న్నీ మహి నిల్పి, యేఁగె నిదె యిప్పుడె, నన్నెడఁబాయలేని యా
ప్రేమ మదింతయంతయని పేర్కొన రా"దనితెల్పఁ దెల్పినన్, 189

అర్థము :

ఆ మదిరాక్షి = కైపు కలిగించే కళ్లుగల ఆ ఉలూచి, భోగవతి అన్ నదిన్ = భోగవతి అన్నపేరు గల నదియందు, క్రుంకఁగన్ చేసి = స్నానము చేయించి, తత్ పురస్థేమునిన్ = ఆ పట్టణమునందు వెలిసి ఉన్న, హాటకేశ్వరు (డనుదేవు)ని, భజింపనొనర్చి = సేవించునట్లు చేసి, ఇటు తోడితెచ్చి = ఇక్కడకు తీసుకొనివచ్చి, నన్నీ మహిన్ నిల్పి = నన్ను ఈభూలోకమున నిలిపి, ఇదె, ఇప్పుడె = ఈ క్షణమే, ఏఁగెన్ = పోయెను; నన్ను ఎడబాయలేని ఆ ప్రేమము అది ఇంత అంత అని, పేర్కొనరాదు = చెప్పడానికి శక్యముకాదు" అని అర్జునుడు తెల్పన్, తెల్పినన్...(తరువాతి కన్వయము).

తాత్పర్యము :

ఆ ఉలూచి నన్ను నదిలో స్నానము చేయించి, అక్కడి దేవుడిని ప్రార్థింపజేసి, ఇక్కడికి తీసుకువచ్చి ఇప్పుడిప్పుడే ఎంతో విచారముతో తిరిగి వెళ్ళిపోయింది. విశారదా, ఆమె ప్రేమ ఇంత అంత అని చెప్పడానికి శక్యముకాదు సుమా అని అర్జునుడు చెప్పగా...

విశేషము :

181 వ పద్యములో "ఒక వింత వింటె..." అని ఆరంభించి అర్జునుడు విశారదుడితో చెప్పిన ఉలూచి ముచ్చటను ఈ పద్యముతో ముగించాడు.

మదిరాక్షి—185 ప. చూడండి.

పురములవల్ల నదులకూ, నదులవల్ల పురాలకీ పేరులు రావడము సాధారణము.

అలంకారము :

కారకదీపకము.

మౌఖరి మించ నిట్లులను మంత్రిశిఖామణి, చోద్య మయ్యె నా
వైఖరి విన్న, నే మనఁగవచ్చు నహో ! మనుజేంద్ర చంద్రమ
శ్శేఖర, చిల్వరా కొలము చేడియ నొక్కతెఁ జెప్పనేల ? నీ
రేఖఁ గనుంగొన న్వలవరే ఖచరీ ముఖ సుందరీ మణుల్ ? 190

అర్థము :

మంత్రిశిఖామణి = మంత్రులలో శ్రేష్ఠుడగు విశారదుడు, మౌఖరి మించన్ = మాటనేర్పు అతిశయించునట్లుగా, ఇట్లు అనున్, మనుజేంద్ర = నరపాలురలో, చంద్రమశ్శేఖర = (చంద్రుడిని తలపూవుగాగల) ఈశ్వరునివంటివాడా - శ్రేష్ఠుడా, ఆ వైఖరిన్ = ఆవిధమంతా, విన్నన్, చోద్యమయ్యె = చాలఆశ్చర్యం కలిగింది, ఏమనంగన్ వచ్చున్ = ఏమి చెప్పడానికీ అలవికాదు. అహో = ఓహో!, నీరేఖన్ కనుంగొనన్ = నీ సౌందర్యమును చూచినంత, చిల్వ రా కొలము = నాగరాజ కులములోనిదైన, చేడియన్ = కాంతను, ఒక్కతెన్ = ఒక్కదానిని మాత్రము, చెప్పనేల, ఖచరీ ముఖ సుందరీమణుల్ = దేవతాస్త్రీలు మొదలైన కాంతారత్నములు, వలవరే = మోహించరా ?

తాత్పర్యము :

అర్జునుడి మాటలు విని ప్రాణస్నేహితుడైన విశారదుడు రాజేశ్వరా, మీరుచెప్పిన విషయాలు చాల అద్భుతంగా ఉన్నాయి, ఓహో ! ఒక్కమాట మాత్రము చెప్తాను. మీ

అందము చూస్తే ఒక్క నాగకాంతే అనడమెందుకు ? దేవతాస్త్రీలు గూడా మిమ్ము ప్రేమించక పోతారా ?, అని అన్నాడు.

*విశేషము :*

మంత్రము - అనగా ఆలోచన - రహస్యము. దానికి తగినవాడు మంత్రి. ఇక్కడ మంత్రి అన్న పదము సాభిప్రాయము.

చంద్రమశ్శేఖరుడికి - ఈశ్వరుడికి, చిలువరాజు ఆభరణము. ఆ సంబంధముండగా నాగకాంత ఒక్కతెను గూర్చి వేరే చెప్పనేల ?

దేవతాకాంతలు గూడా ప్రేమించరా అనడములో ముందుముందు ఊర్వశి అర్జునుడిని వలవడము విశారదుడు సూచిస్తున్నాడా ? అలాంటి అభిప్రాయ ముండబట్టే 'సౌఖరిమించ' విశారదుడన్నాడని కవి చెప్పాడా ?

ఖ-ఆకాశమునందు, చరీ-చరించుచుండు స్త్రీలు, దేవతాస్త్రీలు,

*అలంకారము :*

పరికరాలంకారము, అనుప్రాస.

అనిపలుక నలరి బలరిపు
తనయుం డటఁ గదలి, మొదలి త్రైర్థికులును దా
నును, మంచుకొండ యండకుఁ
జని త, చ్ఛిఖ రావలోక జని తాదరుఁడై. 191

*అర్థము :*

అని పలుకగా, అలరి = సంతోషించి, బలరిపు తనయుండు = బలుడన్నవాని శత్రువగు ఇంద్రుని కుమారుడు అర్జునుడు, అటగా = ఆచోటినుండి, కదలి, మొదలి = తనతో మొదట వచ్చిన, త్రైర్థికులునున్ = యాత్రాపరులును, తానుగా, మంచుకొండ అండకుగా = హిమాచలము దగ్గరకు, చని = వెళ్ళి, తత్ శిఖర అవలోక జనిత ఆదరుఁడై = దాని శిఖరములను చూచుట యందు పుట్టింపబడిన - కలిగిన - కోరికగలవాడై - ఆ శిఖరాలను చూడగోరి, తరువాతి పద్యంతో అన్వయం.

*తాత్పర్యము :*

ఆమాటలు విని సంతోషించి అర్జునుడు తనతో వచ్చిన యాత్రికులతో కలిపి హిమాలయము దగ్గరకు పోయి ఆపర్వత శిఖరాలు చూడాలన్న కోరికతో...

విశేషము :

మొదటి చరణములో అలరి – బలరి, రెండో దానిలో కదలి...మొదలి, మూడోదానిలో కొండ – అండ, నాలుగోదానిలో జనిత...జనితా – శబ్దాలంకారాలు.

పదియాఱువన్నె గుబ్బలి రాచకూఁతురు
　　పట్టంపు రాణిగాఁ బరఁగు జాణ,
పతి యర్ధదేహంబు సతి యంట నిజముగాఁ
　　బ్రబలు కన్నియఁ గన్న భాగ్యశాలి,
ముజ్జగమ్ముఁ బవిత్రముగఁజేయు తీర్థమ్ముఁ
　　గొనసాగఁ జేసిన యనఘమూర్తి,
భూమిధ రారాతిచే మొక్కవోవని
　　యరిది బిడ్డను గాంచినట్టి మేటి,
యోషధుల మొలిపించిన యుత్తముండు,
చల్లదనముల కెల్ల దీక్షాగురుండు,
సకల మాణిక్య రాశికి జననసీమ,
యీ నగస్వామి సద్గణాస్థానభూమి. 192

హిమగిరి ప్రభావమును అర్జునుడు తనతో ఉన్నవారికి తెలుపుతున్నాడు.

అర్థము :

౧. పదియాఱు వన్నె గుబ్బలి రాచకూఁతురు = పదహారువన్నె మేలిమిబంగారు పర్వత రాజు అగు మేరువు పర్వతము యొక్క కూతురు మేనకను, పట్టంపురాణిగాన్ పరగు = ముఖ్య భార్యగా గలిగినట్టి, జాణ = ప్రౌఢికలవాడు.

౨. పతి అర్ధ దేహంబు సతి = భర్తశరీరములో సగము భార్య అని, అంట = చెప్ప డము, నిజముగాన్ = వాస్తవమగునట్లు, ప్రబలు = ప్రవర్తించునట్టి, కన్నియన్ = కూతురు-పార్వతీదేవిని, కన్న, భాగ్యశాలి = కనినట్టి అదృష్టవంతుడు.

౩. ముజ్జగమ్మున్ = మూడులోకములను, పవిత్రముగన్ = పావనములగునట్లు, చేయు తీర్థమ్ము = పుణ్యనదిని (గంగానదిని), కొనసాగన్ = ఆగకుండా ప్రవహించునట్లు, చేసిన, అనఘమూర్తి = పాపరహితుడగు వ్యక్తి.

౪. భూమిధర అరాతిచేన్ = రాజులకు శత్రువగు వానిచేత (కొండలకు శత్రువగు ఇంద్రునిచేత, మొక్కవోవని = దెబ్బతినని - కుంటుపడని, అరిది బిడ్డను = అసాధారణుడైన కుమారుని (మైనాకుని), కాంచినట్టి = కనినట్టి, మేటి = శూరుడు.

ఓషధులన్ = మూలికాదులగు ఔషధవస్తువులను, మొలిపించిన = మొలుచునట్లు చేసిన, ఉత్తముండు = మంచివాడు, చల్లదనమునకు ఎల్లన్, దీక్షాగురుండు = నియమమును నేర్పే గురువు, సకలమాణిక్యరాశికిన్ = అన్ని విధాల రత్నాల సమూహాలకు, జననసీమ = పుట్టిన చోటు, అగు, ఈ నగస్వామి = ఈ పర్వతరాజు, సద్గణ ఆస్థాన భూమి = సాధుజనుల సమూహానికి కొలువుండే స్థలము.

తాత్పర్యము :

ఈ పర్వతరాజు బంగారు కొండరాజు కూతురిని వివాహము చేసుకొన్నాడు. 'పతి అర్ధాంగి సతి' అని లోకానికి చాటిన కూతురునీ, రాజవిరోధివల్ల దెబ్బతినని కొడుకునూ కన్నాడు. మూడులోకాలూ పావనంచేసే పుణ్యనదిని ప్రవహించేలాగ చేశాడు. ఓషధులను మొలిపించి, చల్లదనానికి నిలయమయి, అన్నివిధాల రత్నాలకు పుట్టినిల్లయి, సాధుజనులకు ఆశ్రయమయి ఉన్న మహోత్తముడు సుమా అని భావము.

విశేషము :

ఈ పద్యములో ఆయా వ్యక్తుల - మేరువనీ, మేనక అనీ, పార్వతి అనీ, మైనాకుడు అనీ - పేరులు చెప్పక పోవడము ఉద్దేశపూర్వకము. ఎవరో ఒక అత్యుత్తమ గృహస్థుని ధ్వనిరూపంగా కవి చూపించాడు. గొప్ప ఇంటి పిల్లను పెళ్ళిచేసుకొని, ఒక మహాపతివ్రతనూ, ఒక గొప్పశూరుడినీ కన్నాడు; పావనమైన నదిని ప్రవహింపజేశాడు; మానవ కళ్యాణంకోసం కావలసిన ఓషధులూ రత్నరాసులూ సమకూర్చాడు; సాధుజనులకు ఆశ్రయమిచ్చాడు అని సూచించాడు.

చరణాల చివరనున్న 'జాణ' మొదలైన పదాలు ఎంత భావగర్భితాలో చూడండి :

గొప్ప ఇంటి పిల్లను (మేనకను) పెళ్ళిచేసుకున్నవాడు - జాణ.

పతి అర్ధాంగి సతి అన్న సత్యాన్ని నిలిపిన (పార్వతిని) కనినవాడు - భాగ్యశాలి.

పావనమైన నదిని గంగను ఆటంకము లేకుండా ప్రవహించేలాగచేసి మూడులోకాలను కుమారుని పవిత్రంచేసినవాడు - అనఘమూర్తి.

అదే పనిగా అన్ని కొండల రెక్కలు నరుకుతుండే ఇంద్రుడిచేత గూడ దెబ్బతినని (మైనాకుని) కన్న పౌరుషములో గొప్పవాడు - మేటి.

ఔషధ ద్రవ్యాలు పండించి రోగనివారణ చేస్తున్నవాడు - ఉత్తముడు.

చల్లదనానికీ-శాంతికీ-ఆదర్శంగా ఉండేవాడు - దీక్షాగురుడు.

అన్ని విధాల రత్నాలకు నిలయమయినవాడు - జననసీమ.

కూతురు పార్వతి ఈశ్వరుడి భార్య ఈశ్వరి; ఐశ్వర్యం ఆమె అధీనము - కాబట్టి తండ్రి హిమవంతుకు భాగ్యశాలి. సత్ సంతానం కలవాడు గూడా భాగ్యశాలే.

పూర్వము కొండలకు రెక్కలుండేవి. వాటి సాయంతో కొండలు ఎక్కడపడితే అక్కడ ఎగిరిపడుతూ చాల గొడవ చేస్తుండేవి. ఇంద్రుడు వజ్రాయుధముతో వాటన్నిటి రెక్కలు ముక్కలు చేశాడు. మేనక కొడుకు మైనాకు డన్న పర్వతము మాత్రం ఆ ఇంద్రుడి బారిని పడకుండా ఉండగలిగిందని పురాణకథ.

భగీరథుడి ప్రయత్నమువల్ల గంగ శివుడి జడలలోనుండి హిమాచలముమీద పడ్డది. దానిని ఆటంకపరచకుండా ఆ పర్వతము ఆగంగను ప్రవహించుకుంటూ పోయేలాగ - కొనసాగ చేసింది.

సత్ గణాస్థాన భూమి :— సత్ అంటే సాధువని అర్థముంది. సత్‌గణ = సాధుల సమూహము - దానికి ఆస్థాన భూమి = సభాప్రదేశము - ఆశ్రయము అని చెప్పుకున్నాము. సాధువులు (సత్యవాక్కులయిన ఋషులు మొదలైనవారు) హిమవత్పర్వతప్రాంతాలలో ఉంటారని నమ్ముతారు.

*పాఠాంతరము :*

చివరి చరణములో 'సత్‌గణాస్థానభూమి' అనడానికి రెండుపాఠాంతరాలు కనిపిస్తున్నాయి :

1. సద్గుణాస్థానభూమి

— వేదమువారూ, వేంకటకృష్ణమాచార్యులవారూ.

పైని చెప్పిన గుణాలకు ఆస్థానమని అర్థము చెప్పుకోవాలి. ఇది కుటుంబస్థుని వర్ణనకు అనుగుణంగా ఉన్నది కాని, హిమాచల విశేషాల వర్ణనకు పనికిరాదు.

2. సత్ ఖని స్థానభూమి

— తిరుపతివారూ, నోరివారూ.

సత్ = మంచి, ఖని = గనులకు, స్థానభూమి = ఉనికి పట్టయిన ప్రదేశము అని అర్థము. హిమాలయములో అనేక లోహాల గనులుండడము సహజము. కాబట్టి ఇది పర్వతవర్ణనకు సమంజసమే కాని, ధ్వనిరూపంగా ఉన్న కుటుంబస్థుని వర్ణనకు పనికిరాదు.

*అలంకారము :*

ఉల్లేఖము, అంత్యానుప్రాసము, సమాసోక్తి.

అని బహుప్రకారంబుల హిమగిరిప్రభావంబు వక్కాణించుచుఁ 1. దత్ప్రదేశంబున శాఖాశిఖోల్లిఖిత గ్లావృక్షం బగు నగస్త్య వటవృక్షంబుఁ గనుంగొని, యచట విశంకట కటక నికట కమనీయ మణిశృంగంబగు మణిశృంగంబు గని, యగణ్య పుణ్యాగమ సమర్థం బగు హిరణ్యబిందు తీర్థంబునం గృతావగాహుండై, గో హిరణ్య ధర ణ్యాది దానంబు లనేకంబు లొనరించి, 2. ప్రాగ్భాగంబునం గలికలిత నర శరణ్యంబగు నైమిశారణ్యంబుఁ జొచ్చి, యచ్చోటఁ గోటిగుణ తాంగీకృ తానత జనతా సమర్పిత నారాయణుం డగు బదరీనారాయణుని భూషించి, 3. మనీషి మనీషిత ఫలప్రదానశచీప్రి యాగం బగు ప్రయాగంబున కేఁగి, ముముక్షు హృదయంగమం బగు త్రివేణీసంగమంబునఁ దానంబులు దానంబులుం గావించి, మాధవు నారాధించి, 4. భవ ర సానుభవ భీరు సానుక్రోశం బగు పంచక్రోశంబుఁ బ్రవేశించి, యభ్యర్ణ మణికర్ణిక యగు మణికర్ణికం గ్రుంకి, యన్నపూర్ణ విశాలాక్షీ సనాథుం గాశీవిశ్వనాథుం దర్శించి, 5. తైర్థిక సమాహిత సమ్యగయ యగు గయకుం జని, యచట నుచితకృత్యంబు లొనరించి, 6. పురుషోత్తమక్షేత్రంబునకుం జని, యింద్రద్యుమ్న సరస్సున శిరస్సు మజ్జనంబై నమజ్జనదృక్చకోర జ్యోత్స్నా ధుని జగన్నాథునిఁ గొలిచి, 7. యాతల గౌతమీతటినీ తోయస్నాతయై జగన్మోహన మనోజ మనోవశీకరణ కారణ కళాప్రావీణ్య లావణ్య హావ భావప్రకట నటన రేఖా శ్లాఘా దూరీకృత రంభోర్వశీ రంభో ర్వశీతకిరణ కిరణ నిభ విభా రంగ న్మణిరంగ మంట పోజ్జ్వ లాసిక లాసికా లక్షణ కృతలక్షణ కటాక్ష వీక్షణ సుధారస ధారా సేచన కా నేచి తా సేచన కాంగుండై, పాపాటవీ పాటన పాటవ సంసూచన దీక్షారామ పరమేశ్వరుండగు దాక్షారామ భీమేశ్వరుం జేరి జోహారులు నుపహారంబులు సమర్పించి, 8. సంత తానంత కాంతి రంహుం డగు నంతర్వేది నృసింహు సేవించి, యందు భవ సాగర తరణి యగు సాగరసంగమంబునఁ దీర్థం బాడి, 9. కృష్ణవేణ్యాది పుణ్యతరంగిణుల మునింగి, 10. యుత్తుంగ శృంగ విలోకిలోక సాత్కృత సువర్ణ పర్వతం బగు శ్రీపర్వతంబు లోచన పర్వంబుగాఁ జూచి ప్రణమిల్లి, మల్లికార్జును సమ్మోదంబునఁ బ్రణుతించి, మల్లికార్జున మనోజ్ఞ భ్రమరీ విభ్రమ రమ్యయగు భ్రమరాంబం బ్రశంసించి, 11. భక్త శోభన పరంపరా సంపాదక పాదకమల రజోలేశు నహోబలేశు భజించి, 12. నిజ భజన రత ప్రతిపాదిత ధనేశ్వర పదంబులగు శ్రీవేంకటేశ్వర పదంబులకు నమస్కృతులు విస్తరించి, 13. దుస్తరాంహ స్తూలికా సందోహ దాహ దోహల నిజాహ్వాయ స్మరణ విస్ఫులింగం బగు శ్రీకాళహస్తి లింగంబు

నంతరంగంబున హర్ష తరంగంబు లుప్పొంగం గాంచి, 14. కాంచీపురంబున కరిగి, కరిగిరీశ్వరుండై విరాజిలు వరదరాజుల నమ్ర జన క్రమ ఫలదాయకు నేకామ్ర నాయకుం బూజించి, 15. యావలఁ గావేరి కాంతరిత వనంబున సుప్రసన్న రూపంబునం బాటిల్లు కోటి హరిత్తురంగ ధాముని రంగధాముని సేవించి, కుంభఘోణ చంపకారణ్యాది పుణ్యక్షేత్రంబులు వీక్షించుచు, 16. దక్షిణ నీరాకర వీచికా నికర శీకర తుందిల మందానిల స్పంద నాతిశీతల సికతాతల విహిత యాతాయాత నిరవధిక పథిక నికాయ కాయమా నాయమాన లవ ల్యేలా వల్లీ వేల్లిత క్రముక ప్రముఖ శాఖి శాఖా శిఖా లతాంతర కుహర విహరమాణ వివిధ గరుద్రథ కుల కలక లోద్వేల వేలా మనోజ్ఞ మార్గంబున నపవర్గ రమేశ్వరంబగు రామేశ్వరంబునకుం బోయి, సేతు సందర్శనం బొనర్చి, విధూత స్నాతృ పంచజన వృజిన జనుష్కోటి యగు ధనుష్కోటిం గృతస్నానుండై, పాండవుం డందులం దులాపురుషాది మహాదానంబు లాచరించి, రఘువీర భూభుజ భుజా దర్ప దర్పణం బగు రామాయణంబు పారాయణంబు చేసి, భూసు రాశీర్వాద పరంపరలం బొదలి, యచ్చోటం గదలి, పదుమూఁడవనెల పాండ్య మండలాఖండలుం డగు మలయధ్వజుం డేలు పురంబుఁ జేరంబోవుసమయంబున, 193



అర్థము :

హిమగిరిప్రభావంబు = మంచుకొండ గొప్పతనము, వక్కాణించుచుఁ = చెప్పుతూ, 1. శాఖా...[1]వృక్షంబగు = కొమ్మల చివరలచేత రాచబడిన చంద్ర నక్షత్ర మండలములుగల, అగస్త్యవటవృక్షంబును = అగస్త్యవటము అన్న పేరుగల మర్రిచెట్టును, కనుంగొని = చూచి, నికట ...శృంగంబగు— నికట = సమీపమందు, వికంకట = విశాలములైన, కటక = గుహలును, కమనీయ = సుందరమైన, మణిశృంగంబు = మణులతో కూడిన శిఖరములును గల, మణిశృంగంబుఁ = మణిశృంగమన్న పేరుగల పర్వతమును, కని = చూచి, అగణ్య.. తీర్థంబునన్ — అగణ్య = లెక్కలేని, పుణ్యఆగమ = పుణ్యముల సంపాదనకు, సమర్థంబగు = తగియున్న. హిరణ్యబిందు అన్న తీర్థంబున, కృతావగాహుండై = స్నానముచేసి, గో...దానమ్ములు = గోవులూ బంగారమూ భూమీ మొదలైన దానాలు, అనేకమ్ములు, కావించి = చేసి, 2. ప్రాగ్భాగమ్మునఁ = తూర్పుదిక్కున, కలి...శరణ్యంబగు — కలి = పాపముతో, కలిత = కూడిన, నర = మనుష్యులకు, శరణ్యంబగు = దిక్కు అయిన, నైమిశారణ్యంబున్, చొచ్చి = ప్రవేశించి, అచ్చోటఁ, కోటి...నారాయణుండు — కోటిగుణితా = ...లెటు అను

1. గ్లౌ(=చంద్రుడు)+ఋక్షంబు(=నక్షత్రములు). సంధివల్ల 'గ్లా...బు' ...తుంది.

సని, అంగీకృత = అంగీకరించబడిన, ఆనత = నమస్కరిస్తున్న, జనతా = సమూహముచేత, సమర్పిత = ఇవ్వబడిన, నారాయణుండగు = నారాయణోపనిషత్తుకలవాడగు, బదరీనారాయణుని, భూషించి = పూజించి, 3. మనీషి...ప్రయాగంబగు - మనీషి = పండితులచేత, మనీషిత = కోరబడిన, ఫల = లాభములను, ప్రదాన = ఇచ్చుటచేత, శచీ = ఇంద్రుడి భార్య శచీ దేవియొక్క, ప్రియాగ = ప్రియమయిన, చెట్టు, అనగా కల్పవృక్షముతో సమానమైన, ప్రయాగంబునకు, ఏఁగి = వెళ్ళి, ముముక్షు = మోక్షమును కోరేవారి, హృదయంగమంబగు = మనసులనాకర్షించే, త్రివేణీసంగమంబునన్ = గంగా యమునా సరస్వతీ నదులు కలిసినచోట, తానంబులున్ = స్నానాలూ, దానంబులు, కావించి = చేసి, మాధవున్ ఆరాధించి = విష్ణుదేవుని పూజించి, 4. భవ...క్రోశంబగు — భవ రసానుభవ = సంసార దుఃఖాల అనుభవానికి, భీరు = భయపడ్డ వారియందు, స అనుక్రోశంబగు = దయతోకూడిన, పంచక్రోశంబున్ = పంచక్రోశమన్న పేరుగల వారణాసి క్షేత్రములను, చేరి, అభ్యర్ణ = సమీపమందు, మణికర్ణికయగు = మణులతో కూడిన కర్ణాభరణము గల, మణికర్ణిక (అన్న తీర్థము)లో, క్రుంకి = స్నానముచేసి, అన్నపూర్ణ విశాలాక్షీ = అన్నపూర్ణ అయిన విశాలాక్షి పేరుగలదేవితో, సనాథున్ = కూడిఉన్న, కాశీవిశ్వనాథున్, దర్శించి = పూజించి, 5. తైర్థిక...గయకున్ - తైర్థిక = యాత్రికులయందు, సమాహిత = ఉంచబడిన, సమ్యక్ అయ = మంచి శుభములుగల (యాత్రికులకు మేలుకూర్చే), గయకున్, చని, అచట ఉచితకృత్యంబులు = చేయవలసిన పనులు, ఒనరించి = చేసి, 6. పురుషోత్తమ క్షేత్రంబునకున్ = శ్రీజగన్నాథ క్షేత్రానికి, చని = వెళ్ళి, ఇంద్రద్యుమ్న (అన్న పేరుగల) సరస్సులో, శిరస్సుమజ్జనంబై = తలకు స్నానముచేసి, నమ...ధుని—నమజ్జన = నమస్కరిస్తున్న జనులయొక్క, దృక్చకోర = కన్నులన్న చకోర పక్షులకు, జ్యోత్స్నాధుని = వెన్నెలప్రవాహము అయిన, జగన్నాథస్వామిని, కొలిచి = సేవించి. 7. అతలన్ = తరువాత, గౌతమీ ... స్నాతయై— గౌతమీ తటినీ = గోదావరి నదియొక్క, తోయ = నీటిలో, స్నాతయై = స్నానముచేసినవాడయి, జగన్...కాంగుడై -జగన్మోహన = లోకాలను మోహింపజేసే, మనోజ = మన్మథుడి యొక్క, మనోవశీకరణ = మనస్సును వశపరుచుకొనే, కళా = విద్యయందు, ప్రావీణ్య = నేర్పుచేతా, లావణ్య = సౌందర్యముచేతా, హావభావ = శృంగార చేష్టలచేతా, ప్రకట = ప్రసిద్ధిచెందిన, నటన = నటనలోని, రేఖా = విలాసముల, శ్లాఘా = ప్రశంసలవల్ల, దూరీకృత = దూరముగా చేయబడిన, రంభా ఊర్వశీ రంభోరూ = రంభ ఊర్వశీ అన్న సుందరాంగులు కలవారయి, అశీతకిరణ = సూర్యునియొక్క, కిరణ = కిరణములతో, నిభ = సమానమయిన, విభా = కాంతిచేత, రంగత్ = ప్రకాశించుతున్న, మణిరంగ మంటప = మణులతో నిర్మించిన నాటకరంగస్థలమునందు, ఉజ్జ్వల = ప్రకాశిస్తున్న, అసికా కృతలక్షణ = చిన్నకత్తులను చిహ్నములుగాగల, లాసికా = నాట్యకత్తెలచేత, కృతలక్షణ = మంచిగుణములు కల, కటాక్షవీక్షణ = క్రేగంటి చూపులనే, సుధారసధారా = అమృతరసధార యొక్క, సేచనక = తడుపుటవల్ల, ఆసేచిత = బాగా తడపబడిన, ఆసేచనకఅంగుఁడు = ఎంతచూచినా తనివి తీరని శరీరముకలవాడై, పాపాటవీ = పాపాల అడవిని,

విపాటన = నరుకుటయందు, పాటవసంసూచన = నేర్పును సూచిస్తూ ఉన్న, దీక్ష = దీక్షయందు, రామ = సంతోషించే, పరమేశ్వరుండగు, దాక్షారామ భీమేశ్వరున్ = దాక్షారామములోని భీమేశ్వర స్వామిని, చేరి, జోహారులు = నమస్కారాలూ, కానుకలూ సమర్పించి, 8. సంతత = ఎల్లప్పుడు, అనంతకాంతి = అంతములేని కాంతియొక్క, రంహుండు = వేగముగల, అంతర్వేది, నృసింహునిన్ = నరసింహస్వామిని, సేవించి = పూజించి, అందు = అక్కడ, భవసాగర = సంసారసాగరానికి, తరణి అగు = ఓడవంటి, సాగరసంగమంబునన్, తీర్థంబాడి = స్నానము చేసి, 9. కృష్ణవేణి ఆది = కృష్ణానది మొదలయిన, పుణ్యతరంగిణులన్ = పుణ్యనదులయందు, మునింగి = స్నానముచేసి, 10. ఉత్తుంగ....పర్వతంబగు—ఉత్తుంగశృంగ = ఎత్తయిన శిఖరములను, విలోకిలోక = చూచిన జనులకు, సాత్కృత = ఇవ్వబడిన, సుపర్వపర్వతంబు = దేవతల పర్వతము (బంగారుకొండ, మేరువు,) అగు = అయిన, శ్రీపర్వతంబున్ = శ్రీశైలమును, లోచనపర్వంబుగాన్ చూచి = కన్నుపండువుగా చూచి, ప్రణమిల్లి = నమస్కరించి, మల్లికార్జునున్ = మల్లికార్జునస్వామిని, సమ్మోదంబునన్ = సంతోషముతో, ప్రణుతించి = స్తోత్రముచేసి, తత్‌మనో...రమ్యయగు—తత్ = ఆ మల్లికార్జునస్వామియొక్క, మనోజ్ఞ = హృదయ పద్మమునకు, భ్రమరీ విభ్రమ = ఆడుతుమ్మెదవంటి విలాసమువల్ల, రమ్యఅగు = సుందరమయిన దయిన, భ్రమరాంబన్ = భ్రమరాంబ అన్న దేవిని, ప్రశంసించి = నుతించి, 11. భక్త...లేశున్-భక్త = భక్తులకు, శోభనపరంపర = శుభముల వరుసను, సంపాదక = సమకూర్చే, పాదకమల = పాదపద్మముల, రజోలేశున్ = ధూళియొక్క రేణువులుకల, అహోబలేశున్ = అహోబల నరసింహస్వామిని, భజించి = పూజించి. 12. నిజ భజన రత = తనసేవయందాసక్తిగల, జన = మనుష్యులకు, ప్రతిపాదిత = ఇవ్వబడిన, ధనేశ్వరపదంబులగు = కుబేరునివంటి పదవులుగల, శ్రీవేంకటేశ్వర (సామి) పదంబులకు, నమస్కృతులు, విస్తరించి = ఎక్కువగాచేసి, 13. దుస్త...లింగంబగు — దుస్తర = దాటశక్యముకాని, అంహస్తూలికా సందోహ = పాపమనే దూదిరాశిని, దాహ = కాల్చుటయందు, దోహల = ఉత్సాహముకల, నిజాహ్వయ = తననామముయొక్క, స్మరణ(అనే), స్ఫులింగ = నిప్పురవ్వయైన, శ్రీకాళహస్తిలింగంబున్, అంతరంగంబునన్ = మనస్సులో, హర్షతరంగంబులు = సంతోషవీచికలు, ఉప్పొంగన్ = కాంచి = చూచి, 14. కాంచీపురంబునకు, అరిగి, కరిగిరీశ్వరుడై = హస్తి పర్వతానికి ప్రభువయి, విరాజిలు = ప్రకాశించునట్టి, వరదరాజులన్ = వరదరాజస్వామిని, నమ్ర = అణకువగల, జన = నరులకు, క్రమఫలదాయకు = మంచిఫలములిచ్చే వాడగు, ఏకామ్ర నాయకున్ = ఏకామ్ర ప్రభువగు శివుని, పూజించి, 15. అవలన్ = తరువాత, కావేరీ (నదిచేత) అంతరిత = చుట్టబడిన, కాంత = మనోహరమైన, అంతరీపంబునన్ = ద్వీపమునందు, ప్రసన్నరూపంబునన్ = ఆదరణచూపే రూపముతో, పాటిల్లు = ఒప్పుచున్న, కోటి = కోటిసంఖ్యగల, హరిత్‌తురంగ ధాముని = సూర్యుల ప్రకాశముగల, రంగధామునిన్ = శ్రీరంగనాథస్వామిని, సేవించి = పూజించి, కుంభఘోణ చంపకారణ్య ఆది = కుంభకోణము చంపకారణ్యము మొదలైన, పుణ్యక్షేత్రంబులు, వీక్షించుచు = చూచుకుంటూ, 16. దక్షిణ...

ఈశ్వరంబగు — దక్షిణ నీరాకర = దక్షిణసముద్రము యొక్క, వీచికా = అలల, నికర = సమూహముయొక్క, శీకర = తుంపురులతో, తుందిల = నిండిన, మందానిల = పిల్లవాయువుల, ఆస్పందన = కదలికచేత, అతిశీతల = మిక్కిలి చల్లనైన, సికతాతల = ఇసుక ప్రదేశమును, విహిత = చేయబడిన, యాతాయాత = వచ్చుచుపోవుచుండే, నిరవధిక = ఎడతెగని, పథిక నికాయ = యాత్రికుల సమూహమునకు, కాయమా నాయమాన = పందిలివలె వ్యాపించియున్న, లవలీ ఏలా వల్లీ = లవలీ తీగలచేతను ఏలకి తీగలచేతను, వేల్లిత = అల్లుకొనబడిన, క్రముక ప్రముఖ = పోక మొదలగు, అఖిలశాఖి = అన్ని వృక్షములయొక్క, శాఖాశిఖా = కొమ్మల చివరలయొక్కయు, లతా = తీగలయొక్కయు, అంతర = లోపలిభాగము లనే, కుహర = తొర్రలయందు, విహరమాణ = విహరిస్తున్న, వివిధ = అనేక విధాలయిన, గరుద్రథ = పక్షులయొక్క, కుల = సమూహముయొక్క, కలకల = సందడితో, ఉద్వేల = అతిశయించిన, వేలా = సముద్రతీరమందలి, మనోజ్ఞ మార్గంబునఁ = రమ్యమైన త్రోవను, అపవర్గ రమా = మోక్షలక్ష్మికి, ఈశ్వరంబు = ప్రభువు, అగు రామేశ్వరంబునకుఁ, పోయి, సేతు దర్శనంబు, ఒనరించి, విధూత...జనుష్కోటి — విధూత = ఎగురగొట్టబడిన, స్నాతృపంచ జన = స్నానము చేసిన మనుష్యుల, వృజిన = పాపములుగల, జనుష్కోటి అగు = జన్మల పరంపరకలదైన, ధనుష్కోటి (తీర్థమున), కృతస్నానుండై = స్నానముచేసి, పాండవుండు = అర్జునుడు, అందులఁ = అక్కడ, తులాపురు షాది మహాదానంబులు, ఆచరించి = చేసి, రఘు...దర్పణంబగు — శ్రీరాముని భుజబలము తెలుసుకొనుటకు అద్దమువలె నున్న, రామాయణంబు, పారాయణంబుచేసి = చదివి, భూసుర ఆశీర్వాద పరంపరలఁ = బ్రాహ్మణ ఆశీర్వాదవరుస, పొదలి = పొంది, అచ్చోటు, కదలి = విడిచిపెట్టి, పదుమూఁడవనెల, పాండ్య .... లుండగు — పాండ్యదేశమునకు ఇంద్రుడయిన, మలయధ్వజుండు, ఏలు = పాలించునట్టి, పురంబు = పట్టణము, చేరఁబోవు సమయంబున...తరువాతి కన్యయము.

తాత్పర్యము :

హిమాచల మాహాత్మ్యము చెప్పి, 1. అక్కడి అగస్త్య వటవృక్షమును మణిశృంగమును చూచి హిరణ్యబిందు తీర్థములో స్నానముచేసి, 2. నైమిశారణ్యములోని బదరీనారాయణుని సేవించి, 3. గంగాయమునా సరస్వతీ నదుల సంగమస్థానమయిన ప్రయాగలో విష్ణుని పూజించి, 4. పంచక్రోశమున అన్నపూర్ణ విశాలాక్షీయుతుడైన కాశీవిశ్వనాథుని ప్రార్థించి, 5. గయలో చేయవలసిన పనులు నిర్వర్తించి, 6. (పూరీ) జగన్నాథుని దర్శించి, 7. గోదావరీనదిలో స్నానముచేసి దాక్షారామ భీమేశ్వరుని ఆరాధించి, 8. అంతర్వేదినరసింహస్వామిని సేవించి, 9. కృష్ణానది మొదలైన తీర్థాలు చూచుకుంటూ, 10. శ్రీశైలమున మల్లికార్జున భ్రమరాంబలకు నమస్కరించి, 10. అహోబల నారసింహుని కొలిచి, 12. తిరుపతి వెంకటేశ్వరుని పూజించి, 13. శ్రీకాళహస్తి లింగమును ఆరాధించి, 14. కాంచీనగర

మున వరదరాజస్వామినీ ఏకామ్రనాథునీ కొలిచి, 15. శ్రీరంగనాథస్వామిని పూజించి కుంభ కోణము మొదలయిన పుణ్యక్షేత్రాలను దర్శించి, 16. రామేశ్వరమునకుపోయి, ధనుష్కోటిని స్నాన దానాదులుచేసి రామాయణము పారాయణచేసి, మలయధ్వజరాజు నగరము మణిపురమును సమీపించినప్పుడు — తరువాతి పద్యముతో అన్వయము.

*విశేషము :*

మణిపురము—ఇప్పటిపేరు మణలూరు.

మణికర్ణిక దీని చరిత్ర : ఇది కాశిలోని ఒక కోనేరు. దీనిని విష్ణుమూర్తి చక్రముతో త్రవ్వాడు. దానిని చూడడానికి శివుడు వచ్చి చూస్తుండగా ఆతని చెవిని ఉండిన మణిఖచిత మయిన ఆభరణము ఆ కోనేరులో పడిపోయింది. అందుచేత దానికి 'మణికర్ణిక' అన్నపేరు కలిగింది. ఆ కోనేరు గంగానదితో సమానమయిన మహిమగలది అంటారు.

మంగళస్నాన సంభ్రమము దెల్పెడి రీతిఁ
　　గెలనఁ గెందామర కొలనఁ దేలి,
ధవళముల్ విని చొక్కు హవణి దెల్పెడు లీల
　　హాళిఁ గోయిల పల్కు లాలకించి,
తలఁబ్రాలు వోయు బిత్తరము దెల్పెడు ఛాయ
　　గ్రొన్ననల్ దోయిళ్ళ కొలఁది నొసఁగి,
ఖువ్వాన భుజియించు పొలుపు దెల్పెడు జాడ
　　గుమిగూడికొని మరందములు గ్రోలి,
తనకు దోడ్తోడ నగు పెండ్లి కనబడంగఁ
జేయునటువలె గారాబుఁ జెలులఁ గూడి,
వనవిహారంబు గావించి చనెడు పాండ్య
రాజ సుతఁ జూచి యా పాండురాజ సుతుఁడు. 194

*అర్థము :*

౧. మంగళస్నాన సంభ్రమమున్ = పెండ్లిస్నానముయొక్క సందడిని, తెల్పెడురీతిన్ = తెల్పుచున్నదో అన్నట్లు, కెలనన్ = ప్రక్కనున్న, కెందామర (కెంపు + తామర) = ఎఱ్ఱ తామరలుగల, కొలనన్ = సరస్సులో, తేలి = స్నానముచేసి, (స్నానముచేసి వస్తుంటఁటము వివాహస్నానముచేసి వస్తున్నట్లు తోచిందని భావము)

౨. ధవళముల్ = పెండ్లి పాటలు, విని, చొక్కి = ఆనందాతిశయము పొంది, హావణిన్ = విలాసమును, తెల్పెడు లీలన్, హాళిన్ = సంతోషముతో, కోయిల పల్కులు ఆలకిస్తూ,

౩. తలఁబ్రాలు పోయు = భర్తశిరమున తలంబ్రాలు వేయునప్పు డుండే, బిత్తరము = శృంగారచేష్టలను, తెల్పెడు చాయన్, క్రొన్ననల్ - క్రొత్త + ననల్ = అప్పుడు వికసించిన పూవులను, దోయిళ్ళ కొలఁదిన్ ఒసఁగి = దోసిలులతో చెలికత్తెల కిస్తూ,

౪. బువ్వానన్ = బువ్వంపు బంతిని, భుజియించు, పొలుపున్ = అందమును, తెల్పెడి జాడన్, గుమిగూడికొని = అందరూ ఒకచోటచేరి, మరందములు = తేనెలను, క్రోలి = తాగుతూ,

తనకు తోడ్తోఁద నగు = తనకు త్వరలో కాబోయే, పెండ్లి, కనఁబడంగన్ = కనబడట్లు, జేయు నటువలె = చేయుచున్న విధముగా, గారాబుచెలులన్ = ప్రియసఖులను, కూడి, వనవిహారంబున్, కావించి, చనెడు = అంతఃపురమునకు పోవుచున్న, పాండ్యరాజసుతన్ = పాండ్యదేశపురాజు కూతురిని, చూచి, ఆ పాండురాజసుతుఁడు = ఆ అర్జునుడు - తరువాతి పద్యముతో అన్వయము.

*తాత్పర్యము :*

ఆ సమయములో మణిపురాధీశ్వరుడి కూతురు – చిత్రాంగద చెలికత్తెలతో కూడి వనవిహారముచేసి వస్తూ ఉండడము అర్జునుడు చూచాడు. ఆ వనవిహారములో వారు స్నానముచేసి, కోకిలల పాటలు ఆలకించి, దోసిళ్ళతో పువ్వులు ఒకరికొకరు ఇచ్చుకుంటూ, అందరూ కలిసి పూదేనెలు తాగి నగరికి తిరిగి వెళ్తున్నారు. ఈ కార్యక్రమ మంతా ఆ రాజకుమారికకు త్వరలో కాబోయే వివాహాన్ని తెలుపుతూ ఉన్నది; పెళ్ళిలో మంగళస్నానముచేసి, ధవళాలు-పెళ్ళిపాటలు వింటూ, తలబ్రాలు దోసిళ్ల తో పోస్తూ బువ్వంబంతి భోజనాలు చేస్తూన్న ట్టుందని కవి భావము.

*విశేషము :*

పాండ్యరాజ సుత...పాండురాజ సుతుఁడు. ఈ శబ్దములతోనే బంధుత్వము తెలపడము చమత్కారము.

త్వరలో కాబోయే పెళ్ళిని వర్ణనతో సూచించి, కవి ఈ నామ సంబంధాన్ని చెప్పడం ఉద్దేశపూర్వకమే.

ఇంతవరకు ఆమెపేరు చెప్పకపోవడం ఒక గడుసుతనమే కదా.

*అలంకారము :*

ఉత్ప్రేక్ష.

## చిత్రాంగద కథ

ఈ వెలంది యొడల్ పైఁడిలో వెలంది,
యీ నెలంత లలాటంబు లే నె లంత,
ఈ సుపాణి రదశ్రేణియే సుపాణి,
ఈవి డారు మృగీమద శ్రీ విడారు. 195

వనవిహారము చేసి వెళ్తున్న చిత్రాంగదను చూచి అర్జునుడు ఆమె సౌందర్యాన్ని మనసులో మెచ్చుకుంటున్నాడు.

అర్థము :

ఈ వెలంది ఒడల్ = ఈ అందమైన కాంత యొక్క శరీరము, పైఁడిలోఁ వెలంది = బంగారములో మిక్కిలి వెలకలది, ఈ నెలంత లలాటంబు = ఈ తరుణియొక్క నుదురు, లేఁత నెల అంత = (విదియనాటి) బాలచంద్రు డంత, ఈ సుపాణి = మంచి లక్షణములున్న చేతులుగల ఈ కాంతయొక్క, రదశ్రేణియే = దంతముల వరుసయే, సుపాణి = శుభ్రమైన నీరు (కాంతి) గల ముత్యములు, ఈవిడ ఆరు = ఈ చిన్నదానియొక్క నూగారు, మృగీమద శ్రీ = కస్తూరి యొక్క నల్లనికాంతికి, విడారు = నివాసస్థానము,

తాత్పర్యము :

ఈ కాంత శరీరము ఎక్కువ వెలగల బంగారము, ఈమె లలాటము విదియనాటి చంద్రుడంత ఉంది, ఈ యువతి పలువరుస ప్రశస్తమయిన ముత్యాలు; ఈమె నూగారు నల్లని కస్తూరి కాంతికి నిలయము అని భావము.

విశేషము :

సుపాణి = సుప్ప + పాణి = శుభ్రమైన నీరు. రూపాంతరము- సుప్పాణి, ముత్యముల కాంతికి నీరు అని వాడుక.

ఈ సందర్భములోని వర్ణనలు సాధారణమయినవే అయినా రచనావిధానమూ పదగుంభనా మనోహరంగా ఉంచాడు కవి.

అలంకారము :

యమకము, రూపకము.

వాతెఱకు నమృతమే తుల,
మే తులకింపుల పిసాళి మిసిమికి క్రొమ్మిం
చే తుల, చేతుల కబ్జము
లే తుల, లేతుల వెలందు లీ చెలి తులయే ? 196

అర్థము :

వాతెఱకున్ = పెదవికి, అమృతమే, తుల = సమానము, మే = శరీరముయొక్క, తుల కింపుల = నిగనిగలయొక్క, పిసాళి = మనోహరమైన, మిసిమికి = ప్రకాశమునకు, క్రొమ్మించే-క్రొత్త మించే - తొలకరి మెరుపులే, తుల = సమానము, చేతులకు, అబ్జములే = పద్మములే, తులలు = సమానములు, ఏతుల వెలందులు = సాధారణమగు స్త్రీలు, ఈచెలి తులయే = ఈ కాంతకు సమానమా ? కారని భావము.

తాత్పర్యము :

ఈ కాంత అధరానికి అమృతము, శరీరకాంతికి తొలకరి మెరుపు, చేతులకు పద్మాలు సమానము, సాధారణస్త్రీలు ఈమెతో సరిపోలగలరా ?

'ఏతుల యనంగఁ దగుపాటి యింతి వెలయు' అని ఆంధ్రభాషార్ణవము.

విశేషము :

తొలకరి మెరుపులకు కాంతి యెక్కువని ప్రసిద్ధి.

ఈ వర్ణన సాధారణమే అయినా చెప్పడములో చమత్కారం చూపించాడు కవి.

అలంకారము :

ముక్తపదగ్రస్తము, ఛేకానుప్రాసము, ఉపమ.

కన్నె నగుమోము తోడం
బున్నమ చందురుని సాటిఁ బోలుప వచ్చున్
నెన్నుదురుతోడ మార్కొని
ము న్నందఱుఁ జూడ రేకమోవక[1] యున్నన్ 197

---

1. ఈ పద్యాన్ని గురించి విపులమైన విమర్శన 1932 ఆంగీరస సంవత్సర చైత్రమాస 'భారతి' లో 'విజయవిలాస వ్యాఖ్యాన విధానము' అన్న వ్యాసాలలో రెండవ దానిగా ప్రకటించాను. దానినిగూడ చూడమని మనవి.

*అర్థము :*

(పున్నమచందురుఁడు) మున్ను = ఇంతకు పూర్వము, నెన్నుదురుతోడఁ = చక్కని లలాటముతో, మార్కొని = ఎదుర్కొని, అందఱుఁ చూడఁ = బహిరంగముగా, రేక మోవక యున్నఁ = (ఓడిపోయి), రేక మోసిన అవమానముపాలు కాక, ఉండిఉంటే, (ఇప్పుడు) కన్నె (యొక్క) నగుమోముతోడఁ, పున్నమచందురుని, సాటి బోలుప వచ్చుఁ = సమాన మని చెప్పవచ్చును,

*విశేషము :*

ఈ చిన్నపద్యం గూడా పండితులనూ పరిష్కర్తలనూ వ్యాఖ్యాతలనూ మూడువందల సంవత్సరాలకు పైగా చిక్కులపాలు చేసింది. జూలూరువారు, నోరివారు, వేదమువారు, బులుసు వారు అసంతృప్తికరమయిన (అసందర్భమయిన అని అనవచ్చునేమో) అర్థాలుచెప్పి తప్పించు కోవలసి వచ్చింది.

దీనిలో 'రేక మోవక (మోయక) యున్నఁ' అన్నమాటలే ఈ చిక్కంతటికీ కారణము. ఆ మాటలకు సరియైన అర్థం తెలియకపోవడంవల్ల కవి హృదయంలో ఉన్న అమోఘమయిన భావమంతా బయటపడలేదని అనవలసి వచ్చింది.

పద్యంలో ఒక పోరాటము - పోటీ ఉంది. కొన్నాళ్ళకు పూర్వం ఆ పోటిలో చంద్రుడు చిత్రాంగద నుదురును బహిరంగంగా ఎదిరించి రేక మోవడం అనే అపజయాన్ని - అవమానాన్ని పొందాడు. అందుచేత ఆమె నవ్వు ముఖంతో పోల్చడానికి పున్నమచంద్రుడికి అర్హత లేకుండా పోయిందని తాత్పర్యము.

జూలూరు అప్పయ్యగారు "రేక యనగా జాబు, కమ్మ, అదిమోసే పనికి ఏర్పడక పోయినట్టయితేను; అనగా యీ చిన్నదాని నొసటితో ప్రతిఘటించి సమానము కాలేక వోడి జాబులుమోసే హర్కారా వా డయినాడని అర్థము" అన్నారు.

శబ్దరత్నాకర నిఘంటు కర్తలు 'రేక = జాబు అని అర్థమిచ్చి, విజయ విలాసములోని ఈ పద్యాన్నే ప్రయోగంగా చూపించారు.

వేదమువారు "అందరు జూడఁ = ఎల్లవారి యెదుట(అనగా బట్టబయ లయిన అవమాన మునకు పాలై). రేక మోవక యున్నఁ = జాబుమోయు పనిని (తపాలా నౌకరీని) చేయకున్న యెడల" అని వ్యాఖ్యానించారు.

పోటీలో గాని పోరులోగాని అపజయాన్ని - అవమానాన్ని-తపాలానౌకరి సూచిస్తుం దని మన మంగీకరించలేము.

'రేక మోవక' ఉండడము లోని విశేషార్థాన్ని స్పష్టంగా తెలియజేస్తూ ఈ చేమకూర కవే, ఈ విజయవిలాస కావ్యములోనే, వివరించాడు. చూడండి :

మూడవ ఆశ్వాసములో అర్జునుడు సుభద్రను తీసుకొనిపోతూ ఉండగా బలరాముడి సైన్యాలు అతడిని ఆపడానికి ప్రయత్నించాయి. యుద్ధము జరిగింది. ఆ యుద్ధములో సుభద్ర అర్జునుడికి సారథ్యము చేసింది. శత్రుసేనలను పారదోలి అర్జునుడు సుభద్ర సారథ్యాన్ని మెచ్చుకుంటూ ఆమెను ఆలింగనము చేసుకుంటాడు. అప్పుడు, చెమటవల్ల సుభద్ర వక్షస్థలమున పూసుకొని ఉన్న కుంకుమరేఖలు అర్జునుడి గుండె నంటుకొని కత్తిగంటులు – నరుకులు – వలె కనబడ్డాయి. అది చూచి అర్జునుడు చిన్నినవ్వు నవ్వుతూ.

"ఒక్కించుక రేకమోవని నాయురఃస్థలంబున
నీకుచ కుంకుమ రేఖ లంటించి మీ వారికి సూడు దీర్చితివి..."

అని నెయ్యమూ వియ్యమూ ప్రకటించాడు. ...సూడ = పగ.

దీనినిబట్టి 'రేక' అంటే ఇక్కడ ఆయుధమువల్ల కలిగిన గంటు – గాయము – అని తేట పడుతుందికదా. ఈ కావ్యములో మొదటి 40 వ పద్యములో 'రేకమోవక గెల్చుట నీకె తగుర' అని రచించినప్పుడు గూడ మనకవి హృదయములో ఉన్న అర్థము 'కత్తివ్రేటు తిన కుండా' అనే.

"...సుత్రామాదుల్ వడిఁ జుట్టికొన్న
శశిమీఁదన్ రేఖగా నిత్తునే"

అని శేషము వెంకటపతి ప్రయోగం.

ఇప్పుడు మన ప్రస్తుత పద్యాన్ని చూడండి ;

మున్ను విదియనాడు చంద్రుడు ఈకన్య ముఖములో ఒకభాగము మాత్రమయిన నుదురును ఎదిరించి 'రేకమోశాడు' – రేక (చంద్రరేఖ)ఆకారాన్ని పొంది ఓడిపోయాడు; ఈరెండో అర్థాన్నిబట్టి కత్తివ్రేటు – గాయము – గంటు – తిన్నాడు. అదే అపజయమూ అవమానమూను. ఆ విదియనాడు అందరూ చంద్రరేకను చూడడమూ, చంద్రుడి కొాక నూలుపోగు విసరడమూ మనలో ఉంది. కాబట్టి కత్తిగంటు తిన్న అవమానము బహిరంగంగా జరిగింది.

ఇప్పుడు, పూర్ణిమనాడు పోటీ కన్య నవ్వుమొగ మంతటితోను, పైని చెప్పిన అవమాన కారణంగా ఈ చంద్రుడిని పోటీకి రానీయరు.

అంతేకాదు ; ఆనాటి 'రేకమోసిన' గంటు – గాయము – మాని, మచ్చగట్టి చంద్రుడిలో కళంకముగా కనిపిస్తుంది, కాబట్టి నిష్కళంకమైన నవ్వు మొగముతో సరిపోల్చడానికి వీలు లేదని ధ్వని.

*అలంకారము :*

ఉపమ, శ్లేష.

కమలముల నుజ్జగించుం
గుముదంబుల బుజ్జగించుఁ గొమ చూపులు; పు
న్నమ చందమామ వెలుఁగుల
కొమ రంతయుఁ బుణికి పుచ్చుకొనఁ బోలుఁ జుమీ. 198

అర్థము :

కొమచూపులు = ఈకొమ్మ చూపులు, కమలములన్, ఉజ్జగించున్ = నిరసించును, కుముదంబులన్ = తెల్ల కలువలను, బుజ్జగించున్ = లాలనచేయును, పున్నమచందమామ వెలుఁగుల (యొక్క). కొమరు = విలాసము, అంతయు, పుణికి పుచ్చుకొనన్ పోలున్ చుమీ = ఒడిసి తీసికొన్నట్టున్నది సుమీ.

తాత్పర్యము :

ఈకాంత చూపులు తామరలను నిరసిస్తూండడము, కలువలను లాలించడము చూస్తే అవి పున్నమ చందమామ కిరణాలలోని విలాసమంతా ఒడిసి తీసుకున్నట్టు కనబడుతుందికదా!

విశేషము :

చంద్రకాంతివల్ల కమలాలు ముడుచుకుపోతాయి. కలువలు వికసిస్తాయని కవులు అంటారు.

పద్మములను తక్కువ పరచడము, కలువలను పెద్దచేయడము ఈ రెండుపనులూ వెన్నెల చేస్తుంది. ఆ పనినే చూపులు చేస్తున్నవి. కాబట్టి ఆ వెన్నల సౌరంతా చూపులే హరించి నట్లున్నది అని ఊహ.

కమలములను మించి, కుముదములకు సరియయి, వెన్నల కొమరంతా కలిగి ఉన్న చూపులని భావము.

పాఠాంతరము

.........కోమలి చూపుల్
కమలారి మిత్రు నలుగుల
కొమరంతయు.........

ఈ పాఠములో పరిష్కర్త దృష్టి "మిత్ర = సూర్యుడు" అన్న అర్థంమీద పడి ఉంటుంది.

అలంకారము :

ఉపమ, ఉత్ప్రేక్ష.

చెండ్లా గుబ్బలు ? జాళువా తళుకులా చెక్కిళ్ళ డాల్ ? సింగిణీ
విండ్లా కన్బొమ ? లింద్రనీల మణులా వేణీరుచుల్ ? తమ్మి లేఁ
దూండ్లా బాహువు ? లింత చక్కదన మెందుం గాన, మీ జవ్వనిం
బెండ్లాడంగల వాఁడు సేసినది సుమ్మీ భాగ్య మూహింపఁగన్. 199

అర్థము :

గుబ్బలు, చెండ్లా = బంతులా, చెక్కిళ్ళ డాల్ = బుగ్గల కాంతులు, జాళువా తళుకులా = జాళువాదేశపు మేల్మిబంగారు మెరుపులా, కన్బొమలు, సింగిణీ విండ్లా = సింగిణీ- అందమయిన ఒక విధమయిన, లేక, కొమ్ముతో చేసిన, విండ్లా, వేణీ రుచుల్ = తలవెంద్రుకల కాంతులు, ఇంద్రనీల మణులా, బాహువులు, తమ్మి లేత తూండ్లా = లేత తామర తూడులా, ఇంత చక్కదన మెందుం గానము, ఈ జవ్వనిఁ = ఈయౌవనవతిని, పెండ్లాడంగలవాఁడు చేసినది సుమ్మీ భాగ్యము, ఊహింపఁగన్,

తాత్పర్యము :

బంతులవంటి స్తనములు, బంగారు తళుకువంటి చెక్కిళ్ళ కాంతులు, అందమయిన విల్లు వంటి కన్బొమలు, నీలమణులవంటి తలవెంద్రుకల కాంతులు, లేత తామర తూడులవంటి చేతులు కలిగి ఉన్న ఈలాంటి సుందరాంగిని ఎక్కడా చూడలేదు. ఈమెను పెండ్లాడగలవాడు చాలా అదృష్టవంతుడు అని అర్జును డనుకున్నాడు.

విశేషము :

శృంగము అంటే కొమ్ము: దాని వికృతరూపమే సింగిణీ అని ఊహ.

తీర్థయాత్ర సంవత్సరం పూర్తి అయింది. ఇప్పుడు అర్జునుడు కామసంబంధమయిన ఊహలకు దిగవచ్చునుకదా !

అలంకారము :

సందేహము.

అని, కన్గొంటె విశారదా యనిన, 'నాహా ! యేమనన్వచ్చు, నో
జననాథాగ్రణి ! యీ వినూతన తనూ సౌందర్య మీక్షించినన్
దను దా మెచ్చు విధాత చిత్తమున; నీ తన్వంగితోఁ బోల్పఁగా
నెనలే దెచ్చటఁ; జూడమా తుహిన భూభృత్ సేతు మధ్యంబునన్. 200

195 వ పద్యము మొదలు 199 వ పద్యము వరకు అర్జునుడి దృష్టి నాకర్షించిన విషయాలూ, అతని ఊహలూ కవి వర్ణించి, ఈ పద్యములో విశారదుడితో సంప్రతించడము తెలుపుతున్నాడు.

**అర్థము :**

అని = అని మనసులో అనుకొని, విశారదా కన్గొంటే (విశారదుడు మంత్రిశిఖామణి గదా) అనినన్ (అతడు), "ఆహా ! ఓ జననాథాగ్రణి = రాజశ్రేష్ఠుడా, ఏమనన్ వచ్చున్, ఈ వినూతన తనూ సౌందర్యము = మిక్కిలి క్రొత్తదైన ఈ చక్కదనమును. ఈక్షించినన్ = చూచినయెడల, విధాత = బ్రహ్మదేవుడు, చిత్తమునన్ = మనసులో, తనున్ తాన్ మెచ్చున్ = (ఇంత చక్కని కాంతను సృష్టించానుగదా అని) తన్నుతానే మెచ్చుకుంటాడు, ఈ తన్వంగితోన్ = సన్నమగు శరీరముగల ఈ కాంతతో, పోల్పఁగాన్, ఎన = సమానమైన సుందరాంగి, లేదు ఎచ్చటన్; తుహిన భూభృత్ సేతు మధ్యంబునన్ = మంచుకొండ మొదలు రామసేతువు వరకునుగల దేశమునంతటిని, చూడమా = చూచినవారమే కదా ?

**తాత్పర్యము :**

ఆలోచన చాలించి అర్జునుడు చూచావా, విశారదా అనే టప్పటికి విశారదుడు -'ఏమనవచ్చు మహారాజా, ఈ కాంత అందము చూచినట్టయితే బ్రహ్మ తన సృష్టికి తానే తన్ను మెచ్చుకుంటాడు. హిమాచలము మొదలు రామేశ్వరం వరకూ చూచివచ్చిన వారమేకదా-ఈ సుందరికి సరిపోల్చ దగిన కాంత ఏ ప్రదేశములోనూ లేదని నిర్ధారణ చేయవచ్చునని భావము.

**విశేషము :**

చూచితివా అనే సరికి "ఆహా ! ఏమనవచ్చు" అని అందుకొని విశారదుడు రాజాశ్రితుల ముఖ్యలక్షణమును కనబరిచాడు.

"నూతన తనూ" ఎటునుండి చదివినా మార్పుచెందక ఇంపుగా ఉన్నది. ఈ చమత్కారమును మనకవి అప్పుడప్పుడు చూపుతుంటాడు.

వినూతనమని చెప్పుటచేత అప్పుడే బాల్యముజారి యౌవనము నెలకొంటున్నదన్నమాట.

విధాత చిత్తములో మెచ్చుకొను ననడము ఆత్మశ్లాఘ మంచిదికాదు కాబట్టి.

అర్జునుడు చిత్రాంగద సౌందర్యము చూచి మెచ్చుకొంటూ ఉన్నప్పుడు విశారదుడు ఊరుకోలేదు. ప్రభువు చూపులలోని అర్థం గ్రహించి చేయవలసిన భోగట్టా అంతా చేశాడని అనాలి. కాబట్టే 201 వ పద్యములోని విషయాలు చెప్పగలిగాడు. 'హావభావ పరిణామవిదుండు' కదా విశారదుడు.

**పాఠాంతరము :**

చూడ మాతుహిన భూభృత్ సేతు పర్యంతమున్

ఆబాల గోపాలమున్ వంటి అన్వయము. దీనిలో "పర్యంతమున్" అనడము అనవసరము.

**అలంకారము :**

అతిశయోక్తి.

'మలయధ్వజ బాహుజను
స్తిలకుని గారాబుఁ బట్టి, చిత్రాంగద పే,
రలఘు కుల శీల గుణములు
గల దీకన్య' యని చెప్పఁగా వింటి నృపా. 201

తాను సంపాదించిన సమాచారం అర్జునుడికి నివేదిస్తున్నాడు.

అర్థము :

నృపా = రాజా, ఈకన్య = ఈ అవివాహిత, మలయధ్వజు(డను పేరుగల),బాహుజనుః తిలకుని = క్షత్రియులలో శ్రేష్ఠుని యొక్క, గారాబు పట్టి = ప్రియకుమారిక (అనీ), పేరు చిత్రాంగద (అనీ), అలఘు కుల శీల గుణములు = ఉదారమైన కులము స్వభావము మంచిగుణములు, కలది = కలిగిఉన్నకన్య, అనీ చెప్పఁగాన్, వింటిన్ = విన్నాను.

తాత్పర్యము :

ఈ కన్య మలయధ్వజ రాజోత్తముడి గారాబు కూతురు, పేరు చిత్రాంగద, వంశము, స్వభావము, గుణాలు అన్నీ చాల ఉదారమైనవని చెప్పుతున్నారని విశారదుడు చెప్పాడు.

విశేషము :

అర్జునుడు ఈ చిత్రాంగద ఘట్టములో తన ప్రాణమిత్రు డయిన విశారదుడి దగ్గరగూడా భావగోపనకోసం (బయటపడకుండా ఉండడంకోసం) ప్రయత్నిస్తున్నాడు.

ఈ కాంత కన్య అనీ, కుల శీల గుణ శోభిత అనీ జెప్పడము, నీకు ప్రయత్నించ తగినదని తెలియబరచడానికే.

ఇక్కడ ఆమె సౌందర్యమును గూర్చి చెప్పకపోవడమే చమత్కారము. ఏమంటే అది అర్జునుడు స్వయంగా చూచిన విషయమే.

బాహుజనులు - బ్రహ్మబాహువులనుండి పుట్టినవారు - క్షత్రియులు.

అన విని మనమునఁ గోర్కులు
గొనసాగఁగ "నీ నృపాలకునితో నెయ్యం
బొనరింప వలయు; నేఁ డి
వ్వని నుండుద మం"చుఁ జొచ్చి వచ్చుచు నుండన్, 202

అర్థము :

అనన్ విని = ఆ విశారదుని భావగర్భితములగు పల్కులువిని, మనమునన్, కోర్కులు, కొనసాగఁగన్ = (తీవలు కొనలు సాగునట్లు) అధికమవుతుండగా, "ఈ నృపాలకునితోన్, నెయ్యంబు = స్నేహము, ఒనరింప వలయున్ = చేయవలెను. నేఁడు, ఇవ్వనిన్ = (ఈఁచిత్రాంగద వనవిహారముచేసిన) శృంగారవనమందు, ఉండుదము = బసచేదాము, అనుచున్, చొచ్చి = ఆవనమును ప్రవేశించి, వచ్చుచు ఉండన్...తరువాతి పద్యముతో అన్వయము.

తాత్పర్యము :

విశారదుడు చెప్పిన మాటలతో అర్జునుడి కోర్కెలు కొనలు సాగాయి. "ఈరాజుతో స్నేహము చేయాలి. అందుచేత ఈవేళ ఈ ఉద్యానవనములోనే బసచేదాము విశారదా" అని అన్నాడు.

విశేషము :

'నెయ్యం బొనరింపవలయు' అని అన్నాడే గాని, అర్జునుడి అభిప్రాయము 'వియ్యంబొనరింపవలయు' అనే.

ఇద్దరి మనసులలోనూ వివాహసంబంధ మయిన ఆలోచన ఉంది. కాని, అటు విశారదుడు గాని, ఇటు అర్జునుడు గాని బయటపడకుండా ఉండడానికి ప్రయత్నించడం గడుసుతనమే అనాలి.

ఆ కన్య విహరించిన శృంగార వనములో బసచేయడము సంతోషప్రదంగా ఉండవచ్చునని అర్జునుడి ఆశ.

పద్మరేఖలఁ బోల్చు బాలికా తిలకంబు
చరణంబు లూఁదిన తెరువుఁ జూచి,
మలయధ్వజ తనూజ కొలువు సేసిన జీవ
దంతపుఁ జవికెఁ జిత్తరువు జూచి,
పొన్నగున్నల నీడఁ గన్నె పుష్పొడి తిన్నె
మరునిఁ బూజించిన హరువుఁ జూచి,
కొమ్మ కౌఁగిటఁ జేర్చ గోరంట నంటిన
మొనగుబ్బ కస్తూరి మురువుఁ జూచి

యీ వనము చేసినదికా యదృష్ట మనుచు
రాజసుతుఁడు చిత్రాంగద మై జవాది
కమ్మతావి గుబాళించు తమ్మి కొలని
తెలఁకులకుఁ జేరి యంతంత వలపు మీఱి, 203

అప్పుడే వనవిహారము చాలించి చంద్రాంగద వెళ్ళిపోయింది. ఆమె ఆ వనవిహారములో చేసిన పనులన్నీ తెలిసేటట్టు గుర్తులు ఆ ఉద్యానవనములో కనబడడము అర్జునుడి కోర్కెలను కొనలు మరింత సాగించింది.

అర్థము :

౧. బాలికా తిలకంబు = ఆ కాంతా మణియొక్క, పద్మరేఖలఁ = అరకాలున పద్మరేఖ లనే ఉత్తమ సాముద్రిక లక్షణములతో, పొల్చు = ప్రకాశించునట్టి, చరణమ్ములు = పాదములు, ఊఁదిన = మోపిన, తెరువున్ = దారిని, చూచి.

౨. మలయధ్వజ (రాజుయొక్క), తనూజ = కుమార్తె, కొలువు సేసిన = సభచేసిన, జీవ దంతపు = ఏనుగు జీవించి ఉన్నప్పుడేకోసిన దంతముతో నిర్మించిన, చవికెఁ = మండప మునందలి, చిత్తరువుఁ = చిత్రపటాన్ని, చూచి,

౩. పొన్నగున్నల నీడన్ = లేత పొన్నచెట్ల నీడను, కన్నె = ఆ కాంత, పుష్పాడి తిన్నెఁ = పుష్పరాగముతో నిర్మించిన తిన్నెమీద(ఉంచి), మరునిఁ = మన్మథుని, పూజించిన హరువు = సొగసును, చూచి,

౪. కొమ్మ = ఆకాంత, కౌఁగిటఁజేర్పఁ = కౌగిలించుకొన్నప్పుడు, గోరంటన్ = గోరంట తీగయందు, అంటిన = అంటుకొనిన, మొనగుబ్బ కస్తూరి = చిన్న మొనగలిగిన తన కుచముల యందలి కస్తూరి యొక్క, మురువు = అందమును, చూచి (అంటుకొన్నది కస్తూరి).

ఈ వనము చేసినది, కా = కదా, అదృష్టము = (ఈ లాంటి విలాస లీలల చూడగల అదృష్టము), అనుచు = అనుకొనుచు, రాజ సుతుఁడు, చిత్రాంగద (యొక్క =), మై జవాది = శరీరమున పూసుకొన్న జవ్వాదియొక్క, కమ్మతావిఁ = మేలి పరిమళముచేత, గుబాళించు = బాగా సువాసన గొట్టుతున్న, తమ్మి కొలవికెలఁకులకుఁ = తామరలుగల సరస్సు ప్రక్కలకు,చేరి, అంతంతఁ = క్రమక్రమముగ, వలపుమీఱి = అనురాగాతిశయమును పొంది...తరువాతి పద్య ముతో అన్వయము.

తాత్పర్యము :

ఆ ఉద్యానవనములో చిత్రాంగద నడచినదారిలో ఆమె అరపాదాలయందున్న పద్మరేఖల గుర్తులు చూచి, మంచి కాంతిగల దంతముతో నిర్మించిన మండపములో ఆ కాంత వ్రాసిన

చిత్రలేఖనము చూచి. పొన్నగున్న నీడలో పుప్పొడితో తిన్నెచేసి దానిమీద మన్మథుని పూజిం చిన గుర్తులు చూచి, కౌగిలించినప్పుడు ఆమె వక్షస్థలమున ఉన్న కస్తూరి గోరంట పొద నంటిఉండ డము చూచి, ఈ వనము చేసినదే అదృష్టమని అనుకొంటూ, ఆమె స్నానము చేసినందువల్ల పరిమళిస్తున్న సరసు దగ్గరకు వెళ్ళి...తరువాతి పద్యముతో అన్వయము.

విశేషము :

కాంతఅనే అర్థమున ప్రయోగించిన పదములన్నీ, ఆయావర్ణనలకు తగినవై చమత్కా రముగ ఉన్నవి.

1, పద్మరేఖలుగల చరణములు కలది ఉత్తమజాతి స్త్రీ. అందుకే కవి బాలికా' తిలకము' ( = శ్రేష్ఠము) అన్నాడు.

2. దంతపు చవికెలో కొలువు చేసింది కాబట్టి (మలయధ్వజ) రాజుకూతురు అన్నాడుకవి.

3. పుప్పొడి తిన్నెను మరుని పూజించింది కాబట్టి కన్నె( = అవివాహిత) అన్నాడు. (మంచి భర్తను కోరుతూ కన్యకలు మన్మథుని పూజిస్తారు.)

4, గోరంట లతను కౌగిలించుకొన్నది కాబట్టి కొమ్మ (శాఖ).

గోరంటకు ఆలింగనము దోహదము, దాని వలన గోరంట పూచుతుంది. (గోరంటకు- కొరవి, క్రోవి, కురువకము అని పేర్లు.)

దోహదములు : ఉద్యానవనములోని చెట్లు పూత తొడగడానికి యువతులుచేసే ప్రక్రియ లకు దోహదాలంటారు. మన కవులు అంగీకరించిన దోహద క్రియలు :—

> కనఁ దిలకంబుఁ, గేసరముఁ గ ల్లుమియన్, రహిఁ బాదఁ బ్రేంకనం
> బు, నిమురఁ మావి, నవ్వ సురపొన్న, ముఖాంబుజ మెత్తఁ జంపకం
> బు, నెఱి గవుంగిలన్ గొరవి, మూర్కొన వావిలి, తన్న వంజుళం
> బు, నుడువ గోఁగునై తరుణి పూచు,.......
>
> — పారిజాతాపహరణము 4-10.

నాలుగు పాదములలో తెరువు, చిత్తరువు, హరువు, మురువు, అన్న శబ్ద చమత్కారము కవి ఉద్దేశించినదే.

జీవదంతములకు కాంతి ఎక్కువని ప్రసిద్ధి.

అడుగుల పద్మరేఖలు అదృష్టసూచన, చవికెలో చిత్తరువు ఆమె చిత్రలేఖన ప్రావీ ణ్యము, మన్మథ పూజనము వివాహాభిలాష, గోరంటను కౌగిలించడము దోహదవిజ్ఞానము — ఈ లక్షణాలు అర్జునుడికి గోచరమవుతూ ఉంటాయి.

అలంకారము :

పరికరాంకురము, అంత్యానుప్రాసము,

"తనకుం గౌఁగిలి యీ వొకప్పుడును, నాథా నీ కరస్పర్శనం
బున గిల్గింతలె" యంచుఁ బద్మిని కరాంభోజంబునన్ మందమం
ద నటద్వాయు చల ద్దళాంగుళులు గన్పట్టంగ న వ్వెల్గు రా
యని రా రా! యని పిల్చెనాఁ దగె ద్విరేఫాత్యంత దీర్ఘ ధ్వనుల్ 204

ఈ పద్యము అంతా విశారదుడితో అర్జునుడు చెప్పినది. చిత్రాంగద మీద భావాలతో నిండి ఉన్న అర్జునుడు ఇక్కడ తుమ్మెదల రొదలను గూర్చి వర్ణించడం కొంచెము అప్రస్తుతంగా కనిపిస్తుంది. కాని అటువంటి అసందర్భం ఏమీలేదని సహృదయులు గుర్తించగలరు. తాను దూరమునుంచే చిత్రాంగదను చూచాడు కాని ఆలింగనాది కార్యాలకు నోచలేదు. అ స్థితిలోనే సూర్యుడు గూడా ఉన్నాడు. నాయిక — పద్మినీ కాంత — ఈ దూరపు గిల్గింతలు చాలు, కౌగిలి సుఖము ఇవ్వడానికె రారమ్మని పిలుస్తున్నట్లు అర్జునుడికి కనబడడము చాల సహజమూ సమంజసమూను. తాను సూర్య స్థానములోనూ, చిత్రాంగద పద్మిని స్థానములోనూ ఉన్నట్లు ఊహించుకున్నాడు.

అర్థము :

తనకున్......గిల్గింతలే"—ఇది తామరతీగ (పద్మిని) వాక్యము—తనకున్ = నాకు, ఒకప్పుడును = ఎప్పుడుగూడా, కౌఁగిలి ఈవు = ఆలింగన సుఖమునివ్వవు, నాథా = ప్రియుడా, నీ కరస్పర్శనంబునన్ = నీచేతి తాకుడువల్ల—కిరణముల స్పర్శచేత, గిల్గింతలె = చక్కిలిగింతలు మాత్రమే — వికాసము మాత్రమే కలుగుతూ ఉంది" అంచున్ = పద్మిని అంటూ, కరాంభోజమునన్ = పద్మము అనే హస్తముతో, మంద మంద నటత్ వాయు చలత్ దళాంగుళులు = మిక్కిలి మందముగా వీచుతున్న గాలివల్ల కదులుతున్న రేకు లన్న వ్రేళ్ళు, కన్పట్టంగన్ = కానవచ్చుచుండగా, ఆ వెల్గురాయనిన్ = ఆ సూర్యుని, రా, రా, అని పిల్చెనాన్ = పిలుస్తున్నదా అనునట్లు). ద్విరేఫ అత్యంత దీర్ఘ ధ్వనుల్ = తుమ్మెదల యొక్క మిక్కిలి దీర్ఘమైన ధ్వనులు, తగెన్ = ఒప్పుచున్నవి.

తాత్పర్యము :

దూరమునుంచి చక్కిలిగింతలు కలుగజేయడమేగాని ఆలింగన సౌఖ్యము ఎప్పుడూ ఇవ్వవు అని పద్మిని (తామరతీగ) తనప్రియుడిని రా రా అని పిలుస్తున్నట్టుంది చూచావా విశారదా, ఆ తామరతీగ పద్మము అన్న చేతితో గాలిలో మెల్లగా కదులుతున్న తామరరేకు లన్న వేళ్ళతో సైగచేస్తూ తుమ్మెదల ధ్వనులతో రా రా అని పిలుస్తున్నవి కదా అని భావము.

*విశేషము :*

తుమ్మెద ధ్వనులు 'రా రా' అని పిలిచినట్టు ఉన్నవనడంలో విశేషముంది. తుమ్మెదలకు ద్విరేఫము అన్న పేరు ఉంది. రేఫము అంటే ర్ అనే రకారము; ద్విరేఫములు అంటే రెండు రకారా లన్నమాట. ఆ రకారము మీద అకారము ఉంచుతే ర్ + అ = ర అవుతుంది. దానికి అత్యంత దీర్ఘ మిస్తే రా...అవుతుంది. అలాంటివి ద్విరేఫములలో రెండు ఉన్నాయి కాబట్టి 'రా రా' అన్న పిలుపు ఏర్పడుతుంది. అత్యంత దీర్ఘము అంటే పిలిచినప్పుడు మనము ఉపయోగించే మూడుమాత్రల దీర్ఘమన్నమాట.

'నాకు' అనడానికి 'తనకు' అని కొందరు కవులు ప్రయోగించారు.

ఈ పద్యములో పద్మిని నాయిక. అంభోజము (తామర పువ్వు) చేయి. గాలిలో కొంచెముగా కదులుతున్న తామరరేకులు చేతివేళ్ళు. తుమ్మెదల ధ్వనులు పిలుపు అని గ్రహించాలి.

*పాఠాంతరము :*

......రారా యని పిల్చెనాఁ దగె ద్విరేఫాద్యంత దీర్ఘ ధ్వనుల్

— వేదమువారు.

"ద్విరేఫ అ, ఆది అంత దీర్ఘ ధ్వనుల్ = (ద్విరేఫ = రెండు రేఫములలోను, అ - అకారము, ఆది = మొదటిదానను, అంత = కడపటి దానను కలిగినట్టి, దీర్ఘ = దీర్ఘ రూపమైన, ధ్వనుల్ = ఉచ్చారణలు, అనఁగా — రేఫమువెంబడి అకారము కలుగునట్లుగా రెండుమార్లు రా, రా అను ధ్వనులు.)" అని వ్యాఖ్యానము చేశారు.

ఉన్నవే రెండు రేఫ లయినప్పుడు 'మొదటిది' 'కడపటిది' అని అనడం అంత సమంజసముగా కనబడదు.

అలంకారము :

ఉత్ప్రేక్ష, శ్లేష, సమాసోక్తి, యమకము.

నా విని హావ భావ పరిణామ విదుండు విశారదుం "డగున్,
దేవరవార లిందు నరుదే శకునమ్ములు మంచి వయ్యె, వే
రావలె శోభ నోత్సవ పరంపర లిప్పుడు, చూడుఁ" డంచు నె
త్తావుల దీవులై తనరు తామర మొగ్గలు రెం డొసంగివన్ 205

అర్థము :

నాఁ విని = అని అర్జునుడు పల్కఁగా విని, హావభావపరిణామ విదుండు = భ్రూచలనాది హావము యొక్కయు, మదన వికార జననమగు భావము యొక్కయు మార్పులను ఎరుగునట్టి, విశారదుఁడు, "అగున్ = తమరు చెప్పినది సరియే, దేవరవారలు, ఇందుఁ = ఇచ్చటికి, అరుదేన్ = రాగా, శకునమ్ములు మంచి వయ్యె = శుభసూచకములగు శకునములు గలిగినవి, (పద్మిని నాథుని రమ్మని పిల్చుట మొదలయినవి), వే = శీఘ్రముగ, శోభన ఉత్సవ పరంపరలు = ఒకదాని వెనుక నొకటిగా అనేక శోభనల (పెండ్లి) పండుగులు, ఇప్పుడు = ఇంకమీద, రావలెఁ, చూడుడు = నామాటలలోని యథార్థమును పరిశీలించండి" అంచున్, నెత్తావుల దీవులై = శ్రేష్ఠమైన వాసనలకు స్థానములై, తనరుచున్న, తామరమొగ్గలు రెండు, ఒసంగినఁ = ఇవ్వగా - తరువాతి కన్వయము.

తాత్పర్యము :

అని అర్జును డనగా హావభావాల మార్పులను గ్రహించ గలిగిన విశారదుడు 'మీరు సెల విచ్చినది సరియే. మీరిక్కడకు వచ్చినప్పుడు మంచి శుభశకునాలు కనబడ్డాయి. కాబట్టి శీఘ్రముగా శుభపరంపరలు రావలసి ఉన్నవి" అంటూ పరిమళిస్తున్న రెండు తామర మొగ్గలను అర్జునుడి చేతి కిచ్చాడని భావము.

విశేషము :

హావభావ (చూ. 97) పరిణామవిదుండు కావుననే అర్జునుని యూహను తెలుసుకున్నాడు. పరంపరలు అనడంవల్ల ఈ చిత్రాంగదా వివాహ మొక్కటే కాక మరికొన్ని గూడా నని తెలుసుకోవాలి,

శుభము చెల్పినప్పుడు ఫలమో పుష్పమో ఇవ్వాలంటారు. అప్పటికి తనకు చేరువలో చిక్కిన పద్మకోశములను ఇచ్చాడు, ఇంకమీద చేతికి రాబోయే చందనలిప్త చిత్రాంగదా కుచ యుగం మనసులో ఉండదా విశారదుడికి ?

ఉలూచి ఘట్టములో అర్జునుడు విశారదుడితో అన్ని రహస్యాలూ చెప్పాడు; ఈ ఘట్టములో రాచరికపు బెట్టు పాటిస్తూ మర్మము బయటపెట్టడు.

పాఠాంతరము :

విశారదుఁడనుఁ అని కొందరు. మూడవ చరణంలో తిరుగ 'అంచున్' కిది బాధకము, కాబట్టి "అగుఁ" అని పఠించడం న్యాయము.

అలంకారము :

పరికరము. సూక్ష్మాలంకారము (మొగ్గల నిచ్చుటలో). వృత్త్యనుప్రాసము.

అదియు నొక శకునంబుగా నధిపుఁ డంది
చేతి కందిచ్చి నట్లనె చేకుఱంగఁ
గలదు వలిగబ్బిగుబ్బెత చెలిమి యంచు,
నాత్మలో నెంచి యాభావ మపనయించి. 206

*అర్థము :*

అదియున్ = ఆ తామరమొగ్గల నివ్వడముగూడ, ఒక శకునంబుగాన్ = ఒక శకునముగా, అధిపుఁడు = రాజు, అంది = పుచ్చుకొని, వలిగబ్బి గుబ్బెత = గుండ్రని నిండైన కుచములుగల చిత్రాంగదయొక్క, చెలిమి = స్నేహము, చేతి కందిచ్చి నట్లనె (ఆలస్యానికి గాని తప్పడానికి గాని వీలులేకుండ), చేకుఱంగఁ గలదు = సమకూడుతుంది, అంచు నాత్మలో నెంచి, ఆభావము = ఆ ఊహను, అపనయించి = అణచిపెట్టి....తరువాతి కన్వయము.

*తాత్పర్యము :*

ఆ మొగ్గలివ్వడం గూడ ఒక శుభశకునంగా భావించి, దీని ఫలితంగా, గుండ్రని బలిసిన స్తనాలు గల చిత్రాంగద స్నేహము చేతికందిచ్చినట్టే సమకూడుతుందని మనసులో అనుకొని, ఆ అభిప్రాయము బయటికి చెప్పకుండా అర్జునుడు...తరువాతి కన్వయము.

*విశేషము :*

భావాలను ప్రకటించకుండా అపనయించడాన్ని 'అవహిత్థ' అని పండితు లంటారు.

*పాఠాంతరము :*

గలదు వలిగబ్బి గుబ్బల చెలిమి యనుచు

అప్పుడు ఆ గుబ్బల చెలిమే చేతికందిచ్చినట్లు చేకురగలదని అనుకున్నా డనాలి.

*అలంకారము :*

రెంటను స్తనములు స్మరణకు వచ్చుటచేత స్మరణాలంకారము.

తన మనసులో కలిగిన భావాన్ని అపనయించి అర్జునుడు ఏదో ప్రకృతిలోని విశేషాన్ని వర్ణిస్తున్నట్టు కనబడడానికి ప్రయత్నించాడు.

నెల యుదయించునప్పు డల నీరజముల్ కుముదంబు లౌను రేల్
కలువలదాయ రాకకుఁ బగల్ కుముదంబులు నీరజంబులౌఁ;
దలఁపఁగ నింత వింత గలదా ? యని కందువమాట లాడుచున్
బళిర ! కిరీటి మీఱెఁ దన ప్రౌఢి విశారదుఁ డెన్నుచుండఁగన్. 207

అంతలో సాయంకాల మవుతున్నదని గ్రహించుకోవాలి.

అర్థము :

"రేల్ = రాత్రులందు, నెల = చంద్రుడు, ఉదయించునప్పుడు; అల నీరజముల్ = ఆ పద్మములు, కుముదంబులు అగుఁగా = కలువలగును (చెడిన సంతోషము కలిగిన వగును, ముడుచుకొనును అని మరొక అర్థము), పగల్ = పగళ్ళయందు, కలువలదాయ రాకకుఁగా = కలువలకు శత్రుడగు సూర్యుడు వచ్చినప్పుడు, కుముదంబులు = కలువలు, నీరజంబులౌన్ = తామరలు అవును (మరొక అర్థము : రజము - పుప్పొడి - లేనివి అగును - ముడుచుకొనును), తలఁపఁగా = ఆలోచించగా, ఇంతవింత గలదా ? = ఇంత విచిత్ర ముంటుందా!" అని, విశారదుడు తన, ప్రౌఢిఁగా = నేర్పును, ఎన్నుచుండగఁగా = పొగడుచుండగా, కందువమాటలు = చమత్కారములగు మాటలను, ఆడుచు = చెప్పుతూ, కిరీటి = అర్జునుడు, మీఱెఁగా = అతిశయించెను, బళిర ! = సెబాష్ !

తాత్పర్యము :

విశారదా, చూచావా, చంద్రుడు వచ్చినప్పుడు తామరలు కలువ లవుతాయి. సూర్యుడు వచ్చినప్పుడు కలువలు తామర లవుతాయి. ఇంత వింత ఎక్కడైనా ఉందా అని అర్జునుడు చమత్కారంగా అంటూ ఉండగా విశారదుడు అతని కవిత్వాన్ని మెచ్చుకుంటాడని భావము.

విశేషము :

ఇదొక చక్కని చమత్కారము కల పద్యము.

నీరజములు అంటే 1. నీటిలో పుట్టినవి - తామరలు అనీ, 2. నీ రజములు - రజము లేనివి, పుప్పొడి లేనివి అనీ రెండర్థా లున్నాయి.

అలాగే, కుముదములు అంటే 1. కలువలు అనీ, 2. కు ముదములు - చెడిపోయిన ముదములు (సంతోషములు) కలవి అనీ రెండర్థా లున్నాయి.

చంద్రు డుదయించినప్పుడు తామరలు ముకుళించుకు పోతాయి అనీ, సూర్యుడు వచ్చినప్పుడు కలువలు ముకుళించుకు పోతాయనీ అంటారు.

ఈ విషయాలను మేళవించాడు కవి : నెల ఉదయించునప్పుడు తామరలు కు ముదములు - పోయిన వికాసము కలవి - ముకుళించినవి అవుతాయి; అలాగే సూర్యుడు వచ్చినప్పుడు కలువలు నీ రజములు - పుప్పొడి లేనివి —— ముకుళించినవి అవుతాయి అని చమత్కారము.

ఈవర్ణనలో ఉన్న ప్రౌఢిని - నైపుణ్యాన్ని విశారదుడు ప్రశంసించడం సమంజసమేకదా!

ప్రకృతి విరుద్ధంగా కనబడుతున్న ఈ తామరలు కలువలు కావడమూ, కలువలు తామరలు కావడమూ, అన్న విషయాలను శ్లేషవల్ల కలిగిన అర్థాంతరాలతో సమర్థించాడు కవి.

కిరీటి అనడానికి కారణము :

రవి యుదయించునట్లు సమరంబున నా తలమీఁదఁ గాంతి మూ
ర్తి వెలుఁగు నింద్రుఁ డిచ్చిన కిరీట మభేద్య మహోగ్ర సుస్థిర
త్వ విభవ రూఢిమై; జనులు దానను నన్నుఁ గిరీటినామ సం
స్తవన విశేష పాత్రముగ సమ్మతిఁ జేసిరి మత్స్యనందనా.

— భారతము వి ప.

అలంకారము :

విరోధాభాస, శ్లేష.

## సాయంకాల వర్ణన

అంగజరాజు పాంథ నిచయంబులపై విజయం బొనర్ప నేఁ
గంగఁ దలంచునంత మునుఁగల్గఁగ దాసులు వట్టు జాళువా
బంగరు టాలవట్టముల భంగిఁ గనంబడెఁ బూర్వ పశ్చిమో
త్తుంగ మహీధ రాగ్రములఁ దోయజశాత్రవ మిత్ర బింబముల్. 208

అర్థము :

అంగజరాజు = (శరీరమున బుట్టినవాడగు) మన్మథుడు అన్నరాజు, పాంథ నిచయంబుల పైన్ = విరహులనే మార్గస్థులమీద, విజయంబు ఒనర్పన్ = విజయము సాధించడానికి, ఏఁగంగన్ తలంచునంతన్ = దాడివెడలడానికి ఊహించునంతలో, మునుఁగల్గఁగన్ = అందరి కంటే ముందుగా, దాసులు = సేవకులు, పట్టు (కొనే), జాళువా బంగరు = జాళువాదేశపు మేలిమి బంగారముతో చేయబడిన, ఆలవట్టముల భంగిన్ = సూర్యపానుచంద్రపానులనే రాజ చిహ్నముల విధముగా, పూర్వ పశ్చిమ ఉత్తుంగ మహీధర అగ్రములన్ = తూర్పునా పడమ టనూ ఉన్న మిక్కిలి ఎత్తైన కొండల శిఖరములమీద, తోయజశాత్రవ మిత్ర బింబముల్ = చంద్రుని యొక్కయు సూర్యుని యొక్కయు బింబములు, కనంబడెన్ = అగపడెను.

తాత్పర్యము :

మన్మథు డన్న రాజు మార్గస్థులను జయించి కొల్లగొట్టడానికి దాడి బయలుదేరాలని అనుకున్నంతలో సేవకులు మున్ముందుగా పట్టుకొనే సూర్యపాను చంద్రపానులన్న ఆలవట్టాల లాగ, తూర్పు పడమర కొండలమీద చంద్ర, సూర్యబింబాలు కనిపిస్తున్నాయని తాత్పర్యము.

విశేషము :

రాజులు మార్గస్థులను దోచుకొంటుండడము మన కవి కాలములో దేశమున ప్రబలముగా ఉండేది. పథికులను = విరహులను వేధించడం మన్మథుడికి ఎప్పుడూ ఉన్న లక్షణమే. మునిమాపువేళ - సాయంకాలమందే ఇతవి విజృంభణకు ఆరంభము.

రాజులకు రాజ్యచిహ్నాలలో ఆలావర్తములు గూడ ఉంటాయి. ఆలావర్తము యొక్క వికృతే ఆలవట్టము. దీనికి అర్థము సూర్యపాను చంద్రపాను. (చూ. లక్ష్మీనారాయణీయము.)

ఈ పద్యములోని 'ఆలవట్టములు' అన్నమాట మన పండితలోకాన్ని మూడు వందల సంవత్సరాలు ఆయాస పెట్టింది. ఆ మాటకు సరియయిన అర్థము పట్టుబడక పోయినందువల్ల పద్యరచనలో కవి చూపిన చమత్కారమూ, ప్రకటించనెంచిన గంభీర భావమూ గుర్తించడానికి అవకాశము లేకపోయింది.

ఆలవట్టములు అంటే 'అఫ్తాబ్ గిరా' అని జూలూరు అప్పయ్యగారు వ్యాఖ్యానించారు. (అఫ్తాబ్ అంటే ఎండ ; అఫ్తాబ్‌గిరా అంటే గొడుగు వంటిది అని వారి ఊహ.) శబ్దరత్నాకర నిఘంటుకారులు వస్త్రముతో, గుండ్రముగ చేసిన విసనకర్రలు అన్న అర్థమిచ్చారు. వేదమువారు 'గుండ్రని గుడ్డ విసనకర్రలు' అని వ్రాశారు. వీటిలో ఏ అర్థమూ పద్యములో సమర్థనీయం కాదు. గొడుగూ విసనకర్రలూ ముస్ముందు పట్టవలసినవి కావు.

ఆలవట్టము అంటే పొడుగాటి కొయ్యలమీద సూర్యచంద్రుల బొమ్మలతో ఉన్న పలకలు అమర్చి ఉంటాయి. వాటినే సూర్యపాన్, చంద్రపాన్ అంటారు. ఈ బొమ్మలు బుటేదారీ పని వల్లగాని, వెండి ఇత్తడి మొదలయిన రేకులతో గాని నిర్మిస్తారు.

ఉత్సవం ముందు భాగంలో కుడివైపు సూర్యపానూ, ఎడమవైపున చంద్రపానూ సేవకులు పట్టుకుంటారు.

ఈ పద్యములో మన్మథుడిని 'అంగజరాజు' అని అనడంలోనే కవి తన చమత్కారాన్ని ప్రకటించాడు. అంగజరాజు అంటే శరీరములో పుట్టిన, మన్మథరాజు అనే కాక, అంగదేశమున పుట్టిన రాజు అని గూడా అర్థం ఉంది. అంగదేశ మనగానే మన దృష్టి ఉత్తర దిక్కుకి - వంగదేశానికి కొంచెం పడమరగా - చూస్తుంది.

కుడిపక్క సూర్యుడితోనూ, ఎడమపక్క చంద్రుడితోనూ ఉన్న ఆలవట్టాలతో ఊరేగింపు మనవైపు వస్తూ ఉంటుంది. ఎదురుగా చూస్తూ ఉన్న మనకు కుడివైపున (అనగా తూర్పు దిక్కున) చంద్రపానూ, ఎడమవైపున (అనగా పడమటి దిక్కున) సూర్యపానూ కనిపిస్తాయి. తూర్పున చంద్రు డుదయిస్తున్నాడు ; పడమట సూర్యుడు అస్తమిస్తున్నాడు.

ఈ రాజు మూడు లోకాలను జయించిన మన్మథుడు కాబట్టి ఇతనికి ఆలవట్టాలుగా కృత్రిమ (నకిలీ) సూర్యచంద్రులు కాక, నిజమయిన సూర్యచంద్రులే ఎత్తుగా ఉన్న తూర్పు పడమర కొండలమీద బంగారపు రంగుతో కనబడతారని వివరణ.

అంగజరాజు అనకుండా ఏ విదర్భరాజో కొంకణరాజో అన్నట్టయితే మనము పడమటి దిక్కుకి చూస్తాము. వస్తూ ఉండే ఉత్సవం ముందు భాగంలో పట్టిన సూర్యపాన్ చంద్రపాన్‌లు ఉత్తర దక్షిణ దిక్కులలో కనిపిస్తాయి, పద్యభావం అంతా పాడయిపోతుంది.

పద్యంలో మన్మథుడు అంగజరాజు ; తూర్పు పడమర కొండలు సేవకులు ; ఉదయిస్తున్న చంద్రుడూ అస్తమిస్తున్న సూర్యుడూ జాళువా బంగరు ఆలవట్టములు.

*అలంకారము :*

ఉత్ప్రేక్ష, క్రమము, శ్లేష, ఉపమ.

ఒకమెట్టు తరణి డిగ్గిన
నొకమెట్టు శశాంకుఁ డెక్కు ; నుర్వీస్థలిలో
నొకరాజు సన్నగిల్లిన
నొకరా జంతంతకును మహోన్నతిఁ గనఁడే ? 209

*అర్థము :*

తరణి = సూర్యుడు, ఒకమెట్టు, డిగ్గినన్ = దిగుతుంటే, శశాంకుఁడు = చంద్రుడు, ఒక మెట్టు, ఎక్కున్, ఉర్వీస్థలిలో = లోకములో, ఒకరాజు, సన్నగిల్లిన = క్షీణిస్తుంటే, ఒక రాజు, అంతంతకును = క్రమముగా, మహోన్నతిన్ = గొప్పవైభవమును, కనఁడే = పొందు తుంటాడు గదా !

*తాత్పర్యము :*

పై పద్యములో ఆలవట్టాల లాగా ఉండిన సూర్యచంద్రులలో సూర్యుడు అస్తమిస్తూ ఒక్కొక్క మెట్టు దిగిపోతూ ఉంటాడనీ, చంద్రుడు కొంచెము కొంచెముగా పైకి ఎక్కుతుంటాడనీ చెప్పి కవి, ఒక రాజు సన్నగిల్లితే ఇంకొకరాజు ఆధిక్యాన్ని పొందుతుంటా డన్న లోకస్వభావాన్ని సూచించాడు.

*విశేషము :*

తరణి = సూర్యుడు - దినరాజు, శశాంకుడు = చంద్రుడు - రేరాజు. కాబట్టే రాజుల ప్రస్తావన కవి చేశాడు.

రాజు అంటేనే చంద్రుడని అర్థం ఉంది. కాని, 'ఒకరాజు' అని ప్రయోగించాడు కాబట్టి 'ఱేరాజు' అని అనడం సమంజసము.

ఆనాడు సూర్యుడూ చంద్రుడూ ఇద్దరూ ఒకేసారి నిండుగా కనిపిస్తున్నారు కాబట్టి అది పౌర్ణమి అని మనము గ్రహించాలి. తరువాతి పద్యాలనుబట్టి అది వసంతకాలమని గూడా తేటపడుతుంది.

*పాఠాంతరము :*

ఒకడు దిగుడైన నవ్వల
నొకరా జంతంతకున్ మహోన్నతిఁ గనఁడే ?

— వేంకటకృష్ణమాచార్యులవారు.

*అలంకారము :*

అర్థాంతరన్యాసము.

క్షితిపయి వట్టిమ్రాఁకులుఁ జిగిర్ప వసంతుఁడు దా రసోపగుం
భిత పద వాసనల్ నెఱప, మెచ్చక చంద్రుఁడు మిన్ననఁ బ్రస
న్నతయును సౌకుమార్యము గనంబడ ఱా ల్గరగంగఁ జేసె; నే
గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా ! 210

*అర్థము :*

క్షితిపయిన్ = భూమిమీద, వట్టిమ్రాకులు = (శిశిర ఋతువులో ఆకు రాలిపోవుటచేత) మోడులైయున్న చెట్లు, చిగిర్పన్ = చిగిరించేలాగ, వసంతుఁడు (వసంతకాలము), తాన్, రస ఉపగుంభిత పద వాసనల్ = పాలతో నిండిన (పద) ఆకు పూవు మొదలగు భాగముల యొక్క సువాసనలను, నెఱపన్ = విస్తరింప జేయగా, మెచ్చక = దానిని మెచ్చుకోకుండా, చంద్రుడు, మిన్ననన్ = ఆకాశమునందు, ప్రసన్నతయును = విమలత్వమున్ను, సౌకుమార్యము = కోమలత్వమున్ను, కనంబడన్ = కానవచ్చునట్లు, ఱాల్ గరగంగన్ = చంద్రకాంతపు రాళ్ళను కరుగునట్లు, చేసెను; ఏగతిన్ = ఎంత చక్కఁగ, రచియించిరేని = చేసినప్పటికీ, సమకాలమువారలు = ఆకాలములో ఉన్నవారలు, మెచ్చరేకదా !

*తాత్పర్యము :*

వసంతుడు భూమిమీద మోడుబారిన చెట్లను పాలతో నిండిన ఆకూ పూవూపిందెల పరిమళముతో చిగిరింప జేశాడు. దానిని మెచ్చకుండా చంద్రుడు ఆకాశమున నిర్మలంగా ప్రకాశిస్తూ

రాళ్ళను కరిగించాడు. ఎంతమంచి పనిచేసినా సమకాలమువారు లోకములో మెచ్చరు కదా అని భావము.

*విశేషము :*

ఈ పద్యములో ఇద్దరు కవుల ప్రవర్తనను గూడ వర్ణించాడు చేమకూరకవి :

మోడులను చిగిరింప జేయడమూ, రాళ్లను కరిగించడమూ అంటే ప్రజలను రంజింప జేయడమన్నమాట.

క్షితిపై, వట్టిమ్రాకులు = రసజ్ఞత బొత్తిగ లేనివారు కూడ, చిగిర్పన్ = ఆనందించినట్లు, వసంతుడు-అన్న ఒక కవి, తాను, రస ఉపగుంభిత = శృంగారాది రసములతో నిండిన పద = శబ్దములను, వాసనల్ = భావములను, నెఱపఁగా = కవనములో చూపుతుండగా, మెచ్చక, చంద్రుడు - అన్న మరొకకవి, మిన్నునఁగా = ఆకాశమున, ప్రసన్నతయును, సౌకుమార్యముఁగా = ప్రసాదము, సౌకుమార్యము అనే ఉత్తమ కావ్యగుణములు, కనంబడఁగా, ఱాల్ కరగించె = అరసికులను రంజించాడు; ఏగతిఁగా, రచియించిరేని = కావ్య రచన చేసినా, సమకాలము వారలు (కవులన్నమాట) మెచ్చరేకదా !

వసంత శోభ అంతా భూమి మీదనే కాబట్టీ, చంద్రుని సొబగు ఆకాశముననే కాబట్టి క్షితిపయిఁగా, మిన్నునఁగా అన్న పదములు రెండూ సార్థకములు.

ఏవిధంగా రచించినప్పటికీ, సమకాలమువారు మత్సర గ్రస్తులయి మెప్పునీయరు అని తరుచుగ కవులకున్న అభిప్రాయాన్ని కవి వివరించాడు.

కావ్యగుణములు : శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థదీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి, అని పది.

వేదమువారు వసంతుడికన్న చంద్ర కవికి గొప్పతనము సూచిస్తూ కొంత వ్యాఖ్యానము ఇచ్చారు :

వసంతుడు క్షితిపయిఁగా—క్రింది తరగతి జనములలో, రసోపగుంభిత పదవాసనల్ = సిద్ధరసము పాదములకు పూసుకొని చిందులు ద్రొక్కుతూ (చాల శ్రమపడి యని) వట్టిచెట్లను మాత్రము రంజించాడనీ, చంద్రుడు మిన్నునఁగా—రాజసభలయందు, ప్రసన్నతయు, సౌకుమార్యమును, (శ్రమ లేకపోవుట) కనబడునట్లుగా అంతకన్న అరసికులైన రాళ్ళను రంజించాడనీ, చంద్రునం దాధిక్యము సూచించారు. సమకాలము వారు మెచ్చరే అని కవి మొఱ్ఱ అన్నారు, పద్యములోని పదములు గూడ దీని కనువుగానే ఉన్నవి. కాని ఒక్క విషయము ఆలోచించాలి.

చంద్రునందే ఈ ఆధిక్య మున్నప్పుడు, వసంతుడి కృతిని మెచ్చక పోవడంలో అన్యాయమేమున్నది ? అన్యాయమే లేనప్పుడు మొఱ్ఱకు అవకాశమే కనబడదే.

కాబట్టి, ఈ పద్యములో వసంతుని న్యూనతగాని చంద్రుని ఆధిక్యముగాని ఎంచకూడ దనుకుంటాను.

ఈ సందర్భములో ఒక్క మనవి :

31 వ పద్యములో చేమకూరకవి రఘునాథనాయకుడి కవిత్వాన్ని మెచ్చుకుంటూ 'తా రస పుష్టిమై ప్రతిపదంబున జాతియు వార్తయుఁ జమత్కారము నర్థగౌరవము గల్గ...' అనేక కృతులు రచించినట్టు చెప్పాడు.

ఆ మాటలే ఈ పద్యములోని 'రసోపగుంభిత పద వాసనల్ నెరప ...' అన్న మాటలలో ప్రతిధ్వనిస్తున్నాయి. కాబట్టి వసంత కవి కవిత్వములో అల్పత్వభావం మనకవికి లేదని నిర్ధారణ చేయవచ్చును. మన కవి రచన గూడా రసోపగుంభిత పద వాసనలతో నున్నదే కదా.

వేదమువా రన్నట్టు "సిద్ధరసము పాదాలకు పూసుకొని చిందులు తొక్కడము", 'గట్టి పరిశ్రమ చేసి' అన్న భావాన్ని సూచించినట్టు గ్రహించాలి.

ప్రసాద గుణము అంటే ప్రసిద్ధమయిన పదాలతో సులభంగా అర్థమయ్యే గుణము. సౌకుమార్యము అంటే బిందుపూర్వకమైన - ంబూలూ, ందాలూ ఎక్కువగా ఉండి వినడానికి ఇంపుగా ఉండే లక్షణము. ఉ : 'చెందొవ విందు మందువలెఁ జిందు రుచిం దగఁ జెంద నంబు...'

ఈ గుణాలున్న కవిత్వం మంచిది కాదని ఎవ్వరూ అనరు. అందుచేత రెండుకవితలూ మంచివే. అయినా ఒకరి నొకరు మెచ్చుకోరని మనకవి లోక స్వభావాన్ని తెలియజేశాడు.

తన కవిత్వంలో 'రసోపగుంభితపద వాసనల'తోపాటు, 'ప్రసన్న గంభీర' గుణము గూడ ఉన్నదని సూచన.

అలంకారము :

అర్థాంతరన్యాసము.

వెడవిలుకానికిన్ జెఱకు విల్లును గల్వ లకోరి కోరికల్
గడలుకొనంగ నామనియుఁ గల్వలరాయఁడు నిచ్చి మన్ననల్
బడయుడు, వాని కెక్కుడుగ మౌర్వులు తాము నుగాన్కఁ దెచ్చెనా
బడిబడి గంధలుబ్ధ మధుపమ్ములు రాఁ జనుదెంచెఁ దెమ్మెరల్. 211

వసంతోత్సవ సమయము - ప్రభువైన మన్మథుడికి తన ఉద్యోగస్థులు వసంతుడు, చంద్రుడు, గంధవహుఁడు కానుకలు (నజరానాలు) ఇస్తున్నారు.

అర్థము :

వెడవిలుకానికిఁ = మన్మథుడికి, చెఱకు విల్లును, కల్వ లకోరి = కలువబాణమును, ఆమనియుఁ = వసంతుడును, కల్వలరాయఁడు = చంద్రుడును, కోరికల్ కడలుకొనంగఁ = తమ మనసులోని కోరికలు అతిశయించుచుండగా, ఇచ్చి = మన్మథునికిచ్చి, మన్ననల్ = గౌరవమును, పడయుడు = పొందుచుండగా, వానికి ఎక్కుడుగ = ఆ కాన్కలకన్న గొప్పగా - ఆ వింటికీ ఈబాణానికీ (ఎక్కుడుగ = ) ఎక్కుపెట్టుటకు సాధనముగ, మౌర్వులఁ = అల్లె త్రాళ్ళను, తామును = తాము (తెమ్మెరలు) గూడ, కాన్కతెచ్చెనాఁ = కానుకలు తెచ్చెనా అన్నట్లు, బడిబడి = ఒకదాని వెంట నొకటిగా, గంధలుబ్ధ మధుపంబులు = సువాసనయందాసక్తిగల తుమ్మెదలు, రాఁ = వస్తుండగా, తెమ్మెరల్ = మందమారుతములు, జనుదెంచెఁ = వచ్చినవి.

తాత్పర్యము :

మన్మథుడికి కానుకగా వసంతుడు చెరకు విల్లున్నూ, చంద్రుడు కలువబాణమున్నూ ఇచ్చి గౌరవము పొందారు. వాటికి ఎక్కుడుగా (ఎక్కు పెట్టడానికి వీలుగా) తెమ్మెరలు తుమ్మెద బారులన్న అల్లె త్రాళ్ళను కానుకగా ఇచ్చాయని భావము.

విశేషము :

ఈ పద్యములోని మన్మథుడు 'వెడవిలుకాడు' — వెర్రివిలుకాడు, అనగా విలుకాని తనమున పిచ్చి యాసక్తి కలవాడు. అట్టి వానికి అనుచరులు ఆ పిచ్చికి - విలుకాని తనానికి - తగిన వస్తువుల నిస్తే మన్నన కలుగుతుంది గదా !

కాబట్టి వసంతుడు చెరకు విల్లు నిచ్చాడు. మంచి చెరకు వసంత ఋతువునందే చిక్కును. అదే ఇతరు లివ్వలేని, తానే ఇవ్వగల ప్రత్యేకమైన మంచి వస్తువు.

చంద్రుడు కల్వబాణము నిచ్చాడు. తామున్నప్పుడే కలువలు వికసించును కాబట్టి అట్టి బాణముల నితరు లొసగజాలరు.

ఇక మూడవవాడు వీటిని మించిన కాన్క ఇవ్వాలని చూస్తాడు. సామంతులలో ఈ ఉద్దేశము సహజము. ఆరెంటినీ ఎక్కుపెట్టడానికి సాధనమైన అల్లెత్రాళ్లను వెంట పట్టించికొని వచ్చాడు. అల్లె తాడు లేకుంటే ఆ చెరకూ, ఈ బాణమూ రెండూ వ్యర్థమేగదా !

అల్లె త్రాళ్లెక్కడని అడిగితే, ఈ తెమ్మెరలు వస్తుండగా వాని యందలి పరిమళము నాశించి తుమ్మెదలు బారులు కట్టుకొని రావడంచేత త్రాళ్లవలె కనబడతాయి.

మన్మథుడికి విల్లు చెరకనీ, బాణము కలువ అనీ, అల్లె త్రాడు తుమ్మెదలనీ చెప్ప బనిలేదు, గదా !

పద్యములోని ప్రభువు వెడవిలుకాడు కాబట్టి పద్యములోని కల్పన అంతా ఈ రూపంగా ఏర్పడ్డది.

కానుక లిచ్చినప్పుడు కోర్కెలు కొనలు సాగడం వాటినిచ్చే వారికే కాని ప్రభువుకికాదు.

*అలంకారము :*

పరికరాంకురము, ఉత్ప్రేక్ష, క్రమము, శ్లేష.

ఒక చిగురాకుఁ గొమ్మఁ బిక, మొక్క ప్రసూన లతాగ్రసీమఁ దేం,
ట్లొక ఫలశాఖ రాచిలుకయున్, రొద సేయఁగ, గాడ్పు పొందు వా
యక, పయి వెన్నెలల్ వొలయ, నామని సొంపులు నింప, జొంపమౌ
నొక యెలమావి క్రింద మరుఁడో యనఁగా నరుఁ డుండె నయ్యెడన్.

*అర్థము :*

ఒక చిగురాకు కొమ్మ (యందు), పికము = కోకిలయు. ఒక్క ప్రసూన లతాగ్ర సీమన్ = ఒక్క పూరెమ్మ యొక్క కొనయందు, తేంట్లు = తుమ్మెదలును, ఒక ఫలశాఖన్ = పండ్లుగల కొమ్మమీద, రాచిలుకయున్ = రామచిలుకయు, రొద సేయఁగన్ = ధ్వని సేయుచుం డగా, గాడ్పుపొందు వాయక = మలయమారుతుని స్నేహమును విడువక, పయిన్ వెన్నెలల్ వొలయన్ = మీద వెన్నెలలు ప్రసరించుతుండగా, ఆమని = వసంతుడు, సొంపులు నింపన్ = సొగసుల నిండించుచుండగా, జొంపమౌ = గుబురుగా ఉన్న, ఒక ఎలమావి క్రిందన్ = ఒక గున్నమామిడి చెట్టుక్రింద, మరుఁడోయనన్ = మన్మథుడా యేమి అన్నట్లు, అయ్యెడన్ = ఆచోట, నరుఁడు = అర్జునుడు, ఉండెను.

*తాత్పర్యము :*

అర్జునుడు అక్కడ ఒక గున్నమామిడి కింద బసచేశాడు. ఆ చెట్టు చిగురాకుకొమ్మను కోకిలలు, పూవురెమ్మను తుమ్మెదలు, పళ్ళున్న కొమ్మను చిలుకలు కడుపునిండా మేసి సందడి చేస్తున్నాయి. మందమారుతం వీస్తూంది, వెన్నెల చక్కగా కాస్తూంది, వసంతుడు అలంక రిస్తున్నాడు. మన్మథుడి పరివారమంతా అక్కడ ఉండడం చేతనూ, తాను చాల అందమయిన వాడవుట చేతను అతడు మన్మథుడా అన్న సందేహము కలుగుతుందని భావము.

*విశేషము :*

మన్మథుడి పంచబాణాలలో 'చూతము = తియ్యమామిడి' ఒకటి. కాబట్టి తియ్యమామిడి గున్న మన్మథుడి ఆయుధాగార మనవచ్చును.

మన్మథుడి సేనలో ఉండే కోకిలలు చిగురుటాకు కొమ్మల దగ్గరను, తుమ్మెదలు పూవు లున్న శాఖల దగ్గరను, చిలుకలు పండ్లున్న కొమ్మల దగ్గరను ఉండి, కడుపునిండా తిని సందడి చేస్తూ ఉండడము సైనిక శిబిరాలలో సాధారణ లక్షణము.

తన ఉద్యోగులలోని చంద్రుడు పర్యవేక్షణ చేస్తున్నాడు; వసంతుడు తగిన అలంకరణలు చేయిస్తున్నాడు; మలయమారుతుడు దగ్గరే ఉండి సంభాషణ సాగిస్తున్నాడు.

ఆ పరిస్థితులలో మన్మథుడి సైనిక శిబిరములాగా ఉన్న ఆ మామిడి గున్న దగ్గర సుంద రాకారుడైన అర్జునుడిని చూచినవారు అతడే మన్మథు డన్నట్లు భావిస్తారుకదా.

*పాఠాంతరము :*

ఆమని సొంపుల నింపు జొంపపూ
నొక యెలమావి క్రింద మరుఁడోయనఁగా......

— వేదమువారు, బులుసువారు.

వసంతకాల సౌందర్య మంతా కలిగి గుబురుగా ఉన్న గున్నమామిడికింద మన్మథుడా అన్నట్లున్నాడని అర్థము.

ఈ పాఠములో మన్మథ పరివారమున వసంతుడు ఉండడు. వసంతకాల సౌందర్యమే ఉంటుంది. కాని, దీని తరువాతి పద్యములో ఈ పరివారము అర్జునుని వేధించినట్లు కవి చెప్పాడు. దానిలో వసంతుడు గూడా ఉన్నాడు. కాబట్టి ఈ పాఠము కవి ఉద్దేశాన్ని తెలియ జేయ దనే అనాలి.

*అలంకారము :*

ఉత్ప్రేక్ష, వృత్త్యనుప్రాసము, సందేహము.

విధు చకచకలును, ఝుంద్రే
ష ధనుర్ధరు నంప సెకలు, శుక పిక శారీ
మధులిట్టులు మలయానిల
మధు లిట్టులు తనదు ధైర్యమహిమఁ గలంపన్. 213

మీది పద్యములోని మన్మథపరివారము వల్ల విరహావస్థలో ఉన్న అర్జునుడికి కలిగిన బాధను కవి వర్ణిస్తున్నాడు.

అర్థము :

విధు = చంద్రునియొక్క, చకచకలును = వేడికాంతిని, పుండ్రేక్షు ధనుః ధరు = నలుపు కలిసిన ఎఱ్ఱరంగు చెరకు, విల్లుగా ధరించినవాడైన, మన్మథుని యొక్క, అంపసెకలు = అమ్ముల యొక్క తాపమున్ను, శుక...లిట్టులుగా శుక = చిలుకలును, పిక = కోయిలలును, శారీ = గొరువంకలును, మధులిట్టులుగా = (మధుపములు) తుమ్మెదలును, మలయానిల = మలయమారుతుడును, మధులు = వసంతుడును, ఇట్టులు = ఈరీతిగా, తనదు ధైర్యమహిమగా = తనయొక్క ధైర్యసంపదను, కలంపగా = కలతపడునట్లు చేయగా...తరువాతి కన్వయము.

తాత్పర్యము :

చంద్రుడి వేడికాంతులూ, మన్మథుడి బాణాలూ, శుకపికాదులూ, మలయమారుత వసంతులూ అన్నీ కలిసి అర్జునుడి ధైర్యాన్ని కలతపెట్టగా....తరువాతి పద్యముతో అన్వయము.

విశేషము :

ఇవి అన్నీ మదనోద్దీపకములు కాబట్టి ధైర్యము కలగ బారిందని భావము.

పైపద్యములో చూచినవారికి మన్మథుడిలాగా కనిపించిన అర్జునుడికి ఈ పద్యములో ఆ మన్మథుడి మహిమ ప్రత్యక్ష మవుతూ ఉంది. చకచకలు = చురచురలాడేవని భావము

నలుపు కలిసిన ఎఱ్ఱచెరకును పుండ్రము, పుండ్రేక్షు, అంటారు. దీనినే నామాల చెరుకని కూడా వాడతారు.

అలంకారము :

యమకము.

చందనగంధి నెన్నుదురు చందురులో సగపాలు, బాల ము
ద్దుం దెలి చూపు లంగజుని తూపుల లోపల మేల్తరంబు, లిం
దిందిరవేణి మోవి యెలదేనియలో నికరంపుఁ దేట, యే
మందము మందయాన ముఖ ? మందము మీఱు నవారవిందమున్.214

పైపద్యములో చెప్పినట్లు అర్జునుడి ధైర్యము కలతచెందగా అతడు చిత్రాంగదను తలచుకుంటూ ఊరట చెందుతున్నాడు.

అర్థము :

చందనగంధి = చందనపు వాసన సహజముగ గల ఆ చిత్రాంగదయొక్క, నెన్నుదురు = అందమైన లలాటము, చందురులోగా, సగపాలు = అర్ధభాగ మగును, బాల = అముగ్ధయొక్క,

ముద్దుం తెలిచూపులు = ముద్దులొలుకు నిర్మలమైన చూపులు, అంగజుని = మన్మథునియొక్క, తూపులలోపలన్ = బాణములలో, మేల్తరంబులు = శ్రేష్ఠములు, ఇందిందిరవేణి = తుమ్మెదల వంటి కొప్పుగల దాని, మోవి = అధరము, ఎల తేనియలోన = క్రొత్త పూవుల తేనెలో, నికరంపు తేట = (నిస్సారమైన దంతా పోగా మిగిలిన) శ్రేష్ఠమగు సారము, ఏమందము మందయాన ముఖము = మందమగు నడకగల ఆ ఇంతియొక్క ముఖమును ఏమని చెప్పగలము? (దేనిలోని ఏభాగమని అనగలము ?) అందము = ఆ ముఖముయొక్క సౌందర్యము, నవ అరవిందమున్ = అప్పుడే వికసించిన తామర పూవును, మీఱున్ = అతిశయించునుగదా.

తాత్పర్యము :

ఆ చిత్రాంగద నుదురు చంద్రుడిలో సగపాలు, చూపులు మన్మథ బాణాలలో మొదటి తరగతివి, ఆమె మోవి మంచి తేనెలోని నికరపుసారము. ఇంక ఆమె ముఖము అన్నిటికంటె అందమైన నవ అరవిందాన్ని గూడా సౌందర్యమున మించి ఉన్నప్పుడు అది దేనిలో ఏమని వర్ణించగలము ? అని భావము,

విశేషము :

కొందరు "ఏమందము మందయాన మొగమందము" అని ఛేదించి ఆమందయాన ముఖము యొక్క సౌందర్యమును ఏమందము ? అని అర్థము చెప్పారు.

నుదురు చంద్రుడిలో సగపాలని, చూపులు మన్మథబాణాలలో మంచివనీ, మోవి తేనెలో సారమనీ చెప్పగలిగాము. కాని ముఖమును దేనిలోని నికరమని చెప్పగలము అంటాడు కవి.

ఎందుచేతనంటే అన్నిటికంటె అందమయినది నవాంబుజము, దానిని మించిన అందము ఆమె ముఖానికి ఉంది అని భావము.

కాబట్టి "ఏమందము మందయాన మొగము," అని ఛేదించి "అందము మీఱు నవారవిందమున" అనుటకు అందమునందు అని గాని, లేక దాని (ఆ మొగము యొక్క) అందము అనిగాని అన్వయము చెప్పడము శ్రేయము.

నెన్నుదురు అర్ధచంద్రునిబోలి ఉన్నదనీ, చూపులు మిగుల మదనోద్దీపకములనీ, మోవి సుధారస భరితమనీ, మొగము నిరుపమానమనీ అర్జును డనుకుంటున్నాడు.

అలంకారము :

రూపకము, ఉపమ, యమకము,

బంగరు బొంగరాల పరిపాటి చనుంగవ, మీల సూటి త
ళ్కుం గనుదోయి, చంద్రు ప్రతికోటి మొగం, బెలదేఁటి ధాటిక
న్నుం గడు మేటి వేణి, పులినంబుల సాటి పిఱుం దయారె ! చి
త్రాంగద సాటి జోటి కలదా ? యని మెచ్చు కిరీటి మాటికిన్. 215

అర్థము :

చనుంగవ, బంగరు బొంగరాల, పరిపాటి = విధము (సమానము), తళ్కు కను దోయి = మెరుస్తుండే కన్నుల జంట, మీల సూటి = (బెదిన) చేపలతో సమానము, మొగంబు, చంద్రుని, ప్రతికోటి = ఎదురువాది - సమానము, వేణి = కొప్పు, ఎల తేటి ధాటి కన్నన్ = కొదమ తుమ్మెదల బారుకంటే, కడుమేటి = చాల గొప్పది, పిఱుందు = కటి ప్రదేశము, పులినంబులసాటి = ఇసుక తిన్నెల వోలును, అయారె = ఆహా! చిత్రాంగదసాటి = చిత్రాంగదతో సమానమైన, జోటి = కాంత, కలదా ? అని, కిరీటి = అర్జునుడు, మాటికిన్ = మాటిమాటికీ, మెచ్చున్ = పొగుడును.

తాత్పర్యము :

ఆ చిత్రాంగద స్తనాలు బంగారు బొంగరాలతోను, మెరుస్తుండే కళ్లు చేపలతోను, ముఖము చంద్రుడితోను, కొప్పు తుమ్మెదల బారుతోను, కటి ఇసుక తిన్నెతోను పోలి ఉన్నాయి. ఆహా ! ఆమెవంటి కాంత ఎక్కడైనా ఉందా అని అర్జునుడు మాటిమాటికీ మెచ్చు కుంటూ ఉంటాడని భావము.

విశేషము :

ఈ పద్యములో కవి దృష్టి అంతా 'టి' అన్న అక్షరం మీద నిలిచింది. కేవలం అనుప్రాస కోసం చేసిన రచన లాగున్న దీనిలో విశేషార్థాల కోసం మనం ప్రయత్నించడం సమంజసము కాదనుకుంటాను.

అయినా వేదమువారు ఈ పద్యమున సొగసు నిట్లుగ్గడించారు : "బొంగరము ప్రక్క బొంగరము అభిప్రాయము గాన 'పరిపాటి', మీలు సూటిగా చూపులవలె దూటును గాన 'సూటి', చంద్రునికి కోటి యనగా శృంగము కలదు గాన 'ప్రతికోటి', దాటుచున్న దశలోని తేంట్లు అభిప్రేతములు గాన 'ధాటి', పులిన గుణములలో ఏకదేశ మాత్రము గాని, తదీయ దశా విశేష మాత్రము గాని గాక, పులినమంతయు నభిప్రేతమై నందున 'సాటి', యనియుం గల ప్రయోగంపు సొంపుం బరికింప నింపగు" అని. దీని సారస్యమును సహృదయులు చూడవచ్చును.

ఈకరణిఁ దలంచుచు నా
ళీక నిభానన నెదన్ నిలిపి రేఁ గడపెన్,
లే కెటుల నిద్రవచ్చున్
రేకగు నయ్యువిద నెదను నిల్పిన దాఁకన్. 216

అర్థము :

ఈకరణిన్ = ఈ విధముగా, తలంచుచున్, నాళీక నిభ ఆననన్ = పద్మము వంటి ముఖము గలదానిని, ఎదన్ = హృదయమునందు, నిలిపి, రేన్ = రాత్రిని, కడపెన్ (ఈ తలంపులతోనే రాత్రి అంతా గడచింది గాని నిద్రలేదని భావము). లేక = లేకుంటే, రేక + అగు = అందమగు, ఆ యువిదన్ = ఆ కాంతను, ఎదన్ = వక్షస్థలమునందు, నిల్పిన దాకన్ = నిల్పినంతవరకు, ఎటుల నిద్రవచ్చున్ = ఏలా నిద్రపోగలడు ?

తాత్పర్యము :

ఈలాగున తలచుకుంటూనే రాత్రంతా అర్జునుడు నిద్రలేకుండానే గడిపాడు. అందమయిన ఆ కాంతను ఆలింగనము చేసుకున్నంతవరకు నిద్ర ఎలా పడుతుంది ?

విశేషము :

ఎదను నిల్పుట = మనసులో నిలుపుట అనీ, వక్షస్థలము మీద నిలుపుట అనీ అర్థ చమత్కారము.

పద్యం చివరి భాగములో ఆ కాంతను ఎదను నిల్పిన దాకా నిద్రరాదన్నాడు కవి, మొదటి భాగములో 'ఎదను నిల్పినందువల్లనే' నిద్రపట్టలేదు. ఈ విరోధము రెండో అర్థంవల్ల తీరిపోతుంది.

కొందరు రసికులు రేకగు అన్నదానిని రేకున్ + అగు అని పదవిభాగము చేసి, "రాత్రికి తగినదైన" అని అర్థము చెప్పుతారు. కాని రేక + అగు = అందమయిన అని చెప్పి నట్టయితే, రాత్రికే కాక పగటికిగూడ దగినదై ఉంటుంది కదా. 'రేక' ఈ కవి సాధారణముగా వాడే పదము.

పాఠాంతరము :

'రేకగునయ్యువిద' అనడానికి బదులు 'వ్రేకగు నయ్యువిద' అని ఒక పాఠము.

అలంకారము :

యమకము. (విరోధాభాసము గూడ ఉందనవచ్చును.)

అపుడు నృపుఁడు ప్రఫుల్ల నవాంబుజ ప్ర
సన్న ముఖుఁడయి మలయధ్వజ క్షితీశ
కమలహితునకు మామ కాగమన వార్తఁ
దెలుపు మనుచు విశారదుఁ బిలిచి పనిచె. 217

తెల్లవారింది. ఇంక ఆలస్య మెందు కని అర్జునుడు కార్యోన్ముఖు డయాడు.

అర్థము :

అపుడు = అట్లు రేయిగడచిన తరువాత, నృపుడు = అర్జునుడు, ప్రఫుల్ల నవాంబుజ ప్రసన్న ముఖుఁడు అయి — ప్రఫుల్ల = బాగుగా వికసించిన, నవాంబుజ = క్రొత్త కమలమువలె, ప్రసన్న = తేటగల, ముఖుఁడు = ముఖముగలవాడు, అయి, విశారదుణ్, పిలిచి, మలయధ్వజ క్షితీశ కమలహితునకు = మలయధ్వజుడను పేరుగల రాజసూర్యుడికి (శ్రేష్ఠుడగు రాజుకు), మామక ఆగమన వార్తణ్—మామక = నాయొక్క, ఆగమన వార్తణ్ = రాకవృత్తాంతము, తెలుపుము = తెలియజేయుము, అనుచుణ్, పనిచెణ్ = పంపించెను.

తాత్పర్యము :

తెల్లవారినప్పటికి అర్జునుడు విశారదుడిని పిలిచి, మలయధ్వజరాజుకు తానిక్కడికి వచ్చి ఉన్న వార్త తెలియజేయమని ఆ రాజు దగ్గరకు పంపించాడు.

విశేషము :

అర్జునుడు ప్రసన్న ముఖుడవడానికి కారణము రేయి గడచి కార్యసమారంభానికి సమయము చిక్కెను గదా అని.

తెల్లవారు నప్పటి ప్రకృతితో మేళవించి ఆతని ముఖవికాసము గురించి చెప్పడము సొగసు.

అంబుజములకు స్నేహితుడు — కమలహితుడు. కాబట్టి అంబుజ ప్రసన్నముఖుడైన అర్జునుడు, క్షితీశ కమల హితుడైన మలయధ్వజుడికి, వార్త పంపడము సమంజసము. హిత భావము కార్యాని కనుకూలము గూడా.

సూర్యోదయాదులను వర్ణించడానికి మన కవులు చాలా ఉబలాటపడతారు. అయినా మన నాయకుడి కున్న తత్తరము (కాలయాపనకు ఓర్వక పోవడము) దృష్టిలో ఉంచుకొని మన కవి కథను త్వరిత గతిని నడిపించాడు.

అయినా సూర్యోదయం సంగతి పాఠకుడికి చెప్పకుండా పోలేదు. ప్రఫుల్లనవాంబుజాన్నీ, కమలహితుడినీ పద్యములో చూపించాడు.

విశారదుడిని అర్జునుడు 'పిలిచి పనిచె' అనడంలో అర్జునుడి తొందర స్పష్టమవుతుంది.

విశారదుడితో చెప్పిన మాటలే చాల చమత్కారముగా ఉన్నాయి : మామ కాగమన వార్త (నేను వచ్చానన్న సమాచారము) తెలుపుము అన్నాడు. కాని అతని అభిప్రాయము అంత మాత్రమే కాదని అందరికీ తెలుసును. చిత్రాంగదా ఘట్టములో అర్జును డవలంబించిన 'అవహిత్థ' (భావగోపనము) ఇంకా కొనసాగిస్తున్నాడని అనాలి.

తన హృదయములో ఉన్న అసలు అభిప్రాయం (వివాహ విషయం) తెలియపరచలేదా అంటే చేమకూర కవి చమత్కారము ద్వారా తెలియపరచక పోలేదని గట్టిగా చెప్పవచ్చును.

ఆ చమత్కారాన్ని[1] చూపించడానికి మన పండితులూ వ్యాఖ్యాతలూ ప్రయత్నించారు.

జూలూరువారు 'మామకు ఆగమన వార్త అని కూడా చమత్కారము విచారించవలెను' అని వ్యాఖ్యానించారు.

వేదమువారు ''మామకున్ ఆగమనవార్త... తన కూతును నాకిచ్చి వివాహము చేయుమని ఆయనను అడుగుము అని చమత్కారము" అని వివరించారు.

జూలూరువారు 'విచారించవలెను' అని అన్నారుగాని, వేదమువారు నిస్సంకోచముగా అదే చమత్కారమని నిర్ధారణచేశారు. ఆంధ్రసాహితీపరులు వారి వరవడినే అధ్యయనమూ అధ్యాపనమూ సాగించారు.

మామకున్ + ఆగమనవార్త అని పదవిభాగము చూపినప్పుడు, ఆ పద భాగాలకున్న అర్థాలు చెప్పి, వాటి సమ్మేళనమువల్ల కలిగిన శక్తితో విశేషార్థాలు నిరూపించి, తాము చూపిన (తన కూతునిచ్చి వివాహము చేయు మన్న) చమత్కారార్థాన్ని సాధించి ఉండాలి. అలాంటి దేదీ వారు చేయలేదు. సహృదయు లెంత ప్రయత్నించి ఆ అర్థాన్ని సాధించా లనినా ప్రయోజనము లేకపోయింది.

చమత్కారార్థము చూపించాలన్న అభిలాష ఉంటే "ఇదిగో ఈ సన్నివేశంలో 'మామ' అన్న మాట అర్జునుడి నోట వినవచ్చింది. కాబట్టి సంతోషించండి" అని పాఠకులను కోరితే ఇంతకంటే మేలు కాదా ?

ఇవి కేవలము సందర్భాన్నిపట్టి ఊహించి 'కిట్టించిన' వ్యాఖ్యానా లనక తప్పదు. పెండ్లి కాకముందే మలయధ్వజుడు మామ ఏలాగవుతాడు ? మామకు ఆగమన వార్త తెలుపుము అన్నంత మాత్రాన తన కూతు నివ్వమని అడుగు అన్న అర్థం ఏలా వస్తుంది ?

---

1. ఈ పద్యాన్ని గురించి అంగీరస సం, ఆషాఢమాస (1932జూన్) భారతిలో 'విజయవిలాస వ్యాఖ్యాన విధానము' అన్న వ్యాసావళిలో 5వ పద్య విమర్శన జిజ్ఞాసువులు చూడవచ్చును.

అర్జునుడు సభ్యత తెలియని మోటుమనిషి కాడు. ఉత్తమ రాజవంశములో పుట్టినవాడు. విశేషించి ధర్మరాజు తమ్ముడు. అటువంటి వాడు ఈ సన్నివేశములో — చిత్రాంగద మీద తనకు మోహము కలిగినంత మాత్రాన, ఆమె తండ్రిని 'మామ' అని నిర్దేశిస్తాడా ? ఇంతవరకూ భావగోపన ప్రయత్నముతో ప్రవర్తించిన అర్జునుడు ఇక్కడ ఈలాగు వెకిలిగా బయటపడతాడా? అత్యంతశ్రద్ధతో ఈ పాత్రను పోషించుకుంటూ వచ్చి ఈ ఒక్క మాటతో చేమకూరకవి ఇంత పేలవంగా తేలిపోతాడా ?

తేలిపోడు ! సుస్పష్టంగా అర్జునుడి హృదయములోని అభిప్రాయం కనబరిచాడు. అర్జునుడు విశారదుడికి చెప్పినమాటలను 'మామ + కాగ + మనవార్త తెలుపుము' అని విడదీస్తే ప్రశస్తంగా ఉంటుందని మనవిచేశాను దీని కర్థము 'మామ అయేటట్టు మనవార్త తెలుపుము' అని. మామ అయేటట్టు అంటే కూతురి నిచ్చినట్టు; మనవార్త (నా సంగతి మన వంశము సంగతి) చెప్పుమన్నాడు. నీవు చెప్పినది విని మలయధ్వజుడు మా వివాహాని కంగీకరించాలని కార్యభార మంతా నేర్పుతో విశారదుడిమీద పెట్టాడు.

కాగ = అయేటట్టు అని అర్థం చెప్పినప్పుడు మధ్యను అరసున్న ఉండాలని కొంద రంటారు. కాని, శ్లేషలలో అరసున్నలనూ, బండిరాలనూ పాటించకపోయినా తప్పులేదని వ్యాకరణాచార్యులు అంగీకరించారు.

చేమకూర కవి శ్లేషలు "పూమొగ్గలవలె తమంతతామే వీడును" అని వేదమువారు ప్రశంసించారు ఆ మాట నా పదవిభజన వల్ల అక్షరాలా సార్థక మయిందనే అనుకుంటాను.

*అలంకారము* :

శ్లేష, రూపకము, ఉపమ.

పనిచిన నేఁగి యాతఁడు నృపాలుని మంత్రి ముఖాంతరమ్మునన్
గనుఁగొని, "యంత్ర మత్స్యము జగం బెఱుఁగన్ భుజశక్తి నేసి జ
వ్వనిఁ గయికొన్న యర్జునుఁడు వచ్చినవాఁ డిదె తీర్థయాత్రగా
జనవర" యంచు విన్నపము సల్పినయంత ససంభ్రమమ్ముగన్, 218

*అర్థము* :

పనిచినన్, ఏఁగి, అతఁడు = విశారదుడు, మంత్రి ముఖాంతరమ్మునన్ = (మలయధ్వజుని) మంత్రి యొక్క ముఖము తమ నడుమ నుండినట్లు (మంత్రి ద్వారా తన పక్కు తెలిగించి), కనుఁగొని = (ఆ రాజును) చూచి, "జనవర = ఓరాజా ! యంత్ర మత్స్యమున్,

జగంబు = లోకమంతా, ఎఱుఁగఁగ, భుజశక్తిఁగ = బాహుబలముతో, ఏసి = తెగనేసి, జవ్వనిఁగ = యౌవనవతియైన ద్రౌపదిని, కయికొన్న = పాణిగ్రహణము చేసుకొనిన, అర్జునుఁడు, తీర్థయాత్రగాఁగ = పుణ్యతీర్థములను సేవించుట కొరకు, ఇదే = ఇప్పుడే, వచ్చిన వాఁడు" అంచుఁగ, విన్నపము సల్పినయంతఁగ = తెలియపర్చగానే, ససంభ్రమమ్ముగాఁగ = (మలయధ్వజుడు) ఆదరముతో కూడిన తొందరతో... తరువాతి కన్వయము.

*తాత్పర్యము :*

అర్జునుడు పంపించగా, విశారదుడు మంత్రిద్వారా మలయధ్వజరాజును చూచి, 'రాజేంద్రా! మత్స్య యంత్రాన్ని తెగనేసి ద్రౌపదిని పాణిగ్రహణము చేసుకున్న అర్జునుడు తీర్థయాత్రలకు బయలుదేరి ఇప్పుడే ఇక్కడకు వచ్చి ఉన్నాడు' అని తెలియబరిచాడు. వెంటనే రాజు ఎంతో తొందరతో — తరువాతి కన్వయము.

*విశేషము :*

రాజులను మంత్రి ముఖాంతరమున కనుగొనడము ఒక మర్యాద. విశారదుడు సకల ధర్మవిశారదుడు గదా!

ఈమాటలు అర్జునుని గూర్చి చెప్పడము ఉద్దేశపూర్వకము. వీటివల్ల యంత్రమత్స్య విషయములోని నేర్పున్నూ, ఆ వెనుక జరిగిన యుద్ధములో కనబరిచిన భుజశక్తి, త్రిజగన్నుత సౌందర్యముగల ద్రౌపదికి తగిన గుణసంపద కలిగి ఉండడమూ, అన్నీ తెలుస్తాయి అని విశారదుడి ఆలోచన. తన కూతురు మొదటి భార్య కా దన్న మాటగూడా సూచించాడు.

అంతటి పరాక్రమవంతుడు వచ్చాడుగదా అన్న గౌరవభావమూ, తొందరపాటూ మలయధ్వజుడు కనబరచడము సమంజసము.

తన నగరు వంటిదే చ
క్కని నగ రొక టాయితమ్ము గావించి పురం
బు నలంకరింపఁగాఁ జే
సినవాఁడై యపుడు సకల సేనలు గొల్వన్, 219

*అర్థము :*

తన నగరువంటిదే చక్కని నగరు, ఒకటి, 'ఆయితమ్ము గావించి = సిద్ధముచేయించి, పురంబును, అలంకరింపఁగాన్ జేసినవాఁడై, అపుడు, సకల సేనలు = సేనలన్నీ (రథ గజ తురగ పదాతు లన్నీ), కొల్వన్ = వెంటవస్తుండగా...తరువాతి కన్వయము.

ఎదురుగ వచ్చి పాండ్య ధరణీశ్వరుఁ డర్జునుఁ గాంచి, 'నేఁడుగా
సుదినము, మీరు రాఁగలుగు శోభన మెన్నఁడు గల్గుఁ బ్రోలికిం,
బదుఁ, డని, యిద్దఱుం దొఱసి భద్రగజమ్ముల నెక్కి వచ్చి రిం
పొదవ హళాహళిం గడకు నొత్తెడు పౌజుల దిక్కు చూచుచున్. 220

అర్థము :

పాండ్య ధరణీశ్వరుఁడు = పాండ్యదేశపురాజు, ఎదురుగ వచ్చి, అర్జునున్, కాంచి, 'నేఁడుగా = ఈదినమేకదా, సుదినము, మీరు రాన్ కలుగు = మీరువచ్చి నందువల్ల కలిగే, శోభనము = శుభము, ప్రోలికిన్ = మాపురమునకు, ఎన్నఁడు గల్గున్ = మిక్కిలి అరుదుగదా, పదుఁడు = పదండి, అని, ఇద్దఱున్ (పాండ్య పాండవులు), దొఱసి = కలసి (జోడుగా), భద్ర గజమ్ముల నెక్కి = భద్రజాతి ఏనుగులనెక్కి, హళాహళిన్ = చూడడానికి వచ్చినవారల సంద డిని, కడకున్ = ప్రక్కలకు, ఒత్తెడు = రాజులకు దారికలుగునట్లుగా ఒత్తుచుండిన, పౌజుల దిక్కు = సేనలవైపు, చూచుచున్, ఇంపొదవన్ = మిక్కిలి రమణతో, వచ్చిరి = పోయిరి.

తాత్పర్యము :

పాండ్యుడు ఎదురుగా వచ్చి 'ఇది చాల సుదినము. మీరు వచ్చినందువల్ల కలిగే శుభము మా పురానికి ఎప్పుడు కలుగుతుంది, దయచెయ్యండి, అని, ఇద్దరు రాజులూ భద్రజాతి ఏనుగుల మీదనెక్కి వెళ్తూ ఉండగా, ఈ స్వాగతోత్సవం చూడడానికి వచ్చిన పౌరులు సందడి చేస్తూంటే రాజభటులు ఆమూకను పక్కకు పంపించి దారి ఏర్పాటు చేస్తున్నారని భావము.

విశేషము :

ఆదరాతిశయంతో పాండ్యు డాడిన మాటలలోనే కానున్న కథను సూచించి కవి నాటక విధానము నవలంబించాడు.

నేడుగా సుదినము; మీరురాన్ - మీరు వచ్చుటవల్ల , కలుగు - కలుగనున్న, శోభనము- పెండి, ఎన్నడుగల్గు? ప్రోలికిం పదుడన్న అర్థము గూడా ఉన్నది.

దొఱసి అనగా కలిసి. అనగా, వారెక్కిన భద్రగజములు ఒకదాని పక్కనే ఒకటి నడుస్తున్నాయన్నమాట.

అలంకారము :

స్వభావోక్తి.

రాజవీథుల నెసఁగ నీరాజనములు,
కటికవా రెచ్చరింప నై కటిక భూమి
వంది జనములు పొగడఁ జెల్వంది మిగులఁ
బురము సొత్తెంచె విజయుఁ డబ్బురము గాఁగ. 221

*అర్థము :*

రాజవీథులన్, నీరాజనములు = పురములోని కాంతలిచ్చే మంగళహారతులు, ఎసఁగన్ = ఒప్పుచుండగా, కటికవారు = వెండిబెత్తములవారు (వేత్రహస్తులు), నైకటిక భూమిన్ = సమీప (నికట) ప్రదేశమునందు, ఎచ్చరింపఁగా = తొలగుడు తొలగుడని హెచ్చరిస్తుండగా, వందిజనములు = భట్టులు, పొగడఁగా = స్తోత్రపాఠములు చేయుచుండగా, మిగుల చెల్వు అంది = మిక్కిలి సంతోషమును పొంది, విజయుఁడు = అర్జునుడు, అబ్బురము గాఁగన్ = (చూపరకు) ఆశ్చర్యము కలుగునట్లు, పురముఁగా = పట్టణమును, చొత్తెంచెన్ = ప్రవేశించెను.

*తాత్పర్యము :*

వీథులలో స్త్రీలు హారతులు పట్టుతుండగా, వెండి బెత్తాలవారు జనసంకులాన్ని హెచ్చరిస్తుండగా, భట్లు పొగుడుతుండగా, చాల సంతోషముతో అర్జునుడు రాజధానీనగరము ప్రవేశించాడు.

*విశేషము :*

మలయధ్వజరాజు రాజధానీ నగరముపేరు మణిపూరు. దీని ఇప్పటిపేరు మణలూరు.

*అలంకారము :*

యమకము.

నెట్టుకొని నరునిఁ గనుచోఁ
బట్టణమునగల సమస్త భామల కహహా!
యెట్టి విచిత్రమొ! మనసునఁ
బుట్టినవాఁ డపుడు మనసుఁ బుట్టించె సుమీ. 222

*అర్థము :*

నెట్టుకొని = ఒకరినొకరు తోసుకొంటూ, నరునిన్ = అర్జునుని, కనుచో = చూచినప్పుడు, అహహా! ఎట్టి విచిత్రమో (కాని), పట్టణమునఁగా, కల, సమస్త భామలకుఁగా =

అందరు స్త్రీలకూ, మనసున బుట్టినవాఁడు = మన్మథుడు, మనసుఁ బుట్టించెఁ సుమీ = మనసు పుట్టించెను - కోరికలను కలిగించెను సుమా ?

తాత్పర్యము :

ఒకరినొకరు తోసుకుంటూ అర్జునుడిని చూచినప్పుడు స్త్రీలందరికీ, ఏమిచిత్రమోగాని, మనసులో పుట్టినవాడు ఆ మనసునే పుట్టించాడని భావము.

*విశేషము :*

విచిత్రమేమంటే, మనసులో పుట్టినవాడు ఆ మనసునే పుట్టించాడు. (తండ్రిని బిడ్డడు పుట్టించడము చిత్రము.) మనసున బుట్టినవాడు — చిత్తజుడు, మన్మథుడు ; మనసు బుట్టించె — కోర్కెలను కలిగించెను అని అర్థం చెప్పుకున్నాము కాబట్టి, దీనిలో చిత్రమూలేదు, విరోధమూ లేదు.

స్త్రీలందరికీ 'మోహము' కలిగిందనడం కంటే ఏవేవో 'కోర్కెలు' కలిగాయి అనడము సమంజసము. ఔచిత్య సూచకం గూడా.

*అలంకారము :*

అతిశయోక్తి - విరోధాభాస.

"చక్కఁదనంబు రూపునఁ బొసంగుటె కాదు, గుణంబులందునుఁ
జక్కదనంబు గల్గు నెఱజాణ, జగంబున నీడులేని నా
చక్కని కూఁతునుం దొఱయఁ జాలిన వాఁ డితఁ డల్లుఁడైనఁగా
మిక్కిలి కీర్తి గల్గు" నని మెచ్చు మనమ్మున రాజు సారెకున్. 223

*అర్థము :*

చక్కదనంబు = అందము, రూపునన్ పొసంగుటెకాదు = రూపములో మాత్రముండడం కాదు, గుణంబులందునుఁ, జక్కు + అదనంబు = నైర్మల్య అతిశయము, గల్గు, నెఱజాణ = మిక్కిలి సమర్థుడు, జగంబునన్, ఈడులేని = గుణములలోనూ, సౌందర్యములోనూ సాటి లేనట్టి, నాకూఁతునున్ = నాకూతురుని, దొఱయఁ జాలినవాఁడు = పొందుటకు అర్హతగలవాడు, ఇతఁడు, అల్లుడైనఁ గా = అల్లుఁడైన ఎడలనే కదా, మిక్కిలి కీర్తి కల్గుఁ, అని రాజు, సారెకుఁ = మాటిమాటికిని, మనమ్మునఁ మెచ్చుఁ = మనసులో మెచ్చుకుంటూ ఉంటాడు.

తాత్పర్యము :

చక్కని రూపము, నిర్మలమైన గుణాలు కలిగిన సమర్థుడు; గుణసౌందర్యాలలో సాటి లేని నాకూతురుని వివాహ మాడడానికి తగినవాడు, ఇతడు నాకు అల్లుడైతేకదా కీర్తికలుగుతుం దని మాటిమాటికీ పాండ్యరాజు మెచ్చుకుంటూ ఉంటాడని భావము.

విశేషము :

రూపములోనూ గుణములోనూ సామర్థ్యములోనూ ప్రశంసా పాత్రుడు అర్జునుడు. గుణసౌందర్యాలలో సాటిలేనిది తనకూతురు. ఈ ఇద్దరికీ వివాహము చేసినట్టయితేనే కీర్తి కలుగుతుందని నిర్ణయించుకున్నాడు.

గుణంబులందునుఁ జక్కు అదనంబు అని పదవిభాగము చేసినవారు తిరుపతివారు. గుణంబునందునుఁ చక్కదనంబు అని ఎంత చెప్పినా ఈ సొగసురాదు.

కాబట్టి నిఘంటులలో లేకపోయినా, తిరుపతివారి అర్థాన్ని అంగీకరించడం సమంజసము.

అలంకారము :

యమకము.

అడు గడుగందునున్ మణిపురాధిపుఁ డి ట్లుచితోపచారముల్
కడు నొనరించి యుద్వహన కౌతుక హేతు కళావిశేషమౌ
విడిదికిఁ దెచ్చి నిల్పి, యతి విస్మయమందఁగ విందు వీడుకో
లుడుగరలుఁ ధనంజయుని యుల్లము రంజిలఁ జేసె నెంతయున్.

అర్థము :

అడుగడుగందునుఁ = ప్రతిక్షణమును అన్నమాట, అడుగుదీసి అడుగువేయు నప్పుడెల్ల, మణిపురాధిపుఁడు = మణిపురపు రాజు, ఇట్లు, ఉచితఉపచారముల్ = తగిన మర్యాదలు, కడున్ = విశేషముగా, ఒనరించి = చేసి, ఉద్వహన కౌతుక హేతు కళావిశేషము బౌ = వివాహాలగురించి ఉత్సాహమును కలిగించే చిత్రశిల్పాది వస్తువులు కల (అనగా అచటి చిత్రశిల్పకళల సింగారము చూస్తే ఎటువంటి వానికైనా పెండ్లి వేడుకల కుతూహలము కలుగు తుందనీ, శృంగార రసప్రధానములగు కళావిశేషములు గలదనీ భావము), విడిదికి = బసకు, తెచ్చి, నిల్పి, అతివిస్మయము = మిక్కిలి ఆశ్చర్యము, అందఁగఁ = చూచినవారు పొందు నట్లు, విందు వీడుకోలు ఉడుగరలుఁ = విందులూ, సెలవు తీసుకోడాలూ, కానుకలూ, ధనంజయుని = అర్జునునియొక్క, ఉల్లము = మనసు, రంజిలన్ = సంతోషించునట్లు, ఎంతయుఁ = విశేషముగా, చేసెఁ = నడిపెను.

తాత్పర్యము :

పెండ్లి సరదాలను కలుగజేసే అలంకరణలతో ఉన్న విడిదిలో దించి, మంచి ఆతిథ్యముతో అర్జునుడిని తృప్తిపరుస్తున్నాడు, అల్లుడు కావాలన్న కోరికతో.

విశేషము :

పాండ్యుడికీ పాండవుడికీ ఇద్దరికీ ఉన్న కోరిక ఒక్కటే. ఎవరూ బయట పడలేదు. అందుకే రెండు పక్షాలా ఆందోళన.

ధనంజయు డనడానికి కారణము-

ధరణి యెల్ల గెలిచి తగ ధనంబులు గొని
యునికి నే ధనంజయుండ నైతి.

భార. వి.

## ఆశ్వాసాంతపద్యములు[1]

సరసాగ్రేసర, వాసరప్రభు తనూజ స్థూలలక్షా, పురం
దరజి ద్భోగ ధురంధరా, భరతశాస్త్ర ప్రౌఢ మార్గైక లా
స్య రసాస్వాదన కోవిదా, శ్రవణభూషా దివ్యరత్న త్విషా
తరణి శ్రీకర గల్లభా, విభవభృ త్తంజా పురీ వల్లభా. 225

అర్థము :

సరసాగ్రేసర = రసజ్ఞులలో శ్రేష్ఠుడా, వాసరప్రభు = దిననాథుడగు సూర్యునియొక్క, తనూజ = కుమారుడగు కర్ణునివలె, స్థూలలక్షా = మహాదాతా, పురందర జిత్ = ఇంద్రుని మించగలిగిన, భోగ = భోగమును, ధురంధర = వహించినవాడా, భరతశాస్త్ర = భరతముని చెప్పిన నాట్యశాస్త్రము నందలి, ప్రౌఢ = మిక్కిలి నేర్పుతో కూడిన, మార్గఏక = మార్గమను పేరుగల ముఖ్యమైన, లాస్య = స్త్రీల నాట్యములోని, రస = సొగసును, ఆస్వాదన = అనుభవించుటయందు, కోవిదా = పండితుడా (మార్గలాస్య చమత్కారములను గ్రహించగలిగిన

1. ఆశ్వాసాంత పద్యాలుగా చేమకూరకవి వ్రాసినవి 9, 10 పద్యాలు మాత్రమే. వీటినే విజయ విలాసములోనూ, సారంగధర చరిత్రలోనూ ప్రచురణకర్తలు — ఒక్కొక్క ఆశ్వాసానికి రెండేసి, మూడేసిగా, ఉపయోగించుకున్నారు. వీటిని గురించీ, ఆశ్వాసాది పద్యాలను గురించీ, గద్యలను గురించీ పీఠికలోని నా సమీక్ష చూడమని మనవి.

వాడా), శ్రవణభూషా = చెవిపోగులయందలి, దివ్యరత్న = శ్రేష్ఠమైన మణులయొక్క, త్విషా = కాంతులచేత, తరణిశ్రీ కర = సూర్యశోభను కలిగించుచున్న, గల్ల = చెక్కిళ్ల యొక్క, భా = కాంతికలవాడా (చెవులరవల కాంతులవల్ల సూర్యునివలె ప్రకాశిస్తున్న చెక్కిళ్లు కలవాడా), విభవభృత్ = ఐశ్వర్యమును వహించిన, తంజాపురీ = తంజావూరునకు, వల్లభా = ప్రభువా (రఘునాథనాయకా).

అలంకారము :

ఉల్లేఖము.

యాచనక వినుత, వని తా
సేచనక మనోహరాంగ, శృంగార కళా
సూచన, క్రమ కవి తా
లోచన కందళిత హర్ష లోలుప హృదయా. 226

అర్థము :

యాచనక = అర్థిజనులచేత, వినుత = కీర్తింపబడినవాడా, వనితా = స్త్రీలకు, ఆసేచనక = ఎంత చూచినా తనివి తీరని, మనోహర అంగ = సుందరమైన శరీరముగలవాడా, శృంగార కళా సూచన = శృంగారశాస్త్ర విషయాలు ఏలాగుండవలెనో సూచించ గలిగినవాడా, క్రమ = మనోహరమైన, కవిత్వ = కవనము గురించి, ఆలోచన = ఆలోచించుట యందు, కందళిత = చిగిరించు (అతిశయించు), హర్ష = సంతోషమునందు, లోలుప = మిగుల ఆసక్తిగల, హృదయా = మనస్సుగలవాడా (మంచి కవిత్వము గురించి ఆలోచించుటయం దెక్కు డాసక్తి గల వాడని భావము).

తోటకము :

అతు లాగమ శాస్త్ర నిరస్త సురే
జ్య, తు లాతిగ విద్వ దవాప్త శత
క్రతు లాభ, శుభోదయ కారణ ర
త్న తులాపురు షాదిక దాన చణా. 227

అర్థము :

అతుల = సాటిలేని, ఆగమ = వేదముల జ్ఞానమునందున్ను, శాస్త్ర = శాస్త్రముల (జ్ఞానము) నందున్ను, విరస్త = తిరస్కరింపబడిన, సురేజ్య = దేవగురువగు బృహస్పతిని కలవాడా, (శాస్త్రాగమముల జ్ఞానమందు బృహస్పతిని మించినవాడా), తులాతిగ = ఈడులేని, విద్వత్ = విద్వాంసులచేత, అవాప్త = పొందబడిన, శతక్రతులాభ = (నూరుయజ్ఞములు చేసిన)ఇంద్రుని యొక్క వైభవములు గలవాడా (విద్వాంసులకు ఇంద్ర వైభవముల నిచ్చినవాడా), శుభోదయ కారణ = శుభములు కలుగుటకు హేతువులగు, రత్నతులాపురుష = నవరత్నములతో తులా భారము, ఆదిక = మొదలైన, దాన = దానములు చేయుటయందు, చణా = సమర్థుడా (రత్న ములతో తులతూగి ఆ రత్నములను దానముచేసి శుభములను పొందువాడా అని భావము).

## గద్యము

ఇది శ్రీసూర్యనారాయణ వరప్రసాద లబ్ధ సారస్వత సుధాసార జనిత యశోల తాంకూర చేమకూర లక్ష్మణామాత్య తనయ వినయ ధురీణ సకల కలా ప్రవీణాచ్యు తేంద్ర రఘునాథ భూపాల దత్త హస్త ముక్తాకటక విరాజమాన వేంకట కవిరాజ ప్రణీతంబైన విజయవిలాసంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

అర్థము :

ఇది = ఇప్పుడు సమాప్తమయినది, సూర్యనారాయణ (మూర్తియొక్క) వరప్రసాదము వల్ల, లబ్ధ = పొందబడిన, సారస్వత = వాఙ్మయమను, సుధా ఆసార = అమృతపు జడివాన వలన, జనిత = పుట్టించబడిన, యశః = కీర్తియనెడు, లతా అంకూర = తీవ మొలకయైనట్టి, చేమకూర (వారి ఇంటి) లక్షణామాత్య = లక్ష్మణమంత్రి, తనయ = కుమారుడును, వినయ ధురీణ = అడకువను వహించినవాడును (అయి), సకల కలా = అన్ని విద్యలయందు, ప్రవీణ = పండితుడున్ను, అచ్యుతేంద్రు కుమారుడును అగు, రఘునాథ భూపాలుని(చేత), దత్త = ఈయబడిన, హస్తముక్తాకటక = ముత్యాల చేతికడియముచేత, విరాజమాన = ప్రకాశించు వాడైన, వేంకటకవిరాజ (అన్న పేరుగల) కవిశ్రేష్ఠునిచే, ప్రణీతంబైన = రచించబడిన, విజయవిలాస = (అర్జునిని లీలలు అను అర్థముగల) విజయవిలాసమను పేరి, మహాప్రబంధము నందు, ప్రథమాశ్వాసము.

# వి జ య వి లా స ము

## హృ ద యో ల్లా స ము

### రెండవ ఆశ్వాసము

శ్రీధుర్య శౌర్య, ధైర్య
క్ష్మాధర మూర్ధన్య, యాదిగర్భేశ్వర, వి
ద్యాధిక, వితరణ దీక్షా
రాధాసుత, యచ్యుతేంద్ర రఘునాథనృపా ! 1

*అర్థము :*

శ్రీధుర్య శౌర్య = సంపదను వహించునట్టి పరాక్రమము కలవాడా, ధైర్య...ర్ధన్య— ధైర్య (మునందు), క్ష్మాధర = పర్వతముల, మూర్ధన్య = శ్రేష్ఠుడా (మేరువువంటివాడా). ఆది గర్భేశ్వర = తల్లి గర్భములో ఉన్నదిమొదలు ఐశ్వర్యము కలవాడా, విద్యాధిక = విద్యలలో అధికుడా, వితరణదీక్షా = దానముచేయు నిష్ఠయందు, రాధాసుత = రాధ కొడుకగు కర్ణునివంటి వాడా, అచ్యుతేంద్ర (కుమారుడవగు) రఘునాథరాజా.

*విశేషము :*

మేరుపర్వతము ఎటువంటి పరిస్థితులలోనూ చలించదు కాబట్టి ధైర్యము కలవారికి ఉపమానమయింది. 'మేరునగసమానధీరా' అని కవులు రాజులను పొగుడుతుంటారు.

ఈ పద్యాన్ని కొందరు పరిష్కర్తలు మొదటి ఆశ్వాసారంభమున, కొందరు మూడో ఆశ్వాసారంభమున చూపించారు. దీనినే సారంగధర చరిత్రలో కూడా ఆశ్వాసాది పద్యముగా ప్రచురించారు.

*పాఠాంతరము* :

......గర్భేశ్వర, వి
ద్యాధికజాల వశంవద
రాధానుత యచ్యుతేంద్ర......

— నోరివారు.

"విద్యాధికజాల వశంవద = విద్యలచేత అధికులయిన పండిత బృందమునకు స్వాధీన మయినవాడా ! రాధా నుత = కాంతిచేత కొనియాడబడుచున్నవాడా ! (లేక) రాధయను సంగనా మణిచేత కొనియాడబడుచున్నవాడా !'' అని అర్థము వ్రాశారు.

*అలంకారము* :

ఉల్లేఖము, అతిశయోక్తి, రూపకము.

అవధరింపుము కథాకర్ణ నాతివేల
హర్షులైనట్టి దివ్య మహర్షులకునుఁ
దత సమస్త పురాణ కథా శతాంగ
సూతుఁడై విలసిల్లెడు సూతుఁ డనియె. 2

*అర్థము* :

అవధరింపుము = (రఘునాథరాజా) చిత్తగించు, కథా ఆకర్ణన = కథలను వినుటయందు, అతివేల = మేరమీరుతున్న, హర్షులు = సంతోషముకలవారు, ఐన = అయినట్టి, దివ్యమహర్షులకు, తత = విస్తీర్ణమైన, సమస్త = అన్ని విధాలయిన, పురాణకథా = పురాణ కథలన్న, శతాంగ = రథమునకు, సూతుఁడు ఐ = సారథి అయి, విలసిల్లెడు = ఒప్పుచున్న, సూతుఁడు = సూతమహర్షి, అనియెన్ = ఈక్రింది విధముగా చెప్పెను :

*తాత్పర్యము* :

కథలు విని ఎక్కువగా సంతోషించే మహర్షులకు పురాణ కథలన్న రథానికి సారథి అయిన సూతమహర్షి ఈలాగు చెప్పెనని భావము.

*పాఠాంతరము* :

ఈ పద్యానికి బదులు కొందరు పరిష్కర్తలు "అవధరింపుము నైమిశారణ్య వాసు లగు మహామునులకు రొమహర్షణి యిట్లనియె'' అన్న వచనము మాత్రము ప్రచురించారు.

**అలంకారము :**

రూపకము, యమకము.

ఆ చెలువంపు రాకొమరుఁ డంత వయస్యునిఁ జూచి యింపుతో
"నీ చతురత్వ మీ వినయ మీ యుచితజ్ఞత యెందు నేనియుఁ గా
జూచితె ? మైత్రికిం దగిన చోటగు, శోభనపుం బ్రసంగముఁ గా
సూచనఁ జేసి రాజు మదిచొ ప్పెఱుఁగం గ వలదా విశారదా ?" 3

**అర్థము :**

ఆ చెలువంపు రాకొమరుఁడు = అందగాడయిన ఆ అర్జునుడు, వయస్యునిన్ = చెలికానిని, ఇంపుతోఁ గా = ప్రీతితో, చూచి, విశారదా ! ఈ చతురత్వము = (మలయధ్వజ మహారాజు కనబరుస్తున్న) ఈ నేర్పూ, ఈ వినయమూ, ఈ ఉచితజ్ఞత = తగినదానిని గ్రహించే ఈ వివేకమూ, ఎందు నేనియుఁ గా = ఎక్కడైనా, చూచితె = చూచావా ? మైత్రికిఁ గా = స్నేహానికి (వియ్యానికి అనే అభిప్రాయము), తగినచోటు = తగినవాడు, అగుఁ గా, శోభనపుం బ్రసంగముఁ గా = శుభకరమయిన సంభాషణను (వివాహ సంబంధమయిన మాటలు అని భావము), సూచనచేసి = తెలియపరిచి - సంభాషణలో సూచనగా అందించి, రాజు = మలయధ్వజరాజు యొక్క, మది చొప్పు = మనసున్న తీరును (అభిప్రాయాన్ని), ఎఱుఁగఁ గా వలదా = తెలుసుకోవడం మంచిదికాదా ?

**తాత్పర్యము :**

మొదటి ఆశ్వాసాంతములో కవి చెప్పిన ప్రకారము మలయధ్వజరాజు మహా ఆదరగౌరవాలతో ఆతిథ్యము ఇస్తూ ఉండడం చూచి అర్జునుడు, "విశారదా, ఈ రాజు కనబరుస్తున్న గౌరవమర్యాదలు ఎక్కడైనా చూచావా ? స్నేహం చేయడానికి తగినవాడు. అయినా, అతని ఉద్దేశము ఎలాగుందో, సంభాషణలో వాచాగా కాక సూచనచేసి, తెలుసుకోవడం మంచిదికాదా" అని అంటాడు.

**విశేషము :**

అర్జును డింకా మైత్రి (స్నేహము) అనే అంటున్నాడు. అందుచేత 'శోభనపుం బ్రసంగము' అన్నదానికి 'శుభకరమైన సంభాషణ' అని మనము గూడ అవహిత్థ (భావగోపనము) పాటించడము న్యాయము.

'సూచనచేసి...ఎఱుఁగఁజాలదా' అన్నాడు అర్జునుడు. ఒకవేళ మలయధ్వజుడి అభిప్రాయం వేరుగా ఉండి, అతడు ఏకారణం వల్లనైనా కాదంటే, తమకు అడిగి లేదనిపించుకున్న అవమానము లేకుండా ఉండడానికే.

పాఠాంతరము

'రాజు మదిచొప్పెఱుఁగఁజాలదా' అనడానికి బదులు తిరుపతివారు,' రాజు మదిసొంపెఱుఁగఁజాలదా' అన్నారు.

అలంకారము :

కావ్యలింగ.

అనినఁజా "మీ మదిలోఁ దలంచినది మేలౌ, సిద్ధ సంకల్పు లీ"
రని, యావేళనె చిత్రవాహనుఁడు కొల్వై యుండఁగాఁ బోయి, యా
యన 'రారమ్మ'ని గారవించి సుముఖుండై 'రాజుగా రిప్పు డే
మనినా? రెయ్యవి వార్త'లంచుఁ బయిపై నాసక్తితోఁ బల్కఁగన్. 4

అర్థము :

అనినఁజా = అర్జును డాలాగు చెప్పగా, (విశారదుడు) "మీ మదిలోఁజా తలంచినది, మేలు ఔన్ = శుభమవుతుంది, ఈరు = మీరు, సిద్ధసంకల్పులు = తలపెట్టిన కార్యాలు తప్పక సిద్ధిస్తాయి", అని, ఆవేళనె = ఆరోజే, చిత్రవాహనుఁడు = మలయధ్వజరాజు (అతనిపేరు చిత్రవాహనుడు). కొల్వు ఐ ఉండఁగాఁజా = సభచేస్తుండగా, పోయి, ఆయన = ఆరాజు, సుముఖుండై = సంతోషముతో, రారమ్మని = రండి రండి అని, గారవించి = మర్యాదచేసి, '(మీ) రాజుగారు, ఇప్పుడు ఏమనినారు? ఎయ్యవి వార్తలు = విశేషాలేమిటి' అంచుఁజా, పయిపైన్ = చాల ఎక్కువ, ఆసక్తితోఁజా = అభిలాషతో, పల్కఁగఁజా = చెప్పగా ... తరువాతికన్వయము.

తాత్పర్యము :

అనగా విశారదుడు 'మీరాలోచించినది బాగుంది. మీరు తలపెట్టిన కార్యం తప్పకుండా జరిగితీరుతుంది?, అని అర్జునుడితో చెప్పి, ఆ వేళనే మలయధ్వజుడిని చూడడానికి వెళ్లాడు. ఆ రాజు ఎంతో సంతోషముతో రమ్మని గౌరవించి 'మీరాజుగారేమన్నారు? విశేషాలేమిటి?' అని విశారదుడి నడిగాడు.

విశేషము :

అనుకున్న కార్యం తప్పకుండా నెరవేరే లక్షణము జాతకరీత్యా, లేక అదృష్టవశాత్తు, కలవారిని సిద్ధసంకల్పులు అంటారు. ఈలాంటిదే 'సంకల్పసిద్ధులు'.

మలయధ్వజ రాజుకి చిత్రవాహనుడు అన్న పేరుందన్నమాట. చిత్రమయిన గుర్రాలు గలవాడు అని అర్థము. అందుచేతనే కాబోలు అర్జున చిత్రాంగదలకు పుట్టిన కుమారుడికి బభ్రువాహనుడు అన్న పేరు పెట్టారు.

తనకు రాజు చూపిన గౌర వాదరణలను బట్టీ, అర్జునుడిని గురించి కనబరుస్తున్న గొప్ప ఆసక్తినిబట్టీ, విశారదుడు చిత్రవాహనుడి 'మది చొప్పు' గ్రహించే ఉంటాడని చెప్పాలి.

పాఠాంతరము :

1 వ చరణంలో 'తలంచినది మేలో' అనడానికి బదులు తిరుపతివారు 'తలంచినపుడే యో' అన్నారు.

"అవనితలేంద్ర, మావిభుని హర్ష మదేమని విన్నవింతు ; సం
స్తవ మొనరించి రింతవడి సామిచరిత్రమె వేయినోళ్ళ, న
ర్ణవపతితోడ బాంధవ మొనర్చిన మాధవు లీల వారు బాం
ధవ మొనరింపఁ జిత్తమిడినారు గుణాంబుధు లీరు గావునన్." 5

అర్థము :

అవనితల ఇంద్ర = భూమీశ్వరా, మా విభుని హర్షము = మారాజుగారి సంతోషము, అది ఏమని విన్నవింతున్ = ఇంత అని మనవి చెయ్యడానికి వీలుకాదు, ఇంతవడిన్ = ఇంత వరకు - నేను తమ దగ్గరకు వచ్చినంతవరకు, సామిచరిత్రమె = ప్రభువులయిన మీ విషయమే, వేయినోళ్ళన్ = మిక్కిలి విశేషముగ - వేయినోరులతోవలె, సంస్తవము ఒనరించిరి = ప్రశంస చేశారు, అర్ణవపతితోడన్ = సముద్రాల ప్రభువైన క్షీరసముద్రముతో, బాంధవము ఒనర్చిన = బంధుత్వముచేసిన - చుట్టరికము చేసిన, మాధవులీలన్ = లక్ష్మీనాథుడైన విష్ణువు వలెనే, వారు = అర్జునుడు, ఈరు = తమరు, గుణ అంబుధులు కావునన్ = మంచిగుణాల సముద్రులు కాబట్టి, బాంధవము ఒనరింపన్ = (మీతో) సంబంధము చేయడానికి, చిత్తమిడినారు = తలంచారు.

తాత్పర్యము :

మహారాజా, మా ప్రభువుగారి సంతోషమేమని చెప్పగలను. నేను తమ దగ్గరకు వచ్చినంతవరకు వారు మీ ప్రశంసే చేశారు. పాలసముద్రముతో చుట్టరికముచేసిన లక్ష్మీనాథుడి లాగానే, మీరు గుణసముద్రులు కాబట్టి, మీతో సంబంధము చేయాలని మా ప్రభువు తలంచారు.

విశేషము :

'ఇంతవరకూ మీ ప్రశంసే విశేషంగా అర్జునుడు చేశాడన్న' మాటలు సత్యములయే ఉండాలి. ఎందుచేతనంటే అర్జునుడికి చిత్రాంగదను చూచినది మొదలు ఆమెను గురించిన ఆలోచన తప్ప మరొక పనిలేదని పైని చెప్పిన పద్యాలనుబట్టి తేటపడ్డది.

క్షీరసముద్ర సంబంధమున విష్ణువును మాధవుడనడం (మా = లక్ష్మి, ధవుడు = భర్త) ఉద్దేశపూర్వకము. క్షీరసముద్రము తన కూతురైన లక్ష్మి నిచ్చినట్లు మీరు (గుణసముద్రులు), మీ కూతురు చిత్రాంగద నిచ్చి పెండ్లి చెయ్యాలని సూచన.

అర్జునుడు — (మా = మా అందరికీ, ధవుడు = ప్రభువు) కాబట్టి మాధవుడే అని చమత్కారము.

అర్జునుడు 'సూచన చేసి రాజు మదిచొప్పెఱుగన్ వలదా విశారదా' అని (శివ పద్యములో) అన్నాడు. కాని, ఈ పద్యములో విశారదుడు సూచనా గీచనా లేకుండా సరాసరి 'వారు బాంధవ మొనరింపఁ జిత్తమిడినారు' అని చెప్పాడు. కాని విశారదుడు 'హావభావ పరిణామవిదుడు' (అవులిస్తే పేవులు లెక్కపెట్టగల నేర్పరి). ఇంతకుముందే ఆ రాజు మదిచొప్పు బాగా అవగాహన చేసుకున్నాడు. కాబట్టి తనకున్న నమ్మకముతో సూటిగా చెప్పాడని భావించాలి.

నా విని సంతోషము మది
నావిర్భవ మంద 'నా మహారాజునకుఁ
దేవేరిగ నా కన్యం
బావన గుణ నీయఁ గనుట భాగ్యము గాదే!' 6

అర్థము :

నాన్ = అని చెప్పగా, విని, మదిఁ = మనసున, సంతోషము, ఆవిర్భవము అందన్ = పుట్టగా, 'ఆ మహారాజునకున్, దేవేరిగన్ = భార్యగా, పావనగుణ = పవిత్రమైన గుణాలుగల, నాకన్యన్ = నాకూతురిని, ఈయఁ కనుట = ఇవ్వగలుగుట, భాగ్యము కాదే ! = నిశ్చయముగ భాగ్యమే.

తాత్పర్యము :

విశారదుడి మాటలకు రాజు సంతోషించి, 'అటువంటి మహారాజుకు ఇటువంటి పవిత్ర గుణాలుగల నా కూతురు నివ్వజాలడం నిజంగా భాగ్యమే' అన్నాడు.

విశేషము :

కన్యాదానము చేయడమే ఒక భాగ్యమంటారు. చిత్రాంగద వంటి పావన గుణాలు గల కన్యను, అర్జునుడివంటి మహారాజుకి కన్యాదానము చేయడం మహాభాగ్య మనాలి కదా.

ఈయన్ కనుట :- 'దేవేరిగా ఇచ్చుట కొరకు కూతురుగా (కడుపున) కనడం భాగ్యము గాదే' అని చిన్న చమత్కారము గూడా ఉంది — ఈలాంటి అదృష్టం గల కూతురుని కనడం భాగ్యమని.

పాఠాంతరము :

చివరి చరణమునకు బదులు 'పావన గుణధన్య నీయ భాగ్యముగాదే' అన్న పాఠము ఉంది. దీనిలో కన్య-ధన్య అని అనుప్రాస ఉంటుంది. కాని 'కనుట' లోని చమత్కారము పోతుంది.

కల దొకమాటఁ దెల్పఁగల కార్యము: తొల్లి ప్రభాకరుండు నాఁ
గలఁ డొకఁ డస్మదీయ కులకర్త; యతం డనపత్యుఁడై యచం
చల మతి శంకరుం గుఱిచి చాలఁ దపం బొనరింప, నంతటన్
'కలుగుఁ గుమారుఁ డొక్కొకఁడుగా' నని యిచ్చె వరంబు వేడుకన్.7

అర్థము :

ఒకమాటన్ = సూక్ష్మంగా, తెల్పగల కార్యము కలదు (చిన్నపని ఒకటి ఉందని భావము), తొల్లి = పూర్వము, ప్రభాకరుఁడు నాన్ = ప్రభాకరుడన్న పేరుతో, అస్మదీయ = మాయొక్క, కులకర్త = మూలపురుషుడు, కలఁడు = ఉండేవాడు, అతఁడు, అనపత్యుఁడై = బిడ్డలులేనివాడై, అచంచల మతిన్ = నిశ్చలమైన మనస్సుతో, శంకరున్‌గుఱిచి = ఈశ్వరుడిని గురించి, చాలన్, తపంబు ఒనరింపగా, అంతటన్ = అప్పుడు, 'కుమారుఁడు, ఒక్కొకఁడు గాన్ = ఒక్కొక్కతరమునకు ఒక్కొక్కడుగా కొడుకు, కలుగును = పుట్టును గాక', అని, వేడుకన్ = సంతోషముతో, (పా: వేడగాన్ = కోరగా), వరంబున్, ఇచ్చెన్.

తాత్పర్యము :

విశారదా, ఒక చిన్న విషయం : ప్రభాకరుడన్న మా మూలపురుషుడికి పిల్లలు లేక పోతే, ఈశ్వరుడిని గురించి చాల తపస్సు చేశాడు. ఈశ్వరు డనుగ్రహించి 'మీ వంశములో ఒక్కొక్క తరానికి ఒక్కొక్క కొడుకు మాత్రము పుడుతుంటాడ'ని వరమిచ్చాడు.

అంగజ హరుని ప్రసాదము
నం గలుగుచువచ్చె సుతుఁడు నాఁ డాదిగ మా
వంగడమున ; నది యిప్పుడు
వెంగడమై కూఁతు రుద్భవించెను నాకున్. 8

అర్థము :

అంగజ హరుని = (మన్మథుని భస్మముచేసిన) ఈశ్వరుడి, ప్రసాదమునన్ = అనుగ్రహముచేత, నాఁడు ఆదిగన్ = ఆనాటి మొదలు, మా వంగడమునన్ = మా వంశములో, సుతుఁడు = కుమారుడు, కలుగుచు వచ్చెన్ = తప్పకుండా పుడుతూ వచ్చాడు, అది = ఆ మర్యాద, ఇప్పుడు = నా కాలములో, వెంగడమై = విపరీతమయి, నాకున్, కూఁతురు, ఉద్భవించెన్ = పుట్టెను.

తాత్పర్యము :

అప్పటినుంచి అలాగే తరానికొక కొడుకు పుడుతూ ఉండేవాడు. నా కాలంలోనే విపరీతంగా నాకు కూతురు కలిగింది అని మలయధ్వజుడు చెప్పుతున్నాడు.

ఆ దుహితఁ గుమారుని మ
ర్యాదగఁ జూచికొని యుందు; నా కన్నియకున్
బ్రాదుర్భవించు వానిన్
నాదు కులంబునకు వలయు నాథునిఁ జేయన్. 9

అర్థము :

ఆ దుహితన్ = ఆ కూతురుని, కుమారుని మర్యాదన్ = కుమారుడికి మారుగా — కుమారుని వలెనే, చూచికొని ఉందున్ = పెంచుకుంటున్నాను, ఆ కన్నియకున్, ప్రాదుర్భవించు వానిన్ = పుట్టినవాడిని, నాదు, కులంబునకున్, నాథుని = ప్రభువుగా, చేయన్ వలయున్ = చేయవలసి ఉంది.

తాత్పర్యము :

ఆ కూతురుని కొడుకు లాగే పెంచుకుంటూ ఉన్నాను. ఆమెకు పుట్టిన కొడుకును మా వంశ ప్రభువుగా చేయవలసి ఉంది.

కాదన రా దీకార్యము
జాదులును బ్రసాద మౌ విశారద నాకుఙ ;
నాదు హితం బొనఁగూరిచి
నా దుహితం బెండ్లిసేయు నరనాథునకున్.

అర్థము :

విశారదా, ఈ కార్యము, కాదనరాదు = సరికాదని గాని, జరగరానిదని గాని అనరాదు (ఏలాగునైనా జరిగించవలసినదే అని భావము), నాకుఙ (ఇది), జాదులునుఙ బ్రసాదము బౌఙ = రెండు విధాల ఆదరించదగిన విషయము, నాదు హితంబు = నా మేలును, ఒనఁ గూరిచి = సమకూర్చి, నా దుహితఙ = నా కూతురుని, నరనాథునకున్ = మీ రాజుగారికి (అర్జునుడికి), పెండ్లిచేయు = వివాహము జరిగించు.

తాత్పర్యము :

విశారదా, ఇది తప్పక నెరవేర్చవలసిన కార్యము. ఇది నాకు రెండు విధాల ఉపకరిస్తుంది. నా కూతురుని మీ రాజుగారికి వివాహము జరిగించి నా కుపకారము చెయ్యి అని భావము.

విశేషము :

దేవాలయాలలో అర్చనాదులకు ఉపయోగించిన పత్రం, విభూతి, కుంకుమము మొదలైన వాటిని దేవదర్శనము కోసం వెళ్ళినవారికి 'ప్రసాదము'గా ఇస్తుంటారు. ఆలాగు ఇచ్చిన ప్రసాదము ఇంత విభూతో, బిల్వపత్రమో, తులసిదళమో కాక జాజిపూవు లయినట్టయితే, పుణ్యానికి పుణ్యమూ, సువాసనకు సువాసనా కలిగిస్తూ రెండు విధాల ఆదరణీయంగా ఉంటుంది.

ఇక్కడ మలయధ్వజుడు కోరిన కార్యము : 1. కూతురికి తగిన సంబంధము లభించడమూ 2. వంశానికి వారసుడు దొరకడమూ, ఈ రెండు విధాలా ఉపకరిస్తుందని భావము.

అలంకారము :

యమకము.

అని యతనిఁ బంచె, నా మాట కర్జునుండు
సమ్మతించె, ముహూర్త నిశ్చయము నయ్యెఁ;
హితుఁ డన విశారదుఁడె గాక యెందుఁ గలరె
కోర్కి వెలయంగ దొరఁ బెండ్లికొడుకుఁ జేసె. 11

అర్థము :

అని = మలయధ్వజు డా మాటలు చెప్పి, అతనిన్ = విశారదుడిని. పంచెన్ = పంపించాడు, ఆ మాటకు, అర్జునుండు, సమ్మతించెన్, ముహూర్త నిశ్చయము = వివాహ ముహూర్తం నిశ్చయించడము, అయ్యెన్ = జరిగింది ; హితుఁడనన్ = స్నేహితుడంటే, విశారదుఁడె కాక, (ఇతరులు) ఎందునున్ కలరె? = ఎక్కడయినా ఉన్నారా ? కోర్కి వెల యంగన్ = కోరికలు ఈడేరినట్లు. దొరన్ = తన ప్రభువును, పెండ్లికొడుకు(ను), చేసెన్.

విశేషము :

అటు అర్జునుడికీ ఇటు మలయధ్వజుడికీ ఉన్న తహతహకు అనుగుణంగా ఈ పద్యములో కథాగమనం పరుగెత్తడం చమత్కారము.

కోర్కివెలయంగ-ఇక్కడ ఉభయ పక్షాలలోనూ కోర్కె లున్నాయి కాబట్టి, 'కోరికలు' అని అర్థం చెప్పుకున్నాము.

అలంకారము :

కావ్యలింగ.

సుత్రామ నిభుఁడు పాండ్య ధ
రిత్రీ విభుఁ డాన తీయ, శృంగార కళా
చిత్రాంగద యుత యగు నా
చిత్రాంగదఁ బెండ్లి కూఁతుఁ జేసిరి కాంతల్. 12

అర్థము :

సుత్రామ నిభుఁడు = ఇంద్రునితో సమానమైన, పాండ్య ధరిత్రీవిభుఁడు = పాండ్యరాజు, ఆనతి ఈయన్ = ఆజ్ఞ ఇవ్వగా, శృంగార = అందమైన, కళా = పనితనమువల్ల, చిత్ర = అద్భుతంగా ఉన్న, అంగదయుత అగు = కాలి అందెలతో ఉన్న, ఆ చిత్రాంగదన్, కాంతల్ = చెలికత్తెలు, పెండ్లి కూఁతున్ = పెండ్లి కూతురుగా, చేసిరి = అలంకరించారు,

తాత్పర్యము :

రాజుగారి ఆజ్ఞ ప్రకారము చెలికత్తెలు అందమైన కాలి అందెలు కల చిత్రాంగదను పెండ్లి కూతురుగా అలంకరించారు.

విశేషము :

మలయధ్వజుడిని ఇక్కడ సుత్రామనిభుఁడు( = ఇంద్రునితో సమానుడు) అనడం చాల భావగర్భితంగా ఉంది. చూడండి :

వరుడు, అర్జునుడు, ఇంద్రుడి కొడుకు. వధువు ఈ ఇంద్రసమానుడి కూతురు. ఉభయ పక్షాలకు సమానస్థాయి ఏర్పడ్డది. వివాహంగాని, వివాదంగాని, సమానుల మధ్య నయితేనే శోభిస్తుందంటారు. ఆ శోభ ఈ వివాహానికి కలుగుతుందని నమ్మకము.

అంగద అంటే భుజకీర్తి—బాహుపురి అని అర్థము కూడా ఉంది. పూర్వ వ్యాఖ్యాతలు ఆ అర్థాన్నే చెప్పారు. కాని 2-16వ పద్యములో ఈ కవే చిత్రాంగదను 'పెండ్లికూతురును వచ్చె రణచ్చరణాంగదంబులన్' అన్నాడు. అక్కడ కాలి అందెలని చెప్పి ఇక్కడ భుజకీర్తులనడం ధర్మమా ?

అలంకారము :

యమకము, పరికరము.

గరిత లలంకృతి సేయఁగ
గరువపు మురు వపుడు హెచ్చి కన్నియ తనరెన్;
బరిణయపున్ గై సేఁతల
నరపతి యొఱ పతిశయిల్లు నటనఁ జెలంగెన్.        13

అర్థము :

గరితలు = స్త్రీలు - చెలికత్తెలు, అలంకృతి చేయఁగన్ = అలంకరించగా, గరువపు మురువు = (సహజంగా ఉన్న) విశేష సౌందర్యము, అపుడు, హెచ్చి = (మరికొంత) అధికమయి, కన్నియ = చిత్రాంగద, తనరెన్ = ఒప్పెను, పరిణయపు = వివాహ సమయమందలి, కై సేఁతలన్ = అలంకరణలతో, నరపతి = అర్జునుడి, ఒఱపు = అందము, అతిశయిల్లు నటనన్ = ఎక్కువయిన విధముగా, చెలంగెన్ = ఉండెను.

తన వంశంపు నృపాలు పెండ్లిఁ గను తాత్పర్యంబునఁ వచ్చెనో
యనఁ జంద్రుఁ డలరెఁ; గిరీటి సుముఖుండై యంతఁ గైసేసి తె
చ్చిన భద్రేభము నెక్కి- ఠీవిమెయి వచ్చెఁ బాండ్యభూపాలు లో
చనముల్ చల్లఁగఁ గ్రొత్త ముత్తియపు సేసల్ జవ్వనుల్ సల్లగన్.

అర్థము :

తనవంశంపు = తాను మూలపురుషుడుగా ఉన్న (చంద్ర) వంశమున పుట్టిన, నృపాలు = రాజుయొక్క, పెండ్లిఁ, కను తాత్పర్యంబునన్ = చూడాలన్న ఆసక్తితో, వచ్చెనో = వచ్చాడు కాబోలు, అనఁ = అనడానికి తగినట్టు, చంద్రుఁడు అలరెఁ = చంద్రుడు ప్రకాశించాడు (చంద్రు డుదయించా డన్నమాట) కిరీటి = అర్జునుడు, అంతఁ = అప్పుడు, సుముఖుండై = సంతోషించినవాడై, కైసేసి తెచ్చిన = బాగుగా అలంకరించి తీసుకొని వచ్చిన, భద్ర ఇభమున్ = భద్రజాతి ఏనుగును, ఎక్కి-, ఠీవి మెయిఁ = మంచి రాజఠీవితో, పాండ్య భూపాలు(వి),లోచనముల్ చల్లఁగఁ = కన్నుల పండుగయినట్లున్న, జవ్వనుల్ = యువతులు, క్రొత్తముత్తియపు సేసల్ = మంచికాంతిగల ముత్యాలను అక్షతలుచేసి, చల్లఁగన్ = చల్లు చుండగానున్న, వచ్చెన్ = విడిది ఇంటినుంచి నగరులోనికి వచ్చాడు.

తాత్పర్యము :

చంద్రుడు తన వంశములోని రాజు వివాహము చూడాలన్న ఆసక్తితో వచ్చాడా అన్నట్టు ప్రకాశించాడు. అప్పుడు మావటీడు అలంకరించి తెచ్చిన ఏనుగు మీద సంతోషముతో ఎక్కి-, అర్జునుడు ఠీవితో రావడం చూచి పాండ్యుడి కళ్ళుచల్లబడ్డాయి; యౌవనవతులు కాంతిగల ముత్యాలను అక్షతలుగా అర్జునుడిమీద చల్లారు.

విశేషము :

అర్జునుడు చంద్రవంశములోని రాజకుమారుడు.

కిరీటి అన్నపేరు రావడానికి కారణము : ఇంద్రు డిచ్చిన కిరీటము యుద్ధములలో అర్జునుడి తలమీద సూర్యకాంతితో ప్రకాశిస్తుంటుంది. కాబట్టి కిరీటి అన్నారు.

తాజాగా పట్టిన ముత్యాలకు మంచికాంతి ఎక్కు-వంటారు. ముత్యం పాతపడుతున్న కొద్దీ (నీరు) కాంతి తగ్గుతూ ఉంటుందంటారు. పాండ్యరాజు సముద్రప్రాంతపు రాజు కాబట్టి ఈ వివాహంకోసం కొత్తగా (శుక్తులను) ముత్యపు చిప్పలను పట్టించి ముత్యాలు తీయించి ఉండవచ్చును.

అలంకారము :

ఉత్ప్రేక్ష, యమకము.

నలుగడ హృద్య వాద్య నటనం బొలయం, గపురంపు టారతుల్
వెలయ, ద్విజశ్రుతుల్ చెలఁగ, విప్రవధూ శుభ గాన లీల శో
భిలఁగ, వివాహ వేదికకుఁ బెండ్లికుమారుఁడు వచ్చెనిట్టు, లా
వల, నల పెండ్లికూఁతురును వచ్చె రణ చ్చరణాంగదంబులన్, 15

అర్థము :

నలుగడన్ = అన్ని దిక్కులయందును, హృద్య = మనోహరమైన, వాద్య = మంగళ వాద్యాలతో కూడిన, నటనంబు = నాట్యములు, ఒలయన్ = జరుగుతుండగా, కపురంపు ఆరతుల్ = కర్పూర హారతులు, వెలయన్ = ప్రకాశిస్తుండగా, ద్విజశ్రుతుల్ = బ్రాహ్మణుల వేద పాఠాలు, చెలఁగన్ = నడుస్తుండగా, విప్రవధూ = బ్రాహ్మణ ముత్తైదువల, శుభగాన = పెండ్లి పాటలయొక్క, లీల = విలాసము, శోభిలఁగన్ = రంజిల్లుతుండగా, ఇట్టులు = ఈ(వెలుపలి) దిక్కునుంచి, వివాహ వేదికకున్ = పెండ్లితిన్నె దగ్గరకు, పెండ్లికుమారుఁడు, వచ్చెన్, ఆవలన్ = ఆదిక్కు (అంతఃపురము) నుంచి, రణత్ = ధ్వనిస్తున్న, చరణ అంగదంబులన్ = కాలి అందియలతో, పెండ్లి కూఁతురును, వచ్చెన్.

తాత్పర్యము :

అన్ని దిక్కులందు మంగళవాద్యాలూ, నాట్యాలూ కర్పూరహారతులూ, బ్రాహ్మణుల వేదపఠనలూ, బ్రాహ్మణ స్త్రీల పెండ్లిపాటలూ నడుస్తుండగా పెండ్లికొడుకు, విడిదినుంచి పెళ్లి తిన్నె దగ్గరకు వచ్చాడు; పెండ్లి కూతురుగూడ అంతఃపురమునుంచి, కాలి అందెలు ధ్వని చేస్తుండగా, అక్కడికి వచ్చిందని భావము.

విశేషము :

కాలయాపన చేయకుండా ఈ పద్యములో పెళ్ళి సందడంతా కనబరిచాడు కవి.

అంగదము అంటే కేయూరము. భుజకీర్తి అని నిఘంటులలో అర్థముంది. అందుచేతనే పై 12 వ పద్యములో 'శృంగారకళా చిత్రాంగద' అన్న సమాసములో అంగదములు అంటే భుజకీర్తులు అనే వ్యాఖ్యానించారు. స్త్రీలకు భుజకీర్తులంటే కొంచెం అసాధారణంగా కని పిస్తుంది, కవి ఉద్దేశము అది కాదేమో అనిపిస్తుంది.

ఈ పద్యములో కవి మన సందేహాన్ని తీర్చాడు ; రణచ్చరణాంగదంబులన్' అన్నాడు. ఈ అంగదములు కాళ్ళ ఆభరణాలని తేల్చాడు. ఇక్కడ కాళ్ల నగలనీ, అక్కడ బుజాల నగలనీ చెప్పడము వ్యర్థప్రయాస అవుతుంది.

మరొక్క విషయము ; ఉత్తరదేశంలో మార్వాడీ గుజరాతీ స్త్రీలు కాళ్ల అందెలలో లోహపు ముక్కలు ఉంచడంవల్ల వాళ్లు నడుస్తున్నప్పుడు చక్కని ధ్వని వినిపిస్తుంటుంది.

అందుకే ఆ కాలి నగలకు 'మంజీరములు' (= మనోహరంగా ధ్వనిచేయునవి) అన్న పేరు ఉన్నది.

ఆ విధంగానే పూర్వము పాండ్యదేశములో గూడా అటువంటి నగ లుండేవి. వాటిని 'సిలంబు' అనేవారు. ఆ సిలంబు ప్రధాన కథావిషయంగా ఉన్న పురాతన కావ్యానికి 'సిలప్పదికారము' అని పేరు. ఆనాటి ప్రభువులు ఆ కాలములో ఈ మంజీరాలు ధ్వనిచేస్తూ ఉండడానికి ముత్యాలూ, కెంపులూ మొదలైన రత్నాలనే లోపల ఉంచే వారట

అలంకారము :

స్వభావోక్తి.

పంకేజాతములం దిసంతు లడచుం బాలామణీ పాదముల్;
వంకల్ దీర్చు మనోజ సాయకములం వాల్చూపు; లేణాంకునిం
శంకల్సేయు మొగంబు; జక్కవకవం జక్కట్లు దిద్దుం గుచా
హంకారంబు; మదాళిమాలికల నూటాడించు వేణీ రుచుల్. 16

ఇది చాల చక్కని పద్యము. పదప్రయోగ సారస్యముతోపాటు ప్రసన్నార్థమూ, గంభీరార్థమూ మేళవించి కవి ఈ పద్యరచన సాగించాడు. దీనిలో కవి వ్రాసిన వాక్యములు ఐదు :

1. బాలామణీ పాదముల్ పంకేజాతములం దిసంతులడచుం.
2. వాల్చూపులు మనోజ సాయకములం వంకల్ దీర్చుం.
3. మొగంబు ఏణాంకునిన్ శంకల్సేయుం.
4. కుచాహంకారంబు జక్కవకవం చక్కట్లు దిద్దుం
5. వేణీరుచుల్ మదాళి మాలికల నూటాడించుం.

అన్నీ సాధారణముగా కవులు ఉపయోగించే ఉపమానాలే, ఈ ఉపమానాల నన్నిటినీ కవి ఈ పద్యములో తిరస్కరించాడు.

అర్థము :

1. కన్యక పాదములు తామరలను ఏవగించును. 2. చూపులు మన్మథ బాణములను తిన్నగా చేయును. 3. మొగము చంద్రుని తప్పు పట్టును. 4. స్తనముల బింకము జక్కవ జంటలకు బుద్ధులు చెప్పును. 5. తలవెంట్రుకలు తుమ్మెద బారులను ఊపివేయును. అని తిరస్కార భావము ప్రకటించాడు కవి.

అంత మాత్రపు అర్థంతో పాఠకులు కాని, కవి కాని సంతృప్తి పడడానికి వీలులేదు. ఈ పద్యంలో తిరస్కార వాక్యములు (దిసంతులడచు, వంకలు దిద్దు మొ.) ఉపమానముల పేరులు (పంకేజాతములు, ఏణాంకుడు మొ.) చాల భావగర్భితంగా ఉంచాడు.

దిసంతులడచున్ : దిసంతులు అనగా నింద, రోత అని ఆంధ్రభాషార్ణవము. రోత = అసహ్యము, ఏవగింపు. పాదములు అసహ్యించుకోడానికి కారణము పంకేజాతములు అన్న శబ్దంలో ఉంది. పంకేజాతము = పంకము-బురదయందు పుట్టినవి; నీచజన్మ. కాబట్టే ఏవగించి. చీకొట్టడము. బురదను పుట్టడము పంకజాలకు సహజము.

వంకల్‌తీర్చు : వాల్చూపులు మనోజ సాయకములన్-మన్మథ బాణములను-సూటిగా పోవుటకు-తిన్నగా చేయును. మన్మథ బాణములకు లక్ష్యశుద్ధి ఉండదు. కాబట్టి, మన్మథోద్రేకము కలిగించే ఆమె చూపులు తిన్నగా వెళ్తూ, మన్మథబాణాల కుండే వంకలు తీరుస్తున్నాయి. బాణాలకు వంక ఉండకూడదు; వాటిని వంకలు తీర్చడము విలుకాండ్రు నిత్యము చేసే పనే.

శంకల్వేయు ; అనగా, తప్పుడుపనులు చేసినవారిని కులపెద్దలు తప్పుపట్టి, అవసరమైతే, వెలివేయగలుగుతారు. ఆ తప్పుపట్టడాన్నే శంకచేశారు అని వాడుక.

ఇక్కడ చంద్రుడు ఏణాంకుడు - (ఏణము = జింక) జింకను గుర్తుగా కలవాడు. శ్లేషవల్ల జింకను అంకముపై - తొడపై పెట్టుకున్నవాడు, మృగసంపర్కము, నీచ సంపర్కము, చేసినవాడయ్యాడు. కాబట్టి మొగము చంద్రుని శంకచేసింది. చంద్రుడు మచ్చతో ఉన్నవాడు. ముఖము కళంకము లేనిది అని ఆధిక్యము.

చక్కట్లు దిద్దు : కుటుంబములో కలతలు కలిగినప్పుడు పెద్దలు వారికి బుద్ధిచెప్పి కలతలను సవరించడాన్ని చక్కట్లు దిద్దడం అంటారు. చక్కట్లు = తగవులు, జగడములు.

ఇక్కడ జక్కవ పిట్టలు ప్రతిసాయంకాలము జంటల విడిచిపెట్టి పోవడం సహజం. ఆ విధంగా విడిపోకుండా కలిసి ఉండండి (మావలెనే) అని ఆమె కుచములపొందిక బుద్ధులు చెప్పుతుంది.

ఊటాడించు = ఊపివేయును. చెల్లాచెదురుగా పోతూ ఉండే మత్తెక్కిన తుమ్మెదలు కాబట్టి, వేణీరుచులు - వెండ్రుకల కాంతులు ఆ తుమ్మెదలను బారులు తీర్చినట్లుగా ఉంచి ఊగించును. తుమ్మెదలు బారులుకట్టి పోతూండడము ప్రకృతిసిద్ధము.

తాత్పర్యము :

బురదతో సంపర్కం లేని పద్మాలవలె ఆమె పాదములూ, వంకరలు పోని మన్మథ బాణాలవలె ఆమె చూపులూ, కళంకం లేని చంద్రునివలె ఆమెమొగమూ, ఎల్లప్పుడూ కలిసి ఉండే జక్కవ జంటలవలె ఆమె చనుగవ, మాలికలు కట్టి ఊగాడే తుమ్మెదబారువలె ఆమె తల వెండ్రుకలూ ఉన్నాయని భావం.

ఉభయ పక్షాల వియ్యాలవారి త త్తరానికి తగినట్లుగా, కథా రచనను పరుగులెత్తిస్తూ ఉండినకవి, ఇక్కడ చిత్రాంగద వర్ణనకు ఆగడం కొంచెం విపరీతంగా కనిపిస్తుంది. కాని, దీనికొక సమర్థన ఉంది.

పెళ్ళికూతురు వివాహవేదికకు రావడం "రణచ్చరణాంగదంబులణా" చప్పుడు చేయుచున్న నూపురములతో వచ్చినట్లు పై పద్యంలో కవి చెప్పాడు. కోటలో పెళ్ళిమహోత్సవం చూడ్డానికి వచ్చిన జనసమూహం దృష్టి ఆ ధ్వనికి కారణమైన నూపురాల మీదకు వెళ్ళక తప్పదు. ఆ సందర్భంలోనే పాదాల సౌందర్యం కనుపించింది. దాని ప్రశంసతోనే ఈ పద్యం ఆరంభమైంది.

మొదటి సారిగా రాకుమా ర్తెను చూచిన ప్రజలు ఆమె అందానికి ఆశ్చర్యపడి పోలికలు చెప్పుకొన్నారు. ఈ విధంగా పరుగెత్తుతూన్న కథను ఆపి ప్రజల ఊహను వర్ణించడం చాల సమంజసం. ఈ అభిప్రాయాన్నే కవి 19 వ పద్యములో స్పష్టంచేశాడు.

పూర్వవ్యాఖ్యాతలు, వేదం వారితో సహా, ఈ పద్యంలో ఉన్న అందాన్ని గమనించలేక పోయారు అని అనవలసి వచ్చింది, కాబట్టే —

దిసంతులడచుణా = చెంపపెట్టును అని వారు ఎప్పుడు చెప్పారో అప్పుడే వారు దారి తప్పినారని నిరాశకలిగింది. దిసంతులడచు = 'చీకొట్టు' అనడం సమంజసము. చీకొట్టు 'రాకొట్టు' వంటి మాట.

*అలంకారము :*

పరికరము, వ్యతిరేకము.

హరిపతి నడుమున కోడెణా.
గరువపు నడకలకు నోడె గజపతి, యిఁక నీ
నరపతి లోనగు టరుదే
వరవర్ణిని మెఱుఁగు వాఁడి వాల్చూపులకున్. 17

ప్రజాసముదాయములో మరికొందరి అభిప్రాయము. వీరు సామంతులలోని వారయి ఉంటారు.

*అర్థము :*

నడుమునకుణా, హరిపతి = శ్రేష్ఠమైన సింహము, ఓడెణా = వీగిపోయెను, గరువపు = ఒయ్యారముతో కూడిన, నడకలకు = నడకలతో పోటీపడి, గజపతి = శ్రేష్ఠమైన ఏనుగు, ఓడెణా = అపజయము పొందెను, వరవర్ణిని = ఈ సుందరియొక్క, మెఱుఁగు (కలిగి) వాఁడి

(యైన) వాల్చూపులకుఁ = దీర్ఘ ములగు చూపులకు. ఈ నరపతి = ఈరాజు, లోనగుట = లొంగిపోవుట, అరుదే = ఆశ్చర్యమా ?

తాత్పర్యము :

చిత్రాంగద నడుము సింహము నడుముకన్నా సన్నమనీ, ఆమె నడక ఏనుగు నడకకన్నా ఠీవి గలదనీ, అట్టి ఆమె వాల్చూపులకు అర్జునుడు లొంగుట ఆశ్చర్యము కాదనీ భావము.

విశేషము :

బలానికీ పరాక్రమానికీ పేరుపొందిన ఏనుగూ, సింహములే ఓడిపోగా, ఒక మనుష్య మాత్రుడు లొంగిపోవడం ఆశ్చర్యం కాదు అని చమత్కారం, సాధారణమైన నడుముకు ఒక్కింత ఒయ్యారముగల నడకకు సింహము గజముకూడ ఓడిపోగా, మెరుగుగలిగి, వాడియై, దీర్ఘ ముగా ఉన్న (మూడుగుణాలు కలిగిన) చూపులకు నరుడు లొంగుట చాల సుకరమని భావము.

హరి అనగా మండూకము మొదలుకొని మహావిష్ణువు వరకు అర్థాలున్నాయి. ఇక్కడ ఆశ్వము అని రెండో అర్థము చెప్పుకుంటే, హరిపతులు = అశ్వపతులు అవుతారు. ఈ అశ్వ పతులన్న పేరు బహమనీ రాజులకు బిరుదు నామము.

ఉత్కళదేశరాజులకు గజపతులన్న బిరుదు సుప్రసిద్ధము. విజయనగర రాజులను నర పతు లనేవారు.

రాయలవారి శత్రువులు బహమనీ కళింగరాజులు. యుద్ధములో వారు పారిపోవడం కద్దు. తంజావూరు ప్రజలకు ఈపద్యము ఆ ముచ్చట్లను స్మరణకు తేకపోదు.

మరొక్క విశేషము. తమిళ భాషలో ఓడు అంటే పారు-పరుగెత్తు అని అర్థము. అది తెలుగులోనికి కూడ వచ్చింది. ఆ అర్థము ఆ ప్రాంతమున నివసించిన మన కవి మన సులో ఉండబట్టి, సింహము, ఏనుగు పరుగెత్తుకొని అడవులకు పోయాయన్న చమత్కారార్థము కూడ జోడించాడు. నరపతి దొరికిపోయి స్వాధీను డయాడు.

తెలుగున ప్రయోగము "వెఱచి నిమీలితాక్షులయి వెన్క కొదింగెడి పువ్వుబోడులఁ వెఱవకు డోడకుం డనుచు...హరి. పూ. 8-46.

అలంకారము :

అర్థాపత్తి.

చక్కని కన్యకామణికిఁ జక్కని వాఁడగు ప్రాణనాథుఁడుం
జక్కని శోభనాంగునకుఁ జక్కని యింతియు గల్గు టబ్బురం
బెక్కడ; నిట్టు లుండవలదే? రతిదేవికి సాటివచ్చుఁబో
యి క్కనకాంగి, మన్మథున కీడితఁ డీడిత రూపసంపదన్. 18

ఈ మాటలు ప్రేక్షకులలోని స్త్రీలు ఆడుకొనినవిగా కనబడుతున్నాయి.

అర్థము :

ఎక్కడన్ = ఏచోటనైన, చక్కని కన్యకామణికి, చక్కనివాడగు, ప్రాణనాథుడున్ను, చక్కని శోభనాంగునకు = అందమైన శరీరం గలవానికి, చక్కని యింతియున్, కలుగుట, అబ్బురంబు = అసాధారణము, ఇట్టులుండ వలదే = భార్యాభర్తల సమాన సౌందర్యములు ఈరీతి ఉండవద్దా (ఇది రతీమన్మథురలోనూ; చిత్రంగదా అర్జునులలోనూ మాత్రం కలదు అని భావము). ఈ కనకాంగి = ఈబంగారువంటి శరీరము కలది, రతిదేవికి సాటి, వచ్చును బో = వచ్చును సుమా, ఇతఁడు, ఈడిత = పొగడబడిన, రూపసంపదన్ = సౌందర్యవైభవమందు, మన్మథునకు, ఈడు = సమానుడు.

తాత్పర్యము :

రతీమన్మథులవలె వీరిద్దరూ ఒకరికి తగిన సౌందర్యంతో ఒకరు ఉన్నారనీ, అలా సమకూడడం చాలా అసాధారణమనీ భావము.

విశేషము :

"పంకేజాతములన్..." అన్న పద్యం జనసామాన్యం చెప్పినట్లుగానూ, "హరిపతి..." అన్న పద్యం సామంతులూ, సేనానాయకులూ అనుకొన్నట్లుగానూ, ఈ పద్యం స్త్రీజనులు చెప్పినట్టుగానూ చూపరులందలి భావాలను కవి సమీక్షించాడు.

అలంకారము :

యమకము, ఉదాత్తము.

అని రూపకళలఁ జూపఱు
గొనియాడఁగ బేరటాండ్రు గొందఱు తెరవం
చినఁ జూచె నతివ నర్జునుఁ
డనురాగాంబుధి తటాన నటఁ దెరయెత్తన్, 19

అర్థము :

అని = ఈవిధంగా, రూపకళలఁ = రూపురేఖలను, చూపఱు = ప్రేక్షకులు (బహువచనము), కొనియాడగఁ = ప్రశంసిస్తుండగా, కొందరు, పేరటాండ్రు = పేరంటాళ్ళు, తెర వంచినన్ = వివాహంలో వధూవరుల మధ్యపట్టిన తెరను క్రిందికి దింపగా, అనురాగాంబుధి = ప్రేమ అనే సముద్రము, అటన్ = అక్కడ, తటానన్ = ఆకస్మికముగా, (తటాలున), తెర యెత్తన్ = కెరటములేచి తనమీద పొర్లగా, అర్జునుడు, అతివఁ = చిత్రాంగదను, చూచెఁ

తాత్పర్యము :

ఈవిధంగా చూపరులందరూ వధూవరుల రూపురేఖలను ప్రశంసిస్తుండగా, ముత్తైదువలు తెరదించారు. ఒక్కసారి ప్రేమ సముద్రము పొంగి తనమీద పొరలినట్లు అర్జునుడు చిత్రాంగదను చూచాడు అని భావము.

విశేషము :

ఇంతవరకు అర్జునుడు చిత్రాంగదను దగ్గరనుంచి చూడలేదు.

పద్యంలో పేరటాండ్రు తెరదించారు, అనురాగాంబుధి తెరయెత్తింది అని చెప్పడం చమత్కారమే.

వేదమువారు "అనురాగాంబుధి = ప్రేమ అను సముద్రము,అటె = అట్టె = ఆశ్చర్యకరముగా, తటాన = ఒడ్డుపైకి, తెరయెత్తఁ = పొంగి కరుశ్కెత్తగా" అనివ్యాఖ్యానించారు.

పాఠాంతరము :

వావిళ్లవారూ కృష్ణమాచార్యులుగారు తటాన అనడానికి బదులు "తటాల్న" అనే ముద్రించారు.

అలంకారము :

రూపకము,

కలదు లే దన ననియాడు కౌనుతీరుఁ,
దళుకు మొగమున కెగయు గుబ్బల బెడంగుఁ,
జూచి యాతని నిడువాలుఁ జూపు లపుడు
నిండువేడుక మిన్నంది కొండఁ దాఁకె. 20

అర్థము :

కలదు, లేదు అనఁగా = ఉన్నదని చెప్పడానికి గాని, లేదనడానికి గాని వీలులేకుండా (మిక్కిలి సన్నముగా), అసియాడు = జవ్వాడుతుండే, కౌనుతీరున్ = నడుముయొక్క అందమునూ, తళుకు మొగమునకు = కాంతిమంతమైన ముఖమునకు (తాకునట్లుగా), ఎగయు = పైకుబికియుండు, గుబ్బల, బెడంగుఁగా = సౌందర్యమునూ, చూచి, అతని = అర్జునుని, నిడువాలు చూపులు = మిక్కిలి దీర్ఘములగు దృష్టులు, నిండువేడుకఁగా = పరిపూర్ణమైన సంతోషముతో, మిన్నంది కొండఁదాఁకెఁగా = అపరిమితానందమును పొందెను.

*విశేషము :*

కలదు లేదన నసియాడు నడుము, శ్రీనాథుని 'అస్తి నాస్తి విచికిత్సాహేతు శాతోదరి' వంటిది, కాబట్టే జవ్వాడడము

నడుము ఆకాశంతోనూ, కుచములు కొండలతోనూ సరిపోల్చడం మన కవుల కలవాటు. అర్జునుడి చూపులు మొదట నడుమును చూచి, తర్వాత కుచములను చూచాయి అనగా, మిన్ను, ఆకాశాన్ని (అనగా నడుమును) అందుకొని, కొండను, (అనగా స్తనములను) తాకాయి, అని చమత్కారము,

సంతోషమును చెప్పినప్పుడు ఆకాశాన్నంటినట్లు, కొండను తాకినట్లూ పలుకుబడుల నుపయోగించడం సాధారణము. తెర ఎత్తగానే, అర్జునుడు, చిత్రాంగద ముఖాన్ని చూడకుండా (ఆమె తలవంచుకొని ఉన్నదేమో) ఆమెను క్రిందనుండి మీదికి చూచినట్లు చెప్పడం ఒక సొగసు.

అలంకారము :

స్వభావోక్తి, శ్లేష, అతిశయోక్తి.

చిలుకలకొల్కి కన్గొనియెఁ జేరలఁ గొల్వఁగ రాని కన్నులన్,
మొలక మెఱుంగు నీలముల ముద్దులుగాఱు నొయారి మీసముల్,
గలకల నవ్వు చక్కని మొగంబు, వెడంద యురంబు, సింగముఁ
గలఁచు రువాణపుం గవును గల్గిన యా కురువీర పుంగవున్. 21

అర్థము :

చిలుకలకొల్కి = ఆ చక్కని కాంత, చేరలన్ కొల్వఁగరాని = అరచేతులతోడ కూడా కొలుచుటకు వీలుకాని (అతి విశాలములైన), కన్నులన్ = కన్నులున్నూ, మెఱుంగు (గల)

మొలక నీలముల = నీలపు రవ్వలలాగా, ముద్దులుగాఱు = మిగుల మనోహరంగా ఉన్న, ఒయారి మీసముల్ = చక్కని వంపుగల మీసాలున్నూ, కలకలనవ్వు = మిక్కిలి కళతోకూడి ఉన్న, చక్కని మొగంబునూ, వెడంద = విశాలమైన, ఉరంబు = రొమ్మున్నూ, సింగముఁ = సింహమును, కలఁచు = కలతబెట్టే (తిరస్కరించే), రువాణపు కవునుఁ = అందమైన నడుమున్నూ, కల్గిన, ఆ కురువీర పుంగవుఁ = కురువంశవీరుల్లో శ్రేష్ఠుడైన అర్జునుడిన్ని, కన్గొనియెన్ = చూచెను.

*తాత్పర్యము* :

సుందరియైన చిత్రాంగద, చేరలను మించిన విశాలమైన కన్నులూ, నీలపు రవ్వల కాంతితో మిగుల మనోహరంగా ఉన్న గరువపు మీసములూ, కళావంతమైన మొగమూ, విశాలమైన వక్షస్థలమూ, సింహమును ఓడించే సన్నని నడుమూ, కలిగి ఉన్న కురువీరోత్తము డైన అర్జునుడిని చూచింది అని భావము.

*విశేషము* :

పై పద్యంలో అర్జునుడు చిత్రాంగదను క్రిందినుండి పైకి చూస్తున్నట్లు కవి చెప్పాడు. ఇక్కడ, అర్జునుడి చూపుల్ని తప్పించుకొనేందుకా అన్నట్లు, చిత్రాంగద పైనుండి క్రిందకు చూచిందని చెప్పడము సమంజసము.

మరిన్నీ, పురుషుడు చూడగానే సహజంగా స్త్రీలో గమనించే స్తనాదులు మొదటి పద్యంలో వర్ణించాడు, అలాగే, స్త్రీ పురుషుడిలో గమనించే సౌందర్యం - విశాలనేత్రాలూ, గరువపు మీసమూ, వక్షస్థలమూ మొదలైన పురుషలక్షణాలు, ఈ రెండవ పద్యంలో వర్ణించడం ఔచిత్యం.

*పాఠాంతరము* :

"చేరల గొల్వగ జాలు కన్నులున్*

— తిరుపతివారు.

*అలంకారము* :

స్వభావోక్తి, యమకము.

అంగజ రాజ్యం బేలుట
కుం గట్టిన తోరణంబొకో యన నతఁడా
శృంగారవతికిఁ గట్టెఁ
మంగళసూత్రంబు చతురిమం గళసీమన్. 22

అర్థము :

అంగజరాజ్యంబు = మన్మథ సామ్రాజ్యమును, ఏలుటకుఁ = పరిపాలించుటకు, కట్టిన, తోరణంబొకో యనన్ = తోరణమో అన్నట్లు, అతడు = అర్జునుడు, ఆ శృంగార వతికి = చిత్రాంగదకు, చతురిమం = నేర్పుతో, గళసీమన్ = మెడయందు, మంగళ సూత్రంబున్, కట్టెన్.

తాత్పర్యము :

మన్మథుని సామ్రాజ్యము నేలుటకు తోరణము కట్టినట్లు, అర్జునుడు చిత్రాంగద మెడను మంగళసూత్రము కట్టెను.

విశేషము :

పట్టాభిషేక మహోత్సవ సందర్భంగా తోరణం కట్టినట్లు అనడంలో ఏలేవాడు అర్జునుడనీ, శృంగారవతియైన చిత్రాంగదే మన్మథ సామ్రాజ్యమనీ బోధపడుతుంది.

అలంకారము :

ఉత్ప్రేక్ష, యమకము.

అనురక్తిం దలఁబ్రాలు వోసె విజయుం డావేళ బంగారు కుం
డన రంగౌ నలినీలవేణి పయి ముత్యాల్ దోయిటం ముంచి చ
య్యనఁ బాలొప్పంగిన కైవడిఁ సిరులు పెంపైఁ బూలు రేకె
త్తినట్లనె వర్ధిల్లు, మటన్న దీవనల కెల్లం దావలంబై తగన్. 23

అర్థము :

చయ్యనన్ = ఒక్క సారిగా (అతిశీఘ్రముగా), పాలు పొంగిన కైవడిన్ = పాలు పొంగినట్లున్ను, సిరులు = సంపదలు, పెంపై = అతిశయించి, పూలు రేకెత్తినట్లనె = పూవులు వికసించిన రీతిగానున్ను, వర్ధిల్లుము = అభివృద్ధిని చెందుము, అటన్న = అందరు అంటున్న, దీవనలకెల్లఁ = సమస్త ఆశీర్వాదములకును, తావలంబుఅయి = ఆధారమగునట్లుగా, బంగారు కుండ అనఁ రంగు బౌ = బంగారుకుండలాగున ముద్దులొలుకుచున్న, అలినీలవేణి = తుమ్మెదలవలె నల్లనైన కొప్పుగల చిత్రాంగద, పయిఁ = మీద, విజయుండు = అర్జునుడు, ముత్యాల్ = ముత్యాలను, దోయిటఁముంచి = దోసిళ్ళతోముంచి ఎత్తి, అనురక్తిఁ = ప్రేమతో, తలఁబ్రాలు, పోసెను.

*తాత్పర్యము :*

పాలుపొంగినట్లే సంపదలు అభివృద్ధి చెంది, పూలు రేకెత్తినట్లుగా వర్ధిల్లుము అనే దీవనలకు అనుగుణంగా బంగారు కుండవలె ఒద్దికగా కూర్చున్న చిత్రాంగదయొక్క నల్లనైన తల వెంట్రుకల మీద అర్జునుడు దోసిళ్ళతో ముత్యాలు ఎత్తి ప్రేమతో తలంబ్రాలు పోశాడని భావము.

*విశేషము :*

తలంబ్రాలు పోసినప్పుడు దృష్టి ఆమె నల్లని తలవెంట్రుకల మీదనే ఉంటుంది కాబట్టి, ఇక్కడ "అలినీలవేణి" అనడము సమంజసము.

తెల్లని ముత్యాలు నల్లని వెంట్రుకల మీద నుండి జారిపడుతున్నప్పుడు కుండలోని పాలు పొంగినట్లు కనబడడం సహజము.

అంతేకాక, ఆ ముత్యాలు తలవెంట్రుకలలో చిక్కి ఒక దాని ప్రక్క నొకటి కూడి నప్పుడు పూలురేకెత్తినట్లు కనబడడం కూడ సహజము, కాబట్టి పద్యములో గల రెండు దీవనలు సార్థకములే.

*పాఠాంతరము :*

"పూలుచేరెత్తినట్లన"

—తిరుపతివారు

*అలంకారము :*

ఉత్ప్రేక్ష, ఉపమానము.

తామ్రపర్ణీ నదీతీర ధరణి నేలు
దొరతనముఁ దెల్పఁగా రాశిదొరలఁ బోసె
ముదిత చేతులఁ దలఁబ్రాలు ముత్తియములు
ముదితచేతు లగుచు సఖాసదులు వొగడ. 24

*అర్థము :*

ముదిత = చిత్రాంగద, (ముత్యాలు దొరికే) తామ్రపర్ణీ నది (యొక్క), తీర = ఒడ్డున ఉన్న, ధరణిన్ = భూమిని, ఏలుదొరతనము = పాలించునట్టి ప్రభుత్వమును, తెల్పఁగాన్ = తెలియజేయునట్లుగా, చేతులన్ = దోసిళ్ళతో, తలఁబ్రాలు ముత్తియములు = దలంబ్రాల కొరకు

ఉంచిన ముత్యాలను, సభాసదులు = అటనున్న వారందరును, ముదిత చేతులు అగుచు = సంతోషించిన మనస్సు కలవారగుచు, పొగడఁ = మెచ్చుకొనునట్లు, రాశిదొరలఁ పోసెఁ = (ఆ ముత్యాలు) పెద్ద ప్రోగు పడునట్లు పోసెను.

తాత్పర్యము :

ఈ పద్యములో చిత్రాంగద తనవంతు తలంబ్రాలు పోస్తున్నది. ముత్యాలు దొరికే తామ్రపర్ణీ నదీ ప్రాంతాలను పాలించే రాజు కూతురు కాబట్టి ముత్యాలను అదే పనిగా దోసిళ్ళతో రాశిగా పడినట్లు పోసిందని భావము.

విశేషము :

ముదిత = సంతోషించినది, అని గూడా అర్థముంది. కాబట్టే అత్యుత్సాహముతో తలబ్రాలు పోయడము. అందు వల్లనే అవి రాశి (ప్రోవు)గా పడడము.

ముత్యాల నంత విశేషముగా ఉపయోగించడానికి ఆధారము తామ్రపర్ణీనదీతీరము. తామ్రపర్ణి తిరునెల్‌వేలి జిల్లాలోనున్న నది. ఆ నదిలోనూ అది కలిసే సముద్రభాగములోనూ ఇప్పటికీ ముత్యాలు దొరుకుతుంటాయి, ఆ రాజు కూతురు ముత్యాలు రాశి పోయడం సమంజసము కదా.

చివరిపాదము 'ముదితచేతస్కులయి సభాసదులు వొగడ' అని తిరుపతివారి పాఠము.

అలంకారము :

ఉత్ప్రేక్ష, యమకము.

ఈ చందంబునఁ గల్యా
ణోచిత కృత్యంబు లెల్ల నొనరిచి యంతన్
రాచూలి భోగ్య వస్తు
ప్రాచుర్య మనోజ్ఞకేళి భవనము నందున్, 25

అర్థము :

ఈ చందంబునన్ = ఈ విధముగా, కళ్యాణ ఉచిత కృత్యంబులెల్లన్ = వివాహమునకు తగిన కార్యములన్నీ, ఒనరిచి = చేసి, అంతన్ = తర్వాత, రాచూలి = రాజకుమారుడు (అర్జునుడు), భోగ్య = అనుభవించదగిన, వస్తువుల (యొక్క), ప్రాచుర్య = సమృద్ధిచేత, మనోజ్ఞ = మనోహరముగా ఉన్న, కేళిభవనమునందున్ = క్రీడా (శయ్యా) గృహమునందు,... తర్వాతి పద్యముతో అన్వయము.

తాత్పర్యము :

ఈ విధంగా వివాహ కార్యాలన్నీ ముగించి అర్జునుడు అనుభవింపదగిన వస్తువులతో నిండియున్న శయ్యాగృహమునందు...తర్వాతికి అన్వయము.

పాఠాంతరము :

1. భోగ్యవస్తు ప్రాచుర్య మనోజకేళి భవనము నందున్

దీనికి, అనుభవింపదగిన వస్తువులయొక్క సముదాయము కల్గిన (మనోజకేళి) మన్మథ క్రీడలకు నియమించిన మందిరమందు అని అర్థము.

2. రాచూలి భోగవస్తు
ప్రాచుర్యంబైన కేళి భవనము నందున్

తిరుపతివారు.

భోగవస్తువుల సమృద్ధికల కేళిభవనమునందు అని మాత్రమే చెప్పుకోవలెను.

## శోభనము

మినుకుఁ గడాని జీనిపని మేలిమి మంచముపై వసించి యుం
డినయెడ, నొయ్యనన్ సఖులు నేర్పునఁ దోడ్కొనివచ్చి, మ్రోల జ
వ్వని నిడి, తోడిచూపులకు వచ్చినవారును బోలె, వెన్కకుం
జని; రవుఁగాదె పై నతను సంగర మా నవమోహనాంగికిన్. 26

అర్థము :

మినుకు = మెరుస్తున్న, కడాని = కుందనముతో చేసిన, జీనిపని = సున్నితమైన నగిషీ పనులవల్ల, మేలిమి = ప్రశస్తమైన, మంచముపై (రాచూలి) వసించి, ఉండినయెడన్ = ఉండగా, సఖులు = చిత్రాంగద చెలికత్తెలు, ఒయ్యనన్ = మెల్లమెల్లగా, నేర్పునన్ = చాకచక్యముతో, తోడ్కొని వచ్చి, మ్రోలన్ = అర్జునుని దగ్గర, జవ్వనిన్ = యౌవనవతియైన చిత్రాంగదను, ఇడి = నిలిపి, తోడిచూపులకు వచ్చినవారును బోలెన్ వెన్కకుం, చనిరి = పోయిరి, పైన్ = ఇకమీద, ఆ నవమోహనాంగికిన్ = నూతన యవ్వనముచేత మోహింపజేసే శరీరము కలదానికి, అతను సంగరము(అతనుడి) మన్మథునియుద్ధము, (అతను = 'తను' కానిది, తను అనగా స్వల్పము, అతను అనగా గొప్ప యుద్ధము అనిగూడ అర్థము.) అగుకాదె = కానున్నదికదా !

తాత్పర్యము :

మంచి పనితనముగల మంచముమీఁద అర్జునుడుండగా చెలికత్తెలు మెలమెల్లగా చిత్రాంగదను చాలా చాకచక్యముతో అక్కడికి తీసుకొనివచ్చి నిలిపి వెళ్ళిపోయారు అని భావం.

విశేషము :

మల్లయుద్ధమువంటి పోట్లాటలకు పోయేవీరులను తమ స్నేహితులు యుద్ధరంగము దాకా తీసుకొనివచ్చి, యుద్ధమారంభించినప్పుడు అక్కడినుండి తిరిగి పోతారు. వారినే 'లోడిచూపులకు వచ్చిన వారు' అని అంటారు.

జరుగనున్నది మన్మథ సంగరం అన్న గొప్ప యుద్ధము. ఆ యుద్ధంలో చిత్రాంగద పాల్గొనవలసి ఉంది. కాబట్టే చెలుల నిష్క్రమణ.

ఇక్కడ యుద్ధరంగము శోభనపుగది. వీరులు చిత్రాంగదా అర్జునులు.

'ఒయ్యన' చిత్రాంగదను తోడ్కొనివచ్చిరి అని కవి చెప్పినందువల్ల చిత్రాంగద సిగ్గుచేత ఆలసించింది అని సూచన. ఈ భావాన్నే రెండవ చరణంలో 'నేర్పునన్' అన్నమాటవల్ల కూడా కవి సూచించాడు. లజ్జాభరంచేత చిత్రాంగద ఏవేవో అడ్డంకుల్ని కల్పిస్తూ ఆలస్యం చేయడానికి ప్రయత్నించిందనీ, దానిని నేర్పుతో చెలికత్తెలు సాగనివ్వకుండా ఆమెను తీసుకొని వచ్చారు అనీ అభిప్రాయము.

జీనిపని - చీనిపని అని రెండు రూపాలున్నాయి. దీనికి అర్థము 'చీనాదేశపు పనితనము గల' అని చెప్పవచ్చును. చీనిచీనాంబరాలు ఆదినాలలో చీనాదేశమునుంచి వచ్చినవే.

పాఠాంతరాలు :

'నేర్పునఁ దోడ్కొని తెచ్చి' అని ఒకపాఠము.

అలంకారము :

ఉత్ప్రేక్ష, శ్లిష్టరూపకము, ఉపమ.

చంచలనేత్రఁ గాంచి నృపచంద్రుఁడు మోహము నిల్పలేక, చే
లాంచల మంటి శయ్య కపు డల్లనఁ దార్చి, కవుంగిలింప నుం
కించుఁ; బయంట నంట గమకించుఁ; జె లించు టదెప్పు డెప్పు డం
చించుక సేపులోన మెఱయించు ననేక మనోవికారముల్. 27

అర్థము :

చంచలనేత్రఁ = మిగుల చలిస్తున్న కన్నులుగల కాంతను, కాంచి = చూచి, నృప చంద్రుడు = అర్జునుడు, మోహము నిల్పలేక, చేలాంచలము = చీరచెరగును, అంటి = తాకి (పట్టుకొని), శయ్యకు = సెజ్జకు, అపుడు, అల్లనఁ = మెల్లగా, తార్చి = దగ్గరకుతెచ్చి, కవుంగిలింపఁ = ఆలింగనము చేసుకొనుటకు, ఉంకించున్ = ప్రయత్నించును (ప్రయోజనము లేదు), పయంటఁ = పయ్యెదను, అంటఁ = లాగడానికి, గమకించుఁ = యత్నించును, (ప్రయోజనములేదు), చెలి = ప్రియురాలు, ఇంచుట = ఇష్టపడుట, ఆదెప్పు దెప్పుడు, అంచుఁ = ఇంకెప్పుడని, ఇంచుక సేపులోన = క్షణములోనే, అనేక మనోవికారముల్ = అనేక విధాలైన మనోభావాలను, మెఱయించుఁ = కనబర్చుచుండును.

తాత్పర్యము :

అర్జునుడు మహాప్రయత్నంతో చిత్రాంగదను మంచము దగ్గరకు తీసుకొని రాగలిగాడు. ఆ వెనుక ఆతడు కౌగిలించడానికీ, పైట పట్టుకోడానికీ చేసిన ప్రయత్నాలను చిత్రాంగద సాగ నివ్వలేదు. ఇక ఈమె ఇష్టపడడ మెప్పుడో అని అనేకవిధాలైన ఆలోచనలు మనసులో పరుగెడుతూ ఉండగా అర్జునుడున్నాడు.

విశేషము :

చెలికత్తెలు విడిచిపెట్టి పోవడంవల్ల భీతి లజ్జలతో ఉన్న చిత్రాంగదను ఈ సన్నివేశంలో 'చంచలనేత్ర' అని చెప్పడం సమంజసం.

చిత్రాంగదను చేరదీసేందుకు చేసిన ప్రయత్నాలన్నీ నిష్ప్రయోజనం కాగా ఈమె ఇష్టపడడ మెప్పుడెప్పుడనీ, ఇప్పుడేమిచేస్తే ఆమె అంగీకరిస్తుందనీ అనేక ఆలోచనలు అర్జునుడి మనస్సులో నిముషానికి నూరువిధాలుగా చలించాయి. ఆ ఆలోచనల పోకడనుబట్టి 'మెఱయించు' అనడం సార్థక మయింది.

పాఠాంతరము :

1. ..............................కవుంగిలించ నుం
కించఁ, బయంటనంటఁ గమకించఁ జెలించు టదెప్పుడెప్పు డం
చించుక సేపులోనె మెఱయించె ననేక మనో వికారముల్.

— తిరుపతివారు.

2. "...............చలించు టదెప్పుడెప్పు డం"

ఇంతవరకూ ప్రతిబంధముగానున్న ఈ సిగ్గు, చలించుట = కదలుట—పోవుట ఎప్పుడో కదా అనీ లేదా, ఆమె మనసుకదలుట (రంజిలుట) ఎప్పుడో అనీ అర్థం చేసుకోవాలి.

అలంకారము :

స్వభావోక్తి.

కానుక గాఁగ నిత్తు బిగికౌఁగిలి పల్కవె కీరవాణి, నీ
దౌ నుడితేనె నా చెవుల నానఁ ; గృపారస ధార నాన న
న్నాననమెత్తి చూడు నలినానన; గోలతనాన నేల లో
నానఁ జలంబు నీకుః మరు నాన సుమీః విడు నాన యింకిటన్. 28

*అర్థము :*

కీరవాణి = చిలుక పలుకులదానా, బిగికౌగిలిన్ = గాఢమైన ఆలింగనమును, కానుక
కాఁగన్ = (సేవకాదులు సమర్పించు) నజరానా (ఉపాయనము)గా, ఇత్తును = ఇస్తాను, నీదౌ
నుడి తేనె = నీ యొక్క మాటలలోని తేనెను, నా చెవులన్ = నా చెవులద్వారా, ఆనన్ =
(నేను) తాగడానికి వీలుగా, పల్కవె = మాటలాడవె; నలి నానన = పద్మమువంటి ముఖము
కలదానా, కృపారసధారన్ = (చూపులయందలి) దయారసము యొక్క (వర్ష) ధారలలో,
నానన్ = నేను తడిసిపోయేలాగా, నన్ను, ఆననమెత్తి = నీముఖమెత్తి చూడు; గోలతనానన్ =
బేలతనంచేత, చలంబు = పట్టుదలను, లోన్ ఆనన్ = మనసులో పూనుట, నీకు, ఏల =
ఎందుకు ? తగదని భావము, మరుని ఆన సుమీ = మన్మథుని మీద ఒట్టుసుమా, ఇఁక నిటన్ =
ఇకనైనా, నానన్ = సిగ్గును, విడు = విడిచిపెట్టు.

*తాత్పర్యము :*

బిగికౌగిలి కానుకగా యిస్తాను, పల్కి నా చెవుల కానందము కూర్చు అనీ, చూపులలోని
కృపారసధార నన్ను తడిపి వేసేలాగా ముఖమెత్తి నన్ను చూడమనీ, బేలతనంతో ఈ పట్టు
దల నీకు తగదనీ, సిగ్గు విడిచి పెట్టక పోతే మన్మథుడి మీద ఒట్టు పెట్టాననీ అర్జునుడు
చిత్రాంగదను బతిమాలుతున్నాడు.

*విశేషము :*

చిత్రాంగదను సంబోధించిన పదాలు; 'పల్కుము' అన్నప్పుడు 'కీరవాణి' అని, 'మొగ
మెత్తిచూడు' అన్నప్పుడు 'నలినానన' అని, అనడం భావ గర్భితంగా ఉన్నాయి.

గోలతనము, తెలియక పోవడం, 'ఈ ప్రక్రియ ఉభయులకూ సంతోష ప్రదము' అన్న
సంగతి తెలియకుండా పట్టుపట్టి ఉండడం గోలతనము అని భావము.

కానుక లిచ్చే వారిని చూపులతోనూ మాటలతోనూ సత్కరించడం ధర్మము అని
హెచ్చరించాడు.

పద్యంలో 'నాన'లు ఎనిమిది ఉన్నాయి.

'చక్కెరవింటి దేవర ప్రసాదముఁ గైకొను మిప్పు డిందమో
చక్కెరబొమ్మ!' యంచు విలస న్మణికంకణ హస్త మంటి పే
రక్కఱఁ గప్పురంపు విడె మా నెఱజాణ యొసంగి నిక్కి లేఁ
జెక్కిలి ముద్దువెట్టుకొనెఁ; జెప్పెడి దే మిఁక నా వినోదముల్ ! 29

*అర్థము :*

ఓ చక్కెర బొమ్మ = ఓ సర్వాంగ సుందరీ, చక్కెర వింటి దేవర = చెరకు విల్లుగల మన్మథదేవుని యొక్క, ప్రసాదము, ఇప్పుడు, కైకొనుము = తీసుకో, ఇందము = ఇదిగో పుచ్చుకో, అంచున్, విలసత్ = ప్రకాశిస్తున్న, మణికంకణ = మణులుతాపిన గాజులు కల, హస్తము = ఆమె చేతిని, అంటి = పట్టుకొని, పేరు అక్కఱన్ = మిక్కిలి ప్రేమతో, కప్పు రంపు విడెమున్ = పచ్చ కర్పూరము వేసిన తాంబూలమును, ఒసంగి = నోటికందించి, ఆ నెఱ జాణ = మిగుల నేర్పుగల ఆ అర్జునుడు, నిక్కి = మీదికి ఉబికి, లేఁ జెక్కిలిన్—లేత చెక్కి లిని = నవకము గలిగి తళతళలాడుతున్న బుగ్గను, ముద్దువెట్టుకొనెను; ఇఁకన్ = అటుపైని, ఆ వినోదముల్ = ఆ దంపతుల వేడుకలు, చెప్పెడిదేమి = ఏమని చెప్పగలము? (అతి మనో హరములని భావము).

*తాత్పర్యము :*

మన్మథదేవుని ప్రసాద మిదుగో అందుకో అంటూ, నేర్పరియైన అర్జునుడు చిత్రాంగద హస్తాన్ని పట్టుకొని, కప్పురపువిడెము నోటి కందించి, ఆమె లేత బుగ్గలను ముద్దిడుకొన్నాడు. ఆ పైని వారి వేడుకలు చెప్ప లేనంత మనోహరంగా సాగినా యని భావము.

*విశేషము :*

దేవరప్రసాదం కాబట్టి, వద్దనరాదు, అంగీకరించకతీరదు అనిసూచనచేశాడు. చిత్రాంగద ఆ తాంబూలం తన చేతితో అందుకోబోయే సరికి కాదని ఆ చేయి పట్టుకొని ఆ తాంబూలాన్ని నోటికందించాడు. చిత్రాంగద నోరుతెరిచే సరికి, నెరజాణ కాబట్టి అర్జునుడు తటాలున నిక్కి, ఆమె చెక్కిలి ముద్దుపెట్టు కొన్నాడు. అర్జునుడి నెరజాణ తనం పద్యంలో ప్రత్యక్షము.

*అలంకారము :*

పరికరాంకురము, పర్యాయోక్తి.

ఇగ్గెడు వెన్కకుం బయికి నీడ్చినఁ, బైటఁ దొలంగఁ జేయఁ గే
లొగ్గెడు, రెమ్మి పోకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులుం
బిగ్గ నడంచుచుం విడిచిపెట్టదు; బాల ననం బనేమి? యా
సిగ్గుకు సిగ్గులే; దితులఁజేసిన పిమ్మట నుండ వచ్చునే? 30

అర్థము :

పైకిఁ ఈడ్చినఁ = తనమీదికి తెచ్చుకోడానికి అర్జును డామెను లాగినప్పుడు, (రాకుండా) వెన్కకుఁ ఇగ్గెడుఁ = వెనుకకు ఈడిగిల పడుతుంది; పైటఁ తొలంగఁ చేయఁగఁ = పయ్యెద తొలగించడానికి ప్రయత్నించినపుడు, కేలు ఒగ్గెడుఁ = (వక్షస్థలము కాన రానీయకుండా చేతులు అడ్డుపెడుతుంది). రెమ్మి = బలవంతముగా, పోక ముడిఁ = చీరకట్టు ముడిని, ఈడ్చినఁ = విప్పగా, క్రుంగిలి = క్రుంగి—ముడుచుకొని, రెండు కొంగులుఁ = (విప్పిన) రెండు కొంగులను, అడంచుచుఁ = అదిమి పట్టుకొని, విడిచి పెట్టదు = అర్జును డెంత ప్రయత్నించినా వదలదు; బాలఁ = ఆముద్దరాలిని, అనన్ = నిందించడానికి, పని ఏమి = కారణములేదు, (పాపమా బాల యేమి చేయగలదు?), సిగ్గుకు = సిగ్గు అన్న దానికి, సిగ్గు లేదు = మానావమానాలు లేవు, ఇటులఁ చేసిన పిమ్మటఁ = ఇంత చీకాకు పెట్టిన తర్వాత, గూడా, ఉండవచ్చునే? తక్షణము తొలగిపోకుండా ఇంకా ఇక్కడే ఉండడము సిగ్గులేనిపనికాదా!

తాత్పర్యము :

పైకి లాగుకొనినప్పుడు, ఈడిగిలపడుతుంది; పయ్యెద తొలగించబోతే, చేతులడ్డం పెడుతుంది; బలవంతంగా అర్జునుడు చీరముడి విప్పినప్పుడు ఒళ్లు ముడుచుకొని రెండు కొంగులూ అదిమి పట్టుకుని విడిచిపెట్టదు. అయినా, ముద్దరాలు ఆమె ననడమెందుకు? ఇన్ని పాట్లుపెట్టినా ఆమెను విడిచి తొలగిపోకుండా ఉన్నందుకు ఆ సిగ్గుకేసిగ్గు లే దనాలి. (ఇంత జరిగిన తర్వాత సిగ్గు వెంటనే వీడిపోవాలి కాని ఇంకా అంటిపెట్టుకుని ఉండరాదని భావం).

విశేషము :

ఇక్కడ బాల అనడం సాభిప్రాయం, చిత్రాంగద బాల అనగా ముగ్ధ కాబట్టే సిగ్గు పడుతున్నది అని.

అలంకారము :

పరిసంఖ్యాలంకారం, లోకోక్తి, స్వభావోక్తి.

'కోర్కి వెలయంగ నినుఁ దెచ్చి కూర్చినట్టి
తియ్యవిలుకాని ఋణ మెందుఁ దీర్చుకొందు
నువిద ! నీ చేయి చూచుక యున్న నాకు
నింద మని వేగ నీవి నీ వియ్యకున్న ? 31

పై పద్యములో చిత్రాంగద 'రెండుకొంగులుఁ బిగ్గ నడంచుచున్ విడిచి పెట్టదు బాల' అర్జునుని ప్రయత్నాలన్నీ విఫలమైనవి; ఆమె బిగ్గపట్టిన చేతిని చూచుకొంటు ఉండిన అతడు ఇప్పుడు వాచాగా ఆమెను ప్రార్థిస్తున్నాడు.

అర్థము :

ఉవిద = యువతీ, నీచేయి చూచుకయున్న నాకు = బిగ్గబట్టి ఉంచిన నీచేతిని చూచుకుంటు ఉన్న నాకు, ఇందమని = తీసుకో అని, వేగ, నీవిన్ = పోకముడిని, నీవు ఇయ్యక ఉన్నన్ = నీవు నాకియ్యకపోతే (నాకు స్వాధీన పర్చకపోతే), కోర్కి వెలయంగన్ = నాకోర్కెలు సఫలమైనట్లు, నిను తెచ్చి కూర్చినట్టి, తియ్యవిలుకాని ఋణము = మన్మథుడికి నేనియ్యవలసిన (కృతజ్ఞతారూపమైన)అప్పును, ఎందున్ = ఏవిధంగా, తీర్చుకొందున్ = రుణవిముక్తి పొందగలను ?

ఇంకొక అర్థము ;

ఉవిద = యువతీ, నీచేయిచూచుకయున్న నాకు = నీదయకోసము (నీవు డబ్బుఇస్తావని) ఎదురు చూస్తున్ననాకు, ఇందమని = ఇదిగో అని, వేగ = త్వరగా, ఈవి = నీవిచ్చేదానమును, నీవు ఇయ్యకున్నన్ = ఇవ్వకపోతే, తియ్యవిలుకాని ఋణము = మన్మథునికి నేను ఈయవలసిన అప్పును, ఎందు దీర్చుకొందున్ = ఏ విధంగా తీర్చుకోగలను ?

తాత్పర్యము :

సుందరీ నీవీ విధంగా పిడికిలిపట్టి ఉంచి నీపోకముడిని విడిచిపెట్టక పోయినట్టయితే నాకు (నీకుగూడా) మన్మథుడు చేసిన మహోపకారానికి తగిన కృతజ్ఞత చూపడము ఏలాగు అని అర్జునుడు అన్నాడు.

విశేషము :

చేయిచూచుకొనుట అంటే ఒకరు చేసిన దానము మీద ఆధారపడి ఉండుట.

ఒకడు ఇంకొకనికి ఋణపడి తీర్చడానికి సమర్థతలేక ఒకకాంత చేసే దానముమీద ఆధారపడి ఉన్నాడు. ఆకాంత ఇదిగో అని తానిచ్చే దానము ఈయక పోయినట్టయితే ఆరుణము తీర్చడమునకు వేరుమార్గము లేదని ప్రార్థించినట్లు కనబడుతూ ఉంది.

కొంగులు బిగ్గబట్టిన చేతిని అర్జునుడు చూచిచూచి, ఏమి చేదామా అని ఆలోచించి, వేరుమార్గము లేకపోబట్టి ఈవిధంగా అన్నాడు.

కోర్కి వెలయంగ కూర్చినాడు కాబట్టి ఈ పద్యములో మన్మథుడిని తియ్య విలుకాడు అని తీయగా అనడము బాగుంది.

మన్మథుడి రుణము తీర్చడమంటే రతిక్రీడలతో అతనిని సంతోష పెట్టడమని భావము. పోకముడి వదలకపోతే దానికి వీలుండదు.

*పాఠాంతరము :*

ఇందమని అంది నీవి నీవియ్యకున్న

ఇక్కడ నీవి = వోకముడి అనీ మూలధనము అనీ రెండర్థాలు. శ్లిష్టరూపకము. మూల ధనము అనడములో సారస్యము విశేషములేదు. 'అంది' అను శబ్దానికి చక్కని అన్వయములేదు.

అందన్ = నా చేతికందునట్లు - నా స్వాధీనమగునట్లు అనిన సమంజసముగా ఉండును.

ఈవి = ఇచ్చినది - దానముచేసినది. చేయిచూచుక ఉండడము = పూర్తిగా ఆమె మీదనే ఆధారపడి ఉండడము.

*అలంకారము :*

శ్లేష, సమాసోక్తి;

'మకరకేతనుఁ గూర్చి మకరికా లతలు నీ
చెక్కుల వ్రాయంగ మ్రొక్కుకొంటిఁ,
గుసుమాకరునిఁ గూర్చి కుసుమ మాలికలు నీ
వేనలిఁ దుఱుమంగ వేఁడుకొంటి,
గంధవాహనుఁ గూర్చి గంధసారంబు నీ
గుబ్బలఁ బూయంగఁ గోరుకొంటి,
మృగలాంఛనునిఁ గూర్చి మృగమదంబున నీకుఁ
దిలకంబు దిద్దఁ బ్రార్థించుకొంటి,
నిన్ను వరియించు నప్పుడే యిన్ని చేయు
వాఁడనని మున్ను శృంగార వనములోన;
వల పెఱిఁగి యేలుకోఁ గదే కలికి !, యనుచుఁ
గేళి తెలయించె న మ్మొద్దరాలి నపుడు. 32

ఈ పద్యములో విజయుడు తనకోర్కె సఫలము కావాలని అనేక దేవతలకు మొక్కుకున్నానని చిత్రాంగదతో (ఆమెకు కనికరము కలగా లన్న ఉద్దేశముతో) చెప్పుతున్నాడు.

*అర్థము :*

౧. (నాకోర్కె సఫలము కావాలని) మకరకేతనుఁగూర్చి = మొసలిని టెక్కెముగాగల మన్మథుని గురించి (ఆదేవుని సంతోష పెట్టడానికి) నీ చెక్కులన్ = నీ చెక్కిళ్ళయందు. మకరికా లతలు = మొసలినిపోలు రేఖాచిత్రములను. వ్రాయంగన్ = చిత్రించడానికి. మ్రొక్కుకొంటిన్ = శపథము చేశాను. (మకర కేతమడు కాబట్టి మకరికా లతలు సంతోషకారణాలు)

౨. కుసుమాకరునిగూర్చి = పూవులకు స్థానమైన వసంతుని సంతోషింప జేయడానికి, నీవేనలిన్ = నీ కొప్పులో, కుసుమమాలికలు = పూలదండలు, తుఱుమంగన్ = ముడుస్తానని, వేఁడుకొంటిన్ = ప్రార్థించాను (కుసుమాకరుడు కాబట్టి కుసుమమాలికలు సంతోష కారణాలు)

౩. గంధవాహుఁగూర్చి = (వాసనలు మోసుకొనే) మలయమారుతుని సంతోషార్థము, గంధసారము = చందనమును, నీ గుబ్బలఁ, పూయంగఁ = పూస్తానని. కోరుకొంటిఁ = ప్రార్థించాను, (గంధవాహునకు గంధసారము సంతోష కారణము).

౪. మృగలాంఛనునిఁ గూర్చి = లేడిని గుర్తుగాగల చంద్రుడిని సంతోషింపజేయడానికి మృగమదంబునఁ = కస్తూరితో,నీకు, తిలకంబుఁ = బొట్టును, దిద్దఁ = పెట్టుటకు, ప్రార్థించు కొంటిఁ, మృగమదము = కస్తూరిజింక బొడ్డున కలిగేది కాబట్టి మృగలాంఛనునకు సంతోష కారణము).

నిన్ను వరియించునప్పుడే = నిన్ను వివాహము చేసుకోవా లనుకున్నప్పుడే, ఇన్ని = ఈ మొక్కుబడులన్నీ, చేయువాఁడనని = తప్పక చేస్తానని, మున్ను = ఇక్కడికి రాకపూర్వము, శృంగారవనములోనఁ = ఉద్యానవనములో (మొక్కుకున్నాను); కలికి = సుందరీ, వలపు నామనస్సులోని ప్రేమాతిశయమును, ఎఱిఁగి = తెలిసికొని, ఏలుకోఁగదే = (ఈ సేవకుడిని) నన్ను మన్నించుమా, అనుచు, ఆ ముద్దరాలిని = ఆముగ్ధను, కేళికి = రతిక్రీడకు, ఎలయించెఁ = పురికొల్పెను - ఉత్సాహము కలిగించెను.

*విశేషము :*

ఉద్యానవనములో ఉన్నప్పుడు వియోగము సైపలేక మన్మథ, వసంత, మలయమారుత, చంద్రులను ఈ ప్రకారం వేడుకున్నానని అర్జునుడు అన్నాడు.

ఇటువంటి నియమాలను పూనిన నావలపును గ్రహించి నన్ను పాలించు అని ప్రార్థనము.

పాలించు అనడములో తాను ఒక సేవకుడుగా ఉన్నట్టు సూచన.

*అలంకారము :*

పర్యాయోక్తి.

పొక్కిలి పొంతఁ గరం బిడి,
చెక్కిలి చెంత నొకకొంత చిఱున వ్వొలయఁ
జక్కిలిగింతలు గొలిపెఁ
మిక్కిలి వింతలుగ రతికి మేకొన నంతన్. 33

అర్థము :

పొక్కిలి పొంతన్ = నాభికి చేరువుగా, కరంబిడి = చేతిని ఉంచుతూ, చెక్కిలిచెంతన్ = బుగ్గల దగ్గర, ఒక కొంత, చిఱునవ్వు = మందహాసము, ఒలయన్ = ప్రకాశించగా, మిక్కిలి వింతలుగ = కొత్తరీతులలో, చక్కిలిగింతలు = గిలిగింతలను (కితకితలను), కొలిపెన్ = కలిగించెను, అంతన్ = అటుతర్వాత, రతికి = రతిక్రీడలకు, మేకొనన్ = అంగీకరించగా..., తర్వాతపద్యముతో అన్వయము.

తాత్పర్యము :

పొక్కిలిపొంతను చేతినుంచి గిలిగింతలు కొలుపుటచేత ఆకాంత ఒక్కంతమాత్రము చిఱునవ్వునవ్వి మెలమెల్లన అంగీకారము తెలియజేసెనని భావము.

విశేషము :

ఉచిత లజ్జావతియైన చిత్రాంగద లేతనగవు తేటనుమాత్రము కనబరచడం చాల సమంజసము. చూడండి.

విభుఁడు పరిహాసమాడి నవ్వించుఁ గాని
పడయ లేఁడయ్యె నెన్ని యుపాయములను
రాజబింబాస్య తాంబూలరాగ శుభగ
దంత కురువింద మాలికా దర్శనంబు

— శృంగార నైషధము.

రతికి తా నంగీకరించిన విధానము నూతన రీతిది అని కవి ఊహించాడందామా ?

అలంకారము :

అనుప్రాస.

డాసిన నింగితం బెఱిఁగి డాయఁగ నేరక, తత్తరంబునం
జేసిన సేఁతకున్ బదులు సేయ నెఱుంగక, మేను మేనితో
రాసినయంతనే కళలు రంజిలి కౌఁగిట బాల యుండెఁ బో
యా సుఖ మింతయంత యన నైనది గాదు గదయ్య క్రీడికిన్ ; 34

అర్థము :

డాసినన్ = అర్జునుడు దగ్గరగా వచ్చినప్పుడు, ఇంగితంబు = అతని మనోభావమును, ఎఱిఁగి = గ్రహించి, డాయఁగనేరక = తాను దగ్గరగావోలేక; తత్తరంబునన్ = వేగిరపాటుతో,

చేసిన సేఁతకున్ = విభుడుచేయు చేష్టలకు, బదులు సేయఁగా ఎఱుంగక = చేయడం తెలియక; మేనుమేనితోఁగా = శరీరము తన శరీరముతో, రాసినయంతనే = తగిలినంత మాత్రము చేతనే, కళలు రంజిలి = కళాస్థానములు కరిగి, బాల = ఆ ముద్దరాలు, కౌఁగిటఁగా = ఆలింగనములో (బాహువుల నడుమను), ఉండెన్‌పో = ఇమిడిపోయి ఉండె, ఆహా ! క్రీడికిన్ = క్రీడాసక్తుడైన ఆ అర్జునుడికి, ఆ సుఖము = అప్పుడు అనుభవమునకు వచ్చిన సౌఖ్యము, అది ఇంతది, అంతది అనఁగా అయినది = పరిమితి తెలుపజాలి నట్టిది, కాదు గదయ్యా = కానేకాదు గదా.

*తాత్పర్యము :*

చిత్రాంగద ముగ్ధకాబట్టి శృంగార రసచేష్టలు తెలియక అర్జునుడు చేసిన చేతలకు బదులు ఇవ్వజాలక శరీరానికి శరీరము తాకినంత మాత్రాన పారవశ్యము చెంది అర్జునుని బాహు పంజరమున ఇమిడి ఉండిపోయింది. ఆ సౌఖ్యము అర్జునుడికి ఇంత, అంత అని చెప్పడానికి వీలుకాదు.

*విశేషము :*

క్రీడి అన్న శబ్దము, బాల అన్న శబ్దము ఈ పద్యములో కవి సాభిప్రాయముగా ఉపయోగించాడు.

కళలు రంజిల్లడము చేత పారవశ్యము చెందికౌగిటిలో ఇమిడి పోయెనని భావము.

నేరక, ఎఱుంగక అన్న పదముల వాడినందువల్ల ప్రతిచేష్టలు చేయాలన్న అభిలాష మనసులో ఉన్నదనీ, దానిని బయటికి ప్రకటించే మార్గము ఆమెకు తెలియదనీ సహృదయులు గ్రహించవలెను.

ఆమె ఏ విధంగానూ బదులు ఇవ్వలేదు. ఒంటికి ఒళ్లు తాకగానే పరవశమయి కౌగిలిలో ఇమిడిపోయింది. అయినా అర్జునుడు అపరిమితంగా సంతోషించాడు. బదులు చేసి ఉంటే ఏమయేవాడో కదా !

*పాఠాంతరము :*

డాసిన నింగితం బెఱిఁగి డాయఁగ నేరదు తత్తఱంబునఁగా
జేసినఁ సేఁతకుం బదులుసేయ నెఱుంగదు మేనుమేనితో
రాసినయంతనే కళలు రంజిలి కౌఁగిట బాలయుండెఁ బో
యా సుఖమింత దంత దనసైనది గాదు గదయ్య క్రీడికిఁగా.

— తిరుపతివారు.

*అలంకారము :*

స్వభావోక్తి, పరికరాంకురము.

## బభ్రువాహన జననము

అంగజ రాజ్య వైభవ సుఖాంబుధి నీగతి నోలలాడి చి
త్రాంగద సేవఁజేయ మలయధ్వజు నిల్లటపల్లుఁడై తదీ
యాంగబలంబు గొల్వ నరుఁ డందుల రాజ్యము సేయుచుండ నా
సింగపుఁ జిన్నిలేనడుము చెల్వకు గర్భము నిల్చె నంతటన్. 35

*అర్థము :*

అంగజరాజ్య వైభవ = మన్మథుని రాజ్యసంపదలోని (సంభోగ విలాసమన్న మాట), సుఖాంబుధిన్ = సౌఖ్యమనే సముద్రంలో. ఈ గతిన్ = ఈ ప్రకారంగా, ఓలలాడి = ఈదులాడుతూ, చిత్రాంగద, సేవచేయన్ = సేవిస్తూండగా, మలయధ్వజునిః (ఇల్లటము + అల్లుడు) ఇల్లటపల్లుఁడై = ఇల్లరికమున్న అల్లునిగా, తదీయ అంగబలంబు = ఆ మామగారి చతురంగ బలాలు, కొల్వన్ = కొలుస్తుండగా, నరుఁడు = అర్జునుడు, అందులన్ = ఆ పాండ్యదేశంలో, రాజ్యమున్ చేయుచుండగా, ఆ సింగపుఁ జిన్నిలేనడుము చెల్వకు = సింహమువలె సన్నని (జవ్వాడుచుండే) నడుము కల్గిన ఆ అందకత్తెకు, అంతటన్ = కొంతకాలానికి, గర్భము నిల్చెన్.

*తాత్పర్యము :*

అర్జును డీప్రకారంగా మన్మథ రాజ్యవైభవాన్ని అనుభవిస్తూ, చిత్రాంగద సేవ చేస్తుండగా, మలయధ్వజుని ఇల్లరికపు అల్లుడై పాండ్యదేశాన్ని పరిపాలిస్తున్నాడు. కొంత కాలానికి, సింహమధ్య అయిన ఆ చిత్రాంగద గర్భము తాల్చింది అని భావము.

*విశేషము :*

సుఖాంబుధి కాబట్టి ఓలలాడడం (యథేచ్ఛగా సుఖించడం అన్న మాట).

చిత్రాంగదకు కల్గిన కుమారుడిని రాజ్యాభిషిక్తుని చేస్తానని మాట ఇచ్చాడు. కాబట్టి, కొడుకు పుట్టినంత వరకు అక్కడ ఉండక తప్పిందికాదు.

లేత + నడుము, లేనడుము, గర్భం ధరించబోతున్న ఆ సుందరిని గూర్చి 'సింగపు లేనడుముచెల్వ' అనడం చాల మనోహరము కాదా ?,

*అలంకారము :*

రూపకము.

మించెన్ బోరచి కోరికల్ ; కడు విజృంభించెన్ దనుగ్లాని ;గా
న్పించెన్ మేచకకాంతి చూచుకములన్: జెక్కిళ్ళపైఁ దెల్పు రె
ట్టించెన్; గూర్కులు సందడించె; నడ చండించెన్; మృదామోదమున్
గాంచెన్ వాతెఱ; యోసరించెఁ ద్రివళుల్ నానాఁటికిన్ బోటికిన్. 36

అర్థము :

బోటికిన్ = కాంతకు. నానాఁటికిన్ = రోజులు గడుస్తున్నకొద్దీ. బోరచికోరికల్ = సూడిదలపై అభిలాషలు. మించెన్ = ఎక్కువ కావచ్చాయి; తనుగ్లాని = శరీరాయాసము. కడున్ = మిక్కిలి. విజృంభించెన్ = హెచ్చసాగింది; చూచుకములన్ = చనుమొనలయందు. మేచకకాంతి = నల్లనికాంతి. కాన్పించెన్; చెక్కిళ్లపైన్. తెల్పు = పాండిమము. రెట్టించెన్ = రెండింతలయింది; కూర్కులు = అల్పనిద్రలు. సందడించెన్ = ఎక్కువయాయి. నడ = నడక. చండించెన్ = మందమయింది; వాతెఱ = పెదవులు. మృత్ ఆమోదమున్ = మట్టివాసనను (లేదా మట్టిపెల్లలపై ఇష్టాన్ని). కాంచెన్. త్రివళుల్ = కడుపుపై ఉండే మూడు ముడతలూ. ఓసరించెన్ = తొలగిపోయాయి.

తాత్పర్యము :

రోజులుగడిచే కొద్దీ చిత్రాంగిలో గర్భవతి చిహ్నాలన్నీ కన్పించసాగాయి. సూడిదలపై అభిలాష, శరీరాయాసము, చనుమొనలందు నల్లదనమూ, చెక్కిళ్లు పాలిపోవడమూ, అల్ప నిద్రలూ, నడక మందగించడం, మట్టిపై ఇష్టం మొదలైన లక్షణాలన్నిటితో గర్భం స్ఫుట మయి కడుపుపైనుండే మూడు మడతలూ కన్పించకుండా పోయాయి.

విశేషము :

ఇవన్నీ గర్భవతులైన స్త్రీలలో కనబడే లక్షణాలు. గర్భవతులు మట్టితినడం కూడా కద్దు. అందువల్లనే ఏమో చిత్రాంగద పెదవులు మట్టివాసన కొడుతున్నాయని వర్ణించాడు కవి.

సారంగధర చరిత్రలో గర్భ సందర్భంలో కూడా ఈ పద్యమే కన్పిస్తుంది.

బహుళా, పాఠకులో, లేఖకులో, ఈ విజయవిలాస పద్యాన్ని సారంగధర చరిత్రలో ఇరికించి ఉంటారు.

పాఠాంతరము :

1. "చెక్కుల్ తగన్ దెల్పు రెట్టించన్" అని ఒక పాఠము.

"మించెఙాలో రుచికోరికల్"

—తిరుపతివారు, బులుసువారు.

సాధారణంగా గర్భవతులైన స్త్రీలు తమ కిష్టమైనటువంటి వస్తువులు కొన్నిటిని కోరుతుంటారు. అంచేతనే బంధువులు సూడిదలుచేసి వారికి ఇస్తుంటారు. కాబట్టి 'వోరచి కోరికల్' అన్నదే సమంజసం.

"కోర్కులు నందడించె"

ఆరంభంలోనే 'కోర్కులు' (కోరికలు) ఉన్నాయి. మళ్ళీ యిక్కడ చెప్పడం పునరుక్తి అవుతుంది. ఆ స్థితిలో గర్భవతులకు నిద్ర యెక్కువ కావడం సహజం. కాబట్టి కోర్కులు సందడించెననడమే మంచిది.

*అలంకారము :*

చక్కని స్వభావోక్తి, వృత్యను ప్రాసము.

సీమంతవతీ మణికి
స్సీమంతముఁ జేసి రపుడు నెల లెనిమిది గా
శ్రీ మంతు కెక్కు గర్భ
శ్రీమంతుం డీతఁ డనుట సిద్ధము గాఁగన్. 37

*అర్థము :*

ఈతఁడు = గర్భములో ఉన్న బాలుడు. శ్రీన్ = బుద్ధిచేత. మంతుకెక్కు = ప్రసిద్ధి పొందే. గర్భ శ్రీమంతుఁడు = తల్లి గర్భంలో ఉన్నప్పటినుండే ఐశ్వర్యం కలిగిన వాడు. అనుట = అవుతాడన్నమాట. సిద్ధము కాఁగన్ = నిశ్చయ మయ్యేట్లు. సీమంతవతీ మణికిన్ = స్త్రీలలో మణివంటిదైన చిత్రాంగదకు. నెలలు ఎనిమిది కాన్ = ఎనిమిది నెలల గర్భము కాగా. సీమంతము (అను గర్భసంస్కారమును) చేసిరి.

*తాత్పర్యము :*

ఈ గర్భంలో ఉన్న బాలుడు బుద్ధి సంపదచే ప్రశస్తి కెక్కే ఆగర్భ శ్రీమంతుడవు తాడన్నట్లుగా చిత్రాంగదకు ఎనిమిది నెలల గర్భం నిండగానే సీమంతోత్సవం జరిపారు.

*విశేషము :*

సీమంతం అంటే పాపట. అది కలిగినది సీమంతవతి. అనగా స్త్రీ.

సీమంతం చేయడంలో ఉన్న ఉద్దేశం కవి చెప్పి ఉపకారం చేశాడు. గర్భాధానాది షోడశ కర్మల్లో సీమంతం ఒకటి. గర్భంలో ఉన్నప్పుడే ఇంత ఉత్సవం చేయించుకున్న శిశువు గర్భ శ్రీమంతుడు కాదా!

అలంకారము :

ఉత్ప్రేక్ష.

ప్రొద్దుల నెలలఁ వేవుర
నుద్దులుగాఁ జేయఁదగు మహో యశములుగా
ముద్దుల బాలునిఁ గనియెను
ప్రొద్దులనెల యెడల నిందుముఖి శుభవేళన్. 38

అర్థము :

ప్రొద్దులఁ = సూర్యులను, నెలలఁ = చంద్రులను, వేవురఁ = వేయిమందిని, ఉద్దులుగాఁ = సమానులుగా, చేయఁతగు, మహః యశములుగాన్ = తేజస్సును, కీర్తినిపొందేలాగా, ఇందుముఖి = చంద్రముఖి, ప్రొద్దులనెల = తొమ్మిదవ మాసము, ఎడలఁ = ముగిసినప్పుడు, శుభవేళఁ = మంచి ముహూర్తములో, ముద్దుల బాలునిఁ, కనియెఁ.

తాత్పర్యము :

ప్రతాపములో వేయి సూర్యులతోనూ, కీర్తిలో వేయి చంద్రులతోనూ, సమానము కాగల ముద్దుల బాలుడిని చిత్రాంగద ప్రసవమాసంలో శుభలగ్నమందు కన్నది.

విశేషము :

మహః ( = తేజస్సు లేక ప్రతాపము) ఎఱ్ఱగా సూర్యునివలె ఉంటుందనీ, యశము (కీర్తి) తెల్లగా చంద్రునివలె ఉంటుందనీ కవి సమయాలు, చూడండి :

"అతని కీర్తి ప్రతాపంబు లవనిఁ గలుగ
నేలయువి? యంచు మదిలోన నెపుడు దలఁచు
నపుడ పరివేష మిషమున నబ్జ సూర్య
మండలముల విధాతృండు గుండలించు."

— (శ్రీనాథుడు)

పాఠాంతరము :

"ఉద్దులుగా చేయఁదగు మహోదయములుగా"

—తిరుపతివారు.

ఇక్కడ మహో + ఉదయములు లేక మహః + ఉదయములు అని పదవిభాగము చేయవచ్చును. ఏమైనా, ఉదయములు అన్న శబ్దం నెలల (చంద్రుల)ను సూచించదు. అప్పుడు కవి ఉద్దేశించిన క్రమాలంకారము మాయ మవుతుంది.

*అలంకారము :*

క్రమాలంకారము. యమకము.

ధనము లసంఖ్యముల్ హిత బుధ ద్విజ కోటికి నిచ్చి యప్పు డా
తనయుని బభ్రువర్ణ హయధట్టము నేలెడు నంచు బభ్రువా
హనుఁ డను పేరు వెట్టి చెలువందఁగ బంగరుఁ దొట్లఁ బెట్టి శో
భన విభ వాప్తి రంజిలిరి పాండవ పాండ్య వసుంధ రాధిపుల్; 39

*అర్థము :*

పాండవ పాండ్య వసుంధరాధిపుల్ = అర్జున మలయధ్వజులు, హిత = స్నేహితుల యొక్కయు, బుధ = విద్వాంసుల యొక్కయు, ద్విజ = బ్రాహ్మణుల యొక్కయు, కోటికి = సమూహాలకు, ధనములు = దానాలు, అసంఖ్యములు = లెక్క లేనన్ని, ఇచ్చి, అపుడు, బభ్రు = పచ్చని, వర్ణ = రంగుగల, హయ = గుఱ్ఱముల, ధట్టమున్ = గుంపును, ఏలెడున్ అంచున్ = పాలించుతాడని (జాతకరీతిని బట్టి తెలుసుకొని), ఆ తనయునిన్ = ఆ కుమారుని, బభ్రువాహనుఁడు, అని పేరు పెట్టి, చెలువు అందగన్ = సంతోషముగా, బంగరు తొట్లన్, పెట్టి, శోభన = మంగళ ప్రదమైన, విభవ = సంపద (యొక్క), ఆప్తిన్ = కలుగుటచేత (ఈ శుభమునందుటచేత), రంజలిరి = ఆనందమును పొందిరి.

*తాత్పర్యము :*

పండితులకు హితులకు బ్రాహ్మణులకు లెక్కలేనన్ని దానములనిచ్చి, ఆ శిశువు జాతక రీత్యా పచ్చని గుఱ్ఱముల పాలించే వాడౌతాడని తెలుసుకొని, అర్జున మలయధ్వజులు, బాలుడికి బభ్రువాహనుడని నామకరణం చేసి ఈ శుభము కలిగినందుకు సంతోషించారు.

"తన కులస్వామి తండ్రిని సుధాంబుధిఁ బోలుఁ
బాలబుగ్గల మించులీలఁ గనుటఁ,
దన పితామహుని బృందారకాధిపుఁ బోలు
రెప్పవేయక చూచురీతిఁ గనుటఁ.

దన వంశకర్త నుత్పలబాంధవునిఁ బోలు
గరము లర్మిలిఁ జాఁచి గారవిలుటఁ,
దన తాత యనుఁగుఁ దమ్ముని నుపేంద్రునిఁ బోలు
నల్లనల్లనఁ దప్పు టడుగు లిడుట,
ధరణి గాంభీర్య వైభవ దాన కృపలు
గలవని కనంబడఁగ, వేఱ తెలుప నేల ?"
యని గురుజనంబు లెంతయు నాదరింపఁ
జిన్నిబాలుండు ముద్దులు చిలుకుచుండె. 40

ఈ పద్యములో బభ్రువాహనుడి బాల్యచేష్టలు కవి వర్ణిస్తున్నాడు.

౧ పాలబుగ్గలన్ = పాలుగారుచున్న చెక్కిళ్ళతో, మించు = అతిశయించే, లీలన్ = విలాసమును, గనుటన్ = పొంది ఉండుటచేత, తన కులస్వామి = తన కురుకులానికి మూల పురుషుడైన చంద్రుని యొక్క, తండ్రిని = పాలసముద్రమును, బోలున్ = పోలి ఉన్నాడు.

సముద్రమున నీటి ఊటలవలె పాలసముద్రమున పాలబుగ్గలుండును. ఈ బాలుడు పాల బుగ్గలు కలిగియుండెను. కాబట్టి పాల సముద్రముతో పోలిక. బుగ్గ = సంతత ధారగా ఊరే నీరు a spring of water, a fountain.

౩. కరములు = చేతులు (కిరణములు), అర్మిలిన్ = ఇంపుగా, జాఁచి = చాపి, గార విలుటన్ = గారాబముగా ఉండుటచేత, తనవంశకర్త = మూల పురుషుడైన, ఉత్పలబాంధ వునిన్ = కలువల చెలియగు చంద్రుడిని, పోలున్ = పోలియుండును.

కరములు జాచి గారాబముగా ఉండుటచేత శిశువుకీ, కిరణములచేత చంద్రుడుకీ సామ్యము.

౨ రెప్పవేయక చూచు, రీతిఁ = విధము, గనుటఁ = (చేత), తన పితామహునిన్ = తన తాతయైన, బృందారకాధిపున్ = దేవతలరాజగు ఇంద్రుడిని పోలును.

దేవతలు అనిమిషులు, రెప్పపాటు వారికి లేదు. శిశువు రెప్పవేయక చూస్తుండును కాబట్టిపోలిక.

౪. అల్లనల్లనన్ = మెల్లమెల్లగా, తప్పుటడుగు = వ్యత్యస్తముగ అడుగులు, ఇడు టన్ = వేయుటచేత, తనతాత = ఇంద్రుని యొక్క, తమ్మునిన్ = ఉపేంద్రుని = వామన మూర్తిని, పోలున్.

శిశువు తప్పుటడుగులు వేయడముంటుంది. వామనుడు. బలిచక్రవర్తిని అర్థించినప్పుడు వ్యత్యస్తముగా మూడడుగులు వేశాడు, కాబట్టి సామ్యము.

అదితి కశ్యపులకు పుట్టినవాడు ఇంద్రుడు. వామనుడు కూడా ఆ దంపతులకు పుట్టిన వాడే, కాబట్టి ఇంద్రునికి తమ్ముడు—ఉపేంద్రుడు - అవుతాడు.

ఈ విధంగా ఆ బాలుడు తన పూర్వులను పోలి ఉండడము వల్ల ఆయా పూర్వుల గుణా లను కలిగి ఉంటాడని అనడము న్యాయం. అందుకే:—

దానన్ = అలా పోలి ఉండినందువల్ల, గాంభీర్య = గంభీరతయు (తన మనసు ఇతరు లకు తెలియ నీయకుండడ మన్న సుగుణము), వైభవ = ఐశ్వర్యమును, దాన = ఈవియు (ఇచ్చునట్టి స్వభావము), కృపలు = దయయు, గలవని కనంబడఁగన్ = ఉన్నవని ప్రత్యక్ష మవుతుండగా, వేఱ = ప్రత్యేకముగా, చెప్పనేలచెప్పడ మెందుకు, అని = ఈ రీతిగా అను కొని, గురుజనంబు = పెద్దలు, ఎంతయున్ = మిక్కిలిగా, ఆదరింపన్ = ముద్దు చేస్తుండగా, చిన్ని బాలుండు = బభ్రువాహనుడు, ముద్దులు చిలుకుచుండెను.

*విశేషము :*

దేవేంద్ర వైభవమని ప్రసిద్ధి. చంద్రుడు తన సర్వస్వమును అమృత రూపముగ దేవత లకు ఆహారముగా ఇచ్చేవాడు కాబట్టి గొప్పదాత. వామనుడు (విష్ణువు) జగములను పోషించే వాడు కాబట్టి కృపకు ప్రసిద్ధి.

పాల సముద్రమును పోలిన లోతును, ఇంద్రుడిని పోలిన వైభవమును, చంద్రుడిని పోలిన దానమున్ను, వామనుని (విష్ణుని) పోలిన దయయు, కలవాడవుతాడని పెద్దలు భావించారు.

*అలంకారము :*

శ్లేష, క్రమాలంకారము, స్వభావోక్తి

ఆడితప్పని ధర్మజు నసుఁగుఁ దమ్ముఁ
డా కుమారకుఁ జిత్రవాహనున కపుడు
వంశకరుఁగా నొసఁగి వేడ్క వారిచేత
నంపకముఁ గాంచెఁ దీర్థ యాత్రాభిరతిని. 41

*అర్థము :*

ఆడి తప్పని = అసత్యము పలుకని, ధర్మజు = ధర్మరాజు యొక్క, అనుఁగు తమ్ముఁడు = ప్రియమైన సోదరుడు (అర్జునుడు), ఆ కుమారకున్ = ఆ బభ్రువాహనుని, వంశ కరుఁగాన్ = పాండ్య వంశమును నిలువబెట్టే వానిగా, వేడ్కన్ = సంతోషముతో, అపుడు,

చిత్రవాహనునకు = మలయధ్వజ రాజునకు, నొసఁగి = ఇచ్చి, వారిచేతన్ = పాండ్యదేశస్థుల చేత, దీర్థయాత్రాభిరతిని = తీర్థయాత్రలుచేయా లన్న కోరికతో, అంపకముగా గాంచెన్ = వీడు కోలు పుచ్చుకున్నాడు.

తాత్పర్యము :

అసత్యము పలకని ధర్మరాజు ప్రియసోదరుడు కాబట్టి అర్జునుడు ఇచ్చిన మాట తప్ప కుండ చిత్రాంగద కుమారుని వంశకరునిగా మలయధ్వజుడి కిచ్చాడు. మూల్గుచూ కాకుండ వేడ్కతో నివ్వడం సుగుణము.

అలంకారము :

కావ్యలింగ.

చని యా దక్షిణపుణ్య భూమిఁ గనుచున్ సౌభద్ర తీర్థంబునం
దును స్నానం బొనరింపఁబోవ నట మౌనుల్ కొంద ఱోహో! నిలుం
డన ఘైత న్ముఖ పంచతీర్థములయం దత్యుగ్ర నక్రంబులుం
డును నూఱేఁడులనుండి; యిందు నొకనాఁడుం జేరరా దేరికిన్ 42

అర్థము :

చని = వీడుకోలందుకొని పోయి, దక్షిణ పుణ్య భూమిన్ = దక్షిణ దేశంలోని పుణ్య స్థలాలను, కనుఁగొనుచున్ = చూస్తూ, సౌభద్రతీర్థంబునందును = సౌభద్రము అన్న పేరుతో ఉన్న ఒక తీర్థంలో కూడా, స్నానంబు ఒనరింపన్ పోవన్ = స్నానము చేయబోగా, అట = అక్కడున్న, మౌనులు కొందఱు = కొందరు తాపసులు, "ఓహో, నిలుండు = ఆగండి, అనఘ = పాపములేనట్టి (అనగా పాపములను పోగొట్టునట్టి) ఏతత్ముఖ = ఇది మొదలుగా గల, పంచతీర్థములందున్, అయిదు తీర్థములలోను, నూఱేండ్లనుండి, అతి = మిక్కిలి, ఉగ్ర = భయంకరములైన, నక్రంబులు = మొసళ్ళు, ఉండును = ఉంటున్నాయి, (కాబట్టి), ఒకనాఁడున్ = ఒక్కనాడైనా, ఏరికిన్ = ఎట్టి వారికైనా, ఇందున్ చేరరాదు = వీనిలో దిగ కూడదు."

తాత్పర్యము :

వారి వీడుకోలందుకొని, అర్జునుడు దక్షిణ దేశంలోని పుణ్యస్థలాలను చూస్తూ వెళ్ళి సౌభద్రము అన్న తీర్థంలో కూడా స్నానమాడబోగా, అక్కడ ఉన్నమునులు అతన్ని ఆపుతూ "ఈ పంచ తీర్థాలలో భయంకరమైన మొసళ్లుండడం వల్ల నూరేళ్ళనుండి ఎవరూ వీటిలో స్నానం చేయరు"అని చెప్పారు.

*విశేషము :*

అనఘైతన్ముఖ "అన్నదాన్ని కొందరు అనఘ ! ఏతన్ముఖ" (పాపరహితుడా ! ఇది మొదలు) అనికూడా విడదీసి అర్థం చెబుతారు.

"సౌభద్ర తీర్థంబునందును" అన్న సముచ్చయము అంతకుపూర్వమే మరికొన్ని తీర్థాలలో స్నానమాడియున్నాడని తెలుపుతుంది.

*పాఠాంతరము :*

"అనఘా ! తన్ముఖపంచ...." = (పాపరహితుడా ! అది మొదలు...అని)

" 'మోక్షమునకుఁ బోవ మొసలెత్తుకొనిపోయె'
ననెడు వార్త నిక్కమగు నటంచు
గ్రుంక వెఱతు రెవ్వరును ; మీరలటుపోకుఁ"
డనిన నవ్వుకొనుచు నర్జునుండు, 43

*అర్థము :*

మోక్ష...పోయె : అనెడు లోకోక్తి, నిక్కమగును = నిశ్చయంగానే జరుగుతుంది, అటంచున్, అనుకుంటూ, ఎవ్వరును, గ్రుంకన్ = మునగడానికి, వెఱతురు = భయపడుతారు, (కాబట్టి) మీరలు అటుపోకుఁడు", అనినన్, నవ్వుకొనుచు = లోలోన నవ్వుకుంటూ, అర్జునుడు ......

*తాత్పర్యము :*

"మోక్షానికిపోతే మొసలెత్తుకు పోయిందన్నమాట నిజమౌతుంది, మీరక్కడికి పోవద్దు" అని ఆ మునులు హెచ్చరిస్తుండగా, అర్జునుడు నవ్వుకుంటూ — (తర్వాతి పద్యంతో అన్వయము,

మామూలుగా మంచిచేయబోతే కీడు కలిగినప్పుడు "మోక్షమునకుఁ బోవ మొసలెత్తుకొనిపోయె''నన్న లోకోక్తిని వాడతారు. ఇక్కడ నిజంగా మోక్షం కొఱకే అర్జునుడు తీర్థస్నానం చేయబోతే మొసలి పట్టుకుంటుంది. ఈ విధంగా (అక్షరాలా) అతికిపొయ్యేలాగ లోకోక్తుల్ని వాడడం చేమకూర కవికి వెన్నతో పెట్టిన విద్య.

అర్జునుడు నవ్వుకొనడ మెందుకంటే - ఈ వెఱ్ఱిమునులకు నాబలపరాక్రమాలు తెలియక నన్నే భయపెట్టున్నారుకదా యని. అంతే కాక, తన మంచికోసం చెప్పుతున్న వారిని అవమాన పరిచినట్లు బిగ్గరగా నవ్వడము సభ్యవర్తన కాదు.

అలంకారము :

లోకోక్తి.

"ఏను దీర్థము లాడఁగ నేఁగుదెంచి
యేను దీర్థము లాడక యివలఁ జనుట
పౌరుషమె ?" యంచుఁ గ్రుంకఁబో వారిచరము
పట్టెఁ; బట్టిన నమ్మహా బాహుబలుఁడు. 44

అర్థము :

ఏను తీర్థము లాడఁగన్ = ఐదుతీర్థములలో స్నానము చేయాలని, ఏఁగుదెంచి = వచ్చి, ఏను = నేను, తీర్థములాడక = స్నానాలు చేయకుండానే, ఇవల = ఇంకొకచోటికి, చనుట = పోవుట, పౌరుషమె? = పౌరుషముగలవారు చేయదగిన పనేనా ? (కాదు), అంచున్, క్రుంకఁబోన్ = మునుగబోగా, వారిచరము = మొసలి, పట్టెన్ = అతడిని పట్టుకుంది, పట్టినన్, ఆ మహాబాహుబలుఁడు = గొప్ప భుజబలముగల ఆ అర్జునుడు......(తరువాతి కన్వయము).

తాత్పర్యము :

'అయిదు తీర్థాల్లో స్నానం చేయడానికి వచ్చి అలా చేయకుండ తిరిగిపోవడం పౌరుషమవుతుందా ?'' అని అర్జునుడు స్నానమాడబోగా, మొసలి పట్టుకుంది; అప్పుడు అర్జునుడు తన భుజబలముతో...

పాఠాంతరము :

"యేను తీర్థములాడనో డివలఁ జనుట" లాడన్ ఓడి ఇవలన్.

— వేదంవారు

అలంకారము :

యమకము.

ఎడమ కరంబుననే య
య్యెడ మకరముఁ బట్టి బయిటి కీడిచి వైవన్
వడి భూమికఁ జూపిన నై
వడిఁ తొల్లిటిరూపు వాసి యెసంగన్. 45

అర్థము :

ఎడమ కరంబుననే = ఎడమచేతితోనే, అయ్యెడన్ = అప్పుడు, మకరమున్ = మొసలిని, పట్టి = పట్టుకొని, బయిటికిన్ = వెలుపలికి, ఈడిచి వైవన్ = ఈడ్చిపడవేయగా, వడిన్ = ఒక్క నిముసములో, భూమికన్ = వేషమును, చూపిన కైవడిన్ = చూపించిన విధంగా, తొల్లిటి రూపు వాసి = మొదటి మొసలి రూపాన్ని విడిచిపెట్టి, వాసియెసంగన్ = చక్కదనంతో...

తాత్పర్యము :

అర్జునుడు ఎడమ చేత్తోనే మొసలినిపట్టి బయటి కీడ్చివేశాడు. ఆ మొసలివేషం మార్చుకొన్నవిధంగా, మొసలి రూపాన్ని వదలి, చక్కదనంతో — (తర్వాతి పద్యంతో అన్వయం).

విశేషము :

రూపుమారడం చూస్తే ఇంతవరకూ మొసలి వేషం వేసుకొని ఉన్నదా అనిపించింది.

పాఠాంతరము :

"వడిభూమిక వాసిన కైవడి"

పై విశేషాన్ని ఇది ఇంకా బాగా వ్యక్తం చేస్తుంది. శబ్దాలంకారానికి మరికొంత బలం చేకూరింది, (వడిభూమిక వాసిన కైవడి తొల్లిటి రూపువాసి వాసి యెసంగన్).

అలంకారము :

ఉత్ప్రేక్ష, యమకము, అనుప్రాసము.

వట్రువ గుబ్బలుం దొగరు వాతెఱయుం జిఱునవ్వు వెన్నెలల్
తొట్రిలు ముద్దుమోమును దళుక్కను మేను వెడంద సోగయై
వట్రిలు కన్నుదోయి నిడువాలుఁ గురుల్ బటువుం బిఱుందు లేఁ
గుట్రు నునుం గవున్ గలిగి కోమలియై యది మ్రోల నిల్చినన్. 46

అర్థము :

అది = ఆ మొసలి, వట్రువగుబ్బలున్ = గుండ్రముగానున్న కుచములునూ, తొగరు = ఎఱ్ఱని, వాతెఱయున్ = అధరమునూ చిఱునవ్వు వెన్నెలల్ = వెన్నెలవంటి చిఱునవ్వులతో, తొట్రిలు = అతిశయించిన, ముద్దుమోమును = అందమైన ముఖమునూ, తళుక్కను = ప్రకాశిస్తున్న, మేను = దేహమును, వెడంద = విశాలమై, వట్రిలు = తీరుకల్గిన, కన్నుదోయి =

కన్నుల జంటనూ, నిడు వాలు = మిక్కిలి పొడవైన, కురుల్ = తలవెంట్రుకలను, బటువు = గుండ్రముగా ఉన్న, పిఱుందు (ను) లేఁత = లేతదై, కుఱ = సన్ననిదై, నును = కోమలమై (ఉన్న) కవున్ = నడుమును, గలిగి = కలిగియుండి, కోమలియై = సుకుమారియై (అది = ఆ మకరము) మ్రోలన్ = అర్జునుడి ఎదుట, నిల్చినన్ = నిల్వగా - తర్వాతి పద్యంతో అన్వయము.

విశేషము :

ఈ పద్యంలో ఉపమానాలను ఉపయోగించకుండానే, కవి ఆ అంగన సౌందర్యాన్ని సహజంగా వర్ణించడము ఒక సొగసు.

అలంకారము :

స్వభావోక్తి.

ఆ లోలనయనఁ గనుఁగొని
యాలోచనఁ జేసె నృపతి యద్భుత మతియై
యాలో; నిది యచ్చర ప్రో
యాలో కా కల్ల మరుని యాలో యనుచున్. 47

అర్థము :

ఆ లోలనయనన్ = చలిస్తూన్న కన్నులు గల ఆ కాంతను, కనుఁగొని = చూచి, నృపతి = అర్జునుడు, అద్భుతమతియై = ఆశ్చర్య పడినవాడై, ఆలోన్ = అంత లోపల, ఇది = ఈ కాంత, అచ్చర ప్రోయాలో = అప్సరః కాంతయో, కాక, అల్ల మరునియాలో = ఆ మన్మథుని భార్యయేమో, అనుచున్, ఆలోచన చేసెన్.

తాత్పర్యము :

ఆమెనుచూచి, ఆశ్చర్యపడి అర్జునుడు, "ఇది అచ్చరకాంతయా లేక మన్మథుని భార్యయైన రతీదేవియా'' అనుకొన్నాడు.

విశేషము :

కాంత రూపుమారి నిలిచినప్పుడు ఆమె దృష్టులు నాలుగు వైపులా చూస్తూ చంచలంగా ఉండడం సహజమే, కాబట్టి, 'లోలనయన'అని ప్రయోగం.

అలంకారము :

సందేహము, అనుప్రాసము.

ఈబాల మోమునకు నా
జాబిల్లికి నెంతదవ్వు; సరివచ్చునొకో,
యీబిడ చనుఁగవ కొక మె
ట్టా బంగరు గట్టు తక్కువౌ నెంచంగన్. 48

అర్థము :

ఈ బాల = ఈ చిన్నదాని యొక్క, మోమునకున్ = ముఖమునకును, ఆ జాబిల్లికిన్ = ఆ చంద్రునకును, ఎంతదవ్వు = చాలా దూరము (వ్యత్యాసము), కలదు, సరివచ్చునొకో = సరిరాగలడా.; ఈబిడ = ఈమె యొక్క, చనుఁగవకు = కుచద్వయమునకు, ఆ బంగరు గట్టు = ఆ బంగారపు కొండ-మేరు పర్వతము, ఎంచంగన్ = ఆలోచించగా, ఒక మెట్టు = ఒక కొంచెము, తక్కువ ఔన్.

తాత్పర్యము :

అర్జును డామెను చూచి "ఈమె ముఖానికి చంద్రుడు సరిపోలడు ; ఆలోచిస్తే ఆ బంగారు కొండ కూడా ఈమె చనుగవకన్నా ఒక మెట్టు తక్కువే అవుతుంది" అని అను కుంటున్నాడు.

విశేషము :

పద్యము చిన్నది ; ఉపమానాలు మన కవులు విశేషంగా ఉపయోగించినవే—పాతవే. ముఖానికి చంద్రుడు, కుచాలకు కొండలు, మాటలు సర్వసాధారణంగా వాడుకలో ఉన్నవే.

అయినా ఈ పద్యములో ఒక కొత్తదనం కనబడేలాగ మన కవి తన గడుసుతనంతో రచించాడు చూడండి :

"ఈ బాల మోమునకు నా జాబిల్లికి నెంత దవ్వు సరివచ్చునొకో" అన్నాడు. చంద్రుడు కొన్ని లక్షల మైళ్ల దూరంలో ఉన్నాడన్నది ప్రకృతి సత్యము. ముఖము చంద్రుడికన్న అంద మైనదని కవి భావము.

(౧) "బాల ముఖమెక్కడ, ఆ చంద్రు డెక్కడ ?—ఎంత వ్యత్యాసము ! హస్తిమశ కాంతరము. కాబట్టి సమానము కాగలడా ?" అని అర్థం చేసుకోవచ్చును.

(౨) లేదా, కొంతసాటి వస్తాడనుకున్నా, ఎంత దవ్వుసరివచ్చునొకో' = ఎంతవంతు- ఏమేరకు-ఏ శాతం సరిపోతాడు ? చాల తక్కువ వంతు సరిపోతాడు అని అన్వయించవచ్చును.

(౩) లేదా, వేదమువారు చెప్పినట్టు చంద్రు డున్నది చాల "దూరము గావున వచ్చి ప్రక్కను సరిగా నిలువనేరఁడని" చమత్కారము గ్రహించవచ్చును.

ఈ విధంగానే పద్యములో రెండవ భాగము : "ఈబిడ చనుఁగవ కొక మెట్టా బంగరు గట్టు తక్కువౌ నెంచంగన్" దీనిలో బంగరుగట్టు (మేరువు) ఒక కొండ ; కుచానికి ఉపమానము, కొండను మించిన కాఠిన్యమూ ఉన్నతి కలదని కవి భావము. దీని అర్థము.

(౧) చనుగవకు ఒక మెట్టు (= మేడా, కొండా, ఎక్కడానికి ఉంచిన మెట్లలో ఒకటి —— సోపానము) వంటిది ఆ బంగరుగట్టు. ఈలాంటివి మరికొన్ని మెట్లు ఎక్కితేనే స్తన శిఖరము అందదు ; కాబట్టి తక్కువౌ నెంచంగన్ - అని అర్థం చేసుకోవచ్చును.

మెట్టు = సోపానము, కొండ, అంచీ అని అర్థాలున్నాయి.

(౨) లేదా, ఆ చను గొండలదగ్గర ఈ బంగరుకట్టు 'ఒక మెట్టా ?' అనగా ఇదీ ఒక కొండేనా అని అన్వయించాలి. ఆలోచిస్తే ఆ బంగరుగట్టు తక్కువే అవుతుంది.

(౩) లేదా, 'ఒక మెట్టు ఆ బంగరుగట్టు తక్కువౌను ఎంచంగన్' అని పదవిభజన చేసి, 'ఎంచంగన్ = లెక్కపెడ్తే, ఒక మెట్టు తక్కువవుతుంది.' అని అన్వయం. స్తనాలు పదిమెట్లు అయితే ఈ బంగరుగట్టు తొమ్మిది మెట్లే ఉంటుందన్న మాట.

అలంకారము :

వ్యతిరేకము, వినోక్తి.

నడు మెంత సైక ? మోహో !
పిడికిటిలో నణఁగు ; బెళుకు బేడిస మీలం
గడ కొత్తుఁ గన్ను ; లౌరా !
జడ యందము జూపఁ బాప జగతిం గలదే. 49

అర్థము :

నడుము, ఎంతసైకము = ఎంత సన్ననిది!, ఓహో = ఆశ్చర్యము, పిడికిటిలోన్ = ఒక్కపిడికిటిలో, అణఁగున్ = ఇమిడిపోతుంది గదా ! బెళుకు = మెరుస్తున్న, బేడిసమీలన్ = బేడిస చేపలను, కన్నులు, ఔరా = అద్భుతము, కడకు ఒత్తున్ = ప్రక్కకుతోసి తిరస్కరిస్తాయి, జడ యందము, చూపన్ = ఇట్టిది అని చెప్పడానికిగాని, పాపన్ = వర్ణన ముగించి విడిచిపెట్టేందుకుగాని, జగతిన్ = ప్రపంచంలో, కలదే = సాధ్యమౌతుందా ?

తాత్పర్యము :

ఓహో ! ఈమె నడుము, పిడికిటిలో అణగేంత సన్నంగా ఉంది. ఈమె కళ్లు బేడిస చేపల్ని ప్రక్కకు త్రోసేసే విధంగా ఉన్నాయి. ఇక ఈమె జడ అందము పోల్చి చెప్పేందుకు గాని, చెప్పకుండా విడిచిపెట్టేందుకు గాని సాధ్యంకాదు.

విశేషము :

గడకొత్తు—గడ అంటే గాలం వాడు తగిలించే కఱ్ఱ. కఱ్ఱ చేపల్ని గాలంవేసి పడతాయి అని.

పాఁప జగతిఁ - పాప అంటే పాము సంబంధమైనది సాధారణంగా జడనుపాముతో పోల్చడం కవుల కిష్టం. ఆ విధంగా పోల్చేందుకు, ఈమె జడతో పోల్చగలిగే పాము, పాఁప జగతిన్ = తాను చూచిన నాగలోకంలో గూడా లేదని చమత్కారము.

పాఠాంతరము :

"జడ యందము జెప్పఁగిప్ప జగతిం గలదే?"

—తిరుపతి కవులు.

"జడయందము జెప్ప బాపజగతిం గలదే"

అన్న పాఠాలలో అర్థం స్పష్టంగా లేక పోవడమే కాక, కవికి ప్రియమైన శబ్దాలంకారం కూడా పోతుంది.

అలంకారము :

శ్లేష, వ్యతిరేకము, అనుప్రాస.

అని యాక్రీడి మనంబునం బొగడి 'యుగ్రాకార నక్రంబవై
మును పట్లుండిన దేమి? మేలు చెలువంపుం గల్కివై యిప్డు డొ
ప్పినదే? మెవ్వరి భామినీ మణివి? నీ పేరేమి?' నా నిట్లనున్,
"విను మో భూవర! యానుపూర్విగఁ బురావృత్తాంత మాద్యంతమున్.

అర్థము :

అని, ఆ క్రీడి = ఆ అర్జునుడు, మనంబునన్ = మనస్సులో, పొగడి = మెచ్చుకొని, ఉగ్రాకార = భయంకరమైన రూపంతో, నక్రంబవు = మొసలివి, అయి, మునుపు, అట్లు, ఉండినది ఏమి? = ఎందుకున్నావు? మేలు చెలువంపు = మిక్కిలి అందమైన, కల్కివై = సుందరివై, ఇప్పుడు, ఒప్పిన దేమి = ఉండడానికి కారణమేమిటి? ఎవ్వరి భామినీమణివి = ఎవరికి చెందిన స్త్రీరత్నమవు? నీపేరేమి?" నాన్ = అనగా, (ఆమె) ఇట్లను = ఈ రీతిగా బదులు చెప్పింది: "ఓ భూవర = ఓ రాజా, పురావృత్తాంతము = నా పూర్వచరిత్రము, ఆను పూర్విగన్ = మొదటినుంచి, ఆది అంతమున్ = సమస్తము, వినుము = చెప్పెదను, వినుము.

తాత్పర్యము :

ఈ విధంగా అర్జునుడు మనస్సులో ఆమె అందాన్ని మెచ్చుకొని ఇంతదాకా భయంకర మైన మొసలిగా ఉన్నదానవు ఈ రూపం ఏలాగు పొందగలిగావు నీవెవరు ?" అని ప్రశ్నించగా, "నాచరిత్రం మొదటినుంచి చెప్పుతాను, వినండి" అని నంద చెప్పసాగింది.

విశేషము :

"ఉగ్రాకార నక్రంబవై." — "మేలు జెలువంపుం గల్కివై" అని ఆమెరెండు రూపాలనూ వర్ణించడానికి వాడిన పదాలలో ఉన్న తూగు గమనించ దగింది - ఒకటి సంస్కృతము. ఒకటి తెలుగు.

"అనుపూర్విగన్" = ఏ విషయం వెనుక ఏ విషయం జరిగింది అన్న క్రమం తెలిసేట్లుగా నా కథచెబుతాను అంటే, 'మొదటి నుండీ' అనడం కన్నా సుకరంగా ఉంటుంది.

"భూవర - ." ఆమె అర్జునుడి ఆకారమూ, పరిచారక సమూహము చూచి రాజని పోల్చుకో గలిగింది. లేదా, నారదుడు చెప్పిన దాన్నిబట్టి (63 వ పద్యం) ఇతడే అర్జునుడయి ఉంటాడని తెలుసుకొని ఉంటుంది.

## నంద చెప్పిన విషయము :

ఏ నందయనెడు నచ్చర
చానఁ, దరు ణేందు ధరుని సఖుని యనుంగ౯
నా నెచ్చెలులు త్రిలోకీ
యానేచ్ఛలు గలరు నల్వు రతుల శుభాంగుల్. 51

ఇది మొదలు 68 వ పద్యము వరకు నంద చెప్పిన పూర్వ కథ.

అర్థము :

ఏన్ = నేను, నంద అనెడు = నంద అనే పేరుగల, అచ్చర చానఁ = అప్సరసను, తరుణ ఇందు ధరుని = లేత చంద్రుని (చంద్రరేఖను) ధరించిన శివుని యొక్క, సఖుని = స్నేహితుడైన కుబేరుని యొక్క, యనుంగ౯ = ప్రేయసిని; నా నెచ్చెలులు = నా స్నేహితురాండ్రు, త్రిలోకీ = మూడు లోకములలో, యాన = తిరుగుటయందు, ఇచ్ఛలు = ఇష్టము కల వారు, అతుల = సాటిలేని, శుభఅంగుల్ = శోభతో కూడిన శరీరాలు కలవారు, నల్వురు = నలుగురు, కలరు = ఉన్నారు.

*తాత్పర్యము :*

"నేను నంద అనే అప్సర స్త్రీని. కుబేరుని ప్రేయసిని. నా స్నేహితురాండ్రు మూడు లోకాల్లోనూ తిరగాలనే వాంఛకలవారు. సుందరులు మరొక నలుగురున్నారు."

*విశేషము :*

తన విభుని పేరు చెప్పేందుకు సంకోచించి యేమో, ఆ అచ్చర 'తరుణేందు ధరుని సఖుని యనుంగఁ' అని తెలియపరుచుకుంది. మరొక విధంగా, అంతటి వాని స్నేహితుడి ప్రియురాలిని అని తన గొప్పతనం కూడా చెప్పినట్లయ్యింది.

ఆ స్నేహితురాండ్ర కోరిక మీదనే వీరు షికారు బయలుదేరా రని భావించాలి.

ఈ పద్యంలో 'సౌకుమార్యం' కనబడుతూంది.

*అలంకారము :*

పర్యాయోక్తి, అనుప్రాస.

వారు లలిత పద్మ సౌరభేయి సమీచి
యనెడుపేర్లు గలుగు నట్టివారు;
జగములెల్లఁ జూచి చనుదెంచుచో మేము
వనధికాంచి నొక్క వనము కాంచి. **52**

*అర్థము :*

వారు = ఆ చెలులు, లలిత, పద్మ, సౌరభేయి, సమీచి, అనేపేర్లు కలవారు, (మేమయిదుగురమూ) జగములు, ఎల్లఁ చూచి = అన్ని లోకాలూచూచి, చనుదెంచుచోఁ = తిరిగి వస్తుండగా, వనధికాంచిఁ = (సముద్రమును మొలనూలుగా కలిగిన) భూలోకంలో, ఒక్క వనముఁ = ఒక అడవిని, కాంచి = చూచి, మేము...తరువాతి కన్వయము.

*తాత్పర్యము :*

నా చెలికత్తెలు లలిత, పద్మ, సౌరభేయ, సమీచి అన్న పేర్లు కలవారు. మేమయిదుగురమూ అన్ని లోకాలూచూచి తిరిగి పోతూండగా, భూలోకంలో ఒక అడవి చూచి....(తర్వాతి పద్యంతో అన్వయం.

*విశేషము :*

భూమిచుట్టూ సముద్రం ఉంటుంది కాబట్టి సముద్రాన్ని భూమికి మొలనూలు కవులు పోల్చారు.

మొదటి మూడు పాదాల్లోనూ ఏ విశేషం లేకుండా సాధారణంగా నడిపించి, నాల్గవ పాదంలో వనధి కాంచి నొక్క వనము కాంచి అంటూ పద్యంలో ఒక అందాన్ని పొదిగాడు కవి.

అలంకారము :

అనుప్రాస.

"విహరించుఁ మలయానిలం బిచటఁ; దావిం జిల్కి నెమ్మేని యా
వి హరించుఁ; బికి నాదముల్ చెవికిఁ గావించుఁ జవుల్; పొద మా
సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యా! హాళి వాటిల్లెడుఁ
స హకారాళి పదంబుఁ జూడఁగ వయస్యా! హాళి యానేకదా!" 53

ఆ అడవిని చూస్తూ ఆ అయిదుగురూ ఈ విధంగా చతురోక్తు లాడుకుంటున్నారు :

అర్థము :

'ఇచటఁ = ఈ వనములో, మలయానిలంబు = మలయ మారుతము, విహరించుఁ = మంద మందగా వీస్తున్నది సుమా' అని అన్నది.

రెండవ చెలికత్తె - (ఔను, చక్కగా చెప్పావు, అంతేకాదు), తావిఁ = కమ్మని వాసనలను, చిల్కి = చల్లి, నెమ్మేని = చక్కని శరీరముల యొక్క, ఆవిఁ = ఉష్ణమును, హరించుఁ = పోగొట్టుతుంది కూడా, అన్నది. (మరొక అర్థము)' నీవు విహరించునని చెప్పావు గదా, ఆ మాటలో విఁ = 'వి' అన్న అక్షరాన్ని, చిల్కి = తీసివేస్తే, 'హరించుఁ' మిగులుతుంది. కనుక ఆవిని, హరిస్తుంది, అని చమత్కారం.

మూడవది, - పికినాదముల్ = ఆడకోకిలల కంఠధ్వనులు, చెవికిఁ = చెవులకు, చవుల్ = రుచులను, కావించుఁ = కలిగిస్తున్నవి, (చెవులకు విందుచేస్తున్నవి అని) లేక, పికి నాదముల్, చెవికిగాఁ = చెవుల సంతోషం కోసము, వించుఁ జవుల్ = రుచివంతములగు పాటలను, విన్చును (వినిపించును) అని.

కొందరు వ్యాఖ్యాతలు 'నాదముల్ = 'న' అను అక్షరమును కలిపినవి, కాఁ = అగుచు, వించుఁ = వినుచుఁ - వినునట్లు చేయును, కావించు లోని 'వించు' అన్న మాటకు నకారము చేరగా 'వినుచు' అవుతుంది అన్న చమత్కారం గూడా ఉందన్నారు.

నాల్గవస్త్రీ, ''వయస్యా = చెలీ, ఆ సహకార = ఆ కనబడుతున్న తియ్యమామిడిచెట్ల యొక్క, ఆళీ = వరుస ఉన్న, పదంబుఁ = స్థలాన్ని (మామిడితోపును) చూడఁగఁ =

చూడడానికి, హాళి = ఆసక్తి, పాటిల్లెడుఁ = కలుగుతున్నది, వోదము = రమ్మ వోదాము, లేక, సహకారాళి పదంబుఁ, చూడగఁ = చూచినయెడల, హాళి = సంతోషము, వాటిల్లెడుఁ = కలుగుతుంది, కనుక, వోదము.

'అయిదవ యువతి,' 'బాగా చెప్పావు' సహకార = 'హ'కారంతో కూడిన, ఆళి పదంబు = 'ఆళి' అన్న పదము, చూడఁగఁ, వయస్యా, హాళియౌనే కదా = 'హాళి' అన్న మాట అవుతుందికదా. 'ఆళి' కి హకారంచేరిస్తే, హ్ + ఆళి = 'హాళి' అవుతుందని చమత్కారం. కనుక తప్పక సంతోషం కలుగుతుం దని భావం, లేక, సహకార = సాయముచేసే, ఆళి = చెలికత్తెలయొక్క, పదంబు = స్థానము, చూడగా సంతోషము కల్గుతుంది.

మరొక అర్థాంతరం : సహకార = తియ్యమామిడి చెట్లయందలి, ఆళిపదంబు = తుమ్మెదల పాటలు చూడగా = వింటే, సంతోషం కల్గుతుందికదా. అని చెప్పుకోవచ్చు.

అలంకారము :

వక్రోక్తి, యమకము,

అని యిత రేతర చతురో
క్తి నిగుంభన మెఱయ నరిగి తేఁకువ నందున్
ముని యొకఁడు తపము సేయం
గని యది విఘ్నంబుసేయఁ గడఁగి కడంకన్. 54

అర్థము :

అని = ఈరీతిగా, ఇతర ఇతర = ఒకరిని మించి ఒకరు, చతురోక్తి = చమత్కార వచనముల, నిగుంభన = పొందిక-కూర్పు, మెఱయఁ – విశదమయ్యేలాగ, అరిగి = పోయి, అందుఁ = ఆ అడవిలో, ముని ఒకఁడు తపముచేయఁ కని = ఒక ముని తపస్సు చేస్తుండగా చూచి, తేఁకువన్ = తెగువతో (తెంపరితనముతో), అది = ఆ తపస్సును, విఘ్నంబుచేయన్ భంగము చేయడానికి, కడంకఁ = పూనికతో, కడఁగి = ప్రయత్నించి - ......తరువాతి కన్వయము.

తాత్పర్యము :

"ఈ విధంగా చతురోక్తులాడుకుంటూ మేమా అడవిలోకి పోయి, అక్కడ ఒక ముని తపస్సు చేసుకుంటూ ఉండడం చూచి, తెంపరితనముతో ఆ తపస్సుభంగం చేయాలని ప్రయత్నించగా......

విశేషము :— తాపసులను చూస్తే అప్సరసలకు తపస్సు భంగం చేయాలని కోరిక పుడుతుంది కాబోలు :

లేక, ఇంద్రుడిని చూచి నేర్చుకున్నారా ? యథారాజా తథా ప్రజా అంటారుకదా !

ఇతరేతర - ఇంకా ఈవిధమైన చతురోక్తులు అనేకం ఆడుకుంటూ వారు వెళ్ళారని తేటపడుతుంది.

నెఱికురులు, గేలుఁజిగురులు,
నిఱిచన్నులు, విరివికన్ను, లించుకకౌనుల్,
చిఱుదొడలు, నంచనడలున్,
మెఱపుల యొఱపులు ఘటింప, నిలిచినటింపన్. 55

అర్థము :— నెఱికురులు = వంకరలు తిరిగిన తలవెండ్రుకలును, కేలు చిగురులు = చిగుళ్ళవలె ఉన్న చేతులును, ఇఱి చన్నులు = క్రిక్కిరిసి ఉన్న కుచములును, విరివి కన్నుల్ = విశాలములైన కన్నులును, ఇంచుక కౌనుల్ = మిక్కిలి సన్నగా ఉన్న నడుములును, చిఱుతొడలు = చిన్న తొడలును, అంచనడలున్ = కులుకుగల నడకలును, (ఈ అన్నిటితో). మెఱపుల వలె మెరుస్తున్న, ఒఱపులు = అందములు, ఘటింపన్ = సమకూడే విధంగా, నిలచి = ఎదుట నిల్చి, నటింపఁగా = నాట్యము చేయగా - (లేక ఏదోపని ఉన్నట్లు నిలిచి నటిస్తూ తిరుగగా).

తాత్పర్యము :— "మేము, వంకరలు తిరిగిన తలవెండ్రుకలతోనూ చిగుళ్ళలాగ ఉన్న చేతులతోనూ, బిగువైన చనుగవతోనూ, విశాలమైన కన్నులతోనూ, సన్నని నడుముల తోనూ, చిఱుతొడలతోనూ, వయ్యారపు నడకలతోనూ, మెరపు తీగలలాగా అందాలు చిలికిస్తూ ఆ ముని ఎదుట నాట్యము చేస్తుండగా...తర్వాతి పద్యముతో అన్వయం.

విశేషము :— ఆ యువతులు కదుల్తున్నప్పుడు వారి లావణ్యము మెఱపుతీగలలాగా మెరుస్తూ ఉందని భావము.

అంచ నడలు అన్నది ఒక పలుకుబడి ; దీని అర్థము ఒయ్యారపు నడక, లేక మంద గమనము. ఈ పద్యములో ఆ పలుకుబడి అర్థాన్నే ఊహించాడు కవి అనడం న్యాయము.

ఈ పద్యంలో కూడా అలంకరణల సహాయం గాని కావ్య అలంకారాల సాయముగాని లేకుండానే కవి వారి అందాన్ని సహజ సిద్ధంగా, చక్కగా వర్ణించాడు. పద్యం నడక కూడా, ప్రతిచరణ అనుప్రాసతో, మెరపుల యొరపునకు తగినట్లుగానే పరుగెడుతూంది.

మెరపులు క్షణమాత్రమే ఉంటాయి. కాని వీరు ఆ మెరపుల యొరపు కలిగి కూడా నిలిచి నటించడం విశేషము.

పాఠాంతరము :— 1. "ఇఱుకు చనుల్......"
2. "మెఱపుల యొఱపులు ఘటించి నిలిచిన యంతన్"
— తిరుపతివారు.

అలంకారము :— స్వభావోక్తి, ఉపమ, అనుప్రాస.

మా పొలు పొకింత గనుఁగొని
తాపసుఁ డటు, వలపుపేరు దైవ మెఱుంగుఁ జా,
శాప మొసఁగె మకరులుగాఁ
గోప రసావేశ రూక్ష కుటి లేక్షణుఁడై. 56

అర్థము :— మా పొలుపు = మా సౌందర్యం, ఒకింత = కొంచెము, కనుఁగొని, అటన్, తాపసుఁడు = మౌని, వలపుపేరు దైవమెఱుంగున్ = ప్రేమించే సంగతి పరమాత్మకే తెలియాలి కాని, కోపరస = కోపరసముయొక్క, ఆవేశ = ఆవేశము కలుగుటవల్ల, రూక్ష = తీక్షణమై, కుటిల = క్రూరమయిన, ఈక్షణుడై = చూపులుకలవాడై, మకరులుగా = మొసళ్ళగునట్లు, శాపమొసంగెఁ జా = శాపం ఇచ్చాడు.

తాత్పర్యము :— మమ్ములను చూచి ఆ మౌని ప్రేమించడం మాట అటుండగా, కోపావేశంతో చూస్తూ మొసళ్ళుకమ్మని శపించాడు.

విశేషము :— వాళ్ళు సహజసౌందర్యముతో ఉన్నారు. కాబట్టి వారి 'పొలుపు కని' అనడం సమంజసం.

తా మనుకున్నట్టు వలపు కలగక, దానికి పరమ విరుద్ధమైన కోపావేశం కలిగిందన్న సూచన 'వలపుపేరు దైవమెఱుంగుఁ జా' అన్న మాటలలో తేటపరిచాడు.

అలంకారము :— అసంగతి.

అందులకుఁ జాల భయపడి
యందఱ మడుగులకు వ్రాలి యతి దీనతతోఁ
గొందలపడ నపు డాతని
డెందము దైకొనియె నక్కటికపుం బెంపున్. 57

అర్థము :— అందులకున్ = ఆ శాపమునకు, చాలభయపడి, అందఱము = మేము యిదుగురమూ. అడుగులకున్ వ్రాలి = ఆ ముని పాదాలపై పడి, అతిదీనతతోన్ = మిక్కిలి దైన్యంతో, కొందల పడన్ = కలతపడగా, అపుడు ఆతని, డెందము = మనసు, అక్కటికపు = దయకు సంబంధించిన, పెంపున్ = అతిశయాన్ని, కైకొనియెన్ = పొందింది. మా దీనత్వము చూచినందువల్ల ఆ మునికి దయకలిగిందని భావము.

తాత్పర్యము :— ఆ శాపానికి భయపడే మేమందరము అతని పాదాలమీద పడగా, అతని మనసులో దయ కలిగింది.

పాఠాంతరము :— "........అపుడాతఁడు
నందఱఁ గనుఁగొంచు బలికె నతికృపతోడన్.
— తిరుపతివారు.

ఈ పాఠములో 'అందఱ' అన్నమాట ఈ చిన్నపద్యములో రెండుసార్లు వస్తుంది; అంతేకాదు. దీని తరువాతి పద్యములో 'శీతలదృష్టిఁ జూచి' 'కృపతోడన్' అన్నమాటలలో ఈ భావమే కనబడుతుంది.

శీతల దృష్టిఁ జూచి మునిసింహుఁడు "నా వచనం బమోఘ మో
భీతమృగాక్షులార? మది బెగ్గిలనేల యిఁకన్, వినుండు; మీ
చేత గృహీతుఁడై సలిలసీమను నెవ్వఁడు వెల్వరించు మి
మ్మాతఁడె శాపమోక్షకరుఁ డయ్యెడుఁ బొం"డనిపంచెఁ బంచినన్. 58

అర్థము :— శీతలదృష్టిన్ = (రూక్ష కుటిలేక్షణములకు బదులు) చల్లని చూపుతో, చూచి, మునిసింహుఁడు = మునిశ్రేష్ఠుడు, "నా వచనంబు = నామాట, అమోఘము = వ్యర్థం కానేరదు, ఓ భీతమృగాక్షులార = బెదిరినలేడివంటి కన్నులుకల కాంతలారా, మదిన్ = మనస్సులో, బెగ్గిలనేల? = దిగులుపడడ మెందుకు?, (అనవసరము అని) వినుండు, ఇఁకన్ = ఇకమీద, మీచేతన్ గృహీతుఁడై = (మొసళ్ల ఆకారంలో ఉండే) మీచేతపట్టుబడ్డవాడై, మిమ్ము, ఎవ్వఁడు, సలిలసీమను = జలాశ్రయమునుండి, వెల్వరించున్ = వెలుపలి కీడుస్తాడో, ఆతఁడే, శాపమోక్షకరుఁడు = ఈ శాపమునుండి మిమ్ముల తప్పించేవాడు, అయ్యెడున్ = అవుతాడు, పొండు", అని, (మమ్ములను) పంచెన్ = పంపించెను, పంచినన్ = అట్లుపంపించగా...తరువాతి కన్వయము.

తాత్పర్యము :— మమ్ముల దయతో చూస్తూ ఆ ముని, "నామాట తప్పనేరదు, మీరు చింతించడం వృథా, అయినా వినండి, మొసళ్ళ రూపంలో ఉన్న మీరు పట్టుకున్నప్పుడు, మిములనుమ్మ నీటిలోపల నుంచి ఎవడు బైటికీడ్చివేస్తాడో వాడే మీశాపము పోగొడ్తాడు, ఇక పొండి" అంటూ మమ్మల్ని పంపించగా...తర్వాతి పద్యంతో అన్వయము.

విశేషము :— అమోఘమైన వచనం కలవాడు కనుకనూ, దయతో శాపమోక్షము గురించి చెప్పాడు కాబట్టి నంద అతడిని 'మునిసింహుఁడు' అని చెప్పడము సమంజసమే.

"భీతమృగాక్షులార"—మునిశాపానికి భయపడి, చలించే కళ్లతో బెగ్గడిల్లి ఉన్నారు, కాబట్టి వారికా సంబోధన సరిపోతుంది.

ఇలఁగల వీళ్ళు సూడ మన మేటికిఁ బోవలె? బోయినన్ వనిన్
నిలువఁ బనేమి ? నిల్చిన మునిం గని త్రుళ్ళఁగ నేల ? యంతలో
నలిగి శపింప నేమిటికి నాతఁడు ? వ్రాఁతఫలంబు దప్పునే ?
కలిగినవే కదా మకరికల్ మన కెప్పుడు వ్రాసియుండుటల్. 59

అర్థము :— ఇలన్ కల = భూలోకంలో ఉన్న, వీళ్లు = పట్టణములు, చూడ, మనము, ఏటికి పోవలెన్ = ఎందుకు పోవాలి ? పోయినన్ = పోవడంలో తప్పులేదనే అన్నా, వనిన్ = అడవిలో, నిలువన్ పనియేమి = ఎందులకు నిలవాలి ? నిల్చినన్, మునిన్, కని, త్రుళ్ళఁగన్ ఏల = ఆటలాడడ మెందుకు? అంతలోన్ = అంతమాత్రానకే, అతడు, అలిగి = కోపించి, శపింపఁగన్ ఏల = శపించడ మెందుకు ? (జరిగినవిషయమంతా విచిత్రంగా సాగింది అని) వ్రాఁతఫలంబు = బ్రహ్మ వ్రాసిన వ్రాతఫలితం, తప్పునే = జరగకుండా పోతుందా ; మనకు, ఎప్పుడున్ = ఎల్లప్పుడూ, మకరికల్ = కుచములయందూ, చెక్కిళ్ళయందూ కస్తూరి కాది పదార్థాలతో వ్రాసే మకరికా పత్రములనే అలంకారపు వ్రాతలు, కలిగినవేకదా = మన కున్నవేకదా (అలవాటే కదా ?)— ఆ మకరికా రచనల ఫలము తప్పుతుందా అని అభిప్రాయము.

తాత్పర్యము :— మన మసలు భూలోకం చూడాలని రావడ మెందుకు ? వచ్చినా, ఈ అడవిలో నిలవడ మెందుకు ? నిలిచినా, ఆ మునిని చూచి ఊరుకోక అల్లరి చేయడ మెందుకు ? చేసినా అంత మాత్రానికే అతడు కోపించి శపించడ మెందుకు ? ఎన్నినుకున్నా, విధి వ్రాసిన వ్రాత తప్పుతుందా ? అయినా, మకరికా పత్రాలువ్రాయించుకొనడం మన కలవాటే కదా, ఇప్పుడా మకరరూపాలే మనకు వచ్చాయి. (అని ఆ అచ్చరలు తమలో అనుకొన్నారు.)

విశేషము :— ఈ పద్యములో ఈ మాటలాడుతున్నవారు అప్సరసలు—దేవేంద్ర లోకవాసలు, కాబట్టి 'ఇలఁగల' సార్థకము.

ఎప్పుడూ భగవన్నామాన్ని వ్రాస్తుండేవారు తత్ఫలితంగా సారూప్యం చెందినట్లే మనము ఎల్లప్పుడూ మకరికా పత్రాలు వ్రాస్తూ ఉండడంచేత, మకర రూపాలు మనకు సిద్ధించాయి అని చమత్కారం.

మీరు మొసళ్లు కావాలి అని మన నుదుట బ్రహ్మ వ్రాసి ఉంటాడు. ఆ బ్రహ్మ వ్రాత నిష్ఫలమవుతుందా ? అని ధ్వని.

అచ్చరలు ఆపదలో ఉండి కూడా చతురోక్తులను విడిచిపెట్టక పోవడము వారి నిత్య యౌవన లక్షణము, రమణీయము.

అలంకారము :— నిరుక్తి, అర్థాంతరన్యాసము, ఏకావళి.

అనుచు ననుతాపమునఁ ద్రోవఁ జనుచునుండ
నారదుఁడు చూచి 'యచ్చరలార! మీరు
చిన్నవోయిన మొగముల నున్నవార
లే', మనినఁ బూర్వవృత్తాంత మెల్లదెలిపి, 60

అర్థము :— అనుచు, అనుతాపమునన్ = విచారముతో, త్రోవన్, చనుచునుండన్, నారదుఁడు చూచి, అచ్చరలార, మీరు, చిన్నవోయిన మొగముల (తో) ఉన్నవారలు, ఏమి ? అని అడగగా, పూర్వవృత్తాంతము, ఎల్లన్, (అతనికి) తెలిపి......

తాత్పర్యము :— "ఈవిధంగా అనుకుంటూ మేము దుఃఖముతో త్రోవను పోతూం డగా, నారదుడుచూచి 'మీరు చిన్నవోయిన మొగాలతో ఉన్నారెందువల్ల' అని అడిగాడు. అప్పుడు మేమతనికి జరిగిన సంగ తంతా చెప్పి......" (తర్వాతకన్వయం)

"ఋషితిలక కంటివే మా యదృష్టరేఖ ?
కుడిచి కూర్చుండ కిదె యొకబెడఁదఁ దెచ్చు
కొంటి ; మే మేడ ? మకరులై యుంట యేడ ?
నర్హమే యిట్టి బాధ బింబాధరలకు ? 61

అర్థము :— ఋషితిలక = ఋషిశ్రేష్ఠుడా, నారదా, మాయదృష్టరేఖన్ = మా దురదృష్టపు చందము, కంటివే = చూచావా, కుడిచి కూర్చుండక = సుఖంగా ఉండలేక - అనవసరంగా, ఇదె ఒక బెడఁదన్ = ఇదిగో ఈఆపదను, తెచ్చుకొంటిమి, ఏము ఏడ = అచ్చరలమైన మేమెక్కడ, మకరులై, ఉంట ఏడ = ఉండడమెక్కడ, (ఎంత ఘోరమైన వ్యత్యాసమో చూడు), బింబాధరలకు = దొండపండువంటి పెదవులుగల మావంటి కోమలాంగులకు, ఇట్టిబాధ, అర్హమే = తగినదేనా ?

తాత్పర్యము :— నారదా ? మాదురదృష్టము చూశావా ? తిని కూర్చోలేక ఈ ఆపద తెచ్చుకున్నాము, అచ్చరలమైన మేమెక్కడ ? మొసళ్ళమై జీవించడ మెక్కడ ? మా బోటి కోమలాంగులకు ఈలాటి బాధ తగినదేనా ?" అని నంద అన్నది.

విశేషము :— అదృష్టరేఖ - కానరాని సౌందర్యరేఖ. మొగములు చిన్నవోయి ఉండడముచేత సౌందర్యము అదృష్టమయిందనీ, దానిని నారదుడు చూచాడనీ, ధ్వని.

పాఠాంతరము :— "కుడిచి కూర్చుండి యిదె యొక బెడద"
— వేదము వారు

అలంకారము :— విషమము, అనుప్రాసము.

అన విని యనిమిషముని "యో
వనితా తిలకంబులార, వసుధా గీర్వా
ణుని శాపము విధికృత ; మే
ఘనునకుఁ దప్పింప నలవి గా ; దటులగుటన్," 62

అర్థము :— అనన్, విని, అనిమిషముని = (తెప్పపాటులేని) దేవతలలోని ముని యైన నారదుడు, "ఓ వనితా తిలకంబులార = ఓ నారీమణులారా ! వసుధా గీర్వాణుని = భూమిసురుని (బ్రాహ్మణుని) యొక్క, శాపము = తిట్టు, విధికృతము = దైవముచే చేయబడి నదే, ఏ ఘనునకున్ = ఎంత మహిమగల వాడికైనా, తప్పింపన్, అలవికాదు = వశముకాదు ; అటులగుటన్ = కాబట్టి...... తరువాతి కన్వయము.

తాత్పర్యము :— మా మాట విని, ఆ దేవముని, 'ఆ బ్రాహ్మణుడి శాపము దైవము విధించినదే కాని వేరుకాదు ; ఎంత మహిమగల వాడికైనా దానిని తప్పించ శక్యముకాదు, కాబట్టి...... తర్వాతి కన్వయము.

విశేషము :— గీర్వాణ — గీరేవ బాణ - మాటే బాణముగా కలవాడు - దేవత, వసుధా గీర్వాణుడు - భూమిమీదనున్న దేవత, కాబట్టి శాపమివ్వ గలడు అని అంతరార్థము.

విధికృతము అనడంలో ఆ మునిని నిందించ వద్దని సూచన.

అంతేకాదు. ఇది 'విధికృతము' కాబట్టి తప్పేది కాదు అని భావము.

అలంకారము :— పరికరాంకురము, వృత్త్యనుప్రాసము, కావ్యలింగము.

మీరలు దక్షిణాంబుధి సమీపమునం దగు పంచతీర్థముల్
చేరియు, గ్రాహ రూపములఁ జెంది శ తాబ్దము లున్నఁ, దీర్థసే
వా రతి భారతాన్వయుఁడు వాసవ నందనుఁ డర్జునాఖ్యుఁ డే
తేరఁ గలం; డతండు కడతేర్చు మిముల్ దృఢ సాహసంబునన్. 63

అర్థము :— మీరలు, దక్షిణాంబుధి = దక్షిణ సముద్రముయొక్క, సమీపమున = చేరువను, తగు = ఉన్నట్టి, పంచతీర్థముల్ = ఐదు పుణ్యతీర్థములను, చేరియు = ప్రవేశించి, గ్రాహ రూపములన్ = మొసళ్ల ఆకారములను, చెంది = పొంది, శత అబ్దములు = నూరు సంవత్సరములు. ఉన్నన్ = ఉండిన యెడల, దీర్థసేవారతిజ = తీర్థముల సేవించే ఆసక్తితో, భారత అన్వయుఁడు = భరత వంశమునందలి వాడున్ను, వాసవ నందనుఁడు = ఇంద్రునికుమారుడున్ను, అర్జునాఖ్యుఁడు = ఐన అర్జునుడన్న పేరుగలవాడు, ఏతేరఁగలండు = రాగలడు అతండు, దృఢ సాహసంబునన్ = గట్టితెగువతో, మిముఁ గడతేర్చు = మీ బాధ తీరునట్లు చేయును.

తాత్పర్యము :— దక్షిణ సముద్రము చేరువనున్న పంచతీర్థములకు వోయి మొసళ్ల రూపముతో నూరుసంవత్సరము లున్నట్టయితే అప్పుడు తీర్థయాత్ర జేస్తూ వచ్చిన అర్జునుడు మీ శాపమును కడతేరుస్తాడు అని నారదుడు అప్సరసలకు సలహా ఇచ్చాడు.

విశేషము :— పంచతీర్థాలు ; సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న, భారద్వాజ అన్న అయిదు తీర్థాలు.

ఐదుగురున్నారు కాబట్టి పంచతీర్థములను నారదుడు సూచించాడు. దగ్గరదగ్గరగా ఉండ వచ్చును. వియోగబాధ తగ్గుతుంది గదా !

కడ తేర్చు అనగా ప్రసన్నత నొందించునని అభిప్రాయము. దృఢసాహసము మొస ళ్లన్నా యని తెలిసికూడా లోపల దిగి వాటిని బయటికి ఈడ్చడానికి అట్టి సాహసము కావలసినదే కదా ;

చనుఁ డచటికి నిపు డింపెన
యు; 'న దుఃఖం పంచభిః సహ' యనంగా మునుఁ
వినియుందురె కద; యేటికి
మనమున నుమ్మలికఁ జెంద, మదవతులారా ? 64

అర్థము :—ఇపుడు, అచటికి, ఇంపు ఎనయన్ = సంతోషముతో, చనుఁడు = వెళ్లండి (సంతోషము ఎలా గంటారేమొ), న దుఃఖం పంచభిఃసహ = ఐదుగురితోడి దుఃఖము, దుఃఖముకాదు (దుఃఖములాగ తోచదు). అనంగన్ = అనడం, మునుఁ = ఇంతకుముందు, విని యుందురె కద = వినేఉంటారు కదా, మనమునఁ = మనసులో, ఉమ్మలిక = దుఃఖమును, మదవతులారా ? = యవ్వనవతులారా, చెందఁ ఏటికి = ఎందుకు పొందవలయును ?

తాత్పర్యము :— ఐదుగురితోడి దుఃఖము దుఃఖము కాదంటారుగదా, కాబట్టి మీరు సంతోషముగ పంచతీర్థాలకు పొండి. యవ్వనములో ఉన్నవారు కాబట్టి కలుగబోయే దుఃఖాన్ని ఓర్చుకో గలుగుతారు అని నారదుడి భావము.

*విశేషము :* — 'న దుఃఖం పంచభిఃసహ' లోకోక్తి. మీరు కూడ ఐదుగురే అని భావము. నలుగురితో ఉన్నా పదిమందితో ఉన్నా, ఈ లోకోక్తి వాడవచ్చు.

మదవతులారా – మీరు ముసలివారు కాక యవ్వనవతులు కాబట్టి ఎటువంటి బాధనైన ఓర్చుకోగలరని సూచన.

అంతేకాక నారదుడు తన సహజ ధోరణిలో మీ మదమే మిమ్మల్ని ఇంతకు తెచ్చిందని ఎత్తిపొడిచే ఊహ కూడ కలిగియున్నాడా ఈ సంబోధనలో ?

*అలంకారము :*— కావ్యలింగ, పరికరాంకురము, లోకోక్తి.

అంచుఁ మమ్ముల నూఱడించ విన యాహ్లాదంబు లెంతే 'విజృం
భించన్ మ్రొక్కి 'జగంబులందున మిముం బేర్కొన్న మాత్రం బటా
పంచంబై దురితంబు లెల్లఁ జనఁగా భక్తిఁ మిము న్నేఁడు ద
ర్శించఁ ఖేదము వోయి మోదము మదిం జెన్నారదా, నారదా ! 65

ఈ సలహా ఇచ్చిన నారదునికి కృతజ్ఞతను తెలుపుతూ నంద అన్న అప్సరస ఈ విధంగా చెప్పుతుంది.

అర్థము :— అంచుఁ = అని చెప్పి, మమ్ములన్, ఊఱడించఁ = ఓదార్చగా, (మేము) వినయాహ్లాదంబులు = అణకువా సంతోషమూ, ఎంతే విజృంభించఁ = మిక్కిలి అతిశయించగా, మ్రొక్కి "నారదా, జగంబులందుఁ = లోకములలో, మిముఁ పేర్కొన్న మాత్రఁ = మీ పేరు పలికినంత మాత్రమున, దురితంబు లెల్లఁ = అన్ని పాపములూ, పటాపంచంబు అయి చనగాన్ = చెల్లాచెదరై పోతుండగా, భక్తిఁ = భక్తితో, నేఁడు, మిముఁ దర్శించఁ = మిమ్ము చూచినందువల్ల, ఖేదముపోయి = దుఃఖము నశించి. మదిఁ = మనసులో, మోదము = సంతోషము, చెన్నారదా = కలుగక పోతుందా ?"

తాత్పర్యము :— నారదుడు ఆవిధంగా ఊరడించగా, ఓ నారదరుషీ మూడులోకాలలో మీపేరు పలికినంతమాత్రాన పాపాలు నశించి పోతాయని అన్నప్పుడు భక్తితో మిమ్మల్ని చూచినందువల్ల . దుఃఖముపోయి సంతోషము కలుగక పోతుందా అని నంద చెప్పింది.

*విశేషము :*— ఈ అప్సరసలు సంతోషించడానికి నారదుడు 'న దుఃఖం పంచభిఃసహ' అన్న లోకోక్తిని ఉపయోగించాడు.

దేవరుషిని దర్శించినందువలన దుఃఖాలుపోయి సంతోషము కలుగక పోతుందా అని నంద వేరే కారణం చూపించింది.

ఇంతేకాక, దీని తర్వాతి పద్యములో కూడ ఈ కాంతలు సంతోషించడానికి ఇంకొక కారణము కవి చూపిస్తున్నాడు.

అలంకారము :— కావ్యార్థాపత్తి, అంత్యానుప్రాస.

'మీ కతమున నూఱేం డ్లని
మాకుఁ దా మితి యెఱుకవడియె; మంటి' మటంచున్
లోకేశ్వరసుతు దీవనఁ
జేకొని యిట వచ్చి నిలిచి చిత్తము లోనన్, 66

అర్థము :— 'మీకతమునన్ = మీవలన, నూఱేండ్లు అని మాకున్, మితి = శాపము యొక్క కాలపరిమితి, యెఱుకవడియెన్ = తెలిసింది (కాబట్టి) మంటిమి = బ్రతికితిమి - చింత తీరింది, అటంచున్ = అనిచెప్పి, లోక ఈశ్వర సుతు = లోకములకు ప్రభువగు బ్రహ్మ యొక్క కుమారుడగు నారదునియొక్క, దీవనన్ = ఆశీర్వాదమును, చేకొని = అందుకొని, ఇటవచ్చి = ఈ పంచతీర్థములకు వచ్చి, నిలిచి, చిత్తములోనన్ = మనసున ... తరువాతి కన్వయము.

తాత్పర్యము :— మీ దయవల్ల మా శాపపరిమితి నూరుసంవత్సరాలు అని తెలిసింది, సంతోషమని ఆ నారదుని ఆశీర్వాదాలు తీసికొని, ఈ పంచతీర్థాల దగ్గరకు వచ్చి మనసులో...తరువాతి కన్వయము.

విశేషము :— వారు దేవతలు కాబట్టి మానవుల లెక్క ప్రకారము నూరు సంవత్సరాలు వారికి ఒక దీర్ఘకాలము లాగా కనబడదు, కాబట్టే తేలికగా, బ్రతికితిమి అనగలిగారు.

అలంకారము :— కావ్యలింగ.

'దుర్జనన విసర్జనముగ
నిర్జర లోకాధినాథుని సుతుం డగు నా
యర్జును, సర్జన సముదా
యర్జునుఁ, గనుఁగొనెడి భాగ్య మది యెన్నటికో! 67

అర్థము :— దుర్జనన = దుష్టమగు (మకరికా) జన్మయొక్క, విసర్జనముగన్ = విడుదల కలుగునట్లు, నిర్జరలోక = దేవలోకమునకు, అధినాథుని = ప్రభువగు ఇంద్రుని

యొక్క, సుతుండగు = కుమారుడునూ, సర్జన = సృష్టియొక్క, సముదాయ = సర్వస్వమునకు (అంతటికిని) ఋజునుఁ = తిన్నని (సత్త్వవర్తనగల) వాడునూ అగు, ఆ అర్జునున్, కనుఁ గొనెడి, భాగ్యము = అదృష్టము, అది, ఎన్నటికో = ఎప్పుడో !

తాత్పర్యము :— ఈ దుష్టమయిన మకర జన్మను తప్పించగలిగి సృష్టి అంతటి లోనూ సత్త్వవర్తన ఉన్న ఆ అర్జునుడిని చూచే భాగ్యము మా కెప్పుడో అని...

అలంకారము : అనుప్రాస.

అని తలపోయుచు న్మకరి కాకృతు లూని యిటుండఁగా నిదే
పనిగ మదీయ పుణ్య పరిపాక మనం జనుదెంచి నీవు న
న్మనిచితివే కదా ! కడమ నాచెలులౌ జలచారి చారులో
చనలకు శాపమోచనము సల్పి కృతార్థులఁ జేయు పార్థివా ! 68

అర్థము :— అని తలపోయుచున్ = ఆలోచించుచు, మకరిక ఆకృతులు = మొసళ్ళ రూపములను, ఊని = వహించి, ఇటుండఁగాన్ = ఇప్పుడు నీవు చూచినట్లు ఉండఁగా, ఇదే పనిగన్ = ఈ పనికే అన్నట్టూ, మదీయ = నాయొక్క, పుణ్య = సుకృతముయొక్క, పరి పాకము = ఫలము, అనన్ = అన్నట్టూ, చనుదెంచి = వచ్చి, నీవు, నన్, మనిచితివేకదా = బ్రతికించితివి (రక్షించితివి) కదా. నాచెలులు ఔ = నా చెలికత్తెలగు, కడమ = తక్కిన, జలచారి చారులోచనలకున్ = (నీటిలో దిరిగే) మొసళ్ళయియున్న అందములగు కన్నులుగల కాంతలకు, శాపమోచనము = శాపవిముక్తి, సల్పి = చేసి, పార్థివా = అర్జునా, కృతార్థులన్ = ధన్యురాండ్రను చేయుము.

తాత్పర్యము :— అర్జునుడిని ఎప్పుడు చూడగలుగుతామో అని మేము ఈ రూపా లతో ఉండగా, అదే పనిగా నీవు వచ్చి నన్ను రక్షించావుగదా ! ఇంకా నా నలుగురు చెలికత్తె లకు గూడ శాపవిమోచనం కలిగించి ధన్యలను చేయుమని నంద కోరింది.

*విశేషము* :— 60 వ పద్యములో నంద అర్జునుడిని 'భూవరా' అని సంబోధించింది. నారదుడి మాటలను బట్టి ఇతడు అర్జునుడని నిర్ధారణచేసి ఇక్కడ 'పార్థివా' అన్నది.

*పాఠాంతరము* :— 'మదీయ పుణ్యపరిపాకమునన్' — దీనికి నా పుణ్యాలు పండుట వల్ల అని అర్థము.

*అలంకారము* :— ఉత్ప్రేక్ష.

అని నంద వేఁడినం ద
క్కిన తీర్థము లాడి వారికిఁ శాపవిమో
చన మొనరింపఁగ నేవురుఁ
జనుదెంచి శుభాంగలీల సన్నిధి నిలువన్, 69

అర్థము :— అని నంద (అన్న అచ్చర) వేఁడినఁ, తక్కిన తీర్థములు ఆడి వారి శాపవిమోచనము ఒనరింపఁగఁ = చేయఁగా, ఏవురుఁ = అయిదుగురున్నూ, చనుదెంచి = వచ్చి, శుభాంగ లీలన్ = శ్రేష్ఠమైన శరీరవిలాసముతో, సన్నిధిన్ = సమీపమునందు, నిలువన్ = నిలవగా.

విశేషము :— వికృతమూ భీకరమూ అయిన ఆ మొసలి రూపముపోయి అంద మైన శరీరవిలాసముతో ఆ నలుగురుగూడా దగ్గరకు వచ్చారని భావము.

కలలో నెఱుంగ మే గణి
కలలో నీచెలువమున్; సకల లోకములఁ
గల లోలాక్షుల గరగరి
కల లోఁగొనినారొ ! చంద్రకలలో వీరల్. 70

వారి సౌందర్యము చూచి అర్జునుడు ఈలా గనుకున్నాడు.

అర్థము :— ఈ చెలువమున్ = ఈ సౌందర్యమును. ఏగణికలలోన్ = ఎటువంటి ప్రఖ్యాతిపొందిన వేశ్యలలోగాని. కలలోన్ = (అపూర్వ విషయాలను గూడ చూపించే) కల లలోగాని. ఎఱుఁగము = చూడలేము; సకలలోకములఁ = అన్ని లోకములలోను. కల = ఉన్నట్టి. లోలాక్షుల = చంచలాక్షుల - కాంతలయొక్క, గరగరికలన్ = అందచందాలను: లోఁగొనినారో = తమ వశము చేసికొన్నారొ (కాక) వీరల్ = ఈ అయిదుగురు: చంద్ర కలలో !

తాత్పర్యము :— కలలోగానీ వేశ్యా జనాలలోగాని, ఈ సౌందర్యము ఎక్కడా కన బడదు. అన్ని లోకాలలో ఉన్న సుందరాంగుల సొగసులన్నీ వీరే స్వాధీనము చేసుకున్నారా లేక వీరు సాక్షాత్తు చంద్రకళలేనా ?

విశేషము :— ఆ అప్సరసల రూపరేఖ లావణ్యాలు అంత అద్భుతంగా ఉన్నాయన్న మాట. అప్సరసలు దేవలోక వేశ్యలు; కాబట్టి గణికలతో పోల్చడము.

పద్యములో ఆరుసార్లు 'కలలో' వచ్చింది.

అలంకారము :— యమకము. సందేహము; అతిశయోక్తి.

అని తనచే నిజరూపముఁ
గనిరి గదా, యనుచు వేడుకం గను నృపతిం
గని యా యచ్చర లిట్లని
కొనియాడఁ దొడంగి రధిక కుతు కాన్వితులై 71

అర్థము :— అని = అనుకుంటూ, తనచేన్ = తనవల్ల, నిజరూపము = వారివారి మొదటి రూపాలను, కనిరికదా = పొందారుకదా, అనుచు, వేడుకన్ = సంతోషంతో - ఒకవిధ మయిన వాత్సల్యముతో, కను = చూస్తూన్న, నృపతిన్ = రాజును, కని = చూచి, అధిక కుతుక అన్వితలై = మిక్కిలి ఉత్సాహముతో కూడినవారై, అచ్చరలు, ఇట్లని, కొనియాడన్ = పొగడుటకు, తొడంగిరి = పూనుకున్నారు.

తాత్పర్యము :— అని వారి సౌందర్యాన్ని మెచ్చుకుంటూ, తనచేత వీరు నిజ రూపాలు పొందారు కదా అని సంతోష వాత్సల్యాలతో తమ్ముని చూస్తూన్న అర్జునుడిని చూచి, ఆ అచ్చరలు చాల ఉత్సాహము - గురుభావముతో ఈ విధంగా పొగడ నారంభించారు.

విశేషము :— తన వల్ల ఉపకారం పొందిన వారిని చూచినప్పుడు, మనుష్యులకు సహజంగా కలిగే ఆనందంతో అర్జునుడు అ అప్సరసలను చూస్తున్నాడు; అంతేకాని; ఉలూచినీ చిత్రాంగదనూ చూచిన చూపులతోకాదు, అని గ్రహించాలి. ఈ విధంగా నాయకుని ఔచిత్యాన్ని, కచకుచ వర్ణనలు చేయించకుండ, కవి కాపాడాడు.

అలాగే ఆ అచ్చరలు కృతజ్ఞతతోనూ గురుభావముతోనూ అర్జునుడి రూపాన్ని ప్రశం సించసాగారు.

బల వైభవంబుచే గెలుచు మాత్రమె కాదు
గమన లీలను గెల్చు గంధకరినిఁ,
గీర్తి విస్ఫూర్తిచే గెలుచుమాత్రమె కాదు
నగుమొగమ్మున గెల్చుఁ దొగలఱేని,
బలు సాహసంబుచే గెలుచుమాత్రమె కాదు
మినుకుఁ గౌనున గెల్చు మృగకులేంద్రు,
నలఘు దానంబుచే గెలుచు మాత్రమెకాదు
నెఱుల కాంతిని గెల్చు నీరదమును,

సకల సద్గుణ సౌందర్య సారమూర్తి
యనియు మును నారదుఁడు దెల్ప వినియ యుంటి,
మి మ్మహాభుజు నిప్పుడో కొమ్మలార,
కంటిమి గదమ్మ కన్నుల కఱవు దీర ! 72

అర్థము :— ౧. బలవైభవంబుచేఁ = బలము యొక్క సంపదచేత, గెలుచు మాత్రమె కాదు = మించి పోవడం ఒక్కటేకాదు. గమనలీలనుఁ = నడక యొక్క విలాసము చేతకూడా, గంధకరిని = మదపు టేనుగును, గెల్చెన్.

బలములోనూ నడకలోనూ మదించిన ఏనుగును మించినవాడు అని భావము.

౨. కీర్తివిస్ఫూర్తిచేఁ = కీర్తియొక్క ప్రకాశంచేత, గెలుచుమాత్రమె కాదు, నగు మొగమ్మున (గూడ), తొగలతేనిఁ = కలువల విభుడైన చంద్రుడిని, గెల్చెన్,

కీర్తి తెల్లగా ఉంటుందని కవి సమయము. కీర్తిలోనూ ముఖకాంతిలోనూ చంద్రుడిని మించినవాడు.

౩. బలుసాహసంబుచే = ఎక్కువైన ధైర్యంచేత, గెలుచుమాత్రమెకాదు, మినుకు కౌనునఁ = సన్నని నడుముచేతకూడా, మృగకుల ఇంద్రుఁ = మృగరాజైన సింహమును, గెల్చెన్, ధైర్యములోనూ సన్నని నడుములోనూ సింహాన్ని మించును.

౪. అలఘు = తక్కువకాని-చాల ఎక్కువైన, దానంబుచేన్ = ఈవిచేత, గెల్చు మాత్రమె కాదు, నెఱులకాంతిని = తలవెంట్రుకల కాంతిచేతకూడా, నీరదమును = (నీటిని ఇచ్చే) మేఘమును, గెల్చెన్.

సకల సద్గుణ సౌందర్య సారమూర్తి = అన్ని విధములైన మంచి గుణములయొక్కయు చక్కదనము యొక్కయు సారమే ఆకారము తాల్చినవిధంగా ఉన్నవాడు, అనియు = అని కూడా, మును = పూర్వము, నారదుఁడు, తెల్పఁ, వినియ = వినియే, యుంటిమి, ఇప్పుడు, ఓ కొమ్మలార, ఈ మహాభుజున్ = ఈ దీర్ఘబాహుని (ఆజానుబాహుని) కన్నుల కఱవు దీఱఁ = కన్నులు తృప్తిచెందినట్లు, కంటిమి గదమ్మ = చూడగలిగాము కదా !

తాత్పర్యము :— ఈవీరుడు (అర్జునుడు) శరీరబలముతోనే కాక, నడకతోనూ మదపుటేనుగునూ, కీర్తి ప్రకాశం చేతనేకాక, నగుమోముతో కూడా చంద్రుడినీ, ధైర్యముతో మాత్రమేకాక, సన్నని నడుముతో కూడా సింహమునూ, దానంతోనేకాక తలవెంట్రుకల కాంతితో కూడా మేఘాన్నీ, మించి ఉంటాడనీ అన్ని సద్గుణాల యొక్కయు, సౌందర్యము యొక్కయూ సారమే ఈ అర్జును డనీ నారదుడు ఆనాడే చెప్పాడు కదా, ఈ ఆ పరాక్రమ వంతుడిని ఇప్పుడు కళ్ళారాచూచి ధన్యులమయ్యాము కదా !

*విశేషము* :— ప్రతిపాదంలోనూ మొదట ఒక సద్గుణమూ, తర్వాత ఒక సౌందర్య లక్షణమూ చెప్పి కవి తన ప్రక్రమాన్ని పాటించాడు.

బలము, కీర్తి, సాహసము, దానము సద్గుణాలు.

నడక, మొగము, నడుము, తలవెండ్రుకలు - సౌందర్యాన్ని తెలిపేవి.

కాబట్టే ఎత్తుగీతిలో 'సద్గుణ సౌందర్య' అని రెండుపదాలూ వాడి, ఈపద్యములో ఈ సొగసుంది చూడండి అని పాఠకులను కవి హెచ్చరించాడు.

''సకల......మూర్తి'' అనడానికి, "సమస్తమైన మంచి గుణములతోడి చక్కదనము యొక్క నిగ్గే స్వరూపముగా గలవాడు'' అన్న వేదం వారి వ్యాఖ్యానములో ఒక్క చక్కదనానికి మాత్రమే ప్రాధాన్యము యిచ్చి, సద్గుణములను అప్రధానంగా ఉంచడం జరిగింది.

*అలంకారము* :— ఉపమ, క్రమము, వృత్త్యనుప్రాస.

బాపు ! వలరాజుగర్వంబుఁ బాపురూపు;
చాఁగు ! రేరాజు కళల మించు చాగుఁ రేఖ;
మేలు ! నలరాజు సోయగమేలుఁ జెలువ;
మమ్మ ! యీరాజుప్రతి గానమమ్మ ! యెచట. 73

*అర్థము* : పాదాల మొదటనున్న మాటలన్నీ మెచ్చును తెలియజేసేవి,

బాపు = బళిరా, రూపు = అందము, వలరాజు = మన్మథుని, గర్వంబుఁ = గర్వమును, పాపుఁ = పోగొట్టును, చాఁగు = అద్దిరా, రేఖ = లావణ్యము, రేరాజుకళల = చంద్రుని కళల యొక్క, మించు = కాంతిని, ఆఁగుఁ = అడ్డగించును - తిరస్కరించును, మేలు, చెలువము = సౌందర్యము, నలరాజు (యొక్క), సోయగము = చక్కదనమును, ఏలుఁ = పాలించును (అతిక్రమించును), అమ్మ = అహో, ఈరాజుప్రతిఁ = ఈ రాజునకు సమానమైన వాడిని, ఎచటఁ, కానమమ్మ.

*తాత్పర్యము* :— "అందంలో మన్మథుడినీ, లావణ్యంలో చంద్రుడినీ, ఆకారంలో నలుడినీ మించిపోయే ఈరాజుకు (అర్జునుడికి) సాటిలేరుకదా :

*విశేషము* :— తిరస్కరించిన మాటల్లో, వారివారికి యథార్థంగానే ఉన్న లోపాలను తెలియబరచడం చమత్కారము.

వలరాజు : శరీరం కోల్పోయినవాడు - కనుక రూపు 'బాపును'.

రేరాజు ; బహుళపక్షంలో కళాహీను డవుతాడు - కనుక రేఖ 'మించును'

నలరాజు ; రాజ్యం పోగొట్టుకొని సేవించాడు కనుక, చెలువము 'ఏలును'

ఇందులో తిరస్కరింపబడ్డ ముగ్గురూ రాజులే. కనుక అర్జునుడికి ఏ రాజు సాటిరాదని భావము.

నలుడు అందానికి పేరుపొందినవాడు, ఈ కవే ప్రథమాశ్వాసంలో — "ఆకారమున నలునంత వాఁ డౌనె కా, హయ సమ్య గారూఢి నంతవాఁడె" (1-127) అని వర్ణించాడు.

అలంకారము :— యమకము, వ్యతిరేకము.

అందఱును నింద్రనీల నిభాంగుఁడందు
రింద్రనీల శుభాంగుఁడే యితఁడు గానఁ;
దండ్రిఁ బోలిన రూపుమాత్రంబెకా ద
యారె ! భూలోక దేవేంద్రుఁ డంచుఁ బొగడి. 74

అర్థము :— ఇంద్రనీల నిభాంగుఁడు = ఇంద్రనీల మణులవంటి కాంతిగల శరీరం కలవాడు, కావున, అందఱును, ఇంద్రనీల శుభాంగుఁ డందురు = ఇంద్రునివలె నీలవర్ణము గల చక్కని శరీరం గలవాడు అంటారు.

ఈలాగు చెప్పడంవల్ల, అర్జునుడు ఒక్క రూపంలో మాత్రమే తండ్రిని పోలును (కాని గుణంలో కాదు) అని అనుకోరాదు, అయారె, ఆహా, భూలోకదేవేంద్రుఁడు = వైభవము మొదలయిన లక్షణాలన్నింటిలో భూమిపై నున్న దేవేంద్రుడే సుమా, అనుచుఁ, పొగడి— (తర్వాతి పద్యంతో అన్వయము)

అలంకారము :— ఉపమ, యమకము.

నీకు కల్యాణమౌ రమణీయ రూప !
నీకు వంశాభివృద్ధియౌ నృపకలాప !
నీకు జయమగు సాహస నీతిభరిత !
నీకు సామ్రాజ్యమౌ మహనీయ చరిత ! 75

అర్థము :— రమణీయరూప = మనోహరమైన రూపముగలవాడా, నీకున్, కల్యాణము = శుభము (పెండ్లి) ఔఁ = అగునుగాక, నృపకలాప = రాజులలో చంద్రునివంటివాడా, నీకు వంశాభివృద్ధియౌ = నీవంశము వర్ధిల్లుగాక, సాహసనీతిభరిత = తెగువా నీతీ విశేషంగా కలవాడా, నీకు - జయమగు = సర్వప్రయత్నములలోనూ జయము సిద్ధించును గాక, మహ

నీయ చరిత = పూజింపదగిన ప్రవర్తన కలవాడా, నీకు, సామ్రాజ్యమౌ = మహైశ్వర్యము (చక్రవర్తిత్వము) కలుగునుగాక.

తాత్పర్యము :— నీకు కల్యాణమౌనని, నీకు వంశాభివృద్ధి కలుగునని, నీకు సర్వత్రా జయమే లభించునని, నీకు సామ్రాజ్యము ప్రాప్తిస్తుందని ఆ అచ్చరలు అర్జునుడిని దీవించారు అని భావం ?

విశేషము :— అర్జునునకు ఉత్తరోత్తరా కలుగబోయే శుభములు ఈ దీవనలలో ధ్వనిస్తున్నాయి. సుభద్రతోడి కల్యాణము, అభిమన్యుని జననము, భారత యుద్ధంలో విజయమూ, తద్వారా సామ్రాజ్య ప్రాప్తి ఈ పద్యములో సూచితమయాయి. ఈ పద్యంలో ఉపయోగించిన సంబోధనలు కూడా అర్థానికి తగినట్లుగా ఉన్నాయి. కల్యాణమును గూర్చి చెప్పినప్పుడు, 'రమణీయ రూప' అని, వంశాభివృద్ధికి 'నృపకలాప' — చంద్రా అని, (చంద్రుడు పాండవుల వంశానికి మూలపురుషుడు కదా), విజయము సాధించడానికి 'సాహసనీతి భరిత' అని, సామ్రాజ్యమునకు 'మహనీయ చరిత' అని అర్థవంతమైన సంబోధనలు పద్యానికి సొగసు కూరుస్తున్నాయి.

కలాప - కలాభిపాఇతి కలాపః = చంద్రా అని అర్థము పూర్వము చంద్రునివల్ల వర్ధిల్లినట్లే భరత వంశము నీనుండి అభిమన్యు పరీక్షిత్ జనమేజయాదుల రూపమున వర్ధిల్లునని సూచన.

అర్జునుడికి సామ్రాజ్యము లేదే, ధర్మరాజుకే కదా సామ్రాజ్యం ఉన్నది' అన్న అనుమానానికి — అర్జునుడు మహనీయచరితుడు కావడంవల్ల తన ద్వారా అన్నగారికి కలిగిన ఐశ్వర్యమంతా తనకే కలదని భావించే ఉదారగుణం కలవాడని భావం.

మొదటి రెండుపాదాలకూ, తర్వాతి రెండుపాదాలకు అంత్యానుప్రాస ఉండడం చూడండి.

అలంకారము :— అనుప్రాస, పరికరము.

అంచున్ వేలుపు మించుఁ బోణులు శుభోదర్కంబు గాన్పించ దీ
వించన్, వారిఁ బ్రియానులాపములచే వీడ్కొల్పి, గోకర్ణభూ
ప్రాంచ ద్ధూర్జటిఁ గొల్చి, పశ్చిమ సముద్ర ప్రాంత పుణ్య స్థలుల్
కంచున్ బోయి, ప్రభాస తీర్థమున వేడ్కన్ గ్రీడి క్రీడించుచున్, 76

అర్థము :— అంచున్, వేలుపు మించుఁబోణులు = మెరపుల వంటి శరీరములు గల ఆ దేవకాంతలు, (అప్సరసలు), శుభ ఉదర్కంబు = భవిష్యత్తులో కలుగబోయే శుభాలు, కాన్పించన్ = తేటపడునట్లు, దీవించన్ = దీవనలీయగా, వారిని, ప్రియ అను లాపములచేన్

= ప్రేమగల మంచిమాటలతో, వీడ్కొల్పి = పంపించి, గోకర్ణభూ = గోకర్ణము అనే పుణ్యస్థలములో, ప్రాంచత్ = వెలసియున్న, ధూర్జటిఁ = ఈశ్వరుని, కొల్చి = సేవించి, పశ్చిమ సముద్ర, ప్రాంత = తీరముననున్న, పుణ్యస్థలుల్ = క్షేత్రములను, కంచుఁ = చూస్తూ, పోయి, ప్రభాస (అన్న పేరుకల) తీర్థమున, వేడ్కఁ = సంతోషంతో, క్రీడి = క్రీడలయందు ఆసక్తి (కలిగినట్టి) అర్జునుడు, క్రీడించుచుఁ = విహరిస్తూ......

తాత్పర్యము :— ఆ విధంగా అప్సరసలు శుభాకాంక్షలు చెప్పిన తర్వాత అర్జునుడు వారికి వీడ్కోలిచ్చి గోకర్ణమందున్న ఈశ్వరుడిని సేవించి పశ్చిమ సముద్రతీరంలోని ఇతర క్షేత్రాల్ని సేవిస్తూ, ప్రభాస తీర్థానికి వెళ్లి అక్కడ విహరిస్తుండగా ... (తరువాతి కన్వయము).

విశేషము :— పై పద్యంలో చెప్పిన వారి దీవనలన్నీ 'శుభోదర్కంబు' కన్పించేట్టుగా ఉన్నాయి.

వేడ్కఁ — వేడుకతో, కాబట్టే అర్జునుడు క్రీడిస్తున్నాడు - విహరిస్తున్నాడు అని చెప్పుకున్నాము.

సాధారణంగా అర్జునుడికి ఉన్న పది పేర్లలో 'క్రీడి' అన్న పేరు లేదు అయినా విశేషంగా వాడుకలో ఉన్న ఈ పదం 'కిరీటి' యొక్క రూపాంతరమే.

ఈ ప్రభాసతీర్థానికి సమీపములోనే సుప్రసిద్ధమయిన సోమనాథ దేవాలయముంది. మహమ్మదీయులు కొల్లగొట్టిన ఈ దేవాలయాన్ని భారత ప్రభుత్వం మొన్ననే పునర్మించింది.

ద్వారకాపుర మచటికిఁ జేరు వనుచుఁ
జెప్పఁగా విని కడు సంతసిల్లి, కలదు
గా యిఁక సుభద్ర రూప రేఖా విలాస
విభ్రమంబులు గనఁ జూడ్కి విందు కాఁగ, 77

అర్థము :— ద్వారకాపురము, అచటికిన్ = ఆ ప్రభాసతీర్థమునకు, చేరువ అనుచు, చెప్పఁగా విని, కడు సంతసిల్లి = మిక్కిలి సంతోషించి, "ఇఁకన్ = ఇంకమీదను, సుభద్ర యొక్క రూప.. ...విభ్రమంబులు = రూపము, రేఖ, విలాసములు, విభ్రమములు అన్నీ, చూడ్కి విందు = కన్నుల పండువు, కాఁగఁ = అయినట్టుగా, కనఁ కలదుగా = చూడడం సంభవిస్తుంది కదా" అని అనుకొని......

తాత్పర్యము :— ద్వారకానగరం ఆ ప్రభాస తీర్థానికి సమీపంలోనే ఉంది అని తెలుసుకొని, ఇంక సుభద్ర సౌందర్యవిశేషాలు తనివితీరా చూడవచ్చుకదా అని అర్జునుడు సంతసించాడు.

విశేషము :— రూపము = ముక్కు మొగము మొదలగు అవయవముల చక్కదనము.

రేఖ = అవయవముల పొందిక, కాంతి, లావణ్యము, కళ—,

విలాసము = నడక, చూపు మొదలగువానిలోని ఒయ్యారము—

"బిట్టు నిజ ప్రియు నంగన, కట్టెదురంజూచి యంగకంబుల మీఁదన్
బుట్టించిన యొయ్యారము. చిట్టాడుట యది విలాస చిహ్నం బరయఁ."

విభ్రమము = మాటలు, అలంకారములు వీటివల్ల కలిగే స్త్రీల శృంగారచేష్టలు—

"కడు కౌతుకాతిశయమునఁ, దొడవులుఁ బూతలును దప్పఁ దొడగుటచే న
య్యెడు సంభ్రమంబు విభ్రమ మడరుం బ్రియదర్శనాదులం దెల్లపుడుఁ"

ఇంతవరకూ అర్జునుడు గదునిద్వారా సుభద్ర రూపరేఖా విలాసాదుల గూర్చి బాగా విన్నాడే కాని, చూచే అవకాశం లభించలేదు ఇప్పుడు 'చూడ్కి-విందు' గాగ చూచే వీలుకూడా కల్గింది కదా అని సంతోషించాడు,

అరచందమామ నేలిన
దొరగా నెన్నుదురు నె న్నుదురు బిత్తరికిఁ
బరువంపు మొల్ల మొగ్గల
దొరగాఁ బల్కుదురుఁ బ ల్కుదురు జవ్వనికిన్. 78

సుభద్ర స్మరణకు రాగా అర్జునుడు ఆమెను గురించి ఇంకా ఈలాగున అనుకుంటున్నాడు.

అర్థము :—బిత్తరి = ఆ వయ్యారికి, నెన్నుదురుఁ = చక్కని లలాటమును, అరచంద మామఁ = అర్ధచంద్రుని, ఏలిన = బంటుగాచేసికొన్న, దొరగాఁ = ప్రభువని, ఎన్నుదురు = గణిస్తారు; జవ్వనికిఁ = ఆ యౌవనవతికి, ప ల్కుదురుఁ = దంతములయొక్క పొందికను, పరువంపు = వికసిస్తున్న, మొల్ల మొగ్గలకు, దొరగాఁ = సమానమన్నట్లు, పల్కుదురు = చూచినవా రంటారు.

*విశేషము* :— ఈ పద్యంలో మొదటి దొర ప్రభువనిన్నీ రెండవదొర సమానమనిన్నీ అర్థం చేసుకో వాలి.

ఈ మాటలు తాను గదుడు మొదలైనవారివల్ల వినినవే, కాబట్టే ఎన్నుదురు, పల్కుదురు అని అన్నాడు,

*అలంకారము* : యమకము, ఉపమ,

అలకలు నీలము లధరం
బల పగడము గోళ్ళు ము త్తియంబు లటంచున్
దెలుప మును విందుఁ జిలుకల
కొలికి తెఱంగెల్లఁ బూస గ్రుచ్చిన రీతిన్. 79

అర్థము :— అలకలు = ముంగురులు. నీలములు = ఇంద్రనీలమణులు అని. అధరంబు = పెదవి. అల పగడము = శ్రేష్ఠమగు పగడము అని. గోళ్ళు, ము త్తియంబులు = ముత్యాలు. అటంచున్ = అని. చిలుకలకొలికి = ఆ చక్కని కన్య సుభద్రయొక్క, తెఱంగు = సౌందర్యము. పూస గ్రుచ్చిన రీతిన్ = పూసలు గ్రుచ్చినట్లుగ-వరుస తప్పకుండా, తెలుపన్ = చెప్పగా, మును = యింతకుముందు. విందున్ = వినియున్నాను.

తాత్పర్యము :— ముంగురులు నీలాలని, పెదవి పగడమని, గోళ్ల ముత్యాలని ఆ కాంత సౌందర్యము వర్ణించగా ఇంతకుముందే వినియున్నా నని అర్జునుడు అనుకుంటున్నాడు.

విశేషము :— నీలమణులు, పగడములు, ముత్యాలు, వీటిని పూసలుగా చేసి వాటిని హారాలుగా గుచ్చి వాడడము ఉన్నది.

స్త్రీలు పూసలు గ్రుచ్చినప్పుడు ఏ పూస తరువాత ఏ పూస గుచ్చాలో శ్రద్ధగా చూచి అనగా సక్రమముగా కూర్చడము అవసరము.

నీలాలు, పగడాలు, ముత్యాలు, కూర్చిచేసిన మణిమాల వలె సుభద్ర ఉన్నదని చమత్కారము.

పూసగ్రుచ్చినట్లు — ఇదొక చక్కని పలుకుబడి = వరుస తప్పకుండా అని అర్థము. 'తూచా తప్పకుండా' అన్న పలుకుబడి వంటిదే.

అలంకారము : పరికరాంకురము.

అనుచు నాకన్యఁ గై కొను నాసఁ దగిలి
యతులకు విధేయు లగుదురు యాదవు లని,
తను నెఱుఁగకుండవలె నన్యు లనియుఁ దలఁచి,
యనుచర జనంబు నందంద పనిచి, యంద, 80

అని అర్జునుడు తలచుకుంటూ, సుభద్ర విషయమై కార్యారంభానికి పూనుకుంటున్నాడు.

అర్థము :— అనుచున్ = అని తలచుకుంటూ, ఆకన్యన్ — ఆ చిన్నదానిని, కై కొను = పాణిగ్రహణము చేసుకోవాలన్న, ఆసన్ దగిలి = ఆశతో, యాదవులు = కృష్ణుని వంశము

వారు, యదువంశమువారు— యతులకు = సన్యాసులకు, విధేయు లగుదురు = వినయము చూపుతారు, అనియు = అనిన్నీ, అన్యులు = ఇతరులు, తనుక, ఎఱుఁగకుండవలెననియు = ఇతరులు తన్ను గుర్తించకుండా ఉండాలనీ, తలఁచి, అనుచర జనంబుక = తన పరివారములోనివారిని, అందంద = దూరదూరముగా, పనిచి = పంపించి, యంద = ఆచోటనే...తరువాతి కన్వయము

తాత్పర్యము :— అర్జునుడు సుభద్రమీదగల ఆశతో యాదవులు యతులకు విధేయులుగా ఉంటారనిన్నీ, తన్ను ఇతరులు గుర్తించకుండ ఉండవలెనని తలచి, పరివారమును దూర దూరముగా పంపివేసి ఆ స్థలములోనే......

విశేషము :— కైకొను (కై = చేయి, కొను = పట్టుకొను) పాణిగ్రహణము చేయు.

కృష్ణుడు (యాదవుడు) విష్ణువే; విష్ణుడు తన భక్తులకు లొంగి ఉంటాడని ప్రసిద్ధి. కాబట్టి యాదవులు యతీశ్వరులంటే చాలా భక్తి వినయాలు కనబరుస్తారు.

అందంద అనుటవల్ల వేరువేరు చోటుల కని గ్రహించాలి.

మృగనాభి తిలకంబు బుగబుగ ల్గల లలా
టముపై మృ దూర్ధ్వ పుండ్రంబు దీర్చి,
తపనీయ కౌశేయ ధౌరేయ మగు కటీ
రమునఁ గాషాయ వస్త్రము ధరించి,
శర ణాగ తాభయ సంధాయకం బైన
దక్షిణపాణిఁ ద్రిదండ మూని,
రణచండ కోదండ గుణ కిణాంకం బైన
డాకేల నునుఁ గమండలుపు దాల్చి,
యుండెఁబో శాంతరస మెల్ల నుట్టి పడఁగ,
నంగనల పొందు రోసి సన్న్యాసి యగుట
గద యుచిత మెందు, నా నవమదన మూర్తి
యంగనామణిఁ గోరి సన్న్యాసి యయ్యె. 81

అర్జునుడు యతివేషమును ధరిస్తున్నాడు.

అర్థము :— ౧. మృగనాభి తిలకంబు = కస్తూరితోడిబొట్టు యొక్క. బుగబుగల్ = ప్రసన్నకొనుచుండే సువాసనలు, కల = దినదినము పెట్టుకొనుటచేత (ఆ సువాసన) కలిగిన, లలాటముపైన్ = నుదుటిమీద, మృత్ = మన్ను (తిరుమణి-తిరుమణి)తో పెట్టుకున్న, ఊర్ధ్వ పుండ్రంబు = నిలువు నామాలను, తీర్చి = దిద్ది.

కస్తూరి తిలకము పెట్టుకొనే నుదుట తిరుమణితో నామాలు దిద్దాడని భావము.

౨. తపనీయ = బంగారు (జలతారు) గల, కౌశేయ = పట్టువస్త్రమును, ధౌరేయమగు = ధరిస్తూఉండే, కటీరమునన్ = మొలయందు, కాషాయ వస్త్రమున్ = కావి రంగు బట్టలను, ధరించి,

పట్టువస్త్రాలు కట్టే మొలను కాషాయరంగు బట్టలు కట్టాడని భావము.

౩. శరణాగత = శరణు చొచ్చిన వారికి, అభయ = అభయమును, (భయములేదను రక్షణను), సంధాయకంబు = ఇచ్చునట్టిది, ఐన(టువంటి), దక్షిణపాణిన్ = కుడిచేతియందు, త్రిదండము = మూఁడుదండములు కూర్చి కట్టి సన్యాసులు పట్టుకొనే దండమును, ఊని = పట్టుకొని.

ఆర్తులకు అభయమిచ్చే కుడిచేతిలో త్రిదండము పట్టుకున్నాడని భావము.

౪. రణ = యుద్ధములందు, చండ = తీక్షణముగనుండు, కోదండ = వింటియొక్క, గుణ = అల్లెత్రాడువల్ల (దాని రాపిడివలన) గలిగిన, కిణ = కాయలు, అంకంబులైన = గుర్తులుగాగల, డాకేలన్ = ఎడమచేతియందు, నును = నున్ననై మెరుస్తున్న, గమండలువు = కుండికను, తాల్చి = ధరించి,

అల్లెతాడు రాపిడివల్ల కాయలు కాసిన ఎడమ చేతితో కమండలువు పట్టుకున్నాడు,

శాంతరసమెల్లన్, ఉట్టిపడఁగన్ = వెలికుబికి వచ్చునట్లు, ఉండెపో = (వేషముమార్చి) ఉండెను సుమా; ఎందున్ = ఎక్కడనైనా, అంగనల = స్త్రీల, పొందు = సాంగత్యమును, రోసి = అసహ్యించుకొని, సన్యాసి అగుట(యే)కద, ఉచితము = న్యాయము. ఆ నవమదన మూర్తి = పునర్జీవితుడైన మన్మథుని ఆకారముగల ఆ అర్జునుడు, అంగనా మణిన్ = నారీతిలకమును, కోరి = కామించి, సన్యాసి అయ్యెన్ = సన్యాసివేషము వేసెను.

విశేషము :— సాధారణంగా స్త్రీల సాంగత్యమును అసహ్యించుకున్నవారే సన్యాసులవుతారు, ఇతడు స్త్రీని కోరి సన్యాసి అయాడు. ఇది లోక వ్యవహారానికి విరుద్ధము.

ఈ గీతములోనున్న విరోధము 'సన్యాసి యయ్యెన్' సన్యాసి వేషమును వేసెను అనడం వల్ల తీరిపోతుంది.

దీర్ఘ పాదముల మొదటి వన్నియు రాజచిహ్నములు, రెండవ సన్యాసివి లక్షణములు అర్తులు శరణు గోరినపుడు కుడిచేతితోడనే యభయ మిచ్చుట యాచారము.

త్రిదండము -— మనోదండము, వాగ్దండము, కర్మదండము అని మనోవాక్కాయ నిగ్రహానికి సూచకములుగ మూఁడు దండములను, కర్రలను, కలిపి యొక్క దండముగాకట్టి సన్యాసులు పట్టుకొని ఉంటారు. వారిని త్రిదండు లంటారు.

చండకోదండ మన విశేషముగ నుపయోగింప బడునది అని గ్రహించవలెను. అప్పుడు దాని అల్లెత్రాటి ఒరయిక వలన ఎడమచేయి కాయలు కాయడం సహజము.

పెద్దచరణాలలో మొదటి భాగములో సాధారణంగా అర్జునుడి వేషములోని ఉదాత్తత అంతా కనిపించినట్లు చెప్పి. కవి 'ఊర్ధ్వపుండ్రముతీర్చి' కాషాయవస్త్రము ధరించి, 'త్రిదండ మూని', 'కమండలువు దాల్చి' అని తేలికగా చెప్పడం ఒక చమత్కారము. పద్యము చదివి నప్పుడే అతడి రెండు వేషాలలో ఉన్న వ్యత్యాసము గోచరిస్తుంది.

అలంకారము : విరోధాభాస, చిత్రాలంకారము, యమకము,

ఇటులుండి 'తనదు కోరిక
ఘటియింప హలాయుధుండు గాఁ డనుకూలుం;
డటులైన నేమి? యఘటన
ఘటనా చతురుండు గలఁడకా హరి' యనుచున్. 82

అర్థము :— ఇటులు, (సన్యాసి వేషములో) ఉండి, 'తనదుకోరికన్, ఘటి యింపన్ = సిద్ధించుటకు, హలాయుధుండు = నాగలిని ఆయుధంగా కల బలరాముడు, కాడు అనుకూలుండు = ఒప్పుకొనేవాడు కాడు; ఐనన్ ఏమి = అయినా చింతలేదు, అఘటన = సమ కూడని పనిని, ఘటనా = సమకూర్చగల, చతురుఁడు = నేర్పుగలవాడు, హరి = శ్రీకృష్ణుడు, కలడ కా = (ప్రాపుగ) ఉన్నాడే కదా, అనుచున్ = అనుకుంటూ......

తాత్పర్యము : సన్యాసివేషంలో ఉండి అర్జునుడు తన కోరిక సమకూరేందుకు, బలరాముడు అడ్డుతగులుతాడనీ, అయినా, పమకూడని కార్యాలను సమకూర్చే నేర్పుగల కృష్ణుడు తనకు ప్రాపయి ఉన్నాడు కదా అనీ ధైర్యము తెచ్చుకుంటూ...తర్వాతి పద్యంతో అన్వయము.

విశేషము :—(పద్యంలో అర్జునుడికి కల్గిన నిబ్బరమైన ప్రపత్తి స్పష్టమవుతూంది.

అలంకారము : కావ్యలింగము.

గోపాల నందనుం డా
గోపాలక చక్రవర్తి కోమల దివ్య
శ్రీపాద పద్మములు దన
లోపలఁ దలపోయ నంతలోపల వేగన్. 83

అర్థము :— గోపాలక = స్వర్గమును పాలించే ఇంద్రునియొక్క, నందనుఁడు = కొడుకైన అర్జునుడు, ఆ గోపాలక చక్రవర్తి = గోపకు చక్రవర్తి (కృష్ణుని) యొక్క, కోమల = మృదువైన, దివ్య = గొప్ప మహత్త్వము కలిగిన, శ్రీపాదపద్మములు = పవిత్ర మయిన పాదపద్మములను, తనలోపలఁ, తలపోయఁగ = స్మరించగా, అంత లోపలఁ = ఆ క్షణమే, వేగఁ = శీఘ్రముగా......

తాత్పర్యము :— కృష్ణుడు కలడు కదా అని అర్జునుడు మనస్సులో అతని పాదపద్మాలను ధ్యానించేసరికి, అంతలోనే...... తర్వాతి పద్యంతో అన్వయము.

విశేషము :— గో అనగా భూమి, గోపాలుడు అనగా భూమిని పాలించేరాజు. కాబట్టి, గోపాలనందనుడు = రాజనందనుడు = రాజనందనుడైన అర్జునుడు అనిగూడా చెప్పవచ్చును.

గోపాలురు అనగా గోవులను పాలించేవారు, కాబట్టి, గోపాలక చక్రవర్తి = యాదవులకు రాజు. కృష్ణుడు.

"కోమల దివ్యశ్రీ పాదపద్మములు." ఈ మాటలు అర్జునుడికి కృష్ణుడిపైగల భక్తి గౌరవాలను సూచిస్తున్నాయి.

అలంకారము :— యమకము.

సొన్నపు సన్న చేలఁ గటిఁ జుట్టి, కిరీటము మౌళిఁ దాల్చి, రే
మన్నియ తోడఁ బుట్టు పెనుమానిక మక్కునఁ జేర్చి, వచ్చి, చెం
త న్నిలిచెన్ దయారస మెదం బొదువన్ యదువంశ దుగ్ధ వా
రాన్నిధి పూర్ణిమా విశదరశ్మి దరస్మిత చారు వక్త్రుఁడై. 84

అర్థము :— సొన్నపు = బంగారువన్నె, సన్నచేల = జిలుగువస్త్రమును, కటిఁ = మొలయందు. చుట్టి = కట్టుకొని, కిరీటము, మౌళిఁ = శిరస్సున, తాల్చి = ధరించి, రేమన్నియ తోడఁబుట్టు = (రాత్రికిరాజు) చంద్రునితోకూడా పాలసముద్రమున పుట్టిన, పెను మానికము = పెద్దరత్నమైన కౌస్తుభమణిని, అక్కునఁ = వక్షస్థలమందు, చేర్చి = ధరించి, యదువంశ (ము అను) దుగ్ధ వారాన్నిధి = పాల సముద్రమునకు, పూర్ణిమా = పున్నమనాటి, విశదరశ్మి = ధవళ కిరణములు కల్గిన చంద్రునివంటివాడు, కృష్ణుడు, దరస్మిత = చిఱునవ్వుతో ఉన్న, చారు = సుందరమైన, వక్త్రుఁడై = ముఖముకలవాడై, దయారసము, ఎదఁ = హృదయములో, పొదువగాఁ, వచ్చి, చెంతఁనిలిచెఁ = దగ్గరగా నిలబడ్డాడు.

తాత్పర్యము :— పీతాంబరం ధరించి, తలను కిరీటము దాల్చి, కౌస్తుభమణిని వక్షస్థలమున ధరించి, యాదవ వంశానికి చంద్రుడివంటి కృష్ణుడు చిరునవ్వుతో, సుందరమైన

మోముతో, హృదయంలో దయారసం ఉప్పతిల్లగా, అర్జునుడికి సాక్షాత్కరించి ప్రక్కనే నిల బడ్డాడు.

విశేషము :— సువర్ణపు-సొన్నపుచేల అంటే కృష్ణుడు బంగారు వన్నెకల పీతాంబరం ధరించాడు. అంతేకాని, బంగారపు వస్త్రము అని చెప్పడం సమంజసము కాదు.

రేమన్నియ - (రాత్రికి ప్రభువు) చంద్రునియొక్క, తోడబుట్టు = తోబుట్టు (సోదరి) అయిన కౌస్తుభమణిని అని చెప్పవచ్చును.

ఇక్కడ, యదువంశమే క్షీరసాగరం అని, కృష్ణుడు అందులో ఉద్భవించిన పున్నమ చంద్రుడనీ రూపకం.

ఈ పద్యంలో ఉదాత్తతను చక్కగా పోషించాడు కవి. కృష్ణుని వర్ణనలో, కృష్ణుడి దివ్యత్వమూ, అర్జునుడిపై గల వాత్సల్యమూ బాగా వ్యక్తమౌతున్నాయి.

అలంకారము :— ఉదాత్తము, యమకము, రూపకము.

అప్పుడు సామి తాఁ దలఁచినంతనె వచ్చె నటంచు విస్మయం
బుప్పతిలంగ, వేడ్క ననలొత్తఁగఁ, గన్నుల హర్ష బాష్పముల్
చిప్పిలఁ, జక్రి పాద సరసీజములం బ్రణమిల్లి త ద్రుచుల్
రెప్పల నప్పళించుచును లేవక యుండఁగ సంభ్రమంబునన్, 85

అర్థము :— అప్పుడు, సామి = కృష్ణుడు, తాన్ తలఁచినంతనే, వచ్చె నటంచు, విస్మయంబు = ఆశ్చర్యము, ఉప్పతిలంగ = పుట్టగా, వేడ్క = సంతోషము, ననలు ఒత్తఁగన్ = మొలక లెత్తగా, కన్నులన్, హర్షబాష్పముల్ = ఆనందాశ్రులు, చిప్పిలన్ = రాలుతుం డగా, చక్రి = కృష్ణునియొక్క, పాద సరసీజములన్ = పద్యములవంటి పాదములకు, ప్రణ మిల్లి = నమస్కరించి, తత్‌రుచుల్ = ఆపాదముల కాంతులను, రెప్పలన్, అప్పళించుచున్ = లోగొనుచు, లేవకయుండఁగన్, సంభ్రమంబునన్ = తొందరపాటుతో.

తాత్పర్యము :— తలంచుకున్నంతనే కృష్ణుడు ప్రత్యక్ష మయాడు కదా అని ఆశ్చర్యానందాలతో అర్జునుడు, ఆనందబాష్పాలు వర్షిస్తూ, కృష్ణుడి పాదకమలాలకు సాష్టాంగ నమస్కారంచేసి లేవకుండా ఉండగా, కృష్ణుడు తొందరగా...తరువాతి కన్వయము.

విశేషము :— ఈ పద్యములో కృష్ణుని 'సామి' అనడం సాభిప్రాయము; సామి = దేవుడు.

కృష్ణుడిపై అంత నమ్మకము కలిగిన అర్జునుడు కూడా అంతవేగముగ వస్తాడనుకోలేదన్నమాట. అందుకే కృష్ణుడు సాక్షాత్కరించగానే విస్మయం కల్గింది. తనపై అంత దయకలిగి ఉన్నందుకు వేడ్క - ఆనందము.

అర్జునుడు కృష్ణుడి పాదాలపైబడి లేవకపోవడానికి కారణం : తాను చెప్పదలచుకొన్నది ఎట్లా ఉపక్రమించడం అని ఆలోచిస్తూనో సంకోచంతోనో అదీకాక, భగవంతుడైన కృష్ణుడే గ్రహించుకోలేక పోతాడా అనో అనుకోవచ్చు.

*అలంకారము* :— పరికరము.

> గ్రుచ్చి కవుంగిలించుకొని కూరిమితోఁ గుశలంబు వేఁడి తా
> వచ్చిన రాక లోఁదెలిసి "ద్వారక రైవతకాద్రి పొంతనే
> యిచ్చటికిన్ సమీప" మని కృష్ణుఁడు తెల్పుచుఁ దోడి తేరఁగా
> వచ్చె రథంబుపై నపుడు వాసవి వేసవి యేఁగు నంతటన్. 86

*అర్థము* :— గ్రుచ్చి కవుంగిలించుకొని = గట్టిగా ఆలింగనం చేసుకొని, కూరిమితో = నెయ్యముతో, కుశలంబు వేడి = పాండవాదుల క్షేమవార్తల నడిగి తెలుసుకొని, తా వచ్చిన రాక = అర్జునుడువచ్చిన ఉద్దేశమును, లోన్ = మనసులో, తెలిసి = గ్రహించుకొని, "ద్వారక = ద్వారకానగరము, రైవతక అద్రి పొంతనే = ఆ కనబడుతూన్న రైవతపర్వతము ప్రక్కనే కలదు, ఇచ్చటికిన్, సమీపము'' అని, తెలుపుతూ, రథంబుపైన్, కృష్ణుడు, తోడితేరగాన్ = తీసికొనిరాగా, వేసవియేఁగునంతటన్ = ఎండకాలము గడచిపోయిన, అప్పుడు = ఆ సమయమున, వాసవి = ఇంద్రుని కొడుకైన అర్జునుడు, వచ్చెన్.

*తాత్పర్యము* :— కృష్ణుడు అర్జునుని గాఢాలింగనము చేసుకొని, అతని అభిప్రాయము గ్రహించి, "అదిగో అర్జునా ఆ కనిపిస్తున్న రైవతమన్న కొండ సమీపంలోనే ద్వారక ఉంది, ఇక్కడికి చాల దగ్గర" అని చెప్పి అతడిని రథముమీద తీసుకొని పోయాడు,

*విశేషము* :— తన కోరిక యిదీ అని చెప్పుకోవలసిన దైన్యము కలుగనీయకుండా, కోరిక అంతరంగంలోనే తెలుసుకొనడము గొప్పనుగుణ మంటారు.

సంభ్రమముతో గ్రుచ్చి యెత్తడముతో తన కూరిమిని, కుశలంబువేడి తన బంధుప్రీతిని, ద్వారక యిక్కడే అని అర్జునుడిని తీసుకుపోవడంతో తన సభ్యతనీ కృష్ణుడు ప్రకటించాడు.

కవి ఆకాలంలోని ఆస్థానమర్యాదలను చక్కగా నిరూపించాడు. కృష్ణపాత్రను ఆరంభము నుంచీ చాల శ్రద్ధతో పోషించాడు.

## రైవతకోత్సవము

వచ్చి రైవత కారామ వాటి నిల్చి,
కృష్ణుఁ డం దిష్టగోష్ఠి నారేయిఁ గడపి,
'యిచట నుండుము, తావ కాభీష్ట మిపుడ
చేయుదు' నటంచుఁ బైతృష్వ సేయు నిలిపి, 87

అర్థము :— వచ్చి, రైవతక (గిరియందున్న) ఆరామవాటిన్ నిల్చి = ఉద్యానవనంలో ఆగి, కృష్ణుఁడు, అందు, ఇష్టగోష్ఠిన్ = ప్రియమగు సంభాషణలతో, ఆ రేయిన్ = ఆరాత్రి, కడపి, ''ఇచటన్ ఉండుము, తావక = నీ యొక్క, అభీష్టము = కోరికను, ఇపుడ = అనతి కాలములో - అతిత్వరగా, చేయుదున్ = సమకూరుస్తాను'' అటంచు, పైతృష్వసేయున్ = మేనత్తకుమారుని - అర్జునుడిని నిలిపి...

తాత్పర్యము :— ఆ రాత్రి రైవత పర్వతం పైనే గడిపి, కృష్ణుడు 'ఇక్కడే ఉండు, నీకోరిక నెరవేరుస్తాను' అని అర్జునుడిని అక్కడ నిలిపి — తర్వాతి పద్యంతో అన్వయము.

విశేషము :— "ఇపుడ సేయుదు'' — ఇపుడే చేస్తాను. అని కృష్ణుడు అర్జునుడి మనస్సులో ఉన్న తొందరపాటును గ్రహించి, దాని కనుకూలంగానే అన్నాడు. ఇందువల్ల, అర్జునుడికి ప్రోత్సాహం కలిగించడమేకాకుండా, తర్వాతి పద్యాలలో కృష్ణు డెంత తొందరగా ఆ ప్రయత్నాలను కొనసాగించాడో తెలుస్తుంది.

పితృష్వస = తండ్రియొక్క సోదరి = మేనత్త, పైతృష్వసేయుడు = మేనత్త కొడుకు, ఇక్కడ, ఈ పదంవల్ల కృష్ణుడికీ, అర్జునుడికీ ఉన్న సంబంధం కవి తెలియజేశాడు.

కృష్ణుడి తండ్రి అయిన వసుదేవుడి చెల్లెలు పృథ (కుంతి). కుంతిభోజుడికి ఆమె దత్త పుత్రిక, ఆమె కొడుకు అర్జునుడు. కాబట్టి మేనత్త కొడుకు.

చిన్న పద్యము కాబట్టి చిన్న శబ్దాలంకారమయినా ఉంచాలని కవి ప్రయత్నము.

అలంకారము :— వృత్త్యనుప్రాసము.

ద్వారక కేఁగి, యందు బుధ వర్గము బంధు జనంబు లాప్తులుం
గోరి భజింప నుండి, యొకకొన్ని దినంబుల మీఁద భక్తమం
దారుఁడు వాసుదేవుఁడు ముదంబున రైవత కాచ లోత్సవ
శ్రీ రచియింపఁగా వలయు రే పని మంత్రులఁజూచి పల్కినన్, 88

కృష్ణుడు తాననుకున్న కార్యానికి శుభప్రారంభము చేస్తున్నాడు.

*అర్థము* :— ద్వారకకు ఏఁగి, అందు, బుధవర్గముల్ = పండితుల సమూహమున్ను, బంధు జనంబులు(న్ను), ఆప్తులు = స్నేహితులున్ను, కోరి భజింపన్ = ప్రేమతో కొలుస్తూండగా, ఉండి, ఒక కొన్ని దినంబుల, మీఁదన్ = తర్వాత, భక్తమందారుఁడు = భక్తులు కోరిన కోరికలనిచ్చే కల్పవృక్షమువంటివాడైన, వాసుదేవుఁడు = కృష్ణుడు, ముదంబునన్ = సంతోషముతో, మంత్రులన్ చూచి, రైవతక అచల = రైవత గిరి (మీదచేయవలసిన) ఉత్సవ = పండుగుయొక్క, శ్రీన్ = శోభను, ప్రయత్నమును-రేపు, రచియింపఁగాన్ = చేయఁగా, వలయు, అని, పల్కినన్.

*తాత్పర్యము* :— ద్వారకకువచ్చి, కొన్ని దినాలు గడిపిన తర్వాత, "రేపు రైవత పర్వతంపై ఉత్సవానికి సన్నాహం చేయవలసిందని'' మంత్రుల కాజ్ఞాపించగా ... (తర్వాతి పద్యాని కన్వయము)

*విశేషము* :— కృష్ణుడు ద్వారకలో "ఆ కొన్ని దినాలూ" ఉత్సవం జరపవలసిన తిథికోసము వేచిఉంటూ గడిపా డని ఊహించాలి.

ఈపద్యంలో కృష్ణుడిని 'భక్తమందారుడు' అనడం సాభిప్రాయము. భక్తుడైన అర్జునుడి కోరికలు తీర్చే వాడని ధ్వని.

ఉత్సవ తిథి కోసం వేచి ఉన్న దినాలలో గూడా అర్జునుడి కోరిక సంగతి మరచిపోలే దని తెల్పడానికే భక్తమందారుఁడు అని కవి అన్నాడు.

*అలంకారము* :— పరికరము.

అప్పుడె వారుఁ దీర్పరుల నందులకున్ సమకూర్చి, జాళువా
యొప్పుల కుప్పలై మెఱయుచుండెడు మేరువులుం గురుంజులున్
జప్పరముల్ వితానములు సర్వము నాయితపెట్టి, కానుకల్
దెప్పలుగా నమర్చి రతి తీవ్రత రైవత కాచలంబునన్. 89

*అర్థము* :— అప్పుడె = కృష్ణుని ఆజ్ఞయైన వెంటనే, వారున్ = మంత్రులును, తీర్పరులన్ = ఆయా పనుల పెత్తనము చేసేవారిని, అందులకున్ = ఆ పనులకు, సమకూర్చి = నియమించి, అతితీవ్రతన్ = మిక్కిలి వేగంగా, రైవతక, అచలంబునన్ = కొండమీద, జాళువా = మేలిమి బంగారముతో నిర్మించిన, ఒప్పులకుప్పలై = ముద్దులొలుకుతూ మెరుస్తూ ఉన్నట్టి, మేరువులున్ = గుడారములున్ను, కురుంజులున్ = మంచెలున్ను, చప్పరముల్ = పందిళ్లున్ను, వితానముల్ = మేలుకట్లు - చాందినీలున్ను, సర్వమున్ = ఇంకా కావలసినవన్నీ, ఆయితపెట్టి = సిద్ధముచేసి, కానుకల్, తెప్పలుగాన్ = మిక్కిలి విశేషముగా, అమర్చిరి = పొందుపరిచారు.

విశేషము :— అప్పుడే - అతితీవ్రతఁ అనడంవల్ల కృష్ణుడు తన ఆజ్ఞలో కన బరిచిన తొందరనే మంత్రులుగూడ అవలంబించా రన్నమాట.

జాళువా యొప్పుల = కుందనపు సొగసులయొక్క. కుప్పలై = ప్రోవులై అని అర్థం. బంగారు జలతారు మొదలైన వాటితో చికిలి పనులు చేసినవి అని భావము. మేరువులు గుడా రములు మొదలైనవి కుప్పలవలె కన్పిస్తాయి అని చమత్కారము. ఈ అర్థంతో అతిశయోక్తి పోయి, వర్ణన స్వభావోక్తి క్రిందికి వస్తుంది.

ఈ పాఠంలో కర్త వారు - మంత్రులు. వారు తీర్పరుల ద్వారా ఈ పనులన్నీ చేశారు- చేయించారు అని.

పాఠాంతరము :—

"తీర్పరుల నందులకుఁ సమకూర్ప"

— తిరుపతివారూ, కృష్ణమాచారిగారు.

ఈ పాఠంలో కర్త మంత్రులకు బదులు తీర్పరులు అవుతుంది.

అపు డొకమాటఁ గంసరిపుఁ డానతి యిచ్చెనొ లేదొ, మంచి చొ
క్కపుఁ గపురంపు గిన్నియలు కస్తురి వీణెలు రాశిగాఁగఁ గొం
డపొడవు దెచ్చి పైచి రచటన్, మఱి తక్కిన వస్తులంటి మా,
యపరిమితంబు లేమనఁగ నవ్విభు పట్టణ భాగ్య సంపదల్! 90

అర్థము : - అపుడు, కంసరిపుఁడు = కంసుని చంపిన కృష్ణుడు, ఒకమాట, ఆనతి = ఆజ్ఞ, ఇచ్చెనొలేదొ, ఇచ్చిన నిముసములోనే (అంత వేగముగ), మంచి, చొక్కపు = స్వచ్ఛమైన, కపురంపు గిన్నియలు = పచ్చకర్పూరముతో నిండిన భరిణెలు-డబ్బాలును కస్తురి వీణెలు = కస్తురి ఉండే సంచులును, కొండ పొడవు రాశిగాఁగఁ = కొండల యంత యెత్తు పోగులుగా తెచ్చి అచటన్ పైచిరి = (అనాయాసముగా) తీసికొని వచ్చి అక్కడ పడ వేశారు. మఱి తక్కిన వస్తు (వు) లంటిమా = తక్కిన వస్తువుల విషయమా, అపరి మితంబులు = ఇన్ని అన్ని అని చెప్పడానికి వీలుకాదు, ఆ విభు = ఆ రాజుయొక్క, పట్టణ = రాజధాని యందలి, భాగ్యసంపదల్ = ఐశ్వర్యసమృద్ధిని, ఏమనఁగ వచ్చున్ = చెప్పవీలుకాదు.

తాత్పర్యము :— కృష్ణుడు చెప్పిన ఉత్తర క్షణమందే, పచ్చకర్పూరమూ, కస్తురీ మొదలైన వెలగల సామగ్రి అంతా రాసులుగా తెచ్చి పడవేశారు. రాజధానిలోని సంపద వర్ణనాతీతము.

*విశేషము* :— కంసరిపు - తమ్ము బాధించే దుష్టుడైన కంసుడిని చంపినవాడు కాబట్టి కృష్ణునిపట్ల ప్రజలకు భక్తి. నిముషాలపై అంతా తెచ్చివైచిరి అని అనడంవల్ల నగరములోని ఐశ్వర్యాన్ని సూచించాడు కవి.

కస్తురి వీణెలు —అనగా, కస్తురిమృగము నాభిలోని కస్తురిసంచి; దీనిని వీజె అంటారు. ఆకార సాదృశ్యాన్నిబట్టి ఆ సంచులకు 'వీణెలు' అన్న పదము వ్యవహారంలోకి వచ్చిందేమో.

కర్పూరము - మన ప్రాంతములో ఎక్కువగా లభించదు కాబట్టి ఫార్మోజా మొదలైన ఇతర దేశాలనుండి భరిణెలలో దిగుమతి అవుతుండేది, కనుక, కర్పూరపు గిన్నెలు అని కవి వాడాడు.

*అలంకారము* :— పరికరము, ఉదాత్తము.

గంధ మా ల్యాభరణ వస్త్ర కలితు లగుచుఁ
గామినీ రత్నములుఁ దారుఁ గలసిమెలసి
చనిరి రైవత కోత్సవంబునకు నపుడు
వీరువా రన క య్యదువీరు వారు. 91

*అర్థము* :— గంధ = పరిమళముల పూతలు, మాల్య = పూలదండలు, ఆభరణ = నగలు, వస్త్ర = చీరలు, (వీటితో), కలితులు అగుచు = కూడినవారు - ధరించినవారయి, కామినీ రత్నములున్ = కాంతామణులును, తారు = మగవారును, కలసిమెలసి = సరదాగా చాలా స్నేహభావముతో, వీరు వారనక = వారు, వీరు అన్న భేదము లేకుండా, ఆ యదువీరు = (యాదవ వీరుడైన) ఆ కృష్ణునియొక్క, వారు = బంధువులూ ప్రజలూ, రైవతక ఉత్సవమునకు, అపుడు, చనిరి.

*తాత్పర్యము* :— ద్వారకానగరంలో ఉన్న స్త్రీపురుషులందరూ యథోచితంగా అలంకరించుకొని, వారూవీరూ అన్న భేదంలేకుండా, అందరూ కలసి రైవతకోత్సవానికి వెళ్లారు.

*అలంకారము* : యమకము.

కలయఁగఁ జెంద్ర కావి అవికం బలెఁ గుంకుమఁ బూసి 'చూడుమో,
పొలఁతుక ! నాదు నే' ర్పనినఁ 'బూసిన యట్లనె తెన్ను యున్నదే
బళి!' యని కేళిసీరమణి పల్కిన నవ్వుచు శంబరారి య
ర్మిలిఁ గయిసేసి యేఁగిరి గిరిం గన నా రుచిరాంగు లిర్వురున్. 92

అర్థము :— కలయఁగన్ = నిండుగా (వెలితిలేకుండా), చెంద్రకావి = సింధూరపు ఎరుపువన్నె కల, అవికన్ బలె = రవిక విధముగా కనిపించినట్టు, కుంకుమన్ పూసి = పరిమళ కుంకుమపువ్వు లేపనమును అలది, "ఓ పొలఁతుక = ఓ జవ్వనీ, చూడుము, నాదు నేర్పు అనన్ = చూచావా నానేర్పు" అని, శంబరారి = ప్రద్యుమ్నుడు, అనినన్ = అనఁగా, కేళినీ రమణి = రతీదేవి, "బళి, పూసినయట్లనె లెస్స యన్నదే = నీవు రచించిన రవిక పూసినట్లు గుత్తముగ సరిపోయినది, మేలు" అని, (చమత్కారంగా, నిజంగా కుంకుమపువ్వులు, పూచిన అర్థము వచ్చేలాగా) పల్కినన్ = చెప్పగా, నవ్వుచు = ప్రద్యుమ్నుడు, కయిసేసి = తానూ, అలంకరించుకొని, ఆ రుచిరాంగులు = ప్రకాశవంతములైన శరీరములు కలవారు, ఇర్వురున్ = వారిద్దరూ, గిరిన్ గనన్ = రైవతక పర్వతమును చూడడానికి, ఏఁగిరి = వెళ్ళారు.

తాత్పర్యము :— ప్రద్యుమ్నుడు రతీదేవిని అలంకరిస్తూ, ఆమె వక్షస్థలము మీద రవికవలె కుంకుమపూరంగు పూసి 'చూచావా, ఎంత బాగుందో' అని రతిని హెచ్చరించాడు, రతి దానికి తగినట్టుగా 'బలే ! ఈ రవిక పూసినట్టు, గుత్తముగా సరిపోయింది' అని బదులు చెప్పింది. ఇద్దరూ నవ్వుకొని అలంకరించుకొని రైవతక పర్వతానికి బయలుదేరారు.

ఈ పద్యములోని శంబరారి కృష్ణుడి కొడుకు - ప్రద్యుమ్నుడు, ఆ కేళినీరమణి పేరు ప్రభావతి.

విశేషము :— ఇక్కడ విలాసార్థము ప్రద్యుమ్నుడే రతీదేవిని అలంకరిస్తూ, రవిక ఏ విధంగా ఉంటుందో ఆ విధంగానే సిందూరవర్ణముగల కుంకుపూవు లేపనమును అలది 'చూచావా, రవిక ఎంత బాగుందో' అన్నాడు

దానికి జవాబుగా రతి 'బలే ! రవిక గుత్తంగా రంగుపూసి నట్టుంది' అని అన్నదని చమత్కారం,

ఆటలలో వినోదించే కేళిని కాబట్టి ఈలాంటి బదులిచ్చింది. ఇద్దరూ నవ్వుకున్నారంటే ఏమాశ్చర్యము !

ఉగ్గులూ ముడుతలూ లేకుండా, గుత్తంగా శరీరాన్ని అంటుకొని ఉన్నట్టు సరిపోతే 'రవిక పూసినట్టుందని' ఇప్పటికీ వాడుకలో ఉంది.

ఆ రోజులలో రాజకాంతలు వక్షస్థలాలను పూసుకొనే ఎర్రని లేపనము, కుంకుమపూవులతో తయారు చేసేవారు. అందుచేత 'నీవిచ్చిన రవిక సరిగా కుంకుమపూవు పూచినట్టే ఉంది' అని గూడా రతీదేవి ఉద్దేశించి ఉండవచ్చు.

అతడు రంగుపూసి 'రవిక లాగుం' దన్నాడు: ఆమె 'రవిక రంగు పూసినట్టుం' దన్నాది.

అలంకారము : అనుప్రాస.

రేవతి గుబ్బచంటి మకరీమయ రేఖ లురఃస్థలంబునన్
భావజ చిహ్న ముద్రలయి భాసిల, మేలిమి కందు దుప్పటిన్
బై వలెవాటు వైచి, నును మైజిగి గందపుఁ బూఁతయై తగన్
రైవత కాద్రి కేఁగె బలరాముఁడు కేళి కళాభి రాముఁడై. 93

అర్థము : రేవతి = (బలరాముడి భార్య) రేవతీదేవి యొక్క, గుబ్బవంటి = గుబ్బల వంటి కుచముల మీదనుండే, మకరీ మయ రేఖలు = మకరికల ఆకారముల లేపనపు వ్రాతలు, ఉరఃస్థలంబునన్ = తన (బలరాముడి)వక్షస్థలముమీద, భావజ = మన్మథునియొక్క, చిహ్న = ధ్వజముయొక్క, ముద్రలు, అయి, భాసిల్లన్ = ప్రకాశిస్తుండగా, మేలిమి = శ్రేష్ఠమైన, కందు దుప్పటిన్ = నీలిరంగు పట్టు శాలువను, పైన్ వలెవాటువైచి = మీద వల్లెవాటు వేసి కొని, నును = ప్రకాశిస్తూన్న, మై జిగి = శరీరపు కాంతి, గందపుఁ బూఁతయై తగన్ = చందనము పూసుకొన్నట్లు కనబడుతూండగా, కేళిక లాభిరాముఁడై = క్రీడలు ఆడడములో ప్రీతిగలవాడై బలరాముడు, రైవతక, అద్రికిన్ = కొండకు, ఏఁగెన్ = వెళ్లెను.

తాత్పర్యము :— బలరాముడు రేవతీదేవిని ఆలింగనము చేసుకున్నప్పుడు ఆదేవి స్తనాలమీద చిత్రించుకొని ఉన్న మకరికల గురుతులు బలరాముడి గుండెకు అంటుకొని, మన్మథుడి జండాముద్రలు వేసినట్టు కనబడుతుండగా, నీలిరంగు పట్టు శాలువా వల్లెవాటు వేసు కొని, తన తెల్లని దేహకాంతి చందనపు పూతలాగా కనిపిస్తూ ఉండగా ఆటలప్రీతి బాగా ఉన్న బలరాముడు రైవతక గిరికి బయలుదేరాడు.

విశేషము :— బలరాముడు తెల్లనివాడు ; కృష్ణుడికి పసుపురంగు చేలలాగా బలరాము నీలిరంగు చేల అలవాటు. భావజ చిహ్న ముద్రలు. కస్తూరికాది సుగంధ ద్రవ్యములతో రేవతి వక్షముపై లిఖించుకున్న మకరికాపత్రాలు బలరాముని వక్షముపై కనిపించడం ఆలింగనాదుల వల్ల అని చెప్పనక్కరలేదు. ఈ గుర్తులు మకరిక (మొసళ్ల) ఆకారంలో ఉన్నాయి. మొసలి మన్మథుడి ధ్వజము. ఆ ధ్వజముయొక్క ముద్రలు బలరాముడి గుండెమీద వేసినట్లున్నవన్న మాట. పాలకులు తమ వస్తువులను తమ ధ్వజాదిముద్రలతో అలంకరించడం సంప్రదాయము.

మన్మథుడి ముద్రలుండడంవల్ల బలరాము డతనికి వశంవదు డయ్యాడని కవి తెలుపు తున్నాడు. కాబట్టే, బలరాముడు కేళికళాభిరాముడు.

ఇంకా భావజచిహ్నముద్రలు అనగా మన్మథుని గుఱుతు తెలిపే ముద్రలు అనవచ్చు. భావజుడు భావములలో పుట్టువాడు, కనుక, ఆ గుర్తుగల హృదయములోనే ఉంటాడు. లోపల ఆ మన్మథుడి ఉనికి తెలుపడానికి బయట ఉంచిన ముద్రలు అని చమత్కారము.

బలరాముడు తెల్లనివాడు. కనుక తన శరీరకాంతి చందనము (తెల్లనిది) పూసినట్లున్న దని భావము. అందువల్ల, మకరీమయ రేఖలు మరింత స్ఫుటముగా కాన వస్తాయి. కనుకనే కవి భాసిల ప్రకాశిస్తుండగా అని ప్రయోగించాడు.

అలంకారము :— సమాసోక్తి, ఉత్ప్రేక్ష, అంత్యానుప్రాసము.

నగధరుని వెంట నడచిరి
మిగులం గై సేసి యటఁ దమిం గస్తూరీ
ఘుగఘుగలు నుదిరి బంగరు
నిగనిగ నెఱ యందె రవలు నెఱయం దెఱవల్. 84

అర్థము :— నగధరుని వెంటన్ = గోవర్ధన పర్వతమును ఎత్తిన కృష్ణుని వెంట, అటన్, తమిన్ = కోరికతో, కై సేసి = బాగా అలంకరించుకొని, కస్తూరీ ఘుగఘుగలును = కస్తూరియొక్క పరిమళమున్ను, ఉదిరి బంగరు = కుందనపు బంగారుతో చేయబడి, నిగనిగ (మెరుస్తున్న), నెఱ అందెరవలు = చక్కని అందెల యొక్క రవరవ అను ధ్వనులున్ను, నెఱయన్ = అలము కొనేలాగా, తెఱవల్ = కాంతలు, నడచిరి.

తాత్పర్యము :— కృష్ణుని వెంబడి కాంతలు అలంకరించుకొని నడుస్తూండగా, వారి లేపనముల కస్తూరీ వాసనలున్నూ అందెల రవరవధ్వనులున్నూ అలుముకొంటుండెనని భావము.

విశేషము :— అందె రవలు - అందెల నాదములు అని చెప్పడం ప్రమాదం - నాదమనడానికి రవము అంటారు కాని, రవ అనరు ... బహువచనము, రవములు.

రవ అన్నది ధ్వనియొక్క అనుకరణము ; చూ. "రవరవ మురజరవంబులు" — మనుచరిత్ర, కాబట్టి, రవలు = రవరవ అని చేయు ధ్వని అని అర్థము చెప్పుకున్నాము.

బాగా అలంకరించుకున్నారు కాబట్టి, కంటికీ, కస్తూరి ఘుగఘుగలు ముక్కుకీ, అందె రవలు చెవులకూ ఆనందాన్ని కలిగిస్తున్నా యన్న మాట.

అలంకారము :— యమకము.

పురజను లింపునం గనఁగఁ, బొంతల రుక్మిణి సత్యభామయుం
దొరయఁగ, దక్క నార్వురును దోఁ జన, నావెనుకం బదారువే
ల్తరుణులు గొల్చిరాఁగఁ, బ్రమదంబునఁ గృష్ణుఁడు వట్టివేళ్ల చ
ప్పరముల నీడనే యరిగెఁ బట్టిన దానుక తెల్లఁ జూచుచున్. 95

అర్థము :— పురజనులు, ఇంపునన్ = సంతోషముతో, కనఁగన్ = చూస్తుండగా, బొంతలన్ = రెండు ప్రక్కలా, రుక్మిణి సత్యభామయున్, దొరయఁగన్ = అంటి వస్తుండగా, తక్క = అష్టభార్యలలో మిగిలిన, ఆర్వురును = ఆరుగురును, తోన్ చనన్ = కూడి నడు

స్తుండగా, ఆ వెనుకఁ = వారల వెనుక, పదాఱువేల్, తరుణులు = యువతులు, కొల్చిరాఁగ, ప్రమదంబునన్ = సంతోషముతో, కృష్ణుడు, పట్టివేళ్ల (తో కట్టిన), చప్పరముల = చలువ పందిళ్ల, నీఁడనే, (నడచుచు), పట్టిన కాన్కలు = (సామంతాదులు నజరుగా) ఇచ్చిన కానుకలను, ఎల్లఁ, చూచుచుఁ, అరిగెన్.

తాత్పర్యము :— రుక్మిణీ సత్యభామలు ప్రక్కల నడుస్తుండగా, తక్కిన ఆరుగురు పట్టమహిషులూ, పదారువేల గోపికలూ అనుసరించిరాగా, కృష్ణుడు చలువపందిళ్ల నీడనే నడుస్తూ వెళ్లాడు.

ఆగతి నరిగి, సమస్త జ
నాగతి రైవతకగిరి మహా మహ లీలా
భోగము కన్నుల పండువ
యై గాఢ కుతూహలంబు నడరం జేయన్, 96

అర్థము :— ఆ గతి = ఆ ప్రకారము, అరిగి, సమస్త జన ఆగతిన్ = అందఱు జనులయొక్క రాకచేత, రైవతకగిరి (యందలి), మహా = గొప్పదైన, మహ = ఉత్సవము యొక్క, లీలా = విలాసముయొక్క, ఆభోగము = సమృద్ధి, కన్నులపండువయై, గాఢకుతూహలంబుఁ = ఎక్కుడు ఉత్సాహమును, అడరఁ చేయఁ = కలుగజేయుచుండగా,

అలంకారము :— యమకము.

## సుభద్ర రాక

మున్నతి భక్తి బూజలు సమున్నతిఁ దా మొనరించి, యాత్మ యో
షిన్నికరంబులం బిదప సేవ లొనర్పఁగఁ జేయుచుండిః రం
త న్నవరత్న హేమ రచితంబగు పల్లకి నెక్కి వేడ్కతో
నన్నలు రామకృష్ణులు రయమ్మున రమ్మని గారవింపఁగన్, 97

అర్థము :— తాము = బలరాముడు, కృష్ణుడు, మున్ను = తొలుత, అతిభక్తిఁ = మిగుల భక్తితో, పూజలు, సమున్నతిఁ = చక్కగా, ఒనరించి = చేసి, ఆత్మయోషిత్ నికరంబులఁ = తమ కాంతల సమూహములను, పిదపఁ = తమ తరువాత, సేవలు, ఒనర్పఁగఁ, చేయుచుండిరి; అంతన్, నవరత్న(ములు పొదిగిన), హేమ రచితంబగు = బంగారుతో చేయు

బడ్డ, పల్లకిన్, ఎక్కి, వేడ్కతోన్ = సంతోషముతో, అన్నలు (అగు), రామకృష్ణులు, బలరాముడూ, కృష్ణుడూ, రయమ్మున = తొందరతో, రమ్మని గారవింపఁగాన్.

తాత్పర్యము :— కృష్ణుడు, బలరాముడు మిక్కిలి భక్తితో పూజలు చేసి, తర్వాత స్త్రీ జనముచేత పూజలు చేయించారు. అంతలోనే, బలరామ కృష్ణులు ప్రేమతో రమ్మని గారవిస్తుండగా, రత్నమయమయిన బంగారు పల్లకిమీద (సుభద్ర అని తర్వాత పద్యంతో అన్వయం).

*పాఠాంతరము :*

1. "మున్నతిభక్తి బూజలు సమున్నతిఁ దా నొనరించి యాత్మయో
షిన్నికరంబులం బిదప సేవ లొనర్పఁగఁ జేయుచుండె, నంతన్"

—వేదమువారు.

ఈ పాఠంలో 'తాన్' అని ఏకవచనంతో ఒక్క కృష్ణుడినే సూచించడంవల్ల, బలరాముడిని విడిచి పెట్టిన ట్లవుతుంది. తర్వాత నాల్గవ పాదంలో రామకృష్ణులు అని ఇరువురూ ఉదాహరింపబడ్డారు కాబట్టి, ఇక్కడ కూడా 'తామొనరించి' అని ఉండడమే సమంజసము.

2. "..........పల్లకినెక్కి వేడ్కఁ దా
నన్నలు రామకృష్ణులు......గారవింపన్"

3. "............పల్లకి నెక్కి వేడ్క రా
నన్నలు రామకృష్ణులు.............."

*అలంకారము :— యమకము.*

చెలియలు సుభద్ర వచ్చెన్
చెలియలు వేయాఱులు నిరుచెంతలఁ గొలువన్
తొలకరి మెఱపో యిది యని
తొలకరిదొర బిడ్డ వెఱఁగుతోడం జూడన్. 98

*అర్థము :—* చెలియలు = చెలికత్తెలు, వేయాఱులు = వేలకొలది, ఇరుచెంతలన్ = రెండు ప్రక్కలా, కొలువన్ = సేవిస్తూ వస్తుండగా, తొలకరి మెఱపో యిది యని = ఈ వస్తున్నది తొలకరి కాలంలోని మెరుపా అని, తొలకరిదొర బిడ్డ = ఇంద్రుని కొడుకైన అర్జునుడు, వెఱఁగుతోడన్ = ఆశ్చర్యముతో, చూడన్ = చూస్తుండగా, చెలియలు = (బలరామ కృష్ణుల) చెల్లెలైన, సుభద్ర, వచ్చెన్.

తాత్పర్యము :— వేలకొలది చెలికత్తెలు ఇరువైపులరాగా, సుభద్ర వచ్చింది, సుభద్రను చూచి, అర్జునుడు, 'ఇది తొలకరి మెరుపా' అని ఆశ్చర్యపడ్డాడు.

విశేషము :— తొలకరి కాలంలో మెరుపులకు కాంతి ఎక్కువ అని వాడుక. తొలకరి దొర (పర్జన్యుడు) - ఇంద్రుడు.

అలంకారము :— యమకము, సందేహము.

యౌవత చూళి కాభరణ మప్పుడు కొందఱు బోంట్లు ముంగలన్
రైవత కోత్స వాగత జనంబు బరాబరి సేయుచుండఁద
ద్దేవత కర్చనా నతు లతి ప్రమదంబునఁ జేసెఁ బైపయిన్
దైవతరాజ నందను ధనంజయునిం బతిగాఁ దలంచుచున్. 99

అర్థము :— అప్పుడు, యౌవత = జవ్వనుల, చూళికా ఆభరణము = (శిరోభూషణము) శ్రేష్ఠురాలైన సుభద్ర, కొందఱు, బోంట్లు = చెలికత్తెలు, ముంగలన్, రైవతక, ఉత్సవ ఆగత = ఉత్సవానికి వచ్చిన, జనంబులన్, బరాబరి సేయుచుండన్ = త్రోవయొసఁగునట్లు తొలగజేస్తుండగా, దైవతరాజనందనున్ = ఇంద్రుని కుమారుడైన, ధనంజయునిన్ = అర్జునుని, పతిగాన్ = తన భర్త అయేటట్లుగా, తలంచుచున్, అతి ప్రమదంబునన్ = మిక్కిలి సంతోషంతో. తత్ దేవతకు = ఆ గిరిదేవతకు, పైపయిన్ = విశేషముగా, అర్చనా నతులు = పూజలును, మ్రొక్కులును, చేసెన్,

తాత్పర్యము :— చెలికత్తెలు బరాబరి చేస్తూ దారి చూపుతూ ఉండగా, సుభద్ర వచ్చి, అర్జునుడే తనకు భర్త కావాలి అన్న భావంతో విశేషంగా పూజచేసి నమస్కరించింది.

విశేషము :— బరాబరి—హిందూస్థాని పదము, సరిచేయుట అని అర్థము.

అలంకారము :— వృత్యనుప్రాసము.

ఆకరణిఁ బూజ లొనరించి యిష్ట సఖులఁ
గూడి యగ్గిరి కందరా కూట తట వి
నోద వైఖరు లెల్లఁ గన్గొనుచు సరస
గోష్ఠి నుండెడు పద్మరాగోష్ఠిఁ జూచి, 100

అర్థము :— ఆకరణిన్ = పైన చెప్పినవిధంగా, పూజలు ఒనరించి, ఇష్టసఖులఁ గూడి, అగ్గిరి = ఆ కొండయందలి, కందరా = గుహలయందును, కూట = శిఖరములయందును,

తట = చరియల యందును (గల), వినోద = వేడుక కలిగించు. వైఖరులన్ = విశేషములను, ఎల్లన్, కన్గొనుచున్, సరస గోష్ఠిన్ ఉండెడు = సరస సల్లాపములలో నున్న, పద్మరాగ ఓష్ఠిన్ = కెంపువంటి అధరముగల సుభద్రను - చూచి (అర్జునుడు).

తాత్పర్యము :— చెలికత్తెలతో కలసి అక్కడ కొండ గుహలలోనూ, శిఖరాల్లోనూ ఉన్న విశేషాలను చూస్తూ, సరససల్లాపాల నాడుకుంటూ ఉన్న సుభద్రను చూచి (అర్జునుడు) తర్వాతి పద్యంతో అన్వయం.

అలంకారము :— అనుప్రాస.

మును విన్నది తా నప్పుడు
గనుఁ గొన్నది యొక్కతీరుగాఁ దార్కాణై
పెనఁగొన్న మహైశ్వర్యం
బున న న్నరుఁ డిట్టు లనుచుఁ బొగడం దొడఁగెన్. 101

అర్థము :— నరుడు అర్జునుడు, మునువిన్నది, తాను, అప్పుడు, కనుఁగొన్నది., ఒక్కతీరుగాన్ = ఎచ్చుతగ్గులులేకుండా, తార్కాణై = నిదర్శనము కాగా, పెనఁగొన్న = అతిశయించు, మహైశ్వర్యంబున, ఇట్టు లనుచు, పొగడన్ దొడఁగెన్ = ఆరంభించెను.

విశేషము :— విన్నది, కన్నది — రెండూ ఒకదానితో ఒకటి పెనవేసుకోగా పెనగొన్న మహైశ్వర్యము అని చక్కగా ప్రయోగించాడు కవి.

అలంకారము :— అనుప్రాసము.

చూడమె దేవతా సతుల శోభన కాంతి విలాస వైఖరుల్ ?
చూడమె నాగ కన్యకల లోక మనోహర రూపసంపదల్ ?
చూడమె మర్త్య కామినుల సోయగముం ? దమకంబు పెల్లు తీ
పాడఁగ దీనివంటి యొఱపైన మిటారినిఁ జూడ మెందులన్. 102

అర్థము :— దేవతాసతుల = దేవలోకములోని కాంతలయొక్క, శోభన = సుందరమైన, కాంతి (యొక్కయు), విలాస(ము యొక్కయు), వైఖరుల్ = విధములను, చూడమె; నాగకన్యకల (యొక్క), లోకమనోహర = లోకుల మనస్సుల లోగొనగల్గిన, రూపసంపదల్, చూడమె; మర్త్యకామినుల = మనుష్య స్త్రీలయొక్క, సోయగమున్, చూడమె; ఎందులన్ = ఏచోటనైనా, తమకంబు = మోహము, పెల్లు తీపుఅడఁగన్ = మిక్కిలి మనోహరముగా _

ప్రేమాస్పదమై ఉండగా, దీనివంటి = ఈసుభద్రవంటి, ఒఱపు ఐన = అందమైన, మిటారిక = ఒయ్యారిని, చూడము.

*విశేషము* :— అర్జునుడు దివిజకాంతల నెప్పుడు చూచాడు అన్న సందేహం రావచ్చు కాని, పంచతీర్థాలలోని శాపగ్రస్తలైన అప్సర స్త్రీలకు శాపవిమోచనం కావించి ఎంతోకాలం కాలేదు. ఇక నాగకన్యక ఉలూచి, మర్త్యభామిని చిత్రాంగద అర్జునుడికి బాగా పరిచితలైన వారే. కనుక ఇది అతిశయోక్తికాదు, సత్యమే, సుభద్ర త్రిలోకసుందరి అని కవి ఈపద్యంలో చెప్పదలచుకున్నాడు.

*పాఠాంతరము* :—

"........చూడమె నాగకన్యకల
సుందరరూప మనోహరాంగముల్"

— కృష్ణమాచారి.

*అలంకారము* :— పర్యాయోక్తి.

చెక్కుల జిగి చనుగుబ్బల
చక్కఁదనము మొగముతేట జడతీ రౌరా !
చొక్కమగు దీనిఁ జూచినఁ
జొక్క మనం గూడ దెట్టి సుజ్ఞానులకున్. 103

*అర్థము* :— చెక్కుల = చెక్కిళ్ళయొక్క, జిగి = కాంతిన్నీ, చనుగుబ్బల చక్కదనమున్నూ, మొగము, తేట = అందమున్నూ, జడ తీరున్నూ, (ఇవి) ఔరా = ఆహా, చొక్కమగు = మిక్కిలి అందమగు, దీనిఁ, చూచినఁ = చూచినయెడల, ఎట్టి సుజ్ఞానులకున్ = ఎంతగొప్పజ్ఞానము కలవారికైనా, చొక్కము = మేము మోహింపము అని, అనన్ కూడదు = అనుటకు శక్తి ఉండదు.

*తాత్పర్యము* :— ' సుభద్ర శరీరసౌష్ఠవము చూచిన తర్వాత ఎటువంటి యతీశ్వరులైనా చలింపకుండా ఉండలేరు'' అని అర్జును డనుకుంటున్నాడు.

*విశేషము* :— ఇక్కడ అర్జునుడు యతిరూపంలో ఉన్నాడు కనుక యతీశ్వరులకు కూడా మోహం కల్పించే రూపం అని తాను భవిష్యత్తులో చేయబోయే పనిని సమర్థించు కుంటున్నాడు.

పాఠాంతరము :—

"దీని జూచిన, చొక్కక మనఁ గూడ దెట్టి సుజ్ఞానులకుఁ.

కృష్ణమాచారి.

ఆమె సౌందర్యమునకు వశులుకాక ఎట్టి జ్ఞానులూ బ్రతకలేరు అని.

అలంకారము :— అప్రస్తుత ప్రశంస, యమకము.

కన్నులు దీర్ఘముల్, నగుమొగం బవురా ! తలకట్టు తమ్మిపూ
పున్నమ చందమామలకుఁ, బొక్కిలి చక్కఁదనంబుఁ జెప్పఁగా
నున్నదె ? మేలు బంతులు పయోధరముల్, చిఱు కౌను సున్నయౌ,
నెన్నిక కెక్కు వ్రాఁతఫల మివ్వరవర్ణినికి న్నిజంబుగన్. 104

అర్థము :— కన్నులు, దీర్ఘముల్ = నిడుపైనవి. అవురా = బళీ, నగుమొగంబు = సహజంగా నవ్వుతున్నట్లుండే ముఖము, తమ్మిపూ పున్నమచందమామలకుఁ = పద్మమునకూ, నిండుచందురునకూ, తలకట్టు = పాగ (అనగా వాటిని మించినది), పొక్కిలి = నాభియొక్క, చక్కదనంబు, చెప్పఁగా నున్నదె = చెప్పుటకు వీలుకాదు, పయోధరముల్ = పాలిండ్లు, మేలు బంతులు = చక్కని చెండ్లు, చిఱుకౌను = చిన్నినడుము, సున్నయౌ = లేనిదే ; ఈ వరవర్ణినికిఁ = ఈ నారీమణికి, నిజంబుగఁ, వ్రాఁతఫలము = బ్రహ్మ వ్రాసిన వ్రాఁత యొక్క ఫలము (అదృష్టము), ఎన్నికకు ఎక్కున్ = అతిశయించును.

విశేషము : వరవర్ణినికిఁ = శ్రేష్ఠమైన అక్షరములు కల కాంతకు — దీర్ఘములు, తలకట్టు, పొక్కిలి, బంతులు (పంక్తులు), సున్న, వ్రాతఫలము అనగా వ్రాయడంవల్ల కలిగిన ఫలితం -వీటన్నిటిలో శ్రేష్ఠమైన అక్షరాలు ఏర్పడ్డాయని చమత్కారం.

అలంకారము :— శ్లేష.

భ్రమరక మనోహరం బౌటఁ బద్మ మగును,
తారకా హృద్యమగుట సుధానిధి యగు ;
రెంటి జగడాలు మోమున నంటి యుంట
నబ్జముఖి యంట లెన్న యీ యలరుఁబోఁడి. 105

అర్థము :— భ్రమరక మనోహరము = ముంగురులచే మనోహరమైనది, (మరొక అర్థము :— తుమ్మెదలకు ఇంపయినది), ఔటఁ = అగుటచేత, (ముఖము) పద్మమగును ;

తారకా హృద్యము = కంటి నల్లపాపల (కనీనికల)చే మనోహరమగునది. (మరొక అర్థం : నక్షత్రములకు మనోహరమగునది). అగుట (చేత). సుధానిధి = చంద్రుడు అగును ; రెంటి = ఈ పద్మమును చంద్రుడును అను రెంటి యొక్క. జగడాలు = శ్రేష్ఠమగు కాంతులు (అను పోరాటములు). మోమునఁ = ముఖమునందు. అంటియుంటఁ = కలిగియుండుటచేత. అబ్జముఖి = పద్మముఖి అనీ. చంద్రముఖి అనీ. రెండు అర్థముల నిచ్చే పేరుతో. ఈ అలరుఁబోఁడిఁ = పూవువంటి మేనుగల యీ సుభద్రను. అంట = పిలుచుట. లెస్స = మంచిది.

*విశేషము* :— ముఖాన్ని తరుచు చంద్రునితోనూ, పద్మముతోనూ పోలుస్తారు కదా. సుభద్ర మోము. భ్రమరక మనోహరము కనుక పద్మముఖి అనవలెనని పద్మమూ, తారకా హృద్యము కనుక చంద్రముఖి అనవలెనని చంద్రుడూ జగడము లాడుకొంటారట. (చంద్రునికీ. పద్మానికీ సహజవైరం ఉందని గమనించాలి). కాబట్టి. ఇరువురినీ సంతోషపెట్టేందుకు అబ్జముఖి అనడం మంచిది అని భావము.

అబ్జ అనగా, నీటిలో పుట్టిన పద్మమూ, చంద్రుడూ అని రెండు అర్థాలు.

(జగ = శ్రేష్ఠమైన – చూ : "జగమెఱుంగు దాని జగమెఱుంగు"ః డాలు = కాంతి, జగడాలు అనగా శ్రేష్ఠమైన కాంతి అనీ, కలహములు అనీ రెండర్థాలు.

భ్రమరక తారక – లలో 'క' ప్రత్యయము ముద్దువచ్చే ముంగురులు, కనీనికలు అని తెలియ జేస్తుంది.

ముంగురులు తుమ్మెదలవలె, కనీనికలు నక్షత్రములవలె ఉండడం గమనించాలి.

*అలంకారము* :— శ్లేష. వృత్త్యనుప్రాస.

ధారాధరము వెన్నుఁదన్ని పుట్టిన చాయ
నున్న దీ బింబాధరోష్ఠివేణి;
జక్కవకవ ఱొమ్ము ద్రొక్కి నిల్చిన జాడ
నున్న వీ నవలా పయోధరములు ;
చిన్నిప్రాయపు లేఁడిఁ జెవులు పట్టాడించు
గతి నున్న దీ రామ కన్నుదోయి;
నల్లచీమలబారు నడుము దాఁకిన వీఁక
నున్న దీ చెలువంపుఁ గన్నె యారు;

విపుల పులినంబు వెన్కకు వీఁగనొత్తు
నందమున నున్న దీ మందయాన పిఱుఁదు;
దీని కెనయైన లతకూనఁ గాన మా మ
నోజ వజ్రాంగి యీ జగన్మోహనాంగి. 106

అర్థము :— ౧. ఈ బింబాధరోష్ఠివేణి = దొండపండు వంటి అధరముగల ఈమె కొప్పు, ధారాధరముఁ = మేఘమును, వెన్నుఁదన్ని = వెంబడించి (చెల్లెలుగ) పుట్టిన, చాయఁ = విధముగా, ఉన్నది.

ధారాధరముఁ = మేఘమును, వెన్నుఁదన్ని = వెన్నుమీద (వీపుమీద) తన్ని - కాలితో తన్ని, తిరస్కరించి, పుట్టిన చాయగా ఉంది.

ధారాధరము = మేఘమే, వెన్నుఁదన్ని = సుభద్రయొక్క వెన్నును (వీపును) అంటు కొని, పుట్టిన విధముగా నున్నది.

కొప్పును నలుపుదనంలో మేఘముతో పోలుస్తారు.

౨. ఈ నవలా పయోధరములు = ఈ జవ్వని పాలిండ్లు. కవజక్కవలను, తొమ్ము త్రొక్కి = తిరస్కరించి, నిల్చిన జాడనున్నవి.

జక్కవకవఁ = చక్రవాక పక్షుల జంటయొక్క, తొమ్ముత్రొక్కి = క్రిందబడవేసి గుండెలపై కాలుపెట్టి, నిల్చిన జాడఁ = నిలబడిన విధముగా, ఉన్నవి.

జక్కవకవ = రెండు జక్కవపిట్టలు, తొమ్ముత్రొక్కి = సుభద్రవక్షమునెక్కి, నిల్చిన జాడఁ ఉన్నవి.

కుచములకు జక్కవ పిట్టలతో పోలిక ప్రసిద్ధము, నిల్చు అన్న శబ్దమువల్ల స్తనముల బింకము తెలుస్తుంది.

౩. ఈ రామ కన్నుదోయి = ఈ సుందరి నేత్రములు. చిన్ని ప్రాయపులేడిఁ = లేడి పిల్లను, చెవిపట్టుకొని ఆడించురీతిగా, ఉన్నది. లేడిపిల్లను, చెవులుపట్టి ఆడించు = లోకువచేసి కొనినట్టి, గతిగ నున్నది.

లేడిపిల్లే, చెవిపట్టి ఆడించు = సుభద్ర యొక్క చెవులనుపట్టి కదుపుతున్నట్టు కన్ను లున్నాయి.

కన్నులకు లేడి ఉపమానము. చెవులు పట్టాడించు ననడంవల్ల ఆకర్ణాంత నేత్రములని గ్రహించాలి.

౪. ఈ చెలువంపు కన్నె ఆరు = అందమైన ఈ కన్యకయొక్క నూగారు, నల్లచీమల బారుయొక్క, నడుముఁ దాఁకిన పిఁకన్ = నడుము (విఱుగ) దన్నిన రీతిగా, ఉన్నది.

నల్లచీమలబారును, నడుముదాఁకిన = పరిభవించిన రీతిగా నూగారున్నది.

నల్లచీమల వరుసే, నడుము దాఁకినవీఁకఁ = సుభద్రయొక్క నడుము నంటుకొని యున్నట్లు, ఉన్నది.

నూగారు చీమలబా రంటారు.

ఈ మందయాన పిఱుఁదు = మెల్లని నడకలు గల యీమె యొక్క కటిప్రదేశము, విపుల పులినంబుఁ = విశాలమైన యిసుక తిన్నెను, వెన్కకు వీఁగనొత్తు = వెనుక పడునట్లు గెంటునట్టి అందముతో ఉన్నది.

విపుల పులినంబుఁ, వెన్కకు వీఁగనొత్తు = (పరుగు పందెములోవలె) వెనుకబడి వీఁగిపోయేటట్టు విజృంభించు, అందముతో పిరుదు ఉంది.

విశాల సైకతమే, వెన్కకుఁ = సుభద్ర శరీరము యొక్క వెనుకభాగమునకు, వీఁగ = కొంచెము చలించుచుండునట్లు, పిరుదు, ఒత్తు = ఆనుకొని ఉండే, అందముతో ఉన్నది,

పిరుదులను ఇసుక తిన్నెలతో పోలుస్తారు. వీగుశబ్దము పటుపును తెలుపుతుంది,

దీనికి = ఈసుభద్రకు, ఎనయైన = సమానమైన, లతకూనఁ = లతాంగివి, కానము, ఈ జగన్మోహనాంగి = లోకమునంతటిని మోహింప జేయగల రూపముకల ఈకాంత, ఆమనోజ వజ్రాంగి = ఆ మన్మథునియొక్క మిక్కిలి దృఢమైన రక్షణము. (ఈమె ఉండగా మన్మథున కెక్కడా అపజయం కలుగదని భావము.)

అలంకారము :___ శ్లేష, అనుప్రాస, ఉపమ, ఉత్ప్రేక్ష.

సైకము నడుము, విలాస ర
సైకము నెమ్మొగము, దీని మృదు మధు రోక్తుల్
పైకముఁ దెగడు, న్నవలా
పైకములో నెల్ల మేలుబం తిది బళిరా ! 107

అర్థము :___ బళిరా ! నడుము, సైకము = సూక్ష్మము (సన్ననిది), నెమ్మొగము = చక్కని ముఖము, విలాస రస ఏకము = శృంగార రసమే ప్రధానముగా కలిగినది, దీని మృదు మధుర ఉక్తుల్ = దీని మెత్తని తీయని పల్కులు, పైకముఁ = పికముల (కోకిలల) సంబంధమైన కంఠధ్వనులను, తెగడుఁ = నిందించును, నవలా పైకములోఁ ఎల్లఁ = యువతీ సమూహములో కెల్లా, ఇది (సుభద్ర), మేలుబంతి = శ్రేష్ఠురాలు.

వేదమువారు ఒక పైకమునకు 'సమూహ' మనీ, మరొక దానికి 'ధనము' అనీ అర్థం చెప్పారు. ఇంచుమించు రెండూ సమానమే. కాబట్టి మనము పై విధంగా అర్థం చెప్పుకున్నాము.

అలంకారము :— యమకము.

ఇ త్తరళాక్షి మేని జిగి యేలిక మేలి కడాని పైఁడి, కీ
గుత్తపు గుబ్బలాడి జడ కూఁకటి చీఁకటి మూలదుంప, కీ
పుత్తడి బొమ్మ కన్నుఁగవ పోలిక వాలిక గండుమీల, కీ
బిత్తరి ముద్దు నెమ్మొగము పిన్నమ పున్నమ చందమామకున్. 108

అర్థము :— ఈ తరళాక్షి = చంచలమైన కనులుగల ఈ కాంతయొక్క, మేని జిగి = శరీర కాంతి, మేలి = శ్రేష్ఠమగు, కడాని పైఁడికిఁ = కుందనపు బంగారమునకు, ఏలిక = ప్రభువు ; ఈ గుత్తపు గుబ్బలాడి = క్రిక్కిరిసిన కుచములు కల ఈ కాంతయొక్క, జడ, చీఁకటి మూలదుంపకు = చీఁకటి అనే చెట్టుయొక్క మొదటి గడ్డకు, కూఁకటి = ముఖ్యమగు వేరు ; ఈ పుత్తడిబొమ్మ = ఈ బంగారు బొమ్మయొక్క, కన్నుఁగవ, వాలిక గండు మీలకుఁ = నిడుపైన బెడిసచేపలకు, పోలిక; ఈ బిత్తరి = శృంగారచేష్టలుగల ఈమెయొక్క, నెమ్మొగము = నిండుముఖము, పున్నమ చందమామకున్ = పూర్ణచంద్రుడికి, పిన్నమ = పిన తల్లి అనగా పోలి ఉంటుంది అని అర్థము - ఉపమావాచకము.

విశేషము :— లక్ష్మి చంద్రుడికి చెల్లెలు. లక్ష్మికి తల్లి (పుట్టిల్లు) పద్మము. కాబట్టి, చెల్లెలి తల్లి అయిన పద్మము (అన్న అయిన) చంద్రుడికి పిన్నమ్మ అవుతుంది. ముఖము పద్మమువలె ఉందని. భావము —లోకవ్యవహారంలో పిన్నమ్మ పోలిక, మేనమామ పోలిక రావడం సామాన్యము.

వేదమువారు, "పిన్నమ్మ అనగా మహాలక్ష్మి. కావున - ఈ ముఖము పూర్ణిమా చంద్రుని యొక్క సిరి యని" స్వారస్యమును చూపించారు. వ్యవహారములో పెద్దమ్మ అంటే దరిద్ర దేవత అనే ఉంది కాని, పిన్నమ్మ అనగా లక్ష్మీదేవి అని ప్రసిద్ధంగా లేదు.

అరటి వంటి చెట్లకు బోదె కింద దుంప (గడ్డ) ఉంటుంది. దానినుంచే చెట్టు పెరుగు తుంటుంది. అదే మూలదుంప ; దానికున్న ముఖ్యమయిన వేరు (జీవనాధారము) అదే కూకటి.

అలంకారము :— ఉపమ, అనుప్రాస.

కామినీమణి నిడు వాలుఁ గన్నుఁ గవకు
నెన్నికకు రాని తొగరేకు లీడు సేఁత
తగదు తగ; దిఁక నలిన పత్రంబులందు
నీ డగునొ యేమొ నూట వేయింట నొకటి. 109

*అర్థము* :— కామినీమణి = ఈస్త్రీరత్నముయొక్క, నిడువాలు = మిక్కిలి దీర్ఘమైన, కన్నుఁగవకున్ = కన్నుల జంటకు, ఎన్నికకురాని = లెక్కలోనికి రానట్టి (పేరుపొంద నట్టి), తొగరేకులు = కలువరేకులు, ఈడుచేఁత = సమానమని చెప్పడము, తగదు తగదు; ఇఁకన్, నలినపత్రంబులందున్ = తామర రేకులలో, నూటవేయింటన్ ఒకటి = నూరు రేకు లలో ఒకటిగాని, వేయిరేకులలో ఒకటిగాని ఈడగునొ యేమొ = సరియౌనా యేమో (సరికా వచ్చునని భావము:)

*విశేషము* :— పద్మాలలో శతపత్రమని, సహస్ర పత్రమని రేకుల సంఖ్యనుబట్టి పూవులకు పేర్లున్నాయి. కాని, కలువలకు ఆ విధమైన పేరులేదు. కనుక, తొగరేకులు ఎన్నికకు (లెక్కకు) రాలేదని చమత్కారము.

ఇక, నలినపత్రాలో, నూరురేకులలో ఒకటో, వేయిరేకులలో ఒకటో సమానం కావచ్చు నేమొ; సరిపోల్చదగిన పత్రాలు చాలా అరుదు అన్నమాట.

నూరేసి పత్రాలు కూడి ఒకటిగానైనా (శతపత్రమైనా) వేయేసి పత్రాలు కూడి ఒకటిగా నైనా (సహస్రపత్రమైనా) సరిపోలుతుందేమో అని అర్థాంతరం,

*అలంకారము* :— కావ్యలింగము, శ్లేష.

మహిలో సరి గలదా యీ
మహి లోత్తంసంబు మేని మహిమకుఁ దెలియన్?
మిహి కుందనపు సలాకన్
మిహికాకరు రేక మించు, మించున్ మించున్ 110

*అర్థము* :— ఈ మహిలా ఉత్తంసంబు = స్త్రీలలో తలపూవు అయిన ఈ కాంత యొక్క మేని = శరీరము యొక్క, మహిమకున్ = శోభకు, తెలియన్, మహిలో, సరి కలదా? మిహి = ప్రశస్తమైన, కుందనపు = మేలిమిబంగారుతో చేయబడ్డ, సలాకన్ = సన్నని కాడనూ, మిహికా + కరు = హిమ (మంచు) కిరణుడైన (కిరణాలలో మంచు కలిగిన) చంద్రునియొక్క, రేక-చంద్రరేఖయొక్క, మించున్ = కాంతినీ, మించున్ = మెరపుతీగనూ, (ఈ మూడింటిని) మించున్ = అతిశయించును,

పద్యములో మూడు 'మహి'లు, రెండు 'మిహి'లు, మూడు 'మించు'లు ఉపయోగించిన కవి 'లాక, కాక, రేక' అని అనకుండా ఉంటాడా అని 'మిహికాకరురేక' అని చిన్నమార్పు చేశాము.

అలంకారము :— అనుప్రాస.

కలిగెఁబో యీ యింతి కులుకు గుబ్బలఁ జూడ
శీత శైలాదుల సేవ ఫలము,
కలిగెఁబో యీ నాతి వళుల యందముఁ జూడ
గంగా తరంగముల్ గన్న ఫలము,
కలిగెఁబో యీ రామ కనుబొమ ల్సూడంగ
మును ధనుష్కోటిలో మునుఁగు ఫలము,
కలిగెఁబో యీభామ కటి విలాసము జూడ
భూ ప్రదక్షిణము సల్పుటకు ఫలము,
తోడుతోడనె యిటులు చేకూడ వలదె ?
తన్వి దీఅంగ నింక నీ తన్విఁ గూడి
సరస సంభోగ సల్లాప సరణిఁ దేలు
నాఁడుగా ఫలియించుట నా తపంబు. 111

అర్థము :— ౧. ఈ ఇంతి (యొక్క) కులుకు గుబ్బలు, చూడన్ = చూడగలిగినందువల్ల, (తాను సేవించిన) శీత శైల ఆదుల సేవ ఫలము = హిమవంతము మొదలైన పుణ్యగిరులను సేవించినందువల్ల కలిగే ఫలము, కలిగెన్ బో = లభించింది కదా!

తాను హిమగిరిని సేవించాడు కనుక ఆ యాత్రాఫలం - నేడు సుభద్ర కుచముల దర్శించడం వల్ల ప్రాప్తించింది. ఆ కొండలు సేవించినందుకు కొండలవలె నున్న ఈ సుభద్ర గుబ్బలు చూడ గలిగాడని అర్జును డనుకుంటున్నాడు.

౨. ఈనాతి = ఈయువతియొక్క, వళుల = కడుపుమీద కానవచ్చే మూడుముడతల అందము, చూడఁ = చూడడంవల్ల, గంగా తరంగముల్ = (తాను చూచిన) గంగానదిలోని అలలను, కన్న = చూడడంవల్ల కలిగిన, ఫలము, కలిగెఁబో = లభించింది కదా.

౩. ఈరామ = ఈ మనోహరియొక్క, కనుబొమల్, చూడంగఁ, మును = ఇంతకు పూర్వము, ధనుష్కోటి (అన్న పుణ్యస్థలము)లో మునుఁగు = స్నానముచేసినందువల్ల కలిగే ఫలము, కలిగెఁబో.

౪. ఈ భామ (యొక్క) కటివిలాసము = పిరుదుల యొక్క సొగసు, చూడఁగ = చూచుటవల్ల, భూప్రదక్షిణము, సల్పు = చేయుటవల్ల కలిగే, ఫలము, కలిగెఁబో.

తోడుతోడనె = వెంటవెంటనే (తీర్థయాత్రల వెంటనే వాటి ఫలములు కలిగినట్లు) ఇటులఁగ = ఈ ప్రకారంగా, చేకూడఁగావలదె = చేకూడాలి కదా, తన్వి = (తనివి) తృప్తి, తీఱంగఁగ, ఇంకన్, ఈతన్విన్ = ఈచిన్నదానిని, కూడి, సరస సల్లాప = చమత్కార వచనాల తోడి, సంభోగ = అనుభవముయొక్క, సరణిన్ = వరుసను, తేలునాడుగా ఆనందించినప్పుడు కదా, నాతపంబు = (ఇప్పుడు ఈయతి వేషములో తాను చేస్తున్న తపము) ఫలించుట జరుగును.

*విశేషము* :— ఫలము కలుగుతుందన్న నమ్మకమును ఫల సాదృశ్యము, వర్ణన సాదృశ్యముతో మేళవించాడు కవి.

హిమగిరిని తాను సేవించినందువల్ల' ఫలము, గిరులవలె ఉన్నతంగా ఉన్న కుచములను చూడడము.

గంగాతరంగముల కన్న ఫలము, అలలవలె ఉన్న త్రివళుల (కడుపుమీది ముడుతలు) చూడడము.

ధనుష్కోటిని మునిగినందువల్ల ఫలము, ధనుస్సు-విల్లు-వలె ఉన్న ఆమె కనుబొమల చూచుట.

భూప్రదక్షిణము చేస్తున్న ఫలము భూమివలె ఉన్న కటిప్రదేశమును చూచుట.

ఈ ఫలములు తాను మొన్నమొన్న చేసిన తీర్థయాత్రలవల్ల కలుగుటచేత "తోడు తోడనే" శీఘ్రంగా కలిగినట్లు చెప్పడము. తానిప్పుడు తాపసి అయి యతిరూపంలో ఉన్నాడు కనుక, ఈ తపస్సుయొక్క ఫలం ఎప్పుడు లభిస్తుందో అని అర్జునుడు ఉవ్విళ్ళూరు తున్నాడు.

సేవలఫలము : ఆయా అంగములను చూచుట; తపస్సు ఫలము : సరస సల్లాప సంభోగ సరళి తేలడము.

మూడో చరణములో తన కుతూహలమూ ఆ మాటలతో తా ననుభవిస్తున్న మాధుర్యము తెలియపరచడము చమత్కారము.

*అలంకారము* :— సమాసోక్తి, నిరుక్తి, యమకము.

అని కొనియాడుచు నుండఁగ
వనితామణి నంత నుత్సవము చేసి పురం
బున కనుప్పుచు మాయామునిఁ
గనుఁగొని యూ హాళి నితాంత కౌతూహలి యై, 112

అర్థము :— అని, కొనియాడుచుఁ = (అర్జునుడు) మెచ్చుకొనుచు, ఉండఁ: ఆ హలి = ఆ బలరాముడు (హలము = నాగలిని కలవాడు), వనితామణిఁ = నారీతిలకమైన సుభద్రను, అంతఁ, ఉత్సవముసేసి = పూజచేయించి, పురంబునకు = ద్వారకకు, అన్పుచుఁ = పంపిస్తూ, మాయామునిఁ = అబద్ధపు సన్యాసిని, కనుఁగొని, నితాంత కౌతూహలియై = ఎక్కువయిన ఉత్సాహము కలవాడై —

అలంకారము :— అనుప్రాస.

### బలరాముఁడర్జునుని చూచుట

అతని నుత్తమ మునియ కా మతిఁ దలంచి
వినయమునఁ జేరి సాష్టాంగ వినతిచేసి,
"స్వాము లెందుండి యిచటికి వచ్చినారు,
తీర్థయాత్రగ? నది యెల్లఁ దెల్పుఁ" డనిన. 113

అర్థము :— అతనిఁ, ఆ అబద్ధపు మునిని, ఉత్తమ యతియ కాఁ = నిజమైన యతీశ్వరుడే అని, మతిఁ తలంచి = మనసున అనుకొని, వినయమునఁ, చేరి = సమీపించి, సాష్టాంగ వినతి చేసి = సాష్టాంగ నమస్కారముచేసి, "స్వాములు (తమరు), ఎందుండి = ఏ దేశమునుండి, తీర్థయాత్రగఁ, ఇచటికి వచ్చినారు, అది యెల్లఁ తెల్పుఁడు" అనినన్.

విశేషము :— బలరాముడు, ఉత్తమయతి అనుకోవడంవల్లే వినయవిధేయతలు కనబరిచాడు. యాదవులు యతులకు విధేయు లన్నారు కదా.

హిమశైల సేతువుల మ
ధ్యమునం గల నదులు, నిధులు, నాశ్రమములుఁ, దీ
ర్థములుం దాఁ గనుఁ గొన్నవి
క్రమమునఁ దెలుపం బ్రమోద రస పరవశుఁడై. 114

అర్థము :— హిమశైల సేతువుల = హిమాలయ పర్వతానికీ, రామేశ్వరముకడ నున్న సేతువుకీ, మధ్యమునన్, కల నదులూ, నిధులుఁ = పుణ్యస్థలములూ, ఆశ్రమములు = మునుల ఆశ్రమాలూ, తీర్థములుఁ = క్షేత్రములూ, తాఁ కనుఁగొన్నవి, క్రమమునన్ = ఒకదాని వెనుక నొకటి (దేశ విభాగములబట్టి) తెలుపఁ, ప్రమోదరస పరవశుఁడై = సంతోష రసమువల్ల ఒళ్లుతెలియకుండా (చాల సంతసించి అని) —

విశేషము :— అర్జునుడు స్వయంగా చూచిన స్థలాలే కాబట్టి వాటిని గురించి స్వానుభవంతో చక్కగా చెప్పి ఉంటాడు.

మహాత్ములతో సంబంధం కల చోటులకు నిధులని వాడుక. వాటినిగూడ పుణ్యస్థలాలు అని వ్యవహరిస్తారు.

వేదమువారు నిధులు అనగా జ్ఞానులు అని అర్థంచెప్పారు. కాని, తాఁ గనుఁగొన్నవి అన్న మాటలలో ఆ జ్ఞానులను చేర్చగలమా ?

'ప్రమోదరస పరవశుడు' — సంతోషమన్న మద్యాన్ని త్రాగి మైమరచినవాడు. బలరాముడు మద్యప్రియుడు కదా.

అలంకారము :— రూపకము.

"కలిగెన్ భాగ్యవశంబునన్ గనుఁ గొనంగా మిమ్ము మమ్ముం గృతా
ర్థులుఁగాఁ జేయఁగ నాత్మలోఁ దలఁచి చాతుర్మాస్య మిచ్చోటనే
సలుపంగా వలె స్వామి వా" రని, నమస్కారంబు గావించి, ప్రాం
జలియై వేఁడిన, సమ్మతించెఁ గుహనా సన్న్యాసి యుల్లాసియై. 115

అర్జునుడి వేషమూ, మాటలలోనినేర్పూ చూచి, వీరు మహామహులని బలరాముడు భావించి ఈలా గన్నాడు.

అర్థము :— భాగ్యవశంబునన్ = మాయదృష్టమువల్ల, మిమ్మున్. కనుఁగొనంగాన్, కలిగెన్ = సంప్రాప్తించింది; మమ్మున్, కృతార్థులఁగాన్ = ధన్యులుగా, చేయన్, ఆత్మలోన్, తలఁచి, (మీరు) చాతుర్మాస్యము = తమ చాతుర్మాస్య వ్రతమును, ఇచ్చోటనే = మారాజ్యములోనే,స్వామివారు, సలుపంగావలెన్ = చేయవలె నని ప్రార్థిస్తున్నాను, అని, నమస్కారంబున్, కావించి, ప్రాంజలియై = చేతులు జోడించుకొని, వేఁడినన్ = ప్రార్థించగా, కుహనా సన్న్యాసి = ఆ మాయాముని, ఉల్లాసియై = సంతోషించినవాడై, సమ్మతించె = ఒప్పుకున్నాడు.

విశేషము :— చాతుర్మాస్యము - ఆషాఢ శుద్ధము మొదలు, కార్తిక శుద్ధము వరకు ఉన్న నాలుగు మాసములూ సన్యాసులు చేసే వ్రతము లేక యజ్ఞము. వర్షాల బాధ తీరే వరకు వారు ఒక్క చోటనే ఉంటారు.

చెలువ నేత్ర విలాసంబు చెవులు సోఁక,
బాల కుచలీల యెదఁ జాలఁ బట్టి క్రాలఁ,
గలికి నెఱివేణి చెలువంబు కాళ్ళఁ బెనఁగ,
నవలఁ బోలేక నిలచె న య్యర్జునుండు. 116

అర్జునుడు నిలవడానికి అసలు కారణాన్ని కవి ఈ పద్యములో చెప్పుతున్నాడు.

అర్థము :— చెలువ = సుభద్రయొక్క. నేత్రవిలాసంబు = కన్నుల అందము. చెవులు సోఁకఁగ = సుభద్రయొక్క. చెవులనంటి యుండుటచేత - అనగా సుభద్ర కనులు కర్ణాంతములైనవి అని అర్థం. చెవుల సోఁకఁగ = అర్జునుని చెవులు పట్టుకొని నిలుపడంచేత అని రెండవ అర్థం.

సుభద్రయొక్క వక్షస్థలమును. చాల = అంతయును. పట్టి = ఆక్రమించి. గ్రాలఁగ = ప్రకాశించుచుండుటచేత. కుచలీల = చనుగవ పొంకము (కుచములు రొమ్మునంతటను నిండి యున్నవి అని). ఎదఁ జాలఁ బట్టి గ్రాలఁగ = అర్జునుని రొమ్మును గట్టిగాపట్టి అడ్డగించుట చేతను - అని రెండవ అర్థము.

కలికి = సుభద్రయొక్క. నెఱివేణి = చక్కని కొప్పుయొక్క. చెలువంబు = సొంపు. కాళ్లఁబెనఁగఁగ = సుభద్రయొక్క కాళ్లను (మడిమల) తాకుచుండగా (కొప్పు అంత పొడవైనదని భావము) అని. కాళ్లఁ పెనఁగఁగ = అర్జుని కాళ్లను చుట్టి పట్టుకొని పోనీయకుండుట చేతను. అయ్యర్జునుండు. అవల = వేరొక చోటికి. పోలేక. నిల్చెఁగ.

*విశేషము* :— ఇందులో కవి సుభద్ర అందాన్ని వర్ణిస్తూనే మరొక ప్రక్క అర్జును డెలా ఆకర్షింపబడి. ఆమెను విడిచి పోలేక పోయాడో చమత్కారంగా వర్ణించాడు.

ఆయా విషయాలు కాక. వాటి సౌందర్యం : నేత్రముల 'విలాసము'. కుచముల 'లీల'. వేణి 'చెలువము'. అర్జునుడి మనసునుపట్టి అతడిని నిలిపివేశాయని; అంతేగాని బలరాముడి ప్రార్థన కాదని చమత్కారము.

*పాఠాంతరము* :—

"........యెద బట్టిజాల కలర"

—తిరుపతివారూ, కృష్ణమాచారిగారూ.

చాల - కుచలీల - యెదఁజాల - బట్టిగ్రాల

అనడమే శ్రావ్యంగా ఉంది.

*అలంకారము* :— శ్లేష. అసంగతి. కావ్యలింగ.

సిరియు నిటులా సౌనా
సిరియు నన్యోన్య సూక్తి హిత మానసులై
పోరాని కూర్మి నుండఁగ
నా రాముని కడకు నంత హరి సనుదెంచెఁగ. 117

*అర్థము* :— సీరియు = (సీరము) నాగలిని ఆయుధంగా గలవాడు—బలరాముడున్ను ఆ సౌనాసీరియు = సునాసీరుడైన ఇంద్రుని కుమారుడు—అర్జునుడున్ను, ఇటులన్, అన్యోన్య సూక్తి = ఒకరికొకరుమంచిమాటలచేత, హిత = స్నేహభావముతో కలిసిన, మానసులై = మనస్సులు కలవారై, పోరానికూర్మిన్ = విడిచిపెట్టిపోవ శక్యముకాని ప్రేమలతో, ఉండఁగన్, అంతన్, ఆరామునికడకు = ఆ బలరాముని దగ్గరకు, హరి = కృష్ణుడు, చనుదెంచెన్ = వచ్చెను.

*విశేషము* :— సునాసీరుఁడు = మంచి సేనాముఖము కలవాడు, ఇంద్రుడు. అతని కొడుకు సౌనాసీరి.

ఇక్కడ, హరి 'ఆ రాముని కడకు చనుదెంచెన్' నాటకఫక్కీని తెలుపుతూంది ఒకేచోట ఉన్న ఆ ఇద్దరి వద్దకూ (అనిగాని అక్కడకు అనిగాని వచ్చాడు అని చెప్పకపోవడమువల్ల, కృష్ణుడు ఆ (మాయా) యతిని గమనించనట్లే నటిస్తూ (అతని వైపు చూడకుండా గూడా నేమో) ఒక్క బలుడివద్దకే ఏదో పనిమీద వచ్చినట్లు కనబడతాడని సూచన, ఆ యతిని గమ నించకపోవడం తర్వాతి పద్యంలో స్పష్టమౌతుంది.

*పాఠాంతరము* :— రెండో చరణానికి రెండు పాఠభేదాలున్నాయి.

సీరియు సన్యోన్య సూక్తి జీత మానసులైః
2. .. ... .... సితమానసులై.
—వేదమువారు.

సిత = (ఒండొకటితో) కట్టబడిన అని అర్థం చెప్పారు.

*అలంకారము* :— యమకము.

చనుదెంచిన, "స్వాములకున్
వినయము గావింపు; మిచట వీరల నిలువుం
డనినార, ముపవనంబున
నునిచి మన సుభద్ర సేవ కొనరుపు" మన్నన్, 118

*అర్థము* :— చనుదెంచినన్ = కృష్ణుడిట్లు రాగా, "స్వాములకున్ = ఈమహాత్ము లకు, వినయమున్ = నమస్కారమును, కావింపుము; వీరలన్, ఇచటన్, నిలువుండు అని నారము = నిలువవలసిందిగా ప్రార్థించినాము, ఉపవనంబున = మన ఉద్యానవనములో, ఉనిచి = వీరిని ఉంచి, మన సుభద్రన్, సేవకు, ఒనరుపుము = నియమించు" అని ఆజ్ఞాపింపగా...,

*విశేషము* :— 'నిలువుం'డనినారము అనడములో బహువచనము ప్రభుత్వసూచన. కృష్ణుడు వచ్చినప్పుడు యతిని చూడనేలేదు; చూచి ఉంటే నమస్కరించి ఉండేవాడే. బలుడు 'వినయము గావింపు' మని చెప్పవలసినపనే ఉండదు. కృష్ణుడి నటనకు ఇది ఒక నిదర్శనము.

*పాఠాంతరము* :— "...వీరల నిలువుం డనినాడ" అని.

"వయసు వారును జక్కని వారు వీరు
మనసు మర్మంబు లేవియు మనకుఁ దెలిసి
యున్నయవి గావు, సేవకు నునుపఁ దగునె
కన్నె? నదియేమొ తెలిసికొ" మ్మన్న నతఁడు, 119

*అర్థము* :— వీరు = ఈ యతిగారు, వయసువారును, చక్కనివారును, మనసు మర్మంబులు ఏవియు మనకున్ తెలిసియున్న యవి గావు. కన్నెన్ = అవివాహితయైన (యౌవనవతియైన) సుభద్రను, సేవకు, ఉనుపన్ = ఉంచుట, తగునె = బాగుంటుందా? అది యేమొ తెలిసికొమ్ము, అన్నన్, అతడు = బలరాముడు ...... తరువాతి కన్వయము

*విశేషము* :— బలరాముడు చెప్పినంతవరకూ కృష్ణుడు యతిని చూడలేదని రూఢి అయింది.

ఈ పద్యంలో కూడా కృష్ణుడు ఆ యతిని గూర్చి ఏమీ తెలియనట్టూ, చాలా చమత్కారంగా నటిస్తున్నాడు జగన్నాటక సూత్రధారికదా!

కృష్ణుడు కనబరిచిన అనుమానానికీ సందేహానికీ బలరాముడు కొంత కోపం తెచ్చుకొని ఉంటాడు.

"వీరు మహాత్ములు, ఘను; లప
చారం బగు నిట్టులాడ; సంయములకు మున్
గోరిక వెలయఁగఁ గన్యలె
కారా శుశ్రూష చేయఁగాఁ దగువారల్?" 120

*అర్థము* :— వీరు, మహాత్ములు = గొప్ప (పవిత్రమైన) ఆత్మ కలవారూ, ఘనులు = దొడ్డవారున్నూ, ఇట్టులాడన్ = ఈ రీతిగా అనుమానించి మాట లాడడము, అపచారం బగున్ = దోష మవుతుంది. మున్ = పూర్వము, సంయములకున్ = మునులకు,

కోరిక వెలయఁగన్ = తమ కోరికలు ఫలిస్తాయన్న నమ్మకముతో, శుశ్రూష = పరిచర్య, చేయఁగాన్, తగువారలు, కన్యలె కారా = కన్యలే కదా?

*విశేషము :—* మునులకు శుశ్రూష చేయడానికి అవివాహితలను నియమించడం మన సంప్రదాయం కాదా అని బలుడు మందలించాడు.

అదీకాక, వారు 'సంయములు' = ఇంద్రియ నిగ్రహం సాధించినవారు కాబట్టి నీ సందేహానికి కారణం లేదు అని బలరాము డన్నాడు.

'కోరిక వెలయఁగ' అని బలు డనడంలో 1. కన్య పుట్టినింటివారి కోరికా (మంచి అల్లుడు రావాలని), 2. కన్యకున్న కోరికా (మంచి వరుడు కావాలని). ఇక్కడ అర్జునుడి కోరికా, కృష్ణుడి కోరికా గూడా ఉన్నాయి.

"నెమ్మది సంశయింప కిది నీ వొనరింపు" మటన్న, నట్లె కా
ని మ్మని య మ్ముని ప్రవరుఁ గృష్ణుఁడు దోడ్కొని ద్వారకా ప్రవే
శ మ్మొనరించి యంతిపురిఁ జయ్యనఁ జెల్లెలిఁ బిల్వనంపి, "రా
వమ్మ, సుభద్ర ! నీ యభిమ తార్థము లెల్ల ఫలించు నియ్యెడన్". 121

*అర్థము :—* "నెమ్మదిన్ = మనసునందు, సంశయింపక = సందేహముమాని, ఇది, నీవు ఒనరింపుము" అటన్నన్, అట్లే, కానిమ్ము అని, కృష్ణుఁడు, అమ్మునిప్రవరున్, తోడ్కొని, ద్వారకా ప్రవేశమ్ము ఒనరించి = ద్వారకాపురిని ప్రవేశించి, అంతిపురిన్ = అంతఃపురమునుంచి, చయ్యనన్ = వేగముతో, చెల్లెలిన్ పిల్వన్ పంపి (ఆమె వస్తూ ఉండగానే) "రావమ్మ, సుభద్ర, నీ అభిమత అర్థములు = నీ మనసులోని కోరికలు, ఎల్లన్ = అన్నీ, ఇయ్యెడన్ = ఈ స్థలములోనే, ఫలించున్ = సిద్ధిపొందుతాయి......

*విశేషము :—* బలరాము డింతవరకు తన ఉద్దేశాన్ని సమర్థించాడు. ఇప్పుడు ప్రభువు ఆజ్ఞ గా 'ఇది నీ వొనరింపుము' అన్నాడు. కృష్ణుడు కోరినదీ అదే; కాబట్టి పనులు చకచక నడిపిస్తున్నాడు.

నీ అభిమతార్థము లనగా అర్జునుని పెళ్ళిచేసుకోవాలన్న కోరిక - ఫలిస్తుందని ధ్వని.

కృష్ణుడు, ఈ విధంగా గూఢంగా చెప్పడం: అప్పుడే సుభద్ర తెలుసుకోవాలని కాదు; ముందుగానే ఎందుకు చెప్పలేదని ఆ తర్వాత తనపై నింద రావడానికి అవకాశము లేకుండా ఉండాలనే అనుకోవచ్చు.

ఈ పద్యములో అర్జునుడిని 'మునిప్రవరుఁడు' అని అన్నాడు కవి ముని శ్రేష్ఠుడని కవి ఉద్దేశించలేదు : ప్రవరుడు = మంచి 'వరుడు'గా వచ్చిన ముని అని భావము. ఈలాంటి చేమకూర ప్రయోగాలు కొంచెం శ్రద్ధగా చూస్తే ఈ భావం రూఢి అవుతుంది. ఎక్కడా కృతక యతి, కపట త్రిదండి, కపటపు సన్యాసి...ఈలాంటి ప్రయోగాలే, చూడండి.

"కామాదిస్ఫురణంబు లెల్ల నడఁగంగాఁ జేసి ధన్యాత్ములౌ
స్వాముల్ వీరలు; వీరి కింపొదవు తేవఁ సేవ గావింపు; మెం
తో మోదంబున నానతిచ్చి బలభద్రుండే నియోగించినాఁ,
డేమో చెప్పితి నంచు నుండెదవు సుమ్మీ నీమదిఁ సోదరీ" 122

అర్థము :— కామాది = కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలన్న అంతశ్శత్రువులయొక్క, స్ఫురణంబులు = ఉద్రేకములను, ఎల్లన్ = అన్నిటిని, అడఁగంగాఁ = అణగిపోవునట్లుచేసి (అనగా అంతశ్శత్రువులను జయించి) ధన్యాత్ములు ఔ స్వాముల్ వీరలు, వీరికి, ఇంపు ఒదవు = సంతోషమును కూర్చునట్టి, తేవఁ = విధంగా, సేవ గావింపుము, బలభద్రుండే = మన అన్న బల రాముడే, ఎంతో మోదంబునఁ = చాలా సంతోషముతో, ఆనతిచ్చి = నాకాజ్ఞనిచ్చి, నియోగించినాఁడు = ఈ పని చేయమని నన్ను నియమించాడు; ఏమో చెప్పితినంచున్ = అశ్రద్ధగా, నీ మదిన్, ఉండెదవు సుమ్మీ = ఉండగలవు సుమా, అట్లుండరాదు అని.

*విశేషము :* ... కామ ఆది స్ఫురణంబులు — మన్మథునియొక్క (శివుని కంటిమంటచే రూపు కోల్పోవని నాటి) మొదటి గర్వములు, అణగజేసిన ధన్యులు వీరు - అనగా అర్జునుడు సశరీర మన్మథుని సైతం గెలువగలిగిన అందగాడని ధ్వని

కామ ఆది - అనడంవల్ల మన్మథుడు మొదలైనవారి - వసంతుడు, జయంతుడు వంటి రూపవంతుల - స్ఫురణంబులు, గర్వమును అణచిన వాడని కూడా అర్జునుడిని వర్ణించిన ట్లర్థముంది.

ఈ విధంగా కృష్ణుడు అర్జునుని సౌందర్య ప్రశస్తి ధ్వనిస్తున్నట్లుగా చెప్పడం, తన పలుకుల్లో అబద్ధము కన్పించకుండా ఉంచడము కోసమే. ఇప్పుడితడు కామిగానే వచ్చాడు.

యువకుడైన మునిని సేవిస్తే పెద్దన్న ఏమంటాడో అని సుభద్ర కొంత సంకోచం వ్యక్తంచేసి ఉంటుందని అనుకోవాలి. అందుకే కృష్ణుడు, "ఏమో చెప్పానని అనుకోకు సుమీ, ఇది అన్నగారిచ్చిన ఆజ్ఞయే, అని అనవలసి వచ్చింది. సుభద్ర మరింత జాగ్రతగా సేవించాలన్న భావం కూడా కావచ్చు.

ఈ మునికి సంతోషం కలిగే విధంగా - అనడంలో ఈముని కోరికలన్నీ తీర్చి సంతోష పెట్టు అన్న ధ్వని ఉంది.

ఏమో చెప్పితినంచు - అనగా, జాగ్రత్తగా ఆలోచించి నామాటల్లో అంతరార్థం గ్రహించు అని కృష్ణుడి మనసులో ఉన్న అర్థాంతరం.

అలంకారము :— శ్లేష.

అని త త్కన్యాంతఃపుర
వన వంజుల కుంజ సంజవనమునఁ గుహనా
ముని నుండఁజేసి, పలికెఁ
నెనరు మదిం బొదల రుక్మిణీ సత్యలతోన్. 123

అర్థము :— అని (చెప్పి), తత్కన్యా = ఆసుభద్రయొక్క, అంతఃపుర(మునందలి), వన = ఉద్యానవనంలోని, వంజుల = అశోకపు చెట్లతోనూ, కుంజ = పొదరిళ్ళతోనూ ఉన్న, సంజవనమునఁ = బవంతియందు, కుహనామునిఁ = కపట సన్యాసిని, ఉండఁజేసి = నిలిపి, నెనరు = ప్రేమ, మదిన్ పొదలన్ = మనస్సునందు ఉంటూ ఉండగా, రుక్మిణీ సత్యలతోఁ = రుక్మిణీ సత్యభామలతో పలికెఁ,

విశేషము :— ఈ పద్యములో గూడ మన కవి అర్జునుడిని "కుహనా ముని" అనే పేరొక్కన్నాడు. కవి తాను నోరారా ఎక్కడా 'యతి' అనిగాని 'త్రిదండి' అనిగాని అనడు.
మూడో చరణము 'సౌకుమార్యము' అన్న కావ్య గుణానికి దృష్టాంతము.

అలంకారము :— వృత్త్యనుప్రాసము.

"అతఁడెవ్వఁ డెఱుఁగుదురె ? మీ
మతిలోనన యుండనిండు, మన కుందనపుం
బ్రతిమ యగు సుభద్రకునై
యతివేషము బూనియున్న యర్జునుఁడు సుఁడీ". 124

అర్థము :— అతఁడెవ్వడో ఎఱుఁగుదురె ? మీ మతిలోనన (ఈ రహస్యము) ఉండనిండు, మన కుందనపుం బ్రతిమ = మేలిమి బంగారుబొమ్మ ఐన, మన సుభద్రకునై = సుభద్ర కొరకు, యతివేషముఁ, పూనియున్న అర్జునుఁడు సుఁడీ.

తాత్పర్యము :— అతడు మన సుభద్రకోసం యతివేషముతో ఉన్న అర్జునుడే సుమండీ. ఈ రహస్యం ఎక్కడా పొక్కనీయకండి అని కృష్ణుడు చెప్పాడు.

విశేషము :— సుభద్ర బంగారపుబొమ్మ; కాబట్టి ఎత్తుకు పోవడానికి ఆశ; అర్జునుడు ఇప్పుడు ఆ ఆశతో వచ్చిన సన్యాసి, దొంగకు 'దొరకోలు సన్యాసి' అని కూడా ఒక పేరుంది.

మీ సోదరుడు వట్టి సన్యాసికాడు 'దొరకోలు సన్యాసి' అని రుక్మిణీ సత్యలతో చెప్పడం అందమయిన హాస్యము కాదా.

అలంకారము :— వృత్త్యనుప్రాస.

"తన మదిలో నితఁ డర్జునుఁ
డని తెలిసి సుభద్ర సేవ కరుగక యున్నన్,
జని మీ రతనికి భోజన
మొనరింతురు గాని యూరకుండెదరు సుఁడీ". 125

అర్థము :— తన మదిలో, ఇతడు అర్జునుడు అని తెలిసి, (దానివల్ల కలిగిన లజ్జాదులవల్ల) సుభద్ర, సేవకు, అరుగక ఉన్నన్ = వెళ్ళకపోయిన యెడల, మీరు చని అతనికి భోజనము, ఒనరింతురుగాని = చేయించవలెనుగాని, ఊరకుండెదరు సుఁడీ = అశ్రద్ధగా ఉండగలరు సుమా, జాగ్రత్త :

తాత్పర్యము :— ఇతడు అర్జునుడు అన్న సంగతి తెలుస్తే, సిగ్గుచేత సుభద్ర అతని సేవకు వెళ్ళడం మానవచ్చును. అటువంటి సమయంలో, మీరు వెళ్ళి అతనికి భోజనాదులు ఏర్పాటుచేయండి; మరచి పోవద్దు; అని భావము.

విశేషము :— స్త్రీజనం యొక్క స్వభావ విశేషాలు తెలిసినవాడు కృష్ణుడు; అర్జునుడని తెలుసుకొన్న సుభద్ర మనస్సు ఎట్లుంటుందో ఊహించ గలిగాడు. దూరదృష్టితో, ముందే అర్జునుడి సౌకర్యంకోసం రుక్మిణీ సత్యభామలతో చెప్తున్నాడు.

"అతనిం బూజ లొనర్పుఁ డిప్పు" డని నెయ్యం బొప్ప గోపాలుఁ డా
నతి యీ, నర్మిలి మ్రొక్కి 'నిన్నుఁగని యెన్నాళ్ళో కదా' యంచు, 'వ
చ్చితివా, యన్న, కిరీటి', 'కూర్మి కలదా చెల్లెండ్రపై' నంచు, త
త్సతు, లేకాంతమునన్ ప్రియోక్తులను బూజల్సేసి పీడ్కొల్పినన్, 126

అర్థము :— అతనికా, పూజలొనర్పు(డు ఇప్పుడు = ఇపుడు పోయి సన్మానింపుడు, అని, నెయ్యం బొప్పన్ = ప్రీతితో, గోపాలు(డు అనతియీ్కా = ఆజ్ఞాపించగా, వారు అర్జునుడి దగ్గరకువెళ్లి, అర్మిలిశా = ప్రేమతో, మ్రొక్కి, 'నిన్నున్ గని యెన్నాళ్లో కదా' అనుచు, 'అన్న, కిరీటి = అర్జునా, వచ్చితివా', "కూర్మికలదా చెల్లెంద్రపైన్" అంచు, తత్సతులు = రుక్మిణీ సత్యభామలు, ఏకాంతమునన్ (రహస్యముగా అని) ప్రియోక్తులను = సంభావనలతో, పూజల్‌చేసి = సన్మానముచేసి, వీడ్కొల్పినకా = విడిచిపెట్టి వెళ్లగా......

విశేషము :— ఈ యతి అర్జును డన్న సంగతి రుక్మిణీ సత్యలకు గూడా ఇంతవరకు తెలియదు ; అతనిని చూడాలన్న కుతూహలం సహజంగా ఉంటుంది; అందుకు తగినట్టే కృష్ణుడు 'పోయి పూజలొనర్చండి' అని చెప్పాడు. కాబట్టి ఆలస్యము చేయకుండా తక్షణమే వెళ్లి అతడిని చూచారని భావించాలి.

'కూర్మికలదా చెల్లెంద్రపై' అన్న మాటలు సత్యభామే అని ఉంటుంది. సుభద్రపై ప్రేమ ఉంది కాబట్టి పరుగున వచ్చావు. మామీద ప్రేమ ఉంటే అలాగే వచ్చేవాడవే కదా ! 'నిన్ను గని ఎన్నాళ్లోగదా' అనవలసిన అవసర ముంటుందా అని విసురు.

ఈ మాటలు ఇతరులు వినరాదు. కాబట్టి, ఏకాంతంలో, రహస్యంగా మాట్లాడుకున్నారు.

అ న్నరుం డంత శ్రీకృష్ణు( డున్న నగరి
సరస( గన్నియ రాణివాసమున నమరు
కేళివనిలోని నవరత్న కీలితంపు
బవిరి టాకుల చిన్ని యుప్పరిగె లోన, 127

అర్థము :— ఆ నరుడు = ఆ అర్జునుడు, అంతన్, శ్రీకృష్ణు(డు ఉన్న, నగరి = రాజమందిరముయొక్క, సరసన్ = చేరువను, కన్నియ = సుభద్రయొక్క, రాణివాసమునన్ = అంతఃపురంలో, అమరు = ఉన్నటువంటి, కేళివనిలోని = ఉద్యానవనము నందలి, నవరత్న కీలితంపు = తొమ్మిది రకములైన రత్నములతో కూర్చబడిన, బవిరిటాకుల = గుండ్రముగా చెక్కిన చూరుపట్టెలుగల, చిన్ని - అందమైన, ఉప్పరిగలోనన్ = బవంతియందు......

తాత్పర్యము :— కృష్ణుడి మందిరము దగ్గరనున్న సుభద్ర అంతఃపురానికి చెందిన ఉద్యానవనములో అందమయిన చిన్న బవంతిలో......తరువాతి కన్వయము.

తెఱవ నెఱ వంక బొమలును మెఱుఁగు వాఁడి
చూపులును జూచి తన చేతిసూటి రోసి,
యస్త్రసన్న్యాస మొనరించినట్టి సుమశ
రాసనుం డనఁ జెలిమీఁది యాస నుండె. 128

అర్థము :— తెఱవ = సుభద్రయొక్క, నెఱ = అందమయిన, వంక = వంపుగల. బొమలును, మెఱుఁగు వాఁడి చూపులును = కాంతి గలిగి తీక్ష్ణములగు చూపులును, చూచి, (మన్మథుఁడు)తన = తనయొక్క, చేతిసూటిఁ = చేతియొక్క నేర్పును. రోసి = అసహ్యించు కొని, అస్త్రసన్న్యసము ఒనరించినట్టి = ఆయుధములను (విల్లమ్ములను) త్యజించినట్టి, సుమ శరాసనుం డనఁ = పూవిలుకాడా - మన్మథుడా-అన్నట్లుగా, చెలిమీఁది = సుభద్రమీద నున్న, యాసన్ = ఆశతో, (ఆ బవిరిటాకుల బవంతిలో అర్జునుడు) ఉండెన్.

తాత్పర్యము :— సుభద్రయొక్క చక్కని వంకర గల కనుబొమలనూ, వాడి చూపులనూ చూచి, తన విల్లమ్ములపై అసహ్యం కలిగి అస్త్రసన్న్యసంచేసి కూర్చున్న మన్మథుడో అన్నట్లు అర్జును డున్నాడు.

విశేషము :— వింటికి తగిన వంకర, అమ్ములకు వాడి మంచి గుణాలు. అవి సుభద్ర బొమలయందూ, చూపులయందూ విశేషంగా కలగడంచేత మన్మథుడు తన విల్లమ్ములు బాగులేవని అసహ్యించుకొని వాటిని విడ్డిచి పెట్టాడు.

విల్లమ్ములకు సంబంధించిన విషయ మగుటచేత, ఇక్కడ మన్మథుడిని సుమశరాసను డనడము సమంజసము.

మన్మథునితో సమానమైన ఆకారం కలవాడనీ అర్జునుడు కూడా విల్లమ్ములు లేకుండా, యతివేషంలో కూర్చుని ఉన్నాడు కాబట్టీ ఈ అస్త్రసన్యాసవర్ణన ఉచితమైంది.

అలంకారము :— ఉత్ప్రేక్ష, వృత్త్యనుప్రాస.

అందుండి మనసులోన ము
కుందుం డీగతి నొనర్చు కుశలత కతఁ డా
నందమును జెందుచుండఁ,
గొందఱు గారాబుచెలులు గొల్వఁగ నంతన్, 129

అర్థము :— అందుండి = ఆ ఉప్పరిగలో నుండి మనసులోన, ముకుందుఁడు = కృష్ణుడు, ఈగతిఁ = ఈరీతిగా, ఒనర్చు = ఏర్పాటుచేసిన, కుశలతకు = చమత్కారమునకు,

అతఁడు, ఆనందమును చెందుచున్ ఉండన్ = సంతోషిస్తూ ఉండగా, అంతన్ = అప్పుడు, కొందఱు, గారాబు చెలులు = ఇష్టసఖులు, కొల్వఁగన్ = కొలిచి వస్తుండగా...తరువాతి కన్వయము.

చందురు కావి పావడ పిసాళి రుచుల్ సరిగంచు చీరపైఁ
జిందులు ద్రొక్కఁ, వేణి కటిసీమ పయిన్ నటియింప, జాళువా
యందెలు మ్రోయ, జంటిఅవి కంటి చనుంగవ పిక్కటిల్లఁగాఁ
జందనగంధి వచ్చె రభసమ్మున నమ్మునిరాజు సేవకున్, 130

*అర్థము* :— చందురు కావిపావడ = సిందూరపువన్నె గలిగిన పరికిణీయొక్క, పిసాళి రుచుల్ = ప్రకాశిస్తున్న కాంతులు, సరిగంచు = జలతారు అంచులుగల, చీరపైన్, చిందులుద్రొక్క = గంతులువేసినట్లు కనిపించీ కనిపించకుండా ఉండగా, కటిసీమపయిన్ = పిఱుదులమీద, వేణి = కొప్పు, నటియింపన్ = నటించుచుండగా, జాళువా = కుందనపు, అందెలు మ్రోయగా, చనుంగవ = కుచముల జంట, జంటి అవిక = జరీ బుటాలతో కూర్చి కుట్టిన రవికను, అంటి = పూతపూసినట్లు అంటి, పిక్క టిల్లఁగన్ = క్రిక్కిరిసి ఉండగా, చందనగంధి = సహజముగా చందనమువలె పరిమళిస్తున్న శరీరముకల సుభద్ర, ఆ మునిరాజు సేవకున్ = ఆ మునిశ్రేష్ఠునికి శుశ్రూష చేయడానికి, రభసమ్మునన్ = వేగముగా, వచ్చెన్.

*తాత్పర్యము* :— సుభద్ర చక్కగా అలంకరించుకొని గారాబు చెలికత్తెలతో కలిసి, అర్జునుడి వద్దకు త్వరత్వరగా వచ్చింది.

*విశేషము* :— ఇక్కడ అర్జునుడు 'మునిరాజు'—అంటే, మునిశ్రేష్ఠ డనేకాదు: 'ముని అయినరాజు' అని గూడా చమత్కారము. 'కపట త్రిదండి' వంటిదే.

సుభద్ర రభసమ్మున రావడం యౌవన లక్షణమూ, భక్తి విశేషమూ అనాలి.

*అలంకారము* :— స్వభావోక్తి, ఉదాత్తము.

## సుభద్ర శుశ్రూష

వచ్చిన, దౌలఁ గాంచి తలవంచి జపంబు నెపంబు వెట్టి వి
వ్వచ్చుఁ డొకింతసేపు తనవంకఁ గనుంగొన కున్న, మెల్లనే
యచ్చటు నిల్చి నిల్చి, వినయంబునఁ జేరి, కుచంబు లోరఁగా
హెచ్చిన భక్తి మ్రొక్కి యనియెం జెలి యంజలిజేసి యుంపుగన్, 131

అర్థము :— వచ్చినన్ = సుభద్రవస్తూ ఉండగా, దౌలన్ = దూరముండగానే, కాంచి = చూచి, తలవంచి, జపంబు నెపంబుపెట్టి = జపము చేస్తున్నట్లు—జపమాల త్రిప్పుతు న్నట్టు-నటించి, వివ్వచ్చుఁడు = అర్జునుఁడు, ఒకింత సేపు = కొంచెము కాలము, తనవంకన్ = సుభద్రదిక్కు, కనుంగొనక ఉన్నన్ = చూడకుండా ఉన్నందువల్ల, మెల్లనే = చప్పుడు చేయ కుండగానే, అచ్చట, నిల్చి నిల్చి = చాలా సేపు నిలుచుండి, (కన్నులు తెరచిన పిమ్మట) వినయం బునన్ = అణకువతో, చేరి = దగ్గరకుపోయి, హెచ్చినభక్తిన్ = అధికమైన భక్తితో, కుచంబులు ఓరగాన్ మ్రొక్కి = కుచాలు పక్కవాటుగా కనబడుతుండగా నమస్కరించి, చెలి = సుభద్ర, ఇంపుగన్ = మనోహరముగా, అనియెన్ = పలికెను :

తాత్పర్యము :— సుభద్రను దూరం నుంచే చూచి అర్జునుడు జపం చేసుకుంటు న్నట్లు నటించసాగాడు. సుభద్రవచ్చి చాలా సేపు వేచి ఉంది, అర్జునుడు కళ్ళు విప్పిన తర్వాత, భక్తితో నమస్కారం చేసి ఈవిధంగా పలికింది :

విశేషము :— సుభద్ర వచ్చినప్పుడు అర్జునుడు జపము చేస్తున్నట్లు నటించడంచేత, సుభద్ర భక్తి ఎక్కువయింది.

'నిల్చి నిల్చి' - అన్నందువల్ల సుభద్ర చాలా సేపు వేచి ఉన్న తర్వాతనే అర్జునుడు జపము చాలించి కళ్లువిప్పాడని భావము.

వివ్వచ్చుడు అనగా భయము గొలుపువాడు - కాబట్టే, సుభద్ర జపభంగము చేయడానికి జంకి, మౌనంగా నిలిచింది అని ఊహించాలి. యౌవనవతి కావడంవల్ల సుభద్ర చేతులు జోడించి నమస్కరించినప్పుడు పుష్టిగల కుచములను చేతులు అదుమవలసి వచ్చినందున అవి ప్రక్కవాటుగా కాన వచ్చుట సహజము. కాబట్టే "కుచంబులోరగాన్" అని అన్నాడు. స్తనముల నిండుదనము చెప్పకుండా చెప్పడము చమత్కారము.

అలంకారము :— అనుప్రాసము, స్వభావోక్తి.

"ఓ మహానుభావ ! యేమి గావలె దేవ
పూజ కిపుడు ? పత్ర పుష్ప ఫల జ
లాదికములు దెత్తునా ?" యనవుడు నట్ల
సేయు మనుచు నతఁడు చేయిసూప. 132

అర్థము :— "ఓ మహానుభావ ! ఇపుడు, దేవపూజకు, ఏమి కావలె ? పత్ర పుష్ప ఫల జల. ఆదికములు = మొదలయినవి, తెత్తునా = తేవలయునా ?" అనవుడు = అని సుభద్ర

అడగగా, అట్ల = ఆప్రకారమే, చేయుము, అనుచుఁ = అని తెలిపినట్లు, అతడు = అర్జునుడు, చేయిసూపఁ = చేతితో సంజ్ఞ చేయగా...

పత్ర, పుష్ప ఫల, జలములు - ఈ వరుసనే తర్వాతి పద్యంలో కూడా పోషించడం గమనించాలి.

అర్జునుడు నోటితో కాకుండా, చేతితో తీసుకు రమ్మన్నాడు. ఇంకా జప వాతావరణము లోనే ఉన్నట్టు నటన.

మహానుభావ — ఇది సుభద్ర అర్జునుడి విషయము చేసిన మొదటి సంబోధన - అత్యంత భక్తిగౌరవాలను సూచిస్తుంది.

తన యరు ణాధరంబునకు నీ డివి యన్న
రమణ, నేఱిచి పల్లవములు కొన్ని,
తన తనూ సౌరభంబునకు జో డివి యన్న
చందాన, వెదకి పుష్పములు కొన్ని,
తన మధు రాలాపములకు దీ టివి యన్న
పగిది, నారసి తియ్యపండ్లు కొన్ని,
తన లేనగవు తేటకును బాటి యివి యన్న
పోల్కి, దేఱిచి హిమాంబువులు కొన్ని,
పత్ర పుటికా విధూపల పాత్రికలను
దెచ్చి వినయంబుతోడ నందిచ్చె నపుడు
పసిఁడి గాజుల మినమినల్ పైకిఁ బొలయఁ,
జకిత బాల మృగీ చకచకిత నయన, 133

అర్థము :— చకిత = బెదరిన, బాలమృగీ = ఆడుజింక పిల్లవలె, చకచకిత = చాల చలించుచున్న, నయన = కన్నులుకల సుభద్ర, వినయంబుతోడ (అందిచ్చెఁ తో అన్వయము)

౧. తన (సుభద్రయొక్క), అరుణ అధరమునకుఁ = ఎఱ్ఱని పెదవికి, ఇవి, ఈడు = సాటి, అన్నరమణఁ = అన్న విధముగా, ఏఱిచి = ఎంచియెంచి, పల్లవములు కొన్ని = కొన్ని చిగుళ్లున్ను,

౨. తన, తనూ సౌరభంబునకు = శరీరముయొక్క సహజ సువాసనకు, జోడు ఇవి సమానము, అన్న చందాన, వెదకి = మంచివి చూచి చూచి, కొన్ని పుష్పములున్ను,

3. తన మధు రాలాపములకు = తీయని మాటలకు, ఇవి, దీటు = సాటి, అన్న పగిది = అన్న విధముగా, అరసి = బాగా ఎంచి, కొన్ని, తియ్యని పండ్లున్ను,

4. తన, లేనగవు తేటకును = చిఱునవ్వుయొక్క నైర్మల్యమునకు, ఇవి, పాటి = సమానము, అన్న, పోల్కి౯ = విధమున, తేఱిచి = తేటపడునట్లుచేసి, కొన్ని = కొంత, హిమ అంబువులు = పన్నీరున్ను,

పత్ర పుటికా = ఆకులతో చేసిన దొప్పలయందును, విధూపల పాత్రికలను = చలువ రాతితో చేసిన గిన్నెలయందును, తెచ్చి, వినయంబుతోడ౯, పసిఁడి (బంగారు) గాజుల యొక్క, మిసమిసల్ = తళుకుల కాంతులు, పైకి౯ = అర్జునుడి మీదికి, పొలయ౯ = వ్యాపించునట్లు, అపుడు అందిచ్చె౯.

*విశేషము :—* విశేషమైన భక్తితో, సుభద్ర చక్కని పత్రపుష్పాదులు జాగ్రత్తగా సంగ్రహించింది, కాబట్టే, ఏరిచి, వెదకి, ఆరసి, తేఱిచి అన్న పదాలు, దీనివల్ల పల్లవములన్నీ తన కెమ్మోవికి సాటికావనీ, ఏ ఒకటి రెండో మాత్రము సరిరాగలవనీ గ్రహించాలి. అలాగే తక్కిన మూడింటిలోనూ బాగా సరిపోవడానికి వాటిలో శ్రేష్ఠమైనవి ఎంచిఎంచి తెచ్చిందన్న భావము సూచించాడు కవి.

ఆకు దొప్పలలో పల్లవములనూ, పుష్పములనూ, చలువరాతి పాత్రలలో పండ్లనూ, పన్నీటినీ తెచ్చిందని క్రమము గమనించాలి.

పసిడి గాజులు – రత్నఖచితములై – మెరుస్తుంటాయి. అందుకే మిసమిసలు, పైకి వ్యాపించాయి. తెచ్చిన వస్తువులు చేతికందిచ్చి నప్పుడు ఆ మిసమిసలు అర్జునుడి మీద పడక తప్పవు గదా.

వెదకివెదకి, ఎంచి యెంచి ఆయా వస్తువులను తీసుకొని రావడమువల్ల సుభద్రకు యతీశ్వరుడి సేవయందుగల అపారమయిన శ్రద్ధాభక్తులు తేటపడుతున్నాయి.

పోలికను తెల్పడానికి మొదటి రెండు పాదాలలోను 'ఈడివి' 'జోడివి' అనీ, తక్కిన రెండు పాదాలలోను 'దీటివి' 'పాటివి' అనీ మరొక చిన్న సొగసు కవి ఉద్దేశించాడు.

*అలంకారము :—* ఉత్ప్రేక్ష, క్రమము, ఉదాత్తము.

గెంటని ప్రేమ మేను పులకించెఁ గిరీటికిఁ బూ లొసంగి వా
ల్గంటి గిఱుక్కునం దిరుగఁ గమ్మని కస్తురి తావి గ్రమ్ముకో
గింటెపు గబ్బిగుబ్బల జిగిన్ వెలిఁ జిమ్ము నొయారిజిల్గు ప
య్యంట చెఱం గొకింతదన యంగముపై నటు సోఁకి సంతటన్. 134

*అర్థము* :— వాల్గంటి - సోగకన్నులుగల సుభద్ర, పూలొసంగి, గిఱుక్కునన్ = కొంచెము తొందరగా, తిరుగన్ = తిరిగినప్పుడు, కమ్మని కస్తురితావి = మనోహరమగు (లేపనముల) కస్తూరి వాసనలు, క్రమ్ముకోన్ = అలముకోగా, గబ్బిగుబ్బల = బలిసియున్న స్తనములయొక్క, గింటెపు = దట్టమైన, జిగిన్ = కాంతిని, వెలిన్ చిమ్మ = పైకి కనిపించేట్లు చేస్తున్న, ఒయారి జిల్గు పయ్యంట = ఆ సుందరియొక్క సొగసైన సన్నని పైట, చెఱంగు = కొంగు, ఒకింత = కొంచెము, తన = అర్జునుని, అంగముపై = శరీరము మీద, అటు = రవంత మాత్రము, సోకినంతటన్ = తాకిన మాత్రాన, గెంటని ప్రేమన్ = గాఢమైన ప్రేమ చేత, కిరీటికి = అర్జునునకు, మేను = శరీరము, పులకించెన్ = గగుర్పొడిచింది.

*తాత్పర్యము* :— సుభద్ర పూలందించి, గిరుక్కున వెనుకకు తిరిగినప్పుడు, కస్తూరి పరిమళము అలముకొనినట్టు ఆమె పైటకొంగు రవంత తాకినందువల్ల అర్జునుడి శరీరము పులకరించింది.

*విశేషము* :— గిరుక్కున తిరగడము యౌవన లక్షణము, అలాగు తిరిగినప్పుడు అంగలేపనాదుల సువాసనలు కమ్ముకొనడమూ, ఒయ్యారంగా వేసుకొని ఉన్న సన్నని పైట ఎగిరి అర్జునుని తాకడమూ సహజమైన వర్ణనలు.

"అటు సోకినంతటన్" — తాకీతాకనట్లు - చాల స్వల్పముగా తగులగా అని.

*పాఠాంతరము* :— "సోఁక నంతటన్" — వేదంవారు.

*అలంకారము* :— స్వభావోక్తి.

చేసె జప మతఁడు కడు వి
శ్వాసము చెలి చూపు బేడిసలపై నిగుడన్
జేసిన యది జపమున్ మఱి
వేసిన యది గాల మనుట వృథ గాకుండన్. 135

'చేసిన యది జపమున్ మఱి వేసిన యది గాలము (చేపల బట్టే సాధనము)'-అనుట = అన్న లోకోక్తి, వృథకాకుండన్ = నిరర్థకము కాకుండునట్లు, అతడు = అర్జునుడు, చెలి చూపు బేడిసలపైన్ = సుభద్రయొక్క చూపులన్న బేడిస చేపలమీద, కడువిశ్వాసము = మిక్కిలి శ్రద్ధ, నిగుడన్ = ఉండేలాగ, జపము చేసెన్ = తన జపము సాగించాడు.

*తాత్పర్యము* :— 'చేసినది జపమూ, వేసినది గాలమూ' అన్న సామెత నిజమయ్యే లాగ అర్జునుడు బేడిస చేపలవంటి సుభద్ర కన్నులమీదనే శ్రద్ధ నిలిపి తన జపము సాగించాడని భావము.

*విశేషము :—* ఏదో మంచి పని చేస్తున్నట్టు కనిపిస్తూ, స్వప్రయోజనాన్ని సాధించు కోడానికి ప్రయత్నించినప్పుడు ఈ లోకోక్తిని ఉపయోగిస్తారు. ఇక్కడ చేస్తూ ఉన్నది జపమే, శ్రద్ధ చూపుబేడిసల మీదనే. మన కవి లోకోక్తుల పద్ధతికి ఇది మరియొక నిదర్శనము.

*అలంకారము :—* లోకోక్తి, రూపకము.

భామ మోమున వ్రేలు రూపంబుఁ జూచి,
ముదిత యెదఁ బాయకుండెడు మూర్తిఁ దలఁచి,
రమణి మై సగమైన విగ్రహము నెంచి,
ప్రోవు మని వేఁడుకొను దేవపూజ వేళ. 136

*అర్థము :—* భామ మోమున వ్రేలాడు రూపంబు చూచి = ఎల్లప్పుడును భార్యను (సరస్వతిని) ముఖము నందుంచుకొను ఆకారముగల బ్రహ్మను, చూచి = ఉద్దేశించి,

ముదిత యెదఁబాయ కుండెడు మూర్తిఁదలఁచి = ఎల్లప్పుడూ ఎడబాయకుండునట్లు, లక్ష్మీ దేవిని వక్షస్థలమున నిలుపుకున్న విష్ణుమూర్తిని ధ్యానించి,

రమణి మై సగమైన విగ్రహము నెంచి = భార్య తన శరీరములో సగభాగముగా ఉన్న విగ్రహము — అర్ధనారీశ్వరుడైన - ఈశ్వరుని, ఎంచి = ప్రార్థించి,

దేవ పూజవేళఁ, ప్రోవుము = రక్షింపుము, అని, వేడుకొనుఁ. దేవపూజవేళ త్రిమూర్తులనూ ధ్యానించి, తన్ను రక్షించమని అర్జునుడు ప్రార్థిస్తాడని భావము.

అర్జునుడికి భామ (సుభద్ర) యొక్క రూపము ఎల్లప్పుడూ తన మోమున వేలాడు తున్నట్టు - కన్నులకు కట్టినట్లు ఉంటుంది.

ఆమె యొక్క మూర్తి ఎప్పుడూ వీడిపోకుండా ఎదలో (హృదయములో) నిలిచి ఉంటుంది.

ఆమె శరీరము తన శరీరంలో అర్థభాగంవలె లీనమై ఉన్నట్లుంటుంది.

అటువంటి సుభద్రను తలచుకొని, తన్ను అంగీకరించుమని అర్జునుడు దేవపూజ చేస్తున్నప్పుడు ప్రార్థిస్తాడు.

ఇంకా, పై మూడు స్థితులూ గమనించి, అనగా, తనలో సుభద్ర పైని ప్రేమ ఎంత లోతుగా ఉన్నదీ గమనించి, తనకు సుభద్ర దక్కేటట్టు చేసి రక్షింపమని అర్జునుడు ఆ త్రిమూర్తులను ప్రార్థిస్తాడని అర్థాంతరము.

విశేషము :— భార్యను ఎప్పుడూ ఎదుట పెట్టుకొనే వాడు బ్రహ్మ: సతి నెప్పుడు మనసులో నుంచుకొనేవాడు విష్ణువు; భార్య కోసం శరీరములో సగము ఇచ్చిన వాడు శివుడు. ఈ ముగ్గురికీ ప్రేమ ఏలాటిదో బాగా తెలుసునని అర్జునుడి భావము. అందువల్లనే ఆ ముగ్గురు దేవులనూ పూజించి, వారిలాగే తనకూ ప్రియురాలితో అవినాభావము కలిగేలాగా అనుగ్రహించమని ప్రార్థిస్తున్నట్లు ధ్వని.

ఇందులో, మోమున ఉండు దానిని, యెదనుండు దానిని, సగమైన దానిని క్రమంగా చూచి, తలచి, ఎంచి అన్న క్రియలతో చెప్పడము చాల అందము కాదా,

ఇంతేగాక, వ్రేలునది రూపము (పటములాగా), పాయకుండునది మూర్తి (ఒక్క మూర్తిగా తోచడమువల్ల), సగమయినది విగ్రహము (విభాగము కాబట్టి) అన్న సొగసు గూడా ఉంది,

అలంకారము :— శ్లేష, పర్యాయోక్తి.

వినతిఁ జేసిన, భిక్ష గావింపుఁ డనిన,
మాఱు వడ్డింప నివి దెత్తునా యటన్నఁ,
బల్కు నారాయణా యను భాషణంబె
యల నిజాలకు సన్యాసి వలె నతండు. 137

అర్థము :— వినతిన్ = నమస్కారము, చేసినన్ = చేసినా, భిక్షకావింపుడు = భోజనము చేయండి, అనినన్ = అని అనినా, మాఱువడ్డింపన్, ఇవి, తెత్తునా అటన్నన్ = ఈ పదార్థాలు మరి కొంచెము వడ్డించమంటారా అనినా, అల నిజాలకున్ సన్యాసివలెన్ = వాస్తవానికి సన్యాసి అయినట్టుగానే, అతడు, నారాయణా అను, భాషణంబె = మాటను మాత్రమే, పల్కున్.

విశేషము :— అర్జునుడి నటన అంత స్వాభావికంగా కాన వస్తున్నదని భావము.

భయభక్తుల నిటులా కృత
క యతిగ్రామణికిఁ గన్యకామణి శుశ్రూ
ష యొనర్చుచుఁ గొన్నా ళ్ళుం
డి, యొకానొకనాఁడు తనదు డెందము లోనన్, 138

అర్థము :— ఇటులు, ఆ కృతక = కపటపు, యతిగ్రామణికిన్ = సన్న్యాసిశ్రేష్ఠునకు, కన్యకామణి = సుభద్ర, భయభక్తులన్ = భయముఁతోనూ, భక్తితోనూ, శుశ్రూష = సేవ, ఒనర్చుచున్. కొన్నాళ్ళు, ఉండి, ఒకానొకనాఁడు, తనదు (సుభద్రయొక్క), డెందములోనన్ = మనస్సులో...తరువాతి కన్వయము.

తాత్పర్యము :— భయభక్తులతో సేవచేస్తూ కొన్నాళ్ళయిన తరువాత ఒకనాడు సుభద్ర తన మనసులో (ఈలాగు అనుకున్నది).

'వాసవి రూప చిహ్నముల వార్తలు మున్ వినియుండుదుం గదా,
యా సొబగెల్ల నేఁడు గన నయ్యెడు వీరలయందు; నైన స
న్న్యాస మసంగతం బగు, మహా సుకుమారుఁడు రాకుమారుఁ డీ
గాసికి నోర్చునే? కలరుగా మఱి మానిసిఁ బోలు మానిసుల్. 139

అర్థము :— "వాసవి = అర్జునునియొక్క, రూపచిహ్నముల గురించిన, వార్తలు = విశేషాలు, మున్ = ఇంతకు పూర్వము, వినియుండుదున్ కదా = వింటుండే దానను కదా, (వినుటవల్ల, అర్జును డీ రూపంలో, ఈ ఈ చిహ్నలతో ఉంటాడని తనకు తెలుసు), ఆసొబగు = ఆవార్తలు వర్ణించిన సౌందర్యము, ఎల్లన్ = అంతా, వీరలయందు, నేఁడు = ఈదినమున, కనన్ అయ్యెడు = కానవస్తున్నది; (ఇతడే అర్జునుడేమో అన్న సందేహము), ఐనన్ = అయినప్పటికీ, సన్న్యసము (అర్జునునకు), అసంగతంబు అగు = తగనిది ఎందుకు వస్తుంది? మహాసుకుమారుఁడు = కష్టమున కోర్చుకోలేనివాడు, రాకుమారుడు, ఈ గాసికిన్ = ఈ సన్న్యాసులకుండే ఎండ, వానల బాధలకు, ఓర్చునా = ఓర్చుకుంటాడా? మఱి = ఇంతేకాక, మానిసిన్ పోలు మానిసుల్ = ఒక మనిషిని పోలినట్టు ఇంకొక మనిషి, కలరుగా = ఉండవచ్చునుగదా. (కాబట్టి ఇతడు వాసవిని పోలిన మరొక మనిషేగాని వాసవికాడు,))

తాత్పర్యము :— సుభద్ర తాను విన్న రూప చిహ్నలనుబట్టి ఈ సన్న్యాసి అర్జునుడేమో అనుకొన్నది. కాని అంతలోనే, "అంత సుకుమారుడు సన్న్యాసి ఎందుకవుతాడు, మనిషిని పోలిన మనషులుంటారుగదా, ఇతడు అర్జునుడిలాగే ఉన్న మరొక రెవరో" అని తన అనుమానాన్ని త్రోసివేసింది.

అలంకారము :— అసంగతము, అర్థాంతరన్యాసము, ఆక్షేపము.

అని సంశయ మొకయించుక
యును లే కెప్పటి వడువున యువతి వతంసం
బనువుగ నతనికిఁ బూజన
మొనరించుచు నుండె నంతి కోద్యానమునన్. 140

అర్థము :— అని = పై విధంగా నిశ్చయించుకొని, సంశయ మొక యించుకయును లేక = సంశయ మేమాత్రమూ లేకుండా, ఎప్పటి వడువునన్ = ఎప్పటివలెనే (ఈ అనుమానం కలుగక పూర్వం తా నున్నవిధంగానే), యువతి వతంసంబు = యువతుల్లో సిగబంతివంటి సుభద్ర, అంతిక ఉద్యానమునన్ = (తన నివాసానికి) చేరువగా ఉన్న ఉద్యానవనములో, అనువుగన్ = ఉచితమైన విధంగా, పూజనము = సేవలు, ఒనరించుచు, ఉండెన్.

విశేషము :— సంశయము లేనందువల్లే, ఎప్పటిలాగా సేవ కొనసాగించిందని సుభద్ర స్వభావ విమర్శ చేశాడు కవి.

## అర్జునుని నటన - సుభద్ర శుశ్రూష

కరము సాఁచి నవాంబు కలశ మీ విడివడ్డ
కుంకు మాంకపు ముద్దుఁ జంక మెఱపు,
ననలు దేఁ బోఁ గాళ్లఁ బెనఁగు నంచ నదల్పఁ
జూచు జంకెన వాఁడి చూపు బెళుకు,
పూ రెమ్మ వంచుచో జాఱు పయ్యంటఁ దాఁ
గిలిమూఁత లాడు గుబ్బల బెడంగు,
'పొలఁతి కాయో, పండో, పోయిన పని' యన్న
చిలుక మాటకు నవ్వు సొలపుఁ దేట,
మఱియు మఱియును జూడనే మనసు వాఱి,
వారి కుసుమ ఫలంబులు దేరఁ బనుచుఁ
దొలుతటివి చాల వని యా వధూలలామ ;
నే మనఁగ వచ్చు వివ్వచ్చు నేమ మింత ! 141

యతి వేషములో ఉన్న అర్జునుడు ఆత్మ సంతృప్తికోసము — ఏకపక్ష శృంగారముగా—చేసిన పనులను ఈ పద్యాలలో కవి చాల నేర్పుతో ప్రదర్శించాడు. సుభద్రకు ఈ అంతరార్థాలు తెలియవు పాపము !

అర్థము :— ౧ కరము = చేతిని, చాఁచి, నవాంబు కలశము = అప్పుడు తెచ్చిన నీళ్ల పాత్రను, ఈన్ = ఇచ్చునపుడు, విడివడ్డ = (మరుగుపోయి) బయటికి తెలియవచ్చిన, కుంకుమాంకపు = కుంకుమపూ లేపనముయొక్క చిహ్నములుగల, ముద్దు చంక = మిగుల అందమగు బాహుమూలముయొక్క, మెఱపు = శోభయును.

రాజకాంతలు కుంకుమపూలేపనము వాడుతుండేవారు. చేయి చాచినప్పుడు చంక తెలియ వస్తుంది కనక, "విడివడ్డది" అని.

౨. ననలు = పూవులు, తేన్పోన్ = తెచ్చుటకు పోయినప్పుడు, కాళ్ల పెనఁగు = కాళ్లకు అడ్డము పడుతూన్న, అంచల = పెంపుడు హంసను, అదల్పఁగ = భయపెట్టుటకు, చూచు (నట్టి) జంకెన వాఁడి = బెదరిస్తూన్న తీక్ష్ణమైన చూపుయొక్క, బెళుకు = కాంతియు,

౩. పూరెమ్మఁగ = పూలుగల కొమ్మను, వంచుచోఁగ = వంచినప్పుడు, జాఱుపయ్యంటను, దాఁగిలి మూఁతలాడు = కనబడీ కనబడకుండా ఉండే, గుబ్బల, బెడంగు = సొగసును,

౪. 'పొలఁతి, కాయో పండో పోయిన పని = నీవుపోయిన పని కాయతెచ్చుటకా? పండు తెచ్చుటకా? యన్న ; చిలుక మాటకు, నవ్వు (ఆ మాటలో 'నీకోరిక సిద్ధించిందా, లేదా' అన్న ఇంకొక అర్థం ఉన్నందున సంతోషించి) నవ్వునందలి, సొలపు తేట = ఒయ్యారముయొక్క సొబగును,

(పైన చెప్పిన నాలుగును) మఱియు మఱియును = ఎన్నియో సారులు, చూడనే = చూచుటకే, మనసుపాఱి = కోరికకల్గి, తొలుతటివి = ఇంతకు మున్ను తెచ్చిన ఫలపుష్పాదులు చాలవని, వారి కుసుమ ఫలంబులు = నీరూ పూవులూ పండ్లూ, తేరఁగ = తెచ్చుటకు, వధూ లలామఁగ = నారీతిలకమైన సుభద్రను, పనుపుఁగ = పంపుచుండును, విన్వచ్చు నేమము = అర్జునుని నిష్ఠ, ఏమి అనఁగఁగ వచ్చుఁగ = చాలాగొప్పగా ఉంది కదా!

*విశేషము :—* సారెసారెకు నీరు తెమ్మనడము, నీరందిస్తున్నప్పటి సుభద్ర చంక మెఱపు చూడడానికి, పూలు తెమ్మనడము జంకెన చూపుల బెళుకున్ను, గుబ్బల బెడంగున్ను చూడడానికి, పండ్లు తెమ్మనడము, నవ్వు సొలపు తేట చూడడానికి. చాలవని, ఇంకా వారి కుసుమ ఫలంబులు తెమ్మనడం పైన వర్ణించిన క్రమంలో అర్జునుడు సుభద్ర సౌందర్యాన్ని తిరిగి తిరిగి చూడడానికే; అయినా అదంతా యతిగారి పూజానిష్ఠ అనే సుభద్ర అనుకొనే దన డానికి సందేహము లేదు.

ఇక్కడ దృష్టివల్ల సంతృప్తిని కవి చూపాడు,

*అలంకారము :—* శ్లేష, అపహ్నుతి, క్రమము, అనుప్రాస.

'తెమ్ము బంగారుకుండ జలమ్ము' లనుచుఁ,
'దెమ్ము లతకూన మంచి సుమమ్ము' లనుచుఁ,
'దెమ్ము బాగైన కొమ్మ ఫలమ్ము' లనుచు,
మించుఁ బోఁడిని నేరుపు మించఁ బలుకు. 142

అర్థము :— బంగారు కుండతో, జలమ్ములు = నీటిని, తెమ్ము, అనుచు, లతకూస = లేతతీగయొక్క, మంచి, సుమమ్ములు = పూవులు, తెమ్ము, అనుచు, బాగైన కొమ్మ ఫలమ్ములు = మంచి కొమ్మను పండిన పండ్లను, తెమ్ము అనుచు, నేరుపు మించఁగా = మిక్కిలి చమత్కారంతో, మించుబోఁడిని = మెరుపువంటి శరీరముకల సుభద్రను గూర్చి, పలుకు (ను).

విశేషము :— ఈ మాటల్లో అర్జునుడి 'నేరుపు' ఏమంటే ; బంగారుకుండా (సంబోధనము) = మిగుల కుదురైన ఓకాంతా ! జలమ్ములు తెమ్ము, అనుచు, లతకూనా = లేతతీగవంటి యో తన్వంగీ, సుమములు తెమ్మనుచు, బాగైనకొమ్మా = సుందరమగు చిన్నదానా, ఫలములు తెమ్మనుచు పిలిచి పిలిచి ఆజ్ఞాపిస్తుంటాడు.

ఈలాగు అర్జునుడు తనలో తాను సంతృప్తి పొందుతుంటాడు. కాని ఈ అంతరార్థము సుభద్రకు తెలియదు,

కొమ్మ ఫలములు అనగా చెట్టునుంచి తీసి ముగ్గవేసిన (పండవేసిన) పండ్లు కాక చెట్టునే పండిన పండ్లు అని భావము. వాటికి రుచి ఎక్కువ.

ఈ పద్యములో మాటలవల్ల సంతృప్తిని కవి ప్రకటించాడు.

అలంకారము :— శ్లేష, అనుప్రాసము.

'తుమ్మెద వలె నున్నది, యిటు
ర' మ్మని, నెఱికొప్పు నిమిరి, 'భ్రమసితిఁ దరుణీ,
కమ్మ విరి నల్ల'గల్వ ని
క్రమ్మఱ మఱుపెట్టు గుట్టుఁ గనరాకుండన్. 143

అర్థము :— "తుమ్మెద వలె నున్నది = (ఏదీ, సుభద్రా) నీ తలపై ఏదో తుమ్మెద వాలినట్లుంది, ఇటురమ్ము" (తీసివైచెదను) అని, (ఆమె తలవంచగా), నెఱికొప్పు నిమిరి = = (శృంగార చేష్టగా) కొప్పు నిమురుతూ, 'తరుణీ = ఓ యౌవనాంగీ, భ్రమసితిన్ = భ్రమపడినాను, (అది తుమ్మెదకాదు), కమ్మవిరి నల్లగల్వ = పరిమళయుక్తమైన నల్లకలువయే సుమా" అని, గుట్టు = అంతర్భావము, కనరాకుండన్, క్రమ్మఱన్ = మరల, మఱుపెట్టు = మరుగుపరుచును.

తాత్పర్యము :— "సుభద్రా, తలపై తుమ్మెద వాలినట్లుంది" అంటూ అర్జునుడు దానిని తీసివేయ బోతున్నట్లుగా, సుభద్ర తల నిమిరి, "అరరే, పొరపడ్డాను, ఇది నల్ల కలువ కాని తుమ్మెద కాదు" అని చెప్పుతాడు.

విశేషము :— ఆమెను స్పృశించాలన్న తన తమకాన్ని ఈవిధంగా తీర్చుకుంటాడు యతీశ్వరుడు.

తుమ్మెద నల్ల గుంటుంది. అందువల్ల 'తుమ్మెదలాగుంది, ఇటురా' అని పిలిచి తల నిమిరినవాడు 'తుమ్మెద కాద'ని బొంకాలికదా; కొబట్టి "నల్లగల్వ" అని నేర్పుతో అన్నాడు.

ఇదీ నల్లగానే ఉంటుంది; ఎవరైనా తుమ్మెద అని పొరపడవచ్చును.

ఈ పద్యములో స్పర్శనవల్ల సంతృప్తిని సూచించాడు కవి.

అలంకారము :— అపహ్నుతి.

నిద్దంపు మేలి సొమ్ములు,
దిద్దిన కస్తూరిబొట్టు, దిన చల్వలునై,
ప్రొద్దోక సింగారముతో
ముద్దియ చనుదేర మిగుల మోహాతురుఁడై. 144

అర్థము :— నిద్దంపు = మెరుస్తున్న. మేలిసొమ్ములున్ = ప్రశస్తమయిన నగలును, (చక్కగా) దిద్దిన కస్తూరిబొట్టు (ను), దినచల్వలు = దినదినమును క్రొత్తగా చలువ చేసిన చీరలును, (ధరించుకుంటూ). ప్రొద్దోక సింగారముతో = పూటకొకరీతిగా అలంకరించుకుంటూ, ముద్దియ = ఆ ముద్దరాలు, చనుదేరగా = రావడంచూచి, మిగుల మోహాతురుఁడై = మోహముచే త్వరపడు తున్న వాడై...

తాత్పర్యము :— సుభద్ర నిత్యనూతనంగా అలంకరించుకుంటూ కనిపిస్తుండగా, అర్జునుడు మోహమును ఆపుకోలేక — (తర్వాతి పద్యంతో అన్వయము)

విశేషము :— సుభద్ర ఈ విధంగా అలంకరించుకొనడం అర్జునుడు చూడాలని కాదు; ధనవంతులైన యౌవనవతులకు సహజమైన అభ్యాసంవల్ల మాత్రమే అని గ్రహించాలి.

దినచల్వ — శ్రీనాథుడి 'దినవెచ్చము' వంటిదే.

ప్రొద్దోక సింగారము అర్జునుడికి కామోద్దీపక మయింది. అందుకే స్పర్శ సుఖముతో తృప్తి పడక ఆలింగనాదుల కోరాడు.

అలంకారము :— ఉదాత్తము, అసంగతి.

బలిమినిఁ బట్టఁగాఁ దివురుఁ, బట్టిన నొప్పక యిట్టటున్నచోఁ
బలువు రెట్టించిగిరేని నగుబా టని కొంకుఁ, దలం పెఱుంగకే
కలయఁగఁ జూచుటల్ తగవు గా దని యుండు నతండు, కాంత నె
చ్చెలుల నొకింత పాసి తనచెంత మెలంగుచు నున్న వేళలన్. 145

అర్థము:—కాంత = సుభద్ర, నెచ్చెలులన్ = ఇష్ట సఖులను, ఒకింత = స్వల్పకాలము పాసి = విడిచి, తనచెంతన్ = తనకు దగ్గరగా, మెలంగుచున్ = తిరుగుచు, ఉన్న వేళలన్ = ఉన్న సమయములందు, అతండు = అర్జునుడు, బలిమిన్ = బలవంతముగ, పట్టఁగన్ = పట్టుకొనాలని, తివురున్ = త్వరపడును; పట్టినన్ = అట్లు పట్టుకొనినయెడల, ఒప్పక = అంగీకరించక (సుభద్ర). ఇట్టు అటు అన్నచోన్ = ఏమైన అనిన యెడల, పలువు రెఱింగిరేని = అనేకులకు తెలిసినట్టయితే, నగుబాటు = హాస్యాస్పదము, అని, కొంకున్ = జంకును; తలంపు ఎఱుంగకే = సుముఖముగ నున్నదో లేదో తెలుసుకొన కుండగనే, కలయఁగన్ = కలియబడుటకు - పైబడుటకు, చూచుటల్ = ఉద్దేశించడము, తగవు = న్యాయము, కాదు, అని, ఉండున్ = ఊరుకొనును.

తాత్పర్యము :— అర్జునుడు మోహాతురుడై, సుభద్ర తన సమీపమున ఒంటరిగా ఉన్నప్పుడు పట్టుకొనడానికి తొందరపడతాడు. ఆమె ఒప్పక ఏమయినా చేస్తే నలుగురికి తెలిసి హాస్యాస్పద మవుతాను. సుభద్ర మనసు తెలుసుకోకుండా అలాంటి ప్రయత్నం చేయడం ప్రమాదకరమని తగిన సమయం కొరకు వేచి ఉంటాడు.

విశేషము :— "కామాతురాణాం న భయం న లజ్జా" అన్నట్లు కాకుండా అర్జునుడు మోహాతురుడై నప్పటికీ సమయం కాదని గ్రహించడము ఔచిత్యము. సుభద్ర ఏమైనా వ్యత్యస్తంగా పలికితే నవ్వులపా టవుతుందని అర్జునుడు జంకాడు.

ఈ తర్కవితర్కము చాల సహజమని వేరే చెప్పనక్కరలేదు,

అలంకారము :— ఆక్షేపము, స్వభావోక్తి.

అటు జగదేక సుందరికినై యతివేషముఁ బూని వచ్చినాఁ
డఁట, తన చేయు భాగ్యమున న ప్పువుఁబోఁడియె చెంత సేవఁ జే
యుట కని వచ్చి యుండు నఁట, యొక్కొక పట్టున నొంటిపాటు నౌ
నఁట, యతఁ డెప్పుడెప్పు డను టుబ్బరమే మదిఁదత్తఱించుచున్. 146

అర్థము :— అటన్ = అచ్చట, జగదేకసుందరికినై = జగత్తంతటిలో ప్రసిద్ధమైన సౌందర్యముకల ఆ సుభద్రకొరకు, యతివేషమున్, పూని = వేసుకొని, వచ్చినాఁడు అఁట; తనచేయు = తాను చేసిన, భాగ్యమునన్ = అదృష్టమువల్ల, ఆ పువుఁబోఁడియె = ఆ జగదేక సుందరియే, చెంతన్, సేవచేయుటకు, అని = ఆ పనిమీద, వచ్చియుండునఁట; ఒక్కొక పట్టునన్ = ఒక్కొక్కప్పుడు, ఒంటిపాటును = ఒక్కతెయే ఉండుట కూడా, ఔన్ అఁట = సంభవించునట, అతఁడు, మదిన్ = మనసున తత్తరించుచున్ = తహతహపడుచు, ఎప్పుడెప్పు

డనుట = ఎప్పుడు తన కోరిక నెరవేరుతుందో అని ఉవ్విళ్ళూరుట. అబ్బురమే = ఆశ్చర్య మగునా.

*తాత్పర్యము* :— జగదేక సుందరియైన సుభద్ర కొరకు సన్యాసి వేషముతో వచ్చా డట. అదృష్టవశాత్తు ఆ సుభద్రే అతనికి సేవచేయడానికి వస్తూందట. అప్పుడప్పుడు ఆమె చెలికత్తెలు లేకుండా ఒంటరిగా ఉండడము కూడా తటస్థిస్తుందట-ఇక అర్జునుడు ఎప్పుడెప్పుడని ఉవ్విళ్ళూరడంలో ఆశ్చర్య మేముంది అని భావము.

*విశేషము* :— ఇందులో అర్జును డావిధముగా ఆతుర పడడం ఆ పరిస్థితుల్లో చాలా సహజమైన విషయమని సమర్థించాడు కవి.

అంత ప్రయత్నం చేసిన తరువాత, అంతగా అనుకూలించిన తరువాత, ఫలితము కొరకు తొందరపడడం న్యాయమేనని కూడా చెప్తున్నాడు.

*పాఠాంతరము* :— "అటు జగదేక......" అటు అనడంలోవిశేషార్థం లేకపోవ డమే గాక, 'అట' అనుప్రాసకు భంగం కలిగిస్తుంది.

*అలంకారము* :— సారాలంకారము, అనుప్రాస.

సుందరి రానిచో నెదురు సూచుచు నుండనె పట్టె; వచ్చుచోఁ,
నిందు ని భాస్య చక్కఁదనమే కని చొక్కుచునుండఁ బట్టె; నీ
సందడి చేతనే యరుగ సాగెను ప్రొ; ద్దిఁక వేళ యెప్పుడో
సందె జపంబు నర్చనలు సల్పుట కా కపట త్రిదండికిన్. 147

*అర్థము* :— ఆ కపట త్రిదండికిన్ = ఆ అబద్ధపు సన్యాసికి. సుందరి రానిచోన్ = సుభద్ర రాకుండా ఉన్నప్పుడు, ఎదురుచూచుచున్ ఉండనె = నిరీక్షించుటతోనే. పట్టెన్ = వేళ గడచి పోతుంది; వచ్చుచోన్ = సుభద్ర వచ్చునప్పుడు, ఇందునిభాస్య = చంద్రునివంటి ముఖము గలసుభద్రయొక్క, చక్కఁదనమే = సౌందర్యమునే (మరిదేనిని కాక)కని, చొక్కుచునుండన్ = పారవశ్యము పొంది ఉండుటతోనే, పట్టెన్ = వేళపరిపోతుంది. ఈసందడిచేతనే = ఈరెండు విధాలయిన పనులతోనే, ప్రొద్దు = కాలము, అరుగసాగెను = గడచిపోయేది, ఇకన్ = అలాగు గడచిపో తుండినప్పుడు, సందె = సంధ్య వార్చుకొనుట, జపంబు, అర్చనలు = దేవ తార్చనలు. సల్పుటకు = చేయడానికి, వేళ ఎప్పుడో = వ్యవధి ఎక్కడుందో (సమయం చాలదు కదా అని).

*తాత్పర్యము* :— సుభద్ర లేనప్పుడు ఎదురుచూడడము, వచ్చినప్పుడు ఆమె చక్క దనము చూడడము ఈ రెంటితోనే, అర్జునుడి సమయమంతా గడచిపోయేది. ఇంక జప అర్చ నాదులకు అతనికి తీరి కెక్కడ ?

*విశేషము* :— ఈ పద్యములో అర్జునుడు సుభద్ర కొఱకే వచ్చాడు కాని, జపతపాదులు చేసుకొనేందుకు కాదని, ఇది కేవలం అభినయం మాత్రమే నని ధ్వని.

సుభద్ర ఉన్నప్పుడూ లేనప్పుడూ ఒక్క విధంగానే కాలం గడిచిం దనడము చమత్కారము.

*పాఠాంతరము* :—

'సుందరి కానిచో నెదురు చూచుచు నుండును, వచ్చునప్పుడా
యిందు నిభాస్య చక్కదనముం గని చొక్కుచు నుండు. నట్టియా'—

— తిరుపతివారు.

*అలంకారము* :— అతిశయోక్తి.

వెలఁది కెమ్మోవిఁ గని జపావృత్తి మఱచెఁ;
దరుణి లేఁగౌనుఁ గని హరి స్మరణ మఱచెఁ;
గడమ యననేల ? వేస మొక్కటియ తక్క
మఱచె నన్నియు నా కృత్రిమ త్రిదండి. 148

*అర్థము* :— ఆ కృత్రిమ త్రిదండి = ఆకపటపు యతి, వెలఁది = సుభద్రయొక్క, కెమ్మోవి = (కెంపుమోవి) ఎర్రని పెదవిని, కని, జప + ఆవృత్తిన్ = జపము చేసుకుంటున్నప్పుడు తావళము త్రిప్పడమును, మఱచెన్ = మరచిపోయేవాడు. (జపా + వృత్తి = జపాకుసుమ - ఎఱ్ఱని దాసాని పూవుయొక్క సంగతిని, మఱచెన్ (అని శ్లేష); తరుణి = ఆ సుభద్రయొక్క, లేఁతకౌనున్ = సన్నని నడుమును; కని, హరిస్మరణన్ = విష్ణుని ధ్యానించడము, మఱచెన్, (మిక్కిలి సన్నని నడుము కల సింహముయొక్క తలంపును మఱచెన్ అని శ్లేష). కడమ = ఇతర విషయాలను గురించి, అననేల = చెప్పడమెందుకు, వేసము = తన యతి వేషము, ఒక్కటియ తక్కన్ = ఒక్కటే తప్ప, అన్నియున్ = తక్కినవన్నీ, మఱచెన్.

*విశేషము* :— అధరమును జపాపుష్పంతో (ఎఱ్ఱదనములో), నడుమును సింహముతో (సన్నదనములో) సరిపోలుస్తారు : కనుకనే అర్జునుడు అధరమును నడుమును చూచి, జపము చేసుకొనుటా, హరిని స్మరించుటా మానినా డనడంలో జపాపుష్పముల యొక్కయు, సింహముయొక్కయూ తలపులను మఱచి పోయాడు అన్న శ్లేష ఉంది.

వేసమొక్కటి తక్క తక్కిన వన్నీ మరిచాడు అని కవి జాగ్రత్త పడ్డాడు. వేసమును కూడా మరిస్తే మొదటకే మోసం వచ్చి, కార్యభంగ మౌతుంది, కనుక అర్జునుడు సన్యాసివలె నటించడం మాత్రం మానలేదు.'

కెంపు (మోవి) కలది కాబట్టే వెలఁది, లేఁత (కౌను) కలది కాబట్టే తరుణి అని సారస్యము. హరి అంటే విష్ణువు సింహము అని అర్థా లున్నాయి.

అలంకారము :— వృత్త్యనుప్రాసము, పరికరము, శ్లేష.

ఒడ లుప్పొంగు నొయారిఁ జూడ; జవరా లొద్ద న్మెలంగన్ గగు
ర్పొడుచున్; ముద్దులగుమ్మ గంధ కుసుమంబుల్ చేతి కందిచ్చు న
ప్పుడు వ్యాపారము లన్నియున్ మఱచు; న పూఁబోఁడి రాకుండినన్
గడెసే పొక్క మహాయుగంబు కరణిం గన్పట్టు రాచూలికిన్. 149

అర్థము :— ఒయారిన్ = ఒయ్యారముకల అసుభద్రను, చూడన్ = చూచినప్పుడు, రాచూలికిన్ = రాజకుమారుడు అర్జునుడికి, ఒడలు = శరీరము, ఉప్పొంగున్: జవరాలు = యౌవనవతియైన ఆ సుభద్ర, ఒద్దన్ = దగ్గరగా, మెలంగన్ = తిరుగుతున్నప్పుడు, (ఒడలు) గగుర్పొడుచున్ = పులకించును; ముద్దులగుమ్మ = సుందరియైన సుభద్ర, గంధకుసుమంబుల్ = సుగంధముగల పూవులను, చేతికి అందిచ్చునప్పుడు, వ్యాపారములు = ఇంద్రియముల వృత్తులు, అన్నియున్, మఱచున్; పూఁబోఁడి = పూవువంటి శరీరముగల ఆ సుభద్ర, రాక ఉండినన్, గడె సేపు = ఒక నిముష (చాల స్వల్ప) కాలము, ఒక్క, మహాయుగంబు = నాలుగు యుగముల కాలము, కరణిన్ = విధముగా, కన్పట్టు = తోచును - అనగా నిముస మొక యుగముగా, చాలా కష్టంగా గడుపుతాడని భావము.

అలంకారము :— అతిశయోక్తి, విభావన.

ఆనంద బాష్పములచే
నాని, వధూ హావ భావ నటనలఁ దనలోఁ
దాన తలపోయు వానికి
స్నానం బేమిటికి? వేఱె జప మేమిటికిన్? 150

అర్థము :— ఆనంద బాష్పములచేన్ = ఎక్కువ సంతోషమువల్ల (తనకు) కలిగే కన్నీళ్ల ధారలలో, నాని = బాగా తడిసి, వధూ హావభావ నటనలన్ = హావభావము లనే మనో వికారములను కనబరిచే సుభద్ర ప్రవర్తనలను, తనలో తానే, తలపోయువానికి = మననము చేసుకుంటూ ఉండేవానికి (అర్జునుడికి), వేఱె = ఇతరమైన, స్నానంబు ఏమిటికి; జపము ఏమిటికిన్? (అగత్యము లేదని భావము).

*విశేషము* :— సుభద్రను చూచినప్పటి ఆనందంవల్ల కలిగే బాష్పములతో స్నానము చేసినట్లవుతుంది. సుభద్ర అందచందముల తిరిగి తిరిగి జ్ఞాపకం చేసుకోవడంతో జపము చేసి నట్లవుతుంది. కనుక, అర్జునుడికి ప్రత్యేకంగా స్నానమూ జపమూ అవసరం లేదని భావము, సాధారణంగా చేసే స్నానమూ జపమూ అతడికి అప్రధానమయిన విషయాలు.

*పాఠాంతరము* :—

...హావభావ నటనలఁ దన లో
లోనె తలపోయువానికి

— కృష్ణమాచార్యులవారు.

*అలంకారము* : పరిసంఖ్య.

ఈ రీతి నుండ నొక నాఁ
డా రాజకుమారి యతని కాహార మిడన్
జేరి, త దారామంబునఁ
గూరిమి నెచ్చెలులు వంటఁ గొని తేరంగన్, 151

*అర్థము* :— ఈ రీతిగా (అర్జునుడు) ఉండగా, ఒకనాఁడు, అతనికి. ఆహారము ఇడగా = భోజనము పెట్టడానికి, కూరిమి నెచ్చెలులు = ప్రియసఖులు, వంటగా కొని తేరంగగా = వండిన ఆహారములను తన వెనుకనే తీసుకొని వస్తూండగా, ఆ రాజకుమారి, తత్ ఆరామంబున్ = అతడున్న ఆ ఉద్యానవనమును, చేరి = సమీపించి, ......

తాత్పర్యము :— వంటకాలున్న పాత్రలను చెలికత్తెలు వెంట తీసుకొని వస్తుండగా సుభద్ర అతనికి భోజనము పెట్టడానికి ఆ ఉద్యానవనానికి వచ్చి......తరువాతి కన్వయము.

*పాఠాంతరము* :—

1. పండి కొనితేరంగన్
2. వెంట గొనితేరంగన్.

వెస లలనామణి బంగరు
వెసలల దొంతరలు డించి, వినయము మది కిం
పొసఁగఁగఁ గంకణ రవములు
పొసఁగఁగ, నారసి రసాన్నములు వడ్డించన్, 152

*అర్థము :—* వెసఁ = చురుకుగా, లలనామణి = స్త్రీలలో శ్రేష్ఠురాలైన సుభద్ర, బంగరు వెసలల = బంగారు పాత్రములయొక్క, దొంతరలు = ఒక దానిపై నొకటిగా ఉంచిన పేర్పులను, డించి = ఇష్టసఖుల చేతులనుంచి దిగువనుబెట్టి, వినయము = వడ్డించువేళ జూపే అణకువ, మదికి ఇంపు ఒసఁగఁగఁ = (అర్జునుడి) మనస్సునకు సంతోషము కలుగజేయగా, కంకణరవములు = చేతిగాజుల శబ్దాలు, పొసఁగఁగఁ – శ్రావ్యంగా వినబడుతుండగా, అరసి = చక్కగా గ్రహించి. (ఏమేమి వారికి ఇష్టమో అవసరమో అడుగకుండనే గ్రహించి వడ్డిస్తూ అని), రసాన్నములు = అన్ని రుచులుగల పదార్థములను, వడ్డించఁ = వడ్డించగా —

*విశేషము :—* వడ్డించే వారిలో ఒక సుగుణ ముండాలి. భోజనము చేస్తున్నవారిలో ఎవరెవరు ఏయే పదార్థాలను ప్రీతిగా తింటున్నారో పరిశీలిస్తూ, వాటిని వారికి మారువడ్డిస్తూ తేటలతో వడ్డన చెయ్యాలి.

సుభద్ర అర్జునుడికి అవసరమైనవన్నీ చక్కగా అరసి, చురుకుదనముతో వడ్డన తెలివి చేసిందని భావము. చురుకుగా వడ్డిస్తుండడం వల్లే కంకణరవములు,

*పాఠాంతరము :—*

పద్యము చివరి భాగము :

'పొసగంగా రసిరసాన్నములు వడ్డించెన్'

—కృష్ణమాచార్యులవారు.

దీనిలో 'అరసి' యందున్న అందము కానరాదు.

*అలంకారము :—* యమకము, అనుప్రాసము.

**చిలుకల కొల్కి వే యెడమచే ముడిగొల్పెడు జాఱుకొప్పు, నిం**
**పులు తులకింపుచుండు భుజ మూల రుచుల్, జిలుఁగుం బయంటలోఁ**
**గులుకు మిటారి గబ్బి చను గుబ్బలు సూచుటె కాని, క్రీడి క**
**ర్మిలి మఱిలేదు భోజనము మీఁది యపేక్ష యొకించు కేనియున్. 153**

*అర్థము :—* చిలుకలకొల్కి = ముద్దుగుమ్మ యగు సుభద్ర, వే = వేగముగా, ఎడమచేఁ = ఎడమ చేతితో, ముడి గొల్పెడు = ముడివేసి కొనుచుండు, జాఱు కొప్పుఁ = (ముడివీడి) జారిపోతున్న కొప్పునూ, ఇంపులు తులకింపు = అందము చిందుతున్న, భుజమూల రుచుల్ = చంక మెరుంగులున్నూ, జిలుఁగు పయంటలోఁ = సన్నని పైటలో, కులుకు మిటారి గబ్బి చనుగుబ్బలు = ఇంపుగా తుళ్లుతున్న బిగువు చనులునూ, చూచుటె కాని = చూస్తూ ఉండడమె కాని, క్రీడికి = అర్జునుడికి, అర్మిలి = ప్రీతితోడి, భోజనము మీఁది, అపేక్ష = కోరిక, ఒకించుకేనియుఁ = కొంచెమైనా, మఱిలేదు = బొత్తిగాలేదు,

*తాత్పర్యము* :— వడ్డిస్తూన్నప్పుడు, జారిపోతున్న కొప్పును ఎడమచేతితో సర్దుకుంటున్న సుభద్రయొక్క చంకలమెరుగునూ, చనుగవ పొంకమునూ చూడడంతోనే అర్జునుడికి సరిపోయింది కాని, భోజనంపై కోరిక ఏమాత్రమూ లేదు.

*విశేషము* :— కుడిచేతితో వడ్డన చేస్తూ ఉంది కాబట్టి, జారిన కొప్పును ఎడమచేతితో సవరించవలసి వచ్చింది. ఎడమచేతి సవరణ కాబట్టి జుట్టు బాగా ముడిపడకుండా జారిపోతూ ఉంటుంది; మళ్ళా సవరణా, మళ్ళా జారడమూ తప్పదు.

*అలంకారము* :— స్వభావోక్తి.

రమణి యొయ్యారములపైఁ బరాకుచేతఁ,
జవి యెఱుంగఁడు, వడ్డించునవి యెఱుఁగఁడుః
భోజనము చేసి లేచె నారాజసుతుఁడు;
తృప్తి యేరీతి నుండెనో తెలియరాదు. 154

*అర్థము* :— రమణి = ఆ అందకత్తెయొక్క, ఒయ్యారములపైఁ = విలాసముల మీదనే దృష్టి ఉంచడమువల్ల కలిగిన, పరాకుచేత = పరధ్యానము చేత, చవి = రుచినీ, ఎఱుంగఁడు = గుర్తించడు, వడ్డించునవి (కూడా) ఎఱుఁగఁడు = తెలుసుకోడు, ఆరాజ సుతుఁడు = అర్జునుడు, భోజనము చేసి = భోజనము ముగించి, లేచెన్ = లేచిపోయాడు, తృప్తి, ఏరీతిఁ ఉండెనో = ఏలాగు కలిగెనో, తెలియఁరాదు = మనము గ్రహించలేము.

*విశేషము* :— రుచి ఎరుగడు అంటే ఉప్పూ పులుసూ మొదలైన షడ్రుచులలో ఎక్కువ తక్కువలను గుర్తించడమన్నమాట. వడ్డించునవి ఎరుగడు అంటే కూరలు, పచ్చళ్లు, పాయసాలు, పిండివంటలు ఈలాంటివి ఏమేమి వడ్డించారో కూడా తెలుసుకోడు.

తృప్తి ఏరీతి ఉండెనో అని అన్నాడే గాని ఆమె సౌందర్యము చూస్తూండే 'పరాకు'లోనే కడుపునిండి తృప్తి కలిగిందని మనకవికి తెలియదా ?

*అలంకారము* :— విభావన.

అపు డతి రయమునఁ బన్నీ
రపరంజి పసిండి గిండియందుం గొని తాఁ
జపలాక్షి తెచ్చి యిచ్చినఁ
గపటపు సన్యాసి ధౌత కర పంకజుఁడై, 155

అర్థము :— అపుడు = ఆ విధంగా అర్జునుడు భోజనము ముగించి లేచినప్పుడు, చప లాక్షి = చంచల నేత్రములుగల సుభద్ర, అతిరయమునన్ = మిక్కిలి తొందరగా, అపరంజి పసిండి = పదారువన్నె బంగారముతో చేసిన, గిండి = పాత్రయందు, పన్నీరుగా, తాగా = తానే, కొని తెచ్చి ఇచ్చినన్ = తీసికొని వచ్చి ఇవ్వగా, కపటపు సన్యాసి = అబద్ధపు యతి, ధౌత కర పంకజుఁడు ఐ = కడుగుకొన బడిన పద్మమువంటి చేతులు కలవాడై, (చేతులు కడుగుకొని)...

తాత్పర్యము :— అలాగు లేచినప్పుడు సుభద్ర తొందర తొందరగా బంగారపు పాత్రతో పన్నీరు తెచ్చి ఇవ్వగా, అతడు చేతులు కడుగుకొని...

విశేషము :— బహుశా అర్జునుడంత వేగంగా లేస్తాడని సుభద్ర అనుకొని ఉండదు. తీరా లేచే సరికి సుభద్ర బెదరిన చూపులతో పరుగునపోయి పన్నీటి చెంబు అందించింది.

'తానే' అనడంవల్ల భోజన సమయములో చెలికత్తెలు వెళ్ళిపోయి ఉంటారని ఊహించాలి.

నిగనిగని చంద్రకాంతపు
జగతి పయిం గూరుచుండ, జవ్వని వెనుకం
బగడపుఁ గంబము చాటున
మొగ మించుక కానిపింప మురియుచు నుండెన్. 156

అర్థము :— నిగనిగని = నిగనిగ మెరుస్తున్న, చంద్రకాంతపు జగతిపయిగా = చలువరాళ్ళతో కట్టిన తిన్నెమీద, కూరుచుండగా = (భోజనానంతరము అర్జునుడు) కూర్చొని ఉండగా, జవ్వని = యౌవనవతి యైన సుభద్ర, వెనుకగా = వెనుక ప్రక్కగా, పగడపు కంబము చాటునన్ = పగడములు తాపిన స్తంభము చాటున, మొగము, ఇంచుక = కొంచెము, కానిపింపగా = కనబడునట్లు, మురియుచు = ఒయ్యారము తేటపడునట్లుగా, ఉండెగా = నిల బడ్డది.

తాత్పర్యము:— అర్జునుడు కూర్చున్న తిన్నె వెనుకపక్క పగడపు స్తంభము చాటున, ముఖము కొంచెము కనిపిస్తున్నట్టు నిలబడ్డది అని భావము.

విశేషము :— అర్జునుడున్నది నవరత్న కీలితంపు ఉప్పరిగె (127 ప.) కాబట్టే, 'కంబములు' పగడాలు తాపినవి, తిన్నెలు = చంద్రకాంత శిలలతో నిర్మించినవి.

మురియుచు ఉండడమువల్ల తాను యతీశ్వరుడిని ఏదో అడగడానికి ఉద్దేశించినట్టు మనము గ్రహించాలి. లేకుంటే భోజనమయిపోయిన తరువాత తాను సెలవు తీసుకోవాలికదా.

ఇటువంటి సన్నివేశాలలో తలుపుచాటునో, స్తంభం చాటునో కొంచెము మాత్రము కనిపించేలాగా ఉండడం స్త్రీలకు సహజము.

*పాఠాంతరము* :—

"మురుపు నటింపన్"

అర్థము :— ఒయ్యారము కనబడునట్లుగా అని

—వేదమువారు.

"మురువున నుండెన్"

— కృష్ణమాచార్యులవారు.

*అలంకారము* :— స్వభావోక్తి.

కంగుల్ దీర్చిన పైఠిణీ అవిక చన్కట్టంటి రాణింపఁగాఁ,
జెంగల్వల్ నెఱికొప్పునందు నొఱపై చెంతన్ గుబాళింపఁగా,
బంగా రందియ ముక్కునం గమిచి పైపై నంచ యెల్గింపఁగా,
సింగారం బగు ముద్దుఁ జిల్క తనకుం జేదోడు వాదోడుగాన్. 157

*అర్థము* :— కంగుల్ = జరీబుటాలు, తీర్చిన = అందముగా కుట్టిన, పైఠిణీఅవిక = సరిగె, పట్టు కలిపి నేసిన సన్నని వలిపెముతో కుట్టిన రవిక, చన్కట్టు = స్తన ప్రదేశమును, అంటి = (పూతపూసినట్లు) గుత్తముగా పట్టి, రాణింపఁగాన్ = మరింత అందముతో కన్పిస్తుండగా, నెఱికొప్పునందు = చక్కని సిగలో, చెంగలువల్ = ఎఱ్ఱ కలువలు, ఒఱపై = అందముతో, చెంతన్ = సమీప ప్రదేశము నంతటిని, గుబాళింపఁగా = పరిమళించినట్టు చేస్తుండగా, అంచ = పెంపుడు హంస, బంగారందియ = (సుభద్రయొక్క) కాలి బంగారు అందెను, ముక్కునన్, కమిచి = కరచిపట్టి, ఎల్గింపఁగాఁ = కూస్తుండగా, సింగారం బగు = అందమగు, ముద్దుచిల్క, తనకుఁ = (సుభద్రకు) చేదోడు = ముంజేతనుండుట, వాదోడు = మాటలాడగలిగి యుండుట వల్ల, చేయితోడు వాయితోడుగన్ = (మాటకూ పాటుకూ) సహాయము చేస్తుండగా,—

తాత్పర్యము :— గుత్తంగా పట్టిన పైఠాణి రవితోకనూ, పరిమళిస్తున్న ఎఱ్ఱగల్వ చెక్కిన కొప్పుతోనూ, బంగారు అందెను ముక్కున పొడుస్తూ పాదాలు తొక్కుతు కూస్తున్న పెంపుడు హంసతోనూ, చేదోడు వాదోడుగా ఉండే చేతిచిలుకతోనూ, సుభద్ర అక్కడ — పగడపు స్తంభము చాటున — నిలిచి ఉంది.

*విశేషము* :— కంగులు[1] అంటే ఉగ్గులు - ముడుతలు - అవి లేకుండా - ఇస్త్రి చేసినట్టు ఉన్నదానిని కంగులు తీర్చిన రవిక అనవచ్చును.

పైఠిణీ రవిక - చారిత్రక ప్రసిద్ధి పొందిన ప్రతిష్ఠాన పురాన్ని పైఠాన్ అనేవారు. ఆ నగరమునుంచి ప్రచారములోనికి వచ్చిన రకము రవిక పైఠిణీ రవిక – ఇప్పుడు మనము పంజాబీ జుబ్బా అనీ, ఇంగ్లీషువారు జోద్‌పూరు బ్రీచెస్ (లాగులు) అనీ అంటున్నట్టు.

పద్యములో విశేషము ఏమంటే — చన్కట్టుంటి రాణించినందువల్ల కనులూ, చెంతఁ గుభాళించగా అన్నందువల్ల ముక్కూ, హంస ఎల్గింపగా అన్నందువల్ల చెవులూ, మూడు ప్రధానములయిన ఇంద్రియాలు అర్జునుడికి అపరిమిత ఆనందాన్ని సమకూర్చాయని. వీటి ఆకర్షణ ఫలితమే తరువాతి పద్యములో కవి కనబరిచాడు.

*పాఠాంతరము* :— 1. చన్కట్టుంటి అనడానికి బదులు చన్గట్టుంటి అని - అప్పుడు కొండలవంటి చనులను అంటి అని అర్థము.

2. పైపై నంచ యల్గింపగా అని — అప్పుడు హంస సుభద్రకు కోపం తెప్పించిందని అర్థము.

*అలంకారము* :— స్వభావోక్తి.

ఏకతంబున వసియించి యిట్టు లుండ
మదన మదనాగ వలమాన మాన సాంబు
రుహుఁడు పురుహూత సుతుఁడు నేరుపునఁ బలికె
నా చకోరాక్షిఁ బ్రేఁగంటఁ జూచి యపుడు, 158

*అర్థము* :— ఏకతంబునన్ = చెలికత్తె లెవ్వరు లేకుండా, వసియించి = నిలిచి, ఇట్టులు = ఇంత మనోహరంగా ఉండఁగా, మదన = మన్మథుడన్న, మదనాగ = మదించిన ఏనుగుచేత, వలమాన = కలతనందుతున్న, మానస అంబురుహుఁడు = మనస్సన్న పద్మము కలవాడు (అయిన) పురుహూత సుతుఁడు = ఇంద్రుని కుమారుడు-అర్జునుడు, ఆ చకోరాక్షిన్ = చకోరపక్షుల వంటి కళ్ళుకల సుభద్రను, ప్రేఁగంటన్ = ప్రక్కవాటుగా (సుభద్ర కొంచెము వెనుకప్రక్క నున్నది కాబట్టి) చూచి, అపుడు, నేరుపునన్ = చమత్కారముగా, పలికెన్-

1. కంగు అన్నమాట చాలాకాలం పండితులను కంగారు పెట్టిందనీ, ఒక గుడిసెలో ఒక పేదరాలు "పిల్లాడికి కంగు పట్టావా ?" అని అడగడం విని వారు ఆ పేదరాలు దగ్గర కంగు = ఉగ్గు అన్న అర్థం తెలుసుకున్నారనీ ఒక చిన్న ముచ్చట ఉంది.

తాత్పర్యము :— ఈ విధంగా ఒంటరిగా ఉన్న సమయంలో, మన్మథుని చేతచాలా పీడితుడైన అర్జునుడు, సుభద్రను ఓరకంటితో చూస్తూ నేర్పుతో ఇలా అన్నాడు :

*విశేషము :—* ఇంతకు పూర్వం లేనివిధంగా అర్జును డీ రోజుననే చలించడానికి కారణం పైపద్యములో వర్ణించినట్లు ప్రధానేంద్రియాల నొక్కసారి ఆకర్షించిన సుభద్ర సౌందర్యం ఈనాడు విశేషంగా ఉండడమే.

*అలంకారము :—* రూపకము.

## వివాహ విషయ ప్రస్తావన

"చెలువ, నిను రాజకీరంబు చెట్టపట్టెఁ,
గలికి, నిను రాజహంసంబు కాలుద్రొక్కెఁ,
మంచి శకునంబు లివి; నాదు మాటఁ జూడు
కన్నె, యీలోనఁ బెండ్లి కాఁగలదు నీకు" 159

ఇదొక చక్కని పద్యం.

*అర్థము :—* చెలువ, నిను, రాజకీరంబు = శ్రేష్ఠమైన చిలుక - చెట్టపట్టెఁ = నీచేయి పట్టుకుంది, (చేతిమీదనే ఉన్నందువల్ల). కలికి, నిను, రాజహంసంబు = శ్రేష్ఠమగు హంస, కాలు ద్రొక్కెఁ = (బంగారందెను ధరించే ప్రయత్నములో) నీ కాలు త్రొక్కింది. ఇవి = ఈ రెండును, మంచిశకునములు = శుభమును సూచించిన శకునాలు.

వీటినిబట్టి మనము గ్రహించవలసిన ఫలములు ఏమిటంటే: మొదటిది, రాజకీరంబు = రాజశ్రేష్ఠుడు, భావిని చెట్టపట్టుటను - నిన్ను పాణిగ్రహణము చేసికొనును అని సూచిస్తుంది. రెండవది, రాజహంసంబు = రాజశ్రేష్ఠుడు, భావిని కాలుత్రొక్కుటను - నిన్ను వివాహము చేసికొనును అని సూచిస్తుంది. కొన్ని వివాహాలలో కాలుత్రొక్కి కల్యాణము చేసుకోవడము, ఆచారము, నాదుమాటఁ, చూడు = పరీక్షించు, కన్నె = ఓ చిన్నదానా, ఈలోనఁ = త్వర లోనే, నీకు, పెండ్లి, కాఁగలదు = అవుతుంది.

తాత్పర్యము :— చెలియ నిన్నిప్పుడు చిలుక చేయిపట్టుకొనిన్నీ, హంస కాలు తొక్కుతూనూ ఉంది. ఇవి మంచి శకునాలు. వీటినిపట్టి నిన్ను ఒక రాజశ్రేష్ఠుడు పాణిగ్రహణము చేసుకుంటాడనీ ఒక రాజశ్రేష్ఠుడు వివాహము చేసుకుంటాడనీ తెలుస్తుంది, నీకు త్వర లోనే పెళ్ళి అవుతుంది కావలిస్తే నామాట పరీక్షించుకో అని అర్జును డన్నాడు.

*విశేషము* :— యతీశ్వరుడు కాబట్టి శకునాల ఫలాలను గురించి చెప్పడానికి సమర్థుడనే అనుకుంటారు. ఈపద్యములో సుభద్రను చెలువ, కలికి, కన్నె అని సాధారణ స్త్రీవాచకాలతోనే సంబోధించాడు కాని శృంగారరస సంబోధనలు ఉపయోగించలేదు. మరికొంత సమ్మకము కలగడానికి. అర్జునుడు బాగా నటిస్తున్నా డన్నమాట.

శకునము కనబడినప్పుడు దాని ఫలము భవిష్యత్తులో కలుగుతుం దంటారు కాని గతంలో కాదు. కాబట్టి చెట్టపట్టెఁ అంటే పెండ్లియాడినాడు అని అర్థాంతరము - వేదమువారివలె — చెప్పడము ధర్మముకాదు.

కాలుద్రొక్కె[1] = కదిసె అన్న శబ్దరత్నాకర అర్థమునే చెప్పి పెండ్లియాడెను అన్నారు. కదియు అంటే పెండ్లాడు అన్న అర్థం రాదు; సమీపించును అనే వస్తుంది.

కొన్ని జాతులలోనూ, రాజులలోనూ, కత్తికి బాసికం కట్టి కల్యాణం చేసుకోవడమూ, కాలు ద్రొక్కి కల్యాణము చేసుకోవడమూ, అని రెండు పద్ధతులున్నాయి.

బ్రాహ్మణాదుల పెళ్ళిళ్లలో సన్నెకలు మట్టించడము ఉన్నప్పటికీ శూద్రాదుల వివాహాలలో కాలు తొక్కించడం చాల ముఖ్యము. ఇది తెలియక వారు 'కదిసెను' అని అర్థము చెప్పారు.

శకునములు అంటే 'సూచకాలు' భవిష్యత్తును సూచించేవి అన్న అర్థానికి తోడు 'పక్షులు' అన్న అర్థం గూడా ఉంది. ఇక్కడ సూచన చేసినవి ఒకచిలుక, ఒకహంస. ఈ రెండూ పక్షులే కాబట్టి 'మంచి శకునంబులివి' అన్నప్పుడు ఎంతో ఆనందము కలుగుతుంది.

రాజకీరము అన్నదానికి శకునాల అర్థములో రాజశబ్దము శ్రేష్ఠవాచకము, అలాగే రాజహంసములో రాజశబ్దముగూడా మొదటి అర్థంలో శ్రేష్ఠవాచకమే. శకునఫలములు చెప్పినప్పుడు 'కీరము' అన్నమాటా 'హంసము' అన్నమాటా శ్రేష్ఠవాచకాలు (శ్రేష్ఠుడైన రాజు అని అర్థము)

1. కాలుత్రొక్కుటకు అర్థము తెలియక మన పూర్వపు పరిష్కర్తలు శ్రీనాథమహాకవిని చేతకాని వానిగా చేశారు; శృంగారనైషధములో నలుడు దమయంతి దగ్గరకు వెళ్ళి ఇంద్రాగ్ని యమ వరుణులలో ఎవరినైనా వరించమంటాడు.

అమరపతిఁ వరించెదవో, హవ్యవహుఁ చరణంబు త్రొక్కెదో,
శమనుని చెట్టపట్టెదవో, సాగరవల్లభు పెండ్లియాడెదో.

—— సర్వలక్షణ సారసంగ్రహము నుంచి.

అని ఉండగా, చరణంబు త్రొక్కడానికి పెండ్లియాడెదో అన్న అర్థం ఉందని తెలియక, దానిని 'వరణం బొనర్చెదో' అని మార్చారు. దీనిని బట్టి పెండ్లియాడడానికి నాలుగో పలుకుబడి దొరకక శ్రీనాథుడు వరించు అని క్రియారూపము ఒకచోటా, వరణము అని దాని కృదంతరూపము రెండోచోటా వాడుక చేశాడన్న భావము కనబరిచారు.

ఈ శకునాలను గురించి చెప్పి మెల్లగా పెళ్ళిసంగతి ప్రస్తావనలోనికి వచ్చేలాగా అర్జునుడు తన నేర్పు చూపించాడు. ఈ సందర్భములో సుభద్ర తన అభిప్రాయాన్ని బయట పెట్ట వచ్చునని ఆశ.

*పాఠాంతరము :—*

"మంచి శకునంబు, లిదిగొ నా మాటచూడు"

— కృష్ణమాచారిగారు.

*అలంకారము :—* శ్లేష.

అనవుడు ల జ్జావన తా
నన తామరస యయి, "వీరు నాఁగ మహాత్ముల్,
తన చేసిన సేవకుఁగా
మన మలరి వచించి" రనుచు మది నుత్సుకయై. 160

*అర్థము :—* అనవుడు = అని అర్జునుడు పెండ్లిమాటలు చెప్పగా, లజ్జా అవనత ఆనన తామరస అయి = సిగ్గుచేత వంచబడిన ముఖపద్మము గలదయి (సిగ్గుతో తలవంచుకొని) "వీరు నాఁగన్ = ఈ యతీశ్వరులు అనగా, మహాత్ముల్ = చాల మహిమగలవారు, తనచేసిన = నేనుచేసిన, సేవకుగాన్ = శుశ్రూషవల్ల, మనము, అలరి = సంతోషించి, వచించిరి = ఈమాటలు అన్నారు" అనుచు = అని తలంచి, మదిన్ = సుభద్ర తన మనసులో, ఉత్సుకయై = ఉత్సాహము కలిగినదై...

*తాత్పర్యము :—* "వీరు మహానుభావులు, నేనుచేసిన సేవకు సంతోషించి ఈలా గని ఉంటారు" అనుకొని సుభద్ర ఉత్సాహముతో...

*విశేషము :—* తన చేసిన అంటే నేనుచేసిన అనే అర్థము చెప్పాలి. కొందరు కవులు 'నేను' కి 'తన' వాడుక చేస్తారు. "తనకున్ కౌఁగిలి యీ వొకప్పుడును" చూడండి (1_209) మహానుభావులు సంతోషించినందువల్ల తన కోరిక నెరవేర గలదని ఉత్సాహము.

*అలంకారము :—* అనుప్రాస.

కురులు కెంపుల బొగడల నెరయ దువ్వి,
నిక్కు చనుగుబ్బలఁ బయంటఁ జక్కఁ జేర్చి,
పలికెఁ గలకంఠి మోమునఁ దెలివి తొలుక,
ముత్తియపు ముంగర యొకింత మోవిఁ గదియ, 161

అర్థము :— కెంపుల బొగడలన్ = సుభద్ర చెవుల ఆభరణాలయిన కెంపుల బొగడలను మూసివేయకుండా మెరిసేలాగా, కురులు = ముంగురులను, నెరయన్ = తప్పించుతూ, దువ్వి = సవరించి, నిక్కి, చనుగుబ్బలన్, పయంట, చక్కన్‌చేర్చి, కలకంఠి = మనోహరమయిన కంఠస్వరముగల సుభద్ర, మోమునన్ = ముఖమునందు, తెలివి తొలుకన్ = వికాసము కానవచ్చుచుండ, ముత్తియపు ముంగర = ముత్యముతో కూర్చిన ముక్కర (నాసాభరణము) ఒకింత = కొంచెము, మోవిన్ = పెదవిని, కవియన్ = తాకునట్లు, పలికెన్....

విశేషము :— చెవి మీదిభాగానికి అలంకారముగా బొగడలను వాడుతారు, పనిపాట్లు చేసినప్పుడు ముంగురులు వాటిమీదపడి వాటిని మూసివేస్తుంటాయి. ఇక్కడ ఆ ముంగురులను తప్పించి బొగడలు బాగా కనబడేలాగ చేసిన దన్నమాట.

కురులు సవరించుకొనడమూ, పయ్యెద సవరించుకొనడమూ ఇటువంటి సందర్భాలలో చాలా సహజమైన లక్షణాలు. మొగమునందలి తెలివి (వికాసము) - లజ్జ, ఉత్సాహము కలియగా ఏర్పడింది.

ముక్కున వ్రేలాడుతున్న ముంగరలోని ముత్యమును కొద్దిగా తాకుతూ అధర ముండెననడంతో సుభద్ర మెల్లగా మాట్లాడిందని కవి సూచిస్తున్నాడు.

అలంకారము :— అనుప్రాస.

## సుభద్ర యతి నడుగుట

"అవుఁగా, మీ రిటమున్న గన్గొనని చాయల్ లేవుగాః నాఁటినుం
డి విశేషంబులు కొన్ని మిమ్ము నడుగన్ వేడ్కయ్యెడున్ నాకు; నె
య్యవి గన్గొంటిరి పుణ్యభూము ? లట రాజ్యంబు ల్మనోజ్ఞంబు లె
య్యవి? యేయే పురము ల్గనంబడియె మీ కందందు మార్గంబునన్? 162

అర్థము :— అవున్ కా = సరేగాని - ఆ విషయాని కేమిగాని, మీరు, ఇటమున్న = ఇంతకు పూర్వము, కన్గొనని చాయల్ = చూడని ప్రదేశాలు, లేవుగా = లేవుగదా, నాఁటి నుండిన్ = మీ దర్శనము కలిగిన నాటినుండి, కొన్ని, విశేషంబులు = వృత్తాంతములు, మిమ్మున్, అడుగన్, నాకు, వేడ్క = వేడుక, అయ్యెడున్ = అవుతూన్నది; పుణ్యభూములు, ఎయ్యవి, కన్గొంటిరి? అట = ఆ పుణ్యభూములయందు, మనోజ్ఞంబులు = ఇంపయిన, రాజ్యంబుల్ ఎయ్యవి ?, మీకు, మార్గంబునన్ అందు అందున్ = అటనట, ఏ ఏ పురముల్, కనన్ పడియెన్ = కనబడ్డాయి ?

విశేషము :— సుభద్ర తన కవసరమైన విషయం తెలుసుకోడానికి నేర్పుగా ఎక్కడ ఆరంభించిందో చూడండి. ఈసమాచారమంతా తనకు అనవసరమే కదా; తటాలున అర్జునుడిని గురించి అడిగితే బాగుండదు గదా !

ఈ విషయా లడగడానికే గాబోలు (2-156) 'మురిసిపోతూ ఆనాడు పగడపు స్తంభం చాటున నిలుచుంది !

మీ రింద్రప్రస్థముఁ గని
నారా ? పాండవులఁ జూచినారా ? సుఖులై
వారందఱు నొకచో ను
న్నారా ? వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా ? 163

అర్థము :— మీరు, ఇంద్రప్రస్థమున్ = పాండవుల రాజధాని ఇంద్రప్రస్థ నగరాన్ని, కనినారా ? పాండవులన్, చూచినారా ? వారందఱు, సుఖులై = సుఖముగా, ఒకచోన్ = ఒకచోటనే, ఉన్నారా ? వీర అగ్రగణ్యు = వీరులలో మొదట ఎన్నదగిన వాడైన, నరున్ = అర్జునుని, ఎఱుఁగుదురా ?

విశేషము :— పై 162 వ పద్యములో తా నడిగిన ప్రశ్నలకు బదులు నిరీక్షించ కుండానే ఈవిధంగా ప్రశ్నలవర్షము కురిపించడము సుభద్ర కున్న ఆత్రాన్ని తెలియజేస్తుంది.

చివర ఉన్న ప్రధాన ప్రశ్నకు ముందు ఈ ప్రశ్నలు ఉపోద్ఘాతము వంటివి. ఒకేసారి, సూటిగా అర్జునుడిని గూర్చి అడగడానికి సాహసము చాలదు పాపము.

మహాయతీశ్వరుడు ఇంద్రప్రస్థము తప్పక చూచి ఉంటాడనీ, జగద్విఖ్యాతుడైన నరుని తెలియకపోడనీ ఆమె నమ్మకము ఇందులో తేటపడుతూంది.

"అందరూ ఒకేచోట ఉన్నారా" అనడంలో యాత్రార్థము వెళ్ళిన అర్జునుడు తిరిగి వచ్చి ఉంటాడా అని సందేహము,

ఎగు బుజంబుల వాఁడు మృగరాజ మధ్యంబుఁ
బుడికి పుచ్చుకొను నెన్నడుము వాఁడు,
నెఱి వెంట్రుకల వాఁడు, నీలంపు నికరంపు
మెఱుఁగుఁ జామన ఛాయ మేని వాఁడు,

గొప్ప కన్నుల వాఁడు, కోదండ గుణ కిణాం
కములైన ముంజేతు లమరు వాఁడు,
బవిరి గడ్డము వాఁడు, పన్నిదం బిడి డాఁగ
వచ్చు నందపు వెన్ను మచ్చ వాఁడు,
గరగరని వాఁడు, నవ్వు మొగంబు వాఁడు,
చూడఁగలవాఁడు, మేలైన సొబగు వాఁడు,
వావి మేనత్త కొడుకు కావలయు నాకు,
నర్జునుండు పరాక్ర మో పార్జునుండు. 164

*అర్థము* :— ౧. ఎగుబుజంబులవాఁడు = ఎత్తయిన భుజములు కలవాడు—సాముద్రిక శాస్త్రంలో భుజములు ఎత్తుగా ఉండడం శుభలక్షణము. పటుత్వానికి చిహ్నము. మృగరాజ మధ్యంబు = సింహముయొక్క నడుమును, పుడికి పుచ్చుకొను = ఒడిసి పిడికిట పట్టుకొనగల-సరిపోలిన అని. నెఱ నడుము వాఁడు = అందమైన నడుము కలవాడు;

౨. నెఱి = వంకరలు తీరిన, వెండ్రుకలవాఁడు = జుట్టుకలవాడు, నీలంపు = నీలమణుల యొక్క, నికరంపు = అచ్చమైన, మెఱుఁగు (కల) చామనచాయ = శ్యామలవర్ణముగల, మేని వాఁడు = శరీరము (కల). వాడు ;

౩. గొప్ప కన్నులవాఁడు = (ఇంకొక శుభ లక్షణము) విశాలనేత్రములు కలవాడు. కోదండ = ధనుస్సు యొక్క, గుణ = అల్లెత్రాటి (దెబ్బవల్ల ఏర్పడిన) కిణ అంకములైన = కాయ లనే గుర్తులుకల, ముంజేతులు, అమరువాఁడు = (వింటి అల్లెత్రాడు దెబ్బలవల్ల కాయలు కాసిన) మణికట్టుల నుంచి వేళ్లవరకు ఉన్న హస్తభాగములు - ముంజేతులు కలవాఁడు;

౪. బవిరి = గుండ్రమైన, గడ్డము (కల) వాఁడు, పన్నిదంబు ఇడి = పందెమువేసి, డాఁగఁజవచ్చు = దాగియుండుటకు చాలినంత వెడల్పుగా ఉన్న. అందపు = అందమైన, వెన్ను మచ్చవాఁడు = వీపున్ను (దాని మీద ఒక పుట్టు) మచ్చగూడా కలవాడు;

గరగరని వాఁడు = నాగరకత కలిగినవాడు, నవ్వుమొగంబువాఁడు (చూ. కలకలన్‌నగు చుండెడి......1—128) చూడఁగలవాఁడు = చూడదగినవాడు, మేలైన సొబగువాఁడు = ప్రశస్తమైన చక్కదనము గలవాడు,

పరాక్రమ ఉప అర్జునుండు = పరాక్రమములో కార్తవీర్యార్జునునకు చేరువైనవాడు, (అగు) అర్జునుండు, వావిఁ = చుట్టరికపు వరుసను, నాకు మేనత్త కొడుకు, కావలయును.

*విశేషము* :— అర్జునుడు సవ్యసాచి కనుక రెండు ముంజేతులున్నూ గుణ కిణాంకములు. అల్లె త్రాటి ఒరపిడిచేత విలుకాండ్రకు మణికట్టు దగ్గరి హస్తభాగమున కాయలుంటాయి.

బాణముతో ఆకర్ణాంతము లాగిన వింటినారి, బాణము విడిచి పెట్టినప్పుడు, చాలా తీవ్రంగా ముంజేతికి తగులుతుంది. అలాగు తరుచుగా తగిలినందువల్ల కాయలు కాస్తాయి.

సుభద్ర ఇంతకు పూర్వము అర్జునుడిని చూచి ఉండలేదు. తాను వినుకలి ద్వారా ఏర్పరచుకొన్న మనోచిత్రాన్నే ఈ విధంగా వర్ణిస్తూన్నది.

అర్జునుడిని గురించి ఇంత ప్రత్యేకంగా తా నడుగుతున్నందుకు యతి ఏమనుకుంటాడో అని కొంత సమాధానంగా ఈ చుట్టరికపు వరుసను దెలియజేసింది.

ఒక ముఖ్య విషయము :

ఈ పద్యములోని వర్ణనలను చేమకూరకవి ఒక స్త్రీలపాట 'సుభద్రా కల్యాణము' లో నుంచి తీసుకొని తన కావ్యములో కలుపుకున్నాడని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చిన్న పొరపాటు చేసి తమ అభిప్రాయాన్ని ప్రకటించారు. ప్రభాకర శాస్త్రిగారు గట్టి పరిశోధకులు కాబట్టిమన సాహిత్య ప్రముఖులు బహు సంఖ్యాకులుగా దానినే అంగీకరించారు. ఇది ఘోరమైన అపవాదు. నిజము ఏమిటంటే : 'విజయ విలాసము లోని మన కవి వర్ణనలను ఆ పాటవ్రాసిన వారు—స్త్రీయో పురుషుడో — చక్కగా తమ పాటలో ఇరికించుకున్నారు. ఈ విషయమయిన నా పరిశోధనా ఫలితాలను 'పండిత ప్రమాదము' అన్న శీర్షికతో వ్రాసి ఈగ్రంథ ఉపోద్ఘాతములో ప్రచురిస్తున్నాను. జిజ్ఞాసువులు దానిని చూడవలెనని ప్రార్థన.

అలంకారము :— అంత్యానుప్రాసము, ఉల్లేఖము.

తడ వాయె భూప్రదక్షిణ
మడరింపఁగఁ బోయి యా మహామహుఁడు, పదం
పడి పుణ్యస్థలముల నె
న్నఁడు మీ రందందు నరుగ నరుఁ గానరు గా ? 165

అర్థము :— ఆ మహామహుఁడు = మహాత్ముడైన ఆ అర్జునుడు, భూప్రదక్షిణము, అడరింపఁగన్ = చేయుటకు, పోయి, తడవు = చాలాకాలము. ఆయెన్ = అయినది, పదంపడి = ఆ వెనుక, ఎన్నఁడున్ = ఎప్పుడైనా, పుణ్యస్థలముల (యందు), మీరు, అందందున్ = ఆయాస్థలాలకు, అరుగన్ = పోయినప్పుడు, నరున్ = అర్జునుని, కానరుగా = చూచి యుండ లేదా ?

ఈ ప్రశ్నలన్నిటిలో సుభద్ర అడుగ దలచినది — 'మీరు అర్జునుని ఎక్కడైనా చూచారా' అని.

అలంకారము :— యమకము, పర్యాయోక్తి.

అన విని "సమస్త భూములు
గనినారము, తీర్థయాత్రఁ గావించు నెడన్
గనుఁగొనినారము సంక్రం
దన నందను"; నని న ముద మెదం జెన్నొందన్. 166

అర్థము :— అనన్, విని, సమస్తభూములున్ = అన్ని ప్రదేశాలనూ, కనినారము = నేనుచూచాను, తీర్థయాత్ర కావించు నెడన్ = అతడు తీర్థయాత్ర చేస్తున్న సమయంలో, సంక్రందన నందనున్ = ఇంద్రుని కుమారుడైన అర్జునుని, కనుఁగొనినారము-చూచాము, అనిన, ఎదన్ = ఆమె హృదయములో, ముదము = సంతోషము, చెన్నొందన్ = అతిశయించగా,....

తాత్పర్యము :— "మేమన్ని దేశాలు చూచాము, తీర్థయాత్ర చేస్తూన్న అర్జునుడిని కూడా చూచాము" అని చెప్పేసరికి సుభద్ర, సంతోషముతో —

విశేషము :— కనినాను అనకుండా కన్నారము అని బహువచన రూపము వాడడం యతీశ్వరత్వానికి సరిపోతుందని అర్జునుడి తలంపు.

సమస్త అనడంలో ఇంద్రప్రస్థము కూడా అని. "అర్జునుడిని చూచాను" అనగానే, సుభద్ర ఉత్సాహం అంతా సంతోషంగా మారింది.

అలంకారము :— అనుప్రాస, యమకము.

"ఎచ్చటఁ గంటిరో విజయు నిక్కువ ? నిక్కువ మౌనె ? రాఁడు గా
యిచ్చటి" కంచుఁ గోరికల యూరిక లీరికలెత్తఁ బల్కఁగా,
నొచ్చెము లేని వీర మెద నూరఁగ, నూఱఁగఁ సాగె వెంటనే
పచ్చని వింటివాఁ డపుడు పైదలిపైఁ దలిరాకుఁ గైదువుల్. 167

అర్థము :— ఎచ్చటన్ కంటిరో విజయు, ఇక్కువన్ = ఉనికిని, నిక్కువమౌనె = నిజమౌనా ?, ఇచ్చటికి, రాఁడుగా = రాడా, అంచున్, కోరికల ఊరిక లీరిక లెత్తన్ = కోరికల అంకురాలకు అంకురాలు మొలుస్తుండగా (చాల విశేషముగా వాంఛలు కలుగుతుండగా), పల్కఁగాన్ = అడిగినంత, ఒచ్చెములేని = లోపములేని, వీరము = పరాక్రమము, ఎదన్ = మనస్సున, ఊరఁగాన్ = ఊటలారుతుండగా, పచ్చని వింటివాఁడు = మన్మథుడు, అపుడు, పైదలిపైన్ = సుభద్రమీద, తలిరాకు కైదువుల్ = చిగురాకు ఆయుధాలను (కత్తులను), వెంటనే = తక్షణమే, నూఱఁగసాగె = వాడిచేయ మొదలు పెట్టెను.

*తాత్పర్యము* :—అర్జునుడిని మీరెక్కడ చూచారు ; నిజంగానే చూచారా ? ఇక్కడికి రాడా ? అంటూ కోరికలు పెచ్చు రేగుతుండగా అడుగుతున్న ఆ సుభద్రపై ప్రయోగించడానికి మన్మథుడు చిగురాకు కత్తులు నూరసాగాడు.

*విశేషము* :— నిక్కవమౌనె - అనగా చెప్పినది అబద్ధమా అన్న సందేహం కాదు. (అలాగు యతీశ్వరుడిని సందేహించడము మర్యాదకాదు కదా). చెప్పిన దానిలో పొరపాటేమైనా ఉందేమో, నేను సరిగా అర్థం చేసుకో లేదేమో అన్న ఆత్రమే.

రాఁడుగా - అయ్యో, ఇక్కడికి రాలేదే అన్న విచారము కూడా కనబడుతుంది.

అర్జునుడిని చూచా ననేసరికి సుభద్ర కోరికలు చిగుళ్లకు చిగుళ్లుపెట్టి విస్తరిల్లి పోతూ ఉన్నవి, ఇదే సమయమని, మన్మథుడు వెంటనే, కత్తులు నూరసాగాడు.

పచ్చని వింటివాడు కాబట్టి మన్మథుడు తలిరాకు కైదువు నూరడము చాల సముచితము.

*పాఠాంతరము* :—

ఈ పద్యము రెండో చరణానికి మూడు పాఠాలున్నాయి :

1. ఏకట యేకట బెట్టఁ బల్కఁగా......

కోరికల ఎకట = ఉద్రేకము, ఏకటబెట్టన్ = ఉద్రేకము చెందగా అని అర్థము,

— వేదమువారు

2. కోరిక కిరిక కిరిక లెత్తఁ బల్కఁగా

— తిరుపతివారు.

3. కోరికలు సీరిక లెత్త రసోక్తిఁ బల్కఁగా

— కృష్ణమాచారిగారు.

ఇక్కడి సంభాషణ శుభప్రదమయిన వివాహానికి సంబంధించినది — పచ్చతోరణానికి తగినది. దీనిలో మన్మథుడు పచ్చని వింటివాడు, వాడు నూరుతున్నది తలిరాకు. అంతా పచ్చగా ఉన్న ఈ పద్యములో ఏకట( = ఉద్రేకము) అనడముకంటే పచ్చని ఈరికలు( = అంకురాలు, చిగుళ్లు) అని చెప్పడమే సముచితము కాదా, కాబట్టి వేదమువారి పాఠం విడిచిపెట్టాము,

కృష్ణమాచారిగారి పాఠము 'కోరికలు సీరికలెత్త రసోక్తిఁ బల్కఁగా'లో కవి ఉద్దేశించిన యమకమును. వారు గుర్తించలేకపోయా రనాలి. 'నిక్కవ నిక్కవ' 'నూరగ నూరగ' 'పైదలి పైదలి' అన్నట్టే ఈరెండో చరణములో 'ఈరిక ఈరిక' అనే కవి అని ఉంటాడు. నియమభంగము మన కవికి పనికిరాదు.

*అలంకారము* :— యమకము.

కోమలి యీగతి న్మది తగుల్పడఁ బల్కి నవ్వి," "నిర్జర
గ్రామణి సూను మీ రెచటఁ గంటిరొ యంటివి ; కన్న మాత్రమే
యేమని చెప్పవచ్చు, నొక యించుక భేదములేక యాయనే
మే మయి యున్నవారము సుమీ వికచాంబుజ పత్త్రలోచనా," 168

*అర్థము* :— కోమలి = సుభద్ర. ఈగతిన్ = ఈ ప్రకారముగా, మది = మనస్సు, తగుల్పడన్ = అర్జునునకు పట్టుపడునట్లు, పల్కినన్, నవ్వి. (అర్జునుడీ విధంగా అంటున్నాడు) "వికచాంబుజ పత్ర లోచనా = వికసించిన తామరరేకులవంటి కనులు గల సుభద్రా, నిర్జర గ్రామణి సూనున్ = దేవతల ప్రభువగు దేవేంద్రుని కుమారుడిని, మీరు, ఎచటన్ కంటిరొ = యెక్కడ చూచారో అని, అంటివి = అడిగావు. కన్నమాత్రమే = చూచినంత మాత్రాన, ఏమని చెప్పవచ్చున్ = నీవడిగిన ప్రశ్నలకు ఏమని చెప్పగలను, ఒక ఇంచుక = కొంచెమైనా, భేదములేక, ఆయనే = ఆ అర్జునుడే, మేమయి = నేనయి — అంత భేదము లేకుండా, ఉన్న వారము సుమీ = ఉన్నాముసుమా.

*తాత్పర్యము* :— చూడడమే కాదు, ఆయనే నేను, నేనే అర్జునుడను అన్నంత, అభేదంగా ఉన్నాము, అని, చిన్ననవ్వు నవ్వుతూ అర్జునుడు సుభద్రతో అన్నాడు.

*విశేషము* :— పై 167వ పద్యములో సుభద్ర కనబరిచిన ఆసక్తివల్ల ఆమె మనస్సు. అర్జునుడికి పట్టుబడ్డది-తెలియ వచ్చింది. ఆ సంతోషంతోనే నవ్వుకుంటూ 'చూచినంత మాత్రాన ఏమి విశేషముంటుంది. ఆయనా నేనూ ఏలాంటి భేదమూ లేకుండా కలిసి ఉన్నాము సుమా, అన్నాడు.

అర్జును డీలాగు చెప్పుతూ ఉన్నప్పుడు ఆనందాతిశయముచేత సుభద్ర పెద్దకన్నులు చేసుకొని చూస్తూ ఉంది. కనుకనే వికచాంబుజ పత్రలోచనా అన్న సంబోధన.

ఒక్కమాట

మొదటి పాదములో 'మదిఁ దగుల్పడ' అన్న మాటలకు వేదమువారు 'మనస్సున నాటునట్లు' అని అర్థము చెప్పారు. బులుసువారు 'మనస్సునందు నాటుకొనునట్లుగా' అనే అర్థం ఇస్తూ, ప్రేమ కలుగునట్లుగా అని కొంత వివరణ నిచ్చారు. వీరి అభిప్రాయము 'కోమలి ఆ ప్రకారము ఎచ్చట గంటిరో విజయు నిక్కువ....' అని. 'మనస్సున నాటినట్లు' పలికినది అని-బులుసువారి ప్రకారము 'ప్రేమ కలిగినట్లు' పలికినది అ.వి ఆ మనస్సు అర్జునుడి మనస్సే కావాలి కదా, అర్జును డిక్కడికి వచ్చిన దగ్గరనుంచి, - అంతకు ముందునుంచి గూడా — ప్రేమ కలిగే ఉన్నాడు, ఇప్పుడు కొత్త యేమీ లేదు.

కాబట్టి 'తగుల్పడఁ' అంటే (ఆమె మనసు) 'పట్టుబడినట్టు' అని మనము చెప్పడము న్యాయము. 'బలిమిని పట్టగా తివురు......' అన్న పై 145 వ పద్యములో 'తలంపెరుంగకే కలయగ జూచుటల్ తగవుగాదని యుండు' అని కవి చెప్పాడు. ఆమె మనస్సు తెలుసుకోవాలనే ఇన్నాళ్లూ కవిపెట్టుకొని ఉన్నాడు. ఇప్పుడీ సందర్భములో ఆ 'మనస్సు' చక్కగా పట్టుపడింది. అందుకే నవ్వాడు. ఇక బయట పడవచ్చుననీ బలిమిని పట్టినా ఇట్టట్టన దనీ నిశ్చయించుకొని 'ఆయనే మేమయి' ఉన్నామన్నాడు.

తగుల్పడుటకు మన అర్థముందా అంటే. ఉంది. చూడండి :

> చిక్కుపడియె, దొరకె, చేపడె. నగపడె, తగిలె, పట్టుపడియె, తగులుపడియె:
> అబ్బెనన, గృహీత మయ్యె ననందగు.........
>
> —ఆంధ్రభాషార్ణవము.

అర్జునుడి ప్రవర్తనలో ఇదొక కీలకమయిన సన్నివేశము. ఆ కీలకము ఈ తగుల్పడ డములోనే కవి ఉంచాడు. దానిని మనము గ్రహించక పోవడము కవికి ద్రోహము చేయడమే అవుతుంది.

ఈ మది తగుల్ పడడంతో — సుభద్ర మనసు పట్టుపడడంతో, యతీశ్వరత్వం అంత రించిపోయింది ; అర్జునత్వం ప్రస్ఫుటమయింది. యతిగా ఉన్నప్పుడు, ఎప్పుడూ, శృంగారరస సంబంధమయిన సంబోధనతో సుభద్రను పిలువలేదు. చూడండి - పై 143 లో తరుణీ, 159 లో చెలువ, కలికి అనే అన్నాడు. 'తెమ్ము బంగారు కుండ జలమ్ము లనుచు' అన్న పద్యములో సుభద్రకు 'బంగారు కుండతో జలమ్ములు' అన్న భావమే — 'బంగారుకుండ' సంబోధనగా అర్జునుడి మనసులోనే ఉండి పోయింది.

ఈ పద్యములో సుభద్రను 'వికచాంబుజ పత్రలోచనా' అని సంబోధించి అర్జునుడు తన శృంగార నాయకత్వము ప్రదర్శించాడు. తరువాత 172 వ పద్యములో తామరస దళాక్షీ అని పిలిచాడు.

*పాఠాంతరము :*

> కోమలి ఈ గతిన్ మదిఁ దగుల్పడఁ బల్కిన........
>
> —వేదమువారు.

*అలంకారము :*— కావ్యలింగ.

"తీర్థములను గ్రుంకి దేవతా సేవలు
చేసికొనుచుఁ బెక్కు వానరములు
కూడి యతఁడు మేము గోకర్ణమున యందు
నుంటి" మనిన, మచ్చెకంటి యలరి, 169

అర్థము :— తీర్థములను, క్రుంకి = స్నానముచేసి, దేవతాసేవలు చేసికొనుచుఁ, పెక్కు వాసరములు = చాలాదినములు, అతఁడున్ = ఆ యర్జునుడున్ను, మేముఁ = నేనున్ను, కూడి = కలిసి, గోకర్ణమున యందుఁ = గోకర్ణ క్షేత్రములో, ఉంటిమి, అనినఁ = అనగానే, మచ్చెకంటి = బేడిస చేపవంటి కనులు గల ఆ సుభద్ర, అలరి = ఆనందమును పొంది...

విశేషము :— ఆయనా నేనూ గోకర్ణములో చాలా దినాలు కలిసి ఉన్నాము అని 'యతి' చెప్పగానే, సుభద్రకు మహానందము కలిగి 'అలరింది'. ఆమెకు కావలసిన సమాచారానికి దారి కనిపించింది.

"ఎక్కడ గోకర్ణంబన ?
నిక్కడి కది యెంతదూర ? మింతకు నతఁడీ
చక్కటికి వచ్చునో లే
కక్కడనే యుండి యవలి కరుగునో, చెప్పుఁడా". 170

అర్థము :— గోకర్ణంబు, అనఁ = అనగా ఆ క్షేత్రము ఎక్కడుంది ? ఇక్కడకు, అది, ఎంతదూరము ? ఇంతకుఁ = ఇప్పటికి - మీరిక్కడకు వచ్చినప్పటికి, అతఁడు, ఈ చక్కటికి = ఈ చెంతకు (ద్వారక సమీపానికి,) వచ్చునో, లేక, అక్కడనే ఉండి, అవలికిఁ = ద్వారకవైపు కాక ఇంకొక వైపు, అరుగునో = వెళ్తాడో, చెప్పుఁడా = దయచేసి చెప్పండి - ప్రార్థనార్థకము.

విశేషము :— గోకర్ణము నుంచి ఈ యతి ద్వారకకు రావడానికి పట్టిన కాలములో అర్జును డక్కడే ఉంటాడా, లేక మరేవైపునకైనా వెళ్తాడా అని అడగడములో అవసరమయితే ఆ గోకర్ణానికే వెళ్ళి అతడిని చూడవచ్చునేమో అన్న అభిప్రాయము సుభద్రమనసులో ఉండాలి. అందుకే యెక్కడ, ఎంతదూరము అని అడిగిం దనుకోవాలి.

అని రాజవదన మాటికి
ననురాగము తేటపడఁగ నాడెడు మాటల్
విని జేజేరా కొమరుఁడు
వనజేక్షణ కనియె వలపు వడ్డికిఁ బాఱన్. 171

అర్థము :— అని, రాజవదన = చంద్రునివంటి ముఖము గల సుభద్ర, మాటికిఁ = మాటిమాటికీ, అనురాగము = ప్రేమ, తేటపడఁగఁ = అర్జునుడికి స్పష్టమయ్యేటట్టు, ఆడెడు మాటల్ = చెప్పుతున్నమాటలు, విని, జేజేరా కొమరుఁడు = దేవతలరాజు కొడుకు—అర్జునుడు,

వలపు = తనకున్న మోహము, పడ్డికిన్ పాఱఁగా = వృద్ధిపొందుతుండగా - అతిశయిస్తుండగా, వనజ ఈక్షణకు = తామరసాక్షికి (సుభద్రకు) అనియెఁగా = ఇట్లు చెప్పెను.

*విశేషము :—* మాటిమాటికీ అనడమువల్ల, సుభద్ర చెప్పుతున్న ప్రతిమాటలోనూ ఆమె మనసులో ఉన్న ప్రేమ బయటపడుతున్న దన్న అభిప్రాయము కవికి ఉందన వలెను. 168 పద్యములో 'తగుల్పడ' లో ఉన్న భావమే ఇది.

సుభద్ర ప్రశ్నల నడుగుతున్నకొద్దీ అర్జునుడి మోహము, అసలుకి వడ్డీవలె, వృద్ధిపొందిం దని భావము.

"వేమాఱు గ్రుచ్చి గ్రుచ్చిపు
డేమీ యడిగెదవు, మన సొకించుక నీ కా
భూమీశు మీఁదఁ గలదో ?
తామరస దళాక్షి నాకు దాఁపక చెపుమా." 172

*అర్థము :—* వేమాఱు = వేయిమారులు - చాలాసారులు, గ్రుచ్చిగ్రుచ్చి = నొక్కినొక్కి, ఇపుడు, అడిగెదవు ఏమి = ఎందు కడుగుతున్నావు. తామరసదళాక్షి = పద్మాక్షి, ఆ భూమీశుమీఁదన్ = ఆ రాజుమీద నీకు, మనసు, ఒకించుక కలదో, నాకు, దాఁపక = మరుగు పెట్టక, చెపుమా.

*తాత్పర్యము :—* తరచి తరచి అడిగినదే పలుమా రడగడంచేత, నీకు ఆ అర్జునునిపై మనసు ఉందని ఊహించవచ్చా ? నాకు దాచకుండా చెప్పు అని,

*విశేషము :—* ఇంతదాకా మేము, మేము అని బహువచనము వాడుతూండిన కపట సన్యాసి, 'వలపు వడ్డికి పాఱే సరికి' ఆ యతిత్వమును మరచిపోయి, 'నేను. నేను' అని ఏక వచనమునే వాడడము మనోహరంగా ఉంది,

*పాఠాంతరము :—*

"....గ్రుచ్చిగుచ్చిపుడే మీఁవడిగెదవు..."

— తిరుపతివారు.

ఇపుడు, ఏమి, ఈవు (నీవు) అడిగెదవు అని అర్థము.

"అక్కఱతోడ మంతనమునం దిటు వేఁడెదు గాన, నంతయుఁ
నిక్కముగాఁగఁ దెల్పఁ దగు నీ. కటులైన, సురేంద్ర సూతి యీ
దిక్కున నున్నవాఁ డనుచుఁ దెల్పినతోడనె మాటలాడకే
యెక్కడఁ బోదువోయని యొకించుక సంశయ మయ్యెడుం జెలీ". 173

అర్థము :— చెలీ = ప్రియురాలా అని భావము. మంతనమునన్ = ఏకాంతముగా ఉన్న ఇప్పుడు. అక్కఱతోడఁ = మిగుల కోరికతో. ఇటు = ఈ ప్రకారము. వేఁడెదు = అడుగుతున్నావు. కానఁ. అంతయున్ = అన్ని విషయాలూ. నిక్కముగాఁగన్ = యథార్థ ముగా (ఉన్నది ఉన్నట్లుగా). నీకు తెల్పఁ తగుఁ = నీకు తెలియజేయడము ఉచితమైన పని. అటులు ఐనఁ = ఆలాగయినప్పటికీ. సురేంద్రసూతి = ఇంద్రుని కొడుకు - అర్జునుడు. ఈ దిక్కునన్ = పలానాచోట. ఉన్నవాఁడు. అనుచుఁ. తెల్పినతోడనే = నేను చెప్పగానే. మాటలు ఆడకే = నాతో మాటలాడకుండానే. ఎక్కడ పోదువో అని = వెళ్ళిపోతావేమో అని. ఒక ఇంచుక సంశయము అయ్యెడుఁ = కొంచెము సందేహము కలుగుతూ ఉంది.

తాత్పర్యము :— "ఇంత కోరికతో అడుగుతున్నావు కాబట్టి. నీకు నిజము చెప్పడం ధర్మము; కాని. అర్జును డీ దిక్కున ఉన్నాడు అని చెప్పిన వెంటనే. నువ్వెక్కడ మాటలాడ కుండా లేచి పోతావో అని సందేహం కలుగుతున్నది అని అర్జునుడన్నాడు.

విశేషము :— అర్జును డీ దిక్కున ఉన్నాడు అనడం పలానాచోట ఉన్నాడనే కాక ఇక్కడే ఉన్నాడు అని గూడ అర్థము వచ్చేలాగా చెప్పి. లోలోన సంతసపడుతున్నాడు.

ఈ సుభద్రా ఘట్టములో అర్జునుడు ఉపయోగించిన సంబోధనలలో .మన కవి అమోఘ మైన చమత్కారము చూపించాడు. మొదట చెలువ. కలికి. అన్నాడు. ఆమె మనసు పట్టుబడ్డ తరవాత వికచాంబుజ పత్రలోచనా. తామరసదళాక్షీ అని శృంగార నాయకుడిలాగా అన్నాడు. గ్రుచ్చిగ్రుచ్చి అడగడంతో మరింత దగ్గరగా పోయి. చెలీ అని ప్రేయసిని పిలిచినట్టు అన్నాడు.

"ఆ కవ్వడి యతివేషము
చేకొని యున్నాఁడు నీకుఁ జెంతనె; యెన్నా
ళ్ళో కలదు వచ్చి; యిఁక నే
నీ కీలక మించుకైన నీ వెఱుఁగవుగా'' ! 174

అర్థము :— ఆ కవ్వడి = సవ్యసాచి అయిన ఆ అర్జునుడు. యతివేషముఁ. చేకొని = వేసుకొని. నీకుచెంతనె = దగ్గరనే. ఉన్నాడు. వచ్చి. ఎన్నాళ్ళో కలదు = చాలా రోజులయి నది. ఇఁకనేని = ఇకనైనా - ఇన్నాళ్లుండినా. ఈ కీలకము = ఈరహస్యమును. ఇంచుకైనఁ = కొంచెమైనా. ఈవు = నీవు. ఎఱుఁగవుగా = తెలుసుకో లేక పోయావుకదా.

తాత్పర్యము :— ఆ అర్జునుడు యతివేషములో నీ దగ్గరనే ఉన్నాడు; వచ్చి చాలా దినా లయినా ఈరహస్యము నీవు తెలుసుకో లేకపోయావే.

విశేషము : — కవ్వడి - కవ వడి - రెండుచేతులతోనూ బాణములు వేయువాడు. సవ్యసాచి.

"ఇఁక ఞ నేను ఈ కీలకము' అని పదవిభజన చేసి వేదమువారు 'నేనే ఈ రహస్యము' అన్న అర్థము సూచించారు.

పాఠాంతరము :—

"ఎన్నాళ్ళో కలదు వచ్చి. యింకా ఈ కీలకము...'' — కృష్ణమాచారిగారు.

"నీకై తపంబుఁ జేసెద
నీ కైవడి; దాఁప నేల ? యే నర్జునుఁడఞ;
లోకోత్తర శుభలగ్నం
బో కోమలి నేఁడు; కోర్కు లొడఁగూర్పఁగదే". 175

అర్థము :— "దాఁపనేల = ఇంకా దాచడ మెందుకు ; ఏన్ = నేనే, అర్జునుడన్, నీకై = నీ గురించే. ఈకైవడిఞ = ఈ విధంగా. తపంబు చేసెదన్ = తపస్సు చేస్తున్నాను ; ఓ కోమలీ = ఓ సుభద్రా. నేఁడు = ఈ దినము. లోక ఉత్తర శుభలగ్నంబు = మిక్కిలి శ్రేష్ఠమయిన సుముహూర్తము. కోర్కులు = మన ఇరుపురికిగల కోరికలు—వాంఛలు. ఒడఁగూర్పఁగదే = చేకూరినట్లు చేయమని కోరుతున్నాను."

విశేషము :— ఇన్నాళ్లూ సుభద్ర అభిప్రాయము ఏలాగుంటుందో తెలుసుకోకుండా తొందరపడ కూడదని శాంతించాడు. ఇప్పుడా అభిప్రాయము పట్టుపడ్డది. ఇంకా దాపరిక మెందుకని అర్జునుడు బయటపడ్డాడు.

పద్యములోని ప్రాసాక్షరాలు : 1. 2. పాదాలలో 'కై'. 3. 4. లలో 'కో'.

"నీకై తపంబు చేసెద" — కపట సన్యాసిగా ఉండి నేను చేసిన జపమంతా నిన్ను గూర్చే సుమా. నీ కోసమే ఈ కష్టమంతా భరిస్తున్నాను అని భావము.

ఎవరిని గురించి తపసు చేస్తామో వారు కోర్కెలను సమకూరుస్తారు : నిన్ను గురించి తపస్సు చేశాను కాబట్టి నీవుగూడా కోర్కెలీడేరే లాగా చేయాలని హృదయము.

నా విని యా వినీల కచ నవ్వుమొగం బటు గొంత వంచి యెం
తే వెఱ నివ్వెఱఁ మునిఁగి, "యీతనిఁ బార్థునిఁగా నొకింత మున్
భావమునం దలంచియును నమ్మక యమ్మకచెల్ల ! యూరకే
సేవ లొనర్చుచుంటి" నని సిగ్గున దిగ్గున లేచి పోవఁగన్. 176

అర్థము :— నాఁ = అని చెప్పగా, ఆ వినీలకచ = మిక్కిలి నల్లని తలవెంట్రుకలు గలది, ఆ సుభద్ర, నవ్వుమొగంబు = సంతోషముతో కూడిన తన ముఖమును, అటు కొంత వంచి, ఎంతేన్ = ఎక్కుడైన, వెఱ నివ్వెఱఁ = భయముతోకూడిన ఆశ్చర్యములో, మునిఁగి, (ఇట్లు తన మనస్సులో అనుకొన్నది) "ఈతనిఁ = ఈ యతిని, పార్థునిగాఁ = అర్జునునిగా, మున్ = ఇంతకు ముందు, భావమునన్ = మనసులో, ఒకింత = కొంచెము, తలంచియును = అనుకొని కూడా, నమ్మక = నమ్మకము కలగక, అమ్మకచెల్ల = అయ్యో ! ఊరకే = నిష్ప్రయోజనముగనే, సేవలు, ఒనర్చుచుంటిని", అని, (తలంచి), సిగ్గునఁ, దిగ్గునఁ = ఉన్న పాటున, లేచి, పోవఁగఁ = పోవుచుండగా......

తాత్పర్యము :— ఆ మాటలు విని, సుభద్ర, భయముతో కూడిన ఆశ్చర్యముతో, "అయ్యో, అర్జునుడని అనుమానించికూడా, ఇన్నాళ్లూ వృథాగా సేవచేశానే", అని సిగ్గుతో దిగ్గునలేచి పోబోగా......

విశేషము :— పద్యములో మొదటి రెండు పాదాలూ నావిని_యావినీ అనిన్నీ, తేవెఱ_నివ్వెఱ అనుప్రాసతో ఆరంభించాడు. తరువాతి రెండు పాదాలలోను చివరను నమ్మక_అమ్మక అనిన్నీ సిగ్గున_దిగ్గున అన్నాడు. పద్యరచనలో ఇదొక సొగసు.

అర్జునుడు నేనే అర్జునుడని చెప్పగానే సుభద్రకు సంతోషమూ సిగ్గూ భయమూ ఆశ్చర్యమూ అన్నీ కలగడం తప్పదు — సంతోషముతో నవ్వింది, సిగ్గుతో తలవంచుకుంది, ఎవ రే మనుకుంటారో అని భయము, ఈ సన్నివేశమంతా ఈలాగు జరగడానికి ఆశ్చర్యము.

పై 139వ పద్యంలో తా ననుమానించి కూడా నమ్మక ఊరకే సేవచేశానే అన్న సిగ్గుతో దిగ్గున లేచి పోబోయింది.

"ఏల పోయెదు నిలునిలు బాల" యనుచుఁ
జిఱునగవు నెమ్మొగంబునఁ జెంగలింపఁ,
దమకమున లేచి, మరులేచి, తత్కరాంబు
జం బొడిసి పట్టెఁ జేసాఁచి సవ్యసాచి. 177

*అర్థము* :— "బాల = ముద్దరాలా, ఏలపోయెదు, నిలునిలు", అనుచు, చిఱునగవు, నెమ్మొగంబునన్ = అందమయిన ముఖముపైన, చెంగలింప = ప్రకాశిస్తుండగా, తమకమునన్ = తొందరపాటుతో, లేచి, మరులు ఏచి = మోహము అతిశయించి యుండుటచేత, తత్ కరాంబుజంబు = ఆ సుభద్రయొక్క పద్మమువంటి చేతిని, సవ్యసాచి = అర్జునుడు, చే చాఁచి = చేయిచాచి, ఒడిసిపట్టెన్ = తటాలున పట్టుకొనెను.

*తాత్పర్యము* :— బాలా నిలునిలు అంటూ సంతోషమూ తొందరపాటూ, మోహమూ కలిగి అర్జునుడు లేచి, చేయిసాచి ఆమె చేతిని హఠాత్తుగా పట్టుకున్నాడు.

*విశేషము* :— ఈ పద్యములో సుభద్రను 'బాలా' అని పేర్కొన్నాడు, బాలా అంటే అజ్ఞానురాలా, తెలివి తక్కువదానా, ముగ్ధా అని అనినట్టు భావించాలి.

ఇక్కడ పరిస్థితులన్నీ తనకు అనుకూలంగా ఉన్నప్పుడు సుభద్ర పోవడానికి ప్రయత్నించడము అజ్ఞానమని అభిప్రాయము.

*అలంకారము* :— అనుప్రాసము, పరికరము.

పట్టిన మాత్రన దేవకి
పట్టి కరాబ్జము లలాట పట్టిక చెమటల్
పట్టె, గగుర్పొడిచెం జను
క, ట్టొక యిసుమంత వీడెఁ గట్టుం గొంగున్. 178

*అర్థము* :— పట్టిన మాత్రన = అర్జునుడు చేయిపట్టినంత మాత్రాన, దేవకిపట్టి = దేవకీదేవి కూతురైన సుభద్రయొక్క, కర అబ్జము = పద్మమువంటి చేయీ, లలాటపట్టిక = పలకవంటి నుదురూ, చెమటల్ పట్టెఁ, చనుకట్టు = కుచప్రదేశము, గగుర్పొడిచెన్ = పులకరించెను, కట్టుకొంగున్ = పోకముడిగూడా, ఒక ఇసుము అంత = ఒక రవంతమాత్రము, వీడెఁ = సడలెను.

*విశేషము* :— అర్జునుడు చేయి పట్టుకున్నప్పుడు స్పర్శవల్ల సుభద్రకు స్వేదము, రోమాంచము, కంపము అనిన సాత్త్వికోదయ లక్షణాలు కనబడ్డాయి.

*అలంకారము* :— అనుప్రాస.

మరుఁ డపుడు బేసితూపులు
ధరియించియు నేమిచెప్పఁ ? దరుణి న్నరునిన్
సరికోలలఁ బడనేసెఁ
గొరువంక రొదల్ చెలంగఁ గ్రొన్నన వింటన్. 178

అర్థము :— అపుడు, మరుఁడు = మదనుఁడు, బేసితూపులు = బేసిసంఖ్యయైన ఐదు బాణములు, ధరియించి ఉన్నప్పటికీ, గొరువంకరొదల్ = గొరువంక పక్షుల ధ్వనులు, చెలంగఁగ = వినవచ్చేలాగ, క్రొన్నన వింటఁ = క్రొత్త పూమొగ్గలతో నిర్మించిన వింటితో, తరుణిఁ = యౌవనవతియైన సుభద్రను, నరునిఁ = అర్జునుని, సరికోలలఁ = ఇద్దరినీ సమానముగా బాణములతో (సరిసంఖ్య యగు బాణములతో అని రెండో అర్థము), పడన్ ఏసెఁ = కొట్టెను ఏమి చెప్పఁ = ఎంత ఆశ్చర్యము !

విశేషము :— అల్లెత్రాటిని ఆకర్ణాంతంగా లాగి బాణము విడిచిపెట్టినప్పుడు, ధనుష్టంకారమూ, బాణవేగమువల్ల కలిగిన (తారాజువ్వల వంటి) ధ్వనీ కలిసి గొరువంకల ధ్వనులలాగా వినిపించాయి.

బేసితూపులు - ధరించికూడా - సరికోలల వేయడము విరోధంగా ఉంది. కాబట్టి ఆశ్చ ర్యము. సరికోలలు అంటే ఇద్దరినీ సమానముగా బాణాలతో కొట్టాడన్న అర్థంతో ఆ విరోధం పోతుంది.

సరికోలలు వేశాడు కాబట్టి ఇద్దరికీ అనురాగము ఒక్కలాగే ఎక్కువయిందని భావము.

అలంకారము :— విరోధాభాసము, అనుప్రాసము.

ఆ రీతిం జేపట్టి వ
రారోహన్ వేది మీఁదికై రాఁ దిగువఁ
దూరము వెస నరుగక యొ
య్యారముగా నమ్రవదనయై యుండంగన్, 180

అర్థము :— ఆరీతిన్, చేపట్టి = చేయిపట్టుకొని, వరారోహఁ = అందమయిన పిరుదులు కల ఆ సుభద్రను, వేదిమీఁదికై = తానింతవరకు కూర్చున్న అరుగుపైకి, రాఁ తిగువన్ = వచ్చునట్లు లాగగా, వెసన్ = త్వరగా, దూరము, అరుగక = పోకుండా, ఒయ్యారముగా = విలాసముతో, నమ్రవదనయై = వంచిన ముఖము కలదయి, ఉండంగన్ = ఉండగా....

విశేషము :— చేయిపట్టి లాగినప్పుడు, సుభద్ర అవ్వలి మొగమై తిరిగి ఉండడము సహజమే. అటువంటప్పుడు అర్జునునకు విలాసముగా కనిపించినది, కటిప్రదేశము కదా, అందుకే వరారోహ అన్నాడు కవి.

వెసన్ దూరమరుగక అంటే నెమ్మదిగా రెండడుగులు వేసి అన్న భావము. దీనినిపట్టి సుభద్ర రానూలేదు, రాకపోనూ లేదు, అనుకోవచ్చును.

అలంకారము :— స్వభావోక్తి.

## అర్జునుఁడు సుభద్రను వేఁడుట

"ఏ మును చూచి యెఱుఁగ నిను,
నీ మును ననుఁ జూచి యెఱుఁగ వీవును, నిపు డీ
ప్రేమలు వినుకలినే పై
పై మన కిర్వురకుఁ బర్వె, బర్వేందు ముఖీ. 181

ఆ విధంగా ఉన్నప్పుడు అర్జునుడు ఈలా గన్నాడు.

*అర్థము* :— పర్వ ఇందు ముఖీ = నిండు చందురుని వంటి ముఖము కలదానా, ఏన్ = నేను, మును = ఇంతకుముందు, నినున్ = నిన్ను, చూచి యెఱుఁగన్ = చూడలేదు, ఈవున్ = నీవు గూడా. ఈమును = ఇంతకు పూర్వము, ననున్, చూచి యెఱుఁగవు = చూచినదానవు కావు, ఇపుడు, ఈ ప్రేమలు, వినుకలినే = వినుటవల్లనే, మనకు, ఇర్వురకు, పైపైన్ = అతిశయించుచు, పర్వెన్ = పెరిగినవి.

*తాత్పర్యము* :— సుందరీ, ఇంతకు పూర్వం నేను నిన్ను గాని, నీవు నన్ను గాని చూచి ఎరుగము. కేవలము ఒకరిని గూర్చి ఒకరము వినడమువల్లే మన ప్రేమ ఇంత అతిశయించింది కదా.

*అలంకారము* :— అనుప్రాసము.

శారిక హారి కంకణము సద్దున కంటుట గాదు కేలు, మం
జీర ఝుళంఝుళ ధ్వనికిఁ జేరుటగాదు పదంబు లంచ, వా
గ్ధోరణి మాధురీ మహిమకున్ శుక మానుట గాదు చెక్కు; లో
సారసనేత్ర, నాకొఱకు సారెకు వేఁడెదు జాడ లన్నియున్, 182

*అర్థము* :— ఓ సారసనేత్ర = తామరలవంటి కన్నులుకల ఓ సుభద్రా, శారిక = ఆ గోరింక, కేలు = (నీ) చేతిని, అంటుట = పట్టుకొనడము, హారికంకణము = మనోహరమైన నీ కంకణములయొక్క, సద్దునకు = ధ్వని (వినడం) కోసము (అని నీవనుకుంటున్నావేమో), కాదు = అందుకోసము కాదు; అంచ = ఆ హంస, పదంబులన్ = నీ పాదాలను, చేరుట = సమీపించడము, మంజీర = నీ కాలి అందెలయొక్క, ఝుళంఝుళ ధ్వనికి = ఝుళంఝుళ అనే శబ్దము (వినడము) కోసము (అని అనుకుంటున్నావేమో), కాదు; శుకము = ఆ చిలుక, చెక్కులన్ = నీ బుగ్గలను, అనుట = తాకుతుండడము, వాగ్ధోరణి = మాటల తీరులోని, మాధురీ మహిమకున్ = తీయదనముయొక్క అతిశయము (చూడడము) కోసము (అని అను

కుంటున్నావేమో), కాదు; అన్నియుఁ = ఈ శారికా హంసా చిలుకా మూడున్నూ. నాకొఱకు = నన్ను గురించి - నన్ను కరుణించమని. సారెకు = మరల మరల. వేఁడెడు = ప్రార్థిస్తున్న. జాడలు = విధములే (కాని, మరేమీ కాదు).

తాత్పర్యము :— ఆ గోరింక నీ చేయిపట్టడము నీ కంకణాల చప్పుడు వినాలని కాదు, ఆ హంస నీ పాదాల నాశ్రయించడము నీ అందెల ధ్వనులు నాశించికాదు. ఈ చిలుక నీ బుగ్గలు తాకుతూ ఉండడము నీ మాటల తీయదనము కోసము కాదు; ఇవన్నీ నీవు నన్ను అనుగ్రహించవలసిందని ప్రార్థిస్తున్నాయి సుమా.

విశేషము :— పై 157వ 'కంగులీ దీర్చిన పై తీసీ అవిక......' అన్న పద్యములో చిలుక సుభద్ర ముంజేతిపైనుంది; హంస పాదాలు తొక్కుతూ ఉంది. ఆ చిలుకే (చేదోడు వాదోడు) బుగ్గలు తాకుతూ ఉంది. చిలుక గోరింక అన్న మాటలు సమానార్థములోనే (లింగ భేదము పాటించకుండా) కవులు వాడడం కద్దు. ఆ పక్షులే కాని వేరే ఇంకొక పక్షి వచ్చినట్టు భావించరాదు. ఈ రెండు పక్షులూ చేస్తూన్న పనులు మనకు తెలుసును.

ఒకరిని ప్రార్థించినప్పుడు కొందరు చేతులు పట్టుకుంటారు, కొందరు కాళ్లపై బడతారు, కొందరు బుగ్గలు పట్టుకొని బతిమిలాడతారు. ఇవి ప్రార్థించే విధాలు.

ఈ పద్యములో చిలుక చేయి పట్టుకుంది, హంస కాలు పట్టుకుంది, చిలుక బుగ్గ తాకుతుంది. ఆ పద్ధతులే ఈ పక్షు లవలంబించాయని చమత్కారము.

అలంకారము :— అపహ్నుతి.

"చిలుకల కొలి కిది నాతోఁ
పలుకంగాఁ గొంత సిగ్గు పడియెడు, ముంజే
చిలుకా, నీతో నైనను
బలుకంగా రాదె ! పలుకు బంగా రఁటవే ?" 183

ముంజేతి చిలుక చేదోడూ వాదోడూ కాబట్టి ఆ చిలుక సాయం తీసుకుంటున్నాడు అర్జునుడు.

అర్థము :— చిలుకల కొలికి ఇది = ఈ చిన్నారి చిలుక వంటి సుభద్ర, నాతోన్, పలుకంగాఁ = మాటలాడడానికి, కొంతసిగ్గు పడియెడుఁ = కొంచెము సిగ్గు పడుతూ ఉంది, ముంజే చిలుకా = ముంజేతిపైనున్న చిలుకా, నీతోనైనను, పలుకంగాఁ రాదె = పలుకగూడదా?, పలుకు = మాటే, బంగారు అటవే = బంగారమా ? అంత అపురూపమయిందా ?

తాత్పర్యము :— నాతో చెప్పడానికి సుభద్రకు సిగ్గయితే ముద్దుచిలుకా, నీతోనైనా చెప్పరాదా ! మాటే అంత అపురూపము కావాలా ?

*విశేషము* :— పలుకు బంగారమా : బంగారము లాగా భద్రబరచ వలసిందా అని.

"నేను పై వాడను కాబట్టి సిగ్గు; కాని, నీవు చిలుకవు. ఆమె చిలుకలకొలికి. ఆ సంబంధము చూచయినా నీతో చెప్పరాదా అని భావము.

*అలంకారము* :— లోకోక్తి, పరికరము.

"రతికిన్, భారతికిన్ వినోద కథలం బ్రాగల్భ్యముం జూపి, త
త్పతులం గూరిచి, మాట వాసిఁ గను పెద్దల్ గారె మీ వార; లా
చతురత్వం బిటఁ గొంత కానఁబడ నీ చంద్రాననన్ గూర్చి, నన్
బ్రతికింపం గదె ముద్దుఁ గీరమ! సుధా బంధూ భవ ద్గీరమా !"184

*అర్థము* :— సుధా...రమా—సుధా = అమృతమునకు, బంధూభవత్ = చుట్టము అవుతున్న (అంత మధురంగా ఉన్న) గీః = మాటలయొక్క, రమా = సంపదగల, ముద్దు కీరమా = ముద్దులొలుకుతున్న చిలుకా, మీ వారలు = మీ వంశములోని వారు, రతికిన్ = రతీదేవికీ, భారతికిన్ = సరస్వతీదేవికీ, వినోద కథలన్ = వేడుక కలిగించే కతలతో, ప్రాగల్భ్యమున్ = నేర్పును, చూపి, తత్పతులన్ = వారి భర్తలను, - మన్మథ బ్రహ్మదేవులను, కూరిచి = కలిపి, మాటవాసిన్ = పొగడ్తను (మాట నేర్పరి తనమును), కను = పొందినట్టి, పెద్దల్‌కారె = పెద్దలే కదా, ఆ చతురత్వము = ఆ నేర్పరితనమును, ఇటన్ = మా విషయములో, కొంత, కానఁబడన్ = కనబరిచి, ఈ చంద్రాననన్ = ఈ చంద్రముఖిని, కూర్చి = నాతో కలిపి, నన్ బ్రతికింపంగదె = నన్ను బ్రతికించుమీ.

*తాత్పర్యము* :— ఓ ముద్దుల చిలుకా, రతీ సరస్వతులు ప్రణయ కలహములందు భర్తలతో మాట్లాడక అలిగినపుడు మీ వంశమువారు వినోదకరమైన కథలను నేర్పుతో చెప్పి, వారు తిరిగి భర్తలతో కలిసేటట్టు చేసి ఆ మన్మథ బ్రహ్మదేవుల పొగడ్తలు సంపాదించారు. ఆ మాట నేర్పునే మా విషయములో కొంత కనబరచి ఈ సుభద్రను నాతో కలిపి నన్ను బ్రతికించుమా అని చిలుకను అర్జునుడు కోరాడు.

*విశేషము* :—సుధా బంధూ భవద్గీరమ : అమృతముతో సమానమయిన మాటలు కలది, కాబట్టి ఈ చిలుకను నీ మాటల అమృతముతో నన్ను బ్రతికించు అని కోరాడు. లేకుంటే నేను బ్రతుకను అని సూచన.

పింగళి సూరన్న కళాపూర్ణోదయములోనూ ప్రభావతీ ప్రద్యుమ్నములోనూ రతీ సరస్వతుల దగ్గర చిలుకల ప్రశంసలున్నాయి.

భారతీదేవి ముంజేతి పలుకు చిలుక
నమద గజయాన సబ్రహ్మచారి మాకు.

—శృంగారనైషధము.

అలంకారము : — పరికరము, యమకము.

"చంపకగంధి మోవి సరసంబగు బింబ మటంచు వట్టి తే
లింపు తెలుంగుతోఁ దమి దలిర్పఁగఁ బల్కినఁ జెక్కు గీఁటి ని
న్నింపున ముద్దుపెట్టుకొని యెన్నఁడు మన్ననసేయ నున్నదో ?
పెంపుడుఁ జిల్క, నిన్ను దనిపింతు జుమీ చెలి నన్ను నేలినన్," 185

అర్థము :— చంపకగంధి = సంపెంగపూల తావిగల సుభద్ర యొక్క. మోవి = అధరము, సరసంబు అగు = రసముతో కూడి యున్న. బింబము = దొండపండు. అటంచున్ = అని, వట్టితేలింపు ఎలుంగుతోన్ = మిక్కిలి దీనమైన కంఠస్వరంతో. తమి = మక్కువ. తలిర్పఁగన్ = చిగిరించినట్లు. పల్కినన్ = నీవు అడుగుతుండి నప్పుడు. చెక్కున్ గీఁటి = నీ చెక్కిలినొక్కి (ముద్దుచేతా కనికరముచేతా). నిన్ను. ఇంపునన్ = ఇంపుగా. ముద్దు పెట్టుకొని, ఎన్నడు మన్నన చేయన్ ఉన్నదో = ఎప్పుడు నిన్ను గౌరవించగలనో కదా. పెంపుడు చిల్క, చెలి, నన్ను. ఏలినన్ = పాలించినయెడల, నిన్నున్, తనిపింతున్ సుమీ = సంతృప్తి పరుస్తాను సుమీ - నీకు కావలసినన్ని ముద్దులు (దొండపండ్లు) పెట్టిస్తానుసుమా.

విశేషము :— అర్జునుడు చిలుక పాయముకోరి లంచమిస్తానని మంచి చేసుకుంటున్నాడు.

సుభద్ర తనకు ప్రసన్నమయినట్లైతే, చిలుక కోరినవన్నీ ఇస్తానని వాగ్దానము చేస్తున్నాడు.

పాఠాంతరము :—

1. "...బింబ మటంచు బట్టి తేలింపు...."

— తిరుపతివారూ, కృష్ణమాచారిగారూ.

2. ...'నిన్ను మరపింతు జుమీ చెలి నన్ను నేలినన్'

— కృషమాచారిగారు.

చెలి నిన్ను మరచిపోయినట్లు చేస్తానని అర్థము. పాయం కోరేవాడు ఈలా అనకూడదు కదా.

అని కేళిశుకముఁ బలికిన
మన మలరం గలికి పలికె మాటల తియ్యం
దన మింతం తనఁ గూడని
తన యధర సుధా సమగ్రతం దెలుపంగన్, 186

*అర్థము* :— అని = ఈ ప్రకారము అర్జునుడు, కేళిశుకమున్ = పెంపుడు చిల్కను గూర్చి, పలికినన్ = అనగా, మనము = (సుభద్ర) తనమనస్సు, అలరఁగన్ = వికాసముపొంది నందువల్ల, మాటల, తియ్యందనము, ఇంత అంత అనగూడని = పరిమితి చెప్పలేనంత అధిక ముగా, తన, అధర సుధా సమగ్రతన్ = మోవియందలి అమృతము యొక్క నిండుతనాన్ని తెలుపునట్లు, కలికి = ముద్దుగుమ్మ, పలికెన్...

*తాత్పర్యము* :— చిలుకతో చెప్పినమాటలకు సంతోషించి సుభద్ర తన మాటల మాధుర్యము తేటపడినట్టు ఇలాగు పల్కినది.

*విశేషము* :— పెదవులనుండి వస్తున్న మాటల తీయదనాన్ని బట్టి ఆ పెదవులలో ఎంత అమృతము నిండి ఉన్నదో తేటపడుతుందని భావము.

*అలంకారము* :— ఉత్ప్రేక్ష, అనుప్రాసము.



"మేరలా యివి మీయంత వారలకును ?
బెద్ద లున్నా రెఱిఁగి వారె పెండ్లిసేయఁ
గలరు, వేగిరపా టింత వల దటంచు
విన్నపము సేయరాదె యో చిన్ని చిలుక" 187

సుభద్ర గూడా చిలుకను మధ్య నుంచుకొనే తన అభిప్రాయాన్ని తెలుపుతూ ఉంది.

*అర్థము* :— "మీ యంత వారలకును = మీ వంటి సుప్రసిద్ధులకు, ఇవి మేరలా = మర్యాదలగునా ? పెద్దలు ఉన్నారు, ఎఱిఁగి = సంగతి తెలుసుకొని, వారే పెండ్లి సేయగలరు; ఇంత, వేగిరపాటు = తొందరపడడము, వలదు = వద్దు, కూడదు, అటంచు = అని, ఓ చిన్ని చిలుకా, విన్నపమున్ చేయరాదే = మనవి చేయకూడదా".

*విశేషము* :— పై|172వ పద్యములో, వేమారు గ్రుచ్చి గ్రుచ్చిపుడేమీ యడిగెదవు... అని అర్జును డనినది మొదలు ఇప్పటివరకు ఆమె ఒక్కమాటగూడా అనలేదు. మౌనం అర్ధాంగీ కారముగా అర్జునుడు గ్రహించాడు. ఇప్పుడు ఆ మౌనం మాని చిలుకతో మాటలాడింది.

పెద్దలున్నారు. ఈ సంగతి తెలిసి వారే _ మనము ఏమీ శ్రమపడకుండానే - పెండ్లి చేస్తారు. ఇంతలో వేగిరపాటు ఇంతవలదు అనడముతో సుభద్ర పెండ్లికి తన సుముఖత ప్రకటించింది. అంతేకాక, తన ఉచితజ్ఞత - పెద్దలయందు గౌరవము, అర్జునునియందు అనురాగము వ్యక్తమవుతున్నాయి.

*పాఠాంతరము :—*

"పెద్దలున్నారు వారెఱ్ఱి పెండ్లి సేయగలరు"

— వేదంవారు,

పై 186 వ పద్యములో చెప్పిన ఇంతింతనరాని తీయందనము 'వారెఱ్ఱి' అన్నప్పుడు కనబడదు. అంతే కాకుండ 'ఎరిగి వారే' పెళ్ళిచేస్తా రనడము తన విశ్వాసాన్ని తెలుపుతుంది. తరువాతి పద్యములో సూచించిన 'ఉచితరీతి, రసికముద్ర' కానవస్తాయి.

అని యుచిత రీతి వెలయఁగ నాడు నాతి
రసిక ముద్రకు మిగుల మానసము గరఁగఁ,
బై పయిం బ్రేమ యగ్గలంబై పెరుగఁగ,
న వ్వధూటి నొడంబడ ననుఁ గిరీటి, 188

*అర్థము :—* అని = పై చెప్పినట్లు, ఉచితరీతి వెలయఁగన్ = ఉత్తమస్త్రీలకు యోగ్యమైన విధము స్పష్టమయ్యేలాగా, ఆడు = పలుకుతున్న, నాతి = సుభద్రయొక్క, రసిక ముద్రకుజ = సరస లక్షణమునకు, మిగులన్ = మునుపటికన్నా అధికంగా, మానసము కరఁగన్ = మనస్సు అనురాగమును పొందగా, పై పయిజ = అత్యంతముగా, ప్రేమ, అగ్గలంబై = అతిశయమై, పెరుఁగఁగన్ = అభివృద్ధిని పొందుతుండగా, కిరీటి = అర్జునుడు, అవ్వధూటిజ = ఆ సుభద్రను, ఒడంబడజ = ఒప్పుకొనునట్లు చేయుటకు, అనున్ = ఈక్రింది విధముగా చెప్పును....

*విశేషము :—* పైని చెప్పిన సుభద్ర పలుకులలోని ఔచితీ, రసికతా అర్జునుడు గ్రహించాడు; అందువల్ల అతని ప్రేమ మరింత అధికమయింది; ఆమెను ఒప్పించడానికి అర్జునుడు ఈ క్రింది విధంగా అన్నాడు.

*పాఠాంతరము :—*

"నవ్వధూటి నొడంబడుమనుచు గ్రీడి"

—తిరుపతివారు.

*అలంకారము :—* అంత్యానుప్రాసము.

"మీ వా రెఱుఁగుట యెన్నఁడు ?
కావించుట యెన్నఁ డింకఁ గల్యాణంబున్ ?
నీ వేల జంపు నడపెదు ?
రావే మారాడ కిందు రాకేందు ముఖీ !" 189

అర్థము :— మీవారు, ఎఱుఁగుట, ఎన్నఁడు ? ఇంక ఎన్నఁడు = ఇంకెప్పుడు, కల్యాణంబున్, కావించుట = చేయుట, నీవు, ఏల, జంపు = ఆలస్యము, నడపెదు = చేసెదవు? రాక ఇందుముఖీ = పూర్ణిమా చంద్రుని వంటి ముఖము కలదానా, ఇందు = ఇక్కడకు _ ఈ వేదికపైకి, మారాడక = అడ్డుసెప్పక, రావే.

విశేషము :— మీ వారెరుగుట ఎప్పుడు, ఇంకెప్పుడు పెళ్లి చేస్తారు ? అనడములో 'అదంతా కొంత కాలం పడుతుంది' అని; నువ్వెందుకు ఆలస్యము చేయడము.

ఈ పద్యంలో అర్జునుని ఆతురతా 'నువ్వే కావాలని ఆలస్యం చేస్తున్నా' వని సుభద్రపై నిందా వ్యక్తమౌతున్నాయి; అలాగైనా ఆమె త్వరపడుతుందేమో అని.

"నన్ను గాంధర్వంబునను బెండ్లి యాడవే
నీ గ్గేల పడియెదే చిగురుఁబోణి ?
రతిఁ దేల్చి మదన సామ్రాజ్య మేలింపవే
తల యేల వంచెదే జలజగంధి ?
చెలులు వచ్చెదరు నా తలఁపు లీడేర్పవే
తడ వేల చేసెదే ధవళనయన ?
మది నిచ్చగించి నా మనవి యాలింపవే
దడ వేల పోయెదే కంబుకంఠి ?
మనసు దాఁపంగ నేటికే యనుపమాంగి ?
చలము సాధింప నేటికే చంద్రవదన ?
మాఱు మాటాడ వేటికే మధురవాణి ?
చింత సేయంగ నేటికే దంతిగమన ?" 190

అర్థము :— ౧. గాంధర్వము = అష్టవిధ వివాహాలలో ఒక విధము, క్షత్రియులకు గాంధర్వ, రాక్షసములే అత్యుత్తమము లని భారతము.

గాంధర్వ విధిని, నన్ను, పెండ్లియాడవే. చిగురుఁబోణి = చిగురువంటి సుకుమార మైన శరీరము కలదానా, సిగ్గు ఏల పడియెదే ?

౨. రతిఁ = క్రీడయందు, తేల్చి = ఆనందింపజేసి, మదన సామ్రాజ్యము = మన్మథునియొక్క రాజ్యమును, ఏలింపవే = పాలించునట్లు చేయుమా, జలజగంధి = పద్మమువంటి పరిమళముగలదానా, తల ఏల వంచెదే ?

౩. తలఁపులు = నా ఊహలు, ఈడేర్పవే = సఫలము చేయవే, చెలులు, వచ్చెదరు, (ఆలస్యము చేయకు అని), ధవళనయన = తెల్లని కన్నులుగలదానా, తడవు ఏల చేసెదే,

౪. మదిఁ = మనస్సునందు, ఇచ్చగించి = అంగీకరించి, నా మనవి = నా ప్రార్థనను, ఆలింపవే = వినుమా, కంబుకంఠి = శంఖమువంటి కంఠము కలదానా, కడకు = దూరముగా, ఏల పోయెదే ?

అనుపమ అంగి = సాటిలేని శరీరసౌందర్యము కలదానా, మనసును = కోరికను, దాఁపంగన్ = దాచడము, ఏటికే ? చంద్రవదన = చంద్రునివంటి ముఖము కలదానా ? చలము సాధింపనేటికే = పట్టుదల కొనసాగించుట ఎందుకు ? మధురవాణి = తియ్యని మాటలు కలదానా, మాఱుమాటాడవు = బదులైనా చెప్పవు, ఏటికే ? దంతిగమన = ఏనుగు నడకవంటి నడక కలదానా, చింత సేయంగఁ = ఈ ఆలోచించడమంతా, ఏటికే = దేనికోసము ?

*విశేషము* :— సీస పద్య చరణాల మొదటి భాగములో అర్జునుడి ప్రార్థనా, రెండో భాగములో ఆ మాటలవిన్న తరువాత సుభద్ర ఏమి చేసిందో ఆ వివరణా కవి నేర్పుతో జోడించాడు. గాంధర్వమున పెండ్లియాడవే అన్నప్పుడు ఆమె సిగ్గుపడ్డది, రతిని తేల్చమన్నప్పుడు తల వంచింది......అని గ్రహించాలి. ఇది నాటక రచనా పద్ధతి.

అర్జునుడు పై 177 వ పద్యములో పట్టుకున్న సుభద్రచేతిని ఇంకా విడిచి పెట్టలేదన్న మాట మరవకూడదు.

"గబ్బిమరుఁ డానవెట్టుక
గొబ్బునఁ బైఁబడును; నీవుఁ గూడని వార్తల్
సుబ్బినఁ గార్యంబెక్కడఁ
దబ్బిబ్బోకా, కపూర్వ తనుబిబ్బోకా." 191

*అర్థము* :— అపూర్వ తను బిబ్బోకా = అపూర్వమైన శరీరవిలాసము కలదానా, గబ్బిమరుండు = గర్వించియున్న మన్మథుడు, ఆనవెట్టుక = ప్రతిజ్ఞ చేసి, పూనికతో, గొబ్బునఁ = మిక్కిలివేగంతో, పయిఁ పడును; నీవు, కూడని వార్తల్ = సరికాని మాటలు, (అంగీ

కారము తెలుపని మాటలు), నుబ్బినఁ = పలికినయెడల, తబ్బిబ్బో కాక = ఎచ్చు తగ్గులు కాకుండా, కార్యంబు = మన యిష్టార్థము, ఏకదఁ = ఎట్లు చేకూరును.

*విశేషము* :— (నీవు అన్ని మాటలు చెప్పినా ఫలితంలేదు. మన్మథుడు పూనికతో ఎప్పుడైనా పై బడగలడు అని అర్జునుడి భావము.

శృంగార చేష్టలలో బిబ్బోకము ఒకటి. "వరుని కథయం దనాదర మరయగ బిబ్బోక మయ్యె"; ఇక్కడ కూడా అనురాగము కలిగి ఉండీ, అనాదరణము చూపు సందర్భములో ఈ సంబోధన ఉచితంగా ఉంది.

*పాఠాంతరము* :—

1. "గబ్బిమరు డొలపెరుగక.."
2. "గబ్బిమరు డొరవెరుకక.."

— వేదంవారు.

రెంటికీ తొందరపాటుతో అని అర్థము.

3. గబ్బిమరుఁ డానపెట్టిన -

— తిరుపతివారు.

4. ..తబ్బిబ్బోకా యపూర్వ తను బిబ్బోకా.

— తిరుపతివారు.

దీని అర్థము ఎక్కడ తారుమారో కాదా ! అని.

*అలంకారము* :— అంత్యానుప్రాసము.

"మీఁదట వియోగ సాగర
మీఁదఁ గలవా ? లతాంగి యేమెఱుఁగ; వయో !
'యీఁదా' దన్నను మదనుఁడు
'కోఁదా' డను వాఁడు; బిగువు కొనసాగు నొకో." 192

*అర్థము* :— మీఁదఁ = ఇకమీదట, వియోగసాగరము = ఎడబాటు అన్న సముద్రమును, ఈఁదఁ కలవా = (ఒడ్డుచేరే వరకు) ఈదగలవా, లతాంగి = తీగవంటి శరీరముకల దానా ? అయో = అయ్యో ! ఏమి ఎఱుఁగవు = వట్టి అమాయకురాలవు, (నీవు) యీఁదాడు = ఒకరకము తాటిచెట్టు, అన్నను = అనినీవంటే, మదనుఁడు = మన్మథుడు, కోఁదాడు = కాదు కా దిది మరొక రకమైన కోదాడన్న తాటిచెట్టు, అనువాడు = అని అనేవాడు, అనగా, నీవొక

టంటే వాడు మరొక టంటాడు. నీవనుకున్న విధంగానే తలచేవాడుకాడు – ఎప్పుడూ అడ్డుతగిలే వాడే. బిగువు = నీ బింకమూ, పట్టుదలా, కొనసాగునొకో = కొనసాగుతుం దనుకుంటున్నావా? (సాగదు సుమా అని హెచ్చరిక).

*విశేషము* :— నా కోరిక కాదని నీవు అంతఃపురానికి పోతే తీరిపోతుందని అనుకుం టున్నావు గాబోలు. పిచ్చిదానా నీకు తెలియదు. విరహ సముద్రం నిన్ను ముంచేస్తుంది. దాని నీదలేవు సుమా.

ఈదాడంటే కోదాడంటాడు – ఇదిఒక లోకోక్తి. ఎప్పుడూ ప్రతికూలంగా ప్రవర్తించే వాడిని గురించి దీనిని ఉపయోగిస్తారు. నీవు తొందరపడరాదని అనుకున్నా, మన్మథుడు నిన్ను ఆలాగుండనీయడు. తొందర పెడతాడు.

ఈదాడు, కోదాడు అన్నవి రెండురకాల (తాడులు) తాటిచెట్లు. కొందరు ఈదాడు కోదాడు అన్నవి రెండుగ్రామాలని అంటారు.

వియోగసాగరము ఈదలేవు అని చెప్పుతూ ఆమెను 'లతాంగి' అనడము అందముగా ఉంది.

*అలంకారము* :— లోకోక్తి, యమకము.

ఏలే యాలేఖ్యాకృతి?
యేలే ప్రాలేయకర ముఖీ చూడ వయో?
యేలే శైలేయ స్తని?
యేలే బాలేందు నిటల! యేలాఁతి నఁటే? 193

*అర్థము* :— ఆలేఖ్యాకృతి = చిత్తరువులోని ఈ ఆకారము (మాటలాడకుండా ఉండడము), ఏలే = ఎందుకు వహించావు? ప్రాలేయకర ముఖీ = చంద్రవదనా, చూడవు, అయో = అయ్యో, నావైపు చూడనైనా చూడవు, ఏలే = ఎందువల్ల? శైలేయ స్తని = పర్వత ముల పోలిన స్తనములు కలదానా, ఏలే = ఎందుకో చెప్పరాదా? బాలేందునిటల = బాలచంద్రుని వంటి నుదురు కలదానా, ఏలే = నన్ను పాలించవే, ఏన్ = నేను, లాఁతినఁటే = పరాయి వాడనా? (నీ మేన బావనే కదా అని)

*తాత్పర్యము* :— చిత్తరువులాగా మాటలాడవేమి, నావైపు చూడనైనా చూడ వెందుచేత, ఎందుకో చెప్పరాదా? నేను పైవాడనుకాను, నీ మేనబావనేకదా, నన్ను ఏలుకో అని భావము.

*విశేషము* :— కవి శబ్దాలంకార వ్యామోహములో వ్రాసిన పద్యము. ఇటువంటి సందర్భములో ఏల అన్నది రెండు మూడుసార్లు ఉపయోగించడము వ్యవహారములో ఉంది.

వేదమువారు "ఏలే యాలేఖ్యాకృతియే = చిత్తరుప్రతిమ యొక్క ఆకారమే ఏలే...'' అనీ, లే - లేవే. ప్రాలేయకరముఖీ అనీ కొంత చమత్కారము చూపించారు.

*అలంకారము* : అనుప్రాస.

ఆ హార మింపౌ కుచాగ్ర మూనక యున్న
నాహార మింపుగాఁ దబ్జవదన ;
చెఱకు పా లొదవు వాతెఱ యీనిచోఁ గంతు
చెఱకు పా లౌదునే చిగురుఁబోఁడి ;
కళలు దేఱెడు నెమ్మొగంబు ముద్దిడ కున్నఁ
గళలు దేఱవు సుమీ కంబుకంఠి ;
వలఱేని దురమున నలరింప కున్న న
వ్వాల రే నిదుర రాదు కలువకంటి ;
నేఁడు కాదు గదే ప్రేమ నీకు నాకు,
నాటి యున్నది మదిఁ జిన్న నాఁటి నుండి,
యిటుల నేకాంత సమయ మెన్నఁటికి దొరకు ?
నేల తప్పించు కొనియెదవే లతాంగి ? 194

*అర్థము* :— ౧. అబ్జవదన = పద్మమువంటి ముఖము కలదానా, ఆ హారము (ల చేత) ఇంపు ఔ = మనోహరమయిన, కుచఅగ్రము = చనుమొనలను, అనకఉన్నగా = పట్టకుండిన యెడల, ఆహారము = భోజనము, ఇంపుకాదు = రుచించదు;

౨. చిగురుఁబోఁడి = చిగురువంటి మేను కలదానా, చెఱకుపాలు = చెఱకు పానకము వంటి రసము, ఒదవు = కలిగిఉన్న, వాతెఱ = అధరమును, ఈనిచోన్ = నీవీయకున్న యెడల, కంతు = మన్మథునియొక్క, చెఱకు = ధనస్సు అయిన చెఱకుయొక్క, పాలుఔదును = బారిని పడుదును. (చెఱకు = నిర్బంధమునకు అని గూడా).

౩. కంబుకంఠి = శంఖమువంటి కంఠము కలదానా, కళలు = లావణ్యము, తేఱెడు = ప్రకటించుచున్న, నెమ్మొగంబు = అందమగు మొగము, ముద్దు ఇడక ఉన్నగా, కళలు = జీవ కళలు, తేఱవు సుమీ = తేరుకొనవు సుమా.

ళ. కలువకంటి = కలువలవంటి కనులు కలదానా, వలతేని = మన్మథుని, దురము నన్ = యుద్ధమునందు (సంభోగమునందు), అలరింపకున్నన్ = నన్ను తృప్తిపరచని యెడల, అవ్వలన్ = తరువాత, రే = రాత్రులందు, నిదురరాదు;

నీకు, నాకు, ప్రేమ, నేఁడు గాదు గదే ; చిన్న నాఁటినుండి, మదిన్ = మన మనసు లలో, నాటియున్నది = నాటుకొని ఉన్నది ; ఇటులన్, ఏకాంత సమయము, ఎన్నటికి, దొరకున్, లతాంగి = లతవంటి శరీరము కలదానా, ఏల తప్పించుకొనియెదవే = తప్పించు కొనుటకు ఎందుకు ప్రయత్నిస్తావు ?

*విశేషము* :— తొందరపడి నన్నంగీకరింపక పోయినట్లయితే తర్వాత నీవు గూడా విరహంతో బాధపడతావు సుమా అని అర్జునుడు సుభద్రను హెచ్చరిస్తున్నాడు.

*అలంకారము* :— శ్లేష, యమకము.

అని బాహా పరిరంభ సంభ్రమ రసాయత్తైక చిత్తంబునన్
దను నీక్షింప, నెఱింగి యందియల మ్రోఁతన్ గేకినుల్ రా, 'సఖీ
జను లేతెంచి' రటంచు వే మొఱఁగి హస్తంబున్ విడంజేసి నే
ర్పునఁ దప్పించుక పోవ భూవరుఁ డనుం బూఁబోఁడికిం గ్రమ్మఱన్,

*అర్థము* :— అని = అర్జును డిట్లు పలికి, బాహా...చిత్తంబునన్-బాహా = భుజముల తోడి, పరిరంభ = కౌగిలించుట కొరకు, సంభ్రమ = తొందరపాటుయొక్క, రస = తమకము నకు, ఆయత్త = అధీనమైన, ఏకచిత్తమునన్ = ఒకేఒక అభిప్రాయముతో, తనున్ = సుభద్రను, ఈక్షింపన్ = అతడు చూడగా, ఎఱింగి = (ఆ అభిప్రాయమును) గ్రహించినదై, (ఆ సమయంలో), కేకినుల్ = తన పెంపుడు ఆడునెమళ్లు, అందియల మ్రోఁతన్ = (వాటి కాళ్లకు అలంకారంగా కట్టిన) అందెల చప్పుడుతో, రాన్ = వచ్చుచుండగా, "సఖీ జనులు = అదిగో ! చెలికత్తెలు, ఏతెంచిరి = వచ్చిరి"; అటంచు = అని చెప్పి, మొఱఁగి = మోసగించి, హస్తంబున్ = చేతిని, విడన్‌చేసి = విడిపించుకొని, నేర్పునన్ = చమత్కారముగా, తప్పించుక పోవన్ = సుభద్ర తప్పించుకొని పోవుచుండగా, భూవరుఁడు = అర్జునుడు, క్రమ్మఱన్ = మరల, పూఁబోఁడికిన్ = ఆ కుసుమగాత్రికి, అనున్ = ఈ క్రింది విధంగా అనును......

*విశేషము* :— అర్జునుడు సుభద్రను చేయిపట్టుకొని ఉన్నాడు. అతఁడుపయోగించిన పదాలను పట్టి అతని సంబోధవలనుపట్టి అతని దృష్టి ఏయే అవయవాల ఏయే గుణాలమీద ప్రస రించిందో తేటపడుతుంది. 'ఏల తప్పించుకొనియెదవే లతాంగి' అన్నంతవరకు ఆమెనుండి ఏమీ బదులుగాని, అంగీకారముగాని, బయటపడలేదు. కామ ముద్రేకిస్తూ ఉంది. మార్గాంతరం ఆలోచించాడు.

ఆ ఆలోచనతో చూడడాన్నే 'బాహా పరిరంభ సంభ్రమ...' అని కవి చాలా సమంజస ముగా వర్ణించాడు స్త్రీ సహజమయిన బుద్ధిచేతనూ, తనకున్న ఇంగిత జ్ఞానముచేతనూ ఆ చూపులలోని అర్థము గ్రహించి అతడు అమాంతంగా ఆలింగనము చేసేసుకుంటా డని అవగా హన చేసుకుంది. బెదిరి పోయింది.

అంతలో కాళ్ల అందెల ధ్వని వినవచ్చింది ప్రాణము లేచివచ్చింది. 'అదిగో చెలులు వచ్చారు' అని బొంకింది, అర్జునుడు గూడా అవు ననుకున్నాడు, పట్టువిడిచిపెట్టాడు, సుభద్ర సమయస్ఫూర్తిని మెచ్చినవారు ఆమెకు అసత్యదోషం అంటకట్టరు.

శ్రీనాథుడూ పింగలి సూరన్న తమ కావ్యాలలో పక్షులతో కొంత పనిచేయించారు, అవి మనుష్యుల భాషలో మాటలాడి కథా కార్యాన్ని నడిపించాయి. మన కవి గూడా పక్షుల సాయము తీసుకున్నాడు; కాని, వాటిచేత మాటలాడించ లేదు. పెండ్లి ప్రస్తావనకోసం రాజకీరాన్నీ హంసనీ ఉపయోగించాడు. కామోద్రేకముతో మహోన్నితంగా ఉన్న ఈ సన్నివేశము నుండి బయట పడడానికి గూడా అందెల కేకినులను ఉపయోగించాడు. కలపడానికీ విడదీయడానికీ పక్షులు ఉప కరించాయి.

సుభద్ర 'ఏమెరుగని' ముద్దరాలే, అయినా, ఆ సన్నివేశము ఆమెకు ఆ గడుసుతనాన్ని - నేర్పును - కలుగజేసింది.

"కలహంస కేకి శుకములు
పిలపిల నేతేర నీవు పెంచిన వనిగా
తలఁచెదవు: మరుఁడు పైఁ గా
వలిఁ బెట్టిన దెఱిఁగి, తిరుగు వనజాతముఖీ"॥ 196

అర్థము :— వనజాతముఖీ = పద్మమువంటి ముఖముకలదానా, సుభద్రా, కలహంస కేకి శుకములు = హంసలు, నెమళ్ళు, చిలుకలు, పిలపిలన్ = బిరబిర, ఏతేరన్ = రాగా, నీవు పెంచినవి అనిగా = నీవు పెంచినవి అనేకదా, తలఁచెదవు = భావిస్తున్నావు (అంతేకానీ) మరుఁడు = మన్మథుడు, పైన్ = నీపై, కావలిపెట్టినది = నిన్ను బాధపెట్టడానికి సిద్ధంగా నిన్ను కనిపెడుతూ ఉండమని ఈ హంస కేకి శుకములను ఉంచాడన్న సంగతి, ఎఱిఁగి = తెలుసు కొని, తిరుగు = ప్రవర్తించు (మరలి రా అని శ్లేష)

విశేషము :— సుభద్ర అంతఃపురానికి వెళ్ళిందా, పెళ్ళి జరిగినంత వరకు మరి తన దగ్గరకు రాదని అర్జునుడికి తెలుసును, కాబట్టే ఆమెను పోనీయరాదని తాపత్రయము.

అలంకారము :— అపహ్నుతి, శ్లేష.

వెలిదమ్మి కలువ కొలఁకుల
యెల దెమ్మెర లొలయ వాని నెగఁబోయుచు, నో
చెలి! జుమ్మని విరహులకుం
దల దిమ్ము ఘటించుఁ దుమ్మెదల దిమ్మిచటన్." 197

*అర్థము* :— చెలి = సఖీ. వెలి తమ్మి కలువ. కొలఁకుల = తెల్ల తామరలూ కలువలూ ఉన్న, కొలఁకుల = సరస్సుల మీదుగా వచ్చిన. ఎలతెమ్మెరలు = పిల్లవాయువులు. ఒలయన్ వీచుచుండగా. వానిన్ = ఆ పిల్లగాలులను. ఎగఁబోయుచున్ = రేగగొట్టుచు. జుమ్మని = జుమ్మనిరొదచేయుచు. విరహులకున్ = జోడుపీడిన వారికి-వియోగులకు. తుమ్మెదల దిమ్మి = తుమ్మెదల సమూహము. ఇచటన్ = ఈ ఉద్యానవనమున తలదిమ్మున్ = తీవ్రమైన తల నొప్పిని (శిరోవేదనను). ఘటియించున్ = కలిగించును.

*తాత్పర్యము* :— సఖీ. నీవు పోయిన తర్వాత ఒంటరి నైన నన్ను ఈ పిల్లగాలులకు తోడుగా, జుమ్మని చప్పుడు చేస్తూ తుమ్మెదలు బాధిస్తాయిసుమా! వీటి బారినుంచి నన్ను తప్పించు. పోవద్దని వేడుకొంటున్నాడు.

*విశేషము* :— తెమ్మెరలవల్లా తుమ్మెదలవల్లా కలిగే ఈబాధ నా కొక్కడికే కాదు: నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతే. నీకుగూడా కలుగుతుంది సుమా అని సుభద్రను హెచ్చరిస్తున్నాడు.

*అలంకారము* :— యమకము.

"కలకంఠి! నీ కటాక్షము గల్గ నిన్నాళ్లు
మరు శిలీముఖముల నరకు సేయఁ;
గనకాంగి! నీ సమ్ముఖము గల్గ నిన్నాళ్లు
చందమామ నొకింత సడ్డసేయ;
రమణి! నీ ప్రియవచనము గల్గ నిన్నాళ్లు
కలికి రాచిలుక లక్ష్యంబు సేయఁ;
గోమ! నీ కరావలంబము గల్గ నిన్నాళ్లు
లే మావి చిగురాకు లెక్కసేయఁ;
జూడక, మొగంబు ద్రిప్పి, మాటాడక, కిపుడు
చేఁ దిగిచి, పట్టుక పరాకు చెప్పి నపుడె;
యేమి పుట్టునొ కైలాటు మింక మీఁద!
మగువ! దయలేక విడనాడఁ దగునె నీకు?" 198

అర్థము :— ౧. కలకంఠి = సుందరీ. ఇన్నాళ్లూ, నీకటాక్షము గల్గఁగా = నీ కడ కంటి చూపు లాశ్రయముగా జేసికొని, మరు శిలీముఖములఁగా = మన్మథుని బాణములను (లేక తుమ్మెదలను), సరకుసేయఁగా = లక్ష్యపెట్టకుండా ఉన్నాను. (మన్మథుడి వింటి నారి తుమ్మెదలు)

౨. కనకాంగి, ఇన్నాళ్లూ, నీ సమ్ముఖముఁగల్గఁగా = నిన్నెదురుగా చూస్తూ ఉండడంవల్ల (నీవు కనిపిస్తుండడము వల్ల), చందమామను, ఒకింత, సడ్డచేయఁగా = లక్ష్యపెట్టలేదు. (చంద్రుడు మన్మథుడి ఉద్యోగులలో ఒకడు - మేనమామ గూడా)

౩. రమణి, ఇన్నాళ్లూ, నీ ప్రియవచనము = నీ మధురమైన మాటలు, కల్గఁగా = వింటూ ఉండినందువల్ల, కలికి రాచిలుక = ముద్దుచిలుకను - (మన్మథుడి వాహనము చిలుక) లక్ష్యంబు సేయఁగా = లెక్కచేయలేదు.

౪. కొమ్మ, నీ కరావలంబము కల్గఁగా = నీచేతి ఆశ్రయము కలిగి ఉండడంవల్ల, లేమావి చిగురాకు = లేతమామిడి చిగురుటాకును, లెక్కసేయఁగా = లక్ష్యపెట్టలేదు ; (చిగురుటాకు మన్మథుని ఆయుధాల్లో ఒకటి)-చూడక = నన్నుచూడక, మొగంబుద్రిప్పి = ముఖము ప్రక్కకు త్రిప్పుకొని, మాటాడక = నాతో భాషించక, చేదిగిచి = చేతిని వెనుకకులాగి, ఇపుడు, పట్టుక = పట్టుకొని, పరాకుచెప్పినపుడె = నీకు సేవకునిగానున్న సమయములోనే, (నీ వీలా గుంటే) ఇంక మీద, కైలాటము = మోసము, ప్రమాదము, ఏమి పుట్టునొ, మగువ, దయలేక = నాపై జాలిలేకుండా, విడనాడఁగా = విడిచిపోవుట, నీకు, తగునె = తగునా !

(ఇందులో నన్ను చూడక, ముఖము ప్రక్కకు త్రిప్పుకొని, మాటాడక, చేతిని వెనుకకు లాగుకొని తిరస్కరించడం వల్ల నాగతి ఏమౌతుందో ? అనడం సీసపద్యంలోని నాలుగు పాదాలకూ క్రమంగా అన్వయిస్తుంది.)

తాత్పర్యము :— ఇన్నాళ్ళూ నేను నీ చూపులనూ, ముఖాన్నీ, మాటలనూ, చేయూతనూ నమ్ముకొని, నన్ను బాధించే మన్మథ బాణాలనూ, చంద్రుడినీ, రాచిలకనూ, చిగురుటాకునూ, లక్ష్యపెట్టలేదు. ఇప్పుడు - నీ ఆశ్రితుడనని మనవి చేస్తున్న ఈ సమయములోనే - నీవు నన్ను చూడకా, ముఖము చూపించకా, మాటాడకా, చేయిలాగుకొని, ఈలాగున నీవుంటే, ఇకమీద (నీవు వెళ్ళిపోయిన తరువాత) ఆ శత్రువులు నాకు ఏమి ఘోరమైన అవస్థలు కలుగజేస్తారో కదా అని అర్జునుడు తన్ను కరుణించ మంటున్నాడు.

విశేషము :— సుభద్ర కటాక్షములు మన్మథ బాణములకన్నా, ముఖము చంద్రుని కన్నా, మాటలు చిలుక పలుకుల కన్నా, చేయి పల్లవము కన్నా మిన్న అయినవని, అర్జునుని భావము. వీటిని ఆశ్రయించుకొని, మన్మథ బాణాదులకు తాను భయపడకుంటినని అన్నాడు.

ఇన్నినాళ్లూ తనకుండిన రక్షణ సుభద్ర వెళ్లిపోతే ఉండదు. అప్పుడు మన్మథుడూ అతని సిబ్బందీ ఏమి బాధలు పెడతారో అని అర్జును డంటున్నాడు.

పాఠాంతరము :—

"అతివ ! నీయాఖిముఖ్యము గల్గ నిన్నాళ్లు
చందమామ నొకింత సద్ద సేయ..."

"చే దిగిచి పట్టుక పరాకు చేసినపుడె"

అలంకారము :— ఉపమ, క్రమము.

"మొక మెఱుక కలదు గదవే
మకరాంకుని యనుఁగు మేనమామకు నీకుఁ;
'దికమకలు చేయ వల'దను
మకటా ! మేడపయి కేఁగు నపుడైనఁ; జెలీ !" 199

అర్థము :— మకరాంకుని = మన్మథునియొక్క, అనుఁగు మేనమామకు = ప్రియమైన మేనమామ (అగు) చంద్రునికి, నీకుఁ, మొక మెఱుక కలదు గదవే = ముఖపరిచయము ఉన్నదికదా, అకటా ! = అయ్యో, చెలీ = సఖీ, మేడపయి కేఁగునపు డైనఁ = నీవు మేడ మీదికి పోయినప్పుడైనా, 'తికమకలు చేయవలదను'ము = నన్ను కలత పెట్టవద్దని చెప్పు.

తాత్పర్యము :— "నీకు, మన్మథుడి మేనమామ యైన చంద్రుడికీ ముఖపరిచయం ఉందికదా, (నీ ముఖము చంద్రుని పోలి ఉన్నది కనుక, అని), నీవు మేడపైకి వెళ్ళినప్పుడైనా నన్ను బాధించ వద్దని ఆ చంద్రునికి చెప్పు" (మేడ చంద్రమండలము తాకునంత ఎత్తుగా ఉన్నది అని ధ్వని).

విశేషము :— ప్రభువుల దగ్గర ఏదయినా సదుపాయము కావాలంటే, ఎవరైనా ఆ ప్రభువుతో పరిచయమున్నవారు సిఫార్సు (రికమెండ్) చేసి చెప్పాలి. ఆ చెప్పినప్పుడు ఏకాంతముగా ఉండడము గూడా మంచిది.

అధికారుల దగ్గర ఈలాంటి వ్యవహారాలు ఎప్పుడూ జరుగుతూ ఉండేవే కదా.

అని యనేక ప్రకారంబులం దన మనోనురాగంబు తేటపడం బలికినఁ చెలుల నరయు నెపంబునం బరాకు చేసికొని; చిఱుచెమ్మట క్రమ్మ నెమ్మొగమ్ము మకరందబిందు కందళి తారవిందంబు చందంబునం దనర; నరపేఁడు కుచ్చిళ్ల నెత్తి చెక్కుచు, నొక్కింత జాఱు పయ్యెంటఁ జక్కం జేర్చుచు, నొకింత వదలు వేనలి నలవరింపుచుఁ, గొండొక చెదరు పాపటఁ గుదురుకొల్పుచుఁ, జక్కెరవిల్తుం డెక్కడ వెన్నాడునో, యను భయంబునఁ బోలె నించుకించుక తిరిగి చూచుచు,

ననుగత కేకి హంసంబులపై వెగటునం బోలెఁ జలించుచు, నీ యొళవు సకియలకుం
జెప్పకు మని రాచిల్కకుఁ బ్రియంబులు సెప్పుచు, మగతేఁటి యంటి యంటని
ప్రసూన కళిక పోలిక నరవిరి బాగుతోఁ బోలి; కప్పురంపు టనంటుల నంటు ద్రాక్ష
పందిరుల తెరువులఁ బూఁదేనె కాలువలు దాఁటి, చెంగలువ బావుల దగ్గఱి,
కుంకుమ నీటి కేళాకూళి యోర వట్టి, వట్టివేళ్ళ చప్పరంబుల నీడ వ్రీడాభరం బీడిచి
కొని పోవ నివ్విధంబున. 200

అర్థము :— అని, అనేక ప్రకారంబుల, తన మనః అనురాగంబు = మనస్సులోని ప్రేమ, తేటపడం బలికినఁ = స్పష్టమయ్యేట్లుగా అర్జునుడు పలికినగా, చెలులఁ = చెలికత్తెలను, అరయు నెపంబునన్ = వెదకుతున్నట్లు కనబడుతూ, వరాకు చేసికొని = వినీ విననట్లుగా నటిస్తూ, చిఱుచెమ్మట క్రమ్ము, నెమ్మొగమ్ము = చక్కని ముఖము, మకరందబిందుకందళిత అరవిందంబు = తేనె చుక్కలతో వికాసము పొందియున్న కమలము, చందంబునఁ, తనరఁ = ఒప్పుతుం డగా;

అరపీడు = కొంచెము జారిపోతూ ఉన్న, కుచ్చిళ్ళను, ఎత్తి, చెక్కుచు, ఒక్కింతజాఱు, పయ్యంటఁ = పైటను, చక్కం చేర్చుచున్ = సరిదిద్దుతూ, ఒకింత, వదలు = వీడిపోతూన్న, పేనలిన్ = జుట్టుముడిని, అలవరింపుచుఁ = సవరించుకొంటూ, కొందొక = కొంతగా, చెదరు పాపటఁ = చెరిగిన పాపటను, కుదురుకొల్పుచుఁ = సరిచేసుకొంటూ, చక్కెర విల్తుండు = మన్మథుడు, ఎక్కడ, వెన్నాడునో = తఱుముకొని వెంటవచ్చునో, అను భయంబునఁ బోలె = భయముతోనా అన్నట్లుగా, తిరిగిచూచుచు, అనుగత = వెంబడి వస్తూన్న, కేకి హంసంబులపై, వెగటునఁ బోలెఁ = అసహ్యంతోనా అన్నట్లుగా, చలించుచుఁ = కదలుచు, ఈ యొళవు = ఈ సమాచారము, సకియలకున్ = చెలికత్తెలకు, చెప్పకుమని, రాచిల్కకుఁ = ప్రియంబులు, సెప్పుచు = ముద్దుమాటలు చెప్తూ.

మగతేఁటి యంటి యంటని = మగతుమ్మెద చేత తాకీ తాకబడని, ప్రసూన కళిక పోలికఁ = పూవుమొగ్గ విధముగా, అరవిరి బాగుతోన్ = సగము వికసించిన పూవుయొక్క చక్కదనంతో, పోలి = సమానంగా, కప్పురంపు టనంటులఁ = కర్పూరపు అరటిచెట్టుల చేతను, అంటుద్రాక్ష పందిరుల (చేత కప్పబడిన), తెరవుల = మార్గముల, పూఁదేనె = మకరందము యొక్క, కాలువలుదాఁటి, చెంగలువ(లతో నిండిన) బావుల, దగ్గఱి, కుంకుమ నీటి కేళాకూళి = క్రీడా సరస్సు యొక్క, ఓరవట్టి = ప్రక్కదారిగా వెడలి, వట్టివేళ్ళ చప్పరంబుల నీడలో, వ్రీడాభరంబు = లజ్జాభారము, ఈడిచికొని పోవ = కష్టముతో లాగుకొని పోతుండగా, ఈవిధంగా,

*తాత్పర్యము* :— ఈవిధంగా అర్జునుడు పలుకుతుండగా, సుభద్ర సిగ్గుచేత అక్కడ నిలువ లేకనూ, అర్జునుడిని వీడిపోలేకనూ, చెలులను వెదకే నెపముతో, మన్మథు డెక్కడ వెన్నాడుతున్నాడో అన్న భయంతో నన్నట్లుగా వెనుకకు తిరిగి చూచుకుంటూ మందమందంగా ఉద్యానవనంలో సాగిపోయింది.

*విశేషము* :— ఈ వచనంలోనే ఆ ఉద్యానవనం ఎట్లుంటుందో వర్ణించాడు కవి. కొంత దూరం వెళ్ళిన తర్వాత అర్జునుడు కనిపించక పోవడంవల్ల, సుభద్ర, వెనుదిరిగి చూచి నట్లుగా కాక త్వరితగమనమున వెళ్ళడము సూచించాడు కవి.

*అలంకారము* :— ఉపమ, అనుప్రాసము, ముక్తపద గ్రస్తము.

ఆ ఘనుని బాసి మంజీ
రాఘోషము మొరయ నరిగె నంతః పురికిన్
వే ఘనజఘన తళుక్కన
మేఘము నెడఁబాసి పోవు మెఱుపో యనఁగన్. 201

*అర్థము* :— ఆ ఘనునిన్ = ఆ మహాత్ముడైన అర్జునుని, పాసి = వీడి, మంజీర ఆఘోషము = కాలి అందియల శబ్దము, మొరయన్ = ధ్వనిస్తుండగా, అంతఃపురికిన్ = అంతఃపురములోనికి, వే = వేగముగా, తళుక్కన = తళుక్కుమన్న కాంతితో, మేఘము నెడ బాసిపోవు మెఱుపోయనఁగన్, ఘనజఘన = గొప్ప పిరుదులు గల ఆ సుభద్ర, అరిగెన్ = పోయెను.

*విశేషము* :— అర్జునుడు నల్లనివాడు కనుక మేఘమువంటివాడు. సుభద్ర మెరుపుతీగ వంటిది. కనుకనే, అర్జునుడిని వీడిన సుభద్ర మేఘమును విడిచిపోయిన మెరుపులాగా ఉంది. సుభద్ర తళుక్కుని పోవడం, ఆ మెరుపు మెరిసినట్లుగా ఉండడాన్ని సూచిస్తుంది. అర్జునుడిని 'ఘనుడు' అని పేర్కొనడము గూడా, అతడు (గొప్పవాడే కాక) మేఘమువంటి వాడు అని సూచించడానికే. మంజీరా ఘోషము = ఉరుము ఉరిమినపుడే మెరుపు వస్తుంది కనుక, మంజీర ముల ధ్వని ఉరుమువలె ఉన్నదని, అర్జునుడు – మేఘము, సుభద్ర–మెరుపుతీగ, మంజీరధ్వని– ఉరుము అని పోలికలు.

*పాఠాంతరము* :—

'మంజీరాఘోషము మెఱయ..'

వేదమువారూ, తిరుపతివారూ.

దీని అర్థము : కాలి అందెల చప్పుడు వెలయగా అని, ఇక్కడ మెరయ అనడానికి బదులు మొఱయ (అంటే ధ్వనించగా) అనడము న్యాయము, ఉరుముగా సూచించాడు కాబట్టి 'ఆఘోషము' అన్నాడుకవి.

*అలంకారము :—* పరికరము, ఉత్ప్రేక్ష.

ఎటువంటి నేర్పరి నిశా
విటు నల్లుఁడు ! నడుమ నిల్చి వెడ సింగిణిచే
నటు చూ పిటు నిటు చూ పటుఁ
బటు రయముననేసె నాసుభ ద్రార్జునులన్. 202

*అర్థము :—* నిశావిటుని అల్లుఁడు = చంద్రుని మేనల్లుడైన మన్మథుడు, ఎటువంటి నేర్పరి! = ఎంత నేర్పుగలవాడు! నడుమనిల్చి = సుభద్రార్జునుల మధ్యమునిలిచి, వెడసింగిణిచే = చెఱకు వింటితో, అటు చూపి ఇటు = సుభద్రను చూపి అర్జునుని, ఇటు చూపి అటు = అర్జునుని చూపి సుభద్రను (లేక), అటుచూపు ఇటు = సుభద్ర చూపును అర్జునుని పైకి, ఇటుచూపు అటు = అర్జునుని చూపు సుభద్రపైకి, (ఇట్లు) ఆ సుభద్రార్జునులను, పటు రయమునన్ = మిక్కిలి వేగముతో, ఏసెన్ = బాణాలుగా ప్రయోగించెను.

*విశేషము :—* ఒకరిని చూపి ఒకరికి, పరస్పరము, మదనోద్దీపనము కలిగించడము నేర్పరితనము; అటు చూపు ఇటూ, ఇటు చూపు అటూ అన్నప్పుడు మన్మథుడు తన బాణాలు ఉపయోగించకుండా, వారి వారి చూపులనే బాణాలుగా ప్రయోగించడం మరింత నేర్పరితనాన్ని సూచిస్తుంది.

కోప మను వారి బెదరించి కూర్ప నేర్చుఁ,
గూడ మను వారిఁ దమిఁ గొల్పి కూర్ప నేర్చుఁ,
గొమ్మలకు మగలకుఁ బెండ్లిఁ గూర్ప నేర్చు,
జగతి నెంతటి యుపకారి శంబరారి ! 203

*అర్థము :—* కోపము అను వారిని = కోపగించుకున్న వారిని (ప్రణయ కలహములో) బెదరించి, కూర్పనేర్చున్ = (కోపముమాని) ప్రియులను కలిసేలాగ చేయగల నేర్పు కలవాడు; కూడము అనువారిని = మేము కలియము అని పరస్పరము విముఖంగా ఉన్నవారిని, (లేక), కూడన్ మనువారిని = కలిసి జీవిస్తున్న వారిని, తమిన్ కొల్పి = మోహము కలిగించి, కూర్ప నేర్చున్ = కలియునట్లు చేయగలడు, కొమ్మలకు = యువతులకు, మగలకున్ = వారి ప్రియు

లకు, పెండ్లి = కూర్పనేర్చు = పెండ్లి కుదుర్చగలవాడు, (అయిన) శంబర అరి = శంబరుడన్న రాక్షసుని చంపిన మన్మథుడు, జగతిని = ప్రపంచములో, ఎంతటి ఉపకారి = గొప్పమేలు కలుగజేసేవాడు కదా!

అలంకారము :— కావ్యలింగ౦.

## ఆశ్వాసాంతము

దాక్షిణ్యాకర మూర్తి! షోడశ మహాదానాది పుణ్యక్రియా
దక్షా! యాశ్రిత దీనరక్షణ కళా ధౌరంధరీ సత్కృపా
వీక్షా! శాశ్వత కీర్తి వైభవ రమాభృ చ్చోళ సింహాసనా
ధ్యక్షా! దుర్దమ రా ట్కిరీట దళనై కాక్షేయ కౌక్షేయకా! 204

అర్థము :—దాక్షిణ్య ఆకరమూర్తి = దయాగుణమునకు నెలవైనవాడా!, షోడశ = పదహారు విధములైన, మహాదాన ఆది = మహాదానములు మొదలుగాగల, పుణ్యక్రియాదక్షా = అనేక పుణ్యకార్యములు చేయుటలో పేరుపొందినవాడా, ఆశ్రిత = ఆశ్రయించిన, దీన = దీనులను, రక్షణ = రక్షించుటయన్న, కళాధౌరంధరీ = విద్యను వహించియున్న, (ఆపనిలో నేర్పుగల), సత్కృపావీక్షా = కరుణా వీక్షణములు కలవాడా, శాశ్వతకీర్తి = శాశ్వతమైన కీర్తి కలుగజేయునట్టి, వైభవరమాభృత్ = వైభవసంపద కల, చోళసింహాసనాధ్యక్షా = చోళసింహాసనమునకు ప్రభువా!, దుర్దమ = బలవంతులైన, రాట్ కిరీట = రాజుల కిరీటములను (తలలను), దళన = నరకుటయందు, ఏక అక్షేయ = ఎదురులేని పరాక్రమముకల, కౌక్షేయకా = కత్తిని ధరించినవాడా - అసమాన పరాక్రమ వంతుడా! - (ఇదంతా రఘునాథ రాయల వర్ణన).

*ఒక్కమాట* :— ఈ పద్యము తరువాత కొన్ని ప్రతులలో "కలహారంభణ కౌతూహల...." అన్న కందపద్యమున్నూ, "దుగ్ధవారాశి విద్యోతికీర్తి..." అన్న స్రగ్విణీ వృత్తమున్నూ ఉన్నాయి; మరి కొన్ని ప్రతులలో వేరే పద్యాలున్నాయి. వీటిని గురించి (344 వ పుటలో మనవి చేసినట్టు) నా పీఠికలోని సమీక్ష చూడమని ప్రార్థన.

## గద్యము

ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ సారస్వత సుధాసార జనిత యశో లతాంకూర చేమకూర లక్ష్మణామాత్యతనయ వినయ ధురీణ, సకల కళా ప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాల దత్త హస్త ముక్తాకటక విరాజమాన వేంకటకవిరాజ ప్రణీతంబయిన విజయవిలాసంబను మహాప్రబంధంబు నందు ద్వితీయాశ్వాసము.

# విజయవిలాసము

## హృదయోల్లాసము

### మూడవ ఆశ్వాసము

శ్రీ జానకీ మనోహర
పూజాంచిత హృత్పయోజ, పోష్యాఖిల ది
గ్రాజ, సకలార్థి జన ని
ర్వ్యాజ కృపా, యచ్యుతేంద్ర రఘునాథమణీ[1] ? 1

అర్థము :— శ్రీ జానకీమనోహర = శ్రీకరమైన సీతాదేవిభర్త అయిన శ్రీరాముని. పూజ అంచిత హృత్ పయోజ = పూజయందు ఉంచబడిన హృదయము అనెడి పద్మము కలవాడా (రఘునాథరాజు తన హృదయమునే పద్మముగా శ్రీరాముని పూజయం దుంచినవాడు అని భావము. విశేషించిన రామభక్తి కలవాడుగదా !). పోష్య అఖిల దిక్ రాజ = పోషింపదగిన సమస్త దిక్కుల యందలి రాజులు కలవాడా (సమస్త దిక్కుల సామంతులను పోషించువాడు అని భావము). సకల అర్థిజన నిర్వ్యాజకృపా = సమస్తమైన యాచక సమూహముల యందు కపటములేని కరుణ కలవాడా, అచ్యుత ఇంద్ర రఘునాథమణీ = అచ్యుతరాజుకుమారుడవైన రఘునాథ శ్రేష్ఠా.

---

1. ఈ తృతీయాశ్వాసారంభమున నోరివారి ప్రథమ పద్యము 'శ్రీధుర్య ధైర్య శౌర్య ఘ్నాధర... ..' అని ఉంది.

తిరుపతి వారి పాఠము గూడా ఇదే.

కృష్ణమాచారిగారు "శ్రీ సీతా కుచ కుట్మల......అని అన్నారు.

ఆ ప్రతిలో ద్వితీయాశ్వాసారంభము "శ్రీ జానకీ మనోహర...." పద్యముతో ఉంది.

అవధరింపు క థాకర్ణ నాతివేల
హర్ష లైనట్టి దివ్య మహర్షులకును
దత సమస్త పురాణకథా శతాంగ
సూతుఁడై విలసిల్లెడు సూతుఁ డనియె. 2

అర్థము :— అవధరింపుము = వినుము, కథా......హర్షులు - కథా = కథలను, ఆకర్ణన = వినుటయందు, అతివేల = హద్దుమీరిన (అపరిమితమైన), హర్షులు = సంతోషము కలవారు, అయినట్టి, దివ్యమహర్షులకున్ = దివ్యులైన మహర్షులకు, తత...సూతుఁడై - తత = విస్తారమైన, సమస్త = అన్ని, పురాణకథా = పురాణములయందలి కథలు అను, శతాంగ = రథమునకు, సూతుఁడై = నడుపువాడై, విలసిల్లెడు = ఒప్పారెడు, సూతుఁడు = సూతమహర్షి, అనియె = చెప్పెను,

అలంకారము :— రూపకము, అనుప్రాసము,

## అర్జునుని విరహతాపము

ఆరీతి నంతిపురమున
నారీ తిలకము సఖీ జనమ్ములు గొలువన్
జేరిన పిమ్మట, మదిలోఁ
గూరిన పిమ్మట, విరాళి గొని నరుఁ డుండెన్. 3

అర్థము :— ఆరీతిన్ = ఆప్రకారము, నారీతిలకము = స్త్రీలలో శ్రేష్ఠురాలు అయిన సుభద్ర, సఖీజనమ్ములు కొలువన్ = చెలికత్తెలు కొలుచుచుండగా, అంతిపురమునన్ = అంతఃపురమునందు, చేరిన పిమ్మటన్ = చేరిన తరువాత, నరుఁడు = అర్జునుడు, మదిలోన్ = మనస్సునందు, కూరిన = కలిగిన, పిమ్మటన్ = విచారముతో, విరాళిగొని = విరహమును పొంది, ఉండెన్.

విశేషము :— ఆవిధంగా సుభద్ర వెళ్ళిపోయిన తరువాత అర్జునుడి స్థితిని కవి చూపుతున్నాడు. 1, 2 పాదాలలో 'రీతి' ద్విప్రాసమూ 3, 4 'రిన' ద్విప్రాసమూ, చూడదగును.

ఈ పద్యము తిరుపతివారి ప్రతిలో లేదు.

అలంకారము :— యమకము.

కృష్ణు ననుమతి రుక్మిణీ కీరవాణి
వచ్చి భోజన మిడఁ, దల వంచి యగ్గ
లం బయిన చింత, వలసి యొల్లమి నతండు
సొగటులను బోయి కసిగాటులుగ భుజించె. 4

*అర్థము* :— కృష్ణు అనుమతిన్ = కృష్ణుని ఆజ్ఞప్రకారము. రుక్మిణీ కీరవాణి = చిలుకపలుకులుగల రుక్మిణీదేవి, వచ్చి = అర్జునుడి దగ్గరకు వచ్చి. భోజన మిడన్ = భోజనము పెట్టగా. అతండు - (అర్జునుడు), తలవంచి. అగ్గలంబయిన = మిక్కిలి ఎక్కువయిన. చింతన్ = విచారముతో, వలసి = కావలసియున్నను. ఒల్లమిన్ = ఇష్టములేనట్లు, సొగటులనుబోయి = అస్సురుస్సురనుచు, కసిగాటులుగన్ = సగముతిని సగము తినకుండునట్లు (ఇష్టములేని పద్ధతిలో), భుజించెన్ = భోజనము చేసెను.

*విశేషము* :— ద్వితీయాశ్వాసము 124 వ పద్యములో రుక్మిణీ సత్యభామలకు ఈ వచ్చిన యతి అర్జునుడే అని. "తన మదిలో నిత డర్జును డని తెలిసి సుభద్ర సేవ కరుగక యున్నన్, జని మీ రతనికి భోజన మొసరింతురు గాక యూరకుండెదరు సుడీ" అని కృష్ణుడు చెప్పాడు. కృష్ణుడు అనుకొనినంతా ఇప్పుడు జరిగింది. కాబట్టే రుక్మిణి ఇపుడు వడ్డనకు వచ్చింది.

పద్యములో "వలసి యొల్లమి", "సొగటులను బోవుట" 'కసిగాటులుగ భుజించుట' చక్కని పదబంధములు.

వీటిలో అర్జునుని మానసిక స్థితి బాగా నిరూపిత మైనది.

మునుపు సైఁపదు సంతోషమున భుజింప,
వెనుక సైఁపదు చింతచేతను భుజింప,
బాల కడనున్న యపు డెడఁబాసి నపుడు
నొక్క తీరయ్యె భరత వంశోత్తమునకు. 5

*అర్థము* :— మునుపు = సుభద్ర శుశ్రూషచేస్తున్నప్పుడు కలిగిన, సంతోషమునన్ = తృప్తి ఆనందమువల్ల, భుజింపన్ సైఁపదు = భోజనము చేయుటకు ఇష్టముండక పోయింది; వెనుకన్ = సుభద్రవెళ్ళిపోయిన తరువాత అనగా ఇప్పుడు, చింతచేతన్ = విచారమువల్ల, భుజింప, సైఁపదు, బాల కడనున్న యపుడు = సుభద్ర దగ్గరగాఉన్నప్పుడూ, ఎడబాసినపుడున్ = దూరముగా నున్నప్పుడూ, భరతవంశ ఉత్తమునకున్ = భరతవంశ శ్రేష్ఠుడైన అర్జునుడికి, ఒక్క తీరయ్యెన్ = ఒకే విధంగానే ఉంది.

*విశేషము* :— సుభద్ర దగ్గరున్నప్పుడు అర్జునుడి భోజనము 2_164 లో కవి చెప్పి 'తృప్తి యేరీతి నుండెనో తెలియరాదు' అన్నాడు కదా. రుక్మిణి ఇప్పుడు వడ్డించినప్పుడు 'కసిగాటులుగ' సొగటులను బోయాడు.

తిరుపతివారి పాఠము "బాల కెడ నున్నయపు డెడబాసినపుడు" అని. కెడనున్న యపుడు = ప్రక్కనున్న యపుడు.

*అలంకారము* :— విభావన.

ఎక్కడఁ జప్పు డైనఁ, దరళేక్షణ వచ్చె నటంచు లేచు; నే
దిక్కున నల్కు డైన, సుదతీమణి మా టని యాలకించు; నే
చక్కిఁ దళుక్కు మన్న, నెల జవ్వని మైసిరి యంచుఁ జూచు; న
మ్మక్క! కిరీటి మోహ సముదగ్రత నేమనవచ్చు నయ్యెడన్. 6

*అర్థము* :— ఎక్కడ చప్పుడు అయినఁగా, తరళేక్షణ = చంచలములైన కన్నులు గల సుభద్ర, వచ్చె నటంచుఁగా = వచ్చిన దనుకొని, లేచుఁగా = నిలబడిపోవును; ఏదిక్కున, అల్కుడైన = అలికిడైనా, సుదతీమణి మాట = సుభద్రయొక్క పలుకు, అని ఆలకించుఁగా = చెవియొగ్గి వినును; ఏచక్కిఁగా = ఏ దిక్కునందు అయినా, తళుక్కుమన్నఁగా = తళుక్కుమని ప్రకాశించినా, ఎలజవ్వని = లే జవరాలైన సుభద్రయొక్క, మై = శరీరముయొక్క, సిరి = కాంతి, అంచు = అనుకొని, చూచుఁగా; అమ్మక్క = ఆహాహా !, కిరీటి = అర్జునునియొక్క, మోహ = కామమునందలి, సముదగ్రత = అతిశయము, అయ్యెడఁగా = ఆ సందర్భములో, ఏమనవచ్చు = ఏమని చెప్పవచ్చు !

*విశేషము* :— నిన్నటి వరకు శుశ్రూషకు వస్తూ ఉండిన సుభద్ర ఈవేళగూడా, ఆ నెపముమీద వస్తుందేమో అని అర్జునుడి ఆశ. సుభద్ర ఇంకరాదు అన్నమాట తెలిస్తే ఈ అవస్థ ఉండదు కదా !

చక్కెర కెంపుమోవిఁ గని సారెకుఁ జిల్క మొగంబు వేఁడఁగాఁ,
జొక్కపుఁ జిల్వ కప్పుజడఁ జూచి మయూరము లబ్బు సోఁపఁగాఁ,
జక్కని తమ్మిపూ వడుగుజాడలఁ గన్గొని రాజహంసముల్
ద్రొక్కుడుపాటు చెందఁగ, వధూమణి వచ్చుట లెంచు నెమ్మదిన్. 7

*అర్థము* :— చక్కెర కెంపుమోవిఁగా = తీయనైన ఎఱ్ఱని పెదవివి, కని = చూచి, సారెకు = మాటిమాటికి, చిల్క = సుభద్ర చేతిపై నుండినచిలుక, మొగంబు వేఁడఁగాఁగా =

సుభద్రముఖము నిమ్మని, పెదవితినడానికి, కోరగా; చొక్కపు = అందమైన, చిల్వ(చిలువ) = కృష్ణసర్పమువలె, కప్పు = నల్లనైన, జడను, చూచి, మయూరము = (పెంపుడు) నెమలి, అబ్బుచాఁపఁగాన్ = తినడానికి ఆశపడగా. (అబ్బు = మెడ, సాఁచుట = నిగిడించుట, నెమళులకు సహజమైన అలవాటు); చక్కని = అందమైన, తమ్మిపూవు = తామరపూవులవంటి, అడుగు జాడలఁ = కాలిగుర్తులను, కన్గొని = చూచి, రాజహంసముల్ = రాజహంసలు, త్రొక్కుడు పాటు చెందగ = ఒకదానిపై ఒకటి, తినడానికి, పడగ, వధూమణి = సుభద్ర, వచ్చుటల్ = వచ్చుచుండుటలను, నెమ్మదిఁ = మదిలో, ఎంచున్ = భావించును (స్మరించుకొనును).

*విశేషము* :— తన కాహారమగు చక్కెర కెంపుమోవి = తీయని, ఎఱ్ఱని దొండపండు అను భ్రాంతిచేత చిలుక ప్రార్థించింది; సొగసైన నల్లనై సాగి ఉండిన జడ తన కాహారమైన త్రాచుపామన్న భ్రాంతితో తన కాహారమని నెమలి ఆశపడింది; అడుగుజాడలు తమ కాహారమైన పద్మములను భ్రాంతి కలిగించుటచేత రాజహంసలు త్రొక్కుడుపాటు నందినవి.

చిలుక మాటలాడగలదు కాబట్టి 'వేడింది.' నెమలి మెడచాచడమూ, హంసలుత్రొక్కుడు పడడము వాటి సహజచేష్టలే.

సుభద్ర పాదములు పద్మాంకితములు అని చెప్పడము వల్ల ఆమె మంచి ఉత్తమజాతి స్త్రీ యని వెల్లడి అవుతుంది.

ఈ పద్యము తిరుపతివారి ప్రతిలోనూ వేంకటకృష్ణమాచారిగారి ప్రతిలోనూ కాన రాదు. లేఖకు లెవరో దీనిని ఇరికించారని భావించాలి.

*అలంకారము* :— భ్రాంతిమంతము, స్మరణ.

మారు తమ్ముల వాఁడికి, మలయకూట
మారుతమ్ముల వేఁడికి; మట్టుమీఱు
చంద్ర కిరణమ్ములకు, శుక శారి కాళి
చంద్రకి రణమ్ములకుఁ, జాల జలదరించు. 8

*అర్థము* :— మారు = మన్మథుని, తమ్ముల = (బాణములైన) పద్మములయొక్క, వాఁడికి = తీక్ష్ణత్వమునకు, మలయకూట = మలయపర్వతము నుంచి వచ్చు, మారుతమ్ముల = చల్లగాలులయొక్క, వేఁడికి = ఉష్ణత్వమునకు; మట్టుమీఱు = హద్దుమించిన, చంద్ర కిరణమ్ములకుఁ = చంద్రుని కిరణములకును; శుక = చిలుకలు, శారిక = గోరువంకలు, అళి = తుమ్మెదలు, చంద్రకి = నెమళులు (వీటియొక్క), రణమ్ములకు = రణగుణధ్వనులకు (పోరులకు, బాధలకు), చాల = ఎక్కువగా, జలదరించు = భయపడును.

విశేషము :— సహజముగ మెత్తగానుండే పద్మములు వాడి అనడమూ, చల్లని మలయకూటమునుంచి వచ్చిన గాలి వేడి అనడమూ, ఆహ్లాదకరంగా ఉండే చంద్రకిరణాలకూ, శుకశారికాది ధ్వనులకూ జలదరించడమూ అంతా తన విరహ ప్రభావము వల్లనే.

పాఠాంతరము :—

'చంద్రకి రవమ్ములకు'

ఈ పాఠములో ఛక్కని యమకము కుంటుపడుతుంది.

అలంకారము .— యమకము.

విరహిణులం గలంపఁ గల వీరులు వీరని తమ్ముఁ జేర, న
య్యురుకుచ వాలుఁ జూపులకు నోడుట నంకము కాఁగ మీనమున్
హరిణము; నట్లనే తమ శరాంశులు నోడెనొ గాక బాలికన్
గరఁపఁగ రాదె ? యేల నను గ్రాఁచెద రీ మక రైణ లాంఛనుల్? 9

అర్థము :— ఆ ఉరుకుచ = పెద్దస్తనములు గల సుభద్రయొక్క, వాలుచూపులకు, ఓడుటన్ = ఓడిపోవుటచే, మీనమున్ = చేపయు, హరిణమున్ = జింకయు, విరహిణులన్ = ప్రియుల నెడబాసిన కాంతలను, కలంచగల = కలతపెట్టగలిగిన, వీరులు = శూరులు, వీరు = ఈ మకర ఏణలాంఛనులు (మన్మథుడు, చంద్రుడు), అని, అంకముకాఁగ = వారికి చిహ్నము లైనట్లు, తమ్ముచేరన్ = తమ్ము ఆశ్రయించగా, అట్లనే = ఆ చేపా జింకా ఓడిపోయిన విధముగానే, ఈ మన్మథ చంద్రులయొక్క, శర అంశలు = క్రమముగా బాణములూ, కిరణములూగూడా, ఓడెనో = ఓడిపోయెనో; కాక = కానిపక్షమున, బాలికన్ = సుభద్రను, కరఁపఁగ రాదె = (ఆమె మనసును) కరిగించరాదా ? ఏల నను క్రాఁచెదరు = ఏల నన్ను తపింపజేస్తారు ?

తాత్పర్యము :— సుభద్ర వాలుచూపులకు ఓడిపోయి చేప, జింక తమ పగ సాధించడానికి, వియోగులను పీడించే మన్మథుని, చంద్రునిచేరి వారికి చిహ్నములైనవి. విరహిణి అయిన సుభద్ర వాలుచూపులకు మన్మథుని బాణాలు, చంద్రుని కిరణాలుకూడా ఓడినట్లున్నవి. లేకుంటే, నన్ను బాధించడానికి బదులు వారు సుభద్రను బాధించరాదా ? అని అర్జునుడు తలస్తున్నాడని భావము.

విశేషము :— మన్మథుడు మీనాంకుడు. చంద్రుడు ఏణాంకుడు. సుభద్ర చూపులు మీనములకన్నా, జింకలకన్నా అతిశయించి అందముగా ఉన్నవనీ, మన్మథుని బాణాలైన పద్మాల కన్నా, చంద్రుని కిరణాల (వెన్నెల) కన్నా అందముగా ఉన్నవనీ భావము.

తాము ఓడించలేని శత్రువును సాధించడానికి తగిన సమర్థుని ఆశ్రయించడము రాజనీతి, ఆ పనినే చేపలు, జింకలు చేశాయి.

*పాఠాంతరము :—*

'....తమ శరాంశులు నోడిరొ కాక....'

— తిరుపతివారు.

దీనిలో ఆ మన్మథుడూ చంద్రుడూ తమ శర అంశులను ఓడిపోయారో అని అర్థము. అంటే వాటిని పోగొట్టుకున్నారేమో అని.

*అలంకారము :—* ఉత్ప్రేక్ష, క్రమము, విభావన.

ఇన్నాళ్లు సేవ చేయుచు
నున్నదియుం బోయె నేఁ డయో ! కౌఁగిలి యి
మ్మన్నంతఁ, 'జదువఁ బెట్టఁగ
నున్న మతియుఁ బోయె' నను టహో ! నిజ మయ్యెన్. 10

ఇంకా అర్జును డీలా గనుపంటున్నాడు.

*అర్థము :—* నేఁడు = ఈదినమున, కౌఁగలి ఇమ్మ, అన్నంతఁ = అని కోరినంతనే, ఇన్నాళ్లు సేవచేయుచు ఉన్నదియు (ఆ స్వల్ప విషయముకూడ) ఆగిపోయెను అహో ! చదువబెట్టఁగఁ = (ఎక్కువ తెలివి గలుగునన్న ఉద్దేశముతో) బడికి పంపగా, ఉన్న మతియు = అంతకు పూర్వమున్న తెలివికూడ, పోయెఁ = నశించెఁ, అనుట = అని లోకు లాడుకొనుట, నిజమయ్యెను = సత్యమయ్యెను.

*అలంకారము :—* లోకోక్తి, విషమాలంకారము.

అంతిపురమున కరుగుచో నింతి తిరిగి
యోరగాఁ జూచునపుడు, శృంగార రస మ
పారముగ నుబ్బ జా లెత్తె నౌర ! దాని
చల మనోహర లోచ నాంచలమ చెలమ ! 11

*అర్థము :—* అంతిపురమునకు = అంతఃపురమునకు, అరుగుచో = వెళ్లుతూ, ఇంతి = సుభద్ర, తిరిగి = వెనుకకు తిరిగి, ఓరగా = ప్రక్క చూపులతో, చూచునపుడు, ఔర !, దాని = సుభద్రయొక్క, చల = చలించుచున్న, మనోహర = మనోహరమైనట్టి, లోచన =

కన్నులయొక్క. అంచలమ = అంచలము + అ = కొనయే (కొలుకే). చెలమ = నీటి బుగ్గగా. శృంగారరసము = శృంగార రసము అనే నీరు. అపారముగా = విశేషముగా. ఉబ్బన్ = ఉబ్బుటవల్ల. జాలెత్తెను = జాలువారెను (ప్రవాహముగా పారెను).

*తాత్పర్యము* :— సుభద్ర పోతూపోతూ ఓరగా వెనుకకు చూచినప్పుడు ఆమె క్రేగంటి చూపులలో శృంగారరసము ప్రవాహముగా పారిందని భావము.

*విశేషము* :— చలమయందు నీరు సాధారణముగ ప్రవహించదు. కాని ఈమనోహర నేత్రాంచలము అన్న చెలమలో శృంగారరసమను నీరు అపారముగా ఉబ్బినందువల్ల ప్రవాహ రూపము దాల్చగలిగినది.

ఆమె ఓరగా చూచినది కాబట్టే లోచనాంచలము (కొన) అని కవి స్థల నిర్దేశము చేశాడు. కంటికొనకే ప్రాధాన్యము నిచ్చినాడు. ఆ చూపులు శృంగారరస ప్రవాహములని భావము.

పారము అనగా గట్టు, అంచు. ఇచట అపారముగా అనగా గట్టు దాటినట్టుగా శృంగార రసము ఉబ్బినది కాబట్టి అది చెలమ అంచులను దాటి ప్రవాహరూపము దాల్చినది అని చమత్కారము.

*పాఠాంతరము* :—

'చలమనోహర లోచనాంచలము చెలమ'

— తిరుపతివారు.

ఇక్కడ అన్వయము సుగమంగా ఉంది. చలమనోహర లోచనాంచలము (అనే) చెలమ (ఊటగోయి). చలమతో యమకము కోసము పరిష్కర్తలెవరో 'లోచనాం చలమ చెలమ' అన్నారు; దానివల్ల 'లోచనాంచలము + అ' అని కష్టంగా అన్వయం చేసుకోవలసి వచ్చింది. ఈ పాఠములో గూడా శబ్దాలంకారము బాగానే ఉంది.

*అలంకారము* :— రూపకము, అనుప్రాస, కావ్యలింగ.

అర్జునుండను నేనె యని తెల్పినంతనే
మిట్టి మీనై పడె మెలఁతచూపు;
గాంధర్వమునఁ బెండ్లి గమ్మనుసంతనే
పచ్చకప్పుర మాయె భామపలుకు;

బలిమిమైఁ బట్టంగఁ దలకొనునంతనే
యొక బండి కల్లయ్యె నువిద పిఱుఁదు;
సొలపుఁ బయ్యెదఁ దేఱిచూతు నన్నంతనే
పచ్చపూసాయెఁ బో పడఁతి యారు;

పేరు వివరించి నేనేల బేల నైతిఁ?
గోరి తెఱఁగించి నేనేల గోలనైతి?
బలిమిఁ బైఁబడి నేనేల బయటఁ బడితి?
బత్తి గనిపించి నేనేల పలుచనైతి? 12

అర్థము :— ౧. అర్జునుండను నేనె అని తెల్పినంతనే, మెలఁతచూపు = సుభద్ర చూపు, మిట్టి మీనై పడెను = చేపవలె పైకి త్రుళ్ళి క్రిందపడెను. (సుభద్ర ఒక్కసారి తల యెత్తి అర్జునుని ముఖము చూచి తలవంచుకొనెనని భావము). కనులకు చేపలు ఉపమానములు. కాబట్టి మిట్టిమీనై పడు – అర్థగౌరవము గల పదగుంఫనము.

౨. గాంధర్వమున = గాంధర్వ వివాహపద్ధతిని (అన్యోన్యాంగీకారముతో అప్పటి కప్పుడు చేసుకొనే వివాహము). పెండ్లి గమ్మనుసంతనే = వివాహము చేసుకొమ్మని నంతనే, భామపలుకు = సుభద్రమాట, పచ్చకప్పురమయ్యె = పచ్చకర్పూరమువలె హరించిపోయెను. అనగా సుభద్ర మౌనము దాల్చెనని భావము. పలుకులకు పచ్చకప్పురపు పలుకులతో ఉపమానము చెప్పుట ప్రసిద్ధము, మౌనమును సూచించుటకు పలుకు బంగారమాయెను అన్నట్టులే పలుకు పచ్చకప్పురమాయెను అనుట నుడికారము.

౩. బలిమిమైన్ = బలాత్కారముగ. పట్టంగన్ = సుభద్రను పట్టుకొనుటకు, తలకొను నంతనే = నేను సిద్ధపడగానే, ఉవిద పిఱుఁదు = సుభద్రయొక్క పిరుఁదు, ఒక బండికల్లయ్యె = ఒక బండి చక్రమువలె పట్టుటకు అలవికాని దయ్యెను. పిరుదు చక్రాకారముగ నుండే విషయములో ఈలాగు ఉపమించడం కవి సమయము. ఇచట 'బండికల్లు' — బండి చక్రములకు పూర్వము రాళ్లను (కల్లు = రాయి) ఉపయోగించేవారు. అల్లసానిపెద్దన్న... చంద్రోపాలంభనములో "బండికల్లుగ నీమేను గండి చేసే" అని వ్రాసినాడు. ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో రాతిచక్రాల వాడుక ఉంది.

౪. సొలపు = అందమైనటువంటి, పయ్యెదన్ = చీరపైటను, తేఱిచూతునన్నంతనే = శ్రద్ధగా చూడవలె ననగానే, పడఁతి ఆరు = సుభద్రయొక్క నూగారు, పచ్చపూసాయెన్‌బో = కనిపించీ కనుపించని దాయెను. ఆరును నల్లచీమల బారుతోనూ, పచ్చపూసల చేరుతోనూ వర్ణించుట కలదు.

పేరు వివరించి నేను ఏల? బేలనైతి = పిచ్చివాడనైతిని? కోరిక ఎఱిఁగించి నేను ఏల, గోలనైతి = తెలియనివాడనైతి.

బలిమిపైఁబడి = బలాత్కారముగ ఉద్రేకించి, నేను ఏల బయటపడితి = నేను ఏల నా మనోభావాన్ని ప్రకటించుకొంటిని? బత్తిగనిపించి = అనురాగమును ప్రదర్శించి, నేనేల పలుచనైతి = = తేలికైతిని?

విశేషము :— చూపు, పలుకు, పిరుదు, ఆరు ఈనాల్గింటికిని, మీను, పచ్చకప్పురము బండికల్లు, పచ్చపూసలు ఉపమానములు.

మొదటి చరణమున సిగ్గు, రెండవచరణమున మౌనము, మూడవ నాల్గవ చరణముల యందు సుభద్ర శరీరమున ఉబ్బుట ధ్వనిస్తున్నది. గీతపద్యము నాలుగుచరణములు క్రమముగా పైనాలుగు చరణములకు అన్వయించును.

అలంకారము :— క్రమము, విషమాలంకారము.

తెలుప కస్తురిచుక్క దీర్చి వచ్చిన తెక్కు
గీఱునామమునాఁటి తీరుఁ గేరుఁ;
దన్వంగి వలిపెంబుఁ దాల్చి వచ్చిన ఠీవి
వన్నెఁ గట్టిననాఁటి చెన్నుఁ దన్నుఁ;
వాల్గంటి కీల్గంటు వైచి వచ్చిన చెల్వు
జడ యల్లుకొనునాఁటి సౌరు జౌరు;
నొయ్యారి మెఱుఁగు సొమ్మూని వచ్చిన నీటు
మణిభూష లిడునాఁటి మట్టుఁ దిట్టు;
నాతి రాయంచ గుమిఁగూడి నడచు మురువు
చెలులు గొలువంగఁ జనునాఁటి సొలపు నలఁపుఁ;
జక్కదనముల ప్రోవైన చంద్రముఖికి
నిచ్చలపు రూపు లెస్సైన నింపు నింపు. 13

అర్థము :—౧. తెలుప = సుభద్ర, కస్తురిచుక్క = కస్తురితో చుక్కబొట్టును, తీర్చి = దిద్దుకొని, వచ్చిన, తెక్కు = అతిశయము, గీఱునామమునాఁటి = సన్నని నామము పెట్టుకొన్న నాటి, తీరుఁ = అందమును, గేరుఁ = ఎగతాళిచేయును (తిరస్కరించును).

౨. తను + అంగి = చిన్నశరీరముగల సుభద్ర, వలిపెంబు = సన్నని తెల్లనివస్త్రము, తాల్చి = ధరించి, వచ్చిన (నాటి). ఠీవి = సొగసు. వన్నె = రంగుచీర. కట్టిననాటి. చెన్ను = అందమును. తన్నుఁ = తిరస్కరించును.

౩. వాల్గంటి = వాలుగన్నులు కలిగిన సుభద్ర. కీల్గంటు = వేలుముడి. వైచి = వేసుకొని. వచ్చిన. చెల్వు = అందము. జడఅల్లుకొనునాటి. సొరుఁ = సొగసును. జౌరుఁ = కొట్టును (తిరస్కరించును).

౪. ఒయ్యారి = సుభద్ర. మెఱుఁగు సొమ్మూని = మెరుగు బంగారపు నగలు ధరించి, వచ్చిన. నీటు = ఠీవి. మణిభూషలు = రత్నములతోడి ఆభరణములు. ఇడునాటి = ధరించునాటి మట్టు = సౌందర్యమును. తిట్టుఁ = తిరస్కరించును.

నాతి = సుభద్ర. రాయంచగుమిఁ = రాజహంసల సమూహముతో. గూడి (వెంట వచ్చుచుండగా). నడుచు మురువు = నడచునప్పటి సౌందర్యము. చెలులు కొలువంగఁ = చెలికత్తెలు వెంటవచ్చుచుండగా. చనునాటి = నడచునప్పటి. సొలపున్ = అందమును. నలపుఁ = తిరస్కరించును.

చక్కదనముల ప్రోవైన = అందములరాశియైన. చంద్రముఖికి = స్త్రీకి. నిచ్చలపు = స్వభావసిద్ధమైన. రూపము. లెస్స అయినఁ = బాగుగా నుండిన యెడల. నింపు = నిండుదనమును. నింపును = నిండించును. (నింపుఁ ఇంపును అని పదవిభజనచేసి, అందమును నిండించును' అని అర్థము కావచ్చును).

కొందరు "ఇంపునింపు" అని వ్యాఖ్యానించిరి. యతి భంగము కలుగుతుంది గాబట్టి అది పొసగదు.

విశేషము :— సుభద్ర ఎట్టి అలంకరణములు పెట్టుకున్నా అందము పెంపు వహించింది. కనుక సహజ సౌందర్యమున్న సుభద్రకు ఉపకరణములు అంతముఖ్యముగాదు.

ఈ అభిప్రాయమునే కాళిదాసు శాకుంతలములో, "ఇయ మధిక మనోజ్ఞా వల్కలే నాపి తన్వీ - కిమివహి మధురాణాం మండనం నాఽకృతీనాం" (అందమైన వారికి అలంకరణము కాని దేది?) అని వ్రాశాడు.

చక్కని అంత్యాను ప్రాసముతో చరణాలను ముగించడంలో కవి ప్రయోగించిన తిరస్కారవాక్యాలు కేరు, తన్ను, జౌరు, తిట్టు, నలపు అన్నీ కటువుగానే ఉండడం చూడవచ్చును.

అలంకారము :— అర్థాంతరన్యాసము, అనుప్రాసము.

మిక్కిలి తేఱిచూడ మిఱుమిట్లు గొల్పు; జరించునప్పు డ
మ్మక్క! తళుక్కనన్ మెఱసినట్లగు; నేమనవచ్చు! నద్దిరా!
'చొక్కపుఁ బైఁడిబొమ్మ' యనుచుం జనులాడిన నాడి; రింతెకా
కెక్కడి కేడ పో, యలమృగేక్షణ మేనికి నక్కడానికిన్? 14

అర్థము :— మిక్కిలి తేఱిచూడ = చక్కగా తేరి చూచునపుడు, (సుభద్ర మేను) మిఱుమిట్లు కొల్పుఁ = కన్నులు చెదరునట్టు చేయును; చరించునప్పుడు = (ఆ శరీరము) కదలునపుడు, అమ్మక్క = ఓహో, తళుక్కనన్ = తళుకుమని, మెఱసినట్లగుఁ; అద్దిరా! ఏమనవచ్చు, చొక్కపు = అందమైన, పైఁడిబొమ్మ = బంగారపు బొమ్మ, అనుచుఁ, జనులు, ఆడినఁ ఆడిరి = అంటే అన్నారు, (అది లెక్కసేయ దగినది కాదని భావము), ఇంతెకాక, అలమృగేక్షణ = జింకవంటి చూపులు కలిగిన ఆ సుభద్ర యొక్క, మేనికి = శరీరమునకూ, అకడానికిఁ = మేలిమి బంగారమునకూ, ఎక్కడికేడపో = ఎక్కడికెక్కడ కదా. (చాలా అంతరువు గలదని భావము.)

విశేషము :— మిరుమిట్లు గొలుపుట తళుక్కని మెరయుట ఈ రెండు గుణాలూ బంగారానికి ఉండవు. అవి కలిగి ఉండుటచేత సుభద్ర శరీరమునకూ ఆ బంగారానికీ చాలా వాసి ఉందని భావము.

పాఠాంతరము :— ఆఖరి చరణమున

"ఇంతె కా కెక్కడి దోయి పో యల మృగేక్షణమేనికి నక్కడానికిన్"

— వేదమువారు

"ఎక్కడిదోయి = ఎక్కడి సామ్యము అని వ్యాఖ్యానించిరి. 'దోయి' పాఠము శబ్దాలంకారమునకు ఉపకరించినట్టుంటే అంగీకరించవచ్చు. అదిలేనపుడు చక్కని నుడికారముగ 'ఎక్కడికేడ' (ఎక్కడికెక్కడ) అన్న పాఠాన్నే తీసుకొనడము మేలు.

మిరుమిట్లు గొల్పడమూ తళుక్కని మెరయడమూ సుభద్ర శరీరానికీ మెరుపు తీగకూ ఉన్నాయి. సుభద్ర శరీరము బంగారంకంటే బాగుందనీ మెరుపుతో సమానంగా ఉందనీ భావము.

అలంకారము :— అంత్యానుప్రాస, విషమాలంకారము, కావ్యలింగ.

చిత్తజుఁ దల్గి తూపు మొన చేసినఁ జేయఁగ నిమ్ము; పై ధ్వజం
బెత్తిన నెత్త నిమ్ము, వచియించెదఁ గల్గినమాట గట్టిగా;
నత్తరళాయతేక్షణ కటాక్ష విలాస రస ప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకుఁ దలమున్కలు గండుమీలకున్. 15

అర్థము :— చిత్తజుడు = మన్మథుడు, అల్గి = కోపించుకొని, తూపు = తన బాణమును, మొనచేసినన్ = వాడిచేసినా, చేయఁగనిమ్ము = చేసినా, పై = మీదికి, ధ్వజంబు ఎత్తినన్ = జండా ఎత్తినా (దండెత్తినా), ఎత్తనిమ్ము = ఎత్త వచ్చు; కల్గినమాట గట్టిగా వచియించెద = ఉన్నమాటను గట్టిగా చెప్పుతాను; ఆ తరళ ఆయత ఈక్షణ = చలిస్తున్నట్టి విశాలమైన కన్నులుగల ఆ సుభద్రయొక్క, కటాక్ష విలాస రస ప్రవాహముల్ = క్రేగంటి చూపుల యొక్క శృంగారరస ప్రవాహములు (కటాక్ష విలాసము అను రస - నీటి - ప్రవాహములు), తామరలకున్ = పద్మములకు, కుత్తుకబంటి = కంఠముఎంతకు (పీకలమీద నుండునది - అనగా ప్రమాదకరము) ఉంటాయి; గండుమీలకున్ = బేడిస చేపలకు, తలమున్కలు = తలలు ముంచునట్టివి (మిక్కిలి ప్రమాదమును సూచించునవి) అవుతాయి.

విశేషము :— ఈ పద్యమునందు కవి సుభద్రకన్నులు పద్మముల కన్నను, గండుమీల కన్నను ఉత్కృష్టమైనవనివర్ణించినాడు. పద్మము మన్మథునిబాణము, చేప ధ్వజము, మన్మథుడు తన ఆయుధములను సుభద్ర కన్నులముందు కించపరచిన కోపముచేత తనబాణము, పద్మమును వాడిపట్టినా, తనధ్వజము - బేడిసచేపను పైకి ఎత్తినా వానికి క్రమముగా సుభద్ర కటాక్ష విలాస రసప్రవాహములు కుత్తుకబంటిగానూ, తలమున్కలుగానూ ఉంటాయని అంటాడు దర్జునుడు. బాణము మొనచేయడమూ (కత్తినూరడము లాగా), ధ్వజమెత్తడమూ పోట్లాటకు ప్రయత్నము.

మీరును, తిరస్కరించును అని చెప్పడానికి బదులు కవి కుత్తుకబంటి, తలమున్కలుగా నుండును అని కటువుగా చెప్పుటకే 'గట్టిగా వచింతును' అని అన్నాడు.

ప్రవాహము పద్మమునకు మెడవరకున్ను, చేపలకు తలమునుగునట్లూ ఉండడము సహజము. అదియే కలిగినమాట అని కవి అభిప్రాయము. ఆమె కనులు పద్మాల కంటె చేపల కంటె అందముగా ఉంటాయన్నమాట గూడా కలిగిన మాటే అని చమత్కారము.

పద్యములో ప్రాధాన్యము వహించిన ప్రవాహమును కవి కటాక్ష విలాసరసముతో నిర్మించుకున్నాడు. "అంతిపురమున..." అన్న పై 11 వ పద్యములో ఓరగా చూచినపుడు శృంగారరసము అపారముగ నుబ్బి జాలె త్తెనౌర అని వర్ణించిన శృంగారరసపు జాలు—ప్రవాహమే ఈ పద్యమునందలి కటాక్ష విలాసరస ప్రవాహము.

అలంకారము :— లోకోక్తి, శ్లేష, పరికరము.

అని తాల్మిఁ బాయు; 'నేవచ్చు
నని యెప్పటివలెనె తిరిగి యరుదేర దొకో?'
యని యూనసేయు; 'వచ్చిన,
నన్నృతోదరి నింక వేడువ'నని తలపోయున్. 16

(34)

అర్థము :— అని = ఇట్లుతలచుచు, తాల్మిగా బాయున్ = ఓర్పువీడును. ఎప్పటివలెనే = మొదటి విధముగనే, (సుభద్ర) తిరిగి = మరల, సేవకు అని = శుశ్రూష చేయుటకు అను తలంపుతో, అరుదేరదు ఒకో = రాకూడదా! అని, యాసచేయు = ఆశను పొందును, వచ్చినన్ = వచ్చినయెడల, అన్కృత ఉదరిన్ = చాలా చిన్నదైన కడుపుగలది అనగా సన్నని నడుముకల సుభద్రను, ఇంకన్ = ఇకమీదట, విడువన్ = విడిచిపెట్టను, అని, తలపోయును = ఆలోచించును.

తాత్పర్యము :— పద్యములో మొదట అర్జునుడు ఓర్పుపోగొట్టుకొన్నాడు, తిరువాత సుభద్రవచ్చునని ఆశించాడు, వచ్చిన పిదప తను చేయదగు కార్యమును ఊహించుకొన్నాడు. ఇది విరహులకు సహజమైనది.

విశేషము :— ఇక్కడ సుభద్రను 'అన్కృతోదరి' అన్కృతమును అనగా అబద్ధమును ఉదరమునందు కలది - అని చెప్పడానికి కారణము ఉంది. ద్వితీయాశ్వాసములోని 195వ పద్యములో "కేకినుల్రా సఖీజనులేతెంచి రటంచు వేమొరగి..." పోవడము అర్జునుడు మరవలేదు. అటువంటి అబద్ధములకు సుభద్ర మరల పూనుకొనినా ఇంక అవకాశమీయ కూడదని ఇప్పటి నిర్ణయము.

అలంకారము :— పరికరము, అనుప్రాసము.

విరహాగ్ని కోర్వక విధి దూఱుకొనెడు తాఁ
తపసి వేసం బేల తాల్చినాఁడు ?
కడ లేని సెకలఁ గందెడు ఘనోదయవేళఁ
దెలిసియుఁ దానేల వలచినాఁడు ?
శుక శారి కార్భటులకుఁ దల్లడిలెడు తా
నుపవనంబున నేల యుండినాఁడు
కరగతస్వము వోవు కరణిఁ జింతిలెడు తా
వెలఁది నేటికిఁ బట్టి విడిచినాఁడు ?
నేరములె యెంచెద మటన్న నేరికైనఁ
గలవు పరికించి చూడ; నందులకు నేమి ?
యంగ సాంగత్య పారవశ్యమునఁ గాత
యెఱిఁగి యుండిన నతఁడు చేయేల విడుచు ? 17

ఇతరులు అర్జునుడిని గురించి చేసే విమర్శనలకు మన కవి ఈపద్యములో సమాధానము ఇస్తున్నాడు.

అర్థము :— విరహాగ్నికిన్ = విరహతాపమునకు, విధిన్ = దైవమును. దూఱు కొనెదు = నిందించుకొనే, తాన్ = తాను (అర్జునుడు), తపసివేసంబు, ఏలతాల్చినాడు ?

తాపసులు ఎండకు, వానకు, చలికి ఓర్చుకొని ఉండవలెను. అట్లు చేయలేనివాడు తపసి వేషము వేయడము తప్పు. ఎండకాలమున పంచాగ్నుల మధ్యను, వర్షకాలమున, జారుబండల మీదను, శీతకాలమున లోతునీటియందును ఉండి తపసు చేయవలయును అని నియమము ఉంది. అర్జునుడు మరేవేషము వేసినా ఈ నింద కలుగకపోవును.

౨. కడలేని = అంతములేని, సెకలన్ = తాపముతో, కందెడు = బాధించునట్టి, ఘన ఉదయ వేళన్ = మేఘ ఉదయ కాలమును (తొలకరి మబ్బుల సమయము), తెలిసియు = తెలిసి యుండియు, తాను ఏల వలచినాడు ?

తొలకరి మబ్బుల సమయము ప్రేమికులను అంతము లేని తాపమున తపింప చేస్తుంది. ఈసంగతి తెలిసి గూడా తాను ఈ సమయమున ఎందుకు ప్రేమించాలి ? ఇది పొరపాటు,

అర్జునుడు ద్వారకకు వచ్చిన సమయము చాతుర్మాస్యము (ద్వి. ఆ. 2 . 115). చాతుర్మాస్యము ఇక్కడే గడపవలెనని బలరాముడు కోరాడు.

చాతుర్మాస్యము అనగా ఆషాఢ శుద్ధము మొదలు కార్తీక శుద్ధము వరకు. కాబట్టి అర్జు నుడు వచ్చినది తొలకరి ప్రారంభమే.

౩. శుక = చిలుకలయొక్క, శారిక = గోరువంకలయొక్క, ఆర్పటులకున్ = ధ్వను లకు (కలకలములకు), తల్లడిలెడు = పరితపించునట్టి, తాను, ఉపవనంబున = ఉద్యానవనమున ఏల ఉండినాఁడు ?

పక్షుల కలకలమునకు భయపడువాడు ఆ పక్షులకు ఉనికిపట్టుగా ఉండే ఉద్యానవనమునకు రావడము పొరపాటు.

౪. కరగతస్వము = చేతిలో ఉన్న సొత్తు, పోవుకరణి = జారిపోయిన విధముగ, చింతిలెడు = విచారించే, తాను, వెలఁదిన్ = సుభద్రను, ఏటికి = ఎందులకు, పట్టివిడిచినాఁడు = పట్టుకొని కూడ విడచిపెట్టినాడు ?

చేతిలో ఉన్న సొత్తు పోయినట్టు విచారించువాడు చేతికి చిక్కిన సుభద్రను విడిచిపెట్ట డము పొరపాటు.

ఈ పాదమున వెలది (వెలగలది) అను శబ్దప్రయోగము సాభిప్రాయము.

నేరములే = తప్పులే, ఎంచెదమటన్నన్ = లెక్కపెట్టుటకు పూనుకుంటే, పరికించిచూడ = పరిశీలించి చూడ, ఏరికైననుగలవు = ఎవరికైన ఉంటాయి, అందులకునేమి ? అంగ

సాంగత్య పారవశ్యమునన్ = (సుభద్రయొక్క) శరీరము తాకుట వలన (కలిగిన) మైమరపు చేత, కాక = కాకపోతే, ఎరిగియుండినన్ = తెలిసియుండిన, అతడు, చేయేలవిడుచు = విడిచిపెడతాడా ?

తపసివేషము వేసి విధిని నిందించడమూ, కామోద్దీపకమయిన తొలకరిమేఘాల సమయములో ప్రేమించడమూ, శుకశారికల ధ్వనులు సహించలేని వాడు ఉద్యానవనమున ఉండడమూ చేతిలోని ధనము పోగొట్టుకున్న వాడిలాగా దుఃఖించే వాడు సుభద్రనుపట్టి విడిచి పెట్టడమూ అన్నీ పొరపాటులే అని భావము.

*పాఠాంతరము :—*

'నేరములె కల వెంతటి వారికైన
నన్ని యన వచ్చుఁ బైనుండి, యందు వేమి ?'

—నోరివారు.

ఉనికి శృంగారవన మఁట, యొంటిఁ దగిలె
నఁట, విరహి యఁట, యెంతసేయఁడు కిరీటి
నసమశరుఁడింకఁ దనవైరి యగు లలాట
లోచనుని గెల్చునని దయఁగాఁచె గాక. 18

*అర్థము :—* (ఈ అర్జునుడు) ఉనికి = ఉండడము, శృంగారవనమఁట = ఉద్యానవనము లోనట, ఒంటి తగిలెనఁట = (మన్మథుడికి) ఒంటరిగా దొరికాడట, విరహియఁట = విరహము పాలబడినవాడట (నిస్పృహలో పడి ఉన్నవాడు), అసమశరుఁడు = మన్మథుడు (కటువులైన బాణములుగల వాడని విశేషము), కిరీటిని = అర్జునుడిని, యెంతసేయఁడు = ఏమి చేయలేఁడు? అన్ని విధముల బాధించగలడు అని అర్థము. (మన్మథుడు పెట్టగలిగిన బాధలలో సంజ్వరము, ఉన్మాదము, మూర్ఛ, మరణము కూడా ఉన్నాయి. అనగా అర్జునుడికి మరణము కూడా గల్గించ గల అవకాశము ఉంది; కాని ఆపని జరుపలేదు.) ఎందుకంటే — ఇంక = ముందుముందు, తనవైరి = మన్మథునియొక్క శత్రువు, అగు, లలాటలోచనుని = లలాటమందు కన్ను కలిగిన శంకరుని, గెల్చునని = (అర్జునుడు) ఓడించునని, దయన్ = దయతో, కాచెఁగాక = ప్రాణములు నిలిపినాడు (లేకుంటే చంపేవాడే).

*విశేషము :—* కిరాతార్జునములో కిరాతుడి రూపములో ఉన్న శివుని అర్జునుడు ఓడించి పాశుపతాస్త్రమును పొందిన కథ ఇక్కడ జ్ఞాపక ముంచు కోవాలి.

ఈ పరిస్థితులలో అర్జునుడిని చంపగలిగి కూడా విడిచి పెట్టడానికి కారణము : ముందు ముందు తనకు ప్రబలశత్రువైన శంకరుని ఓడించడానికి ఇతడు అవసరమవుతాడనే. ఈ

పద్యములో మన్మథుడిని భస్మము చేసిన ఈశ్వరుడిని 'లలాటలోచను' డనడము అభిప్రాయ పూరితము.

అలంకారము :— ఉత్ప్రేక్ష.

## సుభద్ర విరహము

ఇటులాతఁ డుండఁగా, న
క్కుటిలాలక యంత నచటఁ గుసుమశ రార్తిన్
బెటిలి పడి, పాన్పుపైన
ట్టిటు వడి, దనలోనఁ దాన యేకాంతమునన్. 19

అర్థము :— ఇటుల ఆతడు (అర్జునుడు) ఉండగా, ఆ కుటిల అలక = వంకరలైన ముంగురులు కలిగిన ఆ సుభద్ర, అంతన్ = ఆ సమయమున, అచటన్ = తన అంతిపురమున, కుసుమశర = మన్మథునియొక్క, ఆర్తిః = బాధచే, పెటిలిపడి = సడలిపోయి, పాన్పుపై అట్టిటుపడి = ప్రక్కమీద కొట్టుకులాడి, ఏకాంతమునన్ = చెలికత్తెలు లేని సమయమందు, తనలోతానె (ఈ క్రింది విధముగా అనుకున్నది).

"ఏ గోరిన చెలువుఁడె ననుఁ
దాఁ గావలె నంచు వచ్చి దగ్గఱివేఁడం,
గౌఁగిలి యీ కిటు వచ్చితి
నౌఁగాదని పెనఁగి ; యెంత యవివేక మయో ! 20

అర్థము :— ఏన్ = నేను, కోరిన = వలచిన, చెలువుఁడె = అందగాడే, తాన్ = తానై, నను గావలెనంచు = ననుకోరి, వచ్చి, దగ్గఱి = దగ్గరగావచ్చి, వేఁడన్ = ప్రార్థించినప్పుడు, ఔః = ఔను, కాదు, అని, పెనఁగి = పెనుగులాడి, కౌఁగిలి = ఆలింగనమును, ఈః = ఇవ్వకుండానే, ఇటువచ్చితి; ఎంత అవివేకమయో = ఎంత తెలివి తక్కువ పని చేశాను.

"దిగ్గున లేచి నన్నతఁ డతిప్రమదంబునఁ జందమామ ఱా
నిగ్గుటరంగు మీఁదికయి నెమ్మిఁ గరాబ్జము వట్టి యీడ్చినఁః,
బిగ్గఁ గవుంగిలించి సుఖనీరధిఁ దేలఁగనీక, నా కయో !
సిగ్గనుపేర వెంటఁబడఁ జెల్లునొకో ప్రతిబంధ మయ్యెడన్ ! 21

అర్థము :— దిగ్గునన్ = తటాలున, లేచి = నిలువబడి, నన్ను, అతడు, అతి ప్రమదంబున = మిక్కిలి సంతోషముతో, చందమామఱా = చంద్రకాంత శిలలతో చేయబడిన, నిగ్గు = మెరయుచున్న, అరంగుమీదికయి = తిన్నెమీదికి, కరాబ్జమున్ = పద్మమువంటి చేతిని, నెమ్మిన్ = ప్రేమతో, పట్టి, ఈడ్చినన్ = లాగినప్పుడు, బిగ్గన్ = గట్టిగా, కవుంగిలించి = కవుగిలించి, (తత్ఫలితముగ) సుఖనీరధిన్ = సౌఖ్యము అనుసముద్రమునందు, తేలఁగనీక = తేలునట్లు చేయక, అయ్యెడన్ = ఆ సమయమునందు, నాకు, అయ్యో ! సిగ్గు అను పేరన్ = సిగ్గు అనే నెపముతో, ప్రతిబంధము = ఆటంకము, వెంటబడ చెల్లునొకో = వెంట పడుట న్యాయమా !

*విశేషము* :— ఉద్యానవనమున జరిగిన దంతా సుభద్ర స్మరించుకుంటూ ఉంది.

*అలంకారము* :— అపహ్నుతి.

"తొల్లిటివలె సేవకుఁ బోఁ  
జెల్లునె ? మావారు పెండ్లి చేసెద రిదిగో  
యెల్లిఁ దమ కంచుఁ బలికితి,  
నెల్లిద మగుఁ గాదె తిరిగి యేఁ బైకొన్నన్ !" 22

అర్థము :— తొల్లిటివలెన్ = మునుపటిలాగే, సేవకు = శుశ్రూషకు, పోన్ చెల్లునె = వెళ్లవచ్చునా - కూడదు కదా, "మావారు = మా పెద్దలు, ఇదిగో, ఎల్లి = రేపు, తమకు = మీకు పెండ్లి చేసెదరు," అంచు = అని, పలికితిన్ = చెప్పివచ్చాను, తిరిగి = అట్లు చెప్పికూడ, ఏన్ = నేను, పైకొన్నన్ = వెళ్లుటకు పూనుకున్న యెడల, ఎల్లిదము = చులకన, అగున్ గాదె = అవుతుంది గదా !

*అలంకారము* :— యమకము.

"ననుఁ దా వలచి పడ్డ నలఁకువల్ దీఱంగఁ  
గైసేయ నెన్నఁడు గలుగునొక్కొ,  
పెనఁగి చే విడిపించుకొనిన నేరమి వోవఁ  
గెలన నెన్నఁడు నిల్వఁ గలుగునొక్కొ,  
ప్రియ మెఱుంగక యడ్డపెట్టిన దుడుకు వోఁ  
గళ్యాణ మెన్నఁడు గలుగునొక్కొ,

మోహతాపము దీఱ మోవి చక్కెరపాన
　　　　కమున నెన్నఁడు దేల్పఁ గలుగునొక్కొ,
యొంటి శృంగారవనములో నునిచివచ్చి
నట్టి నెంజిలి యెల్లఁ బో నానృపాల
తిలకుఁ జేర్పంగ నెన్నఁడు గలుగునొక్కొ
యాము గవిసిన కుచకుంభ సీమయందు." 23

సుభద్ర తాను చేసిన తప్పులకు పరిహారాలు ఊహించుకుంటూంది.

*అర్థము* :— నను, తాఁ, వలచి = ప్రేమించి, పడ్డ = పొందిన, నలకువల్ = ఆయాసములు, తీఱంగన్ = పోవునట్లు, కై సేయన్ = (అర్జునుని) అలంకరించే అవకాశము, ఎన్నడు గలుగునొక్కొ = ఎప్పుడు దొరుకునోగదా!

౨. పెనఁగి = పెనగులాడి, చే = చేతిని, విడిపించుకొనిన, నేరము = తప్పు, పోవన్ = పోవునట్లు, కెలనఁ = (అర్జునుని) ప్రక్కను, ఎన్నడు, నిల్వగలుగునొక్కొ = నిలబడగలనో!

౩. ప్రియమెఱుంగక = ప్రేమను గుర్తించకుండ, అడ్డపెట్టిన = ఆటంకపరచిన, దుడుకు = మొరకు తనము, పోన్ = పోవునట్లు, కళ్యాణము = శుభము, ఎన్నడు కలుగునొక్కొ!

౪. మోహతాపము = (అర్జునుడి) మోహము వలన కలిగిన వేడి (ఆయాసము), తీఱ = పోవునట్లు, మోవి = అధరమునందలి, చక్కెరపానకమున్ = తీయని పానకముతో, ఎన్నడు, తేల్పఁ, గలుగునొక్కొ = సంతృప్తి కల్గించగలుగుదునో!

శృంగారవనములోఁ = ఉద్యానవనమందు, ఒంటి = ఒంటరిగా, ఉంచివేసి, వచ్చినట్టి, నెంజిలి = మనోవ్యధ, ఎల్లఁబోన్ = అంతయు పోవునట్లు, ఆ నృపాలతిలకుఁ = ఆ రాజ శ్రేష్ఠుని, ఆముగవిసిన = క్రొవ్వు అధికమైన (అనగా మదించియున్న), కుచకుంభ = కుంభములవంటి కుచముల, సీమయందు = ప్రదేశమందు, చేర్పంగఁ = చేర్పగ, ఎన్నడు గలుగునొక్కొ!

*పాఠాంతరము* :—

"చెలుల కోర్కెలు దీఱ చెలువునితో నాకు
కమనీయ వనకేళి గలుగునొక్కొ"

— సోరివారు.

ఈ పాఠములో తక్కిన చరణములలోవలె సుభద్ర చేసిన పొరపాటున్ను, దాని కను గుణమైన పరిహారమున్ను లేవు కాబట్టి అంగీకారము కాదు.

అని యెంచరాని కోర్కులు
మనమునఁ దలపోయు, భావ మగ్నత చేతం
గనుమూయుఁ, గలసినటు కల
గనీ సంతస మందుఁ, దెలిసి కళవళమందున్. 24

అర్థము :— అని = ఈ విధముగా, ఎంచరాని కోర్కులు = అలవిగాని కోరికలను, మనమునన్ = మనస్సునందు, తలపోయున్ = ఆలోచించుకొనును, భావమగ్నతచేతన్ = మనోహరములైన ఆ భావములలో మునిగి ఉండడంచేత, కనుమూయున్ = చిన్న నిద్ర తీయును, ఆ నిద్రలో - కలసినట్లు = అర్జునునితో కూడినట్లు, కలగని, సంతసమందు = (నిద్రలోనె) సంతోషమందును, తెలిసి = మేల్కొని, కళవళమందున్ = (అదంతయు వట్టిదే నని) కలతచెందును.

విశేషము :— అలవికాని కోరికలు తలంచడమూ, ఆ భావములలో మునిగి కన్ను మూయడమూ, కలలో అర్జునుని కూడి సంతోషించడమూ, కలచెదరి మేల్కొని కళవళ పడడమూ—భావ పరిణామము చక్కగా నిరూపించాడు కవి.

అలంకారము :— సముచ్చయము.

ఉదయాద్రి యెరగలి నొరసి మీఁద వెలుంగు
జలజారి వేఁడివెన్నెలలు గాయ,
హరు కంటిసెగ కోర్చి యాఱితేఱిన మారుఁ
డలరుఁ జిచ్చరవాఁడి ములుకులేయఁ,
బాముకోఱలతోడ సాము చేసిన గాడ్పు
విసపు విత్తై సోఁకి వెగటు సూపఁ,
గ్రౌంచాచలము పోటుగంటి దూఱిన రాజ
హంసముల్ వడి హాళాహళులు సేయ,
వేగునంతకు వలవంత వేఁగు నంత
నంతిపురమునఁ బ్రమద వనాంతరమునఁ
గృష్ణ కృష్ణా! యటంచు నా కీరవాణి,
రామ రామా! యటంచు నా రాజసుతుఁడు. 25

*అర్థము* :— ఉదయాద్రి = తూరుపుకొండ మీఁది, యెరగలిఁగా = కార్చిచ్చుతో, ఒరసి = రాపాడి, మీఁదఁగా = ఆకాశమున, వెలుంగు = వెలిగే, జలజారి = కమలములకు శత్రువగు చంద్రుడు, వేఁడివెన్నెలలు కాస్తుండగా,

వెన్నెల విరహులకు వేడిగా ఉంటుందట. చంద్రోదయ సమయమున తూర్పు కొండ యందు ఎర్రని కాంతులు కార్చిచ్చువలె కనబడుట ప్రకృతి సిద్ధము. ఆ నిప్పును ఒరసికొని వచ్చినట్టు కనుపించు చంద్రుడు కాపుననే వేడి వెన్నెలలు కాయగలిగాడు.

౨. హరు = ఈశ్వరునియొక్క, కంటిసెగకు = కంటిమంటలకు, ఓర్చి = సహించి, ఆఱితేఱిన = గడితేరినట్టి, మారుఁడు = మన్మథుడు, అలరు = పూవులు అనే, చిచ్చర = నిప్పుతోకూడిన, వాడిములుకులు = సూదియైన బాణములు, ఏయఁగా = ప్రయోగించగా,

(హరుకంటిసెగకు మారుడు ఆఱి = నశించి, తేఱి = బ్రతికిన వాడని చమత్కారార్థము).

హరుని కంటి అగ్నిలో భస్మమై ఆరితేరినవాడు కావున నిప్పుతో కూడిన శరములు వేయుట సహజము.

౩. పాము కోఱలతోడఁగా, సాముచేసిన = పోట్లాడిన, గాడ్పు = గాలి, (మలయ మారుతము), విసపువిత్తై = విషబీజమై, సోఁకి = శరీరమునకు తగిలి, వెగటుచూప = అసహనమును కలిగించగ (పాములకు గాలి ఆహారము; కాబట్టి వారి విషపు కోరలతో పెనగు లాడి వచ్చిన గాలి విషపు బీజమైనది).

౪. క్రౌంచ అచలము = క్రౌంచపర్వతము, పోటుగంటిఁగా = బాణముల పోటుచేత కలిగిన రంధ్రమునుండి, పారిన = చొరబడి పోవునట్టి, రాజహంసముల్ = రాజహంసలు. వడి = విజృంభించి, హళాహళులు = కోలాహలము, సేయన్ = చేయగా,

పరశురాముడు క్రౌంచపర్వతమున బాణప్రయోగముచే చేసిన గంటులో దూరి రాజహంసలు మానససరోవరమునకు పోవుట వచ్చుట పురాణ కథ. ఇచట పోటుగంటినుండి రాజహంసలు దూరి, వీరభటులు చేయు కష్టకార్యమును చేసి, విజృంభించుట వాటి కాఠిన్యమును తెలుపుతుంది.

వేగునంతకున్ = తెల్లవారునప్పటి, వలవంతఁగా = విరహతాపముచే, అంతిపురమున, ఆ కీరవాణి = చిలుక పలుకులుగల ఆ సుభద్రయు కృష్ణ కృష్ణా అటంచు, వేగున్ = పరి తపించును, ప్రమద వన అంతరమున = ఉద్యానవనములోపల, ఆరాజసుతుడు = అర్జునుడును, రామ రామాయటంచును, వేగుఁగా = పరితపించును.

*విశేషము* :— ఆపదలోనున్న వారివలెనె సుభద్ర ''కృష్ణకృష్ణా'' అనీ, అర్జునుడు "రామరామా అనీ" భగవంతుని స్మరించుటలో అర్జునుని ఏకాదశనామమును (కృష్ణ), 'రామ' కు గల స్త్రీ అర్థమును కవి చమత్కారముగా ప్రయోగించినాడు.

అర్జునునకు అర్జున, ఫల్గుణ, పార్థ, కిరీటి, శ్వేతవాహన, బీభత్స, విజయ, జిష్ణు, సవ్యసాచి, ధనంజయ అన్న పదిపేరులే గాక "కృష్ణుండను ఏకాదశ నామంబును" కలదు.

*పాఠాంతరము :—*

తిరుపతివారు—''వేగునంతకు వలవంత వేగిరింత....'' అన్నారు.

*అలంకారము :—* తద్గుణము, యమకము, శ్లేష.

చెలులు ప్రసంగవశంబున
నలరెం గడు విజయభవన మనినఁ నవలా
దెలియ వినున్, గలయఁ గనుఁ,
బలుమఱు బాగౌఁ గిరీటిపచ్చ లటన్నఁ. **26**

*అర్థము :—* చెలులు = చెలికత్తెలు, ప్రసంగవశమునన్ = మాటల సందర్భములో, విజయభవనము = విజయభవనమను మందిరము, కడుఁ అలరెన్ = మిక్కిలి అందముగా నున్నది (అని), అనినఁ = చెలులు చెప్పుకొనినపుడు, నవలా = యవ్వనమునన్న సుభద్ర, తెలియఁ వినుఁ = చాలా శ్రద్ధతో వినును; బాగు ఔ కిరీటి పచ్చలు అటన్నఁ = కిరీటి పచ్చలు (మరకతమణులు) బాగుగా నున్నవి అనినపుడు, పలుమఱు = మరిమరి. కలయన్ కనుఁ = నాలుగు ప్రక్కలను చూచును.

*విశేషము :—* ఒక మందిరము పేరు విజయభవనము[1]. మరకతమణులలో కిరీటి పచ్చలు ఒకజాతి. గిరీటిపచ్చలనే కొందరు గరుడపచ్చ లంటారు.

''గోమేధ్యంబుల కుట్టిమంబులతోఁ గిరీటి పచ్చల వితర్దికల తోడ"

.... వరాహపురాణము.

చెలులలో సంభాషణలలో ఆ మాటలు వచ్చినపుడు విజయ, కిరీటి అన్న పదముల వలన అర్జునుడన్న భ్రాంతిగలిగి శ్రద్ధతో విని, నలుదిక్కులు కలయ జూస్తుంది.

*అలంకారము :—* స్మృత్యలంకారము.

1. విజయ సూచకమైన భవనమునకు విజయ భవనమని పేరు. కృష్ణదేవరాయలు నిర్మించిన ఇట్టి భవనమునకు భువనవిజయమను పేరుంది. కృతిపతి రఘునాథరాజు తన విజయముల జ్ఞాపకార్థము గట్టించిన మందిరానికి విజయభవనమనే పేరుపెట్టారు. దీనినే 'విజయవిలాసము' అని గూడా అనేవారు. తంజావూరిలో మన కవి వ్రాసిన ఈపద్యము చూచినప్పుడు తంజావూరు ప్రజలు, ఆ విజయభవనాన్ని జ్ఞాపకము చేసుకోక తప్పరు.

మనమున సున్నది మొగమునఁ
గనిపించుం గాన, గట్టిగా మదిలో స
ర్జునభావ మునికి, నపు డ
ర్జున భావము మొగమునందు సుదతికి నిల్చెన్. 27

అర్థము :— మనముననున్నది = మనసులో ఉన్నది, మొగమునఁ గనుపించుఁ గానఁ, సుదతికి = సుభద్రకు, మదిలో గట్టిగా, అర్జునభావము, (అర్జునుడిపై తలంపు), ఉనికిఁ = ఉండుటచేత, అపుడు = ఈ విరహావస్థయందు, అర్జునభావము = అర్జునత్వము - అనగా తెల్లదనము, మొగమునందు, నిలిచెఁ = కనుపించెను, (ముఖము పాలిపోయిందని భావము).

అలంకారము :— అర్థాంతరన్యాసము, యమకము.

## వదినెలు మేలము లాడుట

'పులకించె మే నేమి తలఁచుకొంటివె ?' యంచు
మేలంబు పచరించె మిత్రవింద,
'యిన్నాళ్లవలె మనసిచ్చి మాటాడవే !
యెందు దృష్టి' యని కాళింది తెగడెఁ,
'జెలి పెండ్లికత సెప్పఁ జెవి యొగ్గి వినవేమి ?
కలదులే, యని గేలిసలిపె భద్ర,
'వలపు వాసన మించెఁ గలికి నీమొగ;' మంచుఁ
ద్రస్తరి నెఱపె సుదంత కొంత,
జాంబవతి నవ్వె, లక్షణ సరసమాడె,
'నే లగడు చేసెదరు ముద్దరాలి' ననుచుఁ
బలికె రుక్మిణి, సత్య క న్గలిపె, నపుడు
చిన్ని మఱఁదలి మోహంపుఁ జిన్నె లెఱిఁగి. 28

ఈ మేలమాడడములో కృష్ణుడి ఎనమండుగురు భార్యలూ ఉన్నారు.

అర్థము :— చిన్ని మఱఁదలి = ముద్దుమరదలు సుభద్రయొక్క, మోహంపు = ప్రేమను తెలియజేసే, చిన్నెలు ఎఱిఁగి = లక్షణములు గుర్తించి,

౧. మిత్రవింద. 'మేను = సుభద్రా నీ శరీరము, పులకించె = గగుర్పాటు చెంది ఉంది. ఏమి తలచుకొంటివె = శృంగార సంబంధమైన ఏ విషయమును ఊహించుకుంటున్నావే' అని. మేలంబు = పరిహాసము, పచరించె = చేసెను.

౨. కాళింది. 'ఇన్నాళ్ళవలె, మనసిచ్చి = దాపరికం లేకుండా, మాటాడవే = మాట్లాడకుండా ఉన్నావే. ఎందుదృష్టి = దేనిమీద నీభావము లగ్నమయింది. అని, తెగడెన్ = నిందించెను (అనగా పరిహసించెను).

౩. 'చెలి, పెండ్లికథ సెప్పఁగా చెవి ఒగ్గి వినవేమి, కలదులే = ఏదో విశేషముందిలే' అని భద్ర గేలి = ఎగతాళి, సలిపెను.

౪. 'కలికి = సుభద్రా, నీ మొగము, వలపు వాసనఁగా = సుగంధపరిమళముతో, మించెఁగా = అతిశయించి యున్నది' - అనగా విశేషముగా పరిమళించుచున్నది. (దీనియందలి అంతరార్థము వలపు = ప్రేమయొక్క, వాసన = భావము, అతిశయించి యున్నది అని). ఈ శ్లేష వాక్యముతో సుదంత, కొంత త్రస్తరి = కొంత ఎగతాళి, నెఱపె = సాగించింది.

జాంబవతి నవ్వె, లక్షణ సరసమాడె, 'ఏల = ఎందుకు, ముద్దరాలిని = ఏమీ యెరుగని మరదలు సుభద్రను, అగడు చేసెదరు = అల్లరి చేస్తున్నారు?' అనుచు రుక్మిణి పలికె. సత్య = సత్యభామ, కన్గిలిపె = కన్ను గీటెను.

*విశేషము* :— సుభద్ర అన్సురుస్సురవుతుండినా, ఆమె ప్రేమరహస్యము తెలిసినవారు కాబట్టి వదినెలు ఈ విధముగా పరిహాసము చేస్తున్నారు.

అందరికీ పెద్ద అయిన రుక్మిణి తక్కిన వారలను మందలించినట్లు 'ముద్దరాలిని అల్లరి చేయవల దని చెప్పడమే, పెద్దతనానికి తగిన మరొకవిధమైన పరిహాసము; చాలా సహజము.

గడుసుది సత్య కన్నుగీటిందనడము మరీ బాగుంది.

*అలంకారము* :— శ్లేష, స్వభావోక్తి.

"అంగన, యిన్నాళ్లును ముని
చెంగటికిం బాటిపాటి సేవలు గావిం
పంగాఁ బోదువు; నేఁడటు
తొంగియుఁ జూడ, వతఁ డేమి దోసముసేసెన్?" 29

*అర్థము* :— "అంగన = సుభద్రా, ఇన్నాళ్లను = ఇన్ని రోజులున్నా. ముని చెంగటికిఁగా = ముని దగ్గరకు, పాటిపాటి = మిక్కిలి ఆసక్తితో పరుగులెత్తుతూ, సేవలు

కావింపంగా = ఉపచారములు చేయుటకొరకు, వోదువు = పోతుందే దాసవు; నేఁడు, అటు = ఆ వైపు, తొంగియుచూడవు = దూరము నుంచయినా చూడవు; అతడు = ఆ ముని, ఏమిదోసము చేసెఁ = ఏమి తప్పు చేసెను ?"

*విశేషము* :— 'పారిపారి' వెళ్లేదాసవు అనడములోనూ, 'తొంగియుచూడవు' అనడములోనూ సున్నితమైన హాస్యముంది. పారిపారిలోని శ్రద్ధకు, తొంగియు చూడవు లోని అనాదరణ సరితూకముగల పలుకుబడి.

"అక్కఱఁ జూడ వేటికల యచ్చిక బుచ్చిక సేయు నంచలం ?
జెక్కలిగొట్టె దేమిటికిఁ జేరఁగ వచ్చిన ముద్దుఁజిల్కలఁ ?
ముక్కు, మొగంబు జూడ కటు ముట్టను బొమ్మనె దేల బోట్ల ? నో
చక్కెరబొమ్మ, నీ వెగటు జాడలు సూచిన వింతలయ్యెడున్. 30

*అర్థము* :— అచ్చిక బుచ్చికచేయు = ఎక్కువ మచ్చికచూపుతున్న, అల అంచలఁ = ఆ హంసలను, అక్కఱఁ = ప్రేమతో, చూడవు ఏటికి = ఎందుకుచూడవు; చేరఁగవచ్చిన = నీచెంతకు (చనవుతో) వచ్చినముద్దుచిల్కలన్, చెక్కలిగొట్టెదు = చెంప వేయుదువు, ఏమిటికి? బోట్లను = బోటులను, చెలికత్తెలను, ముక్కుమొగంబుజూడక = మోమాటములేకుండా, అటు = ఆ విధముగ, ముట్టను = తాకనైనా తాకను, పొమ్మనెదు ఏల = ఎందుకు పొమ్మంటావు ? ఓ చక్కెరబొమ్మా = ఓ మధురస్వభావముగల సుభద్రా, నీ వెగటుజాడలు = అనిష్టమును తెలియజేసెడి, ప్రవర్తనలు (పైన చెప్పినవి అయిష్టమును తెలిపే ప్రవర్తనలు), చూచినఁ వింతలు అయ్యెడిఁ = ఇంతకు ముందు ఎన్నడూ చూడని విధంగా ఉన్నాయి.

*విశేషము* :— చక్కెరబొమ్మ మధురముగా ఉండవలసినది ఈ పద్యములో వెగటుగా కనబడుతున్నదని చమత్కారము. అది ఒక వింత. ఎన్నడూ చూడనిది వింత; సుభద్ర ఈలాగ ఎప్పుడూ ప్రవర్తించలేదన్నమాట.

"అచ్చిక బుచ్చిక'చేయు, 'ముక్కు మొగంబు చూడక"—చక్కని జాతీయాలు.

*పాఠాంతరము* :—

'అక్కల చూడవేటికి'

— వేదమువారు.

అక్కలకు అన్వయము దొరుకదు.

*అలంకారము* :— పరికరము.

"ఎవ్వనిఁ జూచి మేలుపడితే యరవింద దళాక్షి? నీమనం
బెవ్వఁడు సొచ్చెఁ జెప్పఁగదవే మదకోకిల వాణి? నిన్న నేఁ
డెవ్వని చెల్వు నీయెదుట నెన్నఁబడెన్ వినతాంగి? నేన కా
కెవ్వరు నీకుఁ బ్రాణపద? మేటికి దాఁచెదవే తలోదరీ? 31

ఈ పద్యములో నలుపురూ నాలుగు మాటలాడడం కవి వర్ణిస్తున్నాడు.

*అర్థము* :— అరవిందదళ అక్షి = తామర రేకులవంటి కన్నులుగల సుభద్రా, ఎవ్వని చూచి, మేలుపడితే = మోహించావు. మద కోకిల వాణి = మదించిన కోకిలవంటి కంఠస్వరము కలదానా, నీమనంబున = నీమనసులో, ఎవ్వఁడుచొచ్చెన = ఎవడు ప్రవేశించెను, చెప్పఁగదవే. వినతాంగి = (స్తనముభారముచే) కొంచెము వంగిన శరీరము గలదానా, (నీకు ఇట్లు మరులు కలుగుటకు) నిన్న నేఁడు = ఇటీవల, ఎవ్వనిచెల్వు = ఎవరియొక్క సౌందర్యము, నీయెదుటన, ఎన్నఁబడెన = వర్ణించబడెను? తల ఉదరి = పలుచని ఉదరముకలదానా, నేనెకాక ఎవ్వరు నీకు, ప్రాణపదము = ప్రాణముతో సమానమైనవారు? ఏటికి దాఁచెదవే = ఎందుకుదాస్తావు.

*విశేషము* :— మొదటి చరణములో చూచుటకు ఉచితముగా 'అరవింద దళాక్షి', రెండవచరణమున చెప్పుటకు అనుకూలముగ 'మదకోకిలవాణి', నాల్గవచరణములో దాచుటకు (కడుపున దాచుకొనుట అని లోకోక్తి) తగినట్లు 'తలోదరి' అని ఈడుమూ సంబోధనలు సాభిప్రాయములు, మూడవచరణమున కర్త సుభద్రగాక ఇంకెవరో అగుటచేత పైరీతి సొగసుకి అవకాశములేదు.

సుభద్ర అవస్థ అంతా ప్రేమకు సంబంధించిందే అని తేల్చి మాటలాడుతున్నారు.

*అలంకారము* :— పరికరము.

"బాలసమీరణంబు పయిపాటున నించుక సోఁకినన్ గడుం
దూలుచు నుండు దానవు; వినోదపు సుద్దుల ముద్దుఁజిల్క పై
వ్రాలినఁ గందుఁ గేలు; పువువంటిది నీ నునుమే; ని దేగతిం
దాళునొకో వియోగశిఖి దానెదలోఁ దరికోఁ దలోదరీ!" 32

ఈ పద్యములో మరికొందరు ఇది విరహతాపమే అని నిశ్చయించి అంటున్నాడు.

*అర్థము* :— బాలసమీరణంబు = పిల్లగాలి, పయిపాటునన = మీదుగా, ఇంచుక = కొంచెము, సోఁకినన = తాకినంతమాత్రమున, తూలుచునుండు దానవు = సోలిపోతుందే దానవు, వినోదపు = వినోదము కలిగించే, సుద్దుల = మాటలుగల, ముద్దుచిల్క = నీ ప్రియమైన చిలుక, పై వ్రాలినన = మీదవాలినప్పుడు, కేలు = నీచేయి, కందున = కందిపోతుందే.

నీ నునుమేను = మృదువైన శరీరము, పుపువంటిది = పువ్వువలె కోమలమైనది, వియోగశిఖి = విరహము అనే అగ్ని, తాను, ఎదలోన = నీ హృదయములో, దరిలోన = మండుతుండగా, తలోదరీ = పల్చని కడుపు కల సుభద్రా, ఇది = ఈ కోమలశరీరము, ఏగతిన = ఏవిధముగ, తాళనోకో = సహించగలదోకదా !

"తూలుచునుండు గౌనల వినోదపు సుద్దులు" అని పాఠాంతరము. పిల్ల వాయువు సోకి నంతనే కౌను (నడుము) మాత్రము అల్లాడును అని చెప్పుటకన్న తానే తూలిపోవును అని చెప్పుటయందు ఎక్కువ సౌకుమార్యము కనుపించును. కాబట్టి ఈ పాఠము అంగీరించలేదు. ఇంతేకాక 'కౌను' అని పఠించినపుడు అర్థపుష్టిలేని 'అల'తో "అల వినోదపు సుద్దుల ముద్దు జిల్క' అని చదువవలసి యుండును.

*అలంకారము* :— అనుప్రాసము, అతిశయోక్తి.

అని వారికి వా రందఱు
మనమునఁ దోఁచినటు లాడు మచ్చిక మాటల్
విని సిగ్గున నయ్యెల జ
వ్వని యూరక యున్న నపుడు వారలలోనన్. 33

*అర్థము* :— అని వారికి వారందఱు, మనమున తోచినటుల = ఎవరికి తోచినట్లు వారు, ఆడు = చెప్పుకొను, మచ్చికమాటల్ = చనవుతో కూడిన మాటలు, విని, ఆ యెలజవ్వని = లేజవరాలు సుభద్ర, సిగ్గునన్, ఊరక = ప్రత్యుత్తరము ఇవ్వకుండా, ఉన్నన్ = ఉండగా, అపుడు వారలలోనన = (క్రింది విధముగ అనుకొన్నారు )

"లెంకఁగ నేలుకోఁ గలదు లే మగనిం దరితీపుచేసి, మీ
నాంకుని పొద మాన, మన మాదట వేఁడిన పూఱువల్కఁగాఁ
గొంకెడు నంచు మీరిపుడు గోలని చూడకుఁ డమ్మ, నేర్చుఁబో
చంచలబిడ్డ యూడిపడ సారసలోచన మాటలాడఁగన్." 34

ఒక చెలికత్తె గమనుతనంగా వివరిన విసురు.

*అర్థము* :— సారసలోచన = ఓమలములవంటి కన్నులు కలిగిన ఈసుభద్ర, తరితీపుచేసి = కోరికను, తనయందు ప్రేమను—కలిగించి, మగనిన్ = భర్తను, లెంకగన్ = సేవకునిగా, ఏలుకోన్ గలదులే = ఏలుకోగల దనుటలో సందేహములేదు, మీనాంకుని = మన్మథుని

పాదము అన = పాదముతోడు, (ఆ ఒట్టుపెట్టుకొని చెప్పుతున్నాను), మనము = మనంద రము, ఆదటఁ = ప్రీతితో, వేఁడినఁ = ప్రార్థించినను, మాఱుపల్కఁగాఁ = బదులుచెప్ప టకు, కొంకెడు = జంకుచున్నది, అంచు = అని అనుకొని, మీరు, గోల = ఏమీ ఎరుగనిది, అని చూడకుడు అమ్మ = అని తలంచవద్దు) బదులు పలుక కున్నందువల్ల ముద్దరాలని భావించవద్దు), చంకలబిడ్డలు ఊడిపడఁ = చంకలలో ఉన్న బిడ్డలు ఊడిపడునట్లుగా, అనగా తన్ను తాను మరచిపోవునట్లుగా హాస్యముగను, చమత్కారముగనూ, మాటలాడఁగఁ = మాటలాడు టకు, నేర్చుఁబో = నేర్పుగలిగినదేసుమా.

తాత్పర్యము :— ఈ సుభద్ర మోహం కలిగించి భర్తను సేవకుడిగాచేసి ఏలుకో గలదు లెండి, మనకు బదులు చెప్పకుండా ఉన్నందువల్ల ఈమె ఏమీ ఎరగని ముద్దరాలని తలచకండి. చాలా చమత్కారంగా మాటలాడగలదు.

అలంకారము :— లోకోక్తి.

"క్రాఁగి యున్నది మిగుల నంగంబు సూడఁ,
గలవరించుచు నున్నది; కలదొ యేమొ
సోఁకు; డల్ల సన్యాసికే చూపవలయు
భామ" నని పల్కెనా సత్యభామ నగుచు. 35

అర్థము :— "అంగంబు = శరీరము, చూడఁ = తాకిచూడగా, మిగుల క్రాఁగి యున్నది = ఎక్కువగా కాలుతూ ఉంది; కలవరించుచు నున్నది = ఏమేమో పలవరిస్తున్నది, సోకుడుకలదొ ఏమో = దయ్యము సోకిందో ఏమో, భామను = సుభద్రను, అల్లసన్యాసికే = ఆ సన్యాసికే చూపవలయు" అని, సత్యభామ, నగుచు పలికెను.

విశేషము :— గాలి సోకినపుడు జ్వరతీవ్రత, కలవరింతలు ఉంటాయంటారు. యోగీశ్వరులు తమ మంత్రబలముచేత దయ్యాలను పారదోల గలరని నమ్ముతారు.

ఈ మాటలు చెప్పుతూ సత్యభామ నవ్వడము, సంగతి తెలియని వాళ్ళకు గూడా తెలియ జేస్తుంది.

'ఈ లీలనుండి, మనమిటు
మేలము లాడంగ నేమి మిడిమేలమొ,' యం
చాలో నత్య సుభద్ర హి
తాళుల కిసుమంత యా రహస్యము దెలిపెన్. 36

*అర్థము* :— ఈ లీలగా ఉండి = ఈ ఆటల్లోఉండి, మనము ఇటు = మనము ఈ విధముగా, మేలములు ఆడంగగా = పరిహాసములు ఆడుతుండగా, ఏమి మిడిమేలమో = (విరహావస్థవల్ల సుభద్రకు) ఏమి ఉపద్రవము కలుగునో, అంచుగా = అనుకొని, సత్య = సత్యభామ, ఆలోగా = సమయము చూచుకొని, సుభద్ర హిత ఆళులకు = ప్రియమైన చెలికత్తెలకు, ఆరహస్యమును (తపసి అర్జునుడే అన్న రహస్యము), ఇసుమంత = కొంచెముగా, తెలిపెగా.

*విశేషము* :— సుభద్ర విరహంవల్ల ఏ ప్రమాదమూ కలగకుండా శైత్యోపచారాలూ కొన్ని ప్రక్రియలూ చేయవలసి ఉంది. కాబట్టి, ఈ రహస్యమును ముఖ్యమయిన సుభద్ర చెలికత్తెలకు తెలియజేయ వలసిన అవసరం కలిగింది. సమయము చూచుకొని (తక్కినవారు వినకుండా ఉండే లాగ) స్వల్పంగా సత్యవాళ్ళకీ రహస్యం తెలిపింది.

విరహోపశాంతికిగా చేయవలసిన దంతా, ఆనాటి సంప్రదాయము ప్రకారము, చాలా పెద్ద తంతు.

'ఈ లీలగా' — ఈలన్ ఈలన్ = ఈ లీలగా = ఒక్కొక్క సిగ్గునందును — అనగా సుభద్ర సిగ్గుపడినందులకెల్ల అనియు - వేదమువారు వ్యాఖ్యానించారు.

## శైత్యోపచారములు

గుసగుసలఁ బోయి, వలపుల
కిసమస లని తెలిసి రసిక కిసలయ పాణుల్
బిస కిసల కుసుమ విసరము
వెస మసలక తెచ్చి, శిశిర విధి లాలసలై, 37

*అర్థము* :— రసిక కిసలయ పాణుల్ = చిగురులవంటి చేతులు కలిగిన ఆ సరసురాండ్రు (సుభద్ర ప్రియసఖులు), గుసగుసల బోయి = ఒకరితో నొకరు గుసగుసలాడుకొనుచు, వలపుల కిసమసలని తెలిసి = ప్రేమల వలన కలిగిన చిన్నెలు - కలగిన వేదన అని గుర్తించి, బిస = తామరతూండ్లు, కిసల = చిగుళ్లు, కుసుమ = పూవులు, (వీటియొక్క), విసరము = సమూహమును, వెసగా = శీఘ్రముగ, మసలక = జాగుసేయక, తెచ్చి, శిశిర విధి = శైత్యోపచారములయందు, లాలసలై = ఆసక్తి (శ్రద్ధ) కలిగినవారై.

*విశేషము* :— చెలికత్తెలు శైత్యోపచారములయందు చూపిన తొందరను పద్యగమనములో లఘువులను ఉపయోగించుట ద్వారా సాధించినాడు.

విరహవేదన అని తెలిసిన తరువాత ఆలసించడానికి వీలులేదు. విరహతాపము చల్లార్చ డానికి తామరతూండ్లు, చివుళ్లు, పూవులు ఉపయోగించడము కవి సమయ సిద్ధము. చూడు :—

నలదమయంతు లిద్దరు మనః ప్రభవానల బాధ్యమానులై
నలిపిరి దీర్ఘవాసర నిశల్ విలస న్నవనందనంబులన్,
దళిరుల శయ్యలన్, మృదు మృణాలములన్ ఘనసారపాంసులన్......

— భారతము.

అలంకారము :— అనుప్రాస.

పన్నీటన్ జలకంబు లార్చి, చలువల్ పైఁ గట్టఁగా నిచ్చి, మే
నన్ నిండారఁగఁ జందనం బలఁది, విన్నాణంబుగాఁ గప్పురా
నన్ నామం బిడి, క్రొమ్ముడిన్ విరులు దండల్ నించి హారావళుల్
చన్నుం గ్రేవలఁ దార్చి, రప్పుడు చెలుల్ చంద్రాస్యకున్ నేర్పునన్.

విరహతాపం చల్లార్చడానికి చెలులు చేసిన ప్రయత్నము దీనిలో ఉంది.

అర్థము :— చెలుల్ = చెలికత్తెలు, అప్పుడు, నేర్పునన్ = నేర్పుతో, చంద్రాస్యకున్ = చంద్రునివంటి ముఖముగల సుభద్రకు, పన్నీటన్ = పన్నీటితో, జలకంబులు ఆర్చి = అనేకసారులు స్నానము చేయించి, చలువల్ = చలువచేసిన వస్త్రములు, పైఁగట్టగానిచ్చి = కట్టుటకు ఇచ్చి, మేనన్ = శరీరమునందు, నిండారఁగన్ = అంతటను, చందనంబు = మంచి గంధము, అలఁది = పూసి, విన్నాణంబుగా = నేర్పుతో, కప్పురానన్ = పచ్చకర్పూరముతో, నామం బిడి = తిలకముతీర్చి, క్రొమ్ముడిన్ = (క్రొత్తముడి) సిగలో, విరులదండల్ = పూల మాలలను, నించి = తురిమి, చన్నుంగ్రేవలన్ = చన్నుల ప్రక్కలందు, హారావళుల్ = ముత్యాలహారముల వరుసలు, తార్చిరి = కూర్చిరి.

విశేషము :— పన్నీరు = పని + నీరు, పని అనగా తమిళమున మంచు, పని నీరు అనగా మంచు నీరు. దీనినే సంస్కృతమున మీమాంబువులు అంటారు.

పాఠాంతరము :—

1. గప్పురం పున్నామంబిడి క్రొమ్ముడిన్ విరిసరంబున్ నించి"
2. "హారావళుల్ చన్నుంగ్రేపులఁ దార్చి రప్పుడు"

చన్నుల శిఖరములయందు - చనుమొనలయందు - అని అర్థము చెప్పుకోవాలి.

బోటి మధువ్రతంబులకు దండముపెట్టి
మకరంద మధర బింబమునఁ జిల్కెఁ,
జెలి గంధవహున కంజలి చేసి నెత్తావి
పువ్వుగుత్తు లురోజముల నమర్చెఁ,
నాళి బిసాహార పాళికిఁ బ్రణమిల్లి
నవ మృణాలములు బాహువులఁ గూర్చెఁ,
సకి కెందలిరు దిండులకు వందన మొనర్చి
చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చెఁ,
సరగ నిటు లందఱును మీ ప్రసాద మనుచుఁ,
బంచసాయక దేవతా బలము నెల్ల
వేఁడికొని, తగునటు గారవించి రపుడు
చంచలాక్షికి శిశి రోపచార విధులు. 39

ఈ పద్యములో చెలికత్తెలు మన్మథుని అనుచరులను పూజించి, ఆ ప్రసాదాలను సుభద్రకు అందజేస్తున్నారు.

అర్థము :— ౧. బోటి = ఒక చెలికత్తె, మధువ్రతంబులకు = తుమ్మెదలకు, దండముపెట్టి = నమస్కరించి, మకరందము = (వాటి ప్రసాదము) తేనెను, అధరబింబమునన్ = సుభద్ర దొండపండువంటి అధరమునందు, చిల్కెన్ = చిలికెను ;

౨. చెలి = ఒక చెలికత్తె, గంధవహునకు = వాసనలు మోయు మారుతమునకు, అంజలిచేసి = నమస్కరించి, నెత్తావి = మంచి వాసనగల, పూవుగుత్తులు, ఉరోజములన్ = స్తనములయందు, అమర్చెన్ = గూర్చెను;

౩. ఆళి = మరియొక చెలికత్తె, బిస ఆహారపాళికి = తామరతూండ్లు భోజనముగా కల హంసల సమూహమునకు, ప్రణమిల్లి = వందనముచేసి, నవమృణాళములు = అప్పుడే తీసిన తామరతూండ్లు, బాహువులన్ = చేతులయందు, కూర్చెను ;

౪. సకి = ఇంకొక చెలికత్తె, కెందలిరు తిండులకు = కెంపుతలిరులను (ఎఱ్ఱని చివురులను) తినునట్టి కోకిలలకు, వందనమొనర్చి, చిగురుటాకులు, పాదయుగళిన్ = రెండు పాదముల యందును, చేర్చెన్ ;

సరగన్ = తొందరగా, ఇటులు, అందరును, పంచసాయక దేవత = అయిదు బాణములు కలిగిన దైవమగు మన్మథుని, బలమునెల్ల = అనుచరులందరిని, మీ ప్రసాదమనుచు = మీ అనుగ్రహము అనుచు, వేఁడికొని, అపుడు, చంచలాక్షికి = చలించుకన్నులుగల సుభద్రకు,

శిశిర ఉపచార విధులు = శైత్యోపచారములు, తగునట్లు = అర్హమైన విధముగ, కావించిరి = చేసిరి.

*విశేషము :—* మన్మథునకు తుమ్మెదలు, మలయపవనము, హంసలు, కోకిలలు పరివారముగా ఉంటాయి. విరహమునందున్న సుభద్రను ఆయాసపెట్టవద్దని ప్రార్థిస్తూ వాటి భుక్తశేషమును ప్రసాదముగా సుభద్రకు అందిస్తున్నారు.

మధువ్రతములను వేడి మకరందమును దేవతాప్రసాదముగ సుభద్ర పెదవుల మీద చిలికారు, అట్లే మలయపవనము ప్రసాదముగ తావి పువ్వుగుత్తులు వక్షమునా, హంసల ప్రసాదముగ తామరతూండ్లను బాహువులందూ, కోకిలల ప్రసాదముగ చివురులను పాదములందూ ఉంచారు.

మకరందము, అధరమునకు, పూవుగుత్తులు స్తనములకు, తూండ్లు బాహువులకు, చివురులు పాదములకు ఉపమానములు కాబట్టి, ఆయాస్థలములనే ఉంచుట చమత్కారము. దీనినే కవి 'తగినట్లు కావించిరి' అని సూచించాడు.

ప్రసాదమునకు అనుగ్రహము, భుక్తశేషము అనే రెండర్థములు అన్వయించుకోవాలి: మధువ్రతము మధువునే త్రాగునది. దీని భుక్తశేషము మకరందము' అట్లే నాలుగు చరణములయందు భుక్తశేష ఔచిత్యమును గమనించాలి.

*అలంకారము :—* శ్లేష.

కలయఁ బన్నీరు చిలికి, శ్రీగంధ మలఁది,
విరులు పైఁదార్ప, నపుడొప్పెఁ దరుణి, మేటి
మగని నరుగెల్వ వలరాచ మానటీఁడు
పూజ సేసిన య గ్గజరాజ మనఁగ. 40

*అర్థము :—* కలయన్ = శరీరమంతటను, పన్నీరు, చిలికి, శ్రీగంధము = మంచి గంధము, అలఁది = పూసి, విరులు = పూవులు, పైదార్ప = మీదవేయుటవల్ల, మేటిమగనిన్ = గొప్పశూరుడైన, నరునిన్ = అర్జునుని, గెల్వన్ = గెలుచుట కొరకు, వలరాచ మానటీఁడు = వీరుడైన మన్మధుడు, పూజచేసిన = (యుద్ధమునకు పోవునపుడు) పూజించినటువంటి, ఆ గజరాజము = శ్రేష్ఠమైన ఏనుగు, అనఁగన్ = అనునట్లుగా, అపుడు = ఆ సమయమున, తరుణి = = సుభద్ర, ఒప్పెన్ = కనుపించెను.

*విశేషము :—* శూరులు తాము యుద్ధములో ఎక్కబోయే వాహనములను పూజచేసే ఆచారము ఉంది. ఆ పూజలో పన్నీరు చిలికి, శ్రీగంధము అలది, పూలమాలలతో ఆ వాహనా

లను అలంకరించుట జరుగును. ఇపుడు సుభద్రకు అట్లే జరిగింది. నరుడు మరుడు. ఇద్దరకు సౌందర్యమున పోటీ గనుక తన ప్రత్యర్థియైన అర్జునుని గెలుచుటకు మన్మథుడు సుభద్రను తన వాహనముగా ఉపయోగించుచున్నట్లుగా ఉంది.

*పాఠాంతరము* :— 'మావటీడు' - అనగా ఏనుగును నడిపేవాడు. ఈ ప్రయోగము వలన మీదచెప్పిన అందము లోపించును. అందగత్తెను మరుని దంతి అని వర్ణించుట కవులకు పరిపాటి.

*అలంకారము* :— ఉత్ప్రేక్ష.

అంగన గుబ్బచన్మెఱుఁగు టందపు మేలిపసిండి కుండలం
బొంగఁ దొడంగెఁ జొబ్బిలఁగఁ బూసినగంధము తాపవహ్ని, 'సం
పంగి కటారి వీరునకు బాలును బియ్యము లేని పొంగలో
పొంగలి!' యంచు నయ్యెలరుఁ బోడులు సారెకు గేలిసేయఁగన్. 41

*అర్థము* :— అంగన = సుభద్రయొక్క, గుబ్బచన్ = గుబ్బలవలెనున్న చన్నులు అనే, మెఱుఁగు, అందపు = అందమై మెరయుచున్న, మేలి పసింది కుండలన్ = మేలిమి బంగారపు కుండలయందు (బంగారు కుండలవలెనున్న గబ్బిగుబ్బలయందు), జొబ్బిలగన్ = దట్టముగ, పూసిన = అలదినటువంటి, గంధము = చందనము, అయ్యెలరు బోడులు = పూవువంటి శరీరముగల ఆ చెలికత్తెలు, సారెకున్ = మాటిమాటికి, "సంపంగి కటారి వీరునకు = సంపంగిపువ్వు కత్తిగా కలిగిన వీరుడు అయిన మన్మథునకు, పాలును బియ్యములేని, పొంగలో పొంగలి'', అటంచు = అనుచు, గేలిచేయఁగన్ = ఎగతాళిచేయునట్లు, (ఆ పూసిన గంధము) తాపవహ్నిచే = విరహతాపము అను అగ్నిచేత, పొంగన్ తొడంగెన్ = పొంగుటకు ప్రారంభించెను (ముక్క ముక్కలుగా పెటిలి చిటిలి పడుతుండడమువల్ల)

*తాత్పర్యము* :— సుభద్ర స్తనములయందు దట్టంగా పూసిన గంధము విరహాగ్ని వల్ల పెటిలి రాలిపోవడము పొంగలి పొంగిపోవుటగా గనుపించింది. అది చూచి చెలికత్తెలు మన్మథ వీరుడికి పాలూ బియ్యము లేని పొంగలియని ఎగతాళి చేశారు అని భావము.

*విశేషము* :—— మన్మథుడు భస్మమయి రూపు పోగొట్టుకున్న వీరుడు. చనిపోయిన వీరులకు పాలూ బియ్యముతో పొంగలివండి వీరపూజచేసే ఆచారము ఒకటుంది. వండినప్పుడు పొంగలి పొంగి కిందపడుతుంటే పూజ సంతృప్తికరమని భావిస్తారు.

ఈ పొంగలి కుండలలో వండుతారు. అందుకే స్తనములను మేలి పసింది కుండలుగా కవి వర్ణించాడు. పొంగిపడుతూ ఉన్న పొంగలి తెల్లగా ఉంటుంది. ఇక్కడ స్తనాలమీదనుంచి

పెట్టి రాలిపడుతున్న చందనము గూడా తెల్లగానే ఉంటుంది. చందనపు పూత పలుచనై ఉంటే చిటిలి పెటిలిపోవడానికి అవకాశముండదు. అందుచేతనే 'జొబ్బిలగ అలదిన = దట్టముగపూసిన, అని అన్నాడు కవి.

*అలంకారము* :— రూపకము, ఉత్ప్రేక్ష.

పంచచామరము :—

మెఱుంగుఁబోఁడి కిట్లు చల్వమేర మీఱఁ జేసినం,
గుఱంగటన్ నిలంగ రాక కూర్మివెచ్చ హెచ్చఁగాఁ,
దుఱంగలించు చింతతోడ దూఱి పల్కిరంత వే
మఱున్ మరున్ మరున్మృగాంక మత్తకోకిలాదులన్. 42

*అర్థము* :— మెఱుంగుబోడికిన్ = కాంతిమంతమైన శరీరముగల సుభద్రకు, ఇట్లు చల్వ = శైత్యోపచారము, మేరమీఱన్ = హద్దుమీరగా–విశేషముగా, చేసినన్ = చేసినప్పటికీ, కుఱంగటన్ = ఆమెదగ్గర, నిలంగరాక = చెలులు నిలవడానికి వీలులేనంతగా, కూర్మివెచ్చ = ప్రణయతాపము, హెచ్చఁగాన్ = అధికమవుతుండగా, అంతన్ (సుభద్ర చెలులు), తురంగలించు = అధికమైన, చింతతోడన్ = విచారముతో, వేమఱున్ = పలుమారు, మరున్ = మన్మథుడినీ, మరుత్ = మందమారుతాన్నీ, మృగాంక = జింకను అంగముగాగల(చంద్రుడినీ), మత్తకోకిల = మదించిన కోకిల, ఆదులన్ = మొదలయిన మన్మథుని అనుచర వర్గమునూ, దూఱి = నిందించి, పలికిరి.

*విశేషము* :— చెలులు శైత్యోపచారాలు మేరమీర చేసినపుడు తాపము తగ్గడానికి బదులు హెచ్చు అవడము విపరీతము. కాబట్టి వేరుమార్గము లేక చెలులు ఆమెకు బాధ కలిగిస్తున్న మన్మథాదులను నిందించడానికి పూనుకున్నారు.

*అలంకారము* :— విశేషోక్తి, అనుప్రాసము.

## మదనాదుల ఉపాలంభనములు

విరివింటివాఁడవు గదా,
శరణాగతులైన పాంథజనులను రక్షిం
తురుగా, కిటుల నుపేక్షిం
తురె, పైకము గూడఁబెట్టఁ దొడఁగుచు మదనా? 43

ఈ పద్యము మొదలు 60 వ పద్యము వరకు, మన్మథ. మారుత, చంద్ర, కోకిలాదులపై చెలుల నింద ఉంది. వియోగములో ఉన్న వారిలాగు నిందించడము మన కవుల సంప్రదాయములో ఉంది.

అర్థము :— మదనా = మన్మథుడా (నీవు). విరివి ఇంటివాఁడవుకదా = సంపద కలిగిన పేరుపొందిన పెద్ద ఇంటివాడవు కదా. (విరివింటి వాఁడవు = పూవుల విల్లు కలిగిన వాడవు కదా అని అర్థాంతరము), శరణాగతులైన = శరణు చొచ్చిన, పాంథజనులను = బాట సారులను (విరహులను అని అర్థాంతరము), రక్షింతురుగాక = ఆదరిస్తారుగాని, పైకము కూడ బెట్టఁ దొడఁగుచుచు = డబ్బు కూడబెట్టడానికి చూస్తూ (పైకము - పికముల సమూహమును చేరదీస్తూ అని అర్థాంతరము), ఇటుల = ఇప్పుడు నీవు చేసినట్టు, ఉపేక్షింతురె = అనాదరణ చూపుతారా ? (అది అన్యాయమని భావము).

తాత్పర్యము :— గొప్ప ఇంటివారు తమరి నాశ్రయించిన బాటసారులను (ఆతిధ్య మిచ్చి) ఆదరిస్తారుగాని, డబ్బు కూడబెట్టాలన్న తలంపుతో అనాదరణ చూపుతారా ? మన్మథా నీవూ విరి = (పూవు) వింటివాడవు, నిను, శరణుచొచ్చిన పాంథులను( = వియోగులను) కాపాడాలిగాని, పైకము( = కోకిల సమూహమును) చేరదీస్తూ అనాదరణ చూపుతావా ? బాధపడ మంటావా ? ఇది మహాదోషమని భావము.

అలంకారము :— శ్లేష.

అలరు విలుకాఁడ; వమృతము
చిలికెడు నెలయేల ? సామిచేఁ గాదె వియో
గుల నేఁచఁగ ? విండ్లమ్ములు
గలవారికిఁ దోడు చల్లకడవలవారే ? 44

ఇంకా చెలికత్తెలు ఈలాగు అంటున్నారు.

అర్థము :— (1. అలరు = పేరుపొందిన, విలుకాడవు = విలువిద్య గలవాడవు,) (అలరు = పూవుల, విలుకాడవు - మన్మథుడవు అని గూడా), అమృతముల = పాలుపెరుగు, చిలికెడు = (గవ్వముతో) చిలుకుకొను, (అమృతము చిలికెడు = అమృతమును కిరణముల ద్వారా చల్లుచుండునట్టి అని గూడా), నెల ఏల = చంద్రుడు ఎందుకు (నీకు తోడా), వియోగులన = యోగము - అదృష్టములేని వారిని - నిస్సహాయులను (విరహములో ఉన్నవారిని అని గూడా), ఏచఁగన = బాధించుటకు, స్వామిచే = దేవరవారిచేత, కాదే = వీలు కాదా; విండ్లు అమ్ములు కలవారికి, తోడు, చల్లకడవలవారే (శూరులకు శూరులే కావాలి, లేకుంటే హాస్యాస్పద మవుతుంది.

తాత్పర్యము :— గొప్ప విలుకాడవు, తోడూ నీడా లేని వాళ్ళను కొట్టడము నీచేత కదా ? దీనికా చల్లచిలుకుకొనే వాడి సాయమెందుకు ? అని దృష్టాంతము.

అలంకారము :— శ్లేష, లోకోక్తి, దృష్టాంతము.

చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడవు గాన నీవలెఁ
జక్కనివారిఁ జంద్రుని వసంతునిఁ గూరుచుకొంటి. వంద మౌఁ;
జక్కెరవింటిరాజ, యెకసక్కె మదేమని కూర్చుకొంటి వ
మ్మక్క ! యరూపకం బయిన యా యెలతెమ్మెర నాలిబూతమున్ ! 45

అర్థము :— చక్కెరవింటిరాజ = చెరకు గడలు విల్లుగా కలిగిన ఓ మన్మథుడా, చక్కని వారిలో, మిగుల చక్కనివాడవు, కాన = కావున, నీవలెఁ, చక్కనివారిఁ, చంద్రుని వసంతుని, కూరుచుకొంటివి = చేరదీసుకొంటివి, అందము ఔ = బాగానే ఉంది; అమ్మక్క = అయ్యయ్యో అరూపకంబు అయిన = ఆకారములేనట్టి కురూపిఅయిన, ఆ యెల తెమ్మెర = ఆ లేత (పిల్ల) గాలి అనే, నాలిబూతమున్ = నాలిముచ్చు భూతాన్ని, అదేమని = ఏమి బాగని, కూర్చుకొంటివి, నెయ్యానికీ కయ్యానికీ సమానస్థాయి ఉండాలంటారుకదా ! ఎక్కెసక్కెము = అపహాస్యము సుమా.

తాత్పర్యము :— గాలికి ఆకారములేదు. అది పంచభూతాలలో ఒకటి. భూతంపట్టినా దయ్యం పట్టి గాలిసోకిందంటారు. గాలి అంటే కుత్సితపు అనే కాక మందమయిన అని గూడా అర్థముంది. ఈ గాలి పిల్ల వాయువూ మందపవనము గూడా అని.

*పాఠాంతరము :—*

1. "చక్కనివాడవుగాన, నీ శైనా"

— వేదమువారు.

ఎన (సమానము) ఔ. దీనిలోని సంధి కొంచెము కటువు.

2. " ... గాన నీవునున్..."

— తిరుపతివారు.

*అలంకారము :—* శ్లేష, వ్యాజనింద.

రమకు నట్టింటి పగవాఁడు కమలవైరి;
కంసుఁ బోలిన యుగ్రశేఖరుఁడు వాఁడు;
మేనమా మని చూడకు, మాను చెలిమి
యకట ! పైవచ్చు తెఱఁగవే హరికుమార ? 46

ఈ పద్యములో చెలికత్తెలు మన్మథుడికి హితోపదేశం చేస్తున్నారు.

అర్థము :— హరికుమార = కృష్ణుడి కొడుకు అయిన మన్మథా, కమలవైరి = పద్మములకు శత్రువైన చంద్రుడు, రమకు = (నీ తల్లియైన) లక్ష్మికి, నట్టింటి పగవాడు = నడిఇంటనున్న పగవాడు-అనగా పక్కలో బల్లెమువంటివాడు (ఆ లక్ష్మి నివాసము పద్మము కాబట్టి చంద్రుడు నట్టింటి పగవాడు అని చమత్కారము), వాఁడు = ఆ చంద్రుడు, కంసుబోలిన = కంసునివంటి, ఉగ్రశేఖరుడు = కఠినాత్ములలో శ్రేష్ఠుడు - అనగా అత్యంత కఠినుడు (ఉగ్ర = ఈశ్వరునియొక్క, శేఖరుడు = తలపూవు కాబట్టి, చమత్కారము), మేనమామ అని, చూడకు = చుట్టరికమును ఎంచి కనికరించకు (చంద్రుడు లక్ష్మికి అన్న, మన్మథుడికి మేనమామ అవుతాడు), మానుచెలిమి = స్నేహమును విడిచి పెట్టుము, అకటా = అయ్యో ! హరికుమారా = మన్మథుడా, పై వచ్చుట ఎరుగవే = (చంద్రుడు) మీదికే వచ్చునని (అపాయము కలిగించునని) తెలిసికొనలేవా ? ఆకాశము మీదికి చంద్రుడు వచ్చుట అని చంద్రపరమైన అర్థము. కృష్ణుడికి కంసుడు మేనమామా శత్రువూ, ఇపుడు చంద్రుడు గూడా మన్మథునికి మేనమామ శత్రువు. తండ్రి స్థితె కొడుకుకును ఏర్పడినది గనుక సాభిప్రాయముగ హరికుమార అని ప్రయోగించాడు కవి.

పాఠాంతరము :—

"...పై వచ్చునయ్య ఓ హరికుమారా"

అలంకారము :— శ్లేష, పరికరము.

తరుణి మెయి తావి యీసునఁ
బురికొల్పెడు నిన్ను గందపుం గొండ యిటుల్;
పురికొల్పెనె తానుం దా
మర కొలఁకుల రమయు మలయ మరు దంకురమా ? 47

ఇక్కడ మలయ మారుతాన్ని సుభద్ర చెలికత్తెలు నిందిస్తున్నారు.

అర్థము :— మలయ మరుత్ అంకురమా = మలయ పర్వతము నుండి వచ్చునట్టి పిల్ల వాయువా, తరుణి = జవ్వని అగు సుభద్రయొక్క, మెయితావి = శరీరపరిమళము యెడల, ఈసున = ఈ మత్సరముచేత (తన కట్టి పరిమళము లేదేయని), గందపు కొండ = చందన వృక్షాలుండే మలయపర్వతము, ఇటుల్ = ఈ విధముగా, నిన్ను, పురికొల్పెడు = ప్రేరేపించినది (సుభద్ర శరీర పరిమళము తనకు లేదను ఈసుతో మలయ పర్వతము ఆమెను బాధించడానికి నిన్నిక్కడికి ప్రేరేపించి పంపించింది. అని తాత్పర్యము) సరియే. (ఆ పై విధముగానే) తామరకొలకుల = కమలాకరముల, రమయు = లక్ష్మి, తానున్ = తానునుగూడా పురికొల్పినదా ఏమి ?

విశేషము :— సుభద్రయొక్క శరీరపరిమళము చందన సౌరభము, పద్మగంధము కన్నను మిక్కిలి సువాసన కలిగినదని భావము. ఈసుకలిగిన మలయపర్వతముగాని, పద్మాకరములుగాని ప్రత్యక్షంగా బాధపెట్టుటకు రాకుండా, అల్లరిచిల్లరి చేష్టగా పిల్లవాయువును పంపుట లోక సహజమైనది.

అలంకారము :— ఉత్ప్రేక్ష, అనుప్రాస.

తెమ్మెర నీ కెం తెమ్మెర !
కమ్మని విలుకాని దొరవు కమ్మని నెలఁ బై
రమ్మని యళి పిక శుక నిక
ర మ్మనిగా నిలిపి, ముందరగ వచ్చితివా ; 48

అర్థము :— తెమ్మెరా = ఓ మారుతమా, కమ్మని విలుకాని = తీయని విల్లుగల మన్మథుని, దొరవు కమ్ము అని = నీవు ప్రభువుగా ఉండుమని, నెలఁ = చంద్రుని, పైఁ రమ్మని = పై సహాయముగ రమ్మని (ఆకాశమార్గముగ రమ్మని అర్థాంతరము) అళి = తుమ్మెదలయొక్కయు, పిక = కోకిలలయొక్కయు, శుక = చిలుకల యొక్కయు, నికరమ్ము = సమూహమును, అనిగా = సేనగా, నిలిపి, ముందరగ వచ్చితివా (అనగా భయపెట్టుటకు తాడించుటకు) ముందుగా వచ్చితివా, నీకు ఎంత ఎమ్మెర = నీకు ఎంత గర్వమురా.

విశేషము :— 'అణికి' కన్నడమున సేన అని అర్థము. దానికి వికృతి 'అని'. పూర్వవ్యాఖ్యాతలు నీసందర్భమునుబట్టి అనువుగా అని, వెనుక తోడుగా అని అర్థము చెప్పారు. అలాగే 'ఎమ్మె' అనుటకు ఒయ్యారము అని విలాసార్థము చెప్పారు. కాని ఇక్కడ ఒయ్యారము వర్ణితముగాలేదు. పైగా యుద్ధసన్నాహము, దానికి ముందరి రాయబారము వర్ణితమైనాయి. కాబట్టే గర్వము, విరగబాటు అని అర్థము చెప్పడము న్యాయము.

అలంకారము :— యమకము. శ్లేష.

పంచచామరము :

జోహారు మీకుఁ జల్లగాఁగఁ జూడుఁడో సమీర కం
జహారులార; మంటుమారి శంబరారిఁ గూడి యీ
గోహారు సేయనేల యీ చకోరలోచనఁ ? భుజం
గ హారు పాద మాన మీకుఁ గాఁక లింక రేఁచినన్. 49

*అర్థము* :— ఓ సమీర కంజహారులార = ఓ మలయ మారుత చంద్రులార (కంజ హారి = పద్మములను బాధించువాడు చంద్రుడు), ఈ చకోరలోచనన్ = చకోరములవంటి కన్నులుగల ఈ సుభద్రను, చల్లకాగ చూడుడు = చల్లని చూపులతో చూడండి, మంటమారి = మండిపడుచూ ఉండే స్వభావముగల (శివుని కంటి మంటలో కాగినవారని విశేషము), శంబ రారిన్ = మన్మథునితో, కూడి = సహవాసముచేసి, ఈ. గోహారు = కాంన, చేయనేల = కలి గించడ మెందుకు; కాకలు = కాపములను, ఇంకన్ = ఇకమీదట, రేచినన్ = రేపినట్టయితే, మీకు = మీ ఇద్దరికి, భుజంగహారు = (పాములను ధరించినవాడు) శివునియొక్క, పాదము ఆన = పాదము మీద ఒట్టుసుమండీ.

*విశేషము* :— సమీరచంద్రులను కాకలు రేపగూడదని భుజంగహారుని కోరడములో విశేషముంది. భుజంగము అంటే పాము; పాముకి ఆహారము గాలి, అందువల్ల సమీరమునకు పాము అంటే భయము; మరియు రాహువు అన్నా గూడా పామే. కాబట్టి పాము చంద్రునికి భయము. 'భుజంగహారు' దన్న పేరు సాభిప్రాయము.

శీతాంశుడు కనుక చంద్రుడు, చందనపర్వతము నుండి వీయునది కనుక మలయ సమీ రము సహజముగ చల్లనైనవి. అట్టి వానికి మంటమారితో కూడిక ఉచితముగాదు. శంబరారి అనగా శంబరుడను రాక్షసుడిని చంపినవాడు. శంబరము అనగా నీరు. నీటికి శత్రువు అగ్ని. ఈ విధముగ గూడ మన్మథుడు సహజముగా వేడికలవాడు. అందుచేత ఇచట సమీరము, చంద్రుడు, అను పదములు భావయుక్తముగా నున్నవి. శంబరారి, మంటమారి అను పదములు సాభిప్రాయముగా నున్నవి. చకోరములు వెన్నెల కొరకు చంద్రుని ఆశ్రయించు పక్షులు అందు చేత చంద్రునికి ప్రియముగా నుండతగినవి. చకోరలోచన అని సుభద్రను అనుట సాభిప్రా యము.

ఈ పద్యము (తిరుపతివారూ, కృష్ణమాచార్యులవారూ, నోరివారూ పరిష్కరించి ముద్రింపించిన ప్రతులలో లేదు. అంతేకాక ఈ పద్యము చిన్నమార్పుతో మన కవి రచించిన సారంగధర చరిత్రములో ద్వితీయాశ్వాసము (2-180)న ఉన్నది. పదప్రయోగ చమత్కారమును బట్టి చూచినా ఇది ప్రక్షిప్తము కాదేమో అనిపిస్తుంది.

*అలంకారము* :— పరికరము, అనుప్రాస.

వల పెక్కడ లేదా? యీ
యలికుంతల తలనె వేగెనా? యేఁచకిఁకన్
జలికాలఁ ద్రోచి విడువుము,
చెలి మిక్కిలి మనసుపేద, శీతలపాదా. 50

ఇక్కడనుంచి చంద్రోపాలంభనము.

అర్థము :— శీతలపాదా = చల్లని కిరణములుగల చంద్రుడా (చల్లని పాదాలుకలవాడా) వలపు ఏక్కడఁ లేదా = ప్రేమ ఇంకెవరికీ లేకపోయెనా, ఈ అలికుంతల తలనే = తుమ్మెదల వంటి ముంగురులుగల ఈ సుభద్ర తలపైనే, వేగెనా = ప్రొద్దుపొడిచిందా (ఈమె కొక్కతెకె ప్రేమ కలిగిందా ?) చెలిమిక్కలి మనసుపేద = మా సుభద్ర మెత్తని మనసుగలది (గడుసు తనము లేనిది), ఎచక = బాధపెట్టకఁ, ఇఁకఁ = ఇప్పటికైనా, చలిగాలఁ = నీ చల్లని గాలితో, త్రోచి విడువుము = త్రోసి విడిచిపెట్టుము.

విశేషము :— అమ్మవారు మొదలైన శక్తులను ప్రార్థించునపుడు మా బిడ్డలను చలి కాలుతో త్రోసిపొమ్మని వాడుక గలదు. అనగా బాధించకుండా విడిచి పెట్టమని భావము.

పాఠాంతరము :—

అలికుంతల తలనే వేగెనా ? యా నలకిఁ
చలిగాలిఁ ద్రోచివిడువుము....."

— కృష్ణమాచార్యులవారు.

తలనే వేగెనా, చలిగాలి త్రోచుట. మనసుపేద చక్కని పలుకుబడులు, 'శీతల పాదా' సాభిప్రాయ ప్రయోగము. ఈ సాభిప్రాయ సారస్యములేదు కనుకనే పాఠాంతరము అంగీకార యోగ్యముకాదు.

శివుఁ డిటు రమ్మటంచు దయ చేసినచోఁ దలకెక్కఁ, తుగ్రపై
భవమునఁ జూచుచో నడుగు వట్టితి, వేమనవచ్చు నీగుణం ?
బవు నవు ! నందినఁ సిగయు నందక యున్నను గాళ్లు పట్టుకొం
దువు హరిణాంక, వేలకొలఁదుల్ గద నీ నడకల్ దలంపఁగన్. 51

అర్థము :— హరిణాంక = జింకచిహ్నముగాగల చంద్రుడా, శివుఁడు = ఈశ్వరుడు, ఇటురమ్ము అటంచు = దగ్గరకు రమ్మని, దయచేసినచోఁ = ఆదరించగా, తలకెగు ఎక్కితి = ఆతని తలపై కూర్చుంటివి (మిగుల గర్వించితివి.). ఉగ్రవై భవమున = కఠినమైన భావముతో చూడగా = చూచినప్పుడు (దక్షయజ్ఞము సందర్భమున వీరభద్రావతారమున తన్నినపుడు) అడుగు పట్టితివి = కాళ్ళుపట్టుకుంటివి - ఔనౌను, అందినఁ సిగయు = అనుకూలమైనప్పుడు సిగనూ, అందకయున్నను కాళ్ళు = అనుకూలముకాని యప్పుడు కాళ్ళనూ పట్టుకొందువు, ఏమనవచ్చు నీగుణంబు = నీ స్వభావము చాలా చిత్రము, నీ నడకల్ = నీ ప్రవర్తనములు, తలంపగఁ = ఆలోచించగా, వేలకొలఁదుల్ గదా = వేల సంఖ్యను లెక్కపెట్టవచ్చునుగదా ! (వేల (శ) కొలఁదుల్‌గదా = సమయమును అనుసరించి వుండునుగదా. ఏ యెండ కా గొడుగు పట్టునట్టి

ప్రవర్తన మని భావము) నీ గమనములు వేళకొలదుల్ అనగా వేళనుబట్టి కొలవదగినవి కదా అనియు విశేషార్థము.

లోకోక్తుల ప్రయోగములో మన కవికి ఉన్న ప్రత్యేక నైపుణ్యము ఈ పద్యములో గూడా కనిపిస్తుంది.

అలంకారము :— లోకోక్తి.

కలశవారాశిc బుట్టుట, గప్పెనయుట,
శైలచాపశిరోధివాసంబుc గనుట,
యెవ్వరికి నంట రాకుంట, యెఱిcగి. కాల
కూట మన నేమి నినుc జంద్ర, నేcటినుండి ? 52

చంద్రుడు కాలకూటవిషముతో సమానమైన వాడని నిరూపిస్తున్నాడు.

అర్థము :— కలశవారాశిన్ = పాలసముద్రములో, పుట్టుట = (చంద్రుడూ విషమూ రెండూ) పుట్టడమూ, కప్పు ఎనయుట = నల్లదనమును పొంది ఉండడమూ (కాలకూటవిషము నల్లనిది, చంద్రునిలో నల్లని మచ్చ ఉంది అని భావము.), శైలచాప = మంధరపర్వతమును విల్లుగా గలిగిన శివునియొక్క, శిరోధివాసంబు = కంఠమునందు నిలవడము అని కాలకూట పరము. శిరఃఅధివాసము = తలయందుండడము అని చంద్రపరము, కనుట = ఆ శిరోధివాసము పొంది, ఉండడమూ, ఎవ్వరికిని = ఎట్టివారికీ, అంటరాకుంట = తాకుటకు వీలులేకుండా వుండుట. (విషాగ్ని భయముచేత కాలకూటమును, ఆకాశమున నుండుటచేత చంద్రుడున్నూ అంటరాకుండా వున్నారు.) ఈ నాలుగు సమానధర్మములు ఉండడము, ఎఱిcగి = తెలిసి, నేcటినుండి = ఈ దినమునుండి, నినున్ = నిన్నుకూడా, కాలకూటము అనన్ఏమి = కాలకూటమన్న పేరు పిలుస్తే తప్పేమి ? (అనగా కాలకూటవిషమువలెనే బోధిస్తావని భావము.

అలంకారము :— తుల్యయోగిత, శ్లేష .

భువన జాతార్తి కరమూర్తి వవుట కడలి,
కడలి గరళంబు నిన్నునొక్కటిగ నెంచి,
త్రాగు తలc బోసికొమ్మని వేగ హరున
కిచ్చెc నీ రుచి యుcకనెంచనేల చంద్ర ? 53

అర్థము :— భువన = లోకములయొక్క, జాత = సమూహమునకు, ఆర్తికర = బాధను కలిగించు, మూర్తివి = ఆకారము కలవాడవు, (భువన = నీటియందు, జాత = పుట్టినపద్మము

లకు, ఆర్తికరమూర్తివి = చంద్రుడవు అని భావము), అవుటకు, అడలి = భయపడి, కడలి = = సముద్రుడు, గరళంబు, నిన్ను (చంద్రుడిని), ఒక్కటిగనెంచి = ఇద్దరిని ఒకేవిధమైన దుర్మార్గులుగ భావించి, త్రాగు తలపోసికొమ్ము = ఇష్టము అయితే త్రాగు లేకుంటే తలపై పోసుకో (అనీ ఇష్టమువచ్చినట్లు చేసుకో అని), వేగ = ఆలస్యము చేయకుండానే అనగా పుట్టిన తక్షణము, హరునకు ఇచ్చెగా = శివునికి ఇచ్చివేసెను, (వదలించుకొనెను), చంద్ర = చంద్రుడా, నీరుచి = నీగుణము (కాంతి), ఎంచనేల = ఎందుకు అనుకోవలెను (చాలచెడ్డది అని భావము).

*విశేషము* :— 'త్రాగు తల పోసికొమ్ము' జాతీయము. పౌరాణికముగ శివుడు గరళమును త్రాగి చంద్రుని తలమీద పెట్టుకున్నాడు. ఆలస్యముచేస్తే లోకాలకు ప్రమాదం కలుగుతుందని సముద్రుడు నువ్వు పుట్టిన తక్షణం శివుడి కిచ్చివేశాడు.

అలంకారము :— క్రమము, యమకము.

చక్కెర వింటిరాజు నగచాపునితో నెదిరించి పడ్డనాఁ,
డెక్కడ నుంటి వీవు ? మధుఁ డెక్కడనుండెను ? మందమారుతం
బెక్కడ నుండె ? సిగ్గుపడరే ? మిపుడాతఁ డదృష్టరేఖచే
రక్కొని క్రమ్మఱం బ్రతికి రాఁగ వజీర్లయినారుగా శశీ ! 54

*అర్థము* :— చక్కెరవింటిరాజు = చక్కెరవిల్లుగల మన్మథుడనురాజు, నగచాపునితో = మంథరపర్వతము విల్లుగా కలిగిన శివునితో, ఎదిరించి = పోరాడి, పడ్డనాడు = (భస్మమై పోయిననాడు) కూలిపోయిననాడు, శశీ = ఓ చంద్రుడా, ఎక్కడ నుంటివి ఈవు, మధుడు = వసంతుడు, ఎక్కడనుండెను, మంద మారుతుండు = మలయపవనుడు, ఎక్కడనుండె, (మీరందరు ఆనాడు కనుపించలేదే !), ఇపుడు, ఆతడు = ఆ మన్మథరాజు, అదృష్టరేఖచే = అదృష్టమువల్ల, రక్కొని = కోలుకొని, క్రమ్మఱం = మరల, బ్రతికిరాగ = కష్టములుగట్టెక్కి రాగ, బ్రతికిబయట పడుట అని వ్యవహారమున కలదు, వజీర్లు అయినారుగా = మీరందరు పెద్దమంత్రులు అయినారుగా, సిగ్గుపడరేమి ?

*విశేషము* :— మన్మథుడు శివుని కంటిమంటలో కాలినపుడు ఎక్కడా అగుపించని అతని మిత్రులు చంద్రుడు, వసంతుడు, సమీరుడు అరిగి అతను బ్రతికి బయటపడినపుడు చుట్టు చేరి పెద్దరికము వహించడము, వారి నీతి లేమని తెలుపుతున్నదంటాడు కవి; మీరు సిగ్గుపడరేమి అని అడుగుతాడు.

మన్మథునిది చక్కెరవిల్లు. శివుడు బలిష్ఠమైన కొండను విల్లుగాకలవాడు. వారి ఆయుధముల తారతమ్యము జయాపజయములను సూచిస్తుంది తక్కువ బలముగల ఆ మన్మథుడే కయ్యానికి కాలుదువ్వాడు. ఇది గమనించదగిన విశేషాలు.

మన్మథుడు శివుని కంటి మంటలో భస్మమైనాడు. తరువాత 'అదృష్టరేఖచే' తిరిగి వచ్చినాడు. అదృష్ట అనగా అగుపించని రేఖచే — రూపురేఖలచే బ్రతికి బయటపడినాడని చమత్కారము. అందువల్ల 'అదృష్టరేఖ' సాభిప్రాయముగా నున్నది. కష్టకాలములో కనబడకుండా పోయి, అదృష్టం కలిగినప్పుడు ఆప్యాయంగా వచ్చి అధికారం చెలాయించే స్నేహితులు లోకంలో చాలామంది ఉంటారు కదా!

మా కలకంఠియు నీవును
నేకగ్రీవముగ నుందు రిన్నాళ్ళు; నయో!
కోకిల, యిపుడే లలఁచెదు?
నీ కగునే యిగురుఁబోఁడి నెత్తురు ద్రావన్? 55

చెలికత్తెలు కోకిలాదులను నిందిస్తున్నారు.

*అర్థము* :— అయో = ఏమిటీ విపరీతము! మా కలకంఠి = మనోహరమైన కంఠస్వరముగల మాసుభద్రయు, నీవును = కోకిలా నీవున్ను, ఇన్నాళ్ళును, ఏకగ్రీవముగ = ఒక్క గొంతుగా - మాటగా అనగా అత్యంత సుఖముగా, ఇద్దరు కమ్మనిగ్రీవము = కంఠస్వరము కలవారే. అని సారస్యము). ఉందురు = ఉండేవారు. ఇపుడు ఏల, అలచెదు = ఇప్పుడెందుకు శ్రమపెడుతున్నావు? (న్యాయముకాదు అని), ఇగురుఁబోఁడి = చిగురువంటి మృదువైన శరీరము గలిగిన కాంతయొక్క, నెత్తురుద్రావ = ఉసురుపోసుకొనుట - ఎక్కువగా బాధించుట, ఇగురు యొక్క బోడి - బోడిమ - అనగా ఇకురు యొక్క సారము అనురక్తమును) నీకు అగునె = నీకు తగునా.

*విశేషము* :— కోకిల ఆహారము ఇగురు అనగా చిగురు. అందువలన ఇగురుబోడి రక్తమును త్రావుట నీకు తగియున్నదేలే అని ఒక నిశ్చితార్థము. చిగురువంటి మృదులమైన ఆహారమును భుజించే నీవు రక్తమును త్రాగుట ధర్మమా అని ఒక ప్రశ్నార్థకము.

నెత్తురు ద్రావన్ - జాతీయము, కలకంఠి - సాభిప్రాయము.

*పాఠాంతరము* :—

"నీ కగునే ఇగురు బోడిచి నెత్తురు ద్రావన్"

ఈ పాఠమునందు ఇగురు బోడిచి అనగా మెత్తని దేహముగల సుభద్రను బోడిచి అని ఊహ్యము.

అలంకారము :— శేషపరికరము.

కొమ్మపయిఁ బక్షపాతము
నెమ్మొయి నెఱపుదు; విదేల యేఁచెద వకటా ?
కమ్మగ నవాతు చక్కెర
క్రమ్మఁగ మాటాడుతవర కలకంఠవరా ! 56

*అర్థము* :— కమ్మగ = హాయిగ, నవాతుచక్కెర = (ఒరియా బంగాళీ భాషలలో చక్కెరను నవాతు అంటారు. దీనియందు తియ్యదనము ఎక్కువగా ఉంటుంది ) తీయని పంచదార క్రమ్మునట్లుగా = మిక్కిలి తియ్యగా, మాటాడు = పలుకుటయందు, తవర = ప్రౌఢత్వము నేర్పుకలవాడా.

౨. కలకంఠవరా = కోకిలలలో శ్రేష్ఠుడా, కొమ్మపయిణ = సుభద్రపై (చెట్టుకొమ్మపై అని అర్థాంతరము), పక్షపాతము = అభిమానము (పక్షము = రెక్క. పక్షపాతము = రెక్కలతో పడడము), ఎమ్మొయి = అన్నివిధములుగ, నెఱపుదువు = చూపుతుంటావు, అకటా. ఇది ఏల ఏచెదు = ఈ విధముగ ఇప్పుడు ఎందుకు బాధిస్తున్నావు ?

*విశేషము* :— కొమ్మ మీద పక్షపాతము కోకిలకు సహజగుణము. శ్లేషవల్ల సుభద్ర మీద అభిమానము అని అర్థమవుతుంది. అటువంట కోకిల ఆమెను బాధించడము విపరీతము కాదా !

ఈ పద్యమునం కోకిల పుంస్కోకిల. మగకోకిలకు కంఠమాధుర్యము ఎక్కువ అని కవిసమయము.

చిలుకలు, గోరువంకలను మాత్రమే మనము మాటాడునవిగ చెప్పుతాము. అందువలన కోకిల పరముగ మాటాడడము అంటే పాడడము - ధ్వనించడము అని అర్థము చేసుకొనవలెను.

*పాఠాంతరము* :—

"........క్రమ్మగ మాటాడ వవుర......."

*అలంకారము* :— అంత్యానుప్రాసము, శ్లేష.

కల్లరిత్రాఁచు నిప్పుకలు గైకొను కేకి చకోర పాళికిం
జెల్లినఁ జెల్లుఁగాక, సరసీజ బిసంబు లిగుళ్లుమేసి భా
సిల్లెడు మీ కయో! విషము చిల్కఁగ వేఁడిమి గుల్కఁబల్కఁగాఁ
జెల్లునె? యో మరాళ పిక శేఖరులార, వచింపుఁ డింపుగన్. 57

*అర్థము* :—కల్లరిత్రాఁచుఁ = దుష్టమైన విషసర్పాన్ని, నిప్పుకలుఁ = అగ్నికణాలను వెన్నెలకాంతులను, గైకొను = తినునట్టి, కేకి - చకోర పాళికిఁ = నెమళ్ళ యొక్కయు, చకోరపక్షుల యొక్కయు సమూహములను, ఇతరుల బాధించుట, చెల్లినచెల్లుగాక, (ఆహారమును బట్టి స్వభావము ఉంటుందని ఒక సిద్ధాంతము. ఈ నమ్మకమును అనుసరించి విషము, అగ్నికణాలు ఆహారముగా కలిగినవారికి ఇలాగు సుభద్రను బాధించడము చెల్లితే చెల్లుతుంది కాని), సరసీజ బిసంబులు = తామరతూండ్లను, ఇగుళ్లు = చివుళ్లను, మేసి = తిని, భాసిల్లెడు = ప్రకాశించునట్టి, మీకు, (మధురమైన సాత్విక ఆహారము తినువారు గనుక), ఓ మరాళ పిక శేఖరులార = హంసశ్రేష్ఠులార - కోకిలలలో శ్రేష్ఠులార, అయో!, విషము చిల్కఁగఁ = విషము చిందునట్లుగానూ, వేడిమిగుల్కఁ = తాపము అతిశయించునట్లుగానూ, పల్కఁగాఁ = కూయడము, చెల్లునె = తగునా, (ఇదిచాల అధర్మము) వచింపుడు ఇంపుగఁ = చక్కగా, బాధకలిగేలాగ కాక సొంపుగా - పల్కండి, మరొకర్థము మీరే న్యాయము చెప్పండీ అని.

*విశేషము* :— నెమళ్ళు విషసర్పాలను తింటాయి, చకోరాలు అగ్నికణాలను చంద్రుడి (కాంతిని) మింగుతాయి. వాటికి క్రూరస్వభావం ఉంటే ఉండవచ్చును. తామరతూడులు తినే హంసలకూ లేతచిగురులు తినే కోకిలలకూ ఇతరులను బాధించే స్వభావం ఉండకూడదు. అయినా, ఇప్పుడు అవి సుభద్ర విషయములో విషము చిమ్ముతూ వేడి కలిగిస్తూ (క్రమంగా) ఉన్నాయని భావము. ఇది చాల అన్యాయము సుభద్రను నెమళ్ళు, చకోరములు, మరాళములు, పికములు, నాలుగూ బాధిస్తున్నాయని అభిప్రాయము.

*అలంకారము* :— క్రమాలంకారము - శ్లేష, కావ్యలింగ.

రాచిలుకా, కోమలి దెసఁ
జూచితె? శ్రుతి కటువు లనెడు; శుక నామము నీ
కేచాడ్పునఁ దగు; వల దిఁక
మాచెలిఁ గెరలించితేని మాటలు వచ్చున్. 58

*అర్థము* :— రాచిలుకా = రాజకీరమా (చిలుకా రమ్మ అని గూడ), కోమలి = మృదువైన శరీరము కల సుభద్ర, దెస = వైపు, చూచితే = చూచావా, (నీమాటలు), శ్రుతికటువులు అనెడుఁ = చెవికి కటువుగా పలుకుతున్నావు (అని అంటూ ఉంది), (శ్రుతి - అనగా వేదము

లకు విరుద్ధములుగా నున్నవని అంటున్నదని అర్థాంతరము): శుకనామము = శుక అన్నపేరు (వేదములను అనుసరించే శుకమహర్షి పేరు అని అర్థాంతరము): నీకు = శ్రుతికటువుగ మాట లాడేనీకు, ఏచాడ్పునన్ = ఏవిధముగా, తగున్ = సరిపోవును. (సరిపోదని భావము). వలదు = కూడదు, ఇఁకన్ = ఈ పైని, మాచెలిన్ = సుభద్రను, కెరలించితివి ఏని = రెచ్చగొట్టి నట్టయితే, మాటలు వచ్చున్ = నిందలు కలుగును (మాటలు చిలుకకు సహజము. 'మాటలు వచ్చున్' అందువలన చమత్కారము.

*విశేషము* :— 'మాటలు వచ్చున్' జాతీయము.

వేదమువారు 'శ్రుతి'లో మొదటనున్న 'శు'ను, 'కటువు'లోని 'క'ను జోడించి శుకము నకు శ్రుతి కటువులు ఏచాడ్పునను తగునని చమత్కారమును చూపించారు.

*పాఠాంతరము* :—

"శ్రుతి కటువు లనెదు'' చెవులకు చేదుగా నున్న మాటలాడుతున్నావు – సుభద్రను చూడావా ఎంత నలిగి ఉందో అని చెప్పాలి.

*అలంకారము* :— శ్లేష.

మ దనుగుణంబు లని చాలఁగ
మది నమ్మితి; మిట్లు మొరయ మరియాదగునే ?
యదియును గాక 'మదాళులు
గద' తుమ్మెదలార, వెగటుగా నాడెదరే ? 59

ఈ పద్యము చెలికత్తెలు చెప్పినదిగా కనబడదు. మదనుగుణము అని అనడము చూస్తే ఇది సుభద్ర వాక్యముగానే ఉంది. సుభద్రవాక్యాలు 62 వ పద్యమునుంచే ఉన్నట్లు కవి చెప్పాడు. ఎవరో బుద్ధి మంతులు దీనిని ఇరికించి ఉంటారు.

*అర్థము* :— తుమ్మెదలారా, మత్ అనుగుణంబు అని = నాకు అనుకూలముగనుంటారు అని (మదను = మన్మథునియొక్క, గుణంబు = అల్లెత్రాడు అని అర్థాంతరము – తుమ్మెదలు మదనుని వింటినారి అని కవి సమయము), చాలఁగన్ = ఎక్కువగా, మదినమ్మితిన్ = మన స్సులో నమ్ముకుంటిని, ఇట్లు మొరయన్ = ఇట్లు, గోల(రొద) చేయుట, మరియాద అగునే = ఉచితము అగునా ?, అదియునుగాక, మత్ ఆళులుగద = మీరు నా సఖులుగద (మదఆళులు = (మదించిన తుమ్మెదలు అని అర్థాంతరము), వెగటుగాన్ = అప్రియముగా, ఆడెదరే = పలుకుదురా, (ఆటలాడుదురా ?).

తుమ్మెదలకు మదనుగుణములు, మదాళులు అన్న పదములనే శ్లేషించి మత్ అనుగుణ ములు, మత్ ఆళులు అని స్నేహపాత్రములుగా సంభావించడము చమత్కారము.

సుభద్ర వాక్యముగా ఉన్న ఈ పద్యమును 62 వ పద్యము తరువాత పఠించడము సవ్యముగా ఉంటుంది.

అలంకారము :— శ్లేష.

అని బహూకార నికార మమకార చమత్కారంబులు గానంబడ నీప్రకారంబున. 60

అర్థము :— అని బహూకార = గౌరవము, నికార = తిరస్కారము, మమకార = ప్రేమము, చమత్కార = గడుసు తనము, కానంబడ. ఈ ప్రకారము.

శరదబ్జముఖుల మాటికి
శరదబ్జముఖుల్ తలంపఁ, జాల్నిలుఁ డంచుం,
దరుణీమణి వేసరి, యా
స్తరణ సుమాదులను జూపి, తాపముచేతన్. 61

అర్థము :— శరత్ అబ్జముఖుల్ = శరత్కాలమందలి పద్మమువంటి ముఖము కలిగినవారు (చెలికత్తెలు). శరదబ్జముఖులన్ = శరత్కాల చంద్రుడు మొదలయినవానిని. మాటికిన్ = అదేపనిగ, తలంపన్ = తలంచుచుండగ. తరుణీమణి = యువతీరత్నము అయిన సుభద్ర. తాపముచేతన్ = విరహతాపముచేత, వేసరి = విసుగుచెంది, చాల్ నిలుడంచున్ = చాలును ఆగండి అని, ఆ స్తరణ సుమాదులను = పడకయందున్నట్టి పువ్వులు మొదలైనవానిని. చూపి = చూపించి – (ఈక్రింది విధముగ సుభద్ర చెలికత్తెలతో చెప్పెను). దీనికి – 67 వ పద్యములో 'అనిన' అన్న క్రియతో అన్వయము.

అలంకారము :— యమకము.

"ఈ క్రొవ్విరులఁ గ్రోలు నెలతుమ్మెదలు చెక్కు
చెమరింప కున్నవా చిగురుఁబోఁడి ?
ఈ కెంజిగురు మెక్కు కోకిలానీకముల్
వసివాడ కున్నవా వనజగంధి ?
ఈ నిండు వెన్నెల లానుచకోరముల్
కసుగంద కున్నవా కంబుకంఠి ?

ఈ తూండ్లు భుజియించు జాతియంచలు సొట
సొటలు వోకున్నవా శోభనాంగి ?

తెలిసి రారమ్మ, కలదు సందియము చాల;
నులికిపడక వవి లెస్సలై యుండెనేని
వజ్రకాయములే యౌను వాని కెల్ల;
నపుడు విరహుల యవదికి నవధి లేదు. 62

*అర్థము* :— ౧. చిగురుఁబోఁడి = చిగురువంటి శరీరముగల చెలీ, క్రొవ్విరులన్ = ఈ క్రొత్తపువ్వులను, (తనకు అత్యంతమైన తాపము కల్గిస్తున్న ఈ పువ్వుల): క్రోలు = (ఆ పువ్వులతేనెను ఆనుట) త్రాగినటువంటి, ఎలతుమ్మెదలు = కొదమ తుమ్మెదలు, చెక్కు చెమరింపకున్నవా = ఏకొంచమైనా బాధను పొందకుండా ఉన్నవా ? (ఈపాటికి అవి బాధపొంది మరణించియే ఉండగలవని ఆమె భావము.

౨. వనజగంధి = పద్మములవాసనగల సఖీ, ఈ కెంజిగురున్ = ఈ కెంపువలె ఎఱ్ఱని లేత చిగురును, మెక్కు = తినునటువంటి, కోకిల అనీకముల్ = కోకిలల సమూహములు, వసివాడక = వాడిపోకుండా, ఉన్నావా ? (వాడియే ఉండునని ఆమె తలంపు).

౩. కంబుకంఠి = శంఖమువంటి కంఠముకల చెలీ, ఈ నిండువెన్నెలలు, (తన్ను మిక్కిలి తపింపచేయుచున్న ఈ వెన్నెలలు) ఆను = త్రాగునటువంటి, చకోరపులు = చకోర పక్షులు, కసుగందక = కొంచమైనా కందిపోకుండా, ఉన్నవా, (కందిపోయేఉండునని భావము).

౪. శోభనాంగి = అందమైన శరీరముకల చెలియా, ఈ తూండ్లు (తనకు తాపము కల్గిస్తున్న ఈ తూండ్లు), భుజియించు = తినునటువంటి, జాతి అంచలు = శ్రేష్ఠమైన హంసలు, సొటసొటలుపోక = స్రుక్కిపోక, ఉన్నవా (స్రుక్కిపోయియే ఉండునని ఆమె భావము).

తెలిసిరారమ్మ = తెలిసికొనిరండమ్మ. కలదు సందియము చాల = నాకు చాలా సందేహము కలదు; ఉలికిపడక = బెదరకుండా, అవి = తుమ్మెదలు మొదలగునవి, లెస్సలై = క్షేమముగా, ఉండెనేని = ఉన్నట్లయితే, వానికెల్ల = వాని కన్నిటికి, వజ్రకాయములే, ఔను = దృఢమైన శరీరములే అయి ఉండును, అపుడు = అట్లయిన యెడల, విరహుల, అవదికిన్ = కష్టములకు, అవధి = హద్దు లేదు.

*విశేషము* :— తనకు అత్యంతతాపము కలిగిస్తున్న క్రొవ్విరులు, కెంజిగురులు, నిండువెన్నెలలు, తూండ్లు నిశ్చయముగా, వాటిని తిని బ్రతికే తుమ్మెదలను చెమరింపజేసి, కోకిలానీకములను వాడజేసి, చకోరములను కసుగందజేసి, జాతి యంచలను సొటసొటలుపోవు నట్లుగాచేసి వానికి చావు కల్పించియే ఉండునని సుభద్ర ఆశాభావము; చెమరుట, వసివాడుట,

కసుగందుట: సొటసొటలు పోవుట ఉష్ణముయొక్క ఫలితములే. ఒకవేళ ఆ తుమ్మెదలు మొదలయినవి అట్టి తాపఫలితములను పొందకుండా సుఖంగా ఉంటే వాటివి వజ్రకాయాలే అయి ఉంటాయనీ అందుచేత తన బాధకు అంతులేదనీ ఆమె భయము.

*పాఠాంతరము* :—

"అపుడు విరహుల యవిధికి నవిధిలేదు"

.... వేదమువారు.

అవద, అవిది, మొదలైన రూపాలు ఆనాటి తెనుగు కన్నడ తమిళ భాషలలో కనిపిస్తాయి. వాటన్నిటికి అర్థము కష్టము. బాధ అని, ఈ మాటలలో వత్తుఅక్షరాలుండవు. అందుచేత 'అవదికి నపధి లేదు' అన్న పాఠమే సమంజసము.

*అలంకారము* :— యమకము.

చలిగాలి గర్వ మడఁపం
గలిగెం జిలువ లని యుండఁగా, వానిపయిం
గలిగె శిఖావళము, లయో!
చెలి, తప్పునె వాయు సఖము శిఖియను వార్తల్? 63

*అర్థము* :— చలిగాలి గర్వమడఁపన్ = మలయమారుతము గర్వము అణచుటకు, చిలువలు = (గాలిని తినే)పాములు, కలిగెన్ = ఉన్నవిగదా, అని ఉండగా = అన్న ధైర్యముతో ఉండగా, వానిపయిన్ = ఆ పాములమీదికి, శిఖావళములు = నెమళులు, కలిగెను = దాపురించినవి, అయోచెలీ : వాయుసఖము = వాయువునకు మిత్రము, శిఖి = అగ్ని (నెమలి అని అర్థాంతరము), అను వార్తల్ = అను లోకోక్తి, తప్పునె = తప్పిపోవునా?

*తాత్పర్యము* :— చలిగాలి గర్వము పోగొట్టడానికి పాములున్నాయికదా అని నమ్ముకుంటే, ఆ పాములు తినడానికి నెమళ్లు దాపురించాయి. వాయుసఖము శిఖి (నెమలి) అన్న లోకోక్తి తప్పుతుందా అని భావము.

*విశేషము* :— విరహులకు చలిగాలి శత్రువు. చలిగాలిబాధ తప్పించడానికి పాము ఉంది కదా అనుకుంటే, ఆ పామును తినడానికి నెమలి దాపురించింది. ఈ నెమలిగూడా విరహులకు శత్రువే. ఇక్కడ వాయువుకి శిఖి (నెమలి) తోడు పడ్డది.

అసలు లోకోక్తి 'వాయుసఖము శిఖి' (అగ్ని) అనగా అగ్నికి గాలితోడు అని; శిఖిమీది శ్లేషవల్ల దీనిని తిప్పి 'వాయువుకి శిఖి (నెమలి) తోడు అన్నాడుకవి.

శ్లేషను ఆధారము చేసుకొని కవి లోకోక్తిని ఈ విధంగా సమన్వయముచేసి చమత్కరించాడు.

శిఖావళము అన్నా, శిఖి (శిఖ = పింఛము కలది) అన్నా నెమలి అని అర్థము. శిఖి యనగా శిఖ = జ్వాలగలది అగ్ని అని రెండవ అర్థము.

అలంకారము :— శ్లేష, లోకోక్తి, కావ్యలింగ.

అగము లెక్కుచు, మిన్నుముట్టు, చహంకరించు బలంబులో,
మృగమదంబు నడంగఁ జేయుచు మేనికప్పు సెలంగఁగాఁ,
బగలు మీఱఁగఁ బాంథకోటుల బాధపెట్టుచు, నుండు నీ
తొగతగుల్ వెడవింటి బోయకుఁ దోడువచ్చినవాఁడ పో. 64

కవి ఈ పద్యములో చంద్రుని బోయవానిగా నిరూపించి, మన్మథుడన్న బోయవానికి తోడువచ్చాడనీ ఇద్దరూ పాంథులను హింసిస్తున్నారని కవి చెప్తున్నాడు.

అర్థము :— అగములు = (బోయపరముగ) చెట్లు (చంద్రపరముగ) కొండలు, ఎక్కుచు, మిన్నుముట్టుచు = (బో.ప.) ఉత్సహించుచు, (చం. ప.) అకాశమును అంటుతూ, అహంకరించు బలంబుతో = (బో. ప.) గర్వాన్ని కలిగిన సహచరులతో (చం. ప.) గర్వాన్ని కలిగిన శుకపికాదులతో, మృగమదంబుఁ అడంగచేయుచు (బో. ప.) జంతువులయొక్క గర్వమును అణచివేయుచు (చం. ప.) కస్తూరిని మించిపోవుచు, మేనికప్పు చెలంగగా = (బో.ప.) నల్లని శరీరము ఒప్పగా (చం. ప.) మేనిలోని కప్పు (మచ్చ) ఒప్పగా, పగలుమీరగఁ = (బో.ప.)పగవిశేషించగా-(బోయపగ అని వాడుకలో నున్నది (చం.ప.) పగటివేళ అతిక్రమించగా అనగారాత్రియందు, పాంథకోటులఁ = (బో.ప.) బాటసారుల సమూహములను (చం.ప.) విరహుల సమూహములను, బాధపెట్టుచున్న, తొగతగులు = కలువలకు స్నేహితుడైన చంద్రుడు (తొగ = కలువతో, తగులాటము = స్నేహము కలవాడు), వెడవింటిబోయకు = చెరకువిల్లు కలిగిన మన్మథుడన్న బోయవాడికి, తోడువచ్చిన వాడెపో = సహాయము వచ్చినవాడే సుమా!

కస్తూరి నల్లనిది. చంద్రునిలో కప్పు కస్తూరిని మరపించునదని కవి హృదయము.

అలంకారము :— శ్లేష, రూపకము.

మకరంద రసముఁ జిల్కెడు
చికిలి లకోరీలు చెఱకు సింగిణి విల్లుం
బ్రకటించియు, నిది యేమో!
మకరాంకుఁడు చేఁదువగలు మానఁడు చెలియా." 65

ఇంకా సుభద్ర ఇలాగంటూ ఉంది.

*అర్థము* :— మకరాంకుడు = మొసలి టెక్కెముగా (కేతనముగా) గలిగిన మన్మధుడు. మకరందరసము = తేనెను. చిల్కెడు = ఒలుకుతున్న. చికిలిలకోరీలు = ఎంతో అందమైన (పుష్పలనే) బాణములును, చెఱకు సింగిణి విల్లుగా = చెఱకుతో చేయబడిన ధనుస్సును (రెండూ తీయనివే) ప్రకటించియు = బయటికి చూపిస్తూ, ఇదియేమో = ఎందుచేతనో, చేదు = చేదుగా ఉండే (కటువైన), వగలు = కార్యములను (ప్రాణములను చేదివేసే పద్ధతులను), మానఁదు చెలియా.

*విశేషము* :— మకరాంకుని విల్లు, బాణములు మధురమైనవి. కాని అతని కార్యములు మాత్రము చేదైనవి అని చమత్కారము.

*అలంకారము* :— చిత్రాలంకారము, శ్లేష.

చిడిముడి పాటుతోఁ జెఱకు సింగిణిఁ బూని, మధుప్రియత్వమే
ర్పడుగతి, లాపులున్న హరిపైని జిపుక్కున నెక్కి యుక్కునన్
వెడలెడు చందుఁజూచి, తమి నేఁడిది గోవధ మాచరించుఁ బెం
పడర లతాంగి! పచ్చితురకౌఁగద యమ్మదనుండు చూడఁగన్!" 66

*మనవి* :— మత సహిష్ణుతను విశేషంగా చూపించిన తంజావూరి నాయికరాజుల కాలమున ఈ మతవిద్వేష పూరితమయిన పద్యము చేమకూరకవి వ్రాసి ఉండడనీ, ప్రస్తుతపరిస్థితులకు ఇది తగదని ఈ పద్యమును విరాకరించాము.

అనినఁ, "బవనుండు మనకు లోనైనవాఁడు,
తోయజారాతి మనుజులత్రోవ రాఁడు,
కాముతూపులు వెంద్రుకఁ గట్టఁ బడును,
జామ, యేటికి నూరక జలదరింప?" 67

(62 వ పద్యము మొదలు 66 వరకు) ఈ ప్రకారముగా సుభద్ర చెలికత్తెలతో చెప్పగా ఆ చెలికత్తెలు ఆమెకు ధైర్యము చెప్పాలని కింది విధంగా అంటున్నారు.

*అర్థము* :— పవనుండు మనకు లోనైనవాఁడు = గంధవహుడు మన స్వాధీనములో ఉన్నవాడు = (మనలోపల ఉన్నవాడు, శ్వాసనిశ్వాసల రూపమున అని అర్థాంతరము). తోయజ అరాతి = తామరలకు శత్రువైన చంద్రుడు, మనుజుల త్రోవరాఁడు = మనుష్యుల జోలికిరాడు (మనుజులు సంచరించు భూమియందు నడిచేవాడుకాదు అని అని అర్థాంతరము). కాము = మన్మధునియొక్క, తూపులు = బాణములు (పువ్వులు). వెంద్రుకన్ కట్టబడును = అత్యంత సులభముగా కట్టివేయవచ్చును (పూవులు వెంద్రుకల యందు తురమగలిగినవని

అర్థాంతరము), చామ = ఓకాంతా (సుభద్రా), ఏటికి = ఎందుకొరకు ఊరక = అకారణముగా, జలదరింప = భయపడుట (ఈ ముప్వురును మనకెట్టి హాని కలిగించలేరని చెలికత్తెలు సుభద్రకు వివరిస్తున్నారు.

అలంకారము :— శ్లేష.

అనుచు నూఱడఁ బల్కి, తత్ప్రాణ సఖులు
దేవకీదేవి కీమాట దెల్ప కున్నఁ
గాదనుచుఁ, జేరి, చెలి యున్న గాదఁ దెలిపి;
రంత, యట మున్న తెలిసి మురాంతకుండు. 68

అర్థము :— అనుచు, తత్ ప్రాణసఖులు = సుభద్రయొక్క ప్రియమైన చెలికత్తెలు, ఊఱడఁగా పలికి = ఓదార్చి, (వారిలోవారు) దేవకీదేవికి = సుభద్ర తల్లియైన దేవకికి, ఈమాట = ఈ విరహవేదన, తెల్పకున్నఁగా = చెప్పకుండిన యెడల, కాదుఅనుచుఁగా = ఉచితముకాదు అనుకొని, చేరి = దేవకిని సమీపించి, చెలి ఉన్న - గాద = సుభద్ర పడుతున్న కష్టము సంగతి అంత = సవిస్తరముగా, తెలిపిరి; అటమున్న = అంతకుముందే, తెలిసి = ఈ సమాచారము ఎరిగి, ముర అంతకుండు = మురాసురుని అంతమొందించిన కృష్ణుడు (క్రింది పద్యముతో అన్వయము.)

పాఠాంతరము :—

"చెలియున్న గాథఁ దెలిపి...."

## సుభద్రా వివాహ ఘట్టము

తల్లిని దండ్రి నాత్మజులఁ దమ్ముని రమ్మని యేకతంబునం,
దల్ల కిరీటియున్న తెఱఁ గల్ల సుభద్రకునైన మోహముఁ
దెల్లముసేసి 'ముఁ మనమదింగల యట్లనె యయ్యె' నంచు రం
జిల్లి, "హలాయుధుం డెఱుఁగఁ జేయఁగరాదుగదా వివాహమున్". 69

కృష్ణుడు సత్వర కార్యక్రమానికి పూనుకుంటున్నాడు.

అర్థము :— తల్లిని, తండ్రిని, ఆత్మజులఁగా = కుమారులను, తమ్ముని (సాత్యకిని), రమ్మని, ఏకతంబు నందు = ఏకాంతమునందు, అల్లకిరీటియున్న తెఱగు = ఆ అర్జునుడున్న

విధమును, అల్లసుభద్రకు అయన మోహముఁ = ఆ సుభద్రకు కలిగిన ప్రేమను, తెల్లము చేసి = తెలియపరచి, మున్ = మొదటినుండి, మనమదిన్ = మనమనస్సులలో, కలయట్లనె = ఉన్నవిధముగనే (అనగా మన అభిలాష ప్రకారముగా), అయ్యెఁ = జరిగింది, అంచు = అనుచు, రంజిల్లి = సంతోషించి, హలాయుధుండు = నాగలి ఆయుధముగా కలిగిన బలరాముడు, ఎఱుఁగన్ = ఈ సంగతి తెలుసుకున్నట్టయితే. వివాహముఁ, చేయఁగరాదుగద = చేయుటకు వీలుండదుకదా.

*విశేషము* :— "ఇక్కడ చెప్పిన వారందరూ కృష్ణుడి ముఠా" వీరు మొదటినుండి ఈ వివాహం కోరినవారే. బలరాముడే ప్రతికూలుడు. అతని కీ సంగతి తెలుస్తే ఈపెళ్ళి జరగడం అసాధ్యమని కృష్ణుడు చెప్పుతున్నాడు.

ఈ రహస్య ప్రవర్తన నంతటికి కారణము ఇప్పుడు బయటపెడుతున్నాడు కవి.

తనశిష్యుం డని దుర్యో
ధనునకు నీ వలచి సమ్మతం పడఁ డటుగా
వున నిందుకుఁ బశుపతి పూ
జన మని యిపుడొకఁటి గద ప్రసక్తం బయ్యెన్. 70

అర్థము :— (బలరాముడు), తన, శిష్యుండని = శిష్యుడుఅన్న అభిమానముతో, దుర్యోధనునకున్, ఈఁ = ఇచ్చుటకు, వలచి = కోరి, సమ్మతం పడఁడు = సుభద్రార్జునుల వివాహానికి ఇష్టపడడు, అటుగావునన్ = కాబట్టి, ఇందుకు = ఈ ఆటంకము తప్పించుకొనుటకు (కృష్ణుడు ఉపాయమును చెప్పుచున్నాడు), పశుపతిపూజనము అని = శివుని పూజ (తిరునాళ్ల) అని, ఒకటి = ఒక ఉత్సవము, ఇపుడు ప్రసక్తంబు అయ్యెఁకద = ఇపుడు కలిగినది గద !, (ఇంకను పై పద్యమున ఈ ఉపాయము కొనసాగింది.)

*విశేషము* :— ఇప్పుడీ పశుపతి పూజనమన్న కార్యము కృష్ణుడు సృష్టించినదికాదు. సుభద్ర అర్జునుడు విరహములో ఉన్న ఈసమయములోనే ఆ ఉత్సవానికి ముహూర్తము తటస్థించింది. ఆ ఉత్సవసమయాన్నే ఉపయోగించుకుందామని కృష్ణుడు సలహా ఇస్తున్నాడు. ఆ ఉత్సవము ఏమిటో తరువాతి పద్యములో.

ఇరువదినాళ్ళు రేపు మొద లిందుధ రోత్సవ లీల లచ్చటన్
జరిగెడు; నేఁటి కెన్మిదవ నాఁటికిఁ బెండ్లిముహూర్త మవ్వధూ
వరులకుఁ దెల్పి, చల్పెఁడు వివాహవిధుల్ హలి గానకుండఁ; దీ
వరమున లగ్నవేళ కటువత్తు" నటంచు నమర్చె దేవకిన్. 71

అర్థము :— రేపుమొదలు, ఇరువదినాళ్లు, ఇందుధర ఉత్సవలీలలు = చంద్రుని ధరించిన శివునియొక్క ఉత్సవములోని, వేడుకలు, అచ్చటన్ = ఆ యాత్రా స్థలమందు (అది అంత ర్ద్వీపమని వారికి చెప్పవలసిన అవసరములేదు). జరిగెడు = జరుగుతవి. నేఁటికి, ఎనమిదవ నాటికి, పెండ్లిముహూర్తము; అవ్వధూవరులకు తెల్పి, హలి = బలరాముడు, కానకుండ = చూడకుండ (అనగా హలికి తెలియకుండా). వివాహవిధుల్ = పెండ్లి ఏర్పాట్లను, చల్పుడు = చేయండి; తీవరమునఁ = వేగముగ, లగ్నవేళకు = ముహూర్త సమయమునకు, ఇటువత్తుఁ = ఇక్కడికి వస్తాను, అటంచుఁ, దేవకిన్ = దేవకీ దేవిని, అమర్చె = ఏర్పాటుచేసెను.

*విశేషము* :— ఒక్క తిరుపతివారు తక్కిన ప్రచురణకర్తలు 'అమర్చి దేవకిఁ' కొందరు '...నటంచును దెల్పి దేవకిఁ' అని అసమాపకంగా ప్రచురించారు.

## శివునికి జాతర

అంతటఁ బశుపతి పూజకు
నంతటఁ జాటంగఁ బనిచి హరి యరిగెఁ బ్రలం
బాంతకు వసుదేవుని ము
న్నంతర్ద్వీపమున కేఁగుమని, యావెనుకన్. 72

అర్థము :— అంతటఁ = తరువాత, పశుపతిపూజకు = శివుని పూజోత్సవమునకు, అంతటఁ = అన్ని స్థలములయందు, చాటంగఁ పనిచి = చాటింపుచేయ ఆజ్ఞాపించి, ప్రలం బాంతకున్ = ప్రలంబుడు అను రాక్షసుని చంపిన బలరామునిని. వసుదేవుని, మున్ను = ముందుగా, అంతర్ద్వీపమునకు = తిరునాళ్ల జరుగు ప్రదేశమునకు, ఏగుము అని = వెళ్ళమని, హరి = కృష్ణుడు, అరిగెఁ = పోయెను. ఆవెనుకఁ = ఆ తరువాత —

యదు వృష్ణి భోజ కులజులు
గదలి రపు డనేక బాలికా మణిభూషా
మృదుల పరిధాన పరిమళ
విదిత మహైశ్వర్య ధుర్య విభవోన్నతులై. 73

అర్థము :— అనేక...విభవోన్నతులై — అనేక = పెక్కుమంది, బాలికా = కన్యలు, మణిభూషా = రత్నాభరణములు, మృదుల = మెత్తని, పరిధాన = వస్త్రములు, పరిమళ = సుగంధద్రవ్యములు (వీనిచేత), విదిత = తెలియ చేయబడిన, మహాఐశ్వర్య = గొప్ప ఐశ్వర్య

మును, ధుర్య = వహించిన, విభవ ఉన్నతులై = గొప్ప వైభవము కలవారై, యదు వృష్ణి భోజ కులజులు = యదువంశమునందును, వృష్ణివంశము నందును భోజవంశమునందును పుట్టినవారు, (అందరు) అపుడు కదలిరి.

కృష్ణుడి బంధువర్గము వారు వెంటతీసుకొని పోయిన స్త్రీలూ, రత్నాభరణాలూ వస్త్రాలూ సుగంధద్రవ్యాలూ చూస్తే వారు ఎంతటి మహాఐశ్వర్యముతో ఉన్నారో స్పష్టమవుతుందని భావము.

ఈగతి నంతరీపమున నెల్లజనంబులతోడ నేఁగి, యం
దాగమ వేద్య శీలికి న తామర పాళికి నిందు మౌళికిన్
ద్యాగము భోగముల్ చెలుల యాటలు పాటలు నిత్యకృత్యమై
సాగఁగఁ జూచుచుండి రల శౌరియు సీరియు సంభ్రమంబునన్. 74

అర్థము :— ఈగతిన్ = ఈవిధమున, అంతరీపమునకు = ద్వీపమునకు, ఎల్లజనంబుల తోడన్, ఏఁగి = వెళ్ళి, శౌరియు = కృష్ణుడును, సీరియు = బలరాముడును (సీరము = నాగలి కలిగినవాడు), సంభ్రమంబునన్ = సంబరముతో, అందు = ఆ అంతరీపమునందు, ఆగమ = శైవవేదముల జ్ఞానముచే, వేద్య = తెలుసుకోదగిన, శీలికి = స్వభావముగలవానికి, నత = నమస్కరించుచున్న, అమర = దేవతలయొక్క, పాళికిన్ = సమూహము గలవానికి, ఇందు మౌళికిన్ = చంద్రునిమౌళి (శిరసు)సందుకల శివునకు, త్యాగము, భోగము = త్యాగభోగాలూ, చెలుల = స్త్రీల, ఆటలు పాటలు, నిత్యకృత్యమై సాగగ = ప్రతిదినము జరుగు పనులుగా సాగు తుండగా, చూచుచుండిరి.

శివుడికి రోజూ కానుక లివ్వడమూ, భోగాలు చేయించడము, స్త్రీల ఆటలూ పాటలూ ఇవన్నీ ప్రతిరోజూ జరుగుతుండెనని భావము.

అలంకారము :— అనుప్రాసము.

## వి వా హ స న్నా హ ము

అంత నిచ్చట ద్వారకయందు దేవ
కీ సతీమణి తాను రుక్మిణియుఁ బెండ్లి
పెద్దలై, యర్జును సుభద్రఁ బెండ్లికొడుకుఁ
బెండ్లికూఁతునుఁ జేయ సపేక్షఁ జెలఁగి, 75

అర్థము :— అంత = ఇంతలో (అక్కడ ఆ ఉత్సవము జరుగుచుండగా). ఇచ్చట ద్వారకయందు, దేవకీసతీమణి, రుక్మిణి (ఇద్దరును). పెండ్లి పెద్దలై, అర్జునుఁ సుభద్రఁ, పెండ్లికొడుకుఁ పెండ్లికూతురును, చేయ, అపేక్ష = కోరికతో, చెలఁగి = ప్రవర్తించి....

ఆడపెండ్లివారి పక్షమున దేవకీదేవి, మగపెండ్లివారి పక్షమున సోదరివరుస గల రుక్మిణియు పెండ్లి పెద్దలయి పెండ్లికొడుకును పెండ్లికూతురును చేయడానికి పూనుకున్నారు (అంటే ఏమిటో తరువాతి పద్యాలలో తేటపడుతుంది.)

కట్టిరి మంచిలగ్నమునఁ గంకణముల్ కర పంకజంబులఁ,
బెట్టిరి మేనులఁ నలుఁగు మేలి మృగీమద కుంకుమంబులన్,
జుట్టిరి కైశికంబుల విశుద్ధ మనోహర పుష్పమాలికల్;
పట్టిరి పేరటాండ్రు ధవళంబులు పాడుచు నుల్లభంబులన్. 76

అర్థము :— మంచిలగ్నమున = మంచి ముహూర్తమునందు, కరపంకజంబులన్ = పద్మములవంటి చేతులయందు, కంకణముల్ = దీక్షాకంకణములను, కట్టిరి, మేనులఁ = శరీరములందు, మేలి = ప్రశస్తమైన, మృగీమద = కస్తూరి, కుంకుమంబులఁ = కుంకుమపూవులతో, నలుగుపెట్టిరి = శరీరములను నలిచిరి; కైశికంబులఁ = కేశముల సమూహమునందు, విశుద్ధ = నిర్మలమై, మనోహర = అందమైన, పుష్పమాలికల్ = పూదండలను, చుట్టిరి = తురిమిరి; పేరటాండ్రు = పుణ్యస్త్రీలు, ధవళంబులు = మంగళగీతములు (పెండ్లిపాటలలో ఒకరకమైనవి) పాడుచుఁ, ఉల్లభంబులఁ = మేలుకట్లను (పెండ్లి సమయములో శాలువలు మొదలగువానిని చాందినీవలె ఎత్తిపట్టుకొనునది) పట్టిరి.

ఇన్నాళ్ ప్రోది యొనర్పఁ గేళివనిలో నింపొందు న మ్మాధవీ
పున్నాగంబులఁ బెండ్లి సేయవలెఁ, బూఁబోండ్లార, రారే యటం
చుఁ నేర్పుల్ దగ నొండొరుం బిలిచికొంచుఁ సత్యభా మాది వి
ద్యు న్నేత్రా మణు లప్డు డిర్వరకు నిందుల్సేసి రందందులన్. 77

అర్థము :— ఇన్నాళ్ = ఇన్నినాళ్లు, ప్రోదియొనర్పఁ = పెంచుకొనిరాగా, కేళివనిలోఁ ఉద్యానవనములో, ఇంపొందు = చక్కగా పెరిగిన, ఆమాధవీ, పున్నాగంబుల = ఆ బండిగురివెంద తీగకున్ను, పొన్నచెట్టుకున్ను, పెండ్లిచేయవలెఁ, పూబోండ్లార = పూవువంటి శరీరము గల కాంతలార, రారే = రండు, అటంచు, నేర్పుల్ తగఁ = చమత్కారము ఒప్పునట్లుగ, ఒండొరుఁ = ఒకరినొకరు, పిలుచుకొంచుఁ, సత్యభామ ఆది = సత్యభామ మొదలైన విద్యుత్

నేత్రామణులు = మెరపువంటి కన్నులుగల స్త్రీ రత్నములు, (యాదవరాణులు మొదలైనవారు) అప్పుడు, ఇర్వురకుఁ = సుభద్రార్జునులకు, అందందుఁ = వారివారి మందిరములలో, విందులుచేసిరి.

*తాత్పర్యము* :— ఇన్నాళ్ళూ మన ఉద్యానవనములో పెరిగిన మాధవీ లతకూ పొన్న చెట్టుకీ పెండ్లి చేయాలి రండమ్మా అని ఒకరి నొకరు పిలుచుకుంటూ సత్యభామాది యాదవ రాణులు సుభద్రార్జునులకు విందులు చేశారు.

*విశేషము* :— మాధవుడి సోదరి కనుక సుభద్ర మాధవి. పున్నాగము (పురుషగజము) అనగా పురుషులలో శ్రేష్ఠమైనవాడు అర్జునుడు. అందువలన మాధవీ, పున్నాగములని కాంతామణులు (సుభద్రార్జునులకు పెండ్లి అని ఇతరులకు రహస్యము తెలియనీయకుండానే) చమత్కరించారు. దీనినే కవి 'నేర్పుల్ తగఁ' అనుమాట ద్వారా సూచించాడు.

*అలంకారము* :— అప్రస్తుత ప్రశంస.

అంతర్వాణి పురోహితుఁ
డంత వివాహోచిత క్రియాకాండం బా
ద్యంతము గావించుటకై
సంతసమునఁ జేరియున్న సమయము నందున్. 78

సుభద్రార్జునులు విందులలో పాల్గొంటూ ఉండగా ఇక్కడ...

*అర్థము* :— అంతఁ, అంతర్వాణి పురోహితుఁడు = విద్వాంసుడైన పురోహితుడు = పురోహితుడు, వివాహ ఉచితక్రియా కాండఁ = పెండ్లికి తగినపనుల సమూహమును, ఆది అంతమును = మొదటినుండి తుదివరకు, గావించుటకై = చేయుటకొరకు, సంతసమున = సంతోషమున, చేరియున్న = వచ్చియున్న, సమయమునందు.

*విశేషము* :— ఈవివాహ రహస్యమును పురోహితుడు గాపాడేవాడై యుండాలి. కాబట్టి 'అంతర్ వాణి' లోపలిమాటలవాడు. అనగా బయట చెప్పనివాడు పురోహితుడు అని చెప్పడము, చమత్కారము.

*అలంకారము* :— పరికరము.

సంపంగి సూనె యందెగ
శంపాంగి కిరీటి కౌకత, చనుదోయి పిసా
ళింపం, గిబ్బడ కటి నటి
యింపం గిటకిటని తా నొకింత చంలిపన్. 79

అర్థము :— శంపా అంగి ఒకతె = మెరుపువంటి శరీరముగల చెలికత్తె యొకతె, చనుదోయి = కుచద్వయము, పిసాళింపఁగా = కులుకుతూ ఉండగా, కీల్జడ, కటిఁగా = పిరుదులపై, నటియింపఁగా = నాట్యము చేస్తుండగా - చిందులాడుతుండగా, కౌను = నడుము, కిటకిటని (బరువుకు తాళజాలక కిటకిటమని), ఒకింత = కొంచెము, చలింపఁగా = అల్లల్లాడుతుండగా, కిరీటికి = అర్జునుడికి, సంపంగినూనె యంటెఁగా = సంపంగినూనెతో తల అంటెను,

ఒక సుందరి అర్జునుడికి సంపంగి నూనెతో తల అంటింది.

కలశస్తని మణికంకణ
కల శస్త నినాద మొలయఁగా నొకతె వడిం
దలఁ బ్రామి పసిఁడి కొప్పెర
జలములు చెలు లంది యొసఁగ జలకంబార్చెన్. 80

అర్థము :— కలశస్తని = కుండలవంటి స్తనములుగల, ఒకతె = ఒక చెలికత్తె, మణికంకణ = రత్నకంకణముల యొక్క, కల = మనోహరమైన, శస్త = ప్రశస్తమైన, నినాదము = ధ్వని, ఒలయగాన్ = కలుగునట్లుగా, వడిఁగా = త్వరగా, తలన్ ప్రామి = తలరుద్ది చెలులు = వేరే చెలికత్తెలు, పసిడి కొప్పెరఁగా = బంగారు చెంబులతో, జలములు = నీళ్ళు, అంది యొసఁగన్ = అందిస్తూ ఉండగా, జలకంబార్చెన్ = స్నానము చేయించెను.

విశేషము :— ఒక యౌవనాంగి అతనికి తలరుద్ది, చెలికత్తెలు బంగారు చెంబులతో నీళ్ళు అందిస్తుండగా స్నానము చేయించింది.

అలంకారము :— యమకము.

లయవిభాతి :—

చలువలొసఁగెన్ సరగఁ జెలువ యపు డొక్కరిత,
వలఁతి తన మొప్ప నొకపొలఁతి తడియొత్తఁగా,
గొలఁదిగ జవాది నొకవెలఁది తలఁబూసె; నొక
జలరుహదళాక్షి సిగ కలరు సరి చుట్టెన్,
దిలకమిడియెన్ నిటలఫలకమున నొక్కరిత,
తెలినిలువు టద్ద మొక చెలినిలిపె ప్రోలఁగా
గలయ జవరాలొకతె మలయజ మలందె, నొక
లలన విసరెన్ సురటి యల నరున కర్థిన్. 81

అర్థము :— అపుడు చెలువ, ఒకరిత సరగన్, చలువ, లొసగెన్; ఒకపొలతి, వలతి తన మెప్పున్ = నేర్పరితనముతో తడియొత్తెను;

ఒక వెలది, కొలదిగ, జవాదిన్ పూసెన్; జలరుహదళాక్షి = పద్మదళమువంటి కనులు గల చెలికత్తె ఒకతి, సిగకు, అలరుసరి = పూవుల దండను చుట్టెను; ఒక్కరిత నిటల ఫలకమునన్ = పలకవంటి నుదుటియందు, తిలకమిడియెన్ = బొట్టుపెట్టెను;

ఒక చెలి, మ్రోలన్ = సమీపమునందు, తెలినిలువు టద్దము = స్వచ్ఛమైన పెద్ద అద్దమును నిలిపెన్;

జవరాలు ఒకతె = ఒక యవ్వనవతి, కలయన్ = శరీరమంతటను, మలయజము = చందనము, అలందె;

ఒక లలన, అలనరునకు = ఆ అర్జునునకు, అర్థిన్ = కోరికతో, సురటి = వీవనను. విసరెన్.

ఒరగ వేసినసిగ వింత యొఱపుఁ జూచి
ఐవిరి దిద్దిన చెంపల బాగుఁ జూచి
వడిగొలిపి యున్న మీసము బెడఁగుఁ జూచి,
అపుడు తమలో సుభద్ర నెయ్యంపుఁ జెలులు.... 82

అర్థము :— అపుడు = పైనచెప్పిన అలంకరణ మంతా అయిన తరువాత, సుభద్ర (యొక్క) నెయ్యంపుచెలులు = ఇష్టసఖులు, ఒరగవేసినసిగ = కొంచెము ఒరిగినట్లు వేసిన జుట్టుముడి యొక్క, వింత ఒఱపున్ = కొత్త అందమును, చూచి, ఐవిరి దిద్దిన = గుండ్రంగా తీర్చిదిద్దిన, చెంపల బాగున్ = చెంప వెండ్రుక లున్న సొగసును, చూచి, వడిగొలిపియున్న = తిప్పియుంచిన, మీసము (యొక్క) బెడఁగు = అందమును చూచి, (ఆ ఇష్టసఖులు) తమలో ఈలాఅనుకున్నారు.

"వాసవి త్రిదండి వేసము
వేసి గదా మేలుసేసె; వెస జన్నిదమే
వేసికొనవచ్చు, నీసిగ
వేసికొనం గూడ దొండు వేసము లైనన్. 83

ఈ అభిప్రాయముగ్గొక చెలికత్తెదయి ఉంటుంది.

అర్థము :— వాసవి = ఇంద్రుని పుత్రుడగు అర్జునుడు, త్రిదండి వేసము = త్రిదండములతో ఉండే యతివేషము, వేసి, మేలు = మంచిపని, చేసెఁగదా; ఒండువేసములైనఁ = మరియొకరీతి (సన్యాసి) వేషము వేసిఉంటే, వెసఁ = (ఇప్పుడు) త్వరగా, జన్నిదమే = ఒక్క జందెమునే, వేసికొనవచ్చును, (కాని), ఈసిగ, వేసికొనుటకు వీలుండదుకద.

విశేషము :— వైష్ణవమతము అనుసరించిన త్రిదండి సన్యాసులు జన్నిదమును, సిగను ఉంచుకో వచ్చును. అద్వైతమత సన్యాసులు సిగను తీసివేసి జందెమును మాత్రమే వేసుకో వచ్చు. కాబట్టి, అర్జునుడు ఈ అలంకరణకు పనికి వచ్చినట్లు సిగను ఉంచుకున్నందువల్లను "మేలుసేసె"నని వారి భావము.

దండముఁ గాషాయంబును
గుండికయును మాని పెండ్లికొడుకైనాఁ డా
ఖండలుని ముద్దుఁ గొడుకు ప్ర
చండ రుచి న్నేఁడు మంచి సన్న్యాసముగా. 84

ఇది మరొక సఖి అభిప్రాయము కావచ్చును.

అర్థము :— ఆఖండలుని = ఇంద్రుని, ముద్దుకొడుకు (అర్జునుడు), దండము, కాషాయము, కుండిక = కమండలువు (సన్న్యాసిగా ఉన్నపుడు ఉండిన ఈమూడింటిని), మాని = విడిచిపెట్టి, ప్రచండ రుచిఁ = ఎక్కువైన కాంతితో, నేఁడు = ఈనాడు, పెండ్లికొడుకు అయినాఁడు; మంచిసన్న్యాసముగా = చిత్రమైన సన్యాసముగదా !

విశేషము :— గృహమును, భార్యాపుత్రులను వదలిపెట్టి సన్యాసులవుతారు. ఈసన్యాసి సన్యాసి లక్షణాలైన దండము, కాషాయమును, కమండలువు, విడిచిపెట్టి (సన్యసించి) పెండ్లికొడుకైనాడు, అందువల్ల ఇది చిత్రమైన సన్యాసమని చెలికత్తెలు అనుకుంటున్నారు.

యతివేషంబున నిన్నినాళ్లు మన యుద్యానాంతర క్షోణి ను
న్నతఁడా యీతఁ డదేటి మాట ? కనుఁగో మందెన్నఁడే నీ తను
ద్యుతి, యీ రాజస, మీ మొగంబుకళ, లీ యొయ్యారమ్, మీ వీక్ష ణా
మృత లీ లాభినయంబు, లీ సొగసు, లీ మీసాలలో నవ్వులున్. 85

ఒక చెలికత్తె అతడే ఇతడని నమ్మలేకుండా ఉంది.

అర్థము :— ఇన్నినాళ్లు, యతివేషంబునన్, మన ఉద్యాన అంతర క్షోణిఁ = మన పూలతోటలోపలి ప్రదేశమున ఉన్న అతడా ఈతఁడు ? ఇది ఏటిమాట = ఎవరు నమ్మగలరు !

(ఆ యతికి), ఈ తనుద్యుతి = ఈశరీరకాంతి, ఈరాజసము = ఈఠీవి, ఈమొగంబు కళలు = ముఖమునందలి ఈ వర్చస్సు, ఈ ఒయారము, ఈవీక్షణ = చూపులయందలి, అమృత = అమృత మొలుకునట్టి అనగా చాలా మనోహరమైన, లీల అభినయంబు = విలాసముగల చేష్టలు. ఈ సొగసులు, ఈమీసాలలో నవ్వులన్ = అగుపించీ అగుపించని చిరునవ్వులున్ను, అందు = ఆ ఉద్యానవనమందు, ఎన్నఁడేన్ = ఏసమయమునందైనా, కనుగోము = చూచి యుండలేదు.

*విశేషము* :— చెలికత్తెలు నమ్మలేక ఆశ్చర్య పడుతున్న అర్జునుడి సౌందర్యలక్షణాలు ఇన్ని రోజులు కానరాకుండా ఉండి, నేడు ప్రస్ఫుటమైనాయని భావము.

సన్యాసివేషములో తనకు సహజములైన రాజసము .... సొగసులను తన సామర్థ్యము చేత బయటపడకుండా నటించగలిగినాడు అని ధ్వని, అందువల్ల పద్యములోని 'లీలాభినయంబులు' సార్థకము.

*అలంకారము* :— ఉల్లేఖము.

"ఈ మహిమ యెందుఁ గలదే
భూమండలిలోన ? నితఁడవో చక్కనివాఁ
డో మగువలార ! మును విన
మా మన్మథు, నతని మేనమామన్, మధునిన్ ? 86

అర్జునుడి సౌందర్యాన్ని గురించి సఖుల అభిప్రాయాలు.

*అర్థము* :— ఓ మగువలార = ఓకాంతలార, ఈ మహిమ = ఈ సౌందర్యాతిశయము ఎందున్ కలదే = మరి యెక్కడైనా వుందా ? భూమండలిలోనన్ = సర్వప్రపంచమునందు, ఇతడవో = ఇతడొక్కడే సుమా, చక్కనివాడు; మన్మథుడిని, అతని మేనమామన్ = అతని మేనమామయైన చంద్రుడిని, మధునిన్ = వసంతుని (వీరిని గురించి), మును = ఇంతకు పూర్వము, వినమా = వినలేదా ?

*విశేషము* :— మన్మథ చంద్ర వసంతులను గూర్చి వినిగూడా 'ఇతడవో చక్కనివాడు' అన్నందువల్ల ఈ అర్జునుడు ఆ ముగ్గురికంటే చక్కనివాడన్నమాట. మన్మథుడు, చంద్రుడు, వసంతుడు గొప్ప అందగాళ్ళని ప్రసిద్ధి.

*అలంకారము* :— యమకము.

"ఈ రాజు సేవ చేసిన
వారిది గద భాగ్య; మీ భువన మోహన శృం
గారునితోఁ గూడం గల
నారీమణిదే సుమీ జనన మూహింపఁగా. 87

*అర్థము* :— ఈ రాజు సేవచేసినవారిదిగద భాగ్యము, ఊహింపఁగా = ఆలోచించగా, ఈ భువనమోహన శృంగారునితో = లోకములను మోహించచేయు ఈ అందగానితో, కూడఁగా గల = కలిసి సుఖించగల, నారీమణిదే = స్త్రీరత్నముదే, సుమీ జననము = జన్మముసుమా.

సుభద్ర జన్మమే జన్మము అని భావము.

"మంచి మగఁడు వలయు నంచుఁ గోరుచు నుండ,
మంచి మగఁడు గల్గె మఘవ సుతుఁడు,
మన సుభద్ర సుకృత మహిమ యేమన వచ్చు !
మనసు భద్రమయ్యె మనకు నెల్ల" 88

*అర్థము* :— మంచి మగఁడు = అనుకూలుడైన భర్త, వలయునంచు = గావలెనని, కోరుచునుండఁగా, మంచిమగఁడు = శ్రేష్ఠుడైన వీరుడు, మఘవసుతుఁడు = ఇంద్రునికుమారుడు, కలిగెఁగా = దొరికెను, మన సుభద్ర (యొక్క), సుకృతమహిమ = పుణ్య అతిశయము, ఏమన వచ్చున్ = ఎంత గొప్పది !, మనకు ఎల్లన్ = మనకందరికిని, మనసు = హృదయము, భద్ర మయ్యె = కుదుటపడినది.

*విశేషము* :— కోరిన కోరిక ఫలించడము సుకృత మహిమ.

*అలంకారము* :— యమకము, శ్లేష,

అని నుతింప నలంకృతుఁ డగుచు గొంతి
కూర్మి కొడు కుండ; బంగారు కుండ యైన
కన్యకా రత్నమున కా ప్రకారముననె
శిరసు మజ్జన మొనరించి చిగురుఁ బోండ్లు, 89

*అర్థము* :— అని నుతింప = పైన 83 వ పద్యము మొదలు 88 వ పద్యము వరకు చెప్పినట్లు చెలికత్తెలు తమ అభిప్రాయాలు ప్రకటిస్తున్న సమయమున, అలంకృతుడగుచు =

ఆలంకరింపబడినవాడై, గొంతికూర్మికొడుకు = కుంతీదేవి ముద్దుకొడుకు, అర్జునుడు, ఉండఁగా = ఉండగా, (ఇచట దేవకీదేవి నగరులో) చిగురుబోండ్లు = చిగురువంటి మెత్తని శరీరములు గల చెలికత్తెలు, బంగారుకుండయైన = బంగారు కుండవలె చాలా అందముగానున్న, కన్యాకా రత్నమునకు = కన్యకలలో రత్నమువంటి సుభద్రకు, ఆప్రకారమునఁగా = అర్జునునకు చేసిన విధముగనె, శిరసుమజ్జనము = తలంటిస్నానము, ఒనరించి = చేయించి......

అలంకారము :— అనుప్రాసము.

భామకుఁ గప్పు దేఱు తెగబారెఁడు నిద్దపు సోగ వెంట్రుకల్
వేమఱు దువ్వి, భారముగ వెన్కకు జాఱఁగఁ గొప్పువెట్టి, వో
హో ! మఱి వేయి వెట్టినటు లొప్పె న దేమనవచ్చు ? నౌఁ గదా,
తామరసాక్షి కెందుఁ దలిదండ్రులు పెట్టని సొమ్ము పెన్నెఱుల్. 90

అర్థము :— కప్పుదేఱు = మిక్కిలి నల్లనైన, తెగబారెఁడు, నిద్దపు = నిగనిగలాడు చున్న, సోగవెంట్రుకల్ = నిడుపాటి వెంట్రుకలు, వేమఱుఁగా = అనేకసార్లు, దువ్వి, భార ముగ = బరువుగ, (వెంట్రుకలు ఎక్కువగాసుండుటవల్లఈ భారము), వెనుకకు, జాఱఁగన్ = జారుకొప్పులాగా, భామకు = సుభద్రకు, కొప్పువెట్ట = కొప్పుతీర్చినపుడు, ఓహో = ఏ మాశ్చ ర్యము ! మఱివేయి వెట్టినటుల = వేయి అలంకరణాదులు పెట్టినట్లు (ఎన్నోనగలు పెట్టిన అంతటి అందముతో) ఒప్పెఁగా = అమరెను; అది ఏమనవచ్చుఁగా = దానిని ఏమని పొగడ గలము ! తామరస అక్షికిఁగా = పద్మములవంటి కన్నులుగల స్త్రీకి, ఎందుఁగా = సర్వత్రా, పెన్నెఱుల్ = పొడుగాటి తల వెంట్రుకలు, తల్లితండ్రులు (చేయించి) పెట్టని ఆభరణము, ఔగదా = ఔనుగదా. స్త్రీకి నగలు లేకున్నా చక్కని శిరోజాలు నగలలాగా సౌందర్యమును కూరుస్తాయని భావము.

పాఠాంతరము :— అర్థాంతరన్యాసము.

స్వకపోల కల్పిత మనో
జ్ఞకళా గతి కెట్టు లౌను సరి ? ఛాయా చో
రక రుచి సందర్భం బని
ముకురము నగు కరణి నవ్వు మోము చెలంగన్, 91

ముఖమునకున్న అందము అద్దములోని దాని ప్రతిబింబమునకు లేదనీ, స్వతంత్ర రచనకున్న సొగసు చోరకవిత్వమునకు కలుగదనీ శ్లేషతో కవి చెప్పుతున్నాడు.

అర్థము :— స్వకపోల ...... కళాగతికి - స్వ = తనదైన, కపోల = చెక్కిళ్ల చేత, కల్పిత = కల్పించబడిన-చేకూర్చబడిన, మనోజ్ఞ = మనోహరమైన, కళాగతికి = సౌందర్య వికాసానికి (ఇది ముఖపరమైన అర్థము) స్వకపోలకల్పిత = స్వకీయమైన బుద్ధిచేత కల్పన చేయబడిన (రచింపబడిన), మనోజ్ఞ = మనోహరమైన, కళాగతికి = కవిత్వకళయొక్క- ధోరణికి (ఇది కవిత్వపరము) ఛాయా......సందర్భంబు — ఛాయా = ముఖకాంతిని, చోరక = దొంగిలించుదానియొక్క- (ప్రతిబింబించు దానియొక్క-) అనగా అద్దముయొక్క-, రుచి సందర్భంబు = మెరుగుయొక్క- పొందిక (ఇది ముఖపరమైన అర్థము) ఛాయా = (సత్క-వీశ్వరుల) ఛాయలను, అనగా మంచిమంచి పోకడలను, చోరక = దొంగిలించిన దానియొక్క- (చోరకవిత్వముయొక్క-), రుచిసందర్భంబు = చమత్కా-రముయొక్క- కూర్పు (అని కవిత్వపరము), ఎటుల అవును సరి? అని, ముకురమున్ = అద్దమును, నగుకరణిన్ = నవ్విన (హేళన చేసిన) రీతి, నవ్వుమోము = ఎప్పుడూ నవ్వుతున్నట్లు కళకళలాడే ముఖము, చెలంగన్ = ప్రకాశించునట్లు) (తరువాతి పద్యమునందలి 'అద్దముచూచి' తో అన్వయము)

అద్దముయొక్క- అందము సుభద్ర ముఖకళలను దొంగిలించుట వలన (ప్రతిబింబించుట వలన) కలిగినదే కావున సహజసుందరమైన సుభద్ర ముఖమునకు సాటి వచ్చునది కాదు.

చోరకవి కవిత్వమునకు ఉన్నట్టి మెరుగులు స్వతంత్ర సత్క-వీశ్వరుల రచనలనుండి దొంగిలించినవే అని భావము.

*పాఠాంతరము* :— "ఛాయాచోరక రససందర్భంబు" అని — ఈ పాఠమున ముఖపరముగ జెప్పినపుడు అద్దమునకు వెనుకనుండు పాదరసముతో కూడినదనీ, కవిత్వపరము చెప్పినపుడు శృంగారాది రస సందర్భమనీ అర్థము.

పూర్వము అద్దములు పాదరసము పూసిన గాజుతోకాక బాగుగా మెరుగు (Polish) పెట్టిన కంచు, వెండి మొదలైన లోహపురేకులతో చేసేవారు. 'రుచి' అన్న పాఠమున లోహపు రేకనీ, 'రస' అన్న పాఠమున గాజు అద్దము అనీ అన్వయించుకోవలెను.

ఈ పద్యము కొన్ని ముద్రిత ప్రతులయందు కానరాదు. ఇది చేమకూరకవియే వ్రాసి ఉండిన యెడల, అతడు చేసిన కుకవి వర్ణనగా దీనిని అంగీకరించవచ్చును.

*అలంకారము* :— శ్లేష, ఉత్ప్రేక్ష.

అద్దముఁ జూచి, చంద్రముఖి యందముగాఁ దిలకంబు కస్తురిన్
దిద్ది, యనేక రత్నమయ దివ్య విభూషలు దాల్చి, య య్యెడన్
ముద్దులు గుల్కు- కుందనపు ముక్కా-లి పీఁట వసించెఁ దమ్మి పూ
ముద్దియ గద్దియం బొలుచు ముద్దియ యుద్ది యనన్ శుభోన్నతిన్. 92

*అర్థము* :—చంద్రముఖి = చంద్రునివంటి ముఖము కలిగిన సుభద్ర, అద్దముఁజూచి = అద్దములో చూచుకొని, కస్తురిఁ = కస్తురితో, అందముగాఁ, తిలకంబుదిద్ది = బొట్టుపెట్టుకొని, అనేక, రత్నమయ = రత్నములతో చేసిన, దివ్య = శ్రేష్ఠములైన, విభూషలు = నగలు, తాల్చి = ధరించి, అయ్యెడఁ, ముద్దులుగుల్కు = మిక్కిలి అందముగానున్న, కుందనపు = బంగారుతో చేయబడిన, ముక్కాలిపీటఁ = మూడుకాళ్ళపీటమీద, తమ్మిపూ = తామరపూవు యొక్క. ముద్దియ = కర్ణిక అనే, గద్దియఁ = పీఠమున—కర్ణిక-తామరగింజలుండే దిమ్మె-పొలుచు = ప్రకాశించు, ముద్దియ = కాంత యగు ఆ లక్ష్మీదేవికి, (తామరపూవు పీఠమున వసించు లక్ష్మీదేవి అని) ఉద్దిఅనఁ = సమానము అనునట్లుగా, శుభఉన్నతిఁ = మిక్కిలిశోభతో, వసించెఁ = కూర్చుండెను.

*విశేషము* :— తామరపూవు గద్దెమీద ఉండే లక్ష్మివలె అనడానికి పాండురంగ మాహాత్మ్యమున, "పద్మకర్ణిక కొలువున్న పద్మవోలె" ప్రయోగము చూడనగును.

*అలంకారము* :— ఉత్ప్రేక్ష.

"తనయుని పెండ్లి కేఁగవలె ధాత్రికి; దిక్కుల వారి నెల్లఁ దో
డ్కొని చనుదెమ్ము నీ" వని కడుం గుఱిసేసి సురాధినాథుఁ డ
వ్వనపతి కంపినట్టి శుభవార్తల బంగరు గమ్మ చుట్టనా,
దినకర మండలం బపర దిగ్గిరి కూటముఁ జేరె నయ్యెడఁ. 93

*అర్థము* :— సురాధినాథుఁడు = దేవతలకు ప్రభువు అయిన ఇంద్రుడు (ఇతడు తూర్పు దిక్కునకు అధినాథుడు), తనయుని పెండ్లికిఁ = కుమారుడైన అర్జునుని పెండ్లికి, ధాత్రికిఁ = భూమికి (భూలోకమునకు), ఏగవలెను = పోవలెను, దిక్కులవారినెల్లఁ = దిక్కులనున్నవారి నందరిని, తోడ్కొని = కూడదీసుకొని, నీవు చనుదెమ్ము = నీవురమ్ము, అని, కడున్ = గట్టిగా, గుఱిసేసి = ఆజ్ఞాపించి, ఆ వనపతికిఁ = ఎదుట అనగా పశ్చిమముననున్న (నీటికిపతి) సముద్రునకు, అంపినట్టి = పంపించిన, శుభవార్తల = శుభసమాచారములుకల, బంగరుకమ్మ చుట్టనాఁ = బంగారుతో తయారు చేసిన లేఖల (రేకుల) గుండ్రని కట్టయో అన్నట్లు, దినకర మండలంబు = సూర్యమండలము (బింబము) అయ్యెడఁ = ఆ సమయమున, అపరదిక్ = పడమర దిక్కునందుగల, గిరికూటము = కొండశిఖరము, చేరెఁ,

*విశేషము* :— అష్టాదశవర్ణనలలోని సూర్యాస్తమయ వర్ణన కొరకు కథను ఆగనీయక మేళవించి చేమకూరకవి ఈ వర్ణన చేసినాడు.

భూమికి అన్ని దిక్కులా చుట్టి ఉండువాడు కాబట్టి దిక్కుల వారినందరిని తోడ్కొని వచ్చుటకు సముద్రుడినే ఆజ్ఞాపించుట ఉచితము.

*అలంకారము* :— ఉత్ప్రేక్ష.

నంద కుమా రానుజ యురు
తం దన నందనుఁడు గట్ట దైవతపతి వే
డ్కం దెచ్చు తాళి బొట్టనఁ,
జందురుఁ డరుణ రుచిఁ బ్రాగ్దిశఁ గననయ్యెన్. 94

*అర్థము* :— తన నందనుఁడు = తన కుమారుడైన అర్జునుడు, నందకుమార = నందుని కుమారుడైన కృష్ణుని, అనుజ = చెల్లెలైన సుభద్రయొక్క, ఉరుతన్ = మెడయందు, కట్టన్ = కట్టుటకొరకు, దైవతపతి = ఇంద్రుడు, వేడ్కన్ = సంతోషముతో, తెచ్చు = తీసికొనివచ్చు, తాళిబొట్టు అనన్ = మాంగల్యమా అనునట్లు, ప్రాక్దిశన్ (ఇంద్రుడుపాలించే) తూర్పుదిక్కున, అరుణరుచిన్ = (బంగారు వన్నెతో అన్నమాట) ఎఱ్ఱని కాంతితో, చందురుడు, కననయ్యెన్ = కనబడెను.

*పాఠాంతరము* :— "దైవతపతి వేగం దెచ్చు తాళిబొట్టన".

*అలంకారము* :— ఉత్ప్రేక్ష.

కులదేవతను దెచ్చి నిలిపిరి మాణిక్య
చకచకల్గల పెండ్లి చవికె దండ;
నైరేనిఁ గొనివచ్చి రైదువల్ పాటలు
పాడుచు శుభవేళ వేడుకలరఁ;
బలుగడిగిన ముత్తెముల బాసికంబులు
సరవిఁ గట్టిరి నేర్పు సంఘటిల్లఁ;
దలఁబ్రాల కేర్చి ముక్తామణుల్ నించిరి
పసిఁడి పళ్లెముల సంభ్రమము మీఱఁ;
బణవ శంఖ ఢమామికా పటహ కాహ,
ళారవంబులు నెఱపిరి బోరుకలఁగ;
సకల వినియోగముల జనుల్ సకురె గాఁగ,
సంతిపురమున నుత్సవం బయ్యె నపుడు. 95

అర్థము :— ౧. మాణిక్యచకచకల్ = మాణిక్యముల మెరుగులుగల అనగా రత్నములు తాపిన, పెండ్లిచవికె = వివాహమండపము, దండ౯ = సమీపమున, కులదేవతను తెచ్చి నిలిపిరి.

౨. ఐదువల్ = పుణ్యస్త్రీలు, పాటలుపాడుచు, శుభవేళ౯ = మంచి ముహూర్తమునందు, వేడుకఅలరన్ = సంతోషము అతిశయించునట్లు, ఐరేనిన్ = (రంగులతో చిత్రించబడిన) అరివేణికుండలను, కొనివచ్చిరి;

౩. పులుగడిగిన = పులిసిన గంజితో కాని మజ్జిగతో కాని కడిగిన. (ఇట్లు కడుగుటవలన ప్రకాశము హెచ్చును). ముత్తెముల౯ = ముత్యెములతో, సరవి౯ = చక్కగా, నేర్పుసంఘటిల్ల౯ = చమత్కారముగ, బాసికంబులుకట్టిరి.

౪. తలఁబ్రాలకు౯ = తలంబ్రాలుగా ఉపయోగించడానికి తగిన, ముక్తామణుల్ = ముత్యాలను, ఏర్చి = ఏర్చియేర్చి, సంభ్రమము మీర౯ = మిక్కిలి సంబరముతో, పసిడి పళ్లెముల౯ = బంగారు పళ్లెములలో, నించిరి = నింపి ఉంచిరి.

పణవ శంఖ ఢమామిక పటహ కాహళ = పంబలు - శంఖములు - ఢక్కలు - మద్దెలలు - బాకాలు, (వీటియొక్క) ఆరవంబుల౯ = ధ్వనులను, బోరుకలఁగ౯ = బాగాధ్వనించునట్లు, నెరపిరి = ప్రయోగించిరి: సకులె = చెలికత్తెలే, సకల = సర్వమైన, వినియోగముల౯ = కార్యముల చేస్తుండే, జనుల్ కాగ = సిబ్బందికాగ, అపుడు = ఆసమయమున, అంతిపురమున, ఉత్సవంబు అయ్యెను.

మాణిక్యములు తాపిన పెండ్లి చవికె, ముత్తెముల బాసికంబులు, ముక్తామణుల తలబ్రాలు వారిసంపదను, ఐరేని, కులదేవత, తలబ్రాలు వారి ఆచారములను తెలుపుచున్నవి.

అలంకారము :— ఉదాత్తము.

తడవు సేసె, ముహూర్తంబు దగ్గఱించె,
నేమొకో యన్న రాఁడని యెదురు సూడఁ;
దనదు గారాపుఁ జెలియలి మన సెఱింగి,
మాటలోపల వచ్చె న మ్మాధవుండు. 96

అర్థము :— అన్న = తన అన్నయైన కృష్ణుడు, తడవుచేసె౯ = ఆలస్యము చేస్తూ ఉన్నాడు, ముహూర్తంబు = లగ్నసమయము. దగ్గఱించె = సమీపించినది, ఏ మొకో = ఎందుచేతనో, రాడు = ఇంకను రాకుండ ఉన్నాడు, అని (అనుకొనుచు) ఎదురుచూడ౯ = ఎదురు చూస్తుండగా, ఆమాధవుండు = ఆకృష్ణుడు, తనదు = తనయొక్క గారాబు చెలియలి = ప్రియమైన చెల్లెలి, మనసు ఎఱింగి = ఊహనుగ్రహించి,మాటలోపల = ఆ క్షణముననే, వచ్చెను.

ఒక రొకరి నెఱుఁగకుండఁగ,
నొకరి వెనుక నొకరు వచ్చి రొక నెపమున నా
నక దుందుభి సారణ సా
త్యకులును బ్రద్యుమ్న సాంబు లక్రూ రాదుల్. 97

అర్థము :— ఒకరు ఒకరిని ఎఱుఁగకుండగ, ఒకరివెనుక ఒకరుగా, ఒక నెపమున = ఒక్కొక్క సాకుతో, ఆనకదుందుభి = వసుదేవుడు, సారణుడు = బలరాముని తమ్ముడు, సాత్యకి = కృష్ణుని తమ్ముడు, (వీరున్న) ప్రద్యుమ్నుడును = కృష్ణుని కొడుకును. సాంబుడు, అక్రూరుడు, ఆదుల్ = మొదలైనవారు, వచ్చిరి.

వీరందరు అంతరీపమునుండి వచ్చుటకు అచట ఏదో ఒక నెపమును చెప్పి నేర్పుతో వచ్చిరని భావము.

రహస్యమును కాపాడుటకు వారందరు చేసిన ప్రయత్నము ఇక్కడ ధ్వనిస్తున్నది.

హరి వచ్చునంతలో నా
హరియుం జనుదెంచెఁ దనయుఁ డాత్మఁ దలంపన్
సుర లచ్చరలు మహర్షీ
శ్వరులు నరుంధతియు గురుఁడు శచియును దాసున్. 98

అర్థము :— హరి = కృష్ణుడు, వచ్చునంతలోనన్, ఆ హరియున్ = ఆ ఇంద్రుడును, తనయుడు = కొడుకైన అర్జునుడు, ఆత్మ తలంపన్ = (తండ్రిని-ఇంద్రుని) మనసులో అనుకొనుచుండగా, సురలు = దేవతలు, అచ్చరలు = అప్సరసలు, మహర్షీశ్వరులు = మహర్షి శ్రేష్ఠులు, అరుంధతియు = వసిష్ఠునిభార్య -మహాపతివ్రత, గురుఁడు = బృహస్పతి, శచియు = (ఇంద్రుని) భార్యయైన శచీదేవియు, తామున్, చనుదెంచెను.

చక్కెరవింటిరాజు నెకసక్కెము లాడఁగఁ జాలు నెక్కుడుం
జక్కఁదనంబు గల్గు నెఱ సాహసపుం గొమరుండు మ్రొక్కఁగా,
నక్కునఁ జేర్చి మే నిమిరి యౌదల మూర్కొని చొక్కుచుండె లో
నెక్కొను వేడ్క నిక్కుచెవి నీలని నెక్కు వజీరుఁ డమ్మెడన్. 99

అర్థము :— చక్కెరవింటిరాజున్ = చెరకు విల్లుగల రాజు అయిన మన్మథుని, ఎకసక్కెములు = పరిహాసములు, ఆడఁగఁజాలు = ఆడుటకు చాలినంత, ఎక్కుడుచక్కదనంబు

= ఎక్కువైన చక్కదనము, కల్గు = కలిగిన, నెఱసాహసపుఁ = నిండుసాహసముగలిగిన, కొమరుండు = కుమారుడు (అర్జునుడు), మ్రొక్కఁగాఁ = నమస్కరించగా, నిక్కుచెవి నీలని = నిక్కియున్న చెవులుగల గుర్రమును (ఉచ్చైశ్శ్రవమును), ఎక్కు = స్వారీచేయు, వజీరుఁడు = దొర (ఇంద్రుడు), అయ్యెడఁ = ఆ సమయమున, అక్కునఁ చేర్చి = గుండె కత్తుకొని, మే = శరీరమును, నిమిరి = దువ్వి, ఔదలఁ మూర్కొని = శిరస్సును వాసన చూచి, లో నెక్కొను వేడ్కఁ = హృదములో అతిశయించుచున్న సంతోషముతో, చొక్కుచుండెఁ = మైమరచియుండెఁ.

తండ్రీ కొడుకులు బహుకాలమునకు చూచుకొనినారు. కాబట్టి ఈ మక్కువ. ఇంద్రుడి ఏనుగు ఐరావతము, గుర్రము ఉచ్చైశ్శ్రవము అని ప్రసిద్ధి.

సుముహూర్తం బిదె లెండటంచు గురుఁ డచ్చోఁ దెల్పఁ దేవేంద్రుఁడుం
దమదేశంబుననుండి తెచ్చిన సువర్ణ క్షౌమ కోటీర ము
ఖ్య మణీభూషలతోడ బాసికము సింగారించి, మందార దా
మము కంఠంబునఁ జేర్చి పెండ్లి కొడుకుం బ్రాగ్దంతి నెక్కించినన్,

*అర్థము* :— ఇదె సుముహూర్తంబు = లగ్నసమయము వచ్చినది, లెండు అటంచు = కార్యక్రమము నడపండి అని, గురుఁడు = బృహస్పతి, అచ్చోఁ, తెల్పఁ = తెలియచేయగా, దేవేంద్రుడుఁ, తమదేశంబుననుండి తెచ్చిన, సువర్ణ = బంగారు, క్షౌమ = పట్టువస్త్రములు, కోటీర = కిరీటము, ముఖ్య = మొదలైన, మణీభూషలతోడ = రత్నాభరణములతోడ, బాసికమున్, సింగారించి, మందారదామము = పారిజాతపుష్పహారము, కంఠంబునన్ = మెడలో, చేర్చి = వేసి, పెండ్లికొడుకుఁ, ప్రాక్‌దంతిఁ = తన తూర్పుదిక్కుగజము (ఐరావతము) పై, ఎక్కించినన్ = ఎక్కించగా,

*విశేషము* :— జీలకఱ్ఱ బెల్లము నుదుటపెట్టి అలంకరించి బాసికము కట్టడానికి సుముహూర్తమంటారు.

101

అయ్యవసరంబున......

ఉపరిభాగ నిరంత రోన్నమితములైన
ముత్యాల గొడుగుల మొత్తమలర,
నుభయ పార్శ్వ ముహు ర్ముహుశ్చాలితము లైన
వింజామరల కలా పుంజ మమరఁ,

గల్యాణ వైభవ కర్ణేజపము లైన
తూర్యనాదముల చాతుర్య మొనరఁ,
బృథుల ప్రదక్షి ణార్చి ర్మేదురము లైన
దివ్వటీల సమిష్టి నివ్వటిల్ల,
నపుడు ప్రద్యుమ్నుఁడు జయంతుఁ డవల నివలఁ,
బసిడి బెత్తంబులను బరాబరులు సేయ,
నడచి వచ్చిరి హరిపురందరులు మ్రోలఁ
సంభ్రమంబున మందహాసంబు దొలఁక. 102

అర్థము :— ౧. ఉపరిభాగ = తలలమీదుగా, నిరంతర = సందులేకుండునట్లుగ, ఉన్నమితములైన = పైకిఎత్తబడిన, ముత్యాలగొడుగుల, మొత్తము = గుంపు. అలరన్ = ప్రకాశించునట్లుగాను —

౨. ఉభయపార్శ్వ = కుడిఎడమ ప్రక్కలయందు, ముహుః ముహుః = మరలమరల, చాలితములు = కదల్పబడిన (వీవబడిన), వింజామరల = తెల్లచామరములయొక్క, కలా పుంజము = కాంతిసమూహము, అమరన్ = ఒప్పునట్లును —

౩. కల్యాణవైభవ = వివాహమహోత్సవమునకు, కర్ణేజపములు = సూచకములు, అయిన, తూర్యనాదముల = బాకాలశబ్దముయొక్క, చాతుర్యము = నేర్పు, ఒనరన్ = ఒప్పునట్లును —

౪. పృథుల = విస్తారమైన, ప్రదక్షిణ = కుడిపైపు తిరుగుచుండే, అర్చి = జ్వాలల చేత, మేదురములైన = దట్టమైన, దివ్వటీల = కాగడాల, సమిష్టి = సమూహము, నివ్వటిల్లన్ = ప్రకాశింపగ (జ్వాలలు సవ్యముగ కుడివైపున విశేషముగ ప్రసరించుచున్నవి. ఇట్లు ప్రసరించుట శుభప్రద మంటారు.)

అపుడు, ప్రద్యుమ్నుడు (కృష్ణుని కొడుకు), జయంతుడు (ఇంద్రుని కొడుకు), అవలన్ ఇవలన్ = ఆవలఈవల, పసిడిబెత్తంబులను = బంగారు బెత్తములతో, బరాబరులుసేయన్ = జనులను తొలగించి త్రోవచేయుచుండగా, హరిపురందరులు = కృష్ణుడును, ఇంద్రుడును, మందహాసంబు = చిరునవ్వు, తొలఁకన్ = కనబడునట్లు, సంభ్రమంబునన్ = సంతోషముతో, మ్రోలన్ = ఎదుట అనగా ఉత్సవ అగ్రభాగమున, నడచివచ్చిరి,

విశేషము :— సందు లేకుండా గొడుగులు కలసిఉన్నట్టు ఉండుటచేత మొత్తము అనీ, వలయాకారముగ కదులుతున్న తెల్లని వింజామరలు చంద్రరేఖల సమూహమనీ, తూర్యనాదములు చెవినిల్లుకట్టుకొని వినవచ్చునని కర్ణేజపములనీ, శుభసూచకముగ ప్రదక్షిణార్చి అనీ ప్రయోగించడం చమత్కారము,

అనిమిష భావ మీసమయమందు ఫలించె నటంచుఁ, గోరికల్
వెనుకొనఁ బైనపైన పడి వే తటకాపడి, యుర్వశీ విలా
సిని మొదలైన యచ్చరలు చెంతలఁ జేరి, సహస్రదృక్ తనూ
జుని యొడలెల్లఁ గన్నులుగఁ జూచిరి మానసముల్ గరంగఁగన్.103

*అర్థము* :— ఉర్వశీ విలాసిని = విలాసవతియైన ఊర్వశి, మొదలైన, అచ్చరలు = అప్సరసలు, అనిమేషభావము = (తమకున్న) రెప్పపాటులేని గుణము (దేవతలు అనిమిషులు - రెప్పపాటులేనివారు గదా), ఈ సమయమందు, ఫలించెఁ = సార్థకమైనది (రెప్పపాటు కాలమైనా భంగము లేకుండా అర్జునుని బాగా చూడగలుగుటచేత), అటంచుఁ, కోరికల్, వెనుకొనఁ = వెనుకనుండి ముందరకు తరుముతుండగా, పైనపైనపడి = ఒకరిపైనొకరుపడి, వే తటకాపడి = చూచినంతనే తంగారుపడి, చెంతలచేరి = సమీపమునకు వచ్చి, సహస్ర దృక్తనూజుని = వేయికన్నులవాని (ఇంద్రుని) కొడుకును (అర్జునుని) మానసము కరంగగన్ = హృదయములు ద్రవించునట్లు, ఒడలెల్ల కన్నులుగ చూచిరి = శరీరమునంతను ఒకే కన్నుగ చేసుకొని, అనగా అతిశ్రద్ధగా, చూచిరి.

*విశేషము* :— ఇది జాతీయము. ఇట్లే ఒడలెల్ల నోరు, ఒడలెల్ల చెవులు. ఒడలెల్ల భక్తి అని వాడుకలో కలవు. ఈ అప్సరసలందరి కన్నులు అర్జునుని శరీరమంతటను లగ్నమయి అతని ఒడలంత కన్నులయ్యెనని చమత్కారము.

అపుడు సహస్రాక్షుని కొడుకైన అర్జునునికి కూడా వేయి కన్నులు కలిగెనని ధ్వని.

*పాఠాంతరము* :—

"వెనఁగొనబై పయింబడియు (బడుచు) వేతటకాపడి......"

*అలంకారము* :— స్వభావోక్తి, శ్లేష, పరికరాంకురము.

దేవకి యింటనుండి యి టుదీర్ణతఁ బెండిలి కూఁతు రున్న భో
జావనిజాని జా నిజగృహాంగణ సీమకునేఁగి, యెంతయుఁ
శీవిఘటిల్ల, సాత్యకి వడిం గయిలా గొసఁగం, గిరీటి యై
రావతముఁ దిగెఁ ద్విజపురంధ్రులు ముత్తెపుసేసఁ జల్లఁగఁ. 104

*అర్థము* :— ఇటు, ఉదీర్ణతఁ = మిక్కిలిశోభతో, పెండిలికూతురున్న, భోజ అవని జాని జా = భోజరాజుకు పుట్టినటువంటి కాంత రుక్మిణి, నిజ = స్వంత, గృహఅంగణసీమకు = ఇంటిముంగిటికి, ఏఁగి = వెళ్లి, సాత్యకి, వడిఁ = శీఘ్రముగ (ఆలస్యము లేకుండా), కయి

లాగు ఒసంగఁగా = చేయి ఊతఇవ్వగా, ద్విజపురంధ్రులు = బ్రాహ్మణ ముత్తైదువలు, ముత్తెపు సేస = ముత్యాల అక్షతలను, చల్లఁగా = చల్లుతుండగా, ఎంతయున్ శీవిఘటిల్లన్ = ఎంతో శీవితో, కిరీటి = అర్జునుడు, ఐరావతమును, దిగెను.

అలంకారము :— అనుప్రాసము.

నరవరోత్తముఁ డటు శుభోత్తరముగాఁగఁ,
గుడిపదము మున్నుగా నిడి, గడపదాఁటి
యారతులొసంగ, దీవన లావహిల్ల,
మోదమున నేఁగెఁ గల్యాణవేది కడకు. 105

అర్థము :— నరవరోత్తముడు = శ్రేష్ఠుడైనరాజు (అర్జునుడు): అటు = ఆ విధముగా శుభోత్తరముకాఁగ = శుభము కలుగునట్లుగా, కుడిపదము మున్నుగానిడి = కుడిపాదము ముందుగా వేసి, గడపదాఁటి, ఆరతులు ఒసంగఁగా, దీవనలు, అవహిల్లఁగా = ఎక్కువకాగా, మోదమునఁగా = సంతోషముతో, కల్యాణవేది కడకు = పెండ్లితిన్నె దగ్గరకు, ఏఁగెన్ = వెళ్లెను,

విశేషము :— నరవరోత్తముడు అనడములో నరుడు (అర్జునుడు) అనే వరోత్తముడు = శ్రేష్ఠుడయిన పెండ్లికొడుకు అన్న అర్థము కూడ కవి హృదమున నుండదా ?

కుడికాలుతో గడపదాటడం - శుభమని ఇప్పటికి నమ్ముతారు.

అలంకారము :— స్వభావోక్తి.

శ్రీరంజిల్లఁ బసిండి పెండ్లి చవికెం జేరంగ నవ్వేళఁ గ
న్యారత్నంబును దోడితెచ్చిరి జనానందంబుగాఁ బాడుచుఁ
బేరంట్రాం; డ్రురు మంత్ర వర్ణ పఠ నాప్తిఁ గర్గుఁడుఁ దేవతా
పౌరోహిత్య ధురంధరుండు శుభమొప్పఁగ మోల వేతేరఁగన్. 106

అర్థము :— శ్రీరంజిల్లన్ = శోభప్రకాశించునట్లు, పసిండిపెండ్లి చవికెఁ = బంగారుతో చేసిన పెండ్లి పందిరిని, చేరంగఁ = (అర్జునుడు) చేరిన తరువాత, అవ్వేళ = ఆ సమయమందు, ఉరు = ఉచితమైన-గొప్ప,మంత్రవర్ణపఠనాప్తిఁ = వేదమంత్రముల పఠనముతో కూడినవారై అనగా వేదమంత్రములను పఠించుతు, గర్గుఁడుఁ = (అడుపెండ్లివారి పురోహితుడు

అగు గర్గమహర్షి). దేవతా పౌరోహిత్య దురంధరుండున్ = దేవతల పౌరోహిత్యము అను భారమువహించువాడు అగు బృహస్పతియు, శుభమొప్పన్ = శుభముకల్గునట్లు, మ్రోలన్ = ఎదుట, ఏతేరగాన్ = వచ్చుచుండగా, పేరటాండ్రు = ముత్తైదువలు, జన ఆనందంబుగాన్ = (పెండ్లిచూడవచ్చిన) ప్రజలకు సంతోషము కలుగునట్లు, పాడుచున్ = పెండ్లి పాటలు పాడుకొనుచు, కన్యారత్నంబును = సుభద్రను, తోడితెచ్చిరి = తీసుకొనివచ్చిరి.

*విశేషము* :— కొందరు పేరంటాండ్రురు అని బహువచనము మీద బహువచనమును ఉంచి వ్యాఖ్యానించారు. ఈ బహువచనము మీద బహువచన ప్రయోగము చేమకూరకవికి అలవాటు లేని క్లిష్టప్రక్రియ. కాబట్టి 'ఉరుమంత్రవర్ణపఠనాప్తిన్' అనుట సమంజసము.

'మెత్తుము గదె మనమెపుడుఁ ది
లోత్తమ చక్కఁదన; మీ తలోదరి యెదుటన్
మెత్తపడె దాని చెలు;' వని,
యత్తఱి గుసగుసలఁ బోయి రచ్చర లెల్లన్ 107

*అర్థము* :— అచ్చరలు ఎల్లన్ = అప్సరసలందరును (తిలోత్తమ తప్ప), తమలో తాము, అత్తరిన్ = ఆ సమయమున, ''మనము, ఎపుడు, తిలోత్తమ చక్కదనము, మెత్తుము గదె = పొగుడుచుందుము గద; దాని చెలువు = దాని చక్కదనము, ఈ తలోదరి యెదుటన్ = ఈ సుభద్రముందు, మెత్తబడెన్ = తక్కువై పోయెను'' అని, గుసగుసలుపోయిరి = తమలో తాము రహస్యముగా గొణుగుకున్నారు.

ఈ అప్సరసలలో తిలోత్తమ కూడా ఉన్నది. అందువలననే తక్కిన అప్సరసలు ఆమెకు వినబడకుండా గుసగుసలు పోయిరి.

అప్సరసలలో పేరెన్నికగన్నది తిలోత్తమ. అంతకన్నను సుభద్ర అందగత్తెయని వర్ణన.

వేయుఁ గన్నులు వలయుఁబో వీరిఁ జూడ
నని కవుల్ దంపతులచెల్వు వినుతి చేయఁ;
గాదు, పదివేలకన్నులు గావలె నని
చూచు చుండె సహస్రవిలోచనుండు. 108

అర్థము :— వేయు కన్నులు = వేయికన్నులు, వలయుఁ బోవీరిఁ జూడఁ = వీరిని సంతృప్తికరముగ చూచుటకు (వేయికన్నులు) కావలయును, అని, దంపతుల = వధూవరుల, చెల్వు = సౌందర్యమును, కవులు, వినుతిచేయ = పొగడుచుండగా, కాదు, సహస్రవిలోచనుండు = వేయికన్నులుగల ఇంద్రుడు, కాదు, పదివేల కన్నులు కావలెను, అని, చూచుచుండెఁ.

రెండు కన్నులవాళ్లు వేయికన్నులు కావలెను అనుచుండగ, వేయికన్నులవాడు పదివేల కన్నులు కావలెను అని కోరుచున్నాడు. అనగా సుభద్ర సౌందర్యము అంత లోకోత్తరమైనదని భావము.

అలంకారము :— ఆక్షేపము.

కలరొకో యెవ్వరైన నవుఁ గాదని యడ్డము వల్కువారలీ
యిల ? మఱిఁ దా నెఱుంగనటు లెంతటి మాయలకాఁడు ! కన్యకా
తిలకము ధారవోయ వసుదేవునిఁ గట్టడసేసి, వేయి క
న్నులుగల వేలుపుం బలెఁ గనుంగొను చుండె మురారి చెంగటన్. 109

అర్థము :— ఈ ఇలఁ = ఈ లోకములో, అవుఁగాదు అని, అడ్డముపల్కువారలు = (కృష్ణుని) ఆక్షేపించువారు, ఎవ్వరైనకలరొకో = ఎవ్వరైనావున్నారా ? (తానేమి చేసినను కాదనువారు లేరని భావము), మఱి = అయినప్పటికి, తాఁఎఱుంగనటులు = తనకేమియు తెలియనట్లు, కన్యకాతిలకముఁ = కన్యారత్నమును, ధారవోయఁ = కన్యాదానము చేయుటకు, వసుదేవునిఁ, కట్టడచేసి = ఏర్పాటుచేసి, మురారి = కృష్ణుడు, వేయికన్నులుగల, వేలుపుఁ = దేవతను (ఇంద్రుని), బలెఁ = వలెనే, చెంగటఁ = సమీపమునందు, కనుగొనుచుండెన్ = చూచుచుండెను, ఎంతటిమాయలకాడు ! = చాలామాయకాడు !

కన్యాదానము కృష్ణుడు తానుచేసినను అడ్డగించువారలు లేరు. అయినా దానికి వసుదేవుని కట్టడచేసి తాను వేయి కన్నుల వేలుపువలె, అనగా అత్యంత ఆసక్తితో, సమీపమున ఉండి చూచుచుండెను, వేయికన్నుల వానివలె తానుకూడా ఒక చుట్టమువలె చూచుచుండెనని మరియొక భావము,

అలంకారము :— అర్థాంతరన్యాసము,

మధుకర వేణులు కొందఱు
మధు రోక్తులు వెలయఁ దెర యమర్చిరి సరగన్ ;
మధు మథన జనకుఁ డంతట
మధుపర్కం బొసఁగె నృపకుమా రాగ్రణికిన్. 110

*అర్థము* :— కొందఱు, మధుకరవేణులు = తుమ్మెదలవంటి జుట్టుగలవారు, మధుర ఉక్తులువెలయగా = తీయని మాటలతో, సరగగా = తొందరగా, తెర అమర్చిరి, మధుమథన జనకుడు = మధుడను రాక్షసుని చంపిన (మధుసూదనుడగు కృష్ణుని) తండ్రి వసుదేవుడు, అంతటగా, నృపకుమారాగ్రణికిగా = రాజకుమార శ్రేష్ఠునికి, మధుపర్కము = వివాహమునందు ఈయవలసిన మధుపర్కములను వస్త్రములను — తేనె, పెరుగు, నేయి, నీరు, పంచదార కలిసిన పదార్థమును, ఒసగెన్ = ఇచ్చెను, (వరుడు ఇంటికి వచ్చినప్పుడు మధుపర్కమిచ్చుట ఆచారము).

*అలంకారము* :— అనుప్రాసము.

దేవకి యొసంగఁగా వసుదేవుఁ డపుడు
చంద్రకాంతపు గిండి గొజ్జంగి నీటఁ
బైఁడి పళ్లెములోఁ బదాబ్జములు గడిగి
తనదు మేనల్లునకుఁ గన్య ధారవోసె. 111

*అర్థము* :— దేవకి ఒసంగగా = దేవకి అందివ్వగా. అపుడు, వసుదేవుడు, చంద్ర కాంతపుగిండి = చంద్రకాంత మణులతో చేయబడిన గిన్నెలోని, గొజ్జంగినీటగా = పన్నీటితో, పైడిపళ్లెములోన్ = బంగారుపళ్లెములో, పదఅబ్జములు = పద్మములవంటి కాళ్లను, కడిగి, తనదు మేనల్లునకుగా = అర్జునుడికి, కన్యన్‌ధారవోసె = కన్యాదానము చేసెను.

పన్నీరు లోహపాత్రలలో ఉంచిన వేడి ఎక్కును. అందువలన చంద్రకాంత శిలలతో (పాలరాలతో) చేసిన కాగులో ఉంచుట ఐశ్వర్యవంతులకు ఉచితమే.

సూరెలఁ జేరి యష్టమహిషుల్ దగువారుఁ బొసంగ, నావలం
గోరిక నిక్కినిక్కి కనుఁగొంచు సుపర్వులెసంగ, వాద్యముల్
బోరు కలంగ, సంగములు పొంగ, వధూవరులం గడాని బం
గారపు మెట్టుఁ బ్రాలపుటికల్ గదియించిరి కొందఱెదువల్. 112

అర్థము :— అష్టమహిషులు = (కృష్ణుని) ఎనమండుగురు భార్యలు, తగువారు = తగినవారును, సూరెలన్ = పార్శ్వములందు, చేరి = నిలచి, పొసంగన్ = ఒప్పునుండగా, అవలన్ = కొంచెము దూరముగ, సుపర్వులు = దేవతలు; కోరికన్ = అభిలాషతో, నిక్కి-నిక్కి-కనుగొంచు = ఎగిరిఎగిరి చూచుచు, ఎసంగ = ఉండగ, వాద్యములు = మృదంగాదులు, మ్రోరుకలంగన్ = ధ్వనించుచుండగాను, కొందఱు ఐదువల్ = పుణ్యస్త్రీలు కొందరు, అంగములు పొంగ = వారివారి శరీరములు సంతోషముతో పొంగునట్లు, కడాని బంగారపు = మేలిమి బంగారముతో చేయబడిన, మెట్టుబ్రాల = తలబ్రాలతోనున్న ఎత్తైన, పుటికల్ = బుట్టలను, వధూవరులన్, గదియించిరి = దగ్గరకుచేర్చిరి.

*విశేషము* :— తలబ్రాల పుటికల్ కొంచెము ఎత్తుగా ఉండడము, సులభముగా - ఎక్కువగా వంగ నక్కరలేకుండానే - దోసిళ్లతో ఎత్తి ఒకరిపై నొకరు పోసుకోవచ్చు.

వడిఁ దెఱవల్ దెర వంపం,
బడఁతుక నగుమొగము గానఁబడియెం, గాంతుల్
తడఁ బడఁగ, శర న్మేఘముఁ
బెడఁబాసి వెలుంగు చంద్రబింబము వోలెన్. 113

అర్థము :— వడిన్ = వేగముగ, తెఱవల్ = స్త్రీలు, తెరవంపన్ = వధూవరుల మధ్యకట్టిన తెరనువంచినపుడు, కాంతుల్ తడబడగ = కాంతులు విండియుండగ (అతిశయించగా) పడతుక = సుభద్రయొక్క, నవ్వుముఖము, శరన్మేఘమున్ = శరత్కాలమందలి తెల్లని మేఘమును, పెడబాసి = తొలగించుకొని, వెలుంగు = ప్రకాశించునట్టి, చంద్రబింబమువోలెన్ = చంద్రబింబమువలె, గానంబడియెన్.

*తాత్పర్యము* :— తెల్లని తెరను వంచినపుడు కనబడిన సుభద్ర ముఖము శరత్కాలమందలి తెల్లని మబ్బులనుండిబయటపడి ప్రకాశించునట్టి చంద్రబింబమువలె నున్నదని భావము. శరత్కాలము నందలి మేఘములు వర్షించునట్టి నల్లని మేఘయిలు గావు.

*పాఠాంతరము* :— "కాంతల్ తడబడగా" అప్పుడు స్త్రీలు భ్రమపడునట్లు అని అర్థము.

*అలంకారము* :— ఉపమ.

అమృత మొలుకు నధరంబునఁ,
గుముద చకోరముల నేలుకొను శుభదృష్టిఁ,
గమలముల కళలు గైకొను
రమణీమణి ముఖముఁ దెఱచిరా జనవలెనే? 114

అర్థము :— అమృతము ఒలుకు అధరంబునన్ = తేనెలూరునట్టి పెదవులవలనా, కుముద = కలువలను, చకోరములను, ఏలుకొను = పాలించునటువంటి (అనగా ఆదరించు నట్టి), శుభదృష్టిఁ = మంగళకరమైన చూపువలనా, కమలముల = తామరపూవులయొక్క, కళలు = కాంతులను, కైకొను = అపహరించు (తీసివేయు) నటువంటి, రమణీమణి ముఖముఁ = సుభద్రయొక్క ముఖమును, తెఱచి = విశదపరచి (నోరువిప్పి) రాజనవలెనే = చంద్రుడు అని అనవలెనా! (చెప్పకుండానే గ్రహించకొనదగును అని భావము-కారణము చంద్రునికిగల గుణములు - అమృతమొలుకుట, కుముదచకోరములను ఏలుట, కమలముల కళల అపహరించుట - మూడును ముఖమున కలవు.)

చదరంగమున రాజుకు అడ్డుగానున్న ఎదిరి కాయను తొలగించి ఎదుటి రాజుకు ప్రమాదముకలదని చెప్పడానికి 'తెరచి రాజు' అని అంటారు.

అలంకారము :— ఉపమానము.

పొలయలు కందు వేఁడుకొను పొందిక దెల్పెడులీల సిగ్గు దొ
ట్రిలిన ముఖాబ్జమెత్తి, మెడక్రిందికి హస్తయుగంబు సాఁచి, వే
నలి దెమలించి, సౌఖ్యకలనస్థితి గట్టిగఁ బట్టి కట్టె న
వ్వెలఁదుక కంఠసీమఁ గురువీరుఁడు మంగళసూత్ర మయ్యెడన్. 115

ఈ పద్యమునందు అర్జునుడు మంగళసూత్రము కట్టుట వర్ణితము.

అర్థము :— సిగ్గు తొట్రిలిన = సిగ్గు అతిశయించి ఉన్న, ముఖఅబ్జమును = (సుభద్ర యొక్క) పద్మమువంటి ముఖమును పొల అలుకందు = ప్రణయకోప సమయములలో, వేఁడు కొనుపొందిక = బతిమాలుకొనే నేర్పును- తెల్పెడిలీలన్ = తెలియచేయునటువంటి విధముగ (అనగా ఇకముందు మనకు కలిగిన ప్రణయ కలహములలో ఈ విధముగనే వేడుకొందును సుమా అని సూచించినట్లు), ఎత్తి = (ముఖమును) కొంచెముపైకి ఎత్తి, మెడక్రిందికి, హస్తయు గంబున్ = రెండు చేతులను, చాఁచి = పోనిచ్చి, వేనలి = జడను, తెమలించి = తప్పించి, సౌఖ్య కలన స్థితిన్ = సౌఖ్యముకలుగునట్టి పద్ధతిని, కురువీరుఁడు = కురువంశపు శూరుడైన అర్జునుడు, ఆ వెలఁదుక = ఆ కాంత, కంఠసీమన్ = కంఠప్రదేశమున, మంగళసూత్రము, అయ్యెడన్ = ఆ సమయమునందు, గట్టిగ పట్టి, కట్టెన్.

అలంకారము :— ఉత్ప్రేక్ష - స్వభావోక్తి.

తమతమవార లొండొరుల దండఁ గరంబుల ముత్తియంపుఁ బ
ళ్లెము లిడి "చేయి మించఁగ వలెం జుమి నీ" కని యెచ్చరింపఁగా,
నమితముగా సుభద్రపయి నర్జునుఁ డర్జునుపై సుభద్రయున్
దమిఁ దలఁబ్రాలు వోసి రెలనవ్వును సిగ్గును లోఁ దొలంకఁగన్. 116

అర్థము :— ఒండొరులదండ = సుభద్ర - అర్జునుల ప్రక్కను, తమతమవారలు = తమతమకు అనుకూలమయిన వరుసల వారు, అనగా మగపెండ్లివారు అర్జునుని ప్రక్కను— ఆడుపెండ్లివారు సుభద్ర ప్రక్కను అని, కరంబుల = తమచేతులతో. ముత్తియంపు పళ్లెములు = తలబ్రాలకొరకు ముత్తియములతో నింపిన పళ్లెరములను, ఇడి = పెట్టి, నీకు చేయి మించగవలెన్ సుమి = నీదే పై చేయి కావలెను సుమి, అని ఎచ్చరింపగాన్ = అని ప్రోత్సహించుచుండగా, సుభద్రపై అర్జునుడు, అర్జునుడిపై సుభద్రయు, ఎలనవ్వును = చిరునవ్వును, సిగ్గును, లోన్ తొలంకగన్ = లోలోపల ప్రకాశించుచుండగా (బాహాటముగా కాదని భావము), తమిన్ = కోరికతో, అమితముగా = ఎక్కువగా, తలబ్రాలు పోసిరి.

అలంకారము :— స్వభావోక్తి.

అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టి ప్రియ వ
ధూటియును దాను బంగారుపీఁట మీఁద
నుచితగతి వెలయంగఁ గూర్చుండి పాక
శాసని చెలంగె దీవించి సేస లిడఁగ. 117

అర్థము :— అగ్నిసాక్షిగ = అగ్ని ప్రమాణముగ, పెండ్లాడినట్టి, ప్రియవధూటియు = ప్రియకాంతయు, తానున్, బంగారుపీఁటమీఁద, ఉచితగతి వెలయంగన్ = తగినవిధముగ, కూర్చుండి, దీవించి (జనులు), సేసలిడఁగ = అక్షతలు వేయుచుండగా, పాకశాసని - పాకుడన్న రాక్షసుని శాసించిన - ఇంద్రునియొక్క కొడుకు అర్జునుడు, చెలంగెన్ = ప్రకాశించెను.

మృగమదము చెంతఁ గుంకుమరేఖ వోలె,
నీలమణి పొంత నుదిరి పొన్రేకు వోలె,
మేఘము కుఱంగటను దీఁగ మెఱపు వోలె,
నర్జునుని చెంగట సుభద్ర యలరె నపుడు. 118

అర్థము :— మృగమదము చెంతన్ = కస్తూరి ప్రక్కను, కుంకుమ(పూవు)రేఖవలె, నీలమణిపొంతన్ = ఇంద్రనీలమణి దగ్గర, ఉదిరిపొన్రేకు = మేలిమి బంగారురేకు, వోలె = వలె,

(ఉదిరి అనినా పొన్ను అనినా బంగారమే. కాబట్టి ఉదిరి పొన్ను అనగా మేలిమిబంగారము). మేఘము, కెలంగటను = సమీపమున. తీఁగమెఱపువోలె = మెరపుతీగవలె, అర్జునుని, చెంగటన్ = దాపున, సుభద్ర, అపుడు, అలరెన్ = ప్రకాశించెను.

*విశేషము* :— అర్జునుడు నల్లనివాడు కాబట్టి కస్తూరి: నీలమణి, మేఘములతో పోల్చుట. సుభద్ర మేలిమి పసిడి వన్నెకలది కాబట్టి కుంకుమరేఖ, ఉదిరిపొన్రేకు, మెరపు తీగలతో సరిపోల్చుట.

కస్తూరి - కుంకుమపూవు సుగంధ ద్రవ్యములు: నీలమణి - బంగారురేకు ఆభరణములు; మేఘము - మెఱపుతీగ మేఘసంబంధమైనవి. ఇటుల సజాతీయములైనవే అని సామ్యములోని ఔచిత్యము చూడదగును.

*అలంకారము* :— ఉపమ.

కలుగుఁ గళావిశేషము జగంబునఁ బెండ్లి యటన్న నెట్టివా
రల; కటువంటిపట్ల, నెలప్రాయము, రూప, మొయార మూని పే
ర్కలిగిన రాచకూఁతురఁట, రాకొమరుండఁట, యేమిచోద్యమో
సొలపు మిటారి సిగ్గరులు చూపఱ చూడ్కికి విందుసేయుటల్? 119

*అర్థము* :— జగంబునన్ = లోకములో, పెండ్లియటన్నన్, ఎట్టివారలకున్ = ఎటువంటి సాధారణరూపము కలవారికైనను, కళావిశేషము = క్రొత్తలావణ్యము (పెండ్లికళ), కలుగున్; అటువంటిపట్లన్ = అలాగైనప్పుడు, ఎలప్రాయము = లేతవయసు, రూపము = సౌందర్యము, ఒయారము = ఠీవి, ఊని = కలిగి, పేర్కలిగిన = పేరుపొందిన, రాచకూఁతురఁట, రాకొమరుండఁట, ఆ సొలపుమిటారి = శృంగారవిలాసముతో కూడిన, సిగ్గరులు = సిగ్గుకలవారు, చూపఱ(నిత్యబహువచనము) = చూచువారల- చూడ్కికి = కనులకు, విందు సేయుటల్ = పండుగచేయుట - ఆనందము కూర్చుట, ఏమిచోద్యమో;

*అలంకారము* :— కావ్యార్థాపత్తి.

అంతటఁ బౌలోమీ మఘ
వంతులకుం బెండ్లికొడుకు వందన మిడఁ, ద
త్ప్రాంతమునఁ బెండ్లి కూఁతురు
గొంతటు దలవంచి మ్రొక్కఁ గొంకుచు నున్నన్. 120

*అర్థము* :— అంతట, పౌలోమీ మఘవంతులకున్ = శచీదేవికిని ఇంద్రునకును (పులోమకూతురు పౌలోమి = శచి, మఘము = యజ్ఞములు కలవాడు కాబట్టి ఇంద్రుడు), పెండ్లి

కొడుకు, వందన మిడం = నమస్కరించగా, తత్ప్రాంతమునన్ = అతని ప్రక్కను, పెండ్లి కూఁతురు, అటు తలవంచి, మ్రొక్కన్ = మ్రొక్కుటకు, కొంత, కొంకుచునున్నన్ = సందేహించుచుండగా - (శచీదేవి, ఇంద్రుడు సుభద్రకు క్రొత్తవారు కాబట్టి ఈ సంకోచము.)

"ఎంచంగాఁ దగు నత్తమామలను దా నిల్వేల్పులంగా మనః
ప్రాంచ ద్భక్తిని సాధ్వి" యందుః రది మీ పట్లం నిజంబయ్యె నేఁ;
డంచుం జేరి శచీ పురందరుల కాహ్లాదంబుగా పల్కి, మ్రొ
క్కించెం దేవకి యప్పు డర్థ హిమరుక్ బింబాలికన్ బాలికన్. 121

అర్థము :— సాధ్వి = పతివ్రత, తాన్ = తాను, మనః = మనస్సునందు, ప్రాంచత్ ప్రకాశించుచున్న, భక్తిం = భక్తితో, అత్తమామలను, ఇల్‌వేల్పులంగాంగా = గృహదేవతలనియే, ఎంచంగాంతగును = భావించవలయును (అని) అందురు; అది = అమాట, మీ పట్లం = మీసందర్భములో, నేఁడు నిజంబయ్యెం అంచుం = ఇప్పుడు నిజమే అయినది (అత్తమామలైన మీరు నిజముగానే దేవతలు కాబట్టి) అనుచు, చేరి = సమీపించి, శచీపురందరులకు = శచీంద్రులకు; ఆహ్లాదంబుగాం = సంతోషము కలుగునట్లుగ, పలికి, దేవకి, అప్పుడు, హిమరుక్ = శీతలకాంతిగల చంద్రునియొక్క, అర్థబింబ = సగము బింబమువంటి, అలికం = నుదురుకల దానిని, బాలికం = సుభద్రను, మ్రొక్కించెన్ = అత్తమామలకు మ్రొక్కించెను.

విశేషము :— కూతురి సంకోచాన్ని గ్రహించి దేవకీదేవి ఆలోపము ఏమీ కనబడనీయకుండా, ఆ శచీపురందరులకు సంతోషము కలిగించే చక్కని మాట చెప్పుతూ సుభద్రచేత వారికి నమస్కరించినట్లు చేసెను. దేవకీదేవి సమయస్ఫూర్తిని చక్కగా ప్రకటించాడు కవి.

ఇక్కడ సుభద్రను బాలికగా అనగా ముద్దరాలుగా గ్రహించాలి.

అలంకారము :— యమకము, లోకోక్తి.

ప్రణయం బొప్పఁగఁ గృష్ణునిం గని, సుపర్వస్వామి 'యీ సర్వ ల
క్షణముల్ గల్గిన కన్య మంచివరునింగాఁ జూచి యీ నేర్పు నై
పుణి మీకే తగు;' నంచుఁ బల్కఁ, బరమాప్తుల్ 'మీరు రాఁగా విజృం
భణవృత్తిం నెఱవేతెఁ బెండ్లి,' యని యప్పద్మాక్షుఁడుం బల్కఁగన్.

అర్థము :— సుపర్వస్వామి = దేవతల ప్రభువు (ఇంద్రుడు), ప్రణయంబు ఒప్పఁగన్ = ప్రేమతో, కృష్ణునిన్‌కని = కృష్ణునిచూచి, "సర్వలక్షణములు = అన్ని శుభలక్షణములు,

కల్గిన, ఈ కన్యకా = ఈ సుభద్రను, మంచివరునింగాచూచి = యోగ్యుడైన వరుణ్ణి చూచి, ఈకానేర్పు = ఇయ్యగలిగిన, నైపుణి = నిపుణత. మీకేతగున్ = మీకేచెల్లును (ఇంకొకరికి కలుగదు అని భావము)" అంచున్ పల్కన్ = అని పొగడగా, అపద్మాక్షుడును = ఆకృష్ణుడును, "పరమ ఆప్తుల్ = (మా) మేలు మిక్కిలిగా కోరువారు. మీరు, రాన్‌గా = వచ్చుటచేతనేగదా, పెండ్లి విజృంభణవృత్తిన్ = మిక్కిలి వైభవముగ, నెఱపేతెన్, (మీరాకవల్లనే ఈ పెండ్లికి ఇంత శోభ కలిగెను అని)", అని పల్కగకా = అని ఎదురు ప్రశంసచేయగా —

*విశేషము* : — రాచవారలలోని మర్యాదలూ అన్యోన్య ప్రశంసలూ కవి నేర్పుతో వివరించాడు. ఈ విశేషాలన్నీ తంజావూరు నాయకరాజుల నగరులలో జరిగిన వివాహోత్సవాలలో తాను చూచే ఉంటాడు.

వియ్యంపు మర్యాద వెలయ తానును శచీ
జాని బువ్వాన భోజనముసేసెఁ,
గుమగుమ వాసించు కుంకుమ కస్తూరి
యమరవల్లభుని హస్తమున కిచ్చె,
గంబూర గుల్కిన తాంబూల మింద్రుఁ డం
దుకొని తాఁ సేనాని దోయిట నిడె,
పీతాంబరములు విప్పి యనేకములు వజ్రి
చేతి సంజ్ఞ జయంతు చేతికొసఁగె,
తేలఁ గే ల్వట్టి కొన్నివాకిళ్లు గడచి
రాఁగ, 'విచ్చేసి యుండుఁడు రావల' దని
బలిమి బలభేది యెదురుగ నిలిచి మ్రొక్క,
వేడుక మురారి గేల్మోడ్చి వీడుకొలిపె. 123

*అర్థము* :— ౧. వియ్యంపు మర్యాదవెలయ = వియ్యాలవారి మర్యాదలతో, తానును (కృష్ణుడును), శచీజాని = ఇంద్రుడు, బువ్వాన భోజనము = బువ్వపుబంతి పేరున స్త్రీలును, పురుషులును వేడుకగాచేయు పంక్తిభోజనము, చేసి;

౨. గుమగుమ వాసించు = ఎక్కువగా పరిమళించు, కుంకుమకస్తూరి, అమరవల్లభుని = దేవతలకు రాజగు ఇంద్రుని, హస్తమున కిచ్చి = చేతికిచ్చి;

౩. గంబూర గుల్కిన = పచ్చకర్పూరము ఎక్కువగా వేసిన, తాంబూలము, ఇంద్రుడు, అందుకొని, సేనానిదోయిట నిడి = దేవతాసేనకు అధిపతి కుమారస్వామి దోసిలియందు ఉంచి;

౪. పీతాంబరంబులు = పచ్చని పట్టువస్త్రములు, అనేకములు విప్పి, వజ్రి = వజ్రాయుధము కల ఇంద్రుని; చేతి సంజ్ఞ నుగ్రహించి, జయంతుని, చేతి కొసఁగి;

కేలు = చేయి, కేల్ పట్టి = చేతితోపట్టి (కృష్ణుడు ఇంద్రుని చేయిపట్టుకొని). కొన్ని వాకిండ్లు = కొన్ని హజారములు, గడచి రాగ = కడచిరాగా, 'విచ్చేసియుండుడు = దయచేసి యుండుడు, రావలదు' అని, బలభేది = బలుడను రాక్షసుని చంపిన ఇంద్రుడు, బలిమిఁ = బలాత్కారముగ, ఎదురుగ నిలిచి మ్రొక్కఁ, వేడుకఁ = సంతోషముతో (మురారి), కేల్ మోడ్చి = చేతులు మోడ్చి, వీడుకొలిపెఁ = సాగనంపెను-

*అలంకారము :— స్వభావోక్తి.*

అంతకు మునుపే హరి య
త్యంత కుతూహలముతోడఁ దగు మేరల న
య్యంతఃపురి భోజ సుతా
కాంతను బౌలోమి ననుపఁ గట్టడ సేసెన్. 124

*అర్థము :—* అంతకుమునుపే, ఆ అంతఃపురిన్ = ఆ అంతిపురములో, భోజసుతా కాంతను, రుక్మిణీదేవిని, అత్యంత కుతూహలముతోడఁ = మిక్కిలి ఉత్సాహముతో, తగు మేరలన్ = తగిన మర్యాదలతో, పౌలోమిఁ = శచీదేవిని, అనుపన్ = పంపించుటకు, (రుక్మిణి శచీదేవిని సాగనంపునట్లు) హరి = కృష్ణుడు, కట్టడచేసెన్ = ఏర్పాటుచేసెను.

రుక్మిణీదేవి తమయత్తమ్రోల శచికిఁ
బసిఁడి గిన్నియఁ గస్తూరి యొసఁగ, నామె
చేఁ దిగిచి దేవకీదేవి మీఁద జిలికి,
వదినెగారని యొక కొంత వావి నెఱపె. 125

*అర్థము :—* రుక్మిణీదేవి, తమ అత్తమ్రోలన్ = తమ అత్తయైన దేవకీదేవి యెదుట, శచికి, పసిఁడి గిన్నియఁ = బంగారుగిన్నెతో, కస్తూరియొసగఁ = కస్తూరి ఇవ్వగా, ఆమె = ఆ శచీదేవి, చేఁదిగిచి = చేతితో తీసుకొని, దేవకీదేవి మీద చిలికి, వదినెగారు, అని, కొంత, వావి = వరుసను, నెఱపె = తెలియచేసెను.

శచీదేవి తన కుమారునికి దేవకీదేవి బిడ్డను పెళ్ళి చేసుకొన్నందువల్ల ఈ వదినె చుట్టరికము ఏర్పడినది.

"వీయపురాల వైతి గదవే యిపుః డత్తవు తొంటివావి; నో
తోయజనేత్రుఁ గాంచిన వధూమణి, నీ సుతఁ బెండ్లియాడఁగా
నాయము నా కుమారునకు నర్మిలి హత్తఁగ; నత్తవావిచే
నాయువు గల్గువాఁ డపు నటంద్రుః శుభంబగు దీన నెంతయున్." 126

ఇంకా శచీదేవి ఈలాగంటుంది.

అర్థము :— ఓ, తోయజనేత్రుఁ = పద్మములవంటి కన్నులుకల కృష్ణుని, కాంచిన = కనిన, వధూమణి = స్త్రీరత్నమవు, తొంటివావిఁ = మొదటి సంబంధమున, అత్తవు (నాకు అత్తగానుంటివి), ఇపుడు = ఈ పెండ్లివలన, వీయపురాలవు - అయితివి గదా,

తొంటివావిని - శచీదేవి భర్తయైన ఇంద్రునికి కృష్ణుడు తమ్ముడు, కనుక కృష్ణుని తల్లి దేవకిదేవి తనకు అత్త యగును. ఇపుడు తన కుమారుడు దేవకి కుమార్తెను పెళ్లియాడుటచేత వదినె - వియ్యపురాలు అయినది,

అర్మిలి = ప్రేమ, హత్తగఁ = హత్తుకొనునట్లు, నీసుతఁ = నీకుమార్తెను, పెండ్లియాడఁగన్ = పెండ్లియాడుట, నా కుమారునకుఁ, నాయము = న్యాయమే - (ఆయము = లాభము అని గూడ చమత్కారము). అత్తవావిచేఁ = అత్తవరుస కలిగిన కన్యను పెండ్లియాడుటచేత, ఆయుపు కలుగువాడు అవును అటంద్రు = ఎక్కువ ఆయుర్దాయము కలవాడవునని అంటారు. సుభద్ర కృష్ణునకు చెల్లెలు. ఇంద్రుని కి కృష్ణుడు తమ్ముడు. అందువలన సుభద్ర ఇంద్రునకు కూడా చెల్లెలే, తండ్రికి చెల్లెలైన సుభద్ర అర్జునునకు అత్త అగును.) దీనఁ = ఈ చుట్టరికము వలన, ఎంతయుఁ, శుభము కలుగును.

అలంకారము :— లోకోక్తి.

అని సరసలీల నుడుగర లంది, యపుడు
పారిజాతంబు కతన మున్ బరిచయంబు
చాలఁ గల్గుటఁ బ్రియముతో సత్యభామ
తనకు మ్రొక్కిన, నింద్రాణి నెనరుతోడ. 127

అర్థము :— అని = ఈ ప్రకారము, సరసలీలఁ = సరసాలతో, ఉడుగరలు = కానుకలను, అంది = పుచ్చుకొని, అపుడు = ఆ సమయమున, మున్ = ఇంతకు పూర్వము (పారిజాతాపహరణకాలమున), పారిజాతంబుకతనఁ = పారిజాతవృక్షము కారణముగ, పరిచయంబు, చాలన్ కల్గుటఁ = ఎక్కువగా కలిగియుండుటచేత, సత్యభామ, ప్రియముతో, తనకు మ్రొక్కినఁ, ఇంద్రాణి = శచీదేవి, నెనరుతోడ = ప్రీతితోడ (క్రింది విధముగ పలికెను) —

ఇంతకు పూర్వము సత్యభామ కోరికపైన కృష్ణుడు అమరావతిపై దాడి వెడలి పారిజాత వృక్షమును పెకిలించుకొని వచ్చెను కదా.

'చెల్లెల, లెస్సలా ? పెరటి చెట్టుగ నాటిన పారిజాత ము
త్ఫుల్ల నవీన సూనములతో విలసిల్లుచు నున్నదా ? సదా
యుల్లము దానిమీఁదటనె యుండును నా, కది ప్రాపుఁ బ్రోపుఁ; బు
ట్టిల్లును జొచ్చినిల్లు నయి వృద్ధి యొసంగెడు నీకు నెంతయున్. 128

అర్థము :— "చెల్లెలా (సత్యభామ కృష్ణుని భార్య. కృష్ణుడు ఇంద్రుడు అన్నదమ్ములు కనుక ఇంద్రాణి, సత్యభామ తోడికోడళ్లు. అందువల్లనే చెల్లెలా అని సంబోధన) ; లెస్సలా = క్షేమముగానున్నారా. పెరటి చెట్టుగ నాటిన పారిజాత (వృక్ష) ము. ఉత్ఫుల్ల = బాగుగా వికసించిన. నవీనసూనములతోన్ = క్రొత్తపూవులతో. విలసిల్లుచున్ = అందముగా పెరుగుచు. ఉన్నదా ?. నాకు. సదా = ఎల్లప్పుడు. దానిమీదటనే = ఆ పారిజాతముమీదనే. ఉల్లము = మనస్సు. ఉండును (ఆ వృక్షమును గురించే అనుకొనుచుందును). అది నీకు. ప్రాపున్ = ఆశ్రయమును, ప్రోపున్ = = పోషణమును. పుట్టిల్లున్ = కన్నవారి ఇల్లును, చొచ్చిన ఇల్లున్ = అత్తవారి ఇల్లును. అయి, ఎంతయున్ = మిక్కిలిగా, వృద్ధియొసంగెడు = అభివృద్ధి కలిగించును.

పుట్టిన ఇల్లు, చొచ్చిన ఇల్లు అని అనుటవలన స్త్రీకి కావలసిన సకల సౌఖ్యములు ఇచ్చునని భావము.

"అని సరసలీల"..."చెల్లెల లెస్సలా" అన్న రెండు పద్యములు అనేక పూర్వ ముద్రిత గ్రంథములలో కానరావు. ఈ సందర్భములో సత్యభామను, పారిజాత కథను చొప్పించుటకు ప్రయత్నము జరిగినది.

*అలంకారము :—* అనుప్రాస.

అని యుచితోక్తుల వారల
మనముల రంజిల్లఁజేసి మన్ననతో న
య్యనిమిష లోకాధీశ్వరు
ననుఁగుం బట్టంపుదేవి యరిగిన యంతన్. 129

అర్థము :— అని, ఉచిత ఉక్తులన్ = తగిన మాటలతో, వారల, మనములన్, రంజిల్లచేసి = సంతోషించునట్లుచేసి, మన్ననతోన్ = గౌరవముగా, ఆ అనిమిషలోక =

ఆ దేవలోకమునకు, అధీశ్వరు(డైన) = ఇంద్రుని, అనుంగు = ప్రియమైన, పట్టపుదేవి = రాణి, (శచి) అరిగినయంతిఁ = వెళ్లిన పిదప —

*పాఠాంతరము :—*

" అని పలికి పోయి వచ్చెద మని యందరతోడ చెప్పి
యంపించుక యయ్యనిమిషలోకాధీశ్వరు......''

## సుభద్రార్జునుల ప్రయాణము

'ఏల యాలస్య మిఁక నిందుఁ? బ్రోలు సొచ్చి
నాగవలి సేయుదురు గాక! వేగ కదలి
పొందు దంపతు' లని ధను ష్కాండ రథ హ
యంబుల నొసంగి నరుఁ బయనంబు సేసి, 130

*అర్థము :—* దంపతులు = వధూవరులారా, ఇందు = ఈ ద్వారకానగరములో, ఇఁకన్ = ఇంకను, ఏల ఆలస్యము = జాగుచేయుట ఎందుకు (బలరామునకు తెలిసిన ప్రమాదము అని భావము), ప్రోలుసొచ్చి = (మీ ఇంద్రప్రస్థము) ప్రవేశించి, నాగవలి (ఇంకను మిగిలి యున్న వివాహ ప్రక్రియ) చేయుదురు గాక, వేగ కదలిపొందు = శీఘ్రముగ బయలుదేరుడు' అని, ధనుః = విల్లు, కాండ = బాణములు, రథ(ము), హయంబులు = గుఱ్ఱములు, ఒసంగి, నరుఁ = అర్జునుని, పయనంబుచేసి —

చంద్రకిపింఛ లాంఛనుఁడు చంద్రిక లీనెడు నవ్వుమోముతో
నింద్రజుఁ రాక ధర్మజున కేర్పడఁగా శుభలేఖ వ్రాసి, వే
చెంద్రిక పెట్టి, యందుపయిఁ జెంద్రిక వన్నియ సాలు సుట్టి, ని
స్తంద్రతఁ దానె ముద్రయిడి, చారులచేఁ బనిచెన్ రయంబునన్. 131

*అర్థము :—* చంద్రకి = నెమలియొక్క, పింఛ = పింఛము, లాంఛనుడు = చిహ్నముగా కలిగినవాడు కృష్ణుడు, చంద్రికలు ఈనెడు = వెన్నెలలు కురిపించు, నవ్వుమోముతో, ఇంద్రజు = అర్జునుని, రాక, (అర్జునుడు అక్కడికి వస్తున్నాడు అన్న వార్తను), ధర్మజునకుఁ = ధర్మరాజుకు, ఏర్పడగాఁ = వివరముగా, శుభలేఖఁ, వ్రాసి, వే = శీఘ్రముగ, చెంద్రిక పెట్టి = పసుపు కుంకుమలనుపెట్టి (ఇలాగు పెట్టుట శుభలేఖల విషయమున సాధారణము), అందుపయిఁ = ఆ లేఖమీదను, చెంద్రికవన్నియ సాలు = సిందూరపురంగు శాలువ[illegible]ట్టి = చుట్టి, నిస్తంద్రతఁ = అశ్రద్ధలేకుండ, తానె = స్వయముగా తానె, ముద్ర ఇడి = [illegible]

కుండా ముద్రవేసి, చారులచేఁ = వేగులవారిచేత, రయంబునఁ = శీఘ్రముగ, పనిచెఁ = పంపించెను.

అలంకారము :— యమకము.

ఈరీతి నన్ని యమరిచి
యా రాతిరె యేఁగి శౌరి యడఁకువ నుండెన్
సీరికడ; దేవకియుఁ దన
గారాపుఁ కుమారి నంపఁగా రమ్మనుడున్. 132

అర్థము :— ఈరీతిఁ = ఈ విధముగ, అన్ని అమరిచి = అన్ని ఏర్పాట్లుచేసి, శౌరి = కృష్ణుడు, ఆ రాతిరె = ఆనాటిరాత్రె (తెల్లవారకముందె), ఏగి = వెళ్ళి, సీరికడఁ = బలరాముని దగ్గర, అడఁకువతోఁ = వుండెఁ; దేవకియు, తన గారాపుకుమారిని = సుభద్రను, అంపగా = పొగనంపుటకు, రమ్మనుడుఁ = పిలువగా -

అత్తవారింట సకల భాగ్యంబులున్న,
మగని మీఁదటఁ దన కెంత మక్కువున్న,
నాఁడుఁ బుట్టువు పుట్టింటి కాసపడును,
గావున సుభద్ర యొక తీరుగాఁగ నుండె. 133

అర్థము :— అత్తవారి ఇంట, సకల భాగ్యంబు లున్నప్పటికీ, మగని మీదట, తనకు, ఎంతమక్కువ = ఎంతప్రేమ, వున్నఁ, ఆఁడుపుట్టువు = ఆడుబిడ్డ, పుట్టింటికి ఆసపడును = కన్నవారి ఇంటిమీద ఆశ కలిగి ఉంటుంది, కావున. సుభద్ర, ఒక తీరుగాగ నుండె = కొంచెము విచారముతో (ఒకలాగ) నుండెను.

పాఠాంతరము :—

"మగనిమీఁదటఁ దన కెంత మమత (మమకారము) యున్న" అని.

అలంకారము :— లోకోక్తి.

తల్లిదండ్రులు గారానఁ దన్నుఁ బెనుప,
వదినె లన్నలు గడు గారవంబు నెఱప,
నల్ల యూరంత బలగంబునందు నుండి,
యొకతె యెడఁబాసి పోవ నెట్లోర్చు మనసు! 134

అర్థము :— తల్లితండ్రులు, గారాన౯ = గారాబముతో, తన్నుపెనుపన్ = తనను పెంచుకొనుచుండగా, వదినెలు, అన్నలు, కడు = ఎక్కువ, గారావంబు = గౌరవము, నెఱప = చూపుచుండగా, అల్ల = ఆ, ఊరంత బలగంబునందునుండి = పెద్దబంధుసమూహము (యాదవ) నుండి, ఒకతె, యెడబాసిపోప౯ = విడిచిపెట్టిపోవుటకు, మనసు, ఎట్లు, ఓర్చు౯.

ఊరంత బలగంబు - చక్కని జాతీయము.

అట్టులఁ దొంగలి ఱెప్పలఁ
దొట్టెడు బాష్పముల నడఁపఁ దొట్రిలు ముద్దుం
బట్టిఁ గని, కడుపు చుమ్మలు
చుట్టఁగ, నది మట్టుపఱిచి, శుభమొనరంగన్. 135

అర్థము :— అట్టుల౯ = ఆ విధముగ, తొంగలిరెప్పలన్ = వాలు కనురెప్పలయందు, తొట్టెడు = క్రమ్ముచున్న, బాష్పముల అడఁప౯ = కన్నీరును అణచుకొనుటకు, తొట్రిలు = తత్తఱపడుచున్న, ముద్దుంబట్టి౯ = ముద్దుకూతురు సుభద్రను, కని = చూచి, (ఆమె మనోగతి అంతయు గ్రహించుకొన్నదై దేవకి) కడుపు చుమ్మలు చుట్టఁగన్ = కడుపు తరుక్కుపోతూ ఉండగా (ఎక్కువగు దుఃఖము కలుగగా), అది = ఆ దుఃఖమును, మట్టుపరచి = కప్పిపుచ్చి, శుభము ఒనరంగ౯ = శుభము కలుగునట్లుగ - (క్రింది పద్యముతో అన్వయము)

భర్త ఇంటికిపోవు శుభసమయమున కన్నీరు అశుభసూచక మగునని సుభద్రయు దేవకియు కన్నీరును అణచుకొని తమ సరళ స్వభావమును చూపించిరి.

పాఠాంతరము :—

"తొట్టెడు బాష్పముల తోఁప దొట్రిలు......"

కడుపుచుమ్మలు చుట్టుట - జాతీయము.

"వింతఁటే యేమి ? మేనత్త గొంతిదేవి ?
కోరి వెండియుఁ బెండ్లాడినారు మీర
లొండొరుల; నీ విభుండు లోకోత్తరుండు;
దొరకెను సుభద్ర, మంచి కాఁపురము నీకు. 136

అర్థము :— వింత అటే యేమి = నీకేమి కొత్తయా, మేనత్త గొంతిదేవి = కుంతీదేవి మేనత్త, వెండియు = అంతేకాకుండా, మీరలు, ఒండొరుల = ఒకరినొకరు. కోరి = కావాలని, పెండ్లాడినారు, నీవిభుండు = నీభర్త, లోకఉత్తరుండు = చాలాగొప్పవాడు; నీకు మంచి కాపురము దొరికెను సుభద్ర -

"ఈలోనఁ జూడవచ్చెద, మేలే
చింతిల్లె ?" దనుచు నెంతయుఁ బ్రేమం
గేలం గ్రొమ్ముడి దువ్వుచు,
బాలం దీవించి తల్లి పనుపన్ వేగన్. 137

అర్థము :— "ఈలోన = త్వరగానె, చూడవచ్చెదము = (మేము నిన్ను), చూచుటకు అక్కడికి రాగలము, ఏలే = ఎందుకే, చింతిల్లెదు = విచారించెదవు." అనుచు, ఎంతయు ప్రేమతో = మిక్కిలి ప్రేమతో, కేలన్ = చేతితో, క్రొమ్ముడి = జుట్టుముడి (తల), దువ్వుచు = నిమురుచు, బాలన్ = సుభద్రను, దీవించి, తల్లి పనుపన్ వేగన్ = తల్లి పంపగా, వేగముగా —

క్రొమ్ముడి నిమురుట సుభద్ర విచారమును అనుసయించుటకూ, ప్రేమను తెల్పుటకూ సూచన.

సకియల్ గొందఱు వెంటవచ్చి మణిభూషల్ చక్కఁగాఁ దీర్చి చెం
ద్రిక పూవన్నియ జిల్గుఁజేల కటి నెంతే గట్టిగాఁ జుట్టి, పెం
డ్లి కుమారుండు కరాగ్ర మూఁత యొసఁగన్ వ్రీడావతిం దేరి మీఁ
దికి నెక్కించిరి మందహాస కలనా దేదీప్య మానాస్యలై. 138

అర్థము :— కొందరు, సకియల్ = చెలికత్తెలు, మణిభూషల్ = రత్నాలంకారములను, చక్కగా తీర్చి = బాగుగా అలంకరించి, చంద్రికపూవన్నియ = కుసుంబాపువ్వు (ఎర్రని) వన్నెకలిగిన, జిల్గుచేల = సన్నని చీరను; కటిన్ = నడుమునకు, ఎంతేన్ గట్టిగా = మిక్కిలి గట్టిగా, చుట్టి, పెండ్లికుమారుడు = అర్జునుడు, కరఅగ్రము = చేతికొనను అనగా చేతిని, ఊఁత యొసఁగన్ = పట్టు ఇవ్వగా, వ్రీడావతిన్ = సిగ్గుపడుతూ ఉన్న సుభద్రను, మందహాస = చిరునవ్వు, కలనా = కూడియుండుటచేత, దేదీప్యమాన = విశేషముగా ప్రకాశించుచున్న, ఆస్యలై = ముఖములుకలవారలై, వెంటవచ్చి, తేరిమీఁదికి = రథముమీఁదికి, ఎక్కించిరి.

భర్త వెంట వెళ్లుచున్న సమయమున సుభద్ర సిగ్గుపడుచుండుట, చెలికత్తెలు మందహాస వదను లగుట సహజము —

అటులఁ దేరెక్కి దంపతు లరుగఁ జూచి,
జనులు రతిమన్మథులు వీర లని తలఁచిరి;
హరి తురంగము లించువి ల్లలరు తూపు,
లంద యుండఁగ నందియ మందనేల ? 139

*అర్థము* :— అటులన్ = ఆ విధముగ, తేరుఎక్కి, దంపతులు, అరుగన్ = పోవుట చూచి, జనులు, రతిమన్మథులు, వీరు: అని తలంచిరి = అనుకొనిరి: హరి తురంగములు = మన్మథుని చిలుక గుఱ్ఱములు (కృష్ణుని గుఱ్ఱములు పచ్చని వని కూడ), ఇంచువిల్లు = మన్మథుని చెరకువిల్లు (అందమైన విల్లు అని గూడ), అలరుతూపులు = మరుని పూవుల బాణములు (సొగసైన బాణములు అని గూడ), అందయుండఁగ = ఆ రథమునందు ఉండగ, సందియమంగనేల = (వారురతీమన్మథులు అని అనుకొనుటకు) సందేహము ఎందుకు.

*విశేషము* :— పచ్చని గుర్రాలు, చక్కని విల్లూ, అందమైన బాణాలూ రథములో ఉన్నాయి. శ్లేషవల్ల చిలుక గుర్రాలు, చెరకు విల్లూ, పూవుతూపులూ కనబడ్డాయి. కాబట్టి సందేహము అక్కరలేదని భావము.

*అలంకారము* :— శ్లేష, కావ్యలింగ.

## యాదవ బలములు అర్జును నడ్డగించుట

పచ్చని పచ్చడంబు దొర పంపిన త్రోవనె పోవునంతలో
నచ్చటఁ దెల్లవాఱ, 'నితఁ డర్జునుఁ, డీమె సుభద్ర, వీరిఁ బో
నిచ్చిన, మాటవచ్చు బలకృష్ణులచేత;' నటంచుఁ దారు తా
రెచ్చరికై పృథుశ్రవసుఁ డేలికగాఁగల ప్రోలి కాపరుల్. 140

*అర్థము* :— పచ్చని పచ్చడంబు దొర = పచ్చని పీతాంబరమును ధరించునట్టి ప్రభువు కృష్ణుడు, పంపినత్రోవనె = ఆజ్ఞాపించిన త్రోవనె, పోవునంతలోన్, అచ్చట తెల్లవాఱన్ = సూర్యోదయముకాగా, 'ఇతడు అర్జునుడు, ఈమె సుభద్ర, వీరిన్ పోనిచ్చినన్ = వదలిపెట్టిన, బలకృష్ణులచేత = బలరామునివల్లను, కృష్ణునివల్లను, మాటవచ్చున్ = నిందవచ్చును' అటంచు, పృథుశ్రవసుడు, ఏలికగా = నాయకుడుగా, కల, ప్రోలికాపరులు = పట్టణపు కావలివారు, తారు తారు హెచ్చరికై = ఒకరినొకరు ఎచ్చరించుకొనుచు – తరువాతి కన్దయము.

*విశేషము* :— ఈ నాటకమంతా కృష్ణుడి దన్న సత్యము తెలియదు కాబట్టి ఈ పట్టణ కావలివారు కృష్ణుడిచేత నింద పడతామని హెచ్చరించుకున్నారు.

అల బలము లసంఖ్యములై
అలబలములు సేయుచుండ, నప్పుడు గలఁకన్
కలకంఠిమణి రిపు మద
కల కంఠీరవుని ధవునిఁ గని వికసితయై. 141

అర్థము :—అసంఖ్యములై = లెక్కకు మించినవై, అల బలములు = ఆ ప్రోలికాపరుల సైన్యములు, అలబలములు సేయుచుండ = కోలాహలము చేయుచుండ, అప్పుడు, కలఁకన్ = కలతచెందిన మనస్సుతో, కలకంఠీమణి = నారీరత్నము సుభద్ర, రిపు = శత్రువులు అనెడి, మదకల = మదించిన ఏనుగులకు, కంఠీరవుని = సింహముపంటివాడైన, ధవునిన్ = భర్తను, కని = చూచి, వికసితయై = వికాసము చెందిన దయి (క్రిందివిధముగ చెప్పెను.)

విశేషము :— శత్రువుల కోలాహలము చూచి మొదట కలతచెందింది. భర్తను చూచిన తరువాత ధైర్యము తెచ్చుకొని వికసిత అయినది అని భావము.

పాఠాంతరము :—

"......ధవునిఁ గని విస్మితయై"

అలంకారము :— యమకము, రూపకము,

"హుటాహుటిన్ హలాయుధుం డహో మహోగ్రుఁడై తనం
తటన్ దటాన నిప్పు డీవిధం బెఱింగి వచ్చెనో ?
ఘటాఘటీల నెల్లఁ ద్రోవఁ గట్టి పట్టఁ బంచెనో ?
యటో యిటో యెటో భ టోద్భ టార్భటుల్ ఘటిల్లెడున్. 142

కోలాహలము చూచి సుభద్ర తన అభిప్రాయమును భర్తతో చెప్పుతుంది.

అర్థము :— హలాయుధుండు = బలరాముడు, అహో = ఓహో, తటానన్ = తటాలున, ఇప్పుడు, ఈ విధంబు ఎఱిఁగి = మన వివాహము సంగతి తెలిసికొని, మహోగ్రుఁడై = మిక్కిలి కోపముగలవాడై, హుటాహుటిన్ = అతివేగముగ, తనంతటన్ = తానే స్వయముగ, వచ్చెనో; (లేక) ఘటాఘటీలను ఎల్ల = మంచి సమర్థులైన శూరులను, త్రోవన్ కట్టి = దారిని అడ్డగించి, పట్టన్ = మనలను పట్టుకొనుటకు, పంచెనో = పంపించెనో; అటో ఇటో ఎటో = మొదటి కారణముచేతనో_రెండవ కారణము చేతనో - ఈ రెండునూ కాక మరే కారణముచేతనో కాని, భట ఉద్భట = భటులయొక్క అధికమైన, ఆర్భటుల్ = (అట్టహాసములు) సింహనాదములు, ఘటిల్లెడున్ = చెలగుచున్నవి.

పాఠాంతరము :—

"ఘటాఘటీల నేవఁ ద్రోవఁ గట్టి పట్టఁ" అని.

ఏవన్ = (అసహ్యము) కోపముతో.

భటుల ఆర్భటులను విని బలరాముడే ఉగ్రుడై స్వయంగా వచ్చెనో లేక సమర్థులైన వీరులను తమను అడ్డగించుటకు పంపెనో ఈ రెండూ కాక ఇంకా ఏదైనా జరిగెనో అని సుభద్ర

అనుకొనుచున్నది. బలరాముడిపైనే ముఖ్యముగా సుభద్రకు అనుమానము కలుగుటకు కారణము. మొదటినుండియు బలరాముడు ఈ పెళ్లికి వ్యతిరేకుడను భయము, ఆందోళన మిక్కుటముగా నుండుటే.

*అలంకారము* :— అనుప్రాసము.

తేరు గడపఁగ మాయన్న దిద్దె నన్నుఁ;
నేయ నేరిపె వింట నొక్కింత నాకు
నా వదినె సత్యభామ; మున్నరక యైన,
నిలిచి మున్నరకాసురు గెలిచెఁ గాదె? 143

*అర్థము* :— తేరు = రథమును, గడపగన్ = నడుపుటను, మాఅన్న = కృష్ణుడు. నన్నుఁ, దిద్దెఁ = నాకు నేర్పెను, నా వదినె సత్యభామ, వింటన్ = వింటితో, ఏయఁ = బాణములు వేయుటను, నాకు, ఒకింత నేరిపె, మున్ను అరక యైనఁ = (కృష్ణుడికి), కష్టస్థితి కలిగినప్పుడు, నిలిచి = జంకకుండా, నిలబడి, మున్ = పూర్వము, నరకాసురుఁ = గెలచెఁ కాదె.

*విశేషము* :— కొందరు వ్యాఖ్యాతలు మున్నరక అంటేతొలిదుక్కి-మొదటిది అన్నారు. ఈ తొలిదుక్కి సాధారణముగ బలము కలదీ, వెంబడి వస్తున్న రెండు మూడు అరకలను చక్కగా తీసుకపోగలదీ అయి, మంచి నేర్పు కలిగి ఉంటుంది అన్నారు. ఇక్కడ ఈ నాయకత్వానికి అవసరం కనబడదు. అంతేకాక, 'నిలిచి' అన్నమాటకు అర్థగౌరవము కానరాదు.

మున్నరక = కష్టస్థితి అని సూర్యరాయ నిఘంటువు వారు మన యీ పద్యాన్నే ప్రమాణంగా చూపించారు, మున్నరక కా అర్థం ఎలాగు వచ్చిందో వారు చెప్పలేదు.

ఎడ్లబండిమీదగాని, జట్కా మీదగాని ప్రయాణము చేస్తున్నప్పుడు బండివాడు బరువు తూగు చూచుకుంటుంటాడు. ముందు బరువు, వెనుక బరువు సమంగా ఉండాలి, ఏది ఎక్కువయినా కష్టమే.

ముందుబరువుకు 'అరక' అనీ, వెనుక బరువుకు 'లేవ' అనీ అంటారు. ఇప్పటికీ ఇది కొన్ని ప్రాంతాలలో వాడుకలో ఉంది. ఆ అరకే మున్నరక - కష్టస్థితి.

*పాఠాంతరము* :—

"......మున్నరక మగుచు
......మున్నరక మైన..."

*అలంకారము* :— యమకము, దృష్టాంతము.

అని రాజకన్య గావున
మనమునఁ గల ధీరతయును మమతయుఁ దెలుపన్,
విని యట దరహాసంబున
నునుఁ జెక్కిలి చికిలిగోట నొక్కుచు వేడ్కన్. 144

అర్థము :— అని, రాజకన్య కావునన్ = రాచకులమున పుట్టిన బిడ్డ కావున, మనమున కల, ధీరతయు = ధైర్యమును, మమతయున్ = ప్రేమయు, తెలుపన్ = తెలియచేయగా, విని, అట = అపుడు, దరహాసంబునన్ = చిరునవ్వుతో, నునుచెక్కిలి = నునుపైన ఆమె చెక్కిలిని, చికిలిగోటన్ = సున్నితమైన గోరుతో, వేడ్కన్ = వేడుకతో, నొక్కుచు - (అర్జునుడు - సుభద్ర చెక్కిలి వేడుకతో నొక్కుతూ క్రింది విధముగా అన్నాడు -)

"న న్నెవ్వనిఁగాఁ జూచితి
కన్నియ ? నీ చేయునంత కార్యం బిట నే
మున్నది ? చూడుము చెండెద
ఛిన్నాభిన్నములు గాఁగ సేనల - నైనన్, 145

అర్థము :— కన్నియ = ఓ సుభద్రా, నన్ను ఎవ్వనిగా జూచితి = నేను ఎవరిని అనుకొంటున్నావు (నేనంత సామర్థ్యములేని వాడిని అని అనుకొంటున్నావా అని భావము.). నీ చేయునంత = నీవు చేయవలసినంత, కార్యంబు = పని, ఇటన్ ఏమున్నది ? చూడుము = చూస్తూ ఉండు, సేనలన్ = శత్రుసైన్యముల, చిన్నాభిన్నములుకాగ = ముక్కలుముక్కలుగా పడిపోవునట్లు, చెండెదన్ = నరికివేయుదును - ఐనన్ = ఐనప్పటికిని - అభిప్రాయము మార్చుకొని......

నువ్వు చూస్తూ వుండు నేనే సైన్యమును నరికి పారవేయగలను అని సుభద్రతో అర్జునుడు చెప్పి, తిరిగి ఆమె కోరికను ఎందుకు తిరస్కరించవలెనన్న అభిప్రాయముతో ఐనప్పటికిని అని (క్రింది పద్యములో)

పాఠాంతరము :— "......సేనల నెల్లన్" అభిప్రాయమును అర్జునుడు మార్చుకున్నాడు గనుక ఈ పాఠము సమంజసము కాదు.

"నీ వేడు కేల గాదనఁగా వలె ?
నటు వలెనె తేరు గడపు" మటంచున్
జే విలునమ్ములుఁ గై గొనె నా
విజయుఁడు సమర సన్నహన దోహలుఁడై. 146

అర్థము :— "నీ వేడుక = నీకోరిక, ఏల కాదనగాఁ వలెఁ = ఎందుకు కాదనవలెను? అటువలెనె = నీ కోరిక ప్రకారమె, తేరుగడపుము = రథము నడుపు", అటంచుఁ = అని చెప్పుతు, విజయుఁడు = అర్జునుడు, సమర, సన్నహన = యుద్ధసన్నాహమునందు, దోహలుఁడై = ఉత్సాహముకలవాడై చేఁ = చేతియందు. విలును అమ్ములను, కైకొనెన్ = తీసుకొనెను.

ఇందు అర్జునుడిని 'విజయు' డుగ పేర్కొనడము భావి విజయమును సూచించుటకే -

అంతటిలోఁ బృథుశ్రవసుఁ డాదిగఁ గల్గిన వీరయోధు ల
త్యంత కఠోర తోమర శరాసన బాణ కృపాణ పాణులై
పంతము లాడుచుం బదరి పైఁబడఁ జూచు బలంబు లెల్లఁ దా
మంతట సంతట న్నిలిపి, యడ్డముగం జని యాధనంజయున్. 147

అర్థము :— అంతటిలోన్ = అంతలో, పృథుశ్రవసుడు, ఆదిగ = మొదలుగ, కల్గిన వీరయోధులు, అత్యంత కఠోర = మిక్కిలి కఠినములైన, తోమర = బల్లెములు, శరాసన = విండ్లు, బాణ = బాణములు, కృపాణ = కత్తులు, పాణులై = చేతులయందు పట్టుకొని, పంతములాడుచు = (బలంబులు) ప్రజ్ఞలు పలుకుకొనుచు, బదరి = తొందరపాటుతో, పైబడ జూచు = అర్జునుని పై బడుటకు సిద్ధమవుతున్న, బలంబులెల్లఁ = సేనల నన్నిటిని, తాము, అంతట సంతటఁ నిలిపి = అక్కడక్కడ ఆపి (యుద్ధము చేయుటకు అనుకూలమైన స్థానముల నిల్చి). అడ్డముగఁ చని = అడ్డమువెళ్లి (వీరయోధులు అర్జునుని దారికి అడ్డమువోయి), ఆ ధనంజయున్ = ఆ అర్జునునితో - (సామోపాయముగ ఇట్లన్నారు.)

"స్యందనముఁ దురంగములు శౌరివెపో, బలరాము చెల్లె లీ
యిందునిభాస్య; యీమె నెట నెత్తుకపోయెదు రాకుమార ? యే
మందురు యాదవుల్ వినిన ? హా ! యిటువంటివె రాచవారితోఁ
బొందులు? గానకుండఁ గొనిపోఁ దగవా మిమువంటి వారికిన్ ?"148

అర్థము :— స్యందనముఁ = రథమును, తురంగములు, శౌరివెపో = కృష్ణునివేగదా, ఈఇందునిభాస్య = చంద్రునితో సమానమైన ముఖము కలది - ఈ సుభద్ర, బలరాము చెల్లెలు (కదా), రాకుమారా, ఈమెను, ఎటకు, ఎత్తుకపోయెదు = తీసుకొనిపోవుచున్నావు (దొంగిలించుకొని పోవుచున్నావు అని భావము), వినిన, యాదవులు, ఏమందురు ? హా ! రాచవారితోఁ = రాజులతో, పొందులు = స్నేహము, ఇటువంటివె = ఇలాగునే ఉండునా ?, మిమువంటివారికిన్ = మీవంటి ప్రసిద్ధులకు, కానకుండఁ = ఇతరులు చూడకుండా (దొంగతనముగా), కొనిపోఁ = తీసుకొనిపోవుట, తగవా = న్యాయమా ?

అనుటయు, 'నేమి కనినం
గనకుండిన ? నానఁ బూనఁ గలరా మీరల్ ?
మన వలచిన, నీమాటలఁ
బనిలేదు, చనుం;' డటంచుఁ బైఁబడి రాఁగన్, 149

అర్థము :— అనుటయు, (అర్జునుడు తిరస్కారభావముతో) 'కనినం కనకుండినన్ ఏమి = చూచిననేమి చూడకున్ననేమి?, మీరల్ = మీరు, ఆనన్ = అడ్డగించుటకుకాని, పూనన్ = పూనుకొనుటకు గాని, కలరా = అపుటకు కాని పూనుటకు గాని సమర్థులా ?, మనన్ వలచినన్ = బ్రతుకుటకు కోరిన యెడల, ఈ మాటల పనిలేదు = ఈ మాటల ఆవశ్యకములేదు. చనుండు = పొండు', అటంచు, పైఁబడి = (వారి) మీదికి, రాఁగాన్ (పా: అం ; 'మనవలిసిన).

శ్రీవేంకట్రాయశాస్త్రిగారు 'నేమీకనినం గనకుండిన......' అన్న భాగము ఇలా వ్యాఖ్యానించారు. నేన్ = నేను, మీకున్ = మీమీదికి, అనిన్ = పోరిలో, అంగనకున్ = సుభద్రకై, ఉండినన్ = ఉండగా, ఆమీరలు, నానబూనగలరు = అపజయమువలని సిగ్గును చెందెదరు' అని అర్థాంతరమును చూపించారు. అనగా 'నేను' మీమీదికి యుద్ధమునందు సుభద్రకై ఉండగా ఆ మీరలు అపజయమువలని సిగ్గును చెందెదరు' అని తాత్పర్యము. ఇది సుబోధము కాదు. కావున కవి హృదయము కాదనవలెను.

## యుద్ధము

రాకు రాకు మనెడి రట్టడి తనములు,
పోకు పోకు మనెడి పొగరు వగలు,
పొడువు పొడువు మనెడి బెడిదంపు బీరముల్,
విడువు విడువు మనెడి వీఁక లెసఁగ. 150

అర్థము :— అర్జునుడు పైబడిరాగా, రాకురాకుము, అనెడి, రట్టడితనములు = గడుసుతనములు, పోకుపోకుము, అనెడి, పొగరు వగలు = గర్వపుచేతలు, పొడువుపొడువుము, అనెడి, బెడిదంపు = తీవ్రమైన, బీరముల్ = ప్రగల్భములు, విడువువిడుము, అనెడి, వీఁకలు = అడంబరములు, ఎసఁగన్ = అతిశయించగా —

ముందర వెన్క నీకరణి ముంచుకొనన్, జలియింప, కిం పెల
ర్పం దరళాక్షి దేరు గడపం, గడకంటనె పాఱజూచి, విం
టం దొడి యేయుటల్ బయ లొనర్పక, యెంతటి నేరు పౌర ! పౌ
రందరి యందఱిన్ శరపరంపర వెంపరలాడె నయ్యెడన్. 151

*అర్థము* :— ఈ కరణిఁ = ఈ విధముగ, ముందువెన్క = ముందరిభాగమున వెనుక భాగమున, ముంచుకొనఁ = (శత్రుసేన) చుట్టుముట్టి నప్పటికీ, చలియింపక = అధైర్యపడకుండ, ఇంపు ఎలర్పఁ = ఉత్సాహము (అర్జునునకు) అతిశయించునట్లుగ, తరళాక్షి = చలించుచున్న కన్నులుగల సుభద్ర (నలుదిక్కుల చూచుచున్నదని ఊహ), తేరుగడపఁ = రథమును నడుపుచుండగా, పౌరందరి = పురందరుని (ఇంద్రుని) కుమారుడు అర్జునుడు, కడకంటనె = క్రేగంటితోనె, పాఱజూచి = (సుభద్రను) బాగుగాచూచి, వింటఁ = వింటియందు, (బాణములు) తొడి = సంధించి, ఏయుట, ప్రయోగించుట, బయలొనర్పక = బయటికి తెలియనీయకుండా (అనగా అంత వేగముగ), అందరినిఁ = శత్రువుల నందరిని, శరపరంపరఁ = బాణముల సమూహముతో, అయ్యెడఁ, వెంపరలాడెఁ = హింసించెను, ఔరా ఎంతటి నేరుపు !

*పాఠాంతరము* :— "... జలియింప, కింపొనర్పం...."

*అలంకారము* :— అనుప్రాసము, పరికరము.

కొండలవలెనున్న కొమ్ముఁ గత్తుల భద్ర
 దంతావళముల మొత్తములు బలసి,
యంబుధి తెరల చందంబునఁ దుటుములై
 భాసిల్లు కంఖాణ బలము లొదవి,
విరివియై మేఘముల్ పెరిగి వచ్చిన రీతి
 ఘన పతాకల శతాంగములు హత్తి,
వెదురుపొదల్ పేర్చు విధమునఁ గనిపించు
 గడల పౌఁజులు సమగ్రముగఁ గూడి,
యుదుక్కుపొడి రాల, రోషంబు పిక్కటిల్ల,
నొక రొకరి తేవవెట్టు నత్యుగ్ర సింహ
రవములు సెలంగ, సైనిక ప్రభులు దార
సిలి రుదార శిలీము ఖార్భులు నటింప. 152

*అర్థము* :— ౧. కొండలవలెనున్న, కొమ్ముకత్తుల = దంతములకు కత్తులు కట్టిన, భద్రదంతావళముల = భద్రజాతి ఏనుగులయొక్క, మొత్తములు, బలసి = కమ్ముకొనినిన్నీ –

౨. అంబుధి తెరల = సముద్రపు తరంగముల, చందమున = వలె, తుటుములై = తండోపతండములై, భాసిల్లు = ప్రకాశించు, కంఖాణ బలములు = గుర్రపు సేనలు, ఒదవి = కలిగిన్నీ –

౩. విరివియై = విస్తరించి, పెరిగి = (ఆకాశమునుండి) తెగిపడి, మేఘముల్, వచ్చిన జోకణ = (భూమి మీదికి) వచ్చిన విధముగ, ఘన పతాకల = గొప్పవైనట్టి బావుటాలు కలిగిన, శతాంగములు = రథములు, హత్తి = తాకిన్నీ-

౪. వెదురుపొదల్, పేర్చువిధమున = పెరిగిన విధమున, కనిపించు, గడలపౌజులు = ఈటెలతో వున్న బంటులు, సమగ్రముగకూడి = పూర్తిగాకూడిన్నీ, -

ఉక్కుపొడిరాలఁగా = ఆయుధాల రాపిడివలన ఉక్కు పొడిగా రాలుచుండగా, రోషంబు పిక్కటిల్ల = కోపము అధికమగుచుండ, ఒకరొకరికిఁ, ఏవపెట్టు = మత్సరము దగ్గించు, అత్యుగ్ర = మిక్కిలి భయంకరమైన, సింహ రవములు = సింహనాదములు, చెలంగ = అతిశయిల్లగా, ఉదార = ఎక్కువైనటువంటి, శిలీముఖ = బాణములయొక్క, అర్చులు = కాంతులు, నటింప = మెరుస్తుండగా, సైనికప్రభులు = సేనల అధిపతులు. తారసిలిరి = ఎదుర్కొనిరి.

విశేషము :— ఈ పద్యమున శత్రుసేనల విజృంభణ వర్ణన ఉన్నది. భద్రజాతి ఏనుగులను కొండలతోను, అశ్వికదళాల వరుసలను సముద్ర తరంగాలతోను, పెద్దపెద్ద జెండాలతో వచ్చే రథాలను మేఘముల ముక్కలతోను, ఈటెలతోడి బంట్లను వెదురుపొదలతోను, ఉపమించడం చాల మనోహరము.

అలంకారము :— యమకము, ఉదాత్తము.

ఎత్తిన యాయుధంబు లవి యెన్నియొ యన్నిఁటి నన్ని తూపులఁ
దుత్తునియల్గఁ జేయు, మఱి తోడనె పూనఁగఁ జేతు లాడనీఁ;
డత్తరుణీ రథాశ్వముల యందకు రా విడఁ డంపతున్కయే
నత్తఱి నాతఁ; డే మనఁగ నాశరలాఘవ సావధానతల్ ? 153

అర్థము :— ఎత్తిన ఆయుధంబులు = శత్రుభటులు ఎత్తిన ఆయుధములు, అవి ఎన్నియొ, అన్నిటిని, అన్నితూపులఁ = అన్ని బాణములచేత, తుత్తునియల్గఁ = చిన్నచిన్న ముక్కలుగా, ఆతడు = అర్జునుడు, చేయుఁ, మఱి = తిరిగి, తోడనె = వెంటనె, పూనఁగఁ = ఇంకొక ఆయుధమును ఎత్తుటకు, చేతు లాడనీఁడు, అత్తరి = ఆ సమయమునందు, ఆ తరుణీ రథఅశ్వముల అందకు = ఆ సుభద్ర యొక్కయు - రథము యొక్కయు - అశ్వముల యొక్కయు చేరువకు, అంపతున్కయుఁ = అమ్ము-బాణము-యొక్క ముక్కనయినను, రాఁవిడఁడు = వచ్చుటకు వీలివ్వడు అనగా రానివ్వడు, ఆ = ఆ అర్జునుని యొక్క, శరలాఘవ = బాణప్రయోగమునందలి నేర్పును, సావధానతఁ = ఏకాగ్రతను, ఏమనఁగఁ = ఏమని వర్ణించ గలము ? (వర్ణించుటకు వీలుకాదు.)

అలంకారము :— అతిశయోక్తి.

"రకపుం జెయ్వులఁ దా వినోదముగ సారథ్యంబుఁ గావించు క
న్యకపైఁ బెట్టిన చూపె కాని, యిటు సేనం జూచుటే లేదు; సా
యక పంక్తుల్ నడుచున్ సహస్రములుగా, నయ్యారె! వివ్వచ్చు చే
తికిఁ గన్నుల్ గల" వంచు నెంచి రపు డెంతే వీర యోధాగ్రణుల్.

ఈ పద్యములో అర్జునుని గురించి యాదవవీరుల అభిప్రాయమున్నది.

*అర్థము* :— రకపుంచెయ్వులన్ = చిత్రవిచిత్రములైన గతులతో, తాన్ (సుభద్ర), వినోదముగ, సారథ్యంబు కావించు = రథము నడుపుచున్న. కన్యకపైన్ = సుభద్రపై. పెట్టిన = లగ్నముచేసిన, చూపె కాని, ఇటు, సేనన్ = మన సైన్యమును చూచుటే లేదు = చూచుట అన్నదేలేదు; (ఐనా) సాయకపంక్తుల్ = బాణముల వరుసలు, సహస్రములుగాన్ = వేలలెక్కను, నడచున్ = పోవుచునే ఉన్నవి! (సుభద్రపై కన్నులను నిలుపుటచేత శత్రుసేనను చూడడు అయినను చూడకుండగనే వేలబాణములను వదలుచుండును.), అయ్యారే! = అహాహా! వివ్వచ్చు = బీభత్సుడగు అర్జునుడి, చేతికి, కన్నుల్ కలవు (చేతులే కనిపెట్టి బాణప్రయోగమును చేయును అని భావము), అంచు, వీరయోధాగ్రణుల్ = శత్రువీరులలో శ్రేష్ఠులగువారు, అపుడు, ఎంతేన్ = విశేషముగ, ఎంచిరి = మెచ్చుకొనిరి:

*విశేషము* :— రకరకములైన గతులలో సుభద్ర వినోదముగ రథమును నడపుతూ తన నేర్పును ప్రకటించింది. దీనిని మెచ్చుకొంటూ అర్జునుడు తన చూపును ఆమెపై లగ్నము చేసాడు.

అంతా వాళ్లకు వినోదంగానే ఉంది. అనాయాసంగా శత్రువులను జయించగలమన్న నమ్మకముండబట్టే ఈ నిర్లక్ష్యభావము.

వివ్వచ్చు డనడం సాభిప్రాయము.

*పాఠాంతరము* :—

'అకలంకస్థితి నిర్విరోధముగ సారథ్యంబు గావించు కన్యకపై....'

.... వెంకటకృష్ణమాచార్యులు.

ఈ పాఠములో యుద్ధము గురించి అలక్ష్యభావము సుభద్రకు గూడా ఉందన్న సొగసు పోతుంది.

*అలంకారము* :— కావ్యలింగ - అతిశయోక్తి.

"శూరకులంబు సర్వ మొక జోకయి వచ్చి యెదిర్చెనేని, నే
నీ రమణీశిరోమణి గ్రహింపక పో, నని, గట్టిగా నహం
కారము మీఱఁ గంకణము గట్టుకయుండెడు నిప్పు డర్జునుం;
డౌర! రణంబు పెండ్లి కొడు" కంచు నుతించిరి వీరపుంగవుల్. 155

అర్థము :— 'శూరకులంబు సర్వము = యాదవకులమంతయు - (శూరుడు యాదవుల పూర్వులలో ప్రసిద్ధుడు), శూరసమూహమంతయు, ఒక జోకయి = ఒక్కమొత్తమయి, ఎదిర్చెనేని = ఎదిరించినను, 'నేను, ఈ రమణీశిరోమణిని, గ్రహింపకపోను = తీసికొనిపోకమానను,' అని, గట్టిగా, అహంకారము మీఱ = అతిశయముతో, కంకణము కట్టుకయుండెడు = దీక్షపూని ఉండినటువంటి, అర్జునుండు, ఇప్పుడు, ఔరా !, రణంబు పెండ్లికొడుకు = యుద్ధమునందలి (విజయలక్ష్మికి) పెండ్లికొడుకు', అంచు, వీరపుంగవుల్ = వీరశ్రేష్ఠులు, నుతించిరి = పొగడిరి.

విశేషము :— నాగవల్లి ఇంకా కాలేదు కనుక వధూవరుల చేతులకు కంకణము లుంటాయి. వానిని దీక్షాకంకణములుగ కవి చమత్కరించినాడు.

అలంకారము :— ఉత్ప్రేక్ష.

అమ్మెయి వాజి వారణ భటావళిఁ గప్పిన తూపు లేమనం ;
దెమ్మలుగాఁ దటాకముల నిండు శరమ్ములఁ, బుష్పవాటులం
గ్రమ్మ శిలీముఖమ్ముల, ధగద్ధగితోన్నత సౌధ గోపు రా
గ్రమ్ములయందు వ్రాలెడు ఖగమ్ముల, నెన్నిన నెన్నశక్యమే ? 156

అర్థము :— అమ్మెయి = ఆ విధముగ, వాజి = గుర్రములయొక్కయు, వారణ = ఏనుగులయొక్కయు, భట = భటులయొక్కయు, ఆవళిన్ = సమూహమును, కప్పిన తూపులు = కప్పివైచినబాణములు, ఏమనన్ = ఏమనవచ్చును !, తటాకములన్ = చెరువులలో, తెమ్మలుగ = తెప్పలుగ, నిండుశరమ్ములన్ = నిండు నటువంటి నీళ్లను (నీటిబొట్లను), పుష్పవాటులన్ = పూదోటలయందు, క్రమ్మ = మూగియుండు, శిలీముఖమ్ములన్ = తుమ్మెదలను, ధగద్ధగిత = మిక్కిలి మెరుస్తూ ఉన్న, ఉన్నత = ఎత్తైన, సౌధ = మేడలయొక్కయు, గోపుర = గోపురములయొక్కయు, అగ్రమ్ములయందు = పైభాగములందు, వ్రాలెడు = వ్రాలు నట్టి, ఖగమ్ములన్ = పక్షులను, ఎన్నినన్ = లెక్కించగలిగినప్పటికీ, (వాజి వారణ భటావళిని గప్పిన తూపులను) ఎన్నశక్యమె = ఎంచశక్యమా !

విశేషము :— అసంఖ్యాకములైన బాణములతో అర్జునుడు గజ తురగ పదాతులను ముంచివేసెనని తాత్పర్యము.

శరములు, శిలీముఖములు, ఖగములు అనే పదాలకు తూపులు బాణములు అని అర్థముంది. నీళ్లకు శరములని, తుమ్మెదలకు శిలీముఖములని, పక్షులకు ఖగములని చెప్పడం చమత్కారము. ఆ శరాదులను లెక్కపెట్టగలిగినా, ఈ అర్జునుడి బాణాలను ఎంచలేము అని.

ఈ 'బాణము' లను దిమ్మలుగా రాశిరాశిగా లెక్కించగలిగినను అర్జునుడు వేసిన బాణము లను లెక్కించ వీలుకాదు అని వేదమువారు "దిమ్మలుగ......" అన్న పాఠ మెత్తుకున్నారు.

తెమ్మలుగా = తెప్పలుగా అనడానికి

"....చూచి కిరాతులార బలు సొమ్ములు తెమ్మలు
గానవచ్చె నీ రాచకుమారు డోచుఁడు . ..."

—వరాహపురాణము.

దిమ్మనడానికి : "తలదిమ్ము ఘటియించె తుమ్మెదల దిమ్మచటన్"

—అ2-197.

అని యీ కవే అన్నాడు.

అలంకారము : అతిశయోక్తి - శ్లేష.

అలుఁగుల పోకడలును మై
యలయికలును మీఁదుమిక్కిలై కడు లోనై
బలములుఁ దమతమ బాహా
బలములు నటఁ బనికిరాక భయవిహ్వలులై. 157

అర్థము :— అలుఁగుల = బాణములయొక్క, పోకడలును = జాడలును, మై అలయిక లును = శరీరముయొక్క బడలికలును, మీఁదుమిక్కిలై = అత్యధికముకాగా, బలములు = సేనలు, కడులోనై = మిక్కిలి తగ్గినవారై, తమతమ బాహాబలములు = తమతమభుజబల ములు, అట = ఆయుద్ధమునందు, పనికిరాక, భయవిహ్వలులై = భయముచేత మైమరచినవారై (కర్త క్రింది పద్యలోని సైనికులు.)

అలంకారము :— అనుప్రాసము.

## వి జ య ము

ఒక్క మొగముగాక యుఱికిరి సైనికుల్
దిక్కు మొగము లగుచు; జిక్కుభటులు
బ్రొక్కి కిటియలు దటుక్కునఁ బడవైచి;
యక్కిరీటి యెదుట నాఁగఁగలరె! 158

అర్థము :— ఒక్క మొగముగాక = ఒక్క దిక్కుగాక. అనగా ఒకరు పోయిన దిక్కు నకు ఇంకొకరు పోక, సైనికుల్ దిక్కుమొగములగుచు, ఉఱికిరి = వేగముగా పరుగెత్తిరి;

చిక్కుభటులు = (పరుగులెత్తలేక) వెనుక చిక్కిన భటులు, ఈటియలు = ఈటెలను, తటుక్కున, పడవైచి, మ్రొక్కిరి = కాపాడమనివేడిరి. ఆ కిరీటి, యెదుట, ఆగగలరె !

ఆయుధములు విసర్జించినవారిని రక్షించుట యుద్ధధర్మము.

'ఒక్క మొగము గాగ....' అన్న పాఠముతో వేదమువారు 'ఒకటే పూవికతో' అని అర్థము చెప్పారు.

అలంకారము :— యమకము.

ఇత్తెఱంగున జయాంగనా సంగమంబునం బొసంగియుఁ జెక్కు చెమర్పక యక్కురువీరుండు సారథ్యనిపుణత్వంబునకు మెచ్చి యిచ్చిగురుఁబోఁడి నవారిత ప్రేమాతిశయంబునం గౌఁగిలించి "యొక్కించుక రేకమోవని నాయురఃస్థలంబున నీ కుచకుంకుమరేఖ లంటించి మీవారికి సూడు దీర్చితి" వని నవ్వుచు,......

అర్థము :— ఇత్తెఱంగున = ఈ విధంబున, జయఅంగన = విజయకాంతయొక్క (విజయలక్ష్మి), సంగమంబున = కూడికచేత (సంభోగముచేత), పొసంగియు = ఒప్పియు, చెక్కుచెమర్పక = కొంచెమైనను ఆయాసములేక (చెమటనైనను కలుగక) (అలంకారము-విశేషోక్తి), ఆ కురువీరుండు, ఆ చిగురుఁబోఁడి = ఆ సుభద్ర, సారథ్యనిపుణత్వంబునకు = రథమునడుపు నేర్పునకు, మెచ్చి, అవారిత = అడ్డులేని, ప్రేమాతిశయంబునన్ = మిక్కుటమగు ప్రేమతో, కౌఁగిలించి = ఆలింగనముచేసుకొని, "ఒక్కించుక = కొంచెమైనను, రేకమోవని = గంటుపడని, నా ఉరస్థలంబునన్ = నావక్షస్థలమున, నీ, కుచకుంకుమరేఖలు = కుచములయందు చిత్రించుకొనిన కుంకుమరేఖలను, అంటించి, మీవారికి, సూడు = పగను, తీర్చితివి = పోగొట్టితివి." (అర్జునుని వక్షస్థలము నంటిన రేఖలు కత్తిగంటులవలె నున్నవి. తన కన్నవారి సైన్యములు ఏమీచేయలేక పోయినవన్న విందను పోగొట్టితివని భావము.) అని, నవ్వుచు,

నవ్వలం గొంత దవ్వరుగుచు నట ప్రచ్ఛన్నవేషంబులం దనరాక కెదురుచూచు చున్న విశారద ప్రముఖాప్త పరివారంబుల గారవించి, మురారి ప్రేరిత దాశార్హ నివేది తార్హ మార్గంబున మహారణ్యంబులును గిరివరేణ్యంబులును నదీనదంబులు జన పదంబులుం గడచి స్వదేశంబుఁ గాంచి యుల్లాసంబున నందంద విశ్రమించుచుఁ జనం జనం......

అర్థము :— అవ్వలన్ = ఆవైపు (ఇంద్రప్రస్థము వైపు), కొంతదవ్వు అరుగుచు, అట = అక్కడ, ప్రచ్ఛన్నవేషంబులన్ = మారువేషములతో, తనరాకకు ఎదురుచూచుచున్న, విశారదప్రముఖ = విశారదుడు మొదలగు, అప్తులను = స్నేహితులను, పరివారంబులను = అనుచరులను, గారవించి = గౌరవించి, మురారి = కృష్ణునిచేత, ప్రేరిత = పంపబడిన, దాశార్హ = యాదవులచేత, నివేదిత = తెలుపబడిన, అర్హమార్గంబునన్ = సరియైన దారిని

(పోవుచు), మహారణ్యంబు లును, గిరివరేణ్యంబులును = గొప్పపర్వతములును, నదీనదంబు లును = తూర్పుముఖముగా పారుసట్టి నదులును - పడమర దిక్కుగా పారుసదములను, జన పదంబులును = గ్రామములును; కడచి = దాటి, స్వదేశంబుగాంచి = తన రాజ్యమును చూచి (ప్రవేశించి), ఉల్లాసంబున = సంతోషముతో, అందంద = అక్కడక్కడ, విశ్రమించుచు = ఆగుచు, చనన్చనన్ = పోవు చుండగా -

చారులవలనం దెలిసి యగ్రజాను శాసనంబున నానా సేనా సమన్వితులై మాద్రీ సుతులెదుర్కొని యుపాయనా నతులు సమర్పింప నుపగూహన బహూకృతులొనర్చి...

చారులవలనన్, (అర్జునునిరాక), తెలిసి మాద్రిసుతులు = నకులసహదేవులు, అగ్రజ అను శాసనంబునన్ = అన్నయగు ధర్మజుని ఆజ్ఞ ప్రకారము, నానా సేనాసమన్వితులై = అనేక సేనలతోకూడినవారై, ఎదుర్కొని = ఎదురువచ్చి, ఉపాయనా నతులు = కానుకలను నమ స్కారములను, సమర్పింపన్, ఉపగూహన = ఆలింగనములు అనెడి, బహూకృతులు = ఎదురు కానుకలు, ఒనర్చి, (అర్జునుడు అపుడు),

## ఇంద్రప్రస్థపుర ప్రవేశము

దశదిశా దుస్సహ నిస్సాణ ప్రముఖ నిస్వనంబులు బోరు కలంగ నలంకృత నిస్తుల స్తంబేర మారూఢుం డై గగ నోల్లేఖి తోరణ ధ్వజోల్లోచ ప్రాంచత్ సిచయ ప్రచయ ప్రచల త్ప్రచలాకి చిత్ర చ్ఛవి వ్యాప్త హేమచ్ఛవి ఫలగుళుచ్ఛ రాజ ద్రాజ రంభాస్తంభ విజృంభిత ప్రతిమందిరంబును,

అర్థము :— దశదిశ = పది దక్కులయందును, దుస్సహ = సహించశక్యముకాని, నిస్సాణ = భేరి, ప్రముఖ = మొదలైనవాని, నిస్వనంబులు = ధ్వనులు, బోరుకలంగన్ = మ్రోయుచుండగా, అలంకృత = అలంకరింపబడిన, నిస్తుల = సాటిలేని, స్తంబేరమ = ఏనుగును, ఆరూఢుండై = ఎక్కినవాడై, గగనఉల్లేఖి = ఆకాశమును ఒరయుచున్న, తోరణ = ద్వారములందును, ధ్వజ = టెక్కెములందును, ఉల్లోచ = మేలుకట్లయందును, ప్రాంచత్ = ప్రాకాశించుచున్న, శిచయ = వస్త్రముల, ప్రచయ = సమూహముయొక్క, ప్రచలత్ = మిక్కిలి కదలుచున్న, ప్రచలాకి = నెమళ్లవంటి (నెమలిపురులవంటి), చిత్రచ్ఛవి = చిత్రమైనకాంతులు, (అనేకములైన కాంతులు), వ్యాప్త = కమ్మబడినటువంటి, హేమచ్ఛవి = బంగారుకాంతిగల, ఫలగుళుచ్ఛ = పండ్లగుత్తులచేత, విరాజత్ = ప్రకాశించుచున్నటువంటియు, రాజరంభాస్తంభ = శ్రేష్ఠమైన అరటిస్తంభములచేత, విజృంభిత = అందముగా చేయబడిన, ప్రతిమందిరంబును = ప్రతిభవనమును,

విలోకిత బిబ్బోకవతీ వికచలోచన ప్రాచుర్య విభ్రాజమాన తనూజోత్సవ దిదృక్షా గృహీ తానేక విగ్రహ సహస్రాంబక విడంబి ధర్మహర్మ్యనికురుంబంబును...

విలోకిత్ర = చూచుచున్న, బిబ్బోకవతీ = విలాసముగల కాంతలయొక్క, వ్యాకోచ = వికసించిన, లోచన = నేత్రములయొక్క, ప్రాచుర్య = బాహుళ్యముచేత, విభ్రాజమాన = ప్రకాశించుచున్న, తనూభవ = కుమారుడైన అర్జునునియొక్క, ఉత్సవ = వైభవమును, దిదృక్షా = చూచుకోరికచేత, గృహీత = స్వీకరించబడిన, అనేకవిగ్రహ = అనేకములగు శరీరములుకల, సహస్రాంబక = దేవేంద్రుని, విడంబి = అనుకరించునట్టి, ధర్మ = బంగారు, హర్మ్య = మేడలయొక్క, నికురుంబంబును = సమూహముకలదియు (ఒక్కొక్క మేడపై భాగమునను స్త్రీలు అనేకులు చూచుచుండుట వలన ఆ మేడ సహస్రాక్షమయి ఇంద్రునివలె ఉన్నది. అటువంటి మేడలు అనేకము ఉండుటచేత ఆ ఇంద్రుడే వివిధ ఆకారములతో చూచుచున్నట్లు ఉత్ప్రేక్ష, తన కొడుకు ఉత్సవమును అత్యంత ఆసక్తితో ఇంద్రుడు చూచుచున్నటుల భావము.)

నీరాజన లా జాక్షత కుసుమ కిసలయ వ్యాకీర్ణ కలశ గ్రహయాళు మహీలేఖ మహిళా భూయిష్ఠ ద్రాఘిష్ఠ వేది కాంతరంబును నగు నింద్రప్రస్థపురంబును, సకలజన రంజన కుశల విశాలకటాక్ష కృపా ర సావేశంబునఁ బ్రవేశించి......

నీరాజనములు = హారతులు, లాజ = పేలాలు, అక్షతలు, కుసుమ = పుష్పములు, కిసలయ = చిగుళ్లు, (వీనిచేత) వ్యాకీర్ణ = (కూడిన) వ్యాపించిన, కలశ = పూర్ణకుంభములను, గ్రహయాళు = పట్టుకొనియున్న, మహీలేఖ = (భూదేవత) బ్రాహ్మణ, మహిళా = స్త్రీలచేత, భూయిష్ఠ = క్రిక్కిరిసిన, ద్రాఘిష్ఠ = మిక్కిలి దీర్ఘమైన, వేదికా = అరుగులయొక్క, అంతరంబును = మధ్యభాగమును కలదియు అగు, ఇంద్రప్రస్థపురంబును, సకల జనరంజనకుశల = జనులందరిని రంజింపచేయుటలో నేర్పుగలిగిన, విశాలకటాక్ష = విశాలములైన కడకన్నుల యందలి, కృపారసావేశంబునన్ = కృపారసముయొక్క ఆవేశముచేత, ప్రవేశించి —

మున్ను సు భద్ర ముహూర్తంబున సుభద్రా భద్ర భద్రేభయానం జతురంత యానంబున శుద్ధాంతంబున కనిపి ధౌమ్యాదుల కభివందనంబుఁ గావించి యాశీర్వాదంబులు గైకొని నిజాగమన సంతోష రసోన్మేష భూషిత సుప్రస న్నానన బిసప్రసూనుండును, రత్నసింహాస నాసీనుండును నగు ధర్మసూనునకు సాష్టాంగం బెరఁగి భీమసేనునకు నమస్కరించి యంతఃపురికిం జని కుంతీదేవికి వందనం బాచరించి ద్రుపదనందన నుపచరించి యిష్టాలాపంబుల సుఖం బుండె. 159

అర్థము :— మున్ను = తనకన్నముందుగా, సు భద్ర ముహూర్తంబున = మంచి శుభ ముహూర్తమున, భద్రఇభయాన = భద్రజాతి ఏనుగువంటి నడకకలిగిన, సుభద్రను, చతురంత

యానంబునన్ = పల్లకిలో, శుద్ధాంతంబునకు = రాణివాసమునకు, అనిపి = పంపించి, ధౌమ్య ఆదులకు = (పాండవ పురోహితుడైన) ధౌమ్యుడుమొదలగువారికి, అభివందంబు కావించి = నమస్కారముచేసి, ఆశీర్వాదంబులు కైకొని, నిజ ఆగమన = తనయొక్క రాకవలన(కలిగిన) సంతోషరస ఉన్మేష = ఆనందరసముయొక్క పొంగుచేత, భూషిత = అలంకరింపబడిన సుప్రసన్న = మిక్కిలి అనుగ్రహముకల, అనన బిసప్రసూనుడు = పద్మమువంటి ముఖముకల వాడును (బిసప్రసూనము = తామరతూడున కల పూవు - పద్మము): రత్నసింహాసన ఆసీనుండును, అగు ధర్మసూనునకు = అగు ధర్మరాజునకు, సాష్టాంగంబు ఎరఁగి = నమస్కరించి, భీమసేనునకు నమస్కరించి, అంతఃపురికింజని, కుంతీదేవికి వందనంబు ఆచరించి, ద్రుపద నందనన్ = ద్రౌపదిని, ఉపచరించి = పలుకరించి, ఇష్టఆలాపంబులన్ = ఇష్టసంభాషణము లలో, సుఖముగా నుండెను.

## ద్వారకలో బలరామాదుల సభ

అంతట ద్వారకాపురమునందు సభా పరిపాలుఁ డర్జు నో
దంతము యాదవుల్ దెలియునట్లు హజారమునందు భేరి య
త్యంత రుషా కషాయిత హృదంతరుఁడై చఱపించె; మించె ది
గ్దంతి ఘటా శ్రవఃపుట భిదా చణ భీషణ భూరి భాంకృతుల్. 160

అంతట యుద్ధమునుండి పలాయనులు అయినవారు ద్వారకచేరి సభా పరిపాలకునికి తెలిపినంతట—

*అర్థము* :— ద్వారకాపురమునందు, అర్జున ఉదంతము = అర్జునుని వృత్తాంతము, యాదవుల్ తెలియునట్లు, హజారమునందు = మొగసాలయందు, సభాపరిపాలుడు = రక్షకభటాధి కారి, అత్యంత = మిక్కిలి ఎక్కువైన, రుష = కోపముచేత, కషాయిత = కలతపెట్టబడిన, హృదంతరుడై = మనసుకలవాడై, భేరి చఱపించెన్ = భేరిమ్రోగింపించెను, దిక్‌దంతి = దిగ్గజములయొక్క, ఘటా = సమూహముయొక్క, శ్రవఃపుట = దొప్పలవంటి చెవులు, భిదా = బ్రద్దలుకొట్టుటకు, చణ = నేర్పుగలిగిన, భీషణ = భయంకరములైన, భూరి = గొప్ప, భాంకృతుల్ = భాంకారధ్వనులు, మించెన్.

కాబట్టి అంతర్ద్వీపములోనుండిన బలరాముడు మొదలగు వారు వినగలిగి వచ్చారు.

*అలంకారము* :— అతిశయోక్తి.

ఆనాదము విని హలి మొద
లైన యదూద్వహులు పురికి నరుదెంచి, సభా
సీనులయి, నరుని కపట వి
ధానము మఱిమఱియు నడిగి, తప్తాశయులై, 161

అర్థము :— ఆనాదము = ఆభేరీధ్వనిని, విని, హలి = బలరాముడు, మొదలైన, యదూద్వహులు = యదువంశమువారు - యాదవులు, పురికిన్ అరుదెంచి, సభాఆసీనులయి, నరుని = అర్జునునియొక్క, కపట విధానమున్ = మోసపుప్రవర్తనము గురించి, మరి మరియునడిగి = ఎన్నియోసార్లు ప్రశ్నించి, తప్తఆశయులై = ఉడికిన (తీవ్రమైన) భావములు, కలవారై — (క్రిందివిధముగా అన్నారు.)

"యతి ననుచు వేషభాషల నటమటించి,
పొంచి తఱివేచి కన్నియఁ గొంచు నరిగె,
దొరకు సన్న్యాసి యనుమాట తిరముగాఁగ
నర్జునుం డద్దిరా ! యెంత దుర్జనుండు ! 162

అర్థము :— "యతిని అనుచు = నేనొక సన్యాసిని అని, వేషభాషలన్ = వేషము చేతను మాటలచేతను, అటమటించి = మోసముచేసి,

పొంచి = దాగియుండి, తఱివేచి = సమయముచూచి, కన్నియన్ = పెండ్లికానిపిల్లను, అనగా ముగ్ధను, కొంచు = తీసుకొని, అరిగెన్ = పోయెను,

దొరకుసన్న్యాసి అనుమాట = దొరకిన దానిని ఎత్తుకొని పోవుటకు సన్యాసి వేషమును వేసినవాడు అనగా దొంగ అను మాట, తిరముకాగ = నిలిచేలాగా, అద్దిరా ! అర్జునుండు, ఎంత, దుర్జనుండు = చెడ్డవాడు.

అలంకారము :— అంత్యానుప్రాసము.

"ఏతన్మాత్రమె కార్యభారమని పై యెత్తెన్నకే నేఁడు ని
ర్భీతిన్ బాలికఁ గొంచుఁబోవ నుచితంబే ? కండగర్వంబు ! దు
ర్నీతుల్ యాదవ వీరసింహములతోనేనా ? బలారా ! బలా
రాతి ప్రోద్భవుఁ డెంతసేసె ! నిది తీరా ? వీరరాణ్మౌళికిన్ ?" 163

అర్థము :— ఏతత్‌మాత్రమె = ఈమాత్రమె, కార్యభారము అని = చేయవలసినపని అని (సుభద్రను ఎత్తుక పోవడముతోనె పని తీరిపోయినదని భావించి), పైఎత్తు ఎన్నకే = దీనివలన కలుగు ఆపదను చూడకుండగనే, నేడు, నిర్భీతిన్ = భయములేకుండా, బాలికన్, కొంచున్, పోవన్, ఉచితంబే ? కండగర్వంబు ! = ఎంత బలగర్వము !, దుర్నీతుల్ = ఈ దుష్టప్రవర్తనలు, యాదవవీరసింహములతోనేనా ? = యాదవులలోని వీరసింహములమైన మన తోనేనా? బలారా ! = బాగున్నది !, బలఅరాతి = బలుడను రాక్షసుని చంపిన ఇంద్రుని, ప్రోద్భ

పుడు = కుమారుడు-అర్జునుడు, ఎంతి చేసి : వీరరాట్ మౌళికిన్ = వీరశ్రేష్ఠులలో అధికునకు, ఇది తీరా = ఇదేనా పద్ధతి ?

అలంకారము :— యమకము.

"వంచన సేసి యిట్లు చెలువం గొనిపోవఁ బ్రలంబవైరి సై
రించునె ? దుర్మదాధిప వరేణ్యుల భూములు దున్ని ధూళి గా
వించఁడె ? పిండిపిండిగఁ బ్రవీర విరోధి కిరీటరత్నముల్
దంచఁడె ? ఘోర సీర మునలంబుల వ్యర్థములే ధరించుటల్ ?" 164

యాదవు వీరు అలా అనగా బలుడు ఈ విధముగా అన్నాడు.

అర్థము :— వంచన సేసి = మోసముచేసి, ఇట్లు, చెలువన్ = కాంతను, కొనిపోవన్ = కొనిపోవుటను, ప్రబలంబవైరి = ప్రలంబాసురుని సంహరించిన బలరాముడు, సైరించునె = సహించునా? దుర్మద = చెడుగర్వముకల, అధిపవరేణ్యుల = రాజశ్రేష్ఠుల, భూములు = రాజ్యములను, దున్నిధూళిగావించడే ? ప్రవీర = గొప్పవీరులైన. విరోధి = శత్రువులయొక్క, కిరీట రత్నముల్ = కిరీటముల యందలి రత్నములను, పిండిపిండిగ దంచడే ; ఘోర = భయంకర మైన; సీర మునలంబులన్ = నాగలిని రోకలిని, ధరించుటల్ = ఆయుధములుగా పూనుటలు, వ్యర్థములే ? (వ్యర్థములు కావని భావము.)

ఆయుధములలో నాగలి ఉన్నది కాబట్టి దున్ని ధూళికావించుట, రోకలి ఉన్నది కాబట్టి రత్నములను పిండిపిండిగ దంచుట వ్యర్థముకాక సార్థకములైన ప్రయోగములు.

అలంకారము :— పరికరాంకురము: క్రమము.

అని కాళిందీ భేదనుఁ
డను వాక్య మొకింత విన్నయంతనె, మేఘ
ధ్వనిఁ గెరలెడు మదకేసరు
లన, యోధాగ్రేసరులు మహామత్సరులై, 165

అర్థము :— అని, కాళిందీ భేదనుఁడు = బలరాముడు. అనువాక్యము (పైమాటలు), ఒకింత విన్నయంతనె, మేఘధ్వనిన్ = ఉరుముచేత, కేరలెడు = ఉద్రేకించునట్టి, మదకేస రులు = మదించిన సింహములో. అన, యోధఅగ్రేసరులు = వీరులలో శ్రేష్ఠులు. మహా మత్సరులై = మహామత్సరము కలవారై —

విశేషము : — మేఘగర్జనమునకు సింహము కెరలుట సహజము, అందువలన బల రాముని ధ్వని మేఘగర్జనముతోను అది విని ఉద్రేకపడిన వీరులను సింహములతోను సరిపోల్చి నాడు కవి,

అలంకారము :— ఉత్ప్రేక్ష.

'యాదవ వార్ధి వెల్లివిరియన్ మఱి యాఁగెడుపాటి వీరుఁ డీ
మ్మేదిని నెవ్వఁ? డెందులకు మీరలు గావలె? నేమె చాలమే?
పోదుమె? కట్టితెత్తుమె? ఋభుప్రభునందనుఁ డెంత? వాని తం
డ్రే దురమం దెదిర్చినను, రేకుమడంతుము మాట లేటికిన్?' 166

అర్థము :— యాదవవార్ధి = యాదవబలము అను సముద్రము, వెల్లివిరియన్ = పొంగినపుడు, మఱి = ఇక. ఆఁగెడుపాటి = అడ్డుకొనగలిగిన, వీరుఁడు, ఈమేదినిన్ = ఈ ప్రపంచమునందు, ఎవ్వడు? మీరలు = మీరు (అనగా బలరాముడు), ఎందులకు కావలెన్, (మీ అవసరములేదు అని భావము), ఏమె చాలమే? = మేమే చాలమా?, ఋభుప్రభు నందనుఁడు = దేవతల ప్రభువైన ఇంద్రుని కుమారుడు అర్జునుడు, ఎంత?, వాని తండ్రే = ఆ ఇంద్రుడే, దురమందు = యుద్ధమునందు, ఎదిర్చినను = ఎదిరించినను, రేకుమడంతుము = శరీర మంతయు గాయములు చేయుదుము, మాటలు ఏటికిన్ = మాటలు ఎందుకు?, పోదుమె = వెళ్ల మంటారా? కట్టితెత్తుమె = కట్టితేవలెనా (అనగా ఆజ్ఞయిచ్చిన అర్జునుని బందీచేయుదుము అని భావము.)

*పాఠాంతరము :—*

"......మ్మేదిని నెవ్వ? డిఁదులకు మీరలుగావలె? నేమె చాలమే?"

'ఇందులకు మీరలు కావలెన్? ఏమె చాలమే' అని విడదీసి ఇందులకు మీరు కావలెనా, మేమె చాలమా అని అర్థము చెప్పవలెను. కావలెన్ అను పదమునకు కావలెనా అని అర్థము చెప్పుట సాహసము. 1-87 లో నున్న 'ఏల వలె నన్యులు' అన్న రీతి అన్వయమే ఇక్కడ గూడ.

అని, యుదగ్ర మహాగ్రహ వ్యగ్రుఁడైన
యన్న మాటలు సభవార లన్నమాట
లేమి చవిగామియును, దాల్మి యోమి, భక్త
జన కుశలకామి యల యదుస్వామి యనియె. 167

అర్థము :— అని, ఉదగ్ర = భయంకరమైన, మహాఅగ్రహ = మిక్కిలి కోపమువలన వ్యగ్రుడైన = వేగిరపడుచున్న, అన్నమాటలు = బలరాముని మాటలు, సభవారలు, అన్న మాటలు, ఏమి = కొంచమైనను, చవి కామియు = రుచింపకపోయినను, తాల్మి ఓమి = ఓపిక వహించి, భక్తజన కుశలకామి = భక్తులగు జనులకు క్షేమమునుకోరువాడు అయిన, అల యదు స్వామి = ఆ యాదవరాజైన కృష్ణుడు, అనియెన్ = ఇట్లు చెప్పెను —

పాఠాంతరము :—

"అని. యుదగ్ర హలగ్ర హవ్యగ్రుడైన యన్నమాటల సభవార లన్నమాట
లేమి చవిగామియును దాల్మియోమి. భర్త జనకుశల కామియల యదుస్వామి కనియె"

అని — ఇది వేదమువారి పాఠాంతరము దీనికి ఉదగ్ర = తీక్షణమైన, హల = నాగలి యొక్క, గ్రహ = గ్రహణమందు, అవ్యగ్రుడు = జాగ్రత్తకలవాడైన. అన్నమాట, అని వ్యాఖ్యానించిరి. సందర్భము కోపావేశము కాని హలగ్రహణము కాదు. చరణము నడక చేమకూర వానిదికాదు చివరిపాదము 'భర్త జన కుశల కామియల యదుస్వామి కనియె' అనికూడ ఈ పాఠములో ఉంది. దీనికి భర్తలకు క్షేమమునే కోరుచుండు శ్రీకృష్ణుడు అని త్రెంచి యదుస్వామికిన్ = యాదవ ప్రభువగు బలరామునితో అనియెన్ అని శాస్త్రిగారు వ్యాఖ్యానించాడు. సాధారణముగ ఇట్టి అంత్యానుప్రాసములు ఒక్క విషయమునే సూచించుచు మనోహరముగా నుండును. ఈ అంత్యానుప్రాసము కృష్ణునకు బలరామునకు విభజించవలసిన ఆవశ్యకత కానరాదు. ఏమంటే 'బలరామునితో అనియె' అని చెప్పకపోయినను క్రింది పద్యమున "యదుకుల రాజశిరోమణి" అను సంబోధనమే తేటపరచుచున్నది. యాదవ రాజవంశము వారినందరిని స్వాములు అని చెప్పుటలో తప్పులేదు. అర్జునుని ఈ గ్రంథమున అనేకసార్లు రాజుగా ఉదహరించుట కలదు.

అలంకారము :— అంత్యానుప్రాసము.

"యదు రాజకుల శిరోమణి,
యెదురా మీ కొకరుఁ? డుచిత మెఱిఁగియుఁ బరులెం
చ దురాపకోప మూనుట
చదురా? తెగరానిచోట సైరణ తగదా? 168

అర్థము :— "యదురాజకుల శిరోమణి = ఓ యాదవరాజుల సమూహములో అత్యుత్తముడా. (అనగా 'సోదరా'). మీకు ఒకరుఁడు = మీకు ఎవడైనను, ఎదురా = ఎదుట నిలువ గలడా, ఉచితము ఎఱిగియు = యుక్తము అయిన దానిని తెలిసి ఉండియు, పరులెంచఁగా = ఇతరులు వ్యాఖ్యానించునట్లు (నిందాగర్భముగ). దురాప = సహించరాని. కోపమును, ఊనుట = పొందుట, చదురా = నేర్పా? తెగరానిచోటఁ = తెంపుకొనుటకు వీలులేనిచోట, సైరణ = ఓర్పు - సహనము చూపుట, తగదా? = మంచిదికాదా?

విశేషము :— సుభద్రను పెండ్లియాడిన అర్జునునితో సంబంధము తెంపుకొనుట వీలులేనిది కాబట్టి ఓర్చుకొనుట మంచిదనీ, పరాక్రమోపేతుడైన అర్జునునిపై సాహసము చేయబూనుట ప్రమాదకరము కాబట్టి ఓర్చుకొనుట మంచిదనీ సూచవలు.

అలంకారము :— యమకము.

ద్రోణాచార్యుల శిష్యుఁడు,
బాణాసన నిపుణుఁ డరినృపాలక మకుటీ
శాణాగ్ర తేజి తోగ్ర కృ
పాణాంచ ద్భుజుఁ డతండు ప్రభుమాత్రుండే ? 169

అర్జునుడి బలపరాక్రమముల గురించి కృష్ణుడు చెప్పుతున్నాడు.

*అర్థము* :— ద్రోణాచార్యుల శిష్యుఁడు, బాణాసన = వింటియందు (విలువిద్యయందు), నిపుణుఁడు = నేర్పరి, అరినృపాలక = శత్రురాజులయొక్క, మకుటీ = కిరీటములనే, శాణా = సానలయొక్క, అగ్ర = అంచులచేత, తేజిత = పదును (వాడి) చేయబడిన, ఉగ్ర = భయంకరమైన, కృపాణ = కత్తిచేత, అంచత్ = ఒప్పుచున్న, భుజుండు = భుజముకలవాడు, అతండు = అతడు (అర్జునుడు), ప్రభుమాత్రుండే ? = సామాన్యుడైన రాజా ?

శత్రురాజుల యొక్క కిరీటముల కూల్చుటలో ఒరపిడి కలిగి పదును పెట్టపడిన భయంకరమైన కత్తిని ధరించినవాడు అని అర్థము. ఒరపిడిచే పదునెక్కించినవి కాబట్టి కిరీటములే సానలయాయి.

*అలంకారము* :— రూపకము.

ఆ పురమర్దనుం డయిన నాతని నడ్డముదాఁకి నిల్వఁగా
నోపఁడు; మత్స్యయంత్రము మహోద్ధతి నేసి స్వయంవరంబునన్
ద్రౌపదిఁ గైకొనన్ చెనకు రాజకుమారుల పాటెఱుంగమే ?
మూఁపులు మూఁడగుణ్ రిపు చమూపులఁ గన్నపు డక్కిరీటికిన్. 170

*అర్థము* :— ఆపురమర్దనుండు = త్రిపురాసురులను సంహరించిన ఈశ్వరుడు, అయినను, ఆతనిన్ = అర్జునుని, అడ్డముదాకి = ఎదిరించి, నిల్వగాన్ ఓపడు = నిలువజాలడు: మత్స్యయంత్రము, మహాఉద్ధతిన్ ఏసి = మహాపరాక్రమముతో కూలనేసి, స్వయంవరంబునన్ = స్వయంవరములో, ద్రౌపదినిన్, కైకొనన్ = పరిగ్రహించినప్పుడు, చెనకు = ఎదిరించినట్టి, రాజకుమారులపాటు ఎఱుంగమే = రాజకుమారులుపడిన దురవస్థలు (మనము) ఎరుగమా ?: రిపు = శత్రువుల, చమూపులన్ = సేనానాయకులను, కన్నపుడు = చూచినపుడు, అక్కిరీటికిన్ = ఆ అర్జునునకు, మూఁపులు = (రెండు) భుజములు, మూడగున్ = మూడు అగును (మూడు అయినట్లుగా కానవచ్చును అనగా అత్యధికమైన ఉత్సాహము కలుగును.)

*విశేషము* :— పరాక్రమములో ఈశ్వరుడు చాలా గొప్పవాడు. ఆయన పరాక్రమము భీమపరాక్రమమని కూడా ప్రసిద్ధి. చమూ = సేన, దాని అధికారి చమూపుడు.

సుభద్రా పరిణయ సమయానికి ఇంకా ఈశ్వరుడికి అర్జునుడికి యుద్ధము జరుగలేదు. అందువల్లనే ఈశ్వరుడు కూడా నిలుపలేడు అని పద్యములో ఉంది. తరువాత ఇద్దరికి పంది విషయమై యుద్ధము జరిగినపుడు ఇందలి సత్యము రుజువైనది, ఓడిపోయిన శివుడు అప్పుడే అర్జునునికి పాశుపతాస్త్రమును బహూకరించినాడు.

పాఠాంతరము :—

"..... చ మూపులఁ గన్నపుడే గిరీటికిన్"

అలంకారము :— యమకము.

"మూలిమి లేదు గాన, ననుమానము నామదిఁ దోఁచె నప్పుడే;
బాలిక సేవసేయఁ బనుపఁగ వల దంటినిగాదె ? దానికే ?
మీలుపు గల్గు మేనమఱఁ దింతకు నాతఁడు; నైన దైనదే;
లోలత నింక నాగవలి లోపల నిష్ఠుర మేల పల్కఁగన్ ? 171

అర్థము :— "మూలిమి = పరిచయము (ఆ వచ్చిన యతి ఎవ్వరో తెలియకపోవుటచేత) లేదు కాన = లేకపోవుటచేత, అప్పుడే = ఆ సన్యాసి వచ్చిననాడే, నామదిన్ = నామనస్సులో, అనుమానము తోఁచెన్ = అనుమానము కలిగినది; బాలికన్ = సుభద్రను, సేవచేయన్ = పరిచర్యచేయుటకు, పనుపన్ = నీవు ఆజ్ఞాపించినపుడు, వలదు అంటినికాదె = వద్దని అన్నానుగదా? దానికేమి = ఆ మాటకేమి (ఇప్పుడు అనవసరము అని), ఇంతకున్, అతడు, ఈలువు కల్గు = సత్ప్రవర్తన కలిగిన — ఉదారమానసము కలిగినటువంటి, మేనమఱంది (దూరపువాడు కాదు అని భావము), ఐనది ఐనదే = జరిగినదేదో జరిగినది, ఇంకన్, లోలతన్ = చాపల్యముచేత, నాగవలి లోపల, నిష్ఠురము. ఏల, పల్కఁగన్, (నాగవలిలో ఆడుకొను నిష్ఠురములు పెండ్లిని ఆపజాలవు. కావున నిష్ప్రయోజనములు. కాబట్టి పలుకకుండ ఊరకుండుటే మేలు).

విశేషము :— దీనియందు సుభద్రార్జునుల వివాహము జరిగినదనీ నాగవలి జరుగవలసియున్నదనీ, అందువలన ఇపు డేమనినా లాభములేదనీ కృష్ణుడు సూచన ప్రాయముగ అన్నకు తెలియచేస్తున్నాడు.

ద్వితీయాశ్వాసమున 118 వ పద్యములో కృష్ణుడు బలరామునితో చెప్పిన వాక్యములు :
"వయసువారును చక్కనివారు వీరు:...—"

స్మరణకు తెచ్చుకోవాలి. అందులో సుభద్రను పంపవద్దు అని నోరార చెప్పలేదు.

అలంకారము :— లోకోక్తి.

"క్రీడి సమాను లెంచఁ గలరే యిలఱేఁడులలోనఁ? దూలఁబో
నాడఁడు వైరినైన; విడనాడఁడు నెయ్యము కోపగించియుం;
జూడఁగలట్టివాఁడు; సరసుండు; సుభద్రకు హర్ష వార్ధి నో
లాడఁగ నింతకంటె ననువైన వరుం డిఁక నెవ్వఁ డివ్వలన్? 172

మరికొన్ని విశేషగుణా లున్నవాడని అర్జునుని గురించి కృష్ణుడు చెప్పుతున్నాడు.

అర్థము :— "క్రీడిసమానులు = అర్జునునితో సమానులైనవారు, ఎంచన్ = ఎంచి చూచిన. ఇలఱేడులలోన = భూమీశులలోన. కలరే = వున్నారా? (లేరు అని భావము), వైరిని ఐనన్ = శత్రువునైనను, తూలబోన్ ఆడఁడు = తక్కువచేసి పలుకడు: కోపగించియున్ = కోపముచెందికూడ, నెయ్యముణా = స్నేహమును, విడనాడఁడు = విడిచిపెట్టడు, చూడగలట్టి వాడు = మంచిఅందగాడు, సరసుండు = సరసమైన స్వభావము కలవాడు: హర్షవార్ధిన్ = సంతోషసముద్రమునందు, ఓలాడగణా = తేలియాడుటకు, సుభద్రకు, ఇంతకంటె = అర్జునునికంటె, అనువైన = తగిన, వరుండు = పెండ్లికొడుకు, ఇవ్వలణా = ఈ ప్రాంతములలో, ఇఁకణా, ఎవ్వడు?

విశేషము :— బలరాముడు ఈ వివాహానికి అంగీకరించకపోయినా అర్జునుడు అతనిని వైరివర్గములోచేర్చి తూలనాడే స్వభావము కలవాడు కాడనీ, ఒకవేళ బలరామునిపై కోపము కల్గినను స్నేహాన్ని విడనాడడనీ భావము ధ్వనించునటుల కృష్ణుడు మాట్లాడినాడు. అర్జునుడు సాటిలేనివాడు, సరసుడు, అందగాడు. అందువలన సుభద్రకు ఇంతకన్న అనువైనవాడు మరొకడు లేడని భావము. సుభద్రకు ఇది హర్షాన్ని కలిగిస్తుంది అనికూడ చెప్పాడు.

"నమ్మినవారు పాండు నృపనందను, లందఱిలోనఁ బెద్దఁగా
మిమ్మె గణించు ధర్మజుఁడు, మీ రటకుణా విజయంబు సేయ వే
గ మెదు రేఁగుదెంచి కడుఁ గన్నులఁ గప్పుకొనుం, బదుం" డనం,
దమ్ముని మాట యన్న జవదాఁటని యన్న ససంభ్రమంబుగన్. 173

ధర్మరాజాదులకు బలరామునియందుగల గౌరవ భావాన్ని గురించిగూడ ఒక మాట.

అర్థము :— "పాండునృపనందనులు = పాండురాజు కొడుకులు, నమ్మినవారు = మనలను నమ్ముకొని ఉన్నవారు; ధర్మజుఁడు = ధర్మరాజు, మిమ్మె = మిమ్ములనె, అందరిలోన పెద్దగా గణించుణా = అందరిలోను ఎక్కువగా గౌరవించును, మీరు అటకు = ఇంద్రప్రస్థమునకు, విజయంబుసేయ = దయచేసినపుడు (వచ్చినపుడు), వేగమ్మ (గా) ఎదురు ఏఁగుదెంచి = వేగముగా ఎదురుగావచ్చి, కడుణా = ఎక్కువగా, కన్నులణా కప్పుకొనుణా = మిక్కిలి గౌరవ

వముతో చూచును, పదుండు = పోడముఁరుండు", అనన్ = అని కృష్ణుడు చెప్పగా, తమ్మునిమాటయన్న = తమ్మునిమాటంటె, జనదాటని = అతిక్రమించని, అన్న = అన్నగారైన బలరాముడు, ససంభ్రమంబుగన్ = మిక్కిలి వేగముతో —

'తమ్ములటిప్ప కొనుట' - జాతీయము.

అలంకారము :— అనుప్రాసము.

## బలరామాదులు ఇంద్రప్రస్థమునకు వెళ్ళుట

గజ కంఘాణ శతాంగ పత్తి బల వర్గంబు ల్సమగ్రంబులై
భజియింపం, బితృ పౌత్ర సుహృ దాప్త శ్రేణి గూడం, బ్రియా
నుజుఁడుం దాను సమస్త వస్తు ధన సందోహంబుతో వచ్చె స
ర్వ జనానందకరంబుగాఁగ నటు లింద్రప్రస్థమున్ జేరఁగాన్. 174

అర్థము :— గజ = ఏనుగులయొక్కయు, కంఘాణ = గుర్రములయొక్కయు, శతాంగ = రథములయొక్కయు, పత్తి = పదాతులయొక్కయు, (చతురంగ) బల = సేనల. వర్గంబుల్ = సమూహములు. సమగ్రంబులై = పూర్తిగా. భజియింపఁగా = సేవించుచుండగా, పితృ = తండ్రులు, పుత్ర = కుమారులు, పౌత్ర = మనుమలు, సుహృత్ = మిత్రులు, ఆప్త = శ్రేయోభిలాషులయొక్క, శ్రేణి = వరుసలు, కూడఁగా = తమతోడరాగా, ప్రియఅనుజుఁడుఁగా = ప్రియసోదరుడు (శ్రీకృష్ణుడును), తానుఁగా (బలరాముడు), సమస్తవస్తు, ధన, సందోహముతోన్ = సమూహముతో, సర్వజన = జనులందరికిని, ఆనందకరంబుగాఁగఁగా = సంతోషము కలుగునట్లు, అటుల, ఇంద్రప్రస్థమున్, చేరఁగాఁగా, వచ్చెన్ = వచ్చెను,

అంతకుమున్నె, కృష్ణుఁడు హలాయుధుఁ దోడ్కొని వచ్చుచున్న వృ
త్తాంత మెఱింగి, కీవి మెఱయన్ నగరిం గయిసేయఁ బంచి, య
త్యంత వినీతి ధర్మజుఁడు దమ్ములుఁ దా నెదురేఁగి, రేవతీ
కాంతునకుం బ్రణామములుఁ గాన్కలుఁ జేసి యథాక్రమంబునన్;

అర్థము :— అంతకుమున్నె = ఇంద్రప్రస్థమునకు వారు వచ్చుటకు ముందే, కృష్ణుడు. హలాయుధున్ = బలరాముని, తోడ్కొనివచ్చుచున్న, వృత్తాంతము, ఎఱింగి = తెలిసినవారై, కీవిమెఱయన్ = రాచకీవి ప్రకాశించునట్లు, నగరిఁగా = రాజభవనమును, కయిసేయ = అలంకరించుటకు, పంచి = ఆజ్ఞాపించి. అత్యంతవినీతిన్ = మిక్కిలి వినయముతో, ధర్మజుడు, తాన్ = తాను. తమ్ములు, ఎదురేఁగి, రేవతీకాంతునకు = బలరామునకు,

యథాక్రమంబునన్ = క్రమపద్ధతిలో, ప్రణామములు = నమస్కారములు, జొన్కలు, చేసి = సమర్పించి —

చెలువం దెచ్చుచునుండి యీనున సునాసీరాత్మజుం డమ్మహా
బలముం జేరఁగఁ బోర, మేదుర దురాప క్రోధముం బాసి లో
నలరం, గౌఁగిటఁ జేర్చి, శంభుజ భుజాహంకార రేఖా నిర
ర్గళ మార్గ ప్రబలుఁ బ్రలంబహ బహూకారంబుగాఁ బల్కుచున్. 176

అర్థము :— చెలువన్ దెచ్చుచునుండి = సుభద్రను తీసుకొనివచ్చుచు. సునాసీర అత్మజుండు = గొప్పదైన సేనాముఖముకల ఇంద్రునియొక్క కొడుకు అర్జునుడు, ఆమహాబలమున్ = ఆయాదవసైన్యమును. చేరగ = సమీపించినపుడు, ఈసున = కోపముతో, పోరన్ = పోరిసందు వలన (బలరామునికి కలిగిన), మేదుర = అధికమైన, దురాప = సహింపరాని, క్రోధమున్, పాసి = వదలి, లోన్అలరన్ = మనస్సునందు సంతోషించునట్లు, (ధర్మరాజు), శంభుజ = శివుని కొడుకు ఐన కుమారస్వామియొక్క, భుజాహంకార = బాహుపరాక్రమముయొక్క, రేఖా = విలాసముగలిగి, నిరర్గళ = అడ్డులేని, మార్గ = వైఖరిచేత, ప్రబలున్ = ప్రబలుడైనవాని, ప్రలంబ హున్ = ప్రలంబుడను రాక్షసుని సంహరించిన బలరామునితో, బహూకారంబుగాన్ = గౌరవముతో, పల్కుచున్, కౌఁగిటన్చేర్చెన్ = కౌగలించుకొనెను.

తాత్పర్యము :— యాదవసైన్యముతో అర్జునుడు పోరిసందువలన బలునికి కలిగిన క్రోధమంతయు పోవునట్లు ధర్మరాజు బలరాముని సగౌరవముగా కౌగలించుకొనెను,

విశేషము :— ఈ పద్యములో నాలుగు చరణములందు క్రమముగా 'సునసునా', 'దురదురా', 'భుజభుజా' 'బహుబహూ' అను శబ్దాలంకారములను యతిస్థానమునకు ముందుగా కవి వాడెను. ఈ జంటలలో రెండవ పదము చివరను దీర్ఘముండుట మనోహరము.

పాఠాంతరము :—'నిరర్గళమార్గ ప్రబహున్ బ్రలంబహు బహూకారంబుగా పల్కుచున్' అని కలదు. ప్రబహున్ అనగా మిక్కిలి అధికుడైనట్టి, ఈ పాఠములో మరియొక 'బహు' దొరకును నిజమే కాని పైన చెప్పిన జంటలయందుగల ప్రక్రమమునకు భంగము కలుగును.

అలంకారము :— అనుప్రాసము.

బావ యటంచు వావినడుపన్; భయభక్తుల మ్రొక్కవచ్చు న
ద్దేవకిపట్టి ధర్మజుఁ డతిత్వరితంబుగ గ్రుచ్చియెత్తి, త
ద్భావ మెదం గుదుర్పడఁగఁ దార్చిన భంగిఁ గవుంగిలించి 'మా
కీవ గదయ్య సర్వ శుభ హేతువు విచ్చలు' నంచు నెంచుచున్, 177

ఈ పద్యములో ధర్మరాజు కృష్ణుని సంభావిస్తున్నాడు.

అర్థము :— (ధర్మరాజును) చూపయటంచు, వానినడుపఁగ = వరుసనడుపుటకు, భయ భక్తులతో మ్రొక్కన్, వచ్చుచున్న, ఆదేవకీపట్టిఁగ = ఆకృష్ణుని, ధర్మజుడు, అతిత్వరితంబుగ = వెంటనే అనగా కృష్ణుడు తన పాదముల సంటకముందే, గ్రుచ్చియెత్తి = అదిమిపట్టి లేవదీసి, తద్భావము = తన అభిప్రాయము, ఎదఁగ = (కృష్ణుని) హృదయమునందు (ప్రవేశించి), కుదుర్పదఁగ = కుదురుకొనునట్లు, తార్చినభంగిఁగ = హత్తినవిధముగ (గాఢముగ) కవుంగి లించి, 'మాకు = పాండవులకు, నిచ్చలుఁగ = ఎల్లప్పుడును. సర్వశుభహేతువు = సకలశుభము లను కలిగించువాడవు, ఈవ = నీవె, చదయ్య' అంచున్, ఎంచుచుఁగ = పొగడుచుఁగ —

విశేషము :— తనకున్న ఈ అభిప్రాయము కృష్ణుడి హృదయములోనికి ప్రసరించు నట్లు అనగా అచ్చొత్తినట్లు గాఢముగా ఆలింగనము చేసుకొని అని భావము.

అలంకారము :— స్వభావోక్తి

కెడల బలరామ కృష్ణులు, నడుమఁ దాను,
భద్రదంతావళము నెక్కి పాండవేయ
ముఖ్యుఁ డతిరాజసంబున మువ్వెలుంగు
పోలిక దొసంగ వచ్చెను ప్రోలి కపుడు. 178

అర్థము :— కెడలఁగ = పార్శ్వములందు, బలరాముడును, కృష్ణుడును, నడుమతాను (ధర్మరాజు)' భద్రదంతావళము = భద్రజాతి ఏనుగును, ఎక్కి, పాండవేయముఖ్యుడు = ధర్మ రాజు, అతిరాజసంబున = ఉక్కలి తీవితో, మువ్వెలుంగు పోలిక = మూడు వెలుగులవలె, దొసంగఁగ = ఒప్పునట్లు, ప్రోలికి = పురమునకు, అపుడు, వచ్చెను.

విశేషము :— మువ్వెలుంగు = బ్రహ్మవిష్ణుమహేశ్వరులవలె - బ్రహ్మవలె ధర్మ రాజు పసుపువన్నె వాడు; విష్ణువలె కృష్ణుడు నల్లనివాడు. శివునిలాగ బలరాముడు తెల్లనివాడు.
కొందరు సూర్య చంద్ర అగ్నుల వలె అని అన్నారు.

అలంకారము :— ఉత్ప్రేక్ష, అనుప్రాసము

అంతిపురంబులో నరిగి, అందఱు వందన మాచరింప నా
కుంతికి మ్రొక్కి, భక్తిఁ దమకుం బ్రణమిల్లిన ద్రౌపదీ సతిన్
స్వాంతము రంజిలం బలికి శ్యామ హరిత్ పరిధాను లొప్పి రం
తంతకు నిష్టబాంధవ సమాగమ సౌఖ్యమునన్ జెలంగుచుఁగ, 179

అర్థము :— అంతిపురంబులోఁ అరిగి = అంతిపురంబులోనికి వెళ్లి, అందఱు = అక్కడి వారు, తమకు వందనము ఆచరింప, ఆకుంతికిన్ మ్రొక్కి = (బలరామకృష్ణులు) కుంతికి నమస్కరించి, భక్తిఁ = భక్తితో, తమకున్ = తమకు. ప్రణమిల్లిన = నమస్కరించిన, ద్రౌపదీసతిన్ = ద్రౌపదితో, స్వాంతమురంజిలఁ = మనసు సంతోషించుచున్నట్లు, పలికి = మాటలాడి, శ్యామ = నల్లనైనది, హరిత్ = పచ్చనైనది, పరిధానులు = వస్త్రములు ధరించి, బలరామకృష్ణులు (బలరాముడు కృష్ణచేలుడు, కృష్ణుడు పీతాంబరుడు అను పేర్లు కలవారు). అంతంతకు = క్రమముగా, ఇష్ట = ఇష్టులైన, బాంధవ = బంధువులయొక్క, సమాగమ = కలయిక వలని, సౌఖ్యమునఁ = ఆనందముతో, చెలంగుచున్ = ప్రకాశించుచు, ఒప్పిరి.

పాఠాంతరము :—

"అంతిపురంబులోనరిగి, యన్నకు వందనమాచరించు నాకుంతికి...." అని.

అన్నకు అనగా వసుదేవునకు కుంతి వందనము చేయుచున్నది. ఆ కుంతికి బలరామ కృష్ణులు నమస్కరించుచున్నారు- ఆ బలరామకృష్ణులకు ద్రౌపది మ్రొక్కుచున్నది. ఈ విధముగ మూడు మ్రొక్కులుండుట మనోహరమే కాని ఈ ఘట్టమున ప్రధానముగ బలరామ కృష్ణులే కనుపిస్తున్నారు కావున వసుదేవుని ప్రసక్తి తెచ్చిపెట్టినట్లుండును.

ద్రౌపదికి సవతి వచ్చిన చింత కనబడని రీతిగా మాటలాడిరి అని ధ్వని.

దొర వెట్టిన హరు వెట్టిదొ ః
యరు దాహా ః విడుదు లున్న హావణిక లులుపా
పరిభవము : నింద్రభోగమె
దొరకెం దమ కనని వారు తుదిలే రొకరున్. 180

అర్థము :— ఆహా ః, దొర = ధర్మరాజు, పెట్టిన = చేసినటువంటి, హరువు = ఏర్పాటు, ఎట్టిదొ ః,(అనగా ఆశ్చర్యకరమైనది) విడుదులు = బసలలో, ఉన్న, హావణికలు = అందములు, ఉలుపా = కానుకలయందలి, పరిభవము = విభవము - ఐశ్వర్యము; అరుదు ః ఇంద్రభోగమె = అత్యంతమైన సౌఖ్యానుభవము (ఇంద్రుని భోగము సుప్రసిద్ధము), దొరకెను తమకు, అని, అననివారు, తుదిన్ = చివరను అనగా మరలిపోవునపుడు, ఒకరుఁ, లేరు.

అందరును ఇంద్రభోగమును అనుభవించినట్టు సంతోషించినారు.

వీయము వారికి నిట్లు ద
వీయముగా నుండి వచ్చు విపుల శ్రమముల్
దీయ, ముదం బొనరిచి, కడుఁ
దీయము కనిపింపఁగా యుధిష్ఠిరుఁ డనియెన్. 181

అర్థము :— దవీయముగానుండి = దూరదేశమునుండి, వచ్చుట వలన కలిగిన, విపుల శ్రమముల్ = ఎక్కువైన ఆయాసము, తీయన్ = పోవునట్లుగా, వీయమువారికి = వియ్యాల వారికి, ఇట్లు = ఈ విధముగ, ముదంబు = సంతోషము, ఒనరిచి = కలిగించి, కడున్ తీయము కనిపింపగా = ఎక్కుడు ప్రేమ కనిపించునట్లు, యుధిష్ఠిరుడు = ధర్మరాజు, అనియెన్-

అలంకారము :— యమకము.

"చనవున బలిమిం గన్నియఁ
గొనివచ్చి వివాహ మౌటకు స్వతంత్రులఁగాఁ
నొనరించి నార మము; ని
ట్లనుకూలత గల్గు బంధు లవనిన్ గలరే? 182

అర్థము :— చనవునన్ = చనువు ఉండుటచేత, బలిమిన్ = బలాత్కారముగ, కన్నియన్ కొనివచ్చి, వివాహము అవుటకు, స్వతంత్రులన్ కాన్ = సాహసించువారినిగా, మము, ఒనరించినార = మీరే చేసినారు. ఇట్లు అనుకూలత, కలుగు, బంధులు = బంధువులు, అవనిన్ = భూమియందు, గలరే? (అనగా లేరు అని)

మాకు మీరిచ్చిన చనవును ఆధారముచేసుకొని అర్జునుడు సుభద్రను బలిమిని తీసుకొని రాగలిగినాడు. దానిని మీరు అంగీకరించినారు. మీవలె అనుకూలురైన బంధువులు ఇంకొక రున్నారా అని ధర్మరాజు చమత్కారముగా సమర్థించినాడు.

"ఆదినారాయణుండు వీ డీ మురాసురారి;
యురగ కులభూషణుండ వీ; వరసిచూడ.
నిట్టి మీ బాంధవము గల్గ నెట్టి తపము
సేసినారమొకో మేము సీరపాణి" 183

పై పద్యములో భూమియందు లేరని చెప్పి, కృష్ణబలరాములున్నారు గదా అని ఆశంకించి వారు దివిజులు అని ఈ పద్యములో చెప్పుచున్నారు.

అర్థము :— అరసిచూడన్ = శ్రద్ధగాచూచినయెడల, (నిజము తెలుసుకొన్నచో), ఈ మురాసుర అరి = మురుడను రాక్షసుని చంపినవాడగు ఈ కృష్ణుడు. ఆదినారాయణుండు = సాక్షాత్తు విష్ణుమూర్తి; ఈవు = నీవు, ఉరగ = నాగులయొక్క, కుల = వంశమునకు, భూష ణుండవు = భూషణమైన ఆదిశేషుడవు; సీరపాణి = ఓ హలాయుధుడా, ఇట్టి మీబాంధవము = ఇటువంటి (దివిజుల) చుట్టరికము, కల్గ = కలుగుటకు, మేము, ఎట్టి, తపము, చేసినారమొకో.

గొప్ప తపము చేసిననే తప్ప ఇట్టి దివిజసంబంధము ఇతరులకు దొరకదని భావము.

## ఇంద్రప్రస్థమున వైవాహికోత్సవము

అని ప్రియ భాషణంబుల మనోబ్జము రంజిలఁజేయ; సంభ్రమం
బున హలి 'సర్వసన్నహనమున్ దగ నిట్లెదురేఁగి పెండ్లి సే
సిన దొర యెందు లేఁ' డనఁగఁ, జెల్లెలి ముద్దుమఱందిఁ గోరికల్
పెనగొనఁ బెండ్లి కూఁతుఁగను బెండ్లికుమారుఁగఁ జేసి వేడుకన్. 184

అర్థము :— అని = ఈ ప్రకారముగ, ప్రియభాషణముల = మంచి మాటలతో, మనః అబ్జముల్ = (బలరాముని) హృదయకమలము, రంజిలచేయగా = సంతోషించునట్లు చేయగా, హలి = బలరాముడు, సంభ్రమంబునన్ = సంతోషముతో, 'సర్వసన్నహనమున్ = సకలమైన ఏర్పాట్లును, తగన్ = ఒప్పునట్లుగా, ఇట్లు ఎదురేగి, పెండ్లిసేసిన దొర, ఎందులేడు. అని,' (జనులు) అనుకొనునట్లు, చెల్లెలిని, ముద్దుమఱందిని, కోరికల్ = ఆశలు, పెనగొనన్ = పెనవేసుకొన్నట్లు, పెండ్లికూతురుని, పెండ్లికుమారుని చేసి, వేడుకన్ = ఉత్సాహముతో

ఆడపెళ్లివారు వరుడి యింటికి వచ్చి పెండ్లిచేయడమే ఎదురేగి చేయడము.

అలంకారము :— క్రమాలంకారము.

సకల వాద్యములు బోరుకలంగ నెడమీక
నలుఁగులు నులుపాలు నడుచుచుండ,
నిఖిల బాంధవ రాజనికరంబు మేలైన
యుడుగరల్ గొనివచ్చి పొడగనంగ,
నాశ్రిత విద్వత్కవి శ్రేణులు యథేష్ట
సంభావనలఁ జాల సంభ్రమింప,
విందులఁ గర్పూర వీటి కాంబర వసం
తముల నెల్ల జనంబు తనివి నొందఁ,
బ్రియము వినయంబు దాల్మి యోపికయుఁ గల్గి,
'యచ్యుతాగ్రజ భీమసేనాగ్రజన్ము
లెంతటి మహాత్ము' లని జగం బెన్నఁ, జేసి
రుచితగతి నొప్ప వైవాహికోత్సవంబు'. 185

అర్థము :— ౧. సకల వాద్యములు = అన్ని విధములైన వాద్యయంత్రములు, బోరుకలంగన్ = మ్రోగుచుండగా, ఎడమీక = ఎడతెగకుండా, నలుఁగులు = శుభకార్యాలు చేయు

వారికి మర్యాదకొరకు సమర్పించిన వస్తువులు, ఉలుపాలు = కానుకలు, నడుచుచుండ = నలుగులు — ఉలుపాలు విరామము లేకుండా కావళ్లు - పళ్లెములతో వచ్చుచుండగా —

౨. నిధిని = నర్వ, బాంధవరాజ = రాజబంధువుల, నికరంబు = సమూహము; మేలైన = శ్రేష్ఠమైన, ఓడుగరలు = చిహ్నములు, కొనివచ్చి, పొడగనంగ = దర్శనముచేయు చుండగా -

౩. ఆశ్రిత = ఆశ్రయించుకొనియున్న, విద్వత్ కవి = పండితులయొక్కయు - కవుల యొక్కయు, శ్రేణులు, యథేష్ట = అత్యధికమైన, సంభావనలు = సత్కారములచేత, చాల సంభ్రమింపగా = ఎక్కువగా సంబరము పడుచుండగ —

౪. విందులగా = విందులచేతను, కర్పూరవీటికా = పచ్చకర్పూరముతోడి తాంబూలాల చేతను, అంబరి = వస్త్రములచేతను, వసంతములగా = వసంతములు చల్లుకొనుటచేతను, ఎల్లజనులు = సమస్తమైన జనులు, తనివినొందగా = తృప్తినొందుచుండగా —

ప్రియము, వినయము, తాల్మి = ఓరిమి, ఓపిక = విసుగు - అలసత్వములేనిగుణము, కలిగి, అచ్యుత అగ్రజ = కృష్ణుని అన్నయయిన బలరాముడు, భీమసేనాగ్రజన్ముడు = భీమ సేనుని అన్నయైనధర్మజుడు, (వీరిద్దరును) ఎంతటి, మహాత్ములు = గొప్పవారు, అని జగంబు ఎంచగా = అని లోకము అనుకొన, ఉచితగతి ఒప్ప = క్రమపద్ధతితో, వైవాహిక = వివాహ సంబంధమైన, ఉత్సవము, చేసిరి,

అసలు వివాహము ఇంతకు ముందే జరిగినది కావున ఈ ఉత్సవము దానికి సంబంధించి నది అని అభిప్రాయము.

*విశేషము* :— నలుగులు = శుభకార్యములు జరుగునప్పుడు బంధుమిత్రులు మర్యాద కొరకు పళ్లెములతోను, కావళ్లతోను తీసుకొనివచ్చు ఫలములు - పసుపు కుంకుమ, వస్త్రములు- భూష్యములు మొదలైనవానిని తమిళములో - ఇప్పుడుగూడ - 'నలుంగు' అని చెప్పుతారు, అదియే ఈ పద్యమునందలి 'నలుగు'. దీనికి స్నానమునకు ముందు రాసుకొను నలుగు కిందికి సంబంధములేదు.

అంతట నైదునాళ్లను మహామహిమం దగి, దంపతుల్ గృహా
భ్యంతర దేవతార్య నతులై తన కర్మిలి మ్రొక్క, రుక్మిణీ
కాంతుఁడు పల్కె తేనగవు గ్రమ్మఁగ 'మీరిటు లెల్లకాలముగా
మింతురు గాక శోభనము మీఁదనె శోభనమై ముదంబునన్' 186

అర్థము :— అంతట = ఆ తరువాత, ఐదునాళ్ళును = ఐదుదినములను, మహా మహిమంబున = ఎక్కుడు వైభవముతో, తగి = ఒప్పుచు, దంపతుల్ = వధూవరులు, గృహ అభ్యంతర = ఇంటిలోపలి భాగమున, దేవత = దేవతలకును, ఆర్య = పెద్దలకును, నతులై = నమస్కరించినవారై, తనకు = కృష్ణునకు, అర్మిలిన్ = ప్రేమతో, మ్రొక్కన్ = నమస్కరించగా, రుక్మిణీకాంతుడు = కృష్ణుడు, లేనగవు = లేతనవ్వు, క్రమ్మగన్ = కనుపించునట్లుగ, 'మీరు, ఇటులె = ఈవిధముగనే, ఎల్లకాలమును, శోభనముమీదనె శోభనమై = శుభము వెంట శుభము కలుగ (శుభములు దొంతరలగునట్లు), ముదంబునన్ = సంతోషముతో, మింతురుగాక (మించుదురుగాక) = అతిశయింతురు (జీవింతురు) గాక". (అని), పల్కె = పలికెను.

విశేషము :— ద్వారకలో వివాహము జరిగినది, వెంటనే ఇక్కడ ఈ వైవాహికోత్సవము జరుగుటవలన శోభనముమీద శోభనము అని చమత్కారము.

అని దీవించిన, లోలో
ననె ముసిముసినవ్వు లొలయ నమ్రాననులై
తనరిరి వారా మాటకుఁ
బున రభివాదనము చేయు పోల్కి జనింపన్. 187

అర్థము :— అని దీవించినన్ = కృష్ణుడు ఆశీర్వదించగా, లోలోననె = బయటకి కానరాకుండ, ముసిముసినవ్వులు = దరహాసములు, ఒలయన్ = ప్రకాశించగా, వారు = వధూవరులు, ఆమాటకు = కృష్ణుని పలుకులకు, పునః = మరల, అభివాదనము = నమస్కారము, చేయుపోల్కి = చేయువిధము, జనింపన్ = కలుగునట్లు, నమ్ర ఆననులు ఐ = వంచిన ముఖములు కలవారై, తనరిరి = కనబడిరి.

విశేషము :— వధూవరులు నమస్కరించగా కృష్ణుడు ఆశీర్వదించెను. కృష్ణుని మాటలకు ముసిముసి నవ్వులు నవ్వుతూ తలలువంచుకొన్న వధూవరులు ఆశీర్వాదముపొందినందుకు నమస్కరిస్తున్నట్లు కనబడిరని కవి చమత్కరిస్తున్నాడు.

అలంకారము :— ఉత్ప్రేక్ష.

తొలఁకెడు ప్రేమ బందుగులతో మణిపాత్రికలందు నప్పుడు
జ్జ్వల దమృతాన్నముల్ కొలముసామికి నప్పన గాఁగఁ బండు వె
న్నెల బయలన్ భుజించి, నెఱనీ తెసఁగన్ సగపాలు గంబురా
గులికిన కమ్మవీడె మొక కోమలి యూఁ గొని, క్రీడి వేడుకన్. 188

అర్థము :— తొలఁకెడు ప్రేమ = అతిశయించుచున్న ప్రేమచే, బంధుగులతో (కలిసి), మణిపాత్రికలందు = మణులతో చేయబడిన గిన్నెలయందు, అప్పుడు, ఉజ్జ్వలత్ = ప్రకాశించు చున్న, అమృతఅన్నముల్ = పరమాన్నములను (అనేక విధములగు పాయసములను), కొలముసామికి = వంశపు మూలపురుషు డగు చంద్రునకు, అప్పనగాఁగఁ = అర్పించు నైవేద్యము అగునట్లు, పండువెన్నెల బయలఁ = పండువెన్నెలలు నిండిన ఆరుబయట, భుజించి (అర్జునుడు) నెఱనీటు ఎసఁగన్ = పరిపూర్ణమైన ఒయ్యారము కలుగునట్లు, ఒకకోమలి = ఒక చెలికత్తె, సగ (ము) పాలు = సగముభాగము, గంబుర = పచ్చకర్పూరము, గులికిన = చేర్చిన, విస్మ(ని), పీడెము = తాంబూలము, ఈఁ = ఈయగా, కొని = తీసుకొని, క్రీడి = అర్జునుడు, వేడుకఁ = సంతోషముతో —

విశేషము :— నిండుపెన్నెలలో ఆరుబయట అర్జునుడు బంధువులందరితో కలసి పర మాన్నము భుజించుట ఎదురుగా ప్రకాశించుచున్న కొలముసామి చంద్రునికి నైవేద్యమును అర్పించుచున్నట్లుగా ఉన్నదని భావము.

స్త్రీల తాంబూలములో వేసిన పచ్చకర్పూరములో సగమే పురుషుల తాంబూలములలో వేయుట ఆ రోజులలో ఆచారము. ఈ భావమునే మనుచరిత్రయందు —

"మృగమద సౌరభ విభవ ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ
స్థగితేతర పరిమళమై మగువ మోలుపు తెలుపు నొక్క మారుత మొలసెన్"

అని పెద్దన సూచించాడు.

అలంకారము :— ఉత్ప్రేక్ష.

## కేళీగృహ వర్ణన

చందురు జాతి చాగదపు జంటబవంతి వెడంద యంకణం
పుం దగు లూని పార్శ్వమునఁ బొల్పగు పల్వగ కెంపు టంచుఁ డా
కుం దెలి గుండు కంబములఁ గ్రొంజిగి బోదెల నందగించి పై
సందుల బంచవర్ణమణి జాలకముల్ రహిఁ జూపఁ లోపలఁ. 189

మనవి :— ఈ పద్యములో దంపతుల కేళీగృహ వర్ణన కవి చేస్తున్నాడు. ఆనాడు తంజావూరు మందిర నిర్మాణములలో ఉపయోగించే పారిభాషిక పదాలు చాలా వాడుక చేశాడు. ఈనాటి మన కవి చక్కగా అర్థంకావు. అందుచేతనే నోరి గురులింగశాస్త్రిగారు తన వ్యాఖ్యా నములో

"ఈ పద్యమునకు సరియగు నర్థమును బుద్ధిమంతుడే యూహించుకొనగోరు చున్నాడను"

అని ప్రకటించారు. వేదమువారు కొంత శ్రమతీసుకొని ఈలాగు వ్యాఖ్యానించారు,—
"చంద్రకాంతమణుల కట్టడముగల బవంతిచుట్టును కట్టిన పైబవంతియొక్క విశాలమైన ముంగిలియొక్క సంబంధమును పొంది, ప్రక్కలయందు చక్కనైన అనేక విధములైన కెంపులతో చేసిన బవిరిటాకులు గలిగిన తెల్లని గుండ్రని స్తంభముల యందలి నూతన కాంతులుగల బోదెలచేత సొగసుగలదై, మీది సందులయందు తెలుపు నలుపు ఎరుపు పసుపు ఆకుపసరు వన్నెలుగల రత్నములతో (చేయబడిన) కిటికీలు అందము గనబరుచుచుండగా ఆ లోగిటిలోపల" అన్నారు.

ఏమయినా, వ్యర్థప్రయాస అని ఇంతకంటే ఎక్కువ వ్రాయలేదని మనని చేస్తున్నాము.

బంగరు మేలి కంబములఁ బాటిలు వాటపు మధ్య రంగమున్
జెంగట జీవరత్నముల చెక్కడపుంబని మించు నెజ్జయిల్,
ముంగల వజ్రపుం బలుక లోప పొసంగిన నొప్పు చప్పర
మ్ముం, గల భావచిత్ర నవమోహన కేళిగృహాంతరంబునన్. 190

అర్థము :— బంగరు మేలికంబముల = బంగారముతో చేయబడిన మంచిస్తంభములతో, పాటిలు = ఒప్పుచున్న, వాటపు = అందముగానున్న, మధ్యరంగమున్ = భవంతి నడుమ ప్రదేశమును; చెంగటన్ = సమీపములో, జీవరత్నముల = జాతిరత్నములయొక్క, చెక్కడపుంబని = తాపడపు పనితనముచేత, మించు = అతిశయించునట్లి, నెజ్జయిల్ = పడరిటిల్లును; ముంగల = ఎదుటి = దానిముందు, వజ్రపుం బలుకలోపన్ = వజ్రముల పలకలచేత తీర్చిన చూరుపట్టె, పొసంగినన్ = కలుగుటవలన, ఒప్పు, చప్పరమున్ = పందిరియు, గల = ఉన్న, భావచిత్ర = శృంగారభావములతో కూడిన చిత్తరువులచే, నవమోహన = క్రొత్త ఆకర్షణగల కేళిగృహా అంతరంబునన్ = క్రీడాగృహము లోపలి భాగమందు —

కెలఁకుల వజ్రముల్, నడుమఁ గెంపులు, మూలల ముత్తెముల్, పర
స్థలములఁ బచ్చలుం, దగిన తాపడపుం బని హర్మ్య నందమున్
వెలయఁగఁ, దేఱిచూడఁ గడువింతయి, కోటికిఁ గోటి యైననున్
విలువ యొనర్పరాని యొక నిద్దపు మంచము పై వసింపఁగన్. 191

ఈ పద్యమున కవి పడక మంచమును వర్ణించుచున్నాడు.

అర్థము : కెలకుల = ప్రక్కలయందు, వజ్రములు, నడుమన్, కెంపులు, మూలలన్, ముత్తెముల్, పరస్థలములన్ = ఇతర స్థలయందు, పచ్చలున్, తగిన = వాటికి అనుగుణమైన, తాపడపుం బని = రత్నములను తాపు (కట్టడపు) పనియందలి, హర్వున్ = నేర్పరితనము, అందమున్, వెలయగన్ = ప్రకాశించగాఁ తేటిచూడన్, కడున్, వింతఅయి = ఆశ్చర్యమును గొలుపుచు, కోటికి = ఒక్కొక్క మంచము కోడుకు, కోటియైనను = కోటివరహాలనైనను, విలువ యొనర్పరాని = ధరకట్టరాని (ఒక్కొక్క కోడు కోటి వరహాల కంటెను విలువైనదని భావము). ఒకనిడ్డపు మంచముపై = ఒక నునుపైన మంచముపై, వసియింపగన్ = కూర్చొని ఉండగా —

పాఠాంతరము :—

> "తెలఁకుల వజ్రముల్, నడుమఁ గెంపులు, మూలల ముత్తెముల్ పర
> స్థలముల పచ్చలున్ సుషవు జాతి తగన్ బని హర్వునందమున్"

వేదమువారు "సుషవుజాతి". 'తీగమోళా' (తీగల అల్లికపనితనము) అని చెప్పినారు.

అలంకారము :— అనుప్రాసము, అతిశయోక్తి.

> గోవ జవాది కస్తురియుఁ, గుంకుమ, గంధము, పైఁడి గిన్నెలన్
> దావి బుగుల్కొనం గెలనఁ దార్చిరి; పంజర కీరశారికల్
> 'దేవ, పరాకు సామి' యని తెల్పఁగ - రత్నపుఁ గీలుబొమ్మలే
> కావలెఁ-గొంద అందు నుడిగంపు టొయారపు ముద్దుజవ్వనుల్. 192

అర్థము :— గోవజవాది = గోవానుండి తెచ్చిన జవాది, కస్తురియు, కుంకుమ పువ్వు, గంధము = చందనమును, పైడిగిన్నెలన్ = బంగారు గిన్నెలలో, తావి = వాసన, బుగుల్కొనన్ = అలుముకొనగా, కెలనన్ = పార్శ్వమునందు (మంచముప్రక్కన), పంజర (ములయందున్న), కీరశారికల్ = చిలుకలు - గోరువంకలు, 'దేవ, పరాకు సామి' (ఈ పక్షులు మాట్లాడ గలిగినవి). అని, తెల్పగన్ = పలుకుచుండగ, కొందరు, అందు = ఆ గదియందు, ఉడిగంపు = ఊడిగము చేయుచున్న (పరిచర్యలు చేయుచున్న), ఒయారపు = విలాసపు. ముద్దుజవ్వనుల్ = అందమైన యువతులు, రత్నపు కీలుబొమ్మలే కావలె = రత్నములతో నిర్మించిన కీలుబొమ్మలే అని అనుకొనునట్లు, తార్చిరి = పెట్టిరి.

అలంకారము :— భ్రాంతి.

అందలి క్రొందలిరుం బోం,
డ్లందలి కందళిత శుక ముఖాలాప రసం,
బందలి నుం దలిమంబులు,
నందలి బొందళపుఁ దెరలు నవలం గలవే! 193

అర్థము :— అందలి = ఆ పడక గదియందలి, క్రొత్తలిరుంబోండ్లు = క్రొత్త చిగురువంటి శరీరముకల చెలికత్తెలు, అందలి, కందళిత = చిగిర్చిన, శుక = చిలుకలు, ముఖ = మొదలైనవాటియొక్క. ఆలాప = పలుకులయందలి, రసంబు = స్వారస్యమును, అందలి, నుఱతలిమంబులు = నున్ననయిన పాన్పులు, అందలి, బొందళపు = చుట్టునున్న, తెరలును = దోమతెరలవంటివి - వీనినే పారిజాతాపహరణమున 'అపరణాంశుకము' అని ముక్కు తిమ్మన్న పేర్కొన్నాడు. అవలం కలవే ! = వేరు ఏచోటనైనను కలవా ? బొంద ళము = కవచము.

*పాఠాంతరము :—*

"......అందలిబొందళ(ది తెరలు......". అని. బొందు ఆళది తెరలు = బొందుతో అంచులు కుట్టిన పసుపువన్నెగల తెరలు అన్నారు.

వేదమువారు 'బొందికగల పసుపుపచ్చరంగుగల' అని వ్యాఖ్యానించారు. ఇక్కడ పసుపు వన్నెయొక్క ఉపయోగము కానరాదు.

*అలంకారము :* అనుప్రాసము.

చక్కఁదనంబు లెల్ల నొకచక్కినె దొంతరగాఁగ నిల్చెనో,
యెక్కడఁ జూడఁ జూడ్కి కదియే విడిపట్టగుఁ; జూడఁజూడఁ గా
మిక్కిలి వింతయై మెఱయు; మెచ్చులకుఁ నెల వీ దొకింత ! య
మక్క ! గణింపఁగా దరమె యీ పడుకింటి విలాస సంపదల్ ? 194

అర్థము :— చక్కదనంబులు, ఎల్లన్, ఒకచక్కినె = ఒక ప్రదేశముననె, దొంతర గాఁగ = ప్రోగుగా, నిల్చెనో, ఎక్కడచూడఁ = ఎక్కడచూచినను, చూడ్కికి = దృష్టికి, అదియే, విడిపట్టు = ఆకర్షించుస్థానము-నిలుచునట్టి స్థానము (అనగా దృష్టిని అచట నుండి కదలనీయదు) అగుఁ; చూడచూడగాఁ = పదేపదే చూడవలసినట్లుగ, మిక్కిలి వింతయై = మిక్కిలి అద్భుతముగ, మెఱయు = ప్రకాశించును; మెచ్చులకున్ = మెచ్చుకొనుటకు గూడ, ఒకింత = కొంచెమైనను, నెలవుఈదు = అవకాశము ఈయదు ; (అనగా వాక్కులకు

కట్టివేయును), అమ్మక్క = ఓహోహో, ఆ పడుకింటి, విలాస, సంపదల్, గణింపగాన్ = లెక్కించుటకు, తరమె = శక్యమా!

ఒక దానిని మించి ఇంకొకటి అద్భుతముగ ఉండుటవలన దేనిని మెచ్చుకొనుటకును అవకాశము కలుగదని భావము.

*అలంకారము :—* అతిశయోక్తి.

ఉండె నరపతి యందు మే నుబ్బుచుండ,
నఖిల సామ్రాజ్య మేలిన యంతవేడ్క;
రమ్యమగు నిల్లు మేలైన రాజముఖియుఁ
గలిగె నఁట, యంతకన్న భాగ్యంబు గలదె? 195

*అర్థము :—* అఖిలసామ్రాజ్యము = సమస్తమైన సామ్రాజ్యమును, ఏలిన = పరిపాలించిన, అంత, వేడ్కన్ = వేడుకతో, మేనుఉబ్బుచుండ = శరీరము పొంగుచుండగా, అందు = ఆగదిలో, నరపతి = అర్జునుడు, ఉండెన్ = ఉండెను; రమ్యమగు ఇల్లు = అందమైన ఇల్లు, మేలైన = అన్నివిధాలా శ్రేష్ఠమైన, రాజముఖియు = చంద్రునివంటి ముఖముకల కాంతయును, కలిగెనట = సమకూరినది అన్నచో, అంతకన్న = అంతకంటె, భాగ్యంబు కలదె = అదృష్టమున్నదా (కావున అర్జునుడు సామ్రాజ్యమేలినంత వేడుకతో ఉండుటలో ఆశ్చర్యములేదు.)

అంతటఁ బ్రౌఢ సఖీతతి
కాంతామణిఁ గాంతు కడకుఁ గదియించుటకై
వింతగ మోమునఁ జిఱునగ
వింత గనంబడఁగ ముదిత హృద యాంబుజలై. 196

*అర్థము :—* అంతట = ఇంతలో, కాంతామణిన్ = స్త్రీలలో రత్నమువంటిదైన సుభద్రను, కాంతుకడకున్ = భర్తదగ్గరకు, కదియించుటకై = చేర్చు ఉద్దేశముతో, ప్రౌఢసఖీతతి = ప్రౌఢలైన చెలికత్తెల సమూహము, వింతగ-ఆశ్చర్యము కలుగునట్లు, మోమునన్ = ముఖమునందు, చిరునగవు, ఇంత = కొంచెము, కనంబడఁగన్, ముదిత = సంతోషించిన, హృదయ అంబుజలు ఐ = హృదయ పద్మములు కలవారై

"జడకుచ్చు, గైకొమ్ము, ముడువు చేడియ విరుల్,
పేరలిపట్టిన వీడకుండఁ;

జేర్చుకొ సతి యింద, తీర్చుము తిలకంబు,
గస్తూరి చెమటచేఁ గరఁగకుండఁ;
గొను జంట రవిక, కుంకుమగంద మలఁదు మో
చెలి యెంత యొరసినఁ జిటులకుండ;
మొలనూ లిదిగొ బోటి, చలువ హొందుగఁ గట్టు
సయ్యాటలనె నీవి సడలకుండ;
తరుణి కివి యిచ్చుఁగద మెచ్చుఁ దప్ప," కనుచు,
నేరుపరులైనవారిఁ గా నేరు పఱుపఁ,
గాంతనవసంగ మార్హ శృంగార విభవ
లీలనలరించి రాజవరాలి నపుడు. 197

కొందరు చెలికత్తెలు సుభద్రను అలంకరిస్తున్నారు. మరికొందరు (గడుసువారు) వారికి తగిన సలహా లిస్తున్నారు. ఈ సలహాలనుబట్టి ఆ దంపతుల రహఃక్రీడలు ఏలాగుంటాయో కవి చమత్కారంగా తెలియజేశాడు.

అర్థము :— ౧. చేడియ = చెలి, జడకుచ్చుగా, రైకొమ్మ = తీసికొనుము, పేసరి = జడ, పట్టినగా = భర్త పట్టినప్పటికిని, వీడకుండగా = వీడిపోకుండా (ఉండునట్లు) విరుల్ = పూవులు, ముడువు = కట్టు;

౨. సతి = ఓచెలి, చేర్చుకొ ఇంద = పాపటబొట్టు, ఇదిగో, కస్తూరి- చెమటచేగా, కరగకుండగా, తిలకంబుగా, తీర్చుము = దిద్దుము;

౩. ఓ చెలీ, జంటరవిక = జమిలి కుట్టుకుట్టిన రవిక, గొను = అందుకో, ఎంత ఒరసిన = ఎంతగారాపాడినను, చిటులకుండగా = చిట్లిపోకుండా, కుంకుమగందము = కుంకుమతో కలిపిన చందనము, అలదుము —;

౪. బోటి = ఓచెలి, మొలనూలు = నడుమున కట్టుకొను అభరణము (మేఖల), ఇదిగో = తీసుకో. సయ్యాటలనె = సరసములలోనే, నీవి = కోక (పోక) ముడి, సడలకుండ = విడిపోకుండునట్లు, చలువగా = చీరను, హొందుగగా = గట్టిగ, కట్టుము;

తరుణికి = కాంతకు (సుభద్రకు), ఇవి = ఈవస్తువులు, మెచ్చుగా = మేలిమిని, ఇచ్చుగద, తప్పక = నిశ్చయముగ, అనుచు, నేరుపరులైనవారిగా = నేరుపరులైనవారిని, ఏరుపరుప = ఏర్పాటుచేసి, కాంత = సుభద్రయొక్క, నవసంగమ = ప్రథమ సంగమమునకు, అర్హ = యోగ్యమైన, శృంగారవిభవలీలగా = శృంగార సంపదయొక్క విలాసముతో, ఆ, జవరాలిని = యువతిని, అపుడు, అలరించిరి = వికసింపచేసిరి - అలంకరించిరి.

విశేషము :— నవసంగమములో సుభద్రకు కలుగబోయే అనుభవములను ఈ పద్యములో ప్రౌఢలుగా చెలికత్తెలు సూచిస్తున్నారు

పాఠాంతరము :—

"తరుణీ నీ కిచ్చు నివి మెచ్చు దప్పదనుచు...."

ఈ పాఠంలో పద్యము నందలి సంబోధనము లన్నీ సుభద్రకు చెందినవే. ఆమె తనకు తానే అలంకరించుకొనుచున్న దన్న భావము అంత సరసముగా నుండదు.

"తడవేటికి ? లేజవ్వని,
విడె మీవలెఁ బతికి; మంచివేళ సుమీ యి
ప్పుడు; రా కన్నియ, వల్లభు
కడఁ బెనఁగుదు గాక పెనఁగఁగా నిటఁ దగునే ? 198

అర్థము :— లేజవ్వని = లేతయవ్వనము కలదానా, (జవ్వనీ లెమ్మా !) (సుభద్రను చేయిపట్టుకొని లేపుతారు), తడవు ఏటికి = ఆలస్యము ఎందుకు, పతికి = భర్తకు, విడెము ఈవలె = తాంబూలము ఇవ్వవలెను, మంచివేళ సుమీ ఇప్పుడు = ఇదే మంచి ముహూర్తము, రాకన్నియ = రాచకన్నియా (కన్యా రమ్మా !). (అని చేయిపట్టి లాగినపుడు సుభద్ర కొంచెము పెనగులాడును), వల్లభు కడన్ = భర్తదగ్గర, పెనగుదువు గాక = పెనగులాడెదవు, గాక (భర్తను తీగెవలె పెనవేసుకొందువు గాక అనిభావము), ఇట = మాదగ్గర, పెనఁగఁగన్ = పెనగులాడగ, తగునా = ఏమిలాభము !

అలంకారము :— శ్లేష.

చెలికత్తెల హితోక్తులు

"ప్రియముతో రమ్మని పిలిచినఁ, జేరఁబో
యెదవుగా కూరకుండెదవు సుమ్ము,
చెంతఁ గూర్చుండఁగఁ జేఁజూపఁ గూరుచుం
డెదవుగా కూరకుండెదవు సుమ్ము,
విడెము చేతికొసంగ వినయంబుతోడ నం
దెదవుగా కూరకుండెదవు సుమ్ము.
మధురోక్తి వినఁగోరి మాటాడ, మాఱు ప
ల్కెదవుగా కూరకుండెదవు సుమ్ము.

కాక, విభుఁడైనఁ గొంత సిగ్గరితనంబు
గదలుకొని యున్నఁ, గ్రక్కునఁ గడకు రాక,
చక్కఁగ నొకింతసే పటు సమ్ముఖమున
నిలువుమీ రత్నపాంచాలి చెలువుమీఱి. 199

ఈ పద్యములో ప్రౌఢలగు చెలులు సుభద్రకు ఉపదేశిస్తున్నారు.

అర్థము :— ౧. (భర్త) ప్రియముతోఁ, రమ్మని, పిలిచినఁ, చేరన్ = దగ్గరగా, పోయెదవుగాక, ఊరకుండెదవు సుమ్ము = ఊరకుండేవు సుమా;

౨. చెంత = తనప్రక్కను, కూర్చుండఁగ = కూర్చుండుమని. చేఁజూపఁ = చేతితో చూపినపుడు (ఆస్థలమున) కూరుచుండెదవు గాక = కూర్చోవలె గాని ఊరకుండెదవు సుమ్ము;

౩. విడెము = తాంబూలము, చేతికి ఒసంగన్, వినయంబుతోడఁ, అందెదవు సుమ్ము;

౪. మధురఉక్తిఁ = నీ మధురమైన మాటలను, వినన్‌కోరి = వినవలెనను కోరికతో, మాటాడఁ = భర్త మాట్లాడినపుడు, మారుపల్కెదవు గాక, ఊరకుండెదవు సుమ్ము ; (భర్త ఈ విధముగా చొరవచేయకుండిన యెడల —)

విభుడు = భర్త, కొంత సిగ్గరితనంబు = కొంతసిగ్గు, కదలుకొని = అతిశయించి, ఉన్ననైనను. గ్రక్కునఁ = చప్పున, కడకుఁ = ఇవతలకు, రాక, చక్కఁగా. ఒకింత సేపు, అటు = ఇపుడు కదలక మెదలక నిలిచియున్నట్లు అయినా. సమ్ముఖమున = ఎదుట. రత్న పాంచాలి = రత్నపుబొమ్మ, చెలువు = సౌందర్యమును. మీఱి = అతిశయించి, నిలువుమీ = నిలబడియుండుమీ ; (ఆగియుండుమీ) అటు అంటే ఆ రత్నపు బొమ్మవలె అని గూడ.

ఈ పద్యమున సిగ్గువల్ల సాధారణముగ క్రొత్త పెండ్లి కూతురులు అవలంబించే ప్రవర్తన వలదని చెలికత్తెలు సూచిస్తున్నారు.

అనవలసి యంటి మింతే;
నినుఁ జూచిన నింద్రతనయునికి, నింద్రతనూ
జునిఁ జూచిన నీకును, మఱి
మన సూరక యున్నె పూర్ణిమా చంద్రముఖీ ? 200

అర్థము :— పూర్ణిమా చంద్రముఖీ = పున్నమనాటి చంద్రునివంటి ముఖముగల సుభద్రా, అనవలసి అంటిమి, ఇంతే ; = ఏదో మాటవరుసకు అన్నాము అంతే [illegible]

చూచినఁగా, ఇంద్రతనయునికిఁగా = అర్జునునికీ; ఇంద్రతనూజునిం చూచిన, నీకును, మనసు, ఊరక, ఉన్నె = ఉంటుందా ?

చెలికత్తెలు చెప్పుతున్న మాటలపైన శ్రద్ధలేనట్లు నటిస్తూ సుభద్ర ఏమేమో చేయడం ఈ కింది పద్యములో కలదు.

"చిలుక నీచేఁ గాక చెలిచేత నుండదే,
నిమిరి యిప్పుడె మాట నేర్ప వలెనె ?
యెదుట గౌసెన వేయ కిడినారు. దెమ్మని
వీణ యిప్పుడె మేళవించవలెనె ?
పటము కానుక దెచ్చి పట్టిన, నిప్పుడే
చిత్తర్వునకు హర్వు చెప్పవలెనె ?
మంచి మాటలు తోఁచె నంచును బలకలో
నిప్పుడె కవిత వ్రాయించవలెనె ?
గంట సెప్పినవారిఁ గ్రేఁగంటఁ గనెదు,
రెండు పోద మ టన్న నటుండు మనెదు,
వడిగ రావమ్మ. కంచియే పడుకటిల్లు ?
కన్నియలఁ గంటి; మిటు లెందుఁ గాన మమ్మ. 201

అర్థము :— ౧. ఇట్లు వారు చెప్పుతుండగా వినుటకు ఇష్టములేని దానిలాగ నటిస్తూ సుభద్ర చిలుకను, తనచేత నెక్కించుకొని దానిని నిమురుచు మాటలు చెప్పుచుండెను. ఇప్పడే మాటలు చెప్పవలెనా అని ఒక చెలికత్తె చేతినుండి చిలుకను తీసికొనగా —

౨. ఎదుటఁగా = యెదురుగా, గౌసెన = వీణమొదలగువాని నుంచుటకు సంచివలె కుట్టిన కప్పు. వేయక = వేయకుండా, ఇడినారు = ఉంచినారు (అని), వీణను, తెమ్మని = తెప్పించు కొని, ఇపుడే, మేళవించవలెనే = తీగ లమర్చవలెనా - (అని ఒక చెలి వీణను తొలగింపగా)-

౩. పటము = చిత్రము (బొమ్మ), కానుకతెచ్చి పట్టినఁగా = కానుకగా తెచ్చి చూపి నపుడు, ఇపుడే, చిత్తరువునకు = పటమునకు, హర్వు = అందము, చెప్పవలెనె = విమర్శించ వలెనా - (ఈ పనిని ఒక చెలి ఆటంకపరచగా -)

౪. మంచిమాటలు తోచినపని పలుకపై కవిత్వము వ్రాయడం మొదలు పెట్టింది.

గంటసెప్పిన వారిఁగా = వేళ (ఇన్ని గంటలు ఆయినవి అని) తెలిపిన వారిని, క్రే గంటఁగా = [illegible] (ఇంచుక కోపముతోవలె), కనెదు = చూస్తావు. రెండు, పోదము, [illegible] (చెలికత్తెలు అనగా) [illegible]. అనెదవు.

వడిగ రావమ్మ, కంచియే = కంచియా, పడుకటిల్లు (అనగా పడకటిల్లు అంత దూరమా, కంచికి పోయినంత సన్నాహము కావలెనా ? ఎంతో మంది) కన్నియలు, కంటిమి = చూచాము (కాని) ఇటుల = ఈలాగ జాగుచేస్తున్నటువంటి దానిని, ఎందు = ఎక్కడ, కానమమ్మ = చూడ మమ్మా ; (ఈ మాటలు కొంత విసుగుతో లాగా అంటే వాటికయినా సుభద్ర కదులుతుందో అని ఆశ. (తాను త్వరపడుతున్నట్లు కనబడకుండా ఉండడానికి సిగ్గువల్ల ఆయాసాకులతో కాల యాపన చేయడం శోభనపు పెళ్ళి కూతుళ్లకు సహజము.

సుభద్ర లలిత కళలయం దభిరుచికల కన్య అని కవి సూచించాడు.

*పాఠాంతరము :—*

"గడెలు చెప్పిన వారిఁ గ్రేఁగంటఁ గనెదు"

సుభద్ర కాలమునకు అనుగుణముగ గడియలతో వేళ తెలియచేయడం ఉచితమే అయినా దానిలో ఈ అనుప్రాస సొగసులేదు.

"ఎక్కడనైన వేడుక మెయిన్ శుభవేళలఁ బాను పెక్కుచో
నొక్కినుమంత సిగ్గుపడుచుండెడు లేజవరాంద్రు లేరొ ? యో
యక్క ! యిదేమి ? యింత గలదా ! మఱి రే పిటువంటివారె పో
దక్కఁ బెనంగువారలు సదా మగనిన్ బిగిగౌఁగిలింతలన్. 202

ఇంకా ఆ విసుగుతోవలనే చెలికత్తెలు ఎత్తి పొడుస్తున్నారు.

*అర్థము* :— ఎక్కడనైనన్ = ఏచోటనైనా, వేడుకమెయిన్ = వేడుకతో, శుభవేళలన్ = శోభన సమయములయందు, పానుపు ఎక్కుచోన్ = పడకటింటికి పోవునపుడు, ఒక్క ఇనుమంత, సిగ్గుపడుచుండెడు, లేజవరాంద్రు = లేతవయసుకల యువతులు, లేరొ = లేరా !, ఓయక్క ! ఇదేమి ? ఇంతకలదా = ఇంతసిగ్గా; మరి, రేపు = శీఘ్రకాలములో, ఇటువంటివారెపో = ఇంతసిగ్గుచూపువారే సుమా, మగనిన్, బిగికౌఁగిలింతలన్, సదా = ఎల్లప్పుడు, దక్కన్ = తమకు వశమగునట్లు, పెనంగువారు = కూడియుండేవారు.

"ఏకతమునఁ జెప్పుదుమో ?
కా కందఱు వినెడునట్లుగాఁ జెప్పుదుమో ?
మా కొక్కటి దోఁచిన యది,
నీ కెక్కడఁ గోప మగునొ నీరేజముఖీ ? 203

*అర్థము* :— ఏకతమున (రహస్యముగ), చెప్పుదుమో = చెప్పవలెనో, కాక, అందరు, వినెడునట్లుగా, చెప్పుదుమో = చెప్పవలెనో; మాకు, ఒక్కటి, తోఁచినయది = స్ఫురించినది,

ఓ, నీరేజముఖీ = పద్మమువంటి ముఖముగలదానా, నీకు, ఎక్కడ, కోపము అగునో ? (అని ఏదో రహస్యాన్ని బయట పెడుతున్న భయమును నటిస్తూ చెలికత్తెలు —

"కేవల భక్తితో నచటఁ గేళివనంబున నీవు సారెకున్
సేవలొనర్చుచో గలిగెనే కత, యేకత నిందువచ్చుచోఁ
త్రోవల నిల్తురేకత; వధూవరు లిద్దఱు నొక్కటైనచో
నే వగఁ బాఱునో మనసు ? లెవ్వ రెఱుంగుదు రమ్మ జవ్వనీ ? 204

*అర్థము* :— అచట = ఆ ద్వారకానగరములో, కేళివనంబునన్ = ఉద్యానవనములో, నీవు, కేవలభక్తితోన్ = నిర్మలమైన భక్తితో (అని ఎగతాళి), సారెకున్ = మాటిమాటికి (పలుమారులు), సేవలు ఒనర్చుచోన్ = శుశ్రూష చేసినపుడు, కత - కథ, కలిగెనే (మీ ప్రణయ గాథ జరిగినది గదా), ఏకతన్ = ఎవరూ తోడులేకుండా (మీరిద్దరు), ఇందు వచ్చుచో = ఇక్కడికి వచ్చునపుడు, త్రోవలన్ = దారిలో, అక్కడక్కడ, నిల్తురుఏకత = ఒంటరిగా నిలిచినారు గదా; వధూవరులు, ఇద్దరు, ఒక్కటైనచోన్ = ఏకతకలిగిన, మనసులు, ఏవగన్ = ఏవిధముగా, పాఱునో = ప్రవర్తించునో ?, జవ్వనీ = ఓ జవరాలా, ఎవ్వరు, ఎఱుంగుదు రమ్మ = ఎవరికి తెలుసు ? (ఈ విధంగా చెలికత్తెలు సందేహాన్ని ప్రకటించారు).

*అలంకారము* :— యమకము.

"వేగిరకాఁడు మన్మథుఁడు వెన్కను ముందును జూడ, డంతకున్
వేగిరకాఁడు నీవిభుఁడు, వీరిఁ గటాక్షములందె యేలఁజాల్
వేగిరకత్తె వీ, వుచితలీలఁ దలంతువొ, వేళ యెంతువో?
యీ గరువంపు సిగ్గు లపు డెక్కడనుండు సరోజలోచనా ? 205

*అర్థము* :— మన్మథుఁడు, వేగిరకాఁడు = తొందరపాటుకలవాడు. (కాబట్టి) వెన్కను ముందును చూడడు, అంతకున్ = వానికంటెను, వేగిరకాఁడు, నీవిభుఁడు = నీభర్త, వీరిన్ = ఈ ఇద్దరిని, కటాక్షములందె = కడగంటి చూపులతోనే, ఏలన్‌చాల్ = స్వాధీనము చేసుకోగల, వేగిరకత్తెవు, ఈవు = నీవు; ఉచితలీలన్ = మంచిప్రవర్తనము (రతిప్రవర్తనము), తలంతువో = తలంచెదవో (అవలంబించెదవో), వేళఎంతువో = వేళను గణింతువో (అనగా వేళ అయినదీ లేనిదీ లక్ష్యపెట్టక క్రీడలలోమందువని అంతర్భావము), సరోజలోచనా = పద్మములవంటి కన్నులుగల ఓ సుభద్రా, ఈ గరువంపుసిగ్గులు = బింకముతో నున్న ఈ సిగ్గులు, అపుడు = ఆ లీలలలో, ఎక్కడనుండు (ఉండవనే ఉండవుగదా), పెండ్లి వరకు అగుపడాలా అని విసురు.

"క న్నెఱచేసి చూచిన, మొగ మ్మటు ద్రిప్పినఁ, జే విదిర్చినన్,
గన్నుబొమల్ ముడించినను, గాదన ! మందులకేమి ? మున్ను మీ
రున్న తెఱంగు, నంగకము లున్న తెఱంగుఁ, దలంచి చూచినన్,
గన్నియ, మాకు నమ్మికలు గావు సుమీ పదిలక్ష లేనియున్. 206

అర్థము :— కన్ను ఎఱచేసి చూచినన్ = కోపమును ప్రకటించినను. మొగమ్ము అటు త్రిప్పినన్ = విముఖతను ప్రదర్శించినను, చే = చేయి, విదిర్చినన్ = తోసివేసినను, కన్ను బొమల్, ముడించినను = ముడివేసినను (విసుగుతో), కాదనము, అందులకేమి ? మున్ను = ద్వారకానగరమునందు, మీరు, ఉన్నతెఱంగున్ = అన్యోన్యముగా ఉండిన విధమును, అంగకములు = మీశరీరములందు కానవచ్చు యవ్వనోద్రేకములు, ఉన్నతెఱంగున్ = (స్నేహమూ, యవ్వనమూ రెండున్నూ ఉండుటచేత), తలంచిచూచినన్ = తలచుకొనిన, పదిలక్షలేనియున్ = పదిలక్షల మాటలు చెప్పినను, కన్నియ = సుభద్రా, మాకు, నమ్మికలు కావు, సుమీ (నీవు విభుని దగ్గరికి వెళ్లినపుడు ఈ విముఖత, విసుగు, కోపము ఉంటాయని మాకు నమ్మకములేదు, (అనగా యథేచ్ఛగా సుఖింతువని భావము.)

*విశేషము :—* సుభద్ర కన్నెఱ చేయడము....బొమల్ ముడించడమూ అంతా చెలికత్తె ఉపన్యాసాన్ని ఆపడానికే - వ్యర్థ ప్రయత్నము.

*పాఠాంతరము :—*

"....మున్నుమీరున్న తెఱంగు మీకు తమియున్న తెఱంగు"
తమి = గాఢమైన ప్రేమ.

"అయోఁ గాకుండె, మంచిదే యందుకేమి;
కొంతసే పిటు నవ్వితి మింతె మేము ;
చాలు, నిఁకనైనఁ జాగేల ? సరసములనె
ప్రొద్దు పోయెడుఁ బదవమ్మ ముద్దుగుమ్మ" 207

అర్థము :— అయోగాకుండె = మేము చెప్పింది అయినా కాకున్నా, మంచిదే, అందుకేమి; కొంతసేపు, ఇటు = ఇటుల, నవ్వితిమి, ఇంతే, మేము; చాలు, ఇఁకనైనన్, జాగేల = ఆలస్యము ఎందులకు, సరసములనె = వధూవరుల సరససల్లాపములలోనె అనగా రతిక్రీడలకు ఉపక్రమించకముందె, ప్రొద్దుపోయెడు = రాత్రి ముగియగలదు (తెల్లవారగలదు). ముద్దుగుమ్మ, పదవమ్మ. 198 వ పద్యమునుంచి ఇంతవరకు చెలికత్తెలు చెప్పిన మాటలు.

పైన విసుగుతో నాడిన మాటలు నవ్వులాటలకే అని సమాధానము.

అని, కయిదండ యొక్క మృదుహల్లకపాణి యొసంగ, నొక్క మో
హన నవమౌక్తి కోపమ నఖాంకుర పాపటఁ జక్కఁ దువ్వ, శో
భన శకునమ్ము లొక్క కలభాషిణి ముందరఁ దెల్ప; మంద గా
మిని యను తెల్ల నప్పు డినుమిక్కిలిగాఁ దనయందు నిల్వఁగన్.

అర్థము :— అని, ఒక్క మృదుహల్లకపాణి = కోమలమైన ఎర్ర కలువపూవువంటి హస్తముగల ఒక చెలికత్తె, కైదండయొసంగ = చేయూత నిస్తుండగా (హల్లకపాణి కాబట్టి చేయూత ఇచ్చినదని సాభిప్రాయము), మోహన = మనోహరమైన, నవ = క్రొత్తదైన, మౌక్తిక = ముత్తియములతో. ఉపమ = సమానమైన, నఖఅంకుర = మొలకల (అంకురాల) వంటి గోరులుకల స్త్రీ, (ఒకతె), పాపటన్ = సుభద్ర పాపటను, చక్కన్ దువ్వన్ = చక్కబడునట్లు దువ్వుచుండగా (నఖాంకుర కాబట్టి దువ్వుట సాభిప్రాయము), ఒక్క కలభాషిణి = ఒక మనోహరమైన మాటలుగల స్త్రీ, శోభనశకునమ్ము = సుభసూచకమగు శకునములను, ముందరన్ = ఎదుట, తెల్పన్ = తెల్పుచుండగా, (కలభాషిణి కాబట్టి తెలుపుట సాభిప్రాయము), 'స్త్రీ' మందగామిని = మెల్లని నడకగలది, అనుట ఎల్లన్ = అనుగుణము అంతయు, అప్పుడు, ఇనుమిక్కిలిగాన్ = రెండింతలుగా. తనయందు = సుభద్రయందు, నిల్వఁగన్ = నిలిచి (కన బడుచుండగా) — (తరువాత పద్యముతో అన్వయము.)

అలంకారము :— పరికరాంకురము.

తాలిమిఁ గ్రుంగఁ ద్రొక్కి, మదిఁ దత్తఱముఙ్ దమియున్ భయంబు హే
రాళముగాఁగ, మైఁ జెమట గ్రమ్మఁగఁ, గొంకుచు మెల్లమెల్లనే
బాలిక యేగుదెంచె విభుపాలికిఁ, బ్రాణసఖుల్ దెమల్పఁగా,
మేలిక మ్రోలకుఙ్ మనవి సేఁగెడు నయ్యభిమాని పోలికన్. 209

అర్థము :— (సుభద్ర) మదిన్ = మనస్సులో, తత్తఱమున్ = తొందరపాటును, తమియున్ = ప్రేమయు, భయంబు = భయమును, (ఈ మూడును), (సుభద్ర యొక్క) తాలిమిన్ = ఓర్పును, త్రుంగద్రొక్క = అణచివైచి, హేరాళముకాగన్ = ఎక్కువ అగు చుండగా, మైన్ = శరీరమునందు, చెమటగ్రమ్మగా, కొంకుచు = సందేహించుచు, మెల్ల మెల్లనే, ప్రాణసఖుల్, తెమల్పగాన్ = పట్టుకొని లాగుచుండగా (చూడు : అమ్మరో రమ్మని బోటి కోమలి కర మ్మవివార్యగతిన్ దెమల్పగన్...) బాలిక = సుభద్ర, విభుపాలికిన్ = భర్త దగ్గరకు, ఏలికమ్రోలకున్ = ప్రభువు ఎదుటికి, మనవికి = మనవి చెప్పుకొనుటకు, ఏగెడు = వెళ్ళునట్టి, ఆ అభిమానిపోలికన్ = ఒక (పేరుగాంచిన) మానవంతునివలె, ఏగు దెంచెన్ = వచ్చెను.

అభిమానం కలవారు ఒక ప్రభువు వద్దకువెళ్లి మనవి చేసుకోడానికి ఏ విధంగా తత్తరము, భయముపొంది. చెమటక్రమ్మి, సందేహించుకుంటూ స్నేహితుల ప్రోత్సాహముతో మెల్లమెల్లగా ముందుకు కదులుతారో. ఇపుడు సుభద్ర ఆ విధముగానె అర్జునుని వద్దకు వెళ్ళుచున్నది.

అలంకారము :— ఉపమాలంకారము.

చంచలనేత్ర రాఁ గలుగు సంభ్రమ మేమనవచ్చు? వాసనల్
ముంచుకొనెన్ సమస్త గృహముల్? మిఱుమిట్లు గొంచు నల్గడల్
ముంచుకొనెన్ దనూ రుచులు ; ముంగిటి కించుక రాక తొల్తనే
ముంచుకొనెన్ నృపాలునకు మోహపుఁ గోర్కులు నెమ్మనమ్మునన్.

అర్థము :— చంచలనేత్ర = చలించుచున్న కన్నులుగల సుభద్ర, రాన్ = వచ్చునపుడు, కలుగు సంభ్రమము = కలిగినటువంటి విశేషము, ఏమనవచ్చు ?, సమస్తగృహముల్ = అన్ని భవనములను, వాసనల్ ముంచుకొనెన్ = పరిమళము వ్యాపించెను. తనూరుచులు = శరీరపు కాంతులు, మిఱుమిట్లుగొంచు = మిరుమిట్లుకొలుపుతు, నల్గడల్ = నాలుగు దిక్కులను, ముంచుకొనెను = ముంచివేసెను అనగా ప్రసరించెను, ముంగిటికి = ముంగిలివద్దకు (తన యెదుటికి) ఇంచుక = కొంచెము, రాకతొల్తనే = (సుభద్ర) రాకముందే. నృపాలునకు = అర్జునునకు, మోహపుకోర్కులు = ప్రేమసంబంధమైన కోరికలు, నెమ్మనమ్మునన్ = మనస్సులో, ముంచుకొనెన్ = నిండిపోయెను,

అలంకారము :— యమకము.

మఱుఁగఁ గోరెడి కన్నియ తెఱఁగుఁ జూచి,
చూడఁ గోరెడి యువరాజు జాడఁ జూచి,
వలఁతు లైనట్టి యా కూర్మి పొలఁతు లపుడు
కూర్చి సమకూర్చి యిరువురఁ గూర్చి యనిరి. 211

అర్థము :— మఱుఁగన్ = చాటునుండవలెనని, వెనుకకు వెనుకకు పోవుటకు ప్రయత్నించుచున్న. కన్నియ = సుభద్ర, తెఱఁగుచూచి = విధముచూచి, చూడన్‌కోరెడి = ముందుకుముందుకు వంగి సుభద్రను చూడకోరునట్టి, యువరాజు జాడ = అర్జునుని ప్రవర్తన, చూచి, వలఁతులైనట్టి = నేర్పరులైన, ఆకూర్మిపొలఁతులు = ఆప్రియసఖులు, అపుడు, కూర్చి = దగ్గరకుతెచ్చి, సమకూర్చి = ఇరువురను సమముగా కూర్చుండబెట్టి, ఇరువురన్ గూర్చి = ఆయిద్దరిని ఉద్దేశించి, అనిరి (ప్రియసఖులు) —

*పాఠాంతరము* :—

"అరుఁగఁ గొంకెడు కన్నియ తెఱఁగుజూచి
చూడ గొంకెడు యువరాజు జూడఁజూచి"

*అలంకారము* :— అనుప్రాసము.

"తేరు దా నెట్లు గడపెనో తెలియరాదు,
తేరు గదలించినట్లు దోతేర వలసెఁ;
గన్నె యిందాఁక నే మెఱుంగదు సుమయ్య'
తేరుగడ కాఁగ మెల్లన దిద్దుకొనుము. 212

*అర్థము* :— తేరు = రథమును, తాను, ఎట్లుగడపెనో = ద్వారకనుండి వచ్చునపుడు కలిగిన యుద్ధసమయమునందు (సుభద్ర) ఏ విధముగా నడిపెనో, తెలియరాదు = ఊహించ లేము; తేరు కదలించినట్లు = రథమును ఈడ్చుకొని వచ్చినట్లు (అనగా అతికష్టముతో), తోతేరఁగా-వలసెఁగా = (ఈమెను) తీసుకొని రావలసి వచ్చినది, కన్నె = ఈ సుభద్ర, ఇందాక = ఇప్పటివరకు, ఏమి, ఎఱుంగదు సుమయ్యా (మిక్కిలి ముద్దరాలు అని భావము), తేరుగడ కాగఁగా = చక్కబడునట్లుగా, మెల్లన = ఉపాయముతో, దిద్దుకొనుము = నేర్పుకొనుము.

*అలంకారము* :— అనుప్రాసము.

పాటల బింబాధర కసి
గాటుల కోప దని పలువగలఁ దెలుపంగా
నేటికి ? నెఱింగి నడుపుము
మీటిన విచ్చుచనుదోయి మీ చేతి దిఁకన్. 213

*అర్థము* :— పాటల బింబాధర = ఎఱ్ఱని (దొండపండువంటి) పెదవిగల సుభద్ర, కసిగాటులకుఁగా = తమితోడి (గట్టి) కాటులకు, ఓపదు = సహించజాలదు, అవి, పలువగలఁగా = అనేక విధములుగా అనగా పెక్కుమాటలతో (పలు వగలఁగా = దంతక్షతలను-పంటిగంటులను గూర్చి), తెలుపంగాఁగా ఏటికి = చెప్పవలసిన అవసరము ఏమిటి ?, ఎఱింగి నడుపుము = ఈ విషయము తెలుసుకొని ప్రవర్తించుము, మీటిన = వేలితో మీటినంత మాత్రమున, విచ్చు = బ్రద్దలగునంతటి, బిగువుగల = చనుదోయి, స్తనద్వయము, మీచేతిది ఇకఁగా.

ఈ పద్యము నందలి కసిగాటుల కోర్వనిది అధరము కాబట్టి సుభద్రను పాటల బింబాధర అనుట చమత్కారము.

చూడు : "మీటిన విచ్చు గుబ్బ చనుమిట్టల నక్రులు చిందువందఁగఁగా"
—మనుచరిత్రము.

అలంకారము :— శ్లేష, పరికరము.

మీర లెఱుఁగ గంగ వలయు శృంగార మెల్ల;
యువతి తిలకంబుఁ గంటె యో నవమనోజ;
విభుఁడు మదిమెచ్చి కర్పూరవీటి యొసఁగ,
ముద్దుమొగ మెత్తరాదె యోమోహనాంగి. 214

అర్థము :— ఓ నవమనోజ = నవమన్మథుడవగు ఓ అర్జునా, మీరలు ఎఱుంగఁగా వలయు = మీకు తెలిసియుండవలెను, శృంగారమెల్ల = శృంగారరస సంబంధమైన విషయాలన్నీ,

సుభద్ర ముగ్ధ కావున ఏమీ తెలియదు. కాని మీరు ఇదివరకు ద్రౌపది, ఉలూచి, చిత్రాంగదలను పెళ్ళి ఆడినవారు కావున శృంగార విషయాలు తెలుసు అని భావము.

చెలికత్తె ఇలా చెప్పుతుండగ అర్జునుడు కప్పురవిడెము సుభద్రకు ఇవ్వగా సుభద్ర తలవంచుకొనియున్నట్లు భావించవలెను.

అదిచూచి - (ఆ చెలి) - యువతి తిలకంబున్ కంటె = ఈ ముద్దరాలిని చూచితివా ? (అని, సుభద్రను హెచ్చరించుటకు) ఓ మోహనాంగి, విభుడు = భర్త, మదిమెచ్చి = మెచ్చుకొని, కర్పూరవీటి = కప్పురపు తాంబూలమును, ఒసంగన్ = ఇస్తుంటే, ముద్దుమొగము = ముచ్చటైన ముఖమును, ఎత్తరాదె = పైకి కనపరచరాదె. (ముఖమును ఎత్తరాదే అనగా అర్జునుడు విడెమును నోటిలోపెట్టుటకు అందించుచున్నాడు కావున ముఖమునెత్తుమని భావము.)

సుభద్ర ఆ విడెము నందుకొన్నదనే అనుకోవాలి.

*పాఠాంతరము* :—

"..........యువతి తిలకంబుకంటె నో నవమనోజ...."

ఇపుడు సుభద్ర కంటెను అర్జునునికి శృంగార విషయాలు ఎక్కువ తెలుసు అని అర్థము. ఈ పోలికలో సుభద్రకు కొంతయినా తెలుసు అన్న అర్థము ధ్వనించుచున్నది. కాని సుభద్ర ముగ్ధ, ఏమీ తెలియనిది. అందువలన 'కంటె' పాఠమే కన్న 'గంటె' పాఠమే బాగున్నది.

"వలరాజు కొల్చునంతటి
చెలువుఁడు నినుగూడఁ గలిగెఁ జెప్పెడిదేమీ?
కలఁ డిఁక నీపాలింటన్
జెలియా, యల చందమామ జేజే యెపుడున్. 215

*అర్థము* :— వలరాజు = మన్మథుడు, కొల్చునంతటి = సేవకుడుగా ఉండునంతటి, (తనకంటె అర్జునుడు అందమైన వాడు గనుక) చెలువుఁడు = అందగాడు, నినున్ = నిన్ను, కూడన్ గలిగెన్ = నీతో కలియ గలిగినాడు; చెప్పెడిదేమీ ? = చెప్పవలసిన దేమున్నది? ఇఁకన్, నీపాలింటన్ = నీపాలిట (నీవశమున), చెలియా = సుభద్రా, అలచందమామ జేజే = ఆ చందమామ దేవత, ఎపుడున్ = ఎల్లవేళల, కలడు = ఉండును.

*విశేషము* :— అర్జునుని గొల్చువాడు మన్మధుడు, అందువలన మన్మధుని మామయైన చంద్రుడుకూడా అనుకూలుడుగా ఉండును అని భావము. పాండువంశపు మూలపురుషుడు చంద్రుడు కావున కూడా ఇక అతను సుభద్ర పాలిట ఉండును అని భావము.

పాలిండ్లు = కుచములు, పాలింటన్ అనగా కుచములయందు.

'అల' అనునది 'ల' కు 'ర' కు అ భేదమునుబట్టి అర అగును. అపుడు అర చంద మామ జేజే అనగా, నెలవంక అని అర్థము. పాలింటన్ అరచందమామ ఉండును. అనగా నెల వంక ఆకారమున ఉండు (అర్జునుని) గోటినొక్కులు (నఖక్షతలు) వుండునని చమత్కారము.

213 వ పద్యములో 'మీటిన విచ్చు చనుదోయి మీచేతి దికన్' అని అర్జునుడి కప్పగించిన దాని ఫలితము ఏరూపంగా ఉంటుందో ఈ పద్యములో శ్లేషద్వారా తెలిపింది చెలి.

*అలంకారము* :— శ్లేష.

"రావక్క, వక్కలాకులు
గోవక్క, శుభోత్తరముగ గొబ్బున విభుచే
నీవక్క, సేవసేయుము
నీ వక్కఱ గలిగి రమణునికిఁ జిత్తము రాన్". 216

*అర్థము* :— రావక్క = రావమ్మ, వక్కలు-ఆకులు, కోవక్క = తీసుకొనవమ్మా, శుభోత్తరముగ = శుభము కలుగునట్లుగ, గొబ్బునన్ = శీఘ్రముగ, విభుచేన్ = భర్తచేతికి, ఈవక్క = ఈయవమ్మ, రమణునికి = భర్తకు, చిత్తమురాన్ = మనసురంజిల్లునట్లు, నీవు, అక్కఱగలిగి = కోరికగలిగి, సేవచేయుము.

విశేషము :— 214 వ పద్యములో సుభద్రకు విడెము నిప్పించి, దీనిలో బదులు తాంబూలము సుభద్రచేత ఇప్పిస్తుంది.

అలంకారము :— అనుప్రాసము.

అనుచుఁ గప్పుర బాగాలు నాకు మడుపు
ల చ్చకోరాక్షి చేతి కందిచ్చి, మిగుల
నంతికము సేర్చి "చేపట్టుమయ్య కోర్కు-
లొదవఁగాఁ జేయ నాసామి, యువతి శయము" 217

అర్థము :— అనుచు = పైవిధముగా మాట్లాడుతు, కప్పురబాగాలు = పచ్చకర్పూరము కలిసిన వక్క-పలుకులు, ఆకుమడుపులు = తములపాకు చిలుకలు (చుట్టలు), ఆచకోరాక్షి = చకోరములవంటి కన్నులుగల ఆ సుభద్ర, చేతికి అందిచ్చి, మిగులన్ = ఎక్కు-వ, అంతికము సేర్చి = మరింత దగ్గరగాచేర్చి 'నాసామి = నా ప్రభువా (శృంగార నాయకుని సామి అని అనడము ఇక్క-డ సొగసు), (ఈ) యువతి శయమున్ = సుభద్ర చేతిని, కోర్కు-లు ఒదవగాన్ = కోర్కు-లు ఫలించునట్లు, చేయన్ = చేయుటకు, చేపట్టుమయ్య = చేతితో పట్టవయ్య. (రతిలో కూడవయ్య అని అంతరార్థము).

కోర్కు-లు ఒదవగా చేపట్టుము అనగా సుభద్రార్జునుల హృదయములలో ఇన్ని రోజులుగా ఊహల రూపముననున్న కోర్కె-లు, అభిలాషలు ఫలించునట్లుగా అని భావము.

అని కన్నియ హస్తాబ్జము
దన శ్రీహస్తమునఁ జేర్పఁ; దాత్పర్యమునన్
గొని, యామాటల చతురత
మనమున మెచ్చుకొను రసికమణి పేమాఱున్. 218

అర్థము :— అని, కన్నియ హస్తాబ్జము = సుభద్రయొక్క- కమలమువంటి చేతిని, తన, శ్రీహస్తమునన్ = సంపత్కరమైన హస్తమునందు, చేర్పన్ = చేర్పగా, తాత్పర్యమునన్ = హృదయపూర్వకముగ, కొని = పట్టుకొని, రసికమణి = రసజ్ఞులలో ఉత్తముడగు అర్జునుడు, ఆ మాటల = చెలికత్తెల మాటల యందలి, చతురతన్ = చమత్కా-రమును, మనమునన్ = మనసునందు, పేమాఱున్ = అనేకసార్లు, మెచ్చుకొనున్ = కొనియాడును.

విశేషము :— ఈ చెలికత్తెలు 'వలతులు' అని 211 వ పద్యములో చెప్పాడు కవి. 217 వ పద్యం వరకు ఆ వలతులు చెప్పిన మాటలలో చక్క-ని చతురత ఉండవలె తప్పదు.

అర్జునుడి చేతినుంచి విడెము సుభద్ర అంగీకరించినట్లు చేశారు. రావక్క అంటూ సుభద్ర చేతి విడెము అర్జునుడి కిప్పించారు. ఉభయుల అంగీకారమూ స్థిరపడ్డది.

'కలయఁగ మంచిలగ్న మిది, గట్టిగ నే గడె లెన్ని యయ్యెనో
తెలిసెద' నంచు నోర్తుఁ, జనుదేర ద దే?' మని యోర్తు, 'నెచ్చెలిన్
బిలిచెద' నంచు నోర్తు, నొక పేరిడి వా రిటు లేఁగి రంద; ఆ
చ్చెలియల వెంటనే నగము సి గ్గరిగెన్ దరుణీలలామకున్. 219

*అర్థము* :— కలయగన్ = వధూవరుల కలయికకు, ఇది మంచిలగ్నము, గట్టిగ = సరిగా, గడెలు ఎన్ని అయ్యెనో = వేళ ఎన్ని గడియలైనదో, నేన్ తెలిసెదను = తెలిసికొందును, అంచున్, ఓర్తున్ = ఒకతెయు; 'అది = వేళచూచుటకు వెళ్ళిన చెలి, చనుదేరదు = రాలేదు, ఏమని, ఓర్తున్ = ఇంకొకతెయు, నెచ్చెలిన్ = దానిని, పిలిచెదనంచు, ఓర్తున్ = ఒకతెయు, ఒక పేరిడి = ఏదో ఒక నెపముచెప్పి, ఇటుల, వారందరును, ఏగిరి = వెళ్ళిరి, ఆ చెలియల వెంటనే, తరుణీలలామకున్ = యువతీరత్నమునకు (సుభద్రకు), నగముసిగ్గు, అరిగెన్ = పోయెను.

*అలంకారము* :— స్వభావోక్తి.

పంచ శిలీముఖంబులును బచ్చని విల్లును బూని యెక్కు నం
ధించుచు, 'నిర్వురం బెనఁచి నెమ్మిఁ గరంచు కడంక చూడుమీ,'
యంచు, గవాక్షసీమ నపు డా యెలతెమ్మెరఁ గూడి, వేడుకన్
బొంచులు సూడఁగాఁ దొడఁగెఁ బో మకరాంకుఁడు గానకుండఁగన్.

చెలికత్తెలు పోగానే మన్మధుడు విజృంభిస్తాడు.

*అర్థము* :— పంచ శిలీముఖంబులను = అయిదు బాణములను, పచ్చని విల్లును = చెరకు విల్లును, పూని = ధరియించి, ఎక్కు సంధించుచు = వింటిని ఎక్కుపెట్టుతు, ఇర్వురన్ = వధూవరులను ఇద్దరను, పెనచి = కలియగట్టి, నెమ్మిన్ = ప్రేమచేత, కరంచు = కరిగించునట్టి, కడంకన్ = నా (మన్మధుని) ప్రయత్నమును, చూడుమీ, అంచు, అపుడు, గవాక్షసీమన్ = కిటికీ ప్రదేశమునందు, ఆ ఎలతెమ్మెరన్ కూడి = ఆ పిల్లవాయువుతో కలిసి, వేడుకన్ = వేడుకతో, మకరాంకుడు = మన్మథుడు, కానకుండగన్ = ఇతరులు చూడవీలులేకుండా, పొంచులు = దొంగచూపులు, చూడగాన్, దొడఁగెన్ = ఆరంభించెను.

*విశేషము* :— మకరాంకుడు శరీరము లేనివాడు. కాబట్టి కానకుండగ అన్నపుడు ఇతరులు చూడలేకుండా అని ఒక అర్థము; తాను కానకుండా కన్నులు మూసుకొని అన్న

మాట. ఏ బాణము ఎవరికి తగులుతుందో అన్న యోచన లేకుండానే అని మొరొక అర్థము అన్వయించుకోవాలి.

మన్మథుడిని గుడ్డి బాలుడుగా చిత్రించడం ఉంది కదా.

విలుకాడు ఒక పిల్లవాడితో ప్రగల్భాలు పలుకుతూ తన నేర్పు చూపిస్తున్నట్లు ఇక్కడ ఎలతెమ్మెరతో మన్మథుడు చెప్పుతున్నాడు.

తాను కనబడకుండా చూస్తున్నాడు కాబట్టి 'పొంచులు' సార్థకము.

*అలంకారము* :— ఉత్ప్రేక్ష.

పతియు సతి కేలు పట్టిన పట్టు విడక,
పెడమఱల వామకరమునఁ బిఱుఁదుఁ జుట్టి,
పట్టి, రా నీడ్చి కూర్చుండఁబెట్టె నపుడు,
తొడ తొడయుఁ దాఁకఁ దమి సిగ్గుఁ గడకు నూఁక. 221

*అర్థము* :—పతియు = భర్త, సతికేలు = సుభద్రచేయి, పట్టినపట్టువిడక (సుభద్ర విడుపించుకొనజూచినను) పట్టు సడలించక, పెడ = ప్రక్కకు (సుభద్ర), మఱలన్ = తిరుగ ప్రయత్నించగా, వామకరమునన్ = ఎడమచేతితో, పిఱుఁదున్‌చుట్టి = పిఱుదులను చేతితోచుట్టి, పట్టి = పట్టుకొని, రాన్ ఈడ్చి = దగ్గరకువచ్చునట్లు లాగి, అపుడు, తొడతొడయున్ తాఁకన్ = ఇద్దరి తొడలు తగులుతూ ఉండగా, తమి = ప్రేమ, సిగ్గున్ = సిగ్గును, కడకు = దూరముగా, నూకన్ = తోసివేయునట్లుగా, కూర్చుండబెట్టెన్ = కూర్చుండబెట్టెను.

పరస్పరము ఇద్దరి తొడలు తాకుట వలన ప్రేమహెచ్చి సిగ్గు నశించిన దని భావము.

*అలంకారము* :— అంత్యానుప్రాసము – స్వభావోక్తి.

నెఱి కొప్పు కొనగోర నిమిరిన యంతనే
తళుకు లే ముద్దుఁ జెక్కిలి చెమర్చె,
దళుకు లేముద్దుఁ జెక్కిలి నొక్కినంతనే
వలిగుబ్బ చనుఁగవ పులకరించె,
వలిగుబ్బ చనుఁగవ నలిమిన యంతనే
నతనాభి నీవిబంధంబు బ్రిదిలె,
నతనాభి నీవిబంధము నంటునంతనే
తనువెల్లఁ బరవశత్వము వహించె,

నవలఁ జెప్పెడి దేమి ? యా నవరసికుఁడు,
తావి చెంగావి చక్కెరమోవి గ్రోలి,
కుసుమశరు కేళి నేమేమి గుఱుతు లిడెనొ,
బాల యెఱుఁగదు సౌఖ్యాబ్ధిఁ దేలియపుడు. 222

అర్థము :— ౧. నెఱికొప్పు = వంకరలుతీరిన కొప్పును, కొనగోర, విమిరిన యంతనే = దువ్వినవెంటనే, తళుకు = కాంతిగలిగిన, లే = లేతయై, ముద్దు = ముచ్చటగొల్పు. చెక్కిలి, చెమర్చెఁ = చెమటపట్టెను.

౨. (అ) తళుకులే ముద్దుచెక్కిలిని, నొక్కినంతనే, వలి = గుండ్రనై. గుబ్బ = గుబ్బలవలెనున్న, చనుగవ = చనుదోయి, పులకరించె = గరిపొడిచెను.

౩. (అ) చనుగవను, అలిమినయంతనే = పట్టినయంతనే, నతనాభి = లోతైన బొడ్డు గలది, (లోతైన బొడ్డున నున్న), నీవిబంధము = చీరపోకముడి, ప్రిదిలెఁ = సడలిపోయెను.

౪. (అ) నీవిబంధమును, అంటినంతనే, తనువు ఎల్లఁ = శరీరమంతయు, పరవశత్వము వహించెఁ = పారవశ్యము (మైమరపు) ను పొందెను.

అవలఁ = ఇంతయైన తరువాత, (నవల అనగా యువతి, పారవశ్యమునను్న సుభద్ర ఇక చెప్పెడిది ఏమున్నది అని మరియొక భావము.) చెప్పెడిదేమి = చెప్పవలసినది ఏమున్నది. ఆ నవరసికుడు = అర్జునుడు, తావి = పరిమళము గలిగి, చెంగావి = ఎర్రనైన, చక్కెర = తీయని, మోవిన్ = అధరమును, క్రోలి = పానముచేసి, కుసుమశర = మన్మథునియొక్క, కేళిఁ = క్రీడయందు (రతియందు) ఏమేమి గురుతులు = ఏమేమి గుర్తులు, (నఖక్షతలు, దంతక్షతలు మొదలైన గుర్తులు)ఇడెనో = ఉంచెనో, సౌఖ్యాబ్ధిఁ = సుఖము అను సముద్రము నందు, తేలి = తేలియాడి, బాల = సుభద్ర, ఎఱుఁగదు (పారవశ్యము పొందియుండుట చేత).

*విశేషము :—* ఈ పద్యమునందు మన్మథ వికారములలోని చెమటపట్టుట, గగురుపాటు, పారవశ్యము, శరీరము ఉబ్బుట, అనునవి సూచితములు;

తావి చెంగావి చక్కెరమోవి అనునపుడు ముక్కు, కన్నులు, నోరు అను మూడు ఇంద్రియములకు సంతృప్తిని సూచించెను.

*పాఠాంతరము :—*

చూడు : "...నతనాభిన్నవలా లోకనోకమరున్నారి శిరోరత్నమున్"

—మనుచరిత్ర.

*అలంకారము :—* ముక్తపదగ్రస్తము.

గా ఢాలింగన విముఖము,
రూ ఢాంగ స్వేద భరము, రుంద్ర వ్రీడా
గూ ఢాపాంగము నగుచు, న
వోఢా సంగమము వేడు కొసఁగెం బతికిన్. 223

అర్థము :— గాఢ ఆలింగన = బిగువైన కౌగిలికి, విముఖము = ఇష్టము కానట్లు పెడ మొగమైనదీ, రూఢ = స్పష్టమైన, అంగస్వేదభరము = అవయవములందలి చెమటయొక్క ఆధిక్యము కలదీ, రుంద్ర = దట్టమైన, వ్రీడా = సిగ్గుచేత, గూఢ = కానరాకుండ ఉన్న, అపాంగ = క్రీగంటిచూపు గలదీ, అగుచు, నవ ఊఢా సంగమము = క్రొత్త పెండ్లి కూతురుతో సంభోగము, పతికిన్ = అర్జునునికి, వేడుక, ఓసఁగెన్ = కల్గించెను.

విశేషము :— నాయకీనాయకుల ప్రథమ సురతమును వర్ణించునపుడు సాధారణముగ - అందరికి తెలియకుండునట్లు కాబోలు - సంస్కృతపద భూయిష్ఠముగ వర్ణించుట కలదు. చూ. "సహసానఖంపచ..." మనుచరిత్ర.

అలంకారము :— విభావన.

వీఁడు కొప్పున సాము విరిదండ వెలిఁ గ్రమ్మఁ
గమ్మ కస్తురిబొట్టు చెమ్మగిల్లఁ,
దనువున మేల్పూఁత తావి మాత్రమె చిక్కఁ
జిక్కు చన్గవ సరుల్ చిక్కువడఁగ,
నొసలిపై ముంగురుల్ ముసరి ముద్దులుచూప
జూ పంతకంతకు సొలపు సూపఁ,
జిన్నారి చెక్కులు చెమటఁ జిత్తడినంద,
నందంద యూర్పులు సందడింప;
నపుడు సమ్మతిఁ బతి వేఁడ, నసఁగి పెనఁగి,
లోను గాకుండియు, మృగీవిలోలనయన
యతని నానంద వార్ధి నోలార్చె నౌర!
కలయికలఁ గల్గు హరువుల కలిమి వలన. 224

అర్థము :— ౧. వీఁడుకొప్పున = విడిపోయిన కొప్పున, సాము = సగము, విరి దండ = పూదండ, వెలిగ్రమ్మ = బయట కనబడునట్టు వ్రేలాడుచుండగా, కమ్మ = సువాసన గల, కస్తురిబొట్టు, చెమ్మగిల్లన్ = చెమటచే తడియగుచుండగా,

౨. తనువున = శరీరమునందు, మేల్పూఁత = అందమైన సుగంధలేపనముయొక్క, తావిమాత్రమె = పరిమళము మాత్రమే (చందనము అంతా రాలిపోయి కానరాకుండా పోయినదని భావము). చిక్కఁగ = మిగిలియుండగా, చిక్కచన్గవ = చాలా దగ్గరగావున్న చనుదోయి యందు (అంతరములేనిది), సరుల్ = హారములు, చిక్కువడగ = చిక్కుపడి ఉండగా,

౩. నొసలిపైన్ = నుదురుమీద, ముంగురుల్, ముసరి = క్రమ్మి, ముద్దులుసూపఁగ = ముచ్చట గొల్పుచుండగా, చూపు, అంతకంతకు = క్షణక్షణమునకు ఎక్కువగుచున్న, సొలపుఁగ = అలసతను, చూపఁగ = తెలియపర్చుచుండగా,

౪. చిన్నారిచెక్కులు = ముద్దుగానున్న చెక్కిళ్లు, చెమటఁగ = చెమటచేత, చిత్తడిఁగ అందఁగ = ఎక్కువైన తడిని పొందుచుండగా, అందంద = ఒక్కొక్కప్పుడు, ఊర్పులు = శ్వాసములు, సందడింపన్ = అతిశయించగా,

అపుడు = ఆ రతిసమయమున, సమ్మతిఁగ = (సుభద్రయొక్క) సమ్మతిని, పతి = భర్తయైన అర్జునుడు, వేఁడఁగ = వేడగా, మృగీవిలోలనయన = జింకవలె చలించుచున్న కన్నులు గల స్త్రీసుభద్ర, అనఁగిపెనఁగి = కలసిమెలసి, లోనుగాకుండియుఁ = లొంగకపోయిగూడ (స్వాధీనము కాకుండ ఉండినప్పటికిని) కలయికలన్ = రతిక్రీడలయందు, కలుగు = ఉన్నటు వంటి, హరువుల = విశేషముల, కలిమివలనఁ = సంపదవలన (అనగా అనేక విధములగు కలయికలవలన), ఆతనిన్, అనందవార్ధిన్ = సుఖసాగరమున, ఓలార్చెన్ = తేలించెను, ఔర ! = ఆశ్చర్యము,

*విశేషము* :— అనగిపెనగి యుండినప్పటికీ, లోనుగాకుండియే భర్తను సుభద్ర సౌఖ్యాబ్ధిని తేలించెను. అందులకే ఆశ్చర్యము.

ఇందలి మొదటి రెండు పాదములలోను పువ్వులువీడుట, తిలకము చెమ్మగిల్లుట, సూచించి కవి "జడకుచ్చులై కొమ్ము..." అన్న 197 వ పద్యములో చెలులు తీసుకొనిన జాగ్రత్త అంతా విఫలమైనదని తేట పరిచాడు.

*పాఠాంతరము* :—

ఈ సీసపాదములయందు కవి పాటించిన నియమము మొదటి దళము చివరిమాటతోనె రెండవ దళమును ఆరంభించుట అని వేరుగ చెప్పనక్కరలేదు. కాబట్టి వేదమువారు మూడవ పాదము

"......ముంగురుల్ ముసరి ముద్దునటింప,

జూ పంత కంతకు సొలపుసూప" అనీ నాల్గవ పాదమున,

"చిత్తడినొంద, సందంద యూర్పులు" అనీ పఠించారు.

పైన చూపిన కవి నియమాని కివి భంగము కల్గించుటచేత ఇవి అంగీకారము కావు.

మొదటి పాదము "పీగుకొప్పున..." అని ఒక పాఠాంతరము. పీగు అనిన విరియు చున్న, కాని రతి చిన్నెలను చెప్పునప్పుడు జుట్టు విడిపోవుట, చెదరిపోవుట సాధారణము. చూడు: "బిభ్రాణా కరవల్లవేన కబరీ మేకేన పర్యాకులం" - పుష్పబాణవిలాసము.
"అపుడు సమ్మతిపడ వేఁడ..." అని ఒక గీతపాద పాఠాంతరము.

సమ్మతిపడుటకొరకు వేడగా అని భావము. ఇచట అర్జునుడు కర్త అని సర్దుకొనవలెను.

*అలంకారము :—* ముక్తపదగ్రస్తము - విభావన.

నొక్కి పలుమొనఁ బలుమొన నొక్క నేర్పె,
నంటి గోరులచేఁ గళ లంటు నేర్పె,
జొక్కి బిగికౌఁగిలింతలఁ జొక్క నేర్పె,
జెలువుఁడు నవోఢఁ బ్రౌఢఁగాఁ జేసె నపుడు. 225

*అర్థము :—* అపుడు, చెలువుడు = ఆ అర్జునుడు, పలుమొనన్ = పంటిమొనన్ = పంటిమొనచేత, నొక్కి = సుభద్ర పెదవినొక్కి, పలుమొనన్, నొక్కన్నేర్పెన్ = సుభద్ర అట్లనే పలుమొనతో అర్జునుడి పెదవి నొక్కుటనేర్పెను, గోరులచేన్ అంటి = ఆయా కళాస్థానములను నఖములతో నొక్కి, కళలు, అంటన్నేర్పెన్ = సుభద్రగూడ అలాగే కళాస్థానాలు అంటునట్లు నేర్పెను, బిగికౌఁగిలింతల = బిగువుగా ఉండే ఆలింగనములచేత, చొక్కి = తానుపరవశుడై, చొక్కన్నేర్పెన్ = సుభద్రకు పారవశ్యమును పొందుట నేర్పెను. (ఈ విధముగ తీర్చి దిద్దుకొని) నవ ఊఢన్ = కొత్త పెండ్లికూతురును, ప్రౌఢగాచేసెన్ = ప్రౌఢనాయికగా (రతి క్రీడలయందు నేర్పరిగా) చేసెను.

*విశేషము :—* 211 వ పద్యములో సుభద్ర చెలికత్తె అర్జునుడితో
"కన్నె యిందాక నే మెఱుంగదు సుమయ్య :
తెరుగడగాఁగ మెల్లన దిద్దుకొనుము" అనిన ఉపదేశాన్ని అక్షరాలా పాటించా డన్నమాట.

జిలిబిలి పలి నాలి మొలక తెమ్మెరలు గ
మ్మని మేని తావుల ననుసరింప,
నలరుఁ దేనియ లాని యలరు తుమ్మెద దిమ్ము
జంటచూపుల వెనువెంటఁ దిరుగఁ,
జిగురాకు మేఁతలఁ బొగరొందు కోయిలల్

పాటల నీటు వెంబడి మెలంగఁ,
గులుకఁ బలుకుల ముద్దుగులుక చిల్కలు నేర్పు
పలుకుల బెళుకుల పజ్జ నిలువ,
సతియుఁ బతియును నారామ తతుల నతుల
రతులఁ బెనఁగిరి చతురత లతిశయిల్లఁ;
దొలుతఁ దము నేఁచు వారలే కొలిచి యుండు
వేడ్క కన్నను మఱివేఱె వేడ్క గలదె? 226

అర్థము :— ౧. జిలిబిలి = హాయిగానున్న, వలి = చల్లని, నాలి = మెల్లని, మొలక తెమ్మెరలు = పిల్లవాయువులు, రమ్మని = మనోహరమైన, మేనితావులన్ = (వధూవరుల) శరీరపు వాసనలను, అనుసరింపఁగా = ఆశ్రయించి ఉండగా,

౨. అలరు = పూవులయొక్క, తేనియలు = తేనెలను, ఆని = త్రాగి, అలరు = సంతోషించు, తుమ్మెద దిమ్ము = తుమ్మెదల సమూహము, జంటచూపుల = సతీపతుల దృష్టుల, వెనువెంటఁగా = వెనుకనంటుకొని, సేవకులలాగా, తిరుగఁగా = తిరుగుచుండగా,

౩. చిగురాకు మేఁతలన్ = మేయుటవలన, పొగరుబందు = మదించిన, కోయిలల్, (వీరి) పాటల = పాటలయొక్క, నీటువెంబడి = అందమును అనుసరించి, మెలంగఁగా = మెలగుచుండగా,

౪. కులుక = కులుకుచున్న, పలుకులన్ = మాటలచేత, ముద్దుగులుక = ముచ్చటగా నుండు, చిల్కలు, నేర్పుపలుకుల = చమత్కారముగల నేరుపుమాటల యందలి, బెళుకుల = సొగసుల, పజ్జన్ = ప్రక్కన - గురుభావముతో, నిలువ,

సతియుపతియును, ఆరామ = ఉద్యానవనముల, తతులన్ = సమూహములయందు, అతుల రతులఁగా = సాటిలేని కూటములచే, చతురతలు = నైపుణ్యములు, అతిశయిల్లన్ = అధికము అగుచుండ, పెనఁగిరి = క్రీడించిరి; తొలుతఁ = ఇంతకుపూర్వము (విరహావస్థయందు), తముఁ = తమను, ఏఁచువారలె = బాధించినవారె (మలయానిలుడు మొదలగువారు). కొలిచి యుండు = ఇపుడు సేవించియుండునటువంటి, వేడ్క = వినోదము, కన్నను, మరివేరె = ఇంకొక, వేడ్క = సంతోషకారణము, కలదె = కలదా!

అలంకారము :— శబ్దాలంకారము - అర్థాంతరన్యాసము, యమకము.

నెల మసలె నంతఁ గాంతకు,
నెలకొనె వేవిళ్లు పెల్లు, నిద్దపు మేనన్
దలతలమని మెయి పూఁతలఁ
దళతళ దళుకొత్త గ్రొత్త ధవళిమ దోఁచెన్. 227

అర్థము :— కాంతకు = సుభద్రకు, అంతన్ = కొన్నాళ్లకు, నెలమసలెన్ = నెల తప్పెను (గర్భమాయెను), పెల్లు = అధికముగ, వేవిళ్లు, నెలకొనెన్ = కనుపించెను, మెయి పూఁతలన్ = శరీరమునందలి చందనపుపూతలను, తలతలమని = పొందుపొందని, తళతళ తళుకొత్తన్ = తళతళమని ప్రకాశించునట్లు, క్రొత్త ధవళిమ = కొత్త తెల్లదనము, నిద్దపు మేనన్ = నున్నని శరీరమునందు, తోఁచెన్ = కానవచ్చెను (అనగా గర్భచిహ్నముగా పాలి పోవుచున్నదని భావము.

చందన లేపనము తెల్లగా నుండును. దానిని తిరస్కరించునట్టి ధవళిమ సుభద్ర శరీరమున గర్భచిహ్నముగ కాననయ్యెను.

అలంకారము :— యమకము.

కలదో లేదో యను కౌను గానఁగ నయ్యె,
        తెప్పల నలనత గప్పు కొనియెఁ,
గులుకుఁ జన్గుబ్బలు వలుఁదలై మెఱుఁగెక్కె,
        నూఁగారు పై గప్పు నూలుకొనియెఁ,
జెక్కుటద్దంబుల నెక్కొనెఁ దెలినిగ్గు,
        బడలిక నడుపులఁ గడలుకొనియెఁ,
జిట్టూట చెమటల చిత్తడి మెయి నిండె,
        సారెకు నూర్పులు సందడించె,
నరుచి గన్పించె, నొక చెల్వ మంకురించెఁ,
దరులు సమమయ్యెఁ, జిట్టుముల్ దఱచుమీఱె,
మొలచెఁ గోర్కులు, నెమ్మేన నిలిచె నలఁత,
నెలఁత కేర్పడఁ దొలు చూలు నిలుచు నపుడు. 228

అర్థము :— నెలఁతకు = సుభద్రకు, తొలుచూలు = మొదటి గర్భము, ఏర్పడన్ = స్పష్టమై, నిలుచునపుడు = కనుపించునపుడు —

౧. కలదొలేదొయను = ఉన్నదో లేదో యను అనుమానము కలిగించునట్టి, సన్నని, కౌను = నడుము (ఇప్పుడు గర్భకారణముచేత), కానగనయ్యెన్ = స్ఫుటముగా కనుపించు చున్నది, తెప్పల = కనురెప్పలయందు, అలసత, కప్పుకొనియె = వ్యాపించెను.

౨. కులుకు = అందమైన, చన్గుబ్బలు = స్తనములు, వలుదలై = పెద్దవై, మెఱుఁగెక్కెన్, మూగారుపైఁ, కడుపుమీదనున్న రోమావలి పైన, కప్పు = నల్లదనము, నూలుకొనియెఁ = నిలిచెను.

౩. చెక్కుటద్దంబులన్ = అద్దములవలె నున్ననైన చెక్కిళ్లయందు, తెలివిగ్గు = తెల్లని కాంతి, నెక్కొనెఁ = అతిశయించెను. నడుపులఁ = నడకయందు, బడలిక = ఆయాసము, కడలుకొనియెన్ = ఎక్కువయ్యెను.

౪. చిట్టూట (చిరుఊట) = చిన్న ఊటగా కలుగుచున్న. చెమటల, చిత్తడి = ఎక్కువైనతడి, మెయినిండెఁ = శరీరమంతటను నిండెను. సారెకుఁ = మాటిమాటికి, ఊర్పులు = నిట్టూర్పులు, సందడించెఁ = ఎక్కువగుచుండెను.

అరుచి = నోటికి ఏదియు రుచిలేకుండుట, కవ్వించె, ఒకచెల్వము = ఒక విధమైన అందము, అంకురించెఁ = పొడసూపెను. తరులు = కడుపున (స్త్రీలకు) కనవచ్చు ముడుతలు-త్రివళులు, సమమయ్యె = చదునై పోయెను, చిట్టముల్ = ఓకిలింతలు, వాంతులు, తరచు మీరె = తరచుగానుండెను, కోర్కులు మొలచెన్ = అనేక కోరికలు పుట్టుచుండెను. అలత = అలసత, మెమ్మేనఁ = శరీరమునందు, నిలిచెఁ = కనుపించెను.

అలంకారము :— స్వభావోక్తి.

## అభిమన్యుని జననము

కలుముల్ గన్నులఁజిల్కు కల్కి మరునిం గన్నట్టి చందాన, నా
కల శాంభోనిధి వీచి కల్పతరువుం గన్నట్టి యందంబునన్,
గలకంఠీకుల రత్న మంత శుభలగ్నంబందు నింపొందఁ గాఁ
గుల దీపంబగునట్టి పట్టిఁ గనె దిక్కుల్ తెల్విఁ బెంపెక్కఁగఁ. 229

అర్థము :— కలుముల్ = సంపదలను, కన్నులన్ = చూపులచేతనే, చిల్కు = చిలుకరించు, కల్కి = స్త్రీ అగు లక్ష్మీదేవి, మరునిఁ = మన్మథుని, కన్నట్టి = గర్భమున కనిన, చందానన్ = విధముగ, ఆకలశ అంభోనిధి వీచి = ఆ పాలసముద్రములోని తరంగము, కల్ప తరువున్ = కల్పవృక్షమును, కన్నట్టి, అందంబునఁ = చక్కని విధముగా, కలకంఠీకుల =

స్త్రీలయొక్క సమూహమునకు. రత్నము = రత్నమువంటి సుభద్ర, అంతన్, శుభలగ్నంబందుఁ, ఇంపుఒందగాఁ = అందము అతిశయించునట్లుగా, కులదీపంబు = వంశమునకు దీపము (కీర్తికరుడు), అగునట్టి, పట్టిఁ = కుమారుని, దిక్కుల్ = నాలుగు దిక్కులును, తెల్విఁ = సంతోషముతో, పెంపుఎక్కగాఁ = శోభిల్లగా, కనెఁ = ప్రసవించెను.

విశేషము :— ఈ ఉపమానముల యందు సుభద్ర లక్ష్మీదేవితోను, క్షీరసముద్ర తరంగముతోను సమానమనీ పుట్టిన కుమారుడు అందమున మన్మధునితోను దాన శీలమునందు కల్పతరువుతోను సమానమనీ భావము.

కల్పతరువు పుట్టినది క్షీరసముద్రమునందే అయినను కలశాంభోనిధియందు పుట్టినట్లు కవి చెప్పినపుడు సుభద్ర కలశాంభోనిధితో సమానమని అర్థము కావలసియుండును. కలశాంభోనిధి పుంలింగము. కాబట్టి ఉపమానము పొసగదు. అందువలన 'కలశాంభోనిధి వీచి' అని స్త్రీలింగ సమానమును ప్రయోగించవలసి వచ్చెను.

అలంకారము :— మాలోపమా.

ఋభు విభు సుతునకుఁ దనయుఁడు
ప్రభవించిన సమయమున గుబాలునఁ గురిసెన్
నభమున సుమనో వర్షము,
గుభగుభ నినదములు గ్రందుకొనె దుందుభులన్. 230

అర్థము :— ఋభువిభు = దేవతల ప్రభువైన ఇంద్రుని, సుతునకు = కుమారుడైన అర్జునునికి, తనయుడు ప్రభవించిన సమయమున = కొడుకు పుట్టిన సమయమున, గుబాలున = తటాలున, నభమున = ఆకాశమునుండి, సుమనోవర్షము = పూవులవర్షము, కురిసెఁ, దుందుభులఁ = దేవతల భేరులనుండి (దేవదుందుభులు), గుభగుభ నినదములు = గుభగుభమను ధ్వనులు, గ్రందుకొనెఁ = కమ్ముకొనెను.

దేవలోకమునుండి పుష్పవర్షమూ, దుందుభుల మ్రోతా కలుగుటకు కారణము దేవతలకు ప్రభువైన ఇంద్రునకు మనుమడు జనించుటయే అని భావము. ప్రఖ్యాత పురుషులు పుట్టినపుడు దేవతల పుష్పవర్షము కురుస్తుందని ఒక నమ్మకము.

అలంకారము : అనుప్రాసము.

అపుడు పార్థుఁడు శుభలేఖ ననుప, ననుప
మాన విభవుండు శౌరి సమాన మాన
వాధి నాథులు గొలువఁగా నరుగుదెంచె
నెలమితోడుతఁ బాండవు లెదురుకొనఁగ. 231

అర్థము :— అపుడు, పార్థుఁడు = అర్జునుడు, శుభలేఖను, అనుపఁగా = పంపగా, అనుపమాన = సాటిలేని, విభవుండు = ఐశ్వర్యముగలవాడైన, శౌరి = కృష్ణుడు, సమాన = ఆతనితో సమానులైనటువంటి, మానవాధినాథులు = రాజులు, కొలువఁగాఁ = కొలుచుచుండగా, ఎలమితోడుతఁ = సంతోషముతో, పాండవులు ఎదురుకొనఁగఁ = పాండవులు ఎదురుగావచ్చి స్వాగతమివ్వగా, అరుగుదెంచెఁ = వచ్చెను

అలంకారము :— అనుప్రాసము, యమకము.

హలి సాత్యకి తోడఁ గుతూ
హలియై తన సరస రాఁగ, నంగన యును దా
నల బలరిపు సుతు నగరికి
నలబలము చెలంగ నరిగె హరి గడువేడ్కన్. 232

అర్థము :— హలి = బలరాముడు, సాత్యకితోడఁ, కుతూహలియై = కుతూహలము కలవాడై, తన సరసన్ రాగఁ = తన ప్రక్కనే వచ్చుచుండగా, హరి = కృష్ణుడు, అంగన యును = రుక్మిణియు, తానును, అల = ఆ, బలరిపు సుతు = బలుడన్న రాక్షసునిచంపిన ఇంద్రుని యొక్క కొడుకు అర్జునుని, నగరికి = మందిరమునకు, అలబలము చెలంగ = సందడి కలుగు నట్లుగా, కడువేడ్కఁ = మిక్కిలి వేడుకతో, అరిగెఁ = వెళ్లెను.

అలంకారము :— యమకము.

మన్యు వివర్జితుఁ డల శత
మన్యు తనూభవుఁడు లోక మాన్య విపశ్చి
న్మాన్యుల యనుమతి సుతు నభి
మన్యుం డని పేరువెట్టె మది ముద మొదవన్. 233

అర్థము :— మన్యు వివర్జితుఁడు = శోకములేనివాడు అయిన, అల = ఆ, శతమన్యు తనూభవుఁడు = నూరు యజ్ఞములు చేసిన ఇంద్రుని కొడుకు అర్జునుడు, లోకమాన్య = లోక

పూజితులైన, విపశ్చిత్ మాన్యుల = విద్వాంసులలో శ్రేష్ఠులయొక్క. అనుమతిన్ = అభిప్రాయము ననుసరించి, మదిన్, ముదము = సంతోషము, ఒదవన్ = కలుగగా, సుతున్ = కుమారునకు, అభిమన్యుడు, అని పేరు పెట్టెను.

అలంకారము :— అనుప్రాసము.

చెల్లెలికిని మఱఁదికి మే
నల్లునకు ననర్ఘ మణిమ యాభరణంబుల్
వల్లభయుఁ దాను యదుకుల
వల్లభుఁ డపు డొసఁగె బంధువర్గము మెచ్చన్. 234

అర్థము :—యదుకుల వల్లభుడు = కృష్ణుడు, తాను, వల్లభయు = భార్యయైన రుక్మిణియు, బంధువర్గము మెచ్చన్ = చుట్టముల సమూహము మెచ్చుకొనునట్లుగ, చెల్లెలికిని, మరదికిని, మేనల్లునకును = అభిమన్యునకును, అనర్ఘ్య = వెలలేని - అమూల్యమైన, మణిమయ ఆభరణంబుల్ = రత్నములతో చేయబడిన నగలను, ఒసఁగెన్ = ఇచ్చెను.

కువలయాక్షులు పెనుచు మక్కువల వలన
నేఁటఁ బెరిఁగెడివాఁ డొక్కఁ పూటఁ బెరిఁగి,
మెల్లమెల్లన శైశవ మెల్ల జాఱ,
నందె యౌవన మా రాజనందనుండు. 235

అర్థము :— కువలయాక్షులు = కలువలవంటి కన్నులుగల చెలికత్తెలు, పెనుచు = పెంచుటయందు చూపిన, మక్కువల వలనన్ = ప్రేమలచేత, ఏటన్ = ఒక ఏడులో (ఒక సంవత్సరములో), పెరిగెడివాడు, ఒక్క పూటన్, పెరిగి = పెద్దవాడవుతూ, (ఒక్క సంవత్సరములో పెరిగినంత ఏపుచూపుతు), మెల్లమెల్లనన్ = క్రమక్రమంగా, శైశవము = శిశుత్వము (పసితనము), ఎల్ల = అంతయును, జాఱన్ = జారిపోగా ఆరాజనందనుండు = ఆ రాజకుమారుడు (అభిమన్యుడు), యౌవనమున్, అందెన్ = పొందెను.

శైశవము తొలగుట కంటికి కానరాకుండా జరుగుట వలన 'జారినట్లు' గా చెప్పుట సమంజసము.

అలంకారము :— అతిశయోక్తి.

మను మార్గమున భూమి మను మార్గ మంతయు
స్థిరబుద్ధి యగు యుధిష్ఠిరుఁడు దెలుపఁ,
బాటవవద్వైరి పాటన క్రమమెల్ల
దర వర్జితుఁడు వృకోదరుఁడు దెలుప,
రంగ దుత్తుంగ తురం గాధిరోహ ము
ద్దండ బాహుఁడు నకులుండు దెలుప,
సురభి రక్షణ కీర్తి సురభిళ దిఙ్మండ
లుం డగు త దనుజన్ముండు దెలుప,
వివిధ కోదండ పాండిత్య విలసనంబుఁ
దానె తెలుపంగ నేర్చిన తనయుఁ డెపుడు
సేవఁ సేయఁగ, సంతతశ్రీ వెలుంగ,
విజయుఁ డలరారె శాశ్వత విజయుఁ డగుచు. 236

అర్థము :— ౧ మనుమార్గమునన్ = స్వాయంభువ ప్రభృతి మనువులు శాసించిన పద్ధతిని, భూమిన్ = భూమియందు, మను = జీవించునట్టి, మార్గమంతయు = విధమంతయు, స్థిరబుద్ధియగు = స్థిరమైన ఆలోచన కలిగిన, యుధిష్ఠిరుడు = యుద్ధమున చలింపని వాడగు ధర్మరాజు, తెలుపన్ = ఉపదేశించుచుండగా - (ధర్మరాజు అభిమన్యునికి మను మార్గమున జీవించుట నేర్పుచుండగా).

౨ పాటవవత్ = పాటవము (శక్తి) కలిగిన, వైరి = శత్రువులను, పాటన = ధ్వంసముచేయు, క్రమముఎల్లన్ = పద్ధతులన్నియు, దరవర్జితుఁడు = భయములేని వాడయిన, వృకోదరుఁడు (తోడేలువంటి కడుపుగలవాడు) = భీమసేనుడు, తెలుపన్ = నేర్పుచుండగా,

౩. రంగత్ = ఒప్పుచున్న, ఉత్తుంగ = మిక్కిలి ఎత్తైన, తురంగ = గుర్రములను, అధిరోహము = ఎక్కుట (స్వారీచేయుట) ను, ఉద్దండబాహుఁడు = గొప్ప భుజములుకలవాడగు, నకులుండు, తెలుపన్ = తెలియచేయుచుండగా,

౪ సురభి = గోవులను, రక్షణ = పోషించుట అనే కీర్తి = కీర్తిచేత, సురభిళ = పరిమళించుచున్నట్లు చేయబడిన, దిక్‌మండలుండు = దిక్కుల సమూహము గలవాడు అయిన, తత్ అనుజుండు = నకులుని తమ్ముడు సహదేవుడు (అన్ని దిక్కులయందును వ్యాపించిన కీర్తికలవాడు), తెలుపన్ = నేర్పుచుండగా,

వివిధ = అనేక విధములైన, కోదండ = విండ్లయందలి అనగా వాని ప్రయోగముల యందలి, పాండిత్య = ప్రావీణ్యముయొక్క, విలసనంబు = విలాసము, తానె తెలుపంగన్ =

తానె (అర్జునుడు) ఉపదేశించగా), నేర్చిన తనయుడు = ఆ విద్యల నన్నింటిని నేర్చిన కొడుకు (అభిమన్యుడు), ఎపుడుఁ = ఎల్లవేళల, సేవచేయగఁ, విజయుడు = అర్జునుడు, సంతత శ్రీ = నిత్యసంపద, వెలుంగఁ = ప్రకాశింపగ, శాశ్వత విజయుఁడగుచు = ఎల్లప్పుడూ ఉండునట్టి యుద్ధవిజయములుగల వాడగుచు, అలరారెఁ = ఒప్పెను.

విశేషము :— అయిదుగురు తండ్రులు అయిదు విద్యలు నేర్పగా అభిమన్యుడు సేవ చేయుచుండ అర్జునుడు అలరారెనని భావము.

మనవారి లెక్క ప్రకారము స్వాయంభువాది మనువులు పద్నాలుగురు. వీరు ఆయా కాలాలకు తగినట్టుగ జీవిత విధానాలను శాసిస్తుంటారు. వారి సంతతే మానవులు.

పెద్దన్నగారి మనుచరిత్ర స్వారోచిషమనువు జన్మ గురించే.

## ప్ర బం ధాం త ము

శ్రీ రాజిలు రఘునాథో
ర్వీ రమణుని పేర వెలయు విజయ విలాసం
బారోగ్య భాగ్య సంప
త్సారస్వత జయము లొసఁగుఁ జదివిన వినినన్. 237

అర్థము :— శ్రీరాజిలు = బుద్ధిచే ప్రకాశించుచున్న, రఘునాథ ఉర్వీరమణుని పేరఁ = రఘునాథరాజునకు అంకితముగా, వెలయు = వెలయుచున్న, విజయవిలాసంబు, చదివినఁ, వినినఁ, ఆరోగ్య, భాగ్య, సంపత్, సారస్వత (విద్య) జయములు ఒసగుఁ.

క్ష్వేళ గళ శైణ లాంఛన విజిత్వర శుభ్ర యశో విశాల, ధా
రాళ గళ న్మద ద్విరద రాజి విరాజి సభాంగణా, ఘనా
వేళ గరిష్ఠ దాన పదవీ పరితోషిత కాళగౌతమీ
చోళ కవి ద్విజ స్తుతి వచోలగ, చోలగ మాన భంజనా. 238

అర్థము :— క్ష్వేళగళ = గరళకంఠుడైన శివుని, ఏణలాంఛన = జింకచిహ్నము గాగల చంద్రుని, విజిత్వర = జయించుస్వభావముగలదైన, శుభ్ర యశో విశాల = స్వచ్ఛమగు కీర్తి విశేషముగా కలవాడా (రఘునాథుని శుభ్రమైన కీర్తి తెల్లనిదై ఈశ్వరుని, చంద్రుని - ఉభయులు తెల్లనివారే - తిరస్కరించు నట్టిదని భావము.) ధారాళ = తెంపులేకుండా, గళత్ =

కారుచున్న, మద = మదముగల, ద్విరద రాజి = ఏనుగులయొక్క గుంపుచే, విరాజి = ప్రకాశించుచున్న, సభ అంగణా = ఆస్థాన మందిరమునకు ముందరి భాగము కలవాడా (ఆస్థానమందిరము ముంగిలిలో మదముకారుచున్న ఏగునుల వరుస ఉండునని భావము), ఘన = ఘనమైన, అవేల = గట్టులేని, గరిష్ఠ = మిక్కిలి గొప్పదైన, దాన = దానములచేతను, పదవీ = ఉద్యోగములచేతను, పరితోషిత = బాగుగా సంతోషపెట్టబడిన, కాశ = కాశేశ్వరము, గౌతమీ = గోదావరి, చోళ = చోళదేశములందలి, కవి = కవీశ్వరులయొక్కయు, ద్విజ = బ్రాహ్మణులయొగ్కయు, స్తుతివచోలగ = స్తుతివచనములు (పొగడ్తలు) పొందినవాడా, దానకార్యములచేత సంతోషపడిన సకలాంధ్రమువారు స్తుతించుచుందురు అని భావము), చోలగ = చోలగుడు అను దుర్మార్గుడైన దొంగలనాయకుని, మాన = గర్వమును, భంజనా = నశింపచేసినవాడా.

భుజంగప్రయాతము

అరాతి క్షమాభృ ద్భి దాంచ త్కృపాణా ;
నరాధీశ్వ రాకార నాళీకబాణా ;
స్థి రానందనా ; రామ సేవాధురీణా ;
విరాజ చ్చతు ష్షష్టి విద్యాప్రవీణా ; 239

అర్థము :— అరాతి = శత్రువులైన, క్షమాభృత్ = రాజులను, భిత్ = భేధించుటయందు, అంచత్ = ప్రకాశించునట్టి, కృపాణా = ఖడ్గముకలవాడా, నరఅధీశ్వర = రాజుయొక్క, ఆకార = రూపముగల, నాళీక బాణా = పద్మము బాణముగా కలవాడా అనగా మన్మధుడా - రాజరూపములోనున్న మన్మధుదా, స్థిరా = భూమిని, ఆనందన = ఆనందింపచేయువాడా, రామసేవాధురీణా = రాముని సేవలో ఆసక్తి కలవాడా, విరాజత్ = ప్రకాశించుచున్న, చతుష్షష్టి = అరవైనాలుగు, విద్యా = విద్యలయందు, ప్రవీణా = నేర్పుగలవాడా ;

## గద్యము*

ఇది శ్రీసూర్యనారాయణ వరప్రసాద లబ్ధసార సారస్వత సుధాసార జనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య తనయ వినయ ధురీణ సకల కలా ప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాల దత్త హస్త ముక్తాకటక విరాజమాన వేంకట కవిరాజ ప్రణీతంబైన విజయవిలాసంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము

సంపూర్ణము.

* అర్థాదులు మొదటి ఆశ్వాసము చివర నున్నవే.

# అనుబంధము_I

## ఉపయోగించిన ప్రతులు

చిన్నతనంలోనే నాకు విజయవిలాసము నచ్చిందని మనవిచేశాను. కొన్ని సంవత్సరాలు అయిన తరువాతగాని ఈ వ్యాఖ్యాన విషయం అనుకోలేదు. ఆ వ్యవధిలో నాకు సందేహము కలిగినప్పుడూ, కొత్త పుస్తకంగాని తాళపత్ర ప్రతిగాని కనబడినప్పుడూ, ఎక్కడెక్కడివో ఏవేవో ప్రతులు చూస్తూ ఉండే వాడను. నాకు నచ్చిన పాఠం ఏదయినా ఉంటే అది జ్ఞాపకముంచుకొనేవాడను. అంతేగాని, ఆ పాఠభేదాలను ఎత్తి వ్రాసుకోవాలన్న అవసరం నాకు కనబడలేదు. ఆ విధంగా చాలా ప్రతులు చూచాను. చాల సంవత్సరాలు నా దగ్గరుండిన పుస్తకము మద్రాసులో మూరైలోనూ గుజిలీలోనూ... దొరికినది. తప్పులతడక, ఈ పుస్తకాలను అక్షయపాత్ర అయ్యవార్లు ఆంధ్రనగరాలలో అమ్ముతుండేవారు. వెల 0-2-6 ఉండేది.

వ్యాఖ్యానం వ్రాయాలని అనుకున్నతరువాత ముద్రిత అముద్రిత ప్రతులకోసం ప్రయత్నం చేయవలసి వచ్చింది. ఇటువంటి ప్రయత్నము చేసినవారే మన ప్రసిద్ధ వ్యాఖ్యాతలూ పరిష్కర్తలున్నూ. వారిలో అనేకులు ఆంధ్ర సాహిత్యోద్ధారకులని చెప్పదగిన పండితులుగాని సామాన్యులుకారు. వీరిలో కొందరిని మనవి చేస్తాను.

1. శ్రీమాన్ మా(డభూషి?) వేంకటకృష్ణమాచార్యులవారు; వీరు గొప్ప పండితులు. సి. పి. బ్రౌనుదొరగారి దగ్గర పనిచేస్తూ మన భారతాన్ని పరిష్కరించి ఇచ్చారు. (ఆ భారతము, అచ్చుప్రతి, ఇప్పుడు ఇంగ్లండులో ఇండియా ఆఫీసు లైబ్రరీలో ఉన్నది. ఆ అచ్చు భారతాన్ని ఫోటోల మూలంగా పునర్ముద్రణచేసి, ఉస్మానియా విశ్వవిద్యాలయము వారికి ఇటీవల పంపించారు). వీరు పరిష్కరించి ప్రచురించిన విజయవిలాసము 1856 న ముద్రింపించారు.

2. పోలవరము జమీందార్లు శ్రీ కొచ్చర్లకోట రామచంద్రవేంకటకృష్ణారావు బహద్దరు, బి.ఏ. గారు 1901 లో చెన్నపురిలో ముద్రింపించి ప్రచురించిన విజయవిలాసము, వీరు విద్వాంసులు, సాహిత్య పోషకులు. వీరు శ్రీ తిరుపతి వేంకటకవుల సాయముతో పాఠ నిర్ణయముచేయడానికి అనేక నగరాలనుంచి ప్రతులు తెప్పించారు— వాటిలో శ్రీ వేదము వారు పంపిన ప్రతి గూడా ఉన్నదన్నారు.

3. పేరుగాంచిన పండితుడూ జంధ్యాల లక్ష్మీకాంత కవీంద్రుల ప్రియ శిష్యుడు అయిన నోరి గురులింగశాస్త్రిగారు 1906 లో తత్వబోధిని అన్న పేరి టీకాతాత్పర్యాలతో ముద్రింపించిన విజయవిలాసము.

4. ఆంధ్ర గ్రంథాలను - పందలలెక్కను - తప్పులు లేకుండా పరిష్కరించి ప్రచురిస్తూ ఆంధ్రభాషకు ఇంతింతనరాని ఉపకారము చేసుండిన బ్రహ్మశ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు 1909 లో అనేక ప్రతులు చూచి, శ్రీ వేదమువారు ముద్రణానికి సిద్ధపరుచు కున్న శుద్ధప్రతి గూడా చూచి, ముద్రించిన విజయవిలాసము.

5. కళాప్రపూర్ణులు శ్రీ వేదము వెంకటరాయశాస్త్రిగారు వారి వ్యాఖ్యానముతో మెద్రాసులో 1911 లో ప్రచురించిన విజయవిలాసము.

6. 'ఉభయ భాషాప్రవీణ' 'సాహిత్య విద్యాప్రవీణ' పరీక్షలలో ఉత్తీర్ణులయి, హైస్కూలులో ఆంధ్ర పండితులయి అనేక ఆంధ్ర కావ్యాలకు వ్యాఖ్యానములు వ్రాసిన శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు రచించిన తమ 'ముకురవ్యాఖ్యాన' సహితంగా 1952 లో వావిళ్ళ వారు అచ్చువేసిన ప్రతి.

7. సందేహాలు కలిగినప్పుడు అవకాశము చిక్కజేసుకొని జూలూరువారి వ్యాఖ్యానము అప్పు డప్పుడు చూచుకుంటూ రావడము గూడా ఉంది.

—X—

# అనుబంధము_II

## అచ్చు తప్పులు

### పీఠికలో

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 9 | రామయ్య | రామకృష్ణయ్య |
| 13 | 25 | అర్థగారము | అర్ధ గౌరవము |
| 15 | 7 | పోరాటలు | పోరాటాలు |
| 16 | 14 | యజ్ఞా | యజ్ఞ |
| 16 | 27 | వేటురి | వేటూరి |
| 17 | 27 | ఉపాద్యాలు | ఉపాధ్యాయులు |
| 18 | 26 | దొరకుందేమో | దొరుకుతుందేమో |
| 19 | 7 | పేలమయి | పేలవమయి |
| 25 | 9 | సాదాత్త | సాదత్త |
| 38 | 7 | వాఙ్మ్రయము | వాఙ్మయము |
| 46 | 5 | వాఙ్మ్రయము | వాఙ్మయము |
| 47 | 4 | కావ్యముతో | కావ్యములో |

### ప్రబంధములో

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 29 | 11 | బాస్వ | బాస్వ |
| 210 | 15 | వున్న | అన్న |
| 242 | 20 | వినియుండు | యనివిందు |
| 252 | 17 | ద్వీజా | ద్విజా |
| 265 | 5 | యెంచక | మెంచక |
| 277 | 25 | గోమతి | గోమలి |
| 300 | 6 | గుణతా | గుణితా |
| 304 | 6 | క్రముఖ | క్రముక |
| 316 | 5 | చంద్రా | చిర్రా |
| 328 | 23 | మన్ననల్ | మన్ననం |
| 358 | 2 | చంద్రుడ | చంద్రుండ |
| 372 | 7 | లోడి | రోడి |
| 384 | 6 | కోరుక్కలు | కూరుక్కలు |
| 421 | 25 | రెండవ సన్యాసివి | రెండవవి సన్యాసి |
| 426 | 4 | చేయు | పేయు |
| 430 | 17 | కుంకు | కుంకుమ |
| 431 | 18 | బలరాము | బలరాముడికి |
| 435 | 21 | ఆకరణి | ఈకరణి |
| 443 | 26 | వలాక | సలాక |
| 459 | 13 | ములకు | మునకు |
| 463 | 13 | దెత్తునా | దెత్తుమా |
| 474 | 10 | తేటలతో | తెలివితేటలతో |
| 474 | 12 | తెలివి | తెలిసి |
| 487 | 14 | ఎకట | ఏకట |
| 488 | 2 | యంటిమి | యంటివి |
| 501 | 24 | 1172 | 172 |
| 505 | 1 | సుబ్బిన | సుబ్బిన |
| 516 | 2 | గొవ్వ | గొప్ప |
| 542 | 15 | ఈడుమూ | ఈ మూడు |
| 546 | 10 | విరులు | విరుల |
| 546 | 21 | మీమా | హీమా |
| 551 | 28 | చేతకదా | చేతకాదా |
| 552 | 1 | చక్కని | చక్కవి |
| 552 | 13 | వట్టి | వట్టినా |
| 554 | 23 | జోహారు | జొహారు |
| 554 | 24 | గోహారు | గొహారు |
| 556 | 5 | ఎచక | ఏచక |
| 556 | 20 | తలకెగు | తలకు |
| 557 | 19 | పేరు | పేరున |
| 557 | 20 | బోది | బాది |

| పేజి పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 558 – 25 | ఆరిగి | తిరిగి |
| 558 – 26 | లేమని | లేమిని |
| 559 – 8 | ఇది | ఇవి |
| 559 – 20 | ఇకుర | ఇగురు |
| 559 – 25 | కలకంది | కలకంఠి |
| 560 – 17 | అటువంట | అటువంటి |
| 560 – 19 | పద్యమునం | పద్యమునందు |
| 562 – 2 | శ్రుతి | శ్రుతి |
| 570 – 8 | తక్కిన | తప్ప తక్కిన |
| 571 – 13 | అగమ | ఆగమ |
| 577 – 24 | ముగ్గిరి | ముగ్గురి |
| 579 – 3 | కన్యాకా | కన్యకా |
| 579 – 21 | పాఠాంతరము | అలంకారము |
| 582 – 20 | ముత్తైముల | ముత్తెముల |
| 583 – 7 | ముత్తై | ముత్తె |
| 583 – 7 | మాదవుండు | మాధవుండు |
| 584 – 19 | బృహాస్పతి | బృహస్పతి |
| 584 – 24 | దయ్మెడన్ | దయ్యెడన్ |
| 587 – 17 | కలిగెవివి | కలిగెనవి |
| 588 – 20 | పేరంట్రాండ్రు | పేరంటాండ్రు |
| 591 – 22 | ఐశ్వన్ర్య | ఐశ్వర్య |
| 591 – 26 | కొందఱె | కొందఱై |
| 592 – 8 | కొరికన్ | కోరికన్ |
| 596 – 7 | అర్థ | అర్ధ |
| 603 – 2 | గారావంబు | గారవంబు |
| 613 – 12 | భీభత్స | బీభత్స |
| 616 – 4 | పూలిక | పూవిక |
| 617 – 19 | ్రనిస్ప్రాణ | నిస్ప్రాణ |
| 618 – 1 | విలోకిత | విలోకితృ |
| 618 – 4 | వికచ | వ్యాకోచ |
| 618 – 15 | నీరాజనమల | నీరాజన |
| 621 – 24 | కేరవెడు | కెరలెను |
| 627 – 8 | బితృపౌత్ర | పితృ పుత్ర పౌత్ర |
| 629 – 2 | వాని | వావి |
| 638 – 21 | మక్క | మ్రొక్క |
| 639 – 17 | కాంతామణి | కాంచామణి |
| 643 – 26 | పలుక | పలకె |
| 646 – 19 | అయె | ఆయె |
| 647 – 23 | హెరాళ | హేరాళ |
| 647 – 28 | ఎగు | ఏగు |
| 650 – 24 | 'కంటె'పాఠమే | 'కంటె'పాఠము |
| 654 – 1 | మొరోక | మరొక |
| 655 – 25 | పాఠాంతరము | ప్రయోగము |
| 656 – 5 | బిగువైప | బిగువైన |
| 658 – 9 | ఓసఁగెన్ | ఒసఁగెన్ |
| 663 – 23 | నభిమన్యు | నభిమన్యు |
| 664 – 6 | నర్త | ననర్త్తి |
| 666 – 2 | పంతత | సంతత |
| 667 – 18 | మన్మధురా | మన్మథుడా |